

బౌద్ధ ధర్మానికి, సంస్కృతికి
అంకితమైన ధర్మ సంస్థ




ఆనంద బుద్ధ విహార ట్రస్ట్
మహేంద్ర హిల్స్, సికిందరాబాదు-500 026
ఫోన్: 040-7732421, ఫాక్స్:040-7733160


క్షేమేంద్రుని

# అవదాన కల్పలత




ఆనంద బుద్ధ విహార

క్షేమేంద్రుని

# అవదాన కల్పలత

అనువాదం
తిరుమల రామచంద్ర




ఆనంద బుద్ధ విహార ట్రస్టు
మహేంద్ర హిల్స్, సికిందరాబాదు - 500 026
ఫోను: 040-7732421, ఫాక్స్ : 040-7733160
Email: iananda@yahoo.com

KSHEMENDRA'S AVADANA KALPALATA
Translation by : Tirumala Ramachandra

అవదాన కల్పలత

మూలం: క్షేమేంద్రకవి
అనువాదం: శ్రీ తిరుమల రామచంద్ర
మొదటి ముద్రణ: అద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి, 1963
రెండో ముద్రణ: ఆనంద బుద్ధ విహార ట్రస్ట్, సికింద్రాబాద్,
మే, 2000


ఆనంద బుద్ధ విహార
ప్రచురణ సంఖ్య: 22
1000 ప్రతులు
వెల: రు.150/-





ముఖ చిత్రం : తుషితస్వర్గం నుండి దిగివస్తున్న బోధిసత్త్వుడు, నాగార్జునకొండ శిల్పం, 3వ శతాబ్దం
అట్టవెనుక చిత్రం: నలగిరి దమనం, అమరావతిశిల్పం, 2వ శతాబ్దం


టైప్ సెట్టింగ్: ఆదిత్య గ్రాఫిక్స్, మిర్జాలగూడ, మల్కాజ్‌గిరి
సికింద్రాబాద్-500 047, ఫోన్: 7058920
ముద్రణ : శ్రీ సాయి ప్రాసెస్, నారాయణగూడ, హైదరాబాదు - 500 027
ఫోన్: 7563075, 7561981


నమోతస్స భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స




ఈ పుస్తక ప్రచురణకు తమ అమూల్య సహాయ, సహకారాలనందించిన
సహృదయులు శ్రీ కోన రత్నాకరరెడ్డిగారు ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలనీ,
సర్వతోముఖ ప్రగతి సాధించాలనీ ఆనంద బుద్ధ విహార ఆకాంక్షిస్తుంది.



ఆనంద బుద్ధ విహార ట్రస్టు
మహేంద్రహిల్స్
సికిందరాబాదు-500 026

# సందేశం

2544వ బుద్ధజయంతి ఉత్సవాల సందర్భంగా (18-5-2000) ఆనంద బుద్ధ విహార ట్రస్ట్ 'అవదాన కల్పలత' అనే ప్రసిద్ధ బౌద్ధగ్రంథాన్ని తెలుగు పాఠకులకు అందిస్తున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది.

క్రీ.శ. 1051లో కాశ్మీరుకు చెందిన క్షేమేంద్రకవి 'అవదానకల్పలత'ను సంస్కృతకావ్య రీతిలో శ్లోకరూపంగా రచించారు. ఈ గ్రంథానికి మరో పేరు 'బోధిసత్త్వావదాన కల్పలత'.

పవిత్రీకరణ కథలను, ఉత్తేజదాయక కథలను అవదానం అంటారు. అసాధారణ సాహస కృత్యాలకు, త్యాగాలకు కూడా అవదానమని పేరు. కర్మ - కర్మఫలం - పునర్జన్మ పట్ల ప్రజల్లో విశ్వాసాన్ని పెంచి వాళ్ళలో ధార్మిక వికాసం కలిగించేందుకు బౌద్ధంలో ఇటువంటి సాహిత్యం ఎక్కువగా వెలువడింది.

క్షేమేంద్రుని అవదానకల్పలతలో 107 కథలున్నాయి. ఆయన కుమారుడు సోమేంద్రకవి జీమూతవాహనావదానం వ్రాసి గ్రంథంలోని కథల సంఖ్యను 108 చేశాడు.

కీ. శే. శ్రీ తిరుమల రామచంద్రగారు ఈ సంస్కృత గ్రంథాన్ని యథాతథంగా సుమారు నలభైఏండ్ల క్రితం తెలుగులోకి అనువదించగా, 1963వ సంవత్సరంలో అద్దేపల్లి అండ్‌కో (రాజమండ్రి) వారు ప్రచురించారు. ఆ తరువాత ఈ గ్రంథం పాఠకులకు దొరకనందువల్ల ఆనంద బుద్ధ విహార ట్రస్ట్ దీని పునర్ముద్రణకు పూనుకొన్నది. ప్రచురించుటకు అనుమతి ఇచ్చిన అద్దేపల్లి అండ్‌కో యాజమాన్యానికి మా ధన్యవాదాలు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన శ్రీ కోన రత్నాకరరెడ్డిగారికీ, ఈ గ్రంథాన్ని మళ్ళీ వెలుగులోనికి తెచ్చేందుకు కారకులైన శ్రీ చెన్నూరి ఆంజనేయరెడ్డిగారికి, శ్రీ ఎస్. వీరనారాయణ రెడ్డిగారికి నా ప్రత్యేక అభినందనలు.

తెలుగు పాఠకులు ఈ గ్రంథాన్ని ఆదరించి, మరిన్ని బౌద్ధ గ్రంథాలను ప్రచురించటానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాను.

బుద్ధ జయంతి
18-5-2000

సంఘరక్షితమహాథేర,
చైర్మన్

# విషయసూచిక

# సోమదేవుని పీఠిక

జయాపీడుని మంత్రి అయిన సోమదేవుడనే సుమతి వంశంలో భోగీంద్రుడు అనేవాడు జన్మించాడు. అతడు భోగీంద్రునివలె భోగవంతుడు; సత్త్వనిధి; గుణరత్న; గణాశ్రయుడు. అతనికి సింధువు అనే కుమారుడు పుట్టినాడు. అతడు సింధువు వంటివాడు. అతని వాణి సుధను వర్షించేది. అతని కుమారుడు ప్రకాశేంద్రుడు. అతడు భూలోకంలో ప్రకాశేంద్ర నిభుడు; దానపుణ్యంతో బోధిసత్త్వగుణోచితుడు. అతని పుత్రుడు క్షేమేంద్రుడు. అతడు కవీంద్రుడు. అతని కీర్తి చంద్రిక చంద్రుని చంద్రికవలె సత్పురుషులకు మానసోల్లాసిని. అతనికి రామయశుడనే మహానుభావనుడు సర్వప్రబంధరచనకు ప్రేరకుడయాడు.

ఒకనాడు క్షేమేంద్రుడు సుఖాసీనుడై ఉండగా మిత్రుడు, ఖ్యాతసత్కర్ముకృతుడు అయిన 'నక్క' అనే సౌగతుడు వచ్చి ఇలా అన్నాడు: "ఆచార్య గోపదత్తుడు మొదలయివారు జినజాతకమాలికను అవదానక్రమం వదలి అక్కడొకటి ఇక్కడొకటిగా ఏరి, గద్యపద్య విశృంఖలంగా విస్తీర్ణవర్ణనలతో రచించారు. అవి గాంభీర్య కర్కశమైనవి; ఒకే మార్గం అనుసరించేవి. నీవు అవదాన క్రమంతో, రమ్యమైన సంక్షేపవిస్తరాలతో తథాగతుని కథలను కోమలంగా రచించు" అని. క్షేమేంద్రుడు ఆయన మాటమేరకు, వినయంకొద్దీ మూడు అవదాన కథలను మాత్రం వ్రాసి, కథలు చాల దీర్ఘంగా ఉండడం వల్ల విరమించాడు. కాని, ఒకరాత్రి స్వప్నంలో జినుడు ప్రత్యక్షమై ప్రేరేపించినందువల్ల మరల అవదానార్థ సంగ్రహానికి పూనుకున్నాడు. ఆ సమయంలో ప్రజ్ఞాప్రకాశం గలవాడు, ప్రఖ్యాత సుకృతోజ్జ్వలుడు, జినశాసన శాస్త్రపరినిష్ఠిత మానసుడు అయిన ఆచార్య వీరభద్రుడు తానే క్షేమేంద్రుని ఇంటికి వచ్చి, ఈ గంభీరాగమ మార్గంలో రత్న దీపంగా మార్గదర్శకుడయాడు.

నాతండ్రి అయిన క్షేమేంద్రుడు 107 అవదానాలు రచించాడు. తర్వాత సోమేంద్రుణ్ణనే నేను మంగళపూరణంగా 108వ అవదానం రచించాను. ఎవరిచేతుల్లో అన్ని శాస్త్రాలూ పరిశుద్ధము అవుతాయో అలాంటి ఆచార్య సూర్యశ్రీని ఈ అవదానకల్పలత లిపిన్యాసంకోసం(వ్రాయించి పెట్టడం కోసం) ప్రార్థించాను. 27వ సంవత్సరం వైశాఖ శుద్ధ పూర్ణిమ, జిన జన్మదినోత్సవం నాడు ఈ కల్పలతిక రచించబడింది. రాజశ్రేష్ఠుడయిన అనంత భూపాలుడు రాజ్యమేలుతుండగా, పాపశత్రు ప్రమాథిని అయిన తారాదేవి భ్రుకుటికీర్తి ఉదయించగా, లోకనాథుని సుగతోత్సాహం దిక్కులలో వ్యాపించగా, ఈ ప్రబంధంప్రశమసుఖం కలవారి సంతోషం కోసం నిర్మితమైంది. హతవివేకుల ప్రశమాన్ని పోగొట్టేది, అపారమూ, దుర్వారమూ, మహామోహాగారమూ, అల్పమార్గంలో వ్యసనగణాలతో బరువయినదీ, మద ద్వేషాధారమూ, విషయ విషసారమూ, వికారమూ అయిన సంసారమనే తిమిర పరివారాన్ని జినుడనే కాంతి తొలగించుగాక!

భగవానుడయిన బుద్ధుని శరీరమూ, ఈ కావ్యమూ ఈ జగత్తునకు ప్రియం కలిగించుగాక; అదీ ఇదీ విమల హృదయులకు పరమ సంతోషకారి; మనోహరమయినది; ప్రసాద సౌభాగ్యం కలది; సుకృతప్రయత్నం కలది; వికాసం కలది.

***

# ఉపోద్ఘాతము

విద్యావాచస్పతి, మహోపాధ్యాయ, కవిసార్వభౌమ, సాహిత్యాచార్య, సాహిత్య సమ్రాట్, కవీంద్ర
శ్రీ శివశంకర స్వామి

1

క్షేమేంద్రుడు సంస్కృతసాహిత్యములో పేరుగన్నవాడు. ఒకటి రెండు పుస్తకములతో సంతృప్తి చెందక, బహుగ్రంథములు రచించినాడు. అందును వివిధ ప్రక్రియలలో రచన చేసినవాడు. సామాన్యముగా, ఆలోచనాపరుడగు ప్రతి కవియును ఛందో విషయమును గూర్చి సమీక్ష చేయుచుండును. ఏ కథాభాగమునకు ఎట్టిశైలి అనుగుణమో, దానికి ఎట్టి వృత్తము ఉచితమో పరిశీలించుట సహజము. ఇతడు అట్టి ఆలోచనాత్మకమగు సువృత్తతిలక గ్రంథము చేసినాడు.

ఔచిత్యము కావ్యమునకు ప్రాణమను భావముతో, ఔచిత్యవిచారచర్చ అను సమీక్షాగ్రంథము సంతరించినాడు. ఔచిత్యము కావ్యమునకు ఆత్మ కాకున్ననూ, కవి అనౌచిత్యము పరిహరింపవలయును. ఈ విషయమున ఇతడు ఉదాహరణ పూర్వకమైన విమర్శ గ్రంథము విరచించినాడు.

కవులు రామాయణ భారతాది ప్రాచీన గ్రంథములను పఠించి పురాతన తత్త్వమును, మార్గమును గ్రహించి ఆ మహాకోశములలోని ఒక్కొక్క సందర్భమును విస్తరించి రసపుష్టి కావించి రచన చేయుదురు. కొందరు మహాగ్రంథములను సంక్షేపించి లోకమునకు అందింతురు. కొందరు సుదీర్ఘగ్రంథములలోని ప్రధాన విషయములను విడువక సంగ్రహముగా పునస్సృష్టి చేయుదురు. ఈతడు ఈ విధముగా రామాయణమంజరి, భారతమంజరి సృజించినాడు.

బృహత్కథ చాల ప్రసిద్ధి చెందినది. అందలి కథలను ఉచితమైన వానిని నాటకమున నిబద్ధము చేయవచ్చునని రూపకలక్షణ నిర్మాతలు నిర్ణయించినారు. బృహత్కథ ఎల్లరను ఆకర్షించినది. అయ్యది ఆదిలో పైశాచీ ప్రాకృతమున విరచితమైన సుదీర్ఘకథాసందోహము. కాలక్రమమున పైశాచీభాష లుప్తమైనది. కాని క్రీస్తుశకము కొన్ని శతాబ్దుల వరకును ఆ గ్రంథము ప్రచారములో ఉన్నట్లు ఊహింపవచ్చును. ఒకానొక కవి పైశాచీ మాతృకను నేపాలభాషలోనికి పరివర్తనము చేసినాడు. బుధస్వామి అను కవివరుడు ఆ అనువాదమునుబట్టి సంస్కృతభాషలో రమారమి 22 వేల గ్రంథము రచించినాడు. క్షేమేంద్రుడు దేనిని చూచెనో తెలియదు. కాని, బృహత్కథామంజరి అను పేర సంక్షిప్తగ్రంథమును సంస్కృతమున సంతరించినాడు. ఇందు ఆదిగ్రంథములోని ప్రధానాంశములు నిబద్ధమైనట్లు తోచెడు.

ఈతడు లోకవృత్తము బాగుగా ఎరిగినవాడు. కావున ప్రపంచములోని కొన్ని విషయములను కనుల ఎదుట కట్టినట్లు వర్ణించుచు హితబోధ కూడ ఇమిడ్చినాడు. సేవకులకు యజమానులకు గల సంబంధమును గూర్చి, వేశ్యల మాయోపాయముల గురించియు బాగుగా వర్ణించినాడు. లోకవృత్తమును గూర్చి ఇతడు చిన్ని చిన్ని గ్రంథములు చేసినాడు.

2

అవదానకల్పలత బౌద్ధమత గాథలను బోధించు కథాసందోహము. సనాతన ధర్మపరుడగు క్షేమేంద్రుడు ఇట్టి గ్రంథమును సహజముగ రచింపలేదు. అన్యుల ప్రేరణ ఉన్నప్పుడు కొన్ని కొన్ని రచనలు కొనసాగుచుండును. ఒకనాడు క్షేమేంద్రుని కడకు 'నక్క' అను సౌగతాచార్యుడు వచ్చి అవదానములను బోధించు గ్రంథము రచింపుమని కోరెను. "అదివరలో ఆచార్య గోపదత్తాదులు అవదాన కథలు సంస్కృతమున రచించిరి. కాని, వానిలో క్రమము లేదు. గ్రంథమున పద్యములు సమ్మిశ్రణము చేసినారు. ప్రౌఢరీతి అవలంబించి గ్రంథము సుదీర్ఘవర్ణనలతో నింపినారు. కాన లోకమునకు జాతకకథలు సరళముగ బోధపడునట్లు పద్యరూపముననే విరచింపుము" అని నక్కాచార్యుడు కోరెను.

క్షేమేంద్రుడు ప్రసిద్ధుడగుటచేత, ఆయన రచన రమ్యముగా ఉండుటచేత నక్కాచార్యుడు అట్లు కోరియుండును. క్షేమేంద్రుడు మూడు కథలు మాత్రము ముగించి మిన్నకుండినాడు. తర్వాత కొంత కాలమునకు జినభగవానుడు స్వప్నములో సాక్షాత్కరించి గ్రంథమును పూరింపుమని కోరెను. ఆ ప్రబోధము వలన కవి 107 అవదానములు రచించి కాలధర్మము చెందెను. ఆవల ఆయన కుమారుడు సోమేంద్రుడు 108వ అవదానము రచించి గ్రంథము పూర్తి చేసెను. అప్పటికి ఆతనికి 27 సంవత్సరములు. జినజన్మోత్సవమునాడు గ్రంథము సంపూర్ణమైనది.

3

అవదానకల్పలత వ్రాతప్రతి బర్మాదేశములో లభించెను. బర్మాదేశమున బౌద్ధధర్మము వ్యాప్తిలో ఉండుటచేత, భారతభూమిలో బౌద్ధధర్మము అడుగంటుటచేతను గ్రంథము అక్కడ లభించినది. దీనిని తొలిసారి రాయల్ ఏషియాటిక్ సొసైటీవారు క్రీస్తుశకం 1920 ప్రాంతములో ప్రకటించినారు.

అవదానకథలు కేవలము బౌద్ధకథలే కావు. కొన్ని పురాణములలో నుండి సంగ్రహించిన కథానకములు కూడ కలవు. కాని పురాణములలో వాని తీరు వేరు, ఇందులో ఉన్న వాని తీరు వేరు.

ఇట్టి ఉత్తమ గ్రంథము ఆంధ్రభాష లోనికి సంపూర్ణముగా అనువదింపవలెనను కోరిక బహుకాలము క్రిందట ఉన్ననూ నేను ఏతద్రచనకు పూనుకొనుటకు ఎన్నో అంతరాయములు ఏర్పడెను. ఇప్పుడు నా ఆప్తులు శ్రీ తిరుమల రామచంద్రగారు సంస్కృత మాతృకనుండి దీనిని సంపూర్ణముగా ఆంధ్రీకరించుట మిక్కిలి ముదావహము. రామచంద్రగారు సంస్కృత, ఆంధ్ర, హిందీ, తమిళ, కన్నడ, ఆంగ్లాదిభాషలలో ప్రవీణులు; బహుగ్రంథరచన చేసినవారు. భాషాతత్త్వ సిద్ధాంతములు బాగుగా గ్రహించినవారు. రామచంద్రగారి రచన రమణీయముగ ఉండుననుటలో ఆశ్చర్యము లేదు. మాతృకకు దూరముగాక జాతీయమును అనుసరించి సరళముగా సుసంబద్ధముగా నడచిన ఈ అనువాదము ఆంధ్రానువాద సారస్వతమునకు అలంకారము వంటిది. వివిధ శ్రేణులలో వారు దీనిని పఠించి ఉద్దీప్తిగాంచి ఉల్లాసము పొందుదురుగాక!

సాహితీ సమితి,
ఒంగోలు,
15 ఆగస్టు, 1963.

శ్రీ శివశంకరస్వామి

## మనవి మాటలు

(మొదటి ప్రచురణకు రాసినవి)

ముప్పైయేండ్లక్రితం క్షేమేంద్రుని రచనలు చదివినప్పుడే అవదానకల్పలతను అనువదించాలనే అభిలాష కలిగింది. తరం తర్వాత ఆ అభిలాష నెరవేరింది.

క్షేమేంద్రుడు 11వ శతాబ్ది మధ్యకాలంలో కాశ్మీర రాజులకు మంత్రిగా ఉన్నవాడు; దాదాపు ముప్పైఅయిదు గ్రంథాలు రచించిన మహాకవి; ఔచిత్యవిచారచర్చ వంటి నూతనాలంకార ప్రస్థానం ప్రవర్తింపజేసిన లాక్షణికుడు. బృహత్కథామంజిరితో కల్పనాకథలకు, రాజావళితో చారిత్రక కథానికలకు మూలపురుషుడు. కథన చాతురితోను, సుమపేశల శైలితోను సంస్కృతకవులలో విశిష్టస్థానంగలవాడు. అవదానకల్పలత ఏ పరిస్థితిలో చిగిర్చిందీ అతని కుమారుడు సోమదేవుని పీఠిక తెలుపుతున్నది.

అవదానకల్పలతను ఎంతో మెలకువతోను, నుడికారంతోను అనువదించాను. నలభై తొమ్మదవ అవదానం నాకు లభించిన ప్రతిలో కనిపించలేదు. జయంతిపురం రాజా శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ బహద్దర్ వారు పదికథలను అనువదించి ఎప్పుడో ముక్త్యాల 'సరస్వతి' పత్రికలో ప్రకటించినారు. నాకంటే ముందుగా అనువదించడానికి పూనుకున్న శ్రేయస్సు వారిదే. అవదాన కల్పలతలో చాల భాగం ముక్త్యాలలో అనువదించాను. అనువాదానికి సదుపాయం కలిగించిన గురుతుల్యులు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారికి నమస్కారాలు.

నాకు లభించిన అవదాన కల్పలత ప్రతి మొట్టమొదటి కచ్ర అచ్చుప్రతీ, అనిర్దుష్టమైనదీ కనుక మూడు నాలుగుచోట్ల మూలం సరిగా అర్థంకాక సందర్భోచితంగా అనువదించాను. పండితులు మన్నిస్తారు.

భాషాసేవకుడు

తిరుమల రామచంద్ర

క్షేమేంద్రుని

# అవదాన కల్పలత

# 1. ప్రభాసావదానం

సర్వజ్ఞుడైన తథాగతుని మనస్సు స్ఫటికంవలె నిర్మలమైంది. ఎలాటి రాగమూ దానిని అంటదు. ఆయన హృదయం కరుణార్ద్రం. దానిలో దోషాలన్నీ ఇంకిపోయాయి. ఆయన క్రోధమనేదే లేనివాడు. కనుక సంసారమనే పగ తనంతట తానే నశించిపోయింది. అట్టి సర్వజ్ఞుడు మీకు నిశ్చల శ్రేయస్సును కలిగించుగాక!

బుద్ధదేవుడనే కల్పవృక్షం విరాజిల్లుతున్నది. ఆ కల్పవృక్షానికి ఉత్తమ కాంతి అనేదే నీడ; అది ధర్మమనే వేళ్ళు బాగా తన్నుకుని నిలబడింది; పుణ్యమనేది దానికి పాదు; అది కరుణ అనే ఉదకంతో పెరిగింది; బుద్ధి, విద్య అనేవి దాని శాఖోపశాఖలు; సంతోషమనేదే లేచిగుళ్ళగుంపు; కీర్తి అనేదే పూగుత్తి; ఈ కల్పవృక్షం ఎప్పుడూ సత్ఫలాలను ప్రసాదిస్తూ దిక్కులన్నిటా వ్యాపించింది.

ఈ సంసారసాగరం మకరాది క్రూరసత్త్వాకులమైంది. దీనినుంచి జగత్తును ఉద్ధరించడానికే మహానుభావులు ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటారు. అలాటి గాథ ఒకటి వినండి.

పూర్వం ప్రభావతి అనే ఒక పట్టణం ఉండేది. అక్కడి భవనాలు ఉన్నతమైనవి, స్వర్ణమయమైనవి కనుక పుణ్యాత్ములు ఊర్ధ్వలోకాలకు ప్రయాణం చేసే విమానాలతో శోభాయమానంగా ఉండే అంబర వీధిలాగ ప్రభావతి అనే పేరుకు తగినట్టు ఉండేది. సిద్ధ గంధర్వ విద్యాధరులు నివసించే అమరావతీ పట్టణమే సజ్జనుల సుకృతంతో భూమికి దిగి వచ్చినదా అన్నట్లు ఉండేది. అక్కడి ప్రజలు సత్యవ్రతులు, దానపరులు, దయామయులు కావడం వల్ల పుణ్యగృహాలతో కనుల పండువుగా ఉన్న ఆ పట్టణం ధర్మానికే రాజధాని అన్నట్టు విలసిల్లుతూ ఉండేది. ఆ పట్టణాన్ని ప్రభాసుడనే రాజు పాలించేవాడు. ఆయన భూమికి తిలకం వంటివాడు. ఆయన కీర్తి ప్రపంచం నాలుగంచులూ, స్వర్గంలోనూ వ్యాపించింది. ప్రకాశమానమైన ఆ కీర్తిని దేవతలు ఆదరంతో కొనియాడేవారు. కమ్మని గుణసౌరభం విరజిమ్మే ఆయన కీర్తికుసుమ మంజరులు సుందరులకందరికీ కర్ణావతంసాలయాయి. సామదానభేదదండాలనే చతుర్విధోపాయాలను తెలిసిన ఆ రాజు ఆజ్ఞను సువర్ణ కుసుమ మాలవలె సామంత మహీపాలురందరూ తలపై దాల్చేవారు.

ఆ భువనేశ్వరుడు ఒకనాడు కొలువుదీర్చి ఉండగా, గజారణ్యంపై అధికారిగా ఉండే ఒక భృత్యుడు వచ్చి మోకరిల్లి ఇలా విన్నవించాడు: "దేవా! దివ్యతేజస్సుతో అద్భుతంగా ఉండే ఒక ఏనుగును పట్టుకున్నాము. అది దేవర కీర్తి విని భూలోకానికి వచ్చిన ఐరావతంలాగ ఉన్నది. తోలుకొనివచ్చి సభాద్వారంలో నిలబెట్టాము. చిత్తగించండి. భృత్యుల పరిశ్రమ ప్రభువు చూచి మెచ్చినప్పుడుకదా సఫలమౌతుంది."

రాజు ఆ విన్నపం విని, మంత్రులతో పాటు బయలుదేరి, ద్వారం వద్దకు వచ్చి కదలివచ్చిన కైలాసంవలె ఉన్న ఆ ఏనుగును చూచాడు. ఏనుగు గండస్థలం నుంచి స్రవిస్తున్న మదజల సౌరభానికి తుమ్మెదలు ముసురుకొని ఝుంకారం చేస్తున్నాయి. ఆ దృశ్యం చూస్తే ఆ ఏనుగు శృంగారరసమనే ఆభరణంతో అందాలు చిందే వసంత ఋతువులాగ కనిపించింది. ఆ గజరాజం తన తొండాన్ని దంతాలపై వాల్చి కళ్ళు మూసుకొని నిలబడింది. దాన్ని చూడగా వింధ్యపర్వతంలోని అరటి, అందుగు వనాలను గురించి ఆలోచిస్తున్నట్లు కనిపించింది. ఏడాకుల అరటిచెట్ల వాసనకొట్టే ఆ ఉన్నతగజం అగస్త్యమహాముని శాసనానికి తల ఒగ్గి గజరూపంతో వచ్చిన వింధ్యపర్వతమా అన్నట్టు కనిపించింది. దాని దంతాలు రెండూ, రెండు స్తంభాలలాగ ఉన్నాయి. మొత్తం మీద ఆ ఏనుగు లక్ష్మీవిలాసానికే ఆటపట్టుగా ఉన్నట్లుంది.

దానిని చూచి క్షితిపతి నివ్వెరపోయాడు. "ఓహో! విధికర్మ నిర్మాణ ప్రభావం ఆశ్చర్యకరం. దాని సృష్టి రచనా చాతురి అనవచ్ఛిన్నం, నిత్యనూతనం. వాసుకిని కవ్వపు తాడుగా చేసుకొని ఆయాసపెట్టకనే, మందరగిరితో క్షీరసముద్రాన్ని మధించకనే ఈ ఏనుగు ఎలా పుట్టింది?" అని మనస్సులో అనుకున్నాడు. తర్వాత రాజు సంయాతుడనే మావటిని పిలిచి ఆ ఏనుగును అదుపాజ్ఞలలో పెట్టవలసిందని ఆజ్ఞాపించాడు; కొలువు చాలించి అంతఃపురానికి వెళ్లాడు.

మావటీడు రాజాజ్ఞను ఔదలదాల్చి, సర్వశిక్షలను సహించగల ఆ ఏనుగును గజశాలకు తోలుకొని పోయాడు. ఆ ఏనుగు బుద్ధిమంతుడైన ఉత్తమ శిష్యునివలె పూర్వజన్మ సంస్కారంతో మావటివానినుండి అన్ని శిక్షణలూ పొందింది. ఎక్కువ దానధార ఉన్నా విర్రవీగక, అపారశక్త్యుత్సాహాలు లు కలిగినప్పటికీ ఓర్పు కలిగి, శత్రువులను పరిమార్చగలదైనప్పటికీ సన్మార్గం వీడక, ఆ ఏనుగు ప్రభాసమహీపతికి సాటి వచ్చింది. సంయాతుడు దానికి నేర్పవలసినవన్నీ నేర్పి కృతకృత్యుడై ఆ విషయాన్ని రాజుకు నివేదించాడు. రాజు ఆ ఏనుగును చూచాడు. అది అంకుశానికి ఒదిగి నిర్వికారంగా, శక్త్యుత్సాహాలు వెల్లివిరుస్తూ జయలక్ష్మిలాగ కనిపించింది. ఆయన సంతోషపడి, మావటీడు మప్పిన గతి విశేషలను చూడాలనే కుతూహలంతో సూర్యుడు ఉదయాచలాన్ని ఆరోహించినట్లు ఆ గజాన్ని ఆరోహించాడు. మావటీడు మంత్రిలాగ తన వశంలో గజరాజుకు నేర్పిన సర్వమండల సంచారాది గతివిశేషాలన్నిటినీ చూపించి రాజును మెప్పించాడు.

గజరాజు గతి విశేషాలు చూచి మురిసిన రాజుకు వేటకు వెళ్ళుదామని మనస్సు కలిగింది; దానిని ఎక్కి తన ఉత్సాహంలాగ మహోల్లాసంతో ఉన్న వింధ్యారణ్యానికి వెళ్ళాడు. ఆయన ధరించిన రత్న కేయూరాద్యాభరణాల కాంతి అరణ్యంలో వ్యాపించి సల్లకీవృక్ష పల్లవాలనే భ్రాంతి కలిగిస్తూ దిగ్గజాలను ఆహ్వానిస్తున్నట్టు తోచింది. అరణ్యంలో ప్రవేశిస్తున్న ఆ రాజును వనదేవతలు సంతోష సంభ్రమాలు ముప్పిరిగొన్న చూపుతో చూచారు. ఆ వింధ్యభూమిలో శబరకాంతలు కొప్పులలో తురిమిన పూవులు వాసనలతో నిండిన మందమారుతాలు రాజుకు సేవచేస్తున్నవా అన్నట్టు వీచాయి.

అడ్డమూ, ఆకా లేక ఆకాశం అంటేటట్టు పెరిగిన వింధ్యారణ్యం సమీపించగానే, ఆ ఏనుగు తాను పూర్వం అక్కడ సవిలాసంగా స్వేచ్ఛగా జరిపిన విహారాలు స్మరణకు వచ్చి ఉద్విగ్నమైపోయింది. తనకు ప్రేమపాత్రమైన పిడిఏనుగువాసన రాగానే ఆ ఏనుగు గర్వంతో నీతిని వదలిన జనపతివలె,



అంకుశం పోట్లను కూడ లక్ష్యపెట్టక పరుగెత్తసాగింది. రాగాకృష్టమైన ఆ ఏనుగు సంసారంలో కొట్టుకులాడే మూఢ సన్యాసివలె విరామం లేకుండా వేగంగా పరువెత్తసాగింది.

ఇలా వాయువేగంతో పరువెత్తుతున్న కుంజరాన్ని చూచి, రాజుకు సందేహం కలిగి, సంయాతునితో "అయ్యో! ఏమిటిది? నీవేమో ఏనుగును బాగా శిక్షించి మచ్చిక చేసి, అన్నీ మప్పించానన్నావు. ఇది తీవ్రమైన నీ అంకుశం పోట్లను లెక్కపెట్టడం లేదే! దిక్చక్రం తిరుగుతున్నట్టు, చెట్లు మనవెంటే పరుగెత్తి వస్తున్నట్టు తోస్తున్నది. దీని బలమైన, బరువైన అడుగులకు భూమి దద్దరిల్లుతున్నది. దైవం ప్రతికూలమైనప్పుడు పురుషకారం పొల్లుపోయినవిధంగా ఈ మదోద్ధతమైన ఏనుగును అణచడానికి మన ప్రయత్నాలేవీ పనికి రావడం లేదే!" అన్నాడు. రాజు మాటలకు సంయాతుడు చాలా భయపడ్డాడు. తన గజ శిక్షణ సామర్థ్యానికి కళంకం వచ్చిందికదా అని సిగ్గుపడ్డాడు. వినయంతో చేతులు మోడ్చి "దేవా! నే నీ ఏనుగుకు అన్నివిధాల శిక్షణ యిచ్చి, అన్ని పనులూ నేర్పాను. ఆడ ఏనుగును పసికట్టి, మరులు రేగి దీనికి ఇప్పుడు మతి చెడింది. జంతువులు కామవశమైనప్పుడు బోధనలను పాటించవు; నియమాలకు కట్టుపడవు; దాక్షిణ్యాన్ని దగ్గరకు రానివ్వవు; మంచితనం చూడవు. రతిరసంతో ఉవిళ్ళూరుతూ విషయాభిముఖమైన బుద్ధిని ఎవరు అడ్డుకట్టగలరు? కొండకొన నుంచి అగాధమైన లోయలోకి పరువిడే సెలఏరును అరికట్టడం సాధ్యమా? మేము ఏనుగులకు శరీర పరిశ్రమగల శిక్షణలను ఇవ్వడంలో కుశలులం గాని మనస్సును నియమించే శిక్షణలలో సమర్థులమా? మనోనిగ్రహంలో మునులు కూడా శక్తులు కారుగదా! దేవా, కామోద్రేకంతో ఉన్న ఈ ఏనుగు అలసటను లెక్కచేయక, నియమాలకు కట్టుబడక, మూర్ఖంతో దారీతెన్ను తెలియక దుర్మార్గునిలాగ పరుగెత్తుతున్నది. వ్యసనాలకు లోబడి పతితుడైన దుర్జనుడు తనతోపాటున్నవారిని కూడ అధఃపతితులను చేస్తాడు. ఇది నిజం. కనుక చెట్టుకొమ్మను పట్టుకొని ఏనుగును వదలిపెట్టండి" అన్నాడు. మహీపతి తత్కాలానుగుణమైన సంయాతుని హితవచనం విని, వానితోపాటు ఒకపెద్ద మానుకొమ్మను పట్టుకొని ఏనుగును వదలి పెట్టాడు. తర్వాత కొంతసేపటికి పరిజనులు తెచ్చిన గుర్రమెక్కి తన నగరుకు తిరిగి వెళ్ళాడు.

ఆ మదగజం అలా అరణ్యంలో పరుగెత్తి పరుగెత్తి తను కామించిన పిడి ఏనుగును కలుసుకొని దానిపై బడింది. దానితో స్వేచ్ఛగా గడిపి, కామ వికారం ఉపశమించగా, ఏడునాళ్ళకు మరల స్వయంగానే పట్టణానికి తిరిగివచ్చి గజశాలలో తనను కట్టివేసే కట్టుకంబం వద్ద నిలబడింది; యథాప్రకారం మేతమేయసాగింది.

తన శిక్షణబలం ప్రేరేపించగా తనకు తానే వచ్చి ఆలానం చేరిన ఆ ఏనుగును చూచి సంయాతుడు తన శిక్షాకౌశలోత్కర్షానికి సంతోషిస్తూ, ఈ సంగతిని రాజుకు ఇలా నివేదించాడు: "రాజా! రాగమనే ఉచ్చులలోపడి మోహాతిరేకంతో, నా శిక్షా సంకేత నియమాలను లెక్కచేయక పరుగెత్తిపోయిన ఏనుగు తనంతట తానే తిరిగి వచ్చింది. శిక్షణ పొంది వినయంతో వశమై, మంచీ చెడుగూ తెలిసి అందుగుచెట్ల ఆకులను ప్రేమతో మెసవే ఏనుగుతో కాగిన ఇనుప దూలాన్ని కూడ ఎత్తించవచ్చు. ఈ ఏనుగు అలా కాక కామాకృష్టమై విపరీతమైన వికారం పొందింది; కామజర్వం ప్రశాంతమైన పిదప స్వస్వభావానికి వచ్చింది. దేవా! సింహ శార్దూల మాతంగాలను శిక్షించవచ్చుగాని,

రాగాసవంతో మత్తెక్కి విషయాభిముఖమైన మనస్సును అదుపులో పెట్టడం సాధ్యం కాదు."

రాజు సంయాతుని మాటలు విని "నిజమే!" అని అనుకున్నాడు. మనసులో "సంయాత! నీవు చెప్పినది వాస్తవం, చాల సముచితం. మనస్సనే మదద్విపాన్ని సంయమమనే ఆలానానికి (కట్టుకంబానికి) కట్టివేయగల ప్రశమశీలుడు ఈ లోకంలో ఉన్నాడా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సంయాతుడు దేవత ఆవేశించినవానిలాగ "దేవా! లేకేమి? జగత్క్లేశాన్ని కూకటివేళ్ళతో నశింపజేయడానికి ఉద్యమించినవారు, వివేకదర్శనులు, వైరాగ్యాభిమానులు, శాంతి సంతోష సంయుతులు అయిన బుద్ధులనేవారున్నారు. ప్రబోధం కలవారు వారే!" అని సమాధానమిచ్చాడు.

బుద్ధుడనే పేరు వినగానే, సమ్యక్సంబోధిచేతస్కుడైన ఆ రాజుకు పూర్వజన్మాభ్యస్తమైన ప్రణిధానం స్ఫురించింది. "ఈ సంసార మకరాకరంలో - సముద్రంలో - కొట్టుకులాడే ఈ జగత్తును సంబోధిముక్తుణ్ణై కుశలమనే సేతువుతో తరింపజేస్తాను" అని తలపోశాడు. అప్పుడు శుద్ధావాసదేవతలు ఆకాశం నుంచి "ఓ మహామతీ! నీవు సమ్యక్సంబోధిచే సంబుద్ధుడవు అవుతావు!" అని శుభాశంసనం చేశారు. ఆ ఆశంసనం విని విరాగులలో శ్రేష్ఠుడైన ఆ రాజు పూర్వజన్మ జ్ఞానంతో దివ్యదృష్టి పొంది బోధిసత్త్వుడయ్యాడు.

తర్వాత ఆ రాజు గొప్ప ప్రభావం కలిగి, తత్త్వైకదృష్టితో, భవజలధిలో మునుగుతున్న సర్వభూతాలపైన దయ చూపుతూ, నూతనంగా ఉదయించిన జ్ఞానోత్సాహసంగతితో కుశలసేతువై ప్రాణికోటిని ఉద్ధరించినవాడయ్యాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ప్రభాసావదానమనే మొదటి పల్లవం.

# 2. శ్రీసేనావదానం

ఈ లోకంలో ఛేదించినా ఘర్షణ పెట్టినా కాల్చినా వ్యథచెందక చందన వృక్షాలవలె పరులకు మేలే చేకూర్చు పుణ్యాత్ములున్నారు; వారికి జయమగుగాక!

గుణగణాలతో గణనీయమై, శక్రపురిని కూడా తలదన్నదగిన అరిష్ట అనే పురం ఉన్నది. దానిలో శ్రీసేనుడని విఖ్యాతి చెందిన భూపాలుడుండేవాడు. ఆయన రత్నాకరునివలె సమగ్ర గుణరత్నాకరుడు. సూర్యకాంతి ప్రభావంతో అన్ని దిక్కులూ రాగిల్లినట్లే, పరోపకార పరాయణుడూ, చతురుడూ అయిన ఆ రాజు ప్రభావానికి దిక్ప్రజలందరూ అనురక్తులయ్యారు. ఘన దాన సుగంధం కలిగి, భూతి ధవళాలైన దిగ్గజాలవలె, కల్పవృక్షాలవలె ఆయన కీర్తిపరంపరలు జగత్తుకు శోభ కలిగించాయి. ఆయన ప్రజల పుణ్యవశాత్తు కళాపూర్ణుడైనప్పటికీ సరళ స్వభావుడుగాను; సరళ స్వభావుడైనప్పటికీ మహామేధావిగాను; మహామేధావి అయినప్పటికీ నిష్కపట హృదయుడుగాను ఉండేవాడు. సూర్యుని కాంతి ఎంతమేర వెలుగుతుందో, గాలి ఎంతమేర వీస్తుందో, అంతమేర ఆయన కీర్తి, ఆనతి నిరాఘాటంగా ప్రసరించేవి.

ఆయనకు సమానమైన దేహబలము, బుద్ధిబలము కలవారు, షడ్గుణ జ్ఞానమే దృష్టిగా కలవారు అయిన పన్నెండు వేలమంది మంత్రులు ఉండేవారు. రాజు ధర్మాలకు ఇరవుగా ఉండగా ప్రజలు కూడా సద్వర్తనులు కావడంలో ఆశ్చర్యం ఏమిటి? పడతులలాగే ప్రజలూ పతితుల్య గుణాలు కలవారు కావడం సహజమేకదా!

ఆయన పుణ్యకర్మల వల్ల ఆయన రాజ్యంలోని ప్రజలు కాలధర్మం చెందిన పిదప స్వర్గలోకానికి విమానాలలో తెరపిలేకుండా ప్రయాణాలు సాగించారు. కొంతకాలానికి సురలోకమంతా మనుష్యులతో నిండిపోవడం చూచి ఇంద్రునికి కన్నెర్ర అయింది. "ఈ శ్రీసేనుడేమో అత్యాశ్చర్యకరంగా నిత్యం దానధర్మాలు చేస్తున్నాడు. అన్ని జీవరాసులకూ శ్రేయస్సు కలిగిస్తున్న ఈ రాజు చరితం వల్ల మేము హాస్యపాత్రులమయిపోతున్నాము. ఈ ధీర హృదయుని మనస్సును ఎలాగైనా విరిచి, మాయోపాయంతో ఈయన ధైర్యం పరిశీలించాలి" అని ఇంద్రుడు అనుకుని దేవతలతోపాటు మారువేషంతో భూలోకానికి దిగివచ్చాడు.

ఇది ఇలా ఉండగా, రాజ్యరక్షణ వ్యవహారాలలో రాజుకు గురువు వంటివాడు, ప్రజాకార్యపర్యాలోచన తత్పరుడు అయిన మహామతి అనే మంత్రి రాజుతో ఒకనాడు ఇలా విన్నవించాడు: "రాజా! రాగద్వేషాలు త్యజించి, నిర్వ్యాజదానశీలంతో ప్రజల మనసు రంజింపజేస్తూ రాజ్యగౌరవాలతో ఉన్న మిమ్మల్ని చూచి త్రిదశాధిపతి అయిన ఇంద్రుడు సిగ్గుపడుతున్నాడు. ఇతరులు

గుణగణపూర్ణులుగా ఉండడం, తమకు గుణాలు లేకపోవడం చూచి ఎవరు మత్సరగ్రస్తులు కారు? పరోత్కర్షను సహించనివారు, అసూయాపరులు గొప్పవారు మంచిపనులు చేసినా తరుచు ఏవగించుకొంటారు. మీరేమో దానవ్యసనులు. సర్వస్వదానం, మర్యాదాదానం మీకు లెక్కలోనివి కావు. కాని, దారాపుత్రదానం, ఆత్మదానం చేయాలనే సాహసానికి మాత్రం పోకండి. మీరు ఇలాటి సాహసాలు చేసినట్టు భయంకరమైన కలలు గన్నాను. పూర్వం కొందరు సహజంగా పుట్టిన చూడామణిని కూడా పెకలించి యిచ్చినట్టు కథలూ ఉన్నాయి. తత్త్వవేత్తలయిన దైవజ్ఞులు కూడా మీరు శరీరదానం చేయగలరని జోస్యం చెబుతున్నారు. కనుక నాకు మరీ భయంగా ఉంది. ఆ ప్రవాదాన్ని వినలేకపోతున్నాను. మీరు శరీరదానం చేయడం వల్ల సకలార్థి సమూహమూ నిరాశ పడిపోతుంది. కల్పవృక్షం కూడా తాను ఉంటూనే అందరికీ అన్ని కోరికలూ సమకూర్చుతుంది. కనుక ఆత్మదానం వంటి త్యాగం నుంచి విరమించండి. మీ శరీరం ప్రజాయత్తమైనది. అది జగద్రక్షారత్నంకదా!"

శ్రీసేనవసుధాధిపతి మంత్రి మాటలు విని, శాంతరసమొల్కే చిరునవ్వుతో ఇలా అన్నాడు: "మహామాత్యా! సచివోచితమైన హితం నీవు చెప్పావు. కాని, అర్థిజనులు నిష్ఫలంగా వెళ్ళిపోయే సంతాపానికి నేను ఒడికట్టలేను. 'దేహి' అని అర్థించేవారిని 'లేదు పొండి' అని పరుష వాక్కులు పలికేవారు ప్రాణాలతో ఉన్నా చచ్చినట్టివారే. ఇది ఇతనినుంచి పొందుతానని పుట్టెడాసతో వచ్చిన యాచకుని లేదని తిప్పి పంపేవారు బ్రతికి ఏమి ప్రయోజనం? ఆర్తజనుల దీనాలాపాలు విని కూడా మనసు చల్లబడి ఏమి చేయని కరుణారహితుని, పుణ్యహీనుని జన్మ ఎందుకు? ఎప్పటికైనా, ఎవరికోసమైనా, ఏమాత్రమైనా ఉపకరిస్తుందనే కదా అపాయసహితమైన ఈ కాయాన్ని సత్పురుషులు ప్రీతితో చూడడం!" సత్త్వ త్యాగశాలి అయిన ఆ రాజు మాటలు విని మంత్రి 'కానున్నది కాకమానదు' అనుకొని, సమాధానమేమి పలుకక ఊరుకున్నాడు.

కొంతకాలం గడిచిన తర్వాత, ఒకనాడు శ్రీసేనుని పట్టమహిషి జయప్రభాదేవి విహారార్థం ఉద్యానవనానికి వెళ్ళింది. చిత్తమనే సారంగానికి ఉచ్చువలె, రతీదేవికన్నా మిన్న అయిన ఆమెను అధ్యాపకుడనే ముని అకస్మాత్తుగా దూరం నుంచి చూచాడు. పూర్వజన్మ సంబంధస్నేహంతో ఆమె అతనికి పరిచితగా కనిపించింది. ఆమెను చూచిన మీదట ధీరుడైన ఆ ముని హృదయం ధృతి తప్పింది. వీతరాగుడైన ఆయన మనస్సు సంసార విముఖం కావడం మాని, వాసనావశాన దురభిలాషావశమైంది. పూర్వజన్మవాసన నిరంతర ప్రీతితంతువులతో అల్లిన ఉచ్చు; అది ప్రాణులను విడిచిపోదు.

జయప్రభాదేవిని చూచి మోహాంధుడై ముని ఆశ్రమానికి తిరిగివచ్చాడు. విద్యాభ్యాసం పూర్తిచేసిన ఒక శిష్యుడు గురుదక్షిణ సమర్పించడానికి వచ్చి, స్వీకరించవలసిందని మునిని కోరాడు. "వత్సా! నీ దక్షిణ ఏది నాకు అక్కరలేదు. ధనంతో నాకేమీ ప్రయోజనం లేదు. నిర్బంధంగా గురు దక్షిణ ఇవ్వదలచావా, శ్రీసేనమహారాజు పట్టమహిషి జయప్రభను నాకు తెచ్చి సమర్పించు. ఆమే నాకు గురు దక్షిణ" అన్నాడు మునిపుంగవుడు. గురువువాక్యం విని శిష్యునికి ఒళ్లు జల్లుమన్నది. 'ఆచార్యుని ఆశ అశక్యమైందికదా! ఏమిచేయను?' అనే సంశయం అతనిని కలచివేసింది. అయినా 'గుర్వాజ్ఞ, అనుల్లంఘనీయం' అనుకొని అరిష్టా నగరానికి బయలుదేరాడు.



శిష్యుడు అరిష్టానగరం చేరి, నిరంతరం స్వేచ్ఛగా నిర్భయంగా అర్థిసందోహం వచ్చిపోవడానికి తలుపులు తెరిచే ఉన్న ఆ రారాజు నగరు ప్రవేశించాడు. రాజసమ్ముఖంలో, ఆచార్యుని కోరిక అలభ్యమైందనే దైన్యంతో మనస్సు వ్యాకులం కావడం వల్ల తలెత్తక నేల చూస్తూ నిలబడ్డాడు. తన ఎదుట నిలబడ్డ ఆ అర్థిని రాజు చూచి, దేవతలకు అమృతం అందించిన సమయంలో పొంగిన క్షీరసాగరం లాగ పొంగిపోయి, ఆయనకు అర్ఘ్యపాద్యాలిచ్చి సత్కరించి "ఏమిటి మీ ఈప్సితం?" అని ప్రశ్నించాడు. శిష్యుడు అడుగదలచిందేమో అనుచితమైన కోరిక. కనుక అడగడానికి నోరు రాలేదు; మాటలు తడబడ్డాయి. సిగ్గుతో, వ్యాకులతతో గొంతు ముద్దకట్టుకొని పోయింది. ఏదోవిధంగా కష్టం మీద "రాజా! నీవు అర్థి కల్పవృక్షానివి. నేను ఇదివరకెవ్వరిని యాచించి ఎరుగను. గురువు కోసమని దుర్లభమైనప్పటికీ ఒక కోరిక కోరుతున్నాను. నా విద్యాపూర్తికి దక్షిణగా మా గురువు జయప్రభాదేవిని కోరారు. సాధ్యమైతే అనుగ్రహించు" అన్నాడు. మునిశిష్యుడు ఈ విధంగా అడుగగానే స్నేహదానరసావిద్ధమైన మహీపతి మనస్సు రెండుగా చీలిపోయింది. కాని, స్వచ్ఛమైన వసనాన్ని కప్పుతున్నట్టున్న దంత కాంతులను విరజిమ్ముతూ శిష్యునితో అన్నాడు: "మునిశిష్యా! నా దయితను స్వీకరించండి. మీ గురువు అభీష్టాన్ని ముందు వెనుకా ఆలోచించకనే పూరించవలసినవాణ్ని. నా హృదయం వియోగంతో ముక్కలై పోతున్నది. అయినా లెక్క చేయను" అని అంటూ ఆ రాజు ఒకవైపు తీవ్రమైన వియోగం అడ్డుతున్నప్పటికీ, మరొకవైపు స్మరబంధువైన స్నేహం- చిరకాల స్నేహం వద్దంటున్నా తన రెండవ ప్రాణంవలె హృదయాధివాసిని, రాజీవలోచన అయిన తన దయితను దానం చేశాడు. జయప్రభాదేవి "మహారాజా! ఏమిటిది?" అంటూ భయపడిన లేడివలె దిక్కులు చూడసాగింది.

త్యాగశీలి అయిన పృథివీపతి భార్యను దానం చేయడం చూచి భయపడినదా అన్నట్టు భూమి కంపించింది. భూమికి మేఖలగా వున్న సముద్రమూ ఘూర్ణిల్లింది. ఇంద్రచంద్రాది దేవతలు తమ ప్రియురాండ్ర కోసమేకదా తమ దేహాన్ని దుర్భర నీచదశకు పాల్పడజేశారు. స్త్రీలకోసం కొందరు శీలాన్ని, కొందరు ధనాన్ని, మరికొందరు ధర్మాన్ని, ఇంకా కొందరు తపస్సును, మరికొందరు సిగ్గును, కొందరు శరీరాన్ని కూడా వదలుతున్నారుకదా! మరి స్త్రీలంటే ఎవరికి ఇష్టం ఉండదు? పురుషులకు స్త్రీ అనురాగ సర్వస్వం, జీవితానికే జీవితం. కాని, సత్త్వసంపన్నులు దానిని కూడ గడ్డిపోచగా పరిగణిస్తారు. ముని శిష్యుడు జయప్రభాదేవిని పిలుచుకొనివెళ్ళిన తర్వాత శ్రీసేనుడు విరహాతురుడై సుఖమంటేనే గిట్టక రతిని కోల్పోయిన మన్మథునిలాగ ఒంటరైపోయాడు.

శిష్యుడు జయప్రభాదేవిని ఆశ్రమానికి పిలుచుకొనివెళ్ళి ముని సమ్ముఖంలో నిలిపాడు. జీవకళే లేక పంచత్వం పొందినదానివలె ఉన్న ఆ రాజుభార్యను చూచి, మునికి చాల పశ్చాత్తాపం కలిగింది. తన దుశ్చరితం వల్ల కలిగిన అనౌచిత్యాన్ని తలచుకొని ఆమెను చూడలేక సిగ్గుతో కళ్లు మూసుకొని, "అయ్యో! ఎంతపని చేశాను. పిల్లవానివలె చాపలంతో నాకు నేనే జంకుకొంకులు లేకుండా పాపపంకంలో పడిపోయాను. ఈమె ప్రజలకు జనని; ధర్మాచరణచణులకు ధర్మకారిణి; వర్ణాశ్రమరక్షకుడైన రాజుకు ధర్మపత్ని. ఇలాటి సాధ్విని నేను దుఃఖాగ్నిలో కూలదోశాను. శీలం పాలించలేక పోయాను; సంయమాన్ని విస్మరించాను; వైరాగ్యం వల్లకాడు చేశాను; వివేకాన్ని అవలోకించలేకపోయాను.

నిర్విచారులమైన మావంటివారి మనసు కూడ అసంయమమనే ఆసవంతో మత్తెక్కితే, పెడదారి పట్టి పరుగిడుతుంది' అని తలపోసి, సిగ్గుతో కాంతి తరిగిన ముఖం ఎత్తలేక రాజమహిషి వద్దకు వెళ్ళి ఇలా అన్నాడు: "తల్లీ! ఊరడిల్లు. దుఃఖపడకు. నీకీ కష్టం కలుగడం, నేను అకృత్యానికి పూనుకొనడం నా దుర్విధి. ఆ గట్టున ఉన్న మాను నీడను విశ్రమించు; ఆశ్రమానికి వచ్చిన అలసట పోగొట్టుకోవమ్మా! ఇప్పుడే మేము నిన్ను నగరు చేరుస్తాము." దేవి ఆ ముని మాటలు అమృతపుసోనలై తనపై కురియగా ఊరడిల్లి, మరల జీవితాశ చిగిర్చి, భయసంభ్రమాలు వదలి విశ్రమించింది.

ఈ మహాదాత అద్భుతచరితం దేవలోకం వరకు వ్యాపించింది. రాజు మనోధైర్యాన్ని పరీక్షించడానికి ఇంద్రుడు ఒక బ్రాహ్మణవేషం స్వీకరించాడు. తన శరీరాన్ని సగం నిర్జనారణ్యంలో ఒక పులి పీక్కుతిన్నట్టు మాయ కల్పించాడు. ఆ క్షతగాత్రుడైన బ్రాహ్మణుని నలుగురు కుమారులు ఏడుస్తూ మోసుకొని నడుస్తున్నారు. ఆ బ్రాహ్మణుని దేహంనుంచి రక్తం ధారలుకట్టి కారుతున్నది. పేగులు వేలాడుతున్నాయి. ధనవంతుని పీక్కుతినడానికి లోభులు, రాజులు, దొంగలు వెంటపడినట్టు అతనివెంట నూతన మాంసగంధంతో గ్రద్దలు మొదలయిన మాంసభక్షక పక్షులు పడ్డాయి. కారుణ్యదైన్య దుఃఖార్తుడైన ఆతనిని చూచి పురజనులు సంభ్రమాశ్చర్య చకితులయారు. మూర్తీభవించిన శోకంవలె, సహింపరాని భయంవలె ఉన్న అతనిని చూచి స్త్రీలు వణికిపోయారు. ఇలాటివానిని నలుగురు కుమారులు మోసుకొనివచ్చి, అర్థిసందర్శనస్థానంలో ఆసీనుడైన మహీపతి ఎదుట ఒక మంచంపై పడుకోబెట్టారు. మహాక్లేశ విహ్వలుడైన అతనిని చూచి అక్కడి జనమంతా ముఖం వెనక్కు తిప్పి కనులు మూసుకొంది.

తర్వాత ఆ బ్రాహ్మణుడు వణకుతూ, ఒకవైపు వ్రేలాడుతున్న కుడిచేతిని ఎత్తి, బాధతో మాటాడలేక తడబడుతూ ఇలా అన్నాడు: "మహీపతీ! నీకు శుభమగుగాక! కరుణానిధీ! నన్ను చూడు. నేను బ్రాహ్మణుణ్ని. ఘోరపాపాలు చేసినవాడిలా ఈ దుర్దశను పొందాను. సంసారంవలె ఘోరమైన అరణ్యంలో ఒక బెబ్బులి నన్ను పట్టుకుని ఇలా తినివేసింది. ఈ ఘోర దుఃఖాన్ని అనుభవించడానికి బతికి ఉన్నాను. ఇంతటి విపత్తులోను నా ప్రాణాలు తీవ్రక్లేశాన్ని సహిస్తున్నవేకాని, సజ్జనులైన మిత్రులవలె నన్ను వదలకుండా ఉన్నాయి. 'ఎవడైనా తన దేహార్ధం ఖండించి ఇస్తే, నీవు జీవిస్తావు' అని ఆకాశవాణి పలికింది. కాని ఈ లోకంలో తన ప్రాణం పరులకెవడిస్తాడు? ప్రాయశః అందరూ స్వసుఖాన్నే కోరేవారు. పరార్థవిముఖులూను. కనుక, కరుణానిధీ! సర్వకాలాలలోను సర్వమూ ఇస్తూ, దీనవ్యసన బాంధవుడైన నిన్ను శరణు పొందాను. దేహదానానికి కూడా నీవు వెనుదీయవని నమ్మి వచ్చాను. ఈ లోకంలో నిర్వ్యాజంగా, ఉదారంగా, ఆదరంతో దానమనే ఫలాలిస్తున్న పుణ్యపాదపం నీవొక్కడివేకదా! వదాన్యుడివైన నీ యితర గుణాల సంగతి అలా ఉండగా, నీ పుణ్యడిండిమం 'దానం దానం' అని నిరంతరం మోగుతున్నది. ఆపన్నులను దుఃఖాలనుంచి రక్షించి పవిత్ర చరిత్రులైన మీబోటి వారిని కదా ఆపదలలో ఇతరులు పుణ్యవశాన శరణు పొందుతారు. మంచి గంధంమాకులనుంచి చల్లగా, అమందానందం కలిగిస్తూ వీచే మలయమారుతాలవలె సత్పురుషులు దీనుల సంతాపం పోగొడుతారు. పూర్ణచంద్రునివలె సుందరమైన నీ ముఖం నుంచి వెన్నెలవలె అమృతాన్ని వర్షిస్తూ వెలువడే వాక్కులు యాచకులకు జీవం పోస్తాయి" అని అంటూ ఆ కుహనావిప్రుడు మూర్ఛపోయాడు. ఆ మాటలు



విన్నవెంటనే ఆతని బాధ తనదని భావించి రాజు "ఓ ద్విజుడా! ఊరడిల్లు. ప్రాణభయం వదలిపెట్టు. నిర్విచారంగా నా అర్ధ శరీరం నీకు అర్పించి నిన్ను కాపాడుతాను. పరోపకారం కోసం దేహాన్ని వినియోగించేవారు ధన్యులు. ఈ దేహం క్షణక్షణమూ క్షయం పొందుతూనే ఉంటుంది. ఎంత రక్షించినా అక్షయంగా ఉండదు" అని ఆ కుహనావిప్రుని సమాధానపరిచాడు.

భూపాలుని మాటలు విని మహామాత్యుడైన మహామతి మనసు కంపించిపోయింది. తలపై పిడుగు పడ్డట్టయింది. రాజును సమీపించి వినయంతో ఇలా విన్నవించాడు: "ప్రభూ! ప్రజల పుణ్యం క్షీణించడం వల్ల మీరు దాన సాహసాలకు అలవాటయి, క్లేశాలను కోరుకొంటూ నేను విన్నవించే హితం వినకుండా ఉన్నారు. ప్రజలకు మేలు చేకూర్చే మీవంటి గుణవంతులు మరెవ్వరున్నారు? భృత్యులమైన మేము ఎంతమంది ఉన్నా వాగేవాళ్ళమేకాని వినేవాడూ, చేసేవాడూ రాజే కదా! ఏనుగు కళ్ళు మూసుకున్నట్టుగా రాజు హితవాక్కు వినిపించుకొనకపోతే, భృత్యుల భోగభాగ్యాలీపాటివే అవుతాయి. మాబోటి వినీతులు కల్యాణచింతతో విన్నవించే మంజుల వాక్కులు మధుమంజరిలాగ మీ చెవికి ఎక్కాలి. ఇతడు కుహనా బ్రాహ్మణాకారంలో ఉన్న రాక్షసుడో, పిశాచమో! లేకపోతే జగద్రక్షారత్నమైన మీ దేహాన్ని అర్థిస్తాడా? ఇది వీడు పన్నిన మహామాయ కాకపోతే, క్రూరజంతువులు సగం దేహం తినివేస్తే ఒక్క క్షణమైనా బతకడం కద్దా? 'ఇది తగును, ఇది తగదు' అనే ఆలోచన లేక పట్టుదలతో సుకృతం చేసినా, అది ఆత్మవినాశకమై పరలోకంలోను సుఖం కలిగించదు. సాధ్యమైనది సదా ఇవ్వవచ్చును. కాని, అసాధ్యమైనది ఎలా ఇవ్వవచ్చు? 'సర్వస్వం దానం చేశాడు. దేహం దానం చేసాడు'- అనే ప్రవాదం దూరం నుంచి శ్రావ్యంగా, కర్ణామృతంగా ఉంటుంది. అలా సర్వస్వం, దేహం దానం చేసిన పిదప తక్కిన అర్థుల గతి ఏమవుతుంది? రాజా! మీరు అర్థిచింతామణి వంటివారు; ప్రజలకు జీవితంవంటివారు. కనుక అన్నివిధాల, ఇతరుల జీవితాలతోనైనా మిమ్మల్ని కాపాడుకోవాలి. మమ్మల్ని దయదలచండి. ఈ సాహసానికి ఒడిగట్టకండి. ఈ గాజుపెంకుకోసమా మీ శరీరం విక్రయిస్తారు?" అని అమాత్యపుంగవుడు రాజు కాళ్ళపై పడ్డాడు.

కాని, భూపాలుని శరీర దాన సంకల్పం కొంచెం కూడా సడల లేదు. మంత్రిమాటలకు ఆయన ప్రేమ తొణికిసలాడుతూ మందహాసం చేశాడు. ఆ మందహాస ధవళకాంతి జీవితస్నేహ మోహాంధకారాన్ని పటాపంచలు చేస్తున్నట్టు అనిపించింది. "మహామాత్యా! నాపై భక్తితో నీవు చెప్పిన హితవాక్కులు యుక్తమైనవే. కాని, ప్రాణాలు పోతున్నట్టు బాధపడుతున్న ఈ బ్రాహ్మణుణ్ని చూచి సహించలేను. అర్థి మనోరథం పొందక తిరిగిపోయాడనే మాట వల్ల నాకు కలిగే సంతాపాన్ని చల్లని ముక్తాహారాలు, హిమజలాలు, తామరలు, తామరతూండ్లు, చంద్రకిరణాలు, చందనలేపనాలు శమింపజేయలేవు. ఓ సుమతీ! సర్వదా సకలార్తిహరణోద్యతచిత్తుడైన నాకు అడ్డు రావద్దు. సమ్యక్సంబోధిచిత్తంతో పూర్వజన్మ వృత్తాంతం నాకు స్మరణకు వచ్చింది. పూర్వజన్మలలోను ఈ విధంగానే నా దేహం దానం చేశాను. అప్పుడు కూడా వ్యథపడలేదు. పూర్వం ఒక జన్మలో ఒక ఆడ పులి ఆకలితో అలమటిస్తూ తానుకన్న పసికూనలను తినడానికి పూనుకోగా నేను నిర్విచారంగా నా శరీరమిచ్చి ఆ పసికూనలను కాపాడాను. నేను శిబి జన్మలో ఒక గుడ్డివానికి నా కండ్లు పెకలించి యిచ్చి, నేత్ర దానం చేశాను. ఒక డేగ తరుముకొని రాగా భయంతో నా శరణు పొందిన

పావురాయిని, డేగకు నా కండలు కోసి యిచ్చి కాపాడాను. చంద్రప్రభుడుగా జన్మించినప్పుడు రౌద్రాక్షుడనేవానికి నా శిరస్సునే నరికి యిచ్చాను. ఇతర జన్మలలో సర్వస్వదానం, పుత్రకళత్ర దానం చేశాను" అని అన్నాడు. బోధిసత్త్వుడైన భూమిపతి ఈ విధంగా సమాధానం చెప్పగా మహామతి దుఃఖించి సజీవుడుగానుకాక నిర్జీవుడుగానుకాక అట్లే చూస్తూ నిలబడిపోయాడు.

తర్వాత అలంఘ్యశాసనుడైన ఆ రాజు పలుడు, గండుడు అనే భృత్యులను పిలిచి, రంపంతో తన శరీరం కోసి ఇవ్వవలసిందని ఉత్తరువు చేశాడు. ఆ భృత్యులిద్దరూ మొదట తీవ్ర శోక వివశులయారు. కాని తర్వాత శక్రమాయావిమోహితులై యథాలాపంగా భూమీపతి దేహాన్ని రంపంతో కోయడం ప్రారంభించారు. వారు ఆ విధంగా రంపంతో కోస్తున్నా రాజు ఉస్సురస్సురనైనా అనలేదు; ఎలాంటి వికారమూ చూపలేదు.

ఈ దారుణకృత్యానికి భూమి కంపించింది. ఉల్కలు రాలాయి. రక్తవర్షం కురిసింది. పిడుగులు పడ్డాయి. తారకలు దొర్లాయి. అది చూస్తే గగనలక్ష్మి కన్నీరు కురిపించి బిట్టుగా ఏడ్చినట్టు తోచింది. దిక్కులంతటా ధూళి కప్పింది. ఆ ధూళిలో సూర్యమండలం మరుగైపోయింది. అది చూడగా, ఈ దారుణం చూచి సూర్యుడు దుఃఖం పట్టలేక ముఖానికి ధూళి కప్పుకొన్నట్టు అనిపించింది. ప్రజలు బావురుమని ఏడ్చారు. ఆ రోదనధ్వని ప్రతిధ్వనించి దిక్కాంతలు రోదించినట్టు తోచింది.

దేహం కోస్తున్నా కాంతి తరుగని రాజును చూచి ద్విజరూపంలో ఉన్న ఇంద్రునికి ఆశ్చర్యం, అనుకంప కలిగాయి. తనలో చాలాసేపు ఇలా అనుకున్నాడు. "ఆహా! కరుణాకోమలమైన ఈ వివేకవంతుని మనస్సు పరార్థం కోసం బాధపడుతున్నప్పుడు వజ్రంకన్నా కఠోరంగా పరిణమించింది. మహాత్ముల చరితం ఆశ్చర్యకరమైంది! అది సాగరం కంటే గంభీరమైంది. మేరువుకంటే సమున్నతమైంది. సత్త్వసముద్రుడైన ఈ రాజు ధైర్యం ఎలాంటిదో! ప్రాణాలు పైకి ఎగిరిపోతున్నా ఆపత్కాలంలో సాధువులవలె చెక్కుచెదరకుండా ఉన్నది." ఇలా సహస్రాక్షుడు అనుకుంటూ ఉండగానే, రాజు అధఃకాయం రంపపు కోతకు తెగి భూమి మీద పడింది. తన దేహం రెండు తుండ్లయినప్పటికీ రాజు సర్వభూతపరిత్రాణం వల్ల కలిగిన పుణ్యంతో ప్రాణాలు కోల్పోకుండా, హర్షోత్సాహాలు తగ్గకుండా ఉన్నాడు.

పిదప రాజు తన తెగిన అర్ధశరీరాన్ని ఆ బ్రాహ్మణుని మొండి ఒడలికి తగిలించవలసిందని ఉత్తరువు చేశాడు. భృత్యులు రాజాజ్ఞ పాలించారు. ఆ కుహనా బ్రాహ్మణుడు సంపూర్ణదేహుడై, స్వాస్థ్యం పొంది, లేచి నిలబడి "రాజా! నీవు రాజిల్లుదువుగాక! విరాగశీలుడవైన నీ మనస్సు పవిత్రమైంది. నీవు నిర్వ్యాజస్నేహంతో దేహదానం చేయడం వల్ల నీ కీర్తి విశేషంగా వ్యాప్తి చెందింది. నీ మనస్సు అపూర్వమణివంటిది. దానికి సమానమైనదానిని వెర్రిబాగుల బ్రహ్మ సృష్టించలేక, పోలికలు వెదకలేక తికమకలు పడుతున్నాడు. నీవు చెరకుగడలాగ మధురాశయం కలవాడివి, సరళుడివి, పరార్థం కోసం దుస్సహక్లేశపీడను భరించావు" అని సంతోషంతో ప్రశంసిస్తూ, నిజరూపం ప్రకటించి, అమృతం వర్షించే సంజీవన ఔషధాలను స్మరణ మాత్రంతోనే తెప్పించి, వాటితో రాజును సంపూర్ణ శరీరుణ్ణిగా చేశాడు. ఈ మహాద్భుతం చూచి, ఆకాశం నుంచి దేవతలు సితకుసుమ వర్షం కురిపించారు.



ఆ సమయంలో క్షోణీపురంధ్రి సంతోషంతో నవ్వినట్టు ఆ వర్షం ఉంది.

ఆ సమయానికే ఉపాధ్యాయమునీశ్వరుడు రాజు పట్టపుదేవేరి అయిన జయప్రభాదేవిని పిలుచుకొని ఆస్థానానికి వచ్చి, రాజు త్యాగచరిత్ర విని ఆశ్చర్యపడి, ఆశ్రమంలో జరిగిన ఉదంతం వివరించి, ఆమెను రాజుకు అర్పించాడు. తన కీర్తివలె విశుద్ధ అయిన తన పత్నితో సహా రాజు నిర్వికారంగా శక్రునికి వందనం ఆచరించాడు.

పిదప సురేంద్రుడు విశ్వకర్మ నిర్మితమైన దివ్యసింహాసనములో ఆ రాజుదంపతులను కూర్చోబెట్టి, జంబూద్వీపానికి పట్టం కట్టాడు. అప్పుడు రత్నవర్షం కురిసింది. ఇంద్రుడు అద్భుత సత్త్వంతో విశుద్ధమై, స్నేహకరుణలతో నవనవలాడే రాజమనస్సును, ఆపన్నుల కష్టాలను పొగొట్టడంతో ఫలించిన ఆత్మజ్ఞానయజ్ఞాన్ని చూచి, ఆనంద బాష్పాలు కన్నులనుంచి జల్లుకట్టగా, ఆ రాజు కీర్తితో నిండిన అమరగిరికి మరలి వెళ్లాడు.

శ్రీసేనమహారాజు జయప్రభాదేవితో పాటు సంసారయాత్రా సంతరణ వ్రతం సమాప్తి చేసి, సుజ్ఞాన గరిమతో పరిపూతచిత్తుడై సంతోషముతో పరిపాలను సాగించాడు. ఆయన దాన పుణ్యప్రభావం చేత ప్రజలు సుఖంగా వున్నారు. ఈ విధంగా బృందారకబృందం, సిద్ధ యక్ష పన్నగ గణం, సంతోషంతో కీర్తిస్తుండగా, ఆ రాజు భూమిని అపూర్వ విభవంతో స్వర్గతుల్యంగా చేస్తూ, కొంత కాలానికి బోధిసత్త్వుడయ్యాడు.

బుద్ధభగవానుడు తన పూర్వావతార ప్రస్తావంలో దానోత్కర్షను గూర్చి తెలుపుతూ భిక్షుగణానికి ఈ కథను చెప్పాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శ్రీసేనావధానమనే రెండవ పల్లవం

# 3. మణిచూడావదానం

భయంకర పీడా మకరాకులమైన ఈ విచిత్ర సంసార సాగరంలో అప్పుడప్పుడు పుణ్య కాంతులు వెదజల్లే పురుషమణులు ఉదయిస్తారు.

భూమిపురంధ్రికి సౌభాగ్యతిలకమనదగిన సాకేతమనే నగరం వుంది. అది హర్మ్యగోపురాల ధవళకాంతులతో కర్పూరకండంలాగ ముచ్చటగొలుపుతూ ఉంటుంది. ఆ నగరవాసులు ప్రభాసత్త్వ సంయుతులు; గంగావిమల మానసులు; పవిత్రులు; పుణ్యకర్మాభిరతులు. కనుక తీర్థస్వరూపులు. అలాంటివారితో ఆ నగరం సకల తీర్థసేవితంగా కనిపించేది. అక్కడి ఉద్యానం సుకృతమనే యశస్సుతో పూచి, పుణ్యసౌరభాన్ని విరజిమ్ముతూ, సత్కర్మలకు ఆలవాలమై నందనవనంలాగ వుండేది. దానిలో పురవాసులు విహరిస్తూ ఉంటారు. ఆ నగరాన్ని గుణరత్న మహోదధి, చంద్రధవళకీర్తి అయిన హేమచూడుడనే రాజు ఏలేవాడు. ఆ రాజు క్షమ, కరుణ కలవాడై, సంపదతో తులతూగుతున్నా జితేంద్రియుడై, ప్రజలకు ప్రీతిపాత్రుడుగా ఉండేవాడు. ఆయన ఎల్లప్పుడూ సత్పురుషులకే ఆశ్రయమిస్తూ కలికాల ఘోరాలు కనిపించకుండా పాలించడం వల్ల ప్రజలు కృతయుగంలో లాగ ధర్మావలంబులై ఉండేవారు. ఆయన అమృతం వంటి అహింసా యజ్ఞదీక్ష పూని, సకల ప్రాణికోటికే అభయమనే దక్షిణ పంచి యిచ్చాడు. పరాక్రమవంతుడైనా గర్వమనేదే లేకుండా, ఎంత ఐశ్వర్యమున్నా పరుషవాక్కనేదే పలుకకుండా, ప్రభుత్వమున్నా ఓర్పుకలిగి, నవయౌవనం పొంగులు కారుతున్నా జితేంద్రియుడై శుక్లపక్ష చంద్రునిలాగ నానాటికీ కళలు మీరే ఆ రాజు అందరికీ ఆశ్చర్యం కలిగించాడు. సాటిలేని ఆ రాజుకు త్యాగంతో కలిసిన కారుణ్యం, పుణ్యకర్మలతో నిండారిన తారుణ్యం అనేవి రెండూ పెట్టని కోటలయ్యాయి. ఆయన దేవేరి పేరు కాంతిమతి. ఆమె పద్మవనానికి ప్రభాతలక్ష్మిలాగ ఒప్పేది. ప్రభుతకు నీతి, త్యాగానికి సిరి, శీలానికి సౌందర్యం, మేరువుకు త్రిదివలక్ష్మిలాగ ఆమె రాజుకు పేరు పెంపులు కలిగిస్తూ ఉండేది.

పిదప కొంతకాలానికి ఆమె భువనమనే పద్మవనాన్ని వికసింపజేయడానికి అదితి దివాకరుణ్ణి గర్భందాల్చినట్టు గర్భవతి అయింది. అప్పుడామె, అగ్ని గర్భంలో వున్న అరణిలాగ, సుధాంశువును కడుపులో పెట్టుకొన్న సముద్రవేలలాగ, కమలాసనుని కనబోతున్న కమలనాభుని నాభిలాగ కనుల విందుగా ఉండేది.

గర్భవతి అయిన తన సతీమణి అభిమతాన్ని తీర్చదలచిన రాజు అర్థినివహానికి వాంఛించినదానికన్నా హెచ్చుగా దానం చేసి, "ఇంకా నీ వాంఛితం ఏమిటి?!" అని ఆమెను ప్రశ్నించాడు. ఆమె సరస్వతిలాగ రాజుకు ఇలా సద్ధర్మోపదేశం చేసింది: "మహారాజా! ధర్మమనే నిధి పుణ్యమణిపూర్ణమైంది. దుఃఖసంతప్తులైన ప్రజలకు దానిని విధి ఆట్టే అందించి ఎప్పుడూ రక్షిస్తాడు.



పరలోక మార్గంలో దుర్గమాటవులలో ప్రవేశించి, శ్రమపడి తాపం పొందేవారికి చల్లని నీడను, తియ్యని పండ్లు ఇచ్చి సేదదేర్చే ఛాయాతరువు ధర్మమే. ధర్మం చీకటిలో వెలుగువంటిది; ఆపదలనే విషానికి మణివంటిది; పడిపోయేవానికి చేయూత; కోరికలకు కల్పవృక్షం; జగత్తుకు జయరథం; పరలోక యాత్రకు పాథేయం; దుఃఖవ్యాధులకు మహౌషధం; సంసార భయభ్రాంతులకు ఊరట; పాపతాపాలకు చందన కాననం; సజ్జనులకు స్థిర స్నేహంగల మిత్రుడు, బాంధవుడు. కనుక మీరు ధర్మాచరణలో ప్రాలుమాలవద్దు." ధర్మధవళకాంతులు విరజిమ్మే తన ప్రియురాలి మాటలు విని, రాజు ప్రజలపట్ల ధర్మైకశరణుడై ప్రవర్తించడం ప్రారంభించాడు.

కొంతకాలానికి రాజమహిషి గగనలక్ష్మి సంపూర్ణ చంద్రుణ్ణిలాగ లోకతిమిరదారకుడైన దారకుణ్ణి ప్రసవించింది. ఆ బాలుడు సహజ చూడామణితో ఉద్భవించాడు. ఆ చూడామణి పూర్వజన్మాంతర సంస్కృతమైన వివేకంవలె, రాత్రులను పట్టపగలుగా చేసే దినమణివలె ప్రకాశించేది. ఆ మణిపై ఒక పొర కప్పి ఉండేది. ఆ మణి చెమర్చి చిలికే అమృత బిందువులు సోకగానే ఇనుము మేలిమి బంగారుగా మారుతుంది; పాపతిమిరం పటాపంచలైపోతుంది. ఆ కుమారుడు జన్మించిన సమయంలో దేవతలు వినువీధినుండి సాకేతపురంపై పుష్పాలు, రత్నాలు, ధ్వజాలు, ఛత్రాలు, పతాకాలు, తాళవృంతాలు, అమూల్య వస్త్రాలు కురిపించారు. సహజ చూడామణి ప్రకాశంతో వెలుగొందుతున్న ఆ కుమారునికి తండ్రి మణిచూడుడు అని నామకరణం చేశాడు. ఆ కుమారుడు దిన దిన ప్రవర్ధమానుడై పారిజాతవృక్షం సముద్రాన్ని పొంగేట్టు చేసిన విధంగా తండ్రి హృదయాన్ని సంతోషామృత తరంగాలతో పొంగేట్టు చేశాడు. జయంతునితో శచీదేవి, కుమారస్వామితో పార్వతీదేవి మురిసిపోయినట్టు కాంతిమతి పవిత్రజన్ముడైన ఆ కుమారునితో మురిసిపోయింది. ఆ మణిచూడుడు పూర్వజన్మజ్ఞానం కలవాడు గనుక తండ్రి అతని మాట ప్రకారం ఆ మణివల్ల ఉద్భవించే బంగారమంతా అర్థులకు దానమిచ్చేవాడు.

కొంతకాలానికి హేమచూడమహారాజు సత్కర్మ సోపానమార్గంగా దివ్యలోకాలకు వెళ్ళగా, మణిచూడుడు రాజయ్యాడు. యాచకులకు చింతామణి అయిన అతని దాన ప్రభావం వల్ల లోకం పుణ్యసుఖప్రకాశితం కాగా, ఆర్తుడు, యాచకుడు అనేవాడే లేకపోయాడు. అతనివద్ద ఒక శ్రేష్ఠమైన గజం ఉండేది. దాని పేరు భద్రగిరి. అది ఆ రాజులాగే దానధారార్ద్రమైన హస్తం కలది.

ఒకనాడు ఆ భువననాయకుడు పేరోలగం ఉండగా భృగువంశ సంభూతుడైన భవభూతి అనే ముని ఒక కన్యతో పాటు వచ్చాడు. ఆ కన్య లావణ్యం తొణికిసలాడే ముఖంతో మూర్తీభవించిన మణిచూడుని కాంతిలక్ష్మియా అన్నట్టు వెలుగుతూ ఉంది. అవివేకంతో పాలిండ్లు ముందుకు పొడుచుకొనివచ్చాయనో, చరణ కమలాలు తమ రాగాన్ని కప్పి పుచ్చుకొనకపోయాయనో, నేత్రాలు చంచలమైనవనో చాల సిగ్గుతో ఆమె నిలబడింది. తపోలక్ష్మివంటి ఆ కన్యతోపాటు వచ్చిన ఆ మునిని ప్రజానాథుడు ఉచితాసనంలో కూర్చోబెట్టి సత్కరించాడు. ధీరుడు, గంభీరుడు, సుందరుడు, పరులను పీడించడం ఎందుకనే కనికరంతో తన పుష్పచాపాన్ని పరిత్యజించిన పుష్పచాపునివలె ఉన్నవాడు, పాపహరమైన తన చూడామణిరక్తకాంతులతో దిక్కులకు కుంకుమపూత పూస్తున్నట్టు ఉన్నవాడు, పరిచారిక చామరం వీస్తుండగా సత్యగుణం చామరరూపంగా వచ్చి ఆశ్రయించిందా అన్నట్టు

కనిపిస్తున్నవాడు, పాతాళలోక విపత్తుల శాంతి కోసం శేషనాగాన్ని ధరించాడా అన్నట్టు పెద్ద రత్నహారం ధరించినవాడు, భూమండలాన్ని ధరించగల విశాలభుజం, క్షమావాసమైన విశాలవక్షం గలవాడు అయిన ఆ రాజును ఆ కన్య కుతూహలాశ్చర్యాలతో చూచింది. మునిపుంగవుడు కురంగతరలేక్షణ, అనంగునికి జీవని అయిన ఆ కన్యకను తన ఒడిలో కూర్చోబెట్టుకొని ఇలా అన్నాడు: "రాజా! నీవు సూర్యునివలె జగన్నేత్ర శతపత్రాలను వికసింపజేశావు. కనుకనే ఈలోకం ప్రబోధితమైంది. ఐశ్వర్యంవల్ల గుణవిద్వేషం, మోహం, మదం మొదలయిన దోషాలు సులభంగా కలుగుతాయి. కాని నీవు సత్పురుషుడివి. కనుక అలాటి దోషాలు నీలో లేవు. నీ మనస్సు జీవకారుణ్యపూర్ణం. రాజా! నీ కీర్తి స్నేహసుస్థిరమై దిక్చక్రవాళం దాటింది. నీవు ఎలాటి చీకూ చింతా లేక దానం చేసేవాడివి. నీ సత్కర్మలు నిర్వ్యాజమైనవి. కనుకనే విద్యాంసులకు కూడ నీవు మాననీయుడవయ్యావు. ఈ కన్య పద్మగర్భంలో పుట్టింది. పేరు పద్మావతి. ఈమెను నేను హోమావశేషమైన పాలతో పెంచాను. ఈమె నీకు అన్ని విధాల తగింది. నీవు పురుషోత్తముడివి. విష్ణువు లక్ష్మిని స్వీకరించినట్టు ఈమెను నీవు అగ్రమహిషిగా స్వీకరించు. కాని, నీవు కాలక్రమాన యజ్ఞం చేసి, ఆ పుణ్యఫలం నాకు ధారపోయాలి." ముని మాటలు రాజు విని, అంగీకరించి, విధ్యుక్తంగా ఆ కన్యను స్వీకరించాడు. ఆ ముని సంతృప్తితో వెళ్ళిపోయాడు.

రతీదేవితో మన్మథుడులాగ ఆ పద్మావతితో ఆ రాజు సుకృతోద్యానంలో సంతోషంతో గడిపాడు. రాజు ప్రభావం ఇంద్రాది లోకపాలకులకు కూడ అనుల్లంఘనీయంగా వ్యాపించింది. బ్రహ్మ కూడ ఆయన చరిత్రను ప్రశంసించాడు. ఆయన సకలార్థులకు కల్పవృక్షంలాగ సకల కల్యాణాలు ఒనగూరుస్తూ తన కీర్తి సౌరభాన్ని దిగంతాలకు వ్యాపింపజేశాడు. తర్వాత కొంతకాలానికి పద్మావతి వేణులత ముత్తేన్ని కన్నట్టు ఒక కుమారుణ్ణి ప్రసవించింది. ఆ కుమారుడు తండ్రి గుణాలకు అద్దంలాగ కనిపించాడు. అప్పుడు రాజు మునికి ఇచ్చిన మాటను స్మరించి, విపుల దక్షిణతో అతివైభవంగా యజ్ఞం చేయ తలపెట్టాడు. ఆ యజ్ఞం సాధారణ యజ్ఞాలవంటిది కాదు. దానిలో హింస అనేది ఉండకపోవడమే విశేషం. అది పూర్తిగా అహింసావసుసంపూర్ణం. సకల కామితార్థాలు తీర్చే ఆ యజ్ఞానికి భార్గవుడు మొదలయిన మునులు, కురుపతి అయిన దుష్ప్రసహుడు మొదలయిన నరాధిపులు వచ్చారు.

రాజు ఆ యజ్ఞంలో ధనవర్షం కురిపిస్తూ, అందరినీ తనియించాడు. అప్పుడు ఇంద్రుడు యజ్ఞాగ్నికుండం నుంచి రాక్షస స్వరూపంతో బక్కచిక్కిన వికృతాకారంతో బయలువెడలి, రాజును సమీపించి, "రాజా! ఆకలితో దప్పితో దహించుకుపోతున్నాను, అన్నపానాలు ఇప్పించి కాపాడు" అని కోరాడు. అది విని రాజు అతనికి తగిన వివిధాన్నపానీయాలు తెచ్చి ఇవ్వవలసిందని పరిచారకులకు ఉత్తరువు చేశాడు. పరిచారకులు ఆయన ఉత్తరువు మేరకు వివిధ రుచ్య పదార్థాలు, పానీయాలు తెచ్చి యిచ్చారు. కాని, రాక్షసుడు వాటిని గ్రహించక కొంచెంగా నవ్వి, "రాజా! ఇదంతా మాకు ఇష్టం లేదు. మేము మాంసాహారులం. కనుక అప్పుడే చంపిన ప్రాణికోటి మాంసమూ, రక్తమే మాకు తృప్తి కలిగిస్తాయి. నా కోరిక తీర్చు. నీవు అన్ని కోరికలు తీర్చేవాడివని ఆశతో వచ్చాను. ఇస్తానని మాట యిచ్చి లేదనడం నీకు ఉచితం కాదు" అని అన్నాడు. రాక్షసుని మాటలు విని కరుణార్ద్రుడైన రాజు



ఎటూ ఆలోచించలేకపోయాడు. ఒకవైపు అహింసావ్రతం; దానిని విడిచి పెట్టడం సాధ్యం కాదు. మరొకవైపు అర్థికోరిక తీరక తిరిగి పోతున్నాడన్న దుఃఖం. అప్పుడు ఇలా అనుకున్నాడు తనలో: 'అయ్యో! దైవికంగా ఈ ధర్మ సంశయం ఏర్పడింది. హింసను సహించలేను. యాచకుడు నిష్ఫలంగా తిరిగి పోవడమూ సహించను. హింస లేనిదే శరీరం నుంచి మాంసం ఎలా వస్తుంది? చీమకైనా కాయక్లేశం కలిగించడాన్ని సహించను. అందరికీ పుణ్యకరమైన అభయ దక్షిణ ఇచ్చిన నేను ప్రాణిని చంపి ఇతనికి మాంసం ఎలా ఇవ్వగలను? ఈవిధంగా ఆలోచించి రాజు కరుణావిష్టుడై ఆ దానవునితో "నా శరీరాన్నే తెగకోసి రక్తమాంసాలు ఇస్తాను. నీ ఆకలీ దప్పీ తీర్చుకో!" అన్నాడు.

రాజు ఈ మాటలు అనగానే జగత్తు వ్యాకులితమైంది. ఆయన దేహత్యాగ సాహసాన్ని మంత్రులు సహించలేకపోయారు. అక్కడ చేరిన మునులు, మహీపాలురు ఆ పని చేయవద్దని రాజును ప్రేమతో ఎంతో వారించారు. కాని, ఆ రాజు వారి మాటలు వినిపించుకోక తన దేహాన్ని కోసి కండలు, రక్తం, వస రాక్షసునికి ఇచ్చాడు. ఆ రాక్షసుడు గొంతుబంటిగా రాజురక్తం తాగి, మాంసం మెసవగా, భూమి కంపించింది. పద్మావతీదేవి తన పతి స్థితిని చూచి విలపిస్తూ మూర్ఛతో నేలపై ఒరిగింది.

దేవేంద్రుడు మానవేంద్రుని సత్త్వసంపదకు ఆశ్చర్యపడి దానవరూపం త్యజించి, నిజరూపంతో చేతులు జోడించి, "రాజా నీవు చేసిన పని అపూర్వం, అనితరసాధ్యం. నీ పుణ్యం అసామాన్యం. నీ సత్త్వ సంపద సాటిలేనిది. విరాగి అయిన నీ ధైర్యం ఎల్లలు లేనిది. ఇలాటి నీ చరితం విని ఎవరికి ఒళ్ళు పులకించదు! సత్పురుషులు పరదుఃఖానికి తాము దుఃఖిస్తారు. **దుర్లభ విషయాలకు** లోభపడరు. శత్రువుల ఎడల కూడ సహనం చూపుతారు. వారు ఈ సంసారం తరింపజేసే పుణ్యసేతువులు. ముల్లోకాలను అనుకంపాసహితంగా చేసే దయార్ద్రులైన ఆలాటి మహాత్ములలోను నీలో కనిపించిన సత్యసాహసం అరుదు" అంటూ, దివ్యౌషధులతో రాజుగాయాలు మాన్పి, సిగ్గుతో తలవంచుకొని, నిజలోకానికి వెళ్ళాడు. తర్వాత రాజు విధ్యుక్తంగా యజ్ఞాన్ని సమాప్తి చేసి, మునులను, రాజులను సత్కరించాడు. బ్రహ్మరథుడనే పురోహితునికి దేవతార్హమైన తన పట్టపుటేనుగు భద్రగిరిని మనోహరమైన సువర్ణమాలతో అలంకరించి దానం చేశాడు. అది ఒక దినానికి నూరు యోజనాలు సునాయాసంగా వెళ్తుంది. దానితోపాటు అమూల్యరత్నాలను, కన్యలను, గ్రామాలను, పట్టణాలను దక్షిణగా ఇచ్చాడు. పురోహితునికి దానమిచ్చిన భద్రగిరికోసం యజ్ఞానికి వచ్చిన దుష్ప్రసహుడు కొంచెం ఆశపడ్డాడు. తర్వాత రాజు తన వాగ్దానం ప్రకారం భృగువంశ సంభూతుడైన భవభూతికి యజ్ఞఫలం ధారపోశాడు. యజ్ఞం అత్యద్భుతంగా జరిగినందుకు భూపతులందరూ ప్రశంసిస్తూ వెళ్ళిపోయారు.

తర్వాత కొంతకాలానికి మరీచముని శిష్యుడైన వాహికుడు రాజు వద్దకు వచ్చి, స్వస్తివాచన పురస్సరంగా ఆశీర్వదించి, రాజుపూజలు పొంది, ఉచితాసనంలో ఆసీనుడై, "రాజా! విద్యాసమాప్తి తర్వాత నేను గురువుగారికి దక్షిణ ఇవ్వబోయాను కాని, ఆయన నా దక్షిణను అంగీకరించక సామాన్యజన దుర్లభమైన పరిచర్యను దక్షిణగా కోరాడు. అలాటి దుర్లభార్థం ఇవ్వగలవాడిని నిన్నొక్కణ్ణే బ్రహ్మ సృష్టించాడు. లోకంలో కల్పవృక్షాలు ఎక్కువ ఉంటాయా? ఆ దుర్లభమైన కోరిక ఏమిటంటే, తపస్సుతో బక్కచిక్కి, మూడుకాళ్ళ ముసలి అయిన మా గురువర్యులకు పరిచర్య

చేయడానికి నీ పట్టమహిషి అయిన పద్మావతిని పుత్రసహితంగా పంపాలి" అని అన్నాడు. ఆ మునిశిష్యుని మాటలు విని రాజు, భార్యా వియోగదుఃఖాన్ని ధైర్యంతో అణచుకొని, "ఓ మునీశ్వరా! జీవితంకన్నా అధికురాలైన నా ప్రియురాలిని యువరాజుతోసహ నీవు కోరినట్టు గురుదక్షిణగా సమర్పిస్తున్నాను" అని అంటూ పద్మావతీదేవిని పుత్రసహితంగా దానం చేశాడు. సత్త్వగుణ ప్రధానులయినవారు, తమ జీవితంలోను మమకారం పెట్టుకోరు. మునిశిష్యుడు విరహకాతర అయిన రాజమహిషిని పుత్రసమేతంగా ఆశ్రమానికి పిలుచుకుని వెళ్ళి గురువుకు అర్పించాడు.

ఇలా ఉండగా, యజ్ఞ సమయంలో భద్రగిరిని ఆశించిన కురుపతి దుప్ప్రసహుడు గర్వంతో ఒకనాడు మణిచూడుని వద్దకు భద్రగజాన్ని తనకు అప్పగించవలసిందని దూతతో వార్త పంపాడు. ఆ ఏనుగును మణిచూడుడు ఇదివరకే పురోహితునికి దానమిచ్చినందున, తిరిగి దానిని ఇవ్వలేనని దుప్ప్రసహునికి సమాధానం పంపాడు. దానికి దుప్ప్రసహుడు మండిపడి పెద్ద సైన్యంతో మణిచూడుని పట్టణంపై దండెత్తి వచ్చాడు. కురుపతి యీ విధంగా దండెత్తివచ్చి పురమార్గాలను అడ్డగించగా, మణిచూడుని సైన్యం కూడ వీరావేశంతో యుద్ధ సన్నాహం చేయసాగింది. కాని, పరవీరకుంజర కేసరి అయిన మణిచూడుడు పగతురను పరిమార్చడంలో సమర్థుడైనా, జనక్షయం అవుతుందనే భయంతో ఇలా ఆలోచించాడు: "అయ్యో! నాకు పరమ మిత్రుడైన దుప్ప్రసహుడే గజలోభంతో అకస్మాత్తుగా శత్రువయ్యాడు. సజ్జనులతో స్నేహం తుదివరకు కొనసాగేది. మధ్యములతో మైత్రి తుదివరకూ కొనసాగేది కాదు. ఇక దుర్జనులతో స్నేహం వైరాంతంగాను, ప్రాణహరంగాను పరిణమిస్తుంది. జీవితం క్షణంలో నశించేది. అయినా, ఐశ్వర్యలోభంతో ఇతరుల ప్రాణాలు పోగొట్టడానికి ఉద్యమిస్తాము. పిడికెడు కూటికోసమే కదా ఈ హింసాకర్మలు, ఈ రణరక్తాభిషేకాలూను! నికృష్టమైన కూటికోసం జీవితాన్ని తెగనమ్ముకొని క్రూరంగాను, నీచంగాను, కుక్కలాగ కాట్లాడుకోవడం ఎలా సహించను? అయ్యో! ఈ ఐశ్వర్యలోభం ఎంత పనిచేస్తుంది? ఇలాటివారి బుద్ధులు ఆత్మసుఖం కోసం క్రూరకృత్యాలు చేయించి, ఇతరుల సంతాపాలతో చల్లబడుతాయి. యుద్ధంతో విజయం సాధించి, రక్తపుకూడు తినేవారి హృదయంలో ఒక్క చుక్కైనా కరుణ ఉంటుందా? ఈ దుప్ప్రసహుడు విభవలోభంతో అపరాధం చేసినా, కనికరించదగినవాడేగాని చంపదగినవాడు కాడు."

ఈవిధంగా కరుణాంతరంగంతో ఆలోచిస్తూ రాజ్యం వదలి అడవులకు వెళ్ళుదామనుకొంటున్న ఆ రాజుకు ప్రత్యేకబుద్ధులు నలుగురు ప్రత్యక్షమయ్యారు. వారిని రాజు యథార్థంగా సత్కరించి, తన అభిమతం తెలియజేశాడు. సర్వజ్ఞులైన ప్రత్యేకబుద్ధులు ప్రశమశీలుడైన రాజును చూచి ప్రసన్నులై ఇలా తత్త్వవాక్యాలు తెలిపారు: "రాజా! నీవు సత్త్వగుణంతో వివేకం పండినవాడివి. మోహాంధులై సంసారంలో కొట్టుమిట్టాడుతున్న వారిపై దయ చూపుతున్నావు. ఇది నీకే తగును. నీ ఇష్టం ప్రకారమే ప్రవర్తించు. బోధిలో బుద్ధిని లగ్నం చేయి. శత్రువు ఎత్తి వచ్చిన యీ సమయంలో అరణ్యానికి వెళ్ళడమే మంచిది. అక్కడ అడ్డులేక జలజలపారే సెలయేటి నీటితుంపరలతో చల్లనైన ఏకాంత కానన ప్రాంతాలు శాంతికాములకు ప్రియమైనవి." వారీవిధంగా అనుగ్రహబుద్ధితో ఉపదేశించి, అతనికి కూడ ఆకాశగమనం కల్పించి అతనితోపాటే తమ కాంతులతో దిక్కులను ప్రకాశింపజేస్తూ గగనమార్గంలో బయలుదేరి, ఆయనను హిమవత్పర్వత తీరంలోని



అరణ్యాలలో వదలి తమ దివ్యలోకాలకు వెళ్ళి పోయారు. రాజు ఆ కాననభూమిలో ప్రశాంతచిత్తుడై కాలం గడపసాగాడు. సత్త్వవంతుల బుద్ధివలె వివేక విమలమైన ఆయన బుద్ధి ఆ వనభూమివలనే సంపూర్ణ శాంతికారకమైంది.

భూపభాస్కరుడు హఠాత్తుగా కనిపించకపోగా పట్టణంలో హాహాకారాలు చెలరేగాయి. ప్రజలు దిక్కు తెలియక మోహాంధకారంతో శోకగ్రస్తులై విలపింపసాగారు. మంత్రులు మరీచ్యాశ్రమానికి వెళ్ళి, ఆ మహర్షికి తమ దుస్థితిని తెలియజేసి, రాజ్యరక్షణకోసం రాజపుత్రుని తమకు అప్పగించవలసిందని వేడుకున్నారు. ఆ ముని ఏలాటి విచారమూ లేక రాజపుత్రుని మంత్రులకు అప్పగించాడు. అతడు మంత్రులతోపాటు నగరానికి వెళ్ళి సైన్యాలను సన్నద్ధం చేసుకొని, కురురాజయిన దుప్ప్రసహుని యుద్ధరంగంలో ఎదిరించి, అతని సేనలను చిందరవందర చేసి, రథాలను తునాతునకలు చేసి, గజబలాన్ని గజిబిజి చేసి వీర విహారం చేశాడు. సుభటాగ్రేసరుడు, బలవంతుడు అయిన రాజపుత్రుని ధాటికి దుప్ప్రసహుడు నిలువలేక కాలికి బుద్ధి చెప్పి, హస్తినాపురి చేరి ప్రాణాలు దక్కించుకున్నాడు. పిదప మంత్రులు కుమారునికి పట్టం కట్టారు. అప్పుడు భూమి ఆయన భుజస్కంధం పొంది ఆదిశేషుని పొందినంతగా సమాధానపడింది.

ఇలా కొంతకాలం గడవగా, కలుషాత్ముడైన దుప్ప్రసహుని నగరంలోను, రాష్ట్రంలోను అనావృష్టివల్ల దుర్భిక్షం ఏర్పడింది. జనులకు మరణోపద్రవం సంభవించింది. జనపదోపద్రవకరంగా ఏర్పడిన ఈ తీవ్రవిపత్తును చూచి అతడు దుఃఖంతో, స్వస్తికాది పెక్కు శాంతి క్రియలు చేయించాడు. కాని ప్రయోజనమేమీ లేకపోవడం వల్ల ప్రజలను ఏవిధంగా రక్షించాలో తోచక చింతపడి, మంత్రులను దీనికి ప్రతీకారం ఏమిటని ఆలోచన అడిగాడు. "మహారాజు! ప్రజలకు ఈ దుఃఖం దుస్సహమైంది. మణిచూడ మహీపతి చూడామణి లభిస్తే ఈ ఆపద గడుస్తుంది. ఆ మణినుంచి అమృతవర్షం కురుస్తుంది. అది వినా గత్యంతరం లేదు. ఆ రాజు సంసారవిముఖుడై, వివేక విమల మనస్సుతో హిమనగారణ్యాలలో సమ్యక్ జ్ఞాన సాధనలో ఉన్నాడని వేగులవారి వల్ల విన్నాము. ఆయన లోకచింతామణివంటివాడు. ఆయన వద్దకు వెళ్ళి అడిగితే మణిని ఇస్తాడు. ఆయనకు పుత్రదార శరీరాదులలో ఇవ్వగూడని వస్తువనేది ఏదీ లేదు" అని మంత్రులన్నారు. రాజు మంత్రుల మాటలు విని అట్లే కానిమ్మని నిశ్చయించుకొని మణిని యాచించి తీసుకొని రావడానికి ఐదుగురు బ్రాహ్మణులను మణిచూడుని వద్దకు పంపాడు.

ఈలోగా మణిచూడుడు అరణ్యాలు తిరుగుతూ, తిరుగుతూ మరీచి ఆశ్రమానికి సమీపంలోని అరణ్యానికి వచ్చాడు. అప్పుడు పద్మావతీదేవి మునిశాసనంతో ఆ విజనమైన అరణ్యానికి కందమూలఫలాలు తీసుకుని వెళ్ళడానికి వచ్చింది. అక్కడికి వేటకు వచ్చిన బోయవారు కొందరు ఆమె ఒంటరిగా ఉండడం చూచి బలత్కారంగా పట్టుకోదలచారు. ఆమె తన కష్టదశను తలచుకొని భయంతో వణుకుతూ "హా! మణిచూడమహారాజ! రక్షించు! రక్షించు!" అని దీనంగా కేకలు పెట్టింది. పెంటిచక్రవాకపక్షి కూజితంలాగా సహించరాని ఆ కరుణాక్రందనం విని ఆ సమీప ప్రాంతంలోనే తిరుగుతున్న రాజు వెంటనే పరుగెత్తివచ్చి చూచాడు. చూడగా తన కాంత రాహుభయంతో ఆకాశంనుంచి కూలిన చంద్రలేఖలాగ ఉంది. ఆమెకు మునుపటి చందనచర్చలుగాని,

చీనిచీనాంబరాలుగాని, అంజనలేపనాలుగాని లేవు. హారాద్యలంకారాలేవీ లేవు. అశ్రువులతో ఎర్రనైన కండ్లతో ఆ రాజహంసగమన కరుణాసరసిలాగ కనిపించింది. ఆమెను చూస్తే భోగసంయోగాలు అనిత్యాలని చెబుతున్నట్టు అనిపించింది. ఆమెను చూడగా, ఈ సంసారయాత్రలోని ఆశ్చర్యవిచారాలకు కరకుబారిపోయిన భూపాలుని మనస్సును కృప అనే బాకుతో పొడిచినట్టయింది. రాజమహిషి కూడా ఛత్రచామరాదులేమీ లేక ఒంటరిగా అకస్మాత్తుగా వచ్చిన నాథుని చూచి, వియోగవిషం వ్యాపించగా, ఆయనను చూడాలనే కాంక్ష మితిమీరగా, ఒకవైపు సంతోషం మరొకవైపు దుఃఖం పెనగొనగా చాల విహ్వాలురాలైంది. తాపసవేషంలో ఉన్న రాజును చూచి బోయలు శపిస్తాడనే భయంతో పారిపోయారు. సూర్యుడు ఉదయించగా చీకటిప్రతాపం నిలుస్తుందా?

అప్పుడు శమవిరోధి, సకలభూత మనోవిహారి అయిన మారుడు మానవరూపంతో వచ్చి "కమలలోచనుడైన ఓ రాజా! ఈ రాజీవనయన నీ ప్రియురాలు. నీ మనః ప్రవత్తివలె ఈమె సుఖమనేదే ఎరుగదు. రాజ్యభోగాలు వదలిపెట్టి కష్టాలపాలయింది. నిర్జనమైన ఈ అరణ్యంలో ఈమెను వదలిపోవడం న్యాయం కాదు. ఈమెను స్వీకరించు" అని ప్రలోభింపజేశాడు. రాజు మన్మథుని మాటలు విని, అతడు వివేకం వినాశం చేసే మన్మథుడని గ్రహించి, నీవు మారుడవని ఎరుగుదును. శమగుణం పాడు చేసే నీ అప్రస్తుత ప్రసంగం చాలించు. సంతోషులను నీవు మోహింపజేయడమనేది కొత్త కాదుగదా!" అని అనగానే, మారుడు అకస్మాత్తుగా మరుగైపోయాడు. రాజమహిషి అప్పుడు విరహాగ్ని తప్తురాలయి వివశురాలయింది. పతిభోగవియోగంతో ఆర్తురాలై దుఃఖిస్తున్న పత్నిని మన్మథవిజేత అయిన రాజు ఊరడిస్తూ ఇలా ఉపదేశించాడు: "దేవీ, నిన్ను ధర్మకార్యానికి నియోగించాను. దుఃఖించడం భావ్యం కాదు. ఈ భోగాలన్నీ విరసాలు; తుదకు దుఃఖం కలిగించేవి. సుఖం కలిగించగలవనడం కేవలం భ్రమ. ప్రాణుల ఆయుస్సు తరంగాలవలె చంచలమైంది. ప్రియసంయోగం కదులుతున్న తామరఆకు కొసలో తూగే జలబిందువు వంటిది. సంపదలు సంసారసర్పపు నాలుకలాగ, కారుమబ్బులలో క్షణకాలం నాట్యమాడే మెరుపుతీగలలాగ చంచలమైనవి. భోగవిలాసమనేది సంతోషం కలిగించేది కాదు; వియోగమనే రోగం కలది. విభవం కలలో జరిగిన పెండ్లి వంటిది. సుఖం గాలిలో దీపం వంటిది. ఈ సంసార చరితమంతా పిచ్చివాని నృత్యం వంటిది. కరుణే అందరికీ ప్రాపుగాను ప్రోవుగాను వుండేదిగాని, కలిమి కాదు. సర్వకాలసర్వావస్థలలోను ప్రకాశం కలిగించేది ధర్మమేగాని, దీపం కాదు. రమణీయమైనది కీర్తేగాని యౌవనం కాదు. స్థిరమైనది పుణ్యమేగాని జీవితం కాదు." ఈ విధంగా సత్యవ్రతుడైన ఆ రాజు ఆమెను ఊరడించి మహర్షి ఆశ్రమంలో వదలి, సంసారపరాఙ్ముఖులైన వారికి సంతోషదాయకాలు, పుణ్యదాయకాలు అయిన తపోవనాలలో సంచరిస్తూ గడిపాడు.

దుష్ప్రసహుడు పంపిన ఐదుగురు బ్రాహ్మణులు వెదుకుతూ వెదుకుతూ ఆ వనపరిసరాలలో అర్థులకు అకాలబంధువు, విశుద్ధసత్త్వుడు అయిన మణిచూడుని చూచారు. చూచి, భయంతో ధైర్యం కోల్పోయి, వేడి నిట్టూర్పులతో తమ సంతాపాన్ని సూచిస్తూ కష్టం మీద స్వస్తివాచనం చేసి "రాజా! ఏమని విన్నవిస్తాము? దుష్ప్రసహమహారాజు పట్టణంలో దుర్భిక్షం ఏర్పడి, శాంతి నశించింది. జనానికి అన్ని ఆశలూ అడుగంటాయి. మిగిలిందెల్లా ఒక్క ఆర్త స్వరమే. మీవద్దనున్న చూడామణి



సకలదోషాలను పోగొడుతుందట! త్రిలోకాన్ని రక్షించే ప్రభావం గలదట. దానిని నీవు దయ చేస్తే అక్కడ కలిగిన క్షామం శాంతిస్తుంది. కరుణాంతరంగం, చందనపల్లవకోమలమైన మనస్సు, విమల హృదయం, చంద్రమణివంటి కాంతి గలిగిన మీబోటివారే కదా ఈలోకంలో సంతాపం కలిగినప్పుడు ప్రజలకు శరణ్యులవుతారు!" అని ప్రార్థించారు. వారి ప్రార్థన విని, ఇంతటి కష్టంలోను సత్త్వం కోల్పోని మణిచూడుని మనస్సు ప్రజల కష్టాలు చెవిలోబడగా దయతో ద్రవించింది. ఆలోచించి బ్రాహ్మణులతో ఇలా అన్నాడు: "పాపం! దైవికంగా వచ్చిన ఈ ఆపదతో బాధపడుతున్న ప్రజల హృదయవిదారకమైన ఆర్తనాదాలను దుష్ప్రసహుడు ఎలా సహిస్తున్నాడో! ఈ మణి నా మస్తకమూలంలో ఉన్నది. దీనిని భేదించుకొని తీసుకువెళ్ళండి. అర్థిజనుల దుఃఖాన్ని క్షణమాత్రమైనా పోగొట్టగలుగుతున్నందుకు ధన్యుణ్ణయాను."

రాజు ఇట్లనగా, ఆతని మస్తకప్రదేశంనుంచి మణిని పెకలించనున్నందుకు బాధపడినదానివలె ధరిత్రి ధారాధరాంబోధి సహితంగా చాలసేపు కంపించింది. పిదప కృపాకోమల చిత్తవృత్తి అయిన ఆ రాజు మాటలు విని బ్రాహ్మణులు తీక్ష్ణశస్త్రాలతో, ఆ తీక్ష్ణశస్త్రాలకన్నా తీక్షణమైన మనస్సుతో తామే ఆ మణిని ఆయన తలనుంచి పెకలించ ప్రారంభించారు. ఆ రాజు చేస్తున్న దుష్కరకార్యాన్ని చూడడానికి బ్రహ్మాదిదేవతలు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు అంబరవీధినుంచి వచ్చారు. రత్నాన్ని పెకలిస్తుండగా రక్తం ధారలు కట్టి రాజుదేహాన్ని తడిపివేసింది. అది చూడగా రత్నకాంతులే వ్యాపించాయా అనే భ్రాంతి కలిగింది. అంత కష్టాన్నీ ఆయన అర్థుల సుఖంకోసం ధైర్యం కోల్పోక కండ్లు మూసుకొని సహించాడు. రాజు ఇంత బాధపడుతున్నా రాక్షసులుగా ప్రవర్తిస్తున్న ఆ బ్రాహ్మణులు మాత్రం తమ ఘాతుక కృత్యాన్ని ఒక్క క్షణమైనా మానుకోలేదు. రాజు కండ్లు మూసుకొని తన శరీరబాధను గురించి ఇలా ఆలోచించాడు: "దేహధారులకు ఈ దేహమే క్లేశమయమైనది. ఇలాటి దుఃఖాలు వేలు, లక్షలు వస్తుంటాయిగదా! నా దేహంలో చేరిన ఈ రత్నాన్ని దానం చేయడం వల్ల నేను పొందే పుణ్యంతో ఇలాటి తీవ్రదుఃఖం నాకు అంటకుండా ఉండుగాక! పుణ్య పరిపాకం లేనిదానివల్ల కలిగే నరక బాధలు కూడా కలుగకుండా ఉండుగాక!"

ఇంతలోగా విప్రులు ఆయన మస్తక ప్రదేశంనుంచి రక్తవసలతో తడిసిన మణిని పైకి తీశారు. ఆ బాధకు రాజు మూర్ఛపోయాడు; అయినా "అర్థి మనోరథం పూర్తి చేశాను గదా!" అని సంతోషంతో పొంగిపోయాడు. పిదప రాజు వణుకుతున్న తన అంగుళి పల్లవాలతో తానే మణిని ఎత్తి బ్రాహ్మణులకు అర్పించి, లోకాన్ని చీకట్లతో ముంచివేస్తూ, అరుణారుణుడై అస్తమిస్తున్న సూర్యునివలె రక్తప్లావిత శరీరుడై కిందపడిపోయాడు. పడిపోయినా సత్త్వగుణం చెక్కుచెదరని ఆయన గుండెనిబ్బరానికి మెచ్చి దేవతలు పుష్పవర్షం కురిపించారు.

తర్వాత విప్రులు మణిని తీసుకొని వెంటనే దుష్ప్రసహుని పట్టణానికి వెళ్ళి, మణిని అతనికి అర్పించారు. ఆ మణితో దుర్భిక్షోపద్రవం తొలగింది. అమరలోక భోగాలు సమకూరాయి. అది చూచి దుష్ప్రసహుడు సంతోషించి బోధిసత్త్వుడైన మణిచూడుని సకలప్రాణి సంరక్షణ సమర్థమైన మాహాత్మ్యాన్ని ప్రశంసించాడు.

మణిచూడుడు శిరోమణి దానం చేశాడనే వార్త వ్యాపించింది. ఆతనిని చూడడానికి అరణ్యాలనుంచి భార్గవుడు, గౌతముడు, మరీచి మొదలయిన మునులు వచ్చారు. ఈలోగా రాజు మూర్ఛనుంచి కొంచెం తేరుకున్నాడు. మరీచి మహర్షి వెంట వచ్చిన రాజుభార్య పద్మావతీదేవి గాయంతో మూర్ఛపడి ఉన్న తన భర్తను చూచి దుఃఖం భరించలేక, తెంపివేసిన లేదీగవలె భూమిపై కుప్పగా కూలిపోయింది. రాజు మణిదానకీర్తి దేవచారణులవల్ల దిగంతాలకు వ్యాపించగా, అతని మంత్రులు రాజపుత్రుడు ప్రజలతోసహా చూడడానికి వచ్చారు. రక్తంతో ఒళ్ళంతా తడిసిపోయి తీరని బాధతో భూమి మీద పడినా ధర్మబలంతో కాంతి తరుగని ఆ రాజును చూచి ప్రజలు దుఃఖంతో పరిపరివిధాలుగా అనుకోడం ప్రారంభించారు. "అర్థులకందరికీ నిలువ నీడగా ఉంటూ దయార్ద్రుడు, సరళస్వభావుడు, సువృత్తుడు అయిన ఈ రాజును స్వార్థపరులైన దుర్మార్గులు నీడయిచ్చే చెట్టును నరికివేసినట్టు నరికివేశారే! పరహితం కోసం జీవితం వదలిన ఇతని చరిత్ర ఆశ్చర్యకరం. తియ్యని మామిడిపండును కోసి ముక్కలు చేసినా, దాని ఉదారమైన రుచి, వాసన పోతాయా? లోభికి తనవాడనేవాడు ఉంటాడా? కాముకునికి ధనమంటే లక్ష్యం ఉంటుందా? అలాగే ప్రాణిమాత్రోపకారి అయిన దయాళువుకు కూడా దేహాభిమానం ఉండదు. అర్థిజనులకోసం కదా ఈయన ఇలాటి దైన్యస్థితి పొందాడు! ఇంతకూ, దీనోద్ధరణ వ్రతం అవలంబించినవారు పరపరిత్రాణనంలో ప్రాణాలను గడ్డిపోచగా ఒడ్డుతారు" అని అక్కడ మూగిన ప్రజలు విధవిధాలుగా అనుకుంటుండగా, మరీచిముని ఈ అద్భుతాన్ని చూచి కన్నీళ్ళు ఆపుకోలేక రాజు దగ్గిరికి వచ్చి, స్నేహంతో "రాజా! నీవు దయతో ప్రజలపై అకారణ బంధుభావం పూని వారి ప్రాణరక్షణకోసం నీదేహాన్ని గడ్డిపోచగా అర్పించావు. నిరపేక్షాబుద్ధితో అర్థిబాంధవుడైన నీవు నీ జీవితం క్షయిస్తున్నా లక్ష్మీనివాసమైన నీ దేహాన్ని అపాయానికి పాల్పడజేశావు. ప్రాణాలు ఒడ్డిన ఈపుణ్యవ్రతంలో నీకు ఫలాపేక్ష ఏముంది? అర్థులకోసం మణిని తీయడానికి నీ తలను భేదిస్తున్నప్పుడు బాధతో నీ మనస్సు వికారం చెందలేదు కదా?" అని ప్రశ్నించాడు. ఆ మాటలు విని రాజు ఎంతో ప్రయత్నం మీద నొప్పిని లోపలనే అణచుకొని, ముఖంపై కమ్మిన రక్తం తుడుచుకొని, "మహర్షీ! నాకు మరే ఫలాపేక్షా లేదు. ఒకటిమాత్రం బలంగా ఉంది. ఈ ఘోర సంసార సాగరంలో మునిగిన జీవులను తరింపజేయడానికే మరల మరల పుట్టుదునుగాక! ఇదే నాబలమైన కోరిక. అర్థిలోకం అభీష్టంకోసం నా దేహాన్ని భేదించడం వల్ల నాకు ఎలాటి మనోవికారంగాని, కష్టంగాని కలుగలేదు. నేను చెప్పేది సత్యమైతే, నా శరీరం వ్రణాలు ఉపశమించి స్వస్థం కానీ!" అని సమాధానమిచ్చాడు. సత్యధనుడు, సహజ మహిమగలవాడు అయిన ఆ రాజు ఈ మాటలు అనీఅనగానే, సత్యబలంతో పుండు మాని మరల మణి మొలిచింది. ఈ అద్భుతం చూచి అందరూ ఆశ్చర్యపడి జయజయధ్వానాలు చేశారు.

పిదప ఇంద్రాది దేవతలు, మహర్షులు రాజును రాజ్యపాలనం స్వీకరించాలని బహువిధాల ప్రార్థించారు. కాని, ఆరాజు మరల భోగాభిలాషి కాలేదు. ఈలోగా పద్మావతీదేవి మూర్ఛ తేరింది. ఆమెను మరీచిమహర్షి తన సేవనుంచి విముక్తి చేసి రాజుకు అప్పగించాడు. ఆమె రాజపుత్రునితో సహా "దీనబంధూ! మమ్మల్ని పరిగ్రహించండి. మా తీవ్రవియోగ దుఃఖం పోగొట్టండి. మరల సింహాసనం అధిష్ఠించి, ప్రజలకు దివ్యపరిపాలన సుఖం కలిగించండి" అని ప్రార్థించింది.



మునుపు రాజుకు హితం ఉపదేశించిన ప్రత్యేకబుద్ధులు నలుగురూ తమ దివ్యదేహకాంతులతో దిక్కులు నింపుతూ జగద్ధితం కోసం అప్పుడు ప్రత్యక్షమై, సంతోషాన్ని విరజిమ్ముతున్నట్టున్న పలుకులతో రాజును ఇలా ఉద్బోధించారు: "మహీపతీ! చిరకాల వియోగం తర్వాత ఇంతకాలానికి మరల ఆలుబిడ్డలను కలుసుకొన్నావు. మరల పరిత్యాగ దుఃఖాన్ని రాజుపుత్రుడూ సంహించలేడు; నీ దేవేరీ సంహించలేదు. శాశ్వత వియోగదుఃఖం ఎవరికైనా సంహించరానిది. ఆపన్నుల దుఃఖనివారణకోసం తన దేహాన్నే అర్పించేవాడు ఆత్మీయులను ఉపేక్షించడం ఎలా? ఆత్మీయులను రక్షించే ధర్మం కూడ పరార్థమే సుమా!"

ప్రత్యేకబుద్ధుల హితవు విని, రాజు అతికష్టం మీద "సరే!" అని ఒప్పుకొని, విమానారూఢుడై గగన మార్గాన తన పట్టణం చేరి పుత్రకళత్రసహితంగా రాజ్యం స్వీకరించాడు. అలా ఆ సత్యవంతుడు, విపుల సత్త్వుడు అయిన రాజు బహుకాలం రాజ్యం పాలించి, పెక్కు జినపురాలు, మణిచైత్యాలు నిర్మించి, ధర్మచక్రచ్ఛత్రం, ధర్మరత్నత్రయం, ధర్మదీపం- వీటితో విశేషకీర్తి ప్రతిష్ఠలు సంపాదించి, సమ్యక్సంబోధిని సంతరించుకొని, అంతంలో సౌగతలోకం పొందాడు.

బుద్ధభగవానుడు తన పూర్వజన్మ వృత్తాంత కథన సందర్భంలో దానవిషయోపదేశప్రస్తావంలో సమ్యక్సంబోధిసిద్ధికోసం భిక్షువులకు ఈ కథను తెలిపాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మణిచూడావదానమనే మూడవ పల్లవం.

# 4. మాంధాత్రవదానం

దానమే సంపదలకు నిదానం. దేవకాంతలు వింజామరలు వీస్తుండగా, మరికొందరు నాగకాంతలు శ్వేతచ్ఛత్రం పట్టుకొనగా భవ్యమనస్కులైనవారు అనుభవిస్తున్న సంపదలు; కర్పూర ప్రవాహంవలె ధవళోజ్జ్వలంగా ప్రసరిస్తున్నవారి కీర్తి దానకణ స్వల్ప ఫలమే సుమా!

పూర్వం ఉపోషధుడనే రాజు ఉండేవాడు. ఆయన మహాప్రతిభావంతుడు. ఆయన కీర్తి పాలకడలినుంచి పుట్టిన అమృతంవలె ధవళ మధురమై దేవతలకు కూడ ఇంపుగా స్వర్గలోకం వరకు వ్యాపించింది. వైభవం, పరాక్రమం గల ఆ రాజు భూమిని పాలిస్తూ ఉండగా, ఆయన ఆనతికి తల ఒగ్గని రాజులెవరు? భూమి ఆయన పరిపాలనలో ధర్మయుతమైన విమలబుద్ధిలాగ, దయతో కూడిన దానంవలె, వినయ సహితమైన విభవంవలె ప్రసిద్ధి చెందింది. గుణవంతుడు, ఉన్నతవంశుడు, చంద్రధవళుడు అయిన ఆ రాజుకాంతి గుణవంతము, ఉన్నతవంశము, చంద్రధవళము అయిన ఛత్రంవలె తక్కిన రాజులందరి తలపై వెలిసింది. ఆయన కీర్తి గంగాజలంవలె ఉజ్జ్వలమై ఈశ్వర శిరస్సులపై ఉంటూ, ముల్లోకాలూ వ్యాపించి, వాటికి అపూర్వాభరణమైంది. ఆయన వేయి యజ్ఞాలు చేసి, మహేంద్రుని తలదన్నిన వైభవంతో తులదూగుతూ, అరవై వేలమంది పత్నులతో సకల సౌఖ్యాలూ అనుభవిస్తూ ఉండేవాడు.

ఇలా ఉండగా, ఆ రాజు ఒకమారు రాక్షసులు మునులను బాధిస్తున్నారని విని, వారి మదమణచి మునులను రక్షించడం కోసం అశ్వారూఢుడై తపోవన భూములలో సంచరించాడు. అప్పుడు మార్గాయాసంతో అతనికి దప్పి కలిగింది. ఒకచోట రాజర్షులు కొందరు పుత్రకామేష్టి చేసి ఉంచిపోయిన మంత్రజలపూర్ణమైన కలశం కనిపించింది. అది చూచి రాజు దప్పికతో బాధపడుతున్నాడు గనుక ముందు వెనకలు చూడకుండా, ఆ కలశంలోని నీరు త్రాగాడు. పిదప రాజధానికి వెళ్ళిపోయాడు. ఆ మంత్రజల ప్రభావం వల్ల రాజుకు గర్భం కలిగింది. ఆహా! విధి ఎంత బలీయమైంది! అది అద్భుతాలకు ఆటపట్టు. స్వప్నం, మాయ, ఇంద్రజాలం మొదలయినవంతా దాని వినోదచర్యాలేశం. దానిచర్య చిత్రవిచిత్రం. దాని అద్భుతరేఖా విన్యాసాన్ని ఎవరు కొలువగలరు? తొమ్మిది నెలలు నిండిన తర్వాత ఆ రాజు తలను చీల్చుకొని బాలసూర్యునివలె దివ్యకాంతియుతుడైన కుమారుడు జనించాడు. రాజు శిరోవ్రణం కూడా క్రమంగా మానింది.

జగత్సామ్రాజ్యరక్షణ లక్షణాలతో, మూర్తీభవించిన పుణ్యంలాగ వెలుగొందే ఆ కుమారుని చూచి రాణులు ఎత్తుకుని, పుత్రవాత్సల్యంతో చన్నులు చేపి "నా ముద్దు తండ్రి! నన్ను కాపాడుతాడు! నన్ను కాపాడుతాడు!- మాం ధారయిష్యతి" అని పరస్పరం అనుకొని ముద్దులాడడం ప్రారంభించారు.



తల్లులు "మాం ధారయిష్యతి! మాం ధారయిష్యతి!" అని ఎప్పుడూ అంటుండడం వల్ల ఆ బాలునికి మాంధాత అని పేరు పడింది.

ఆ బాలుడు ప్రవర్ధమానుడవుతూ పుణ్యక్రీడలతో బాలారిష్టాలు లేక ఆరు ఇంద్ర సంవత్సరాలు గడిపాడు. తర్వాత యౌవనం అంకురించింది. సర్వవిద్యలలోను పారంగతుడయ్యాడు. పిదప కొంత కాలానికి తండ్రి పరలోకగతుడు కాగా, పట్టాభిషిక్తుడై రాజ్యభారం స్వీకరించాడు. ఆయన పట్టాభిషేకానికి, ఆ సుకృతి గుణగణాలకు దాసుడైన దివౌకసుడనే యక్షుడు దివ్యవస్తువులు తీసుకొనివచ్చాడు. ఆ రాజు పట్టాభిషేక మహోత్సవంలో సువర్ణమకుటం ధరించి, దానిపై తెల్లని ఉష్ణీషం తురాయి ధరించి, శిఖరంపై శరత్కాల మేఘాలు పారాడే మేరుపర్వతంలాగ వెలిగాడు. అప్పుడు వెంటనే అతనికి రాజోచితాలైన సప్తరత్నాలు, చక్రాశ్వమణిహస్తి స్త్రీగృహాలనేవి వాటంతట అవే చేకూరాయి. ఆయన సాగరమేఖల అయిన వసుంధరను తన ఏకైక భుజంతో వహిస్తూ భూభారశ్రాంతుడైన ఆదిశేషునికి విశ్రాంతీ, సంతృప్తీ కలిగించాడు. భువనరక్షణసన్నద్ధుడు, అభినవ రాజలక్ష్మీ సమాశ్రితుడు, చక్రవర్తి అయిన ఆ రాజు భువనరక్షణసమాయత్తం, నవలక్ష్మీసమాశ్రయం, చక్రం కలది అయిన మహావిష్ణువు భుజంవలె వెలుగొందాడు. అతని కీర్తి జాహ్నవివలె మూడు లోకాలు వ్యాపించింది. ఆయన సంపదలు అందరినీ ఆశ్చర్యచకితులను చేశాయి. ఆయన, పుణ్యలత పూచిన తొలిపూవులా పరిమళించాడు. ఇలా సకల సామ్రాజ్య లక్షణాలతో తులతూగుతూ శత్రువులను పరిమార్చి పరిపాలన కొనసాగిస్తున్న ఆ రాజచంద్రునికి తుల్యరూప బల సంపన్నులయిన వేయిమంది పుత్రులుదయించారు.

ఆ రాజు ఒకానొకనాడు మంత్రులతోపాటు వనభూములలో విహరిస్తూ, వికసిత కుసుమలక్ష్మిని చూచి ఆనందిస్తూ, ఒకచోట కొన్ని పక్షులను చూచాడు. ఆ పక్షులు ఆకాశానికి ఎగురబోయి, రెక్కలు లేనందున ఎగరలేక, ఆకాశగమనం తలచుకొంటూ చిక్కిపోయి గత్యంతరంలేక నేలపై తిరుగాడుతూ, కులవృత్తి కూలిపోగా తినతిండీ కట్టుగుడ్డా లేక దీనస్థితి పొందిన దరిద్రులవలె అగచాట్లు పడుతున్నాయి. వాటిని చూచి రాజు మనస్సు నీరై "అయ్యో!ఈ దీనశకుంతాలు ఏమి చెడ్డపని చేశాయి? పాపం! రెక్కలు లేక కష్టం మీద నేలపై తిరుగాడడానికి కారణమేమిటి?" అన్నాడు. ఆ మాటలు విని ముందు నడుస్తున్న సత్యసేనుడనే మహామాత్యుడు రాజుకు ఇలా విన్నవించాడు: "దేవా! వనచరులు చెప్పగా దీనికి కారణం విన్నాను. ఈ తపోవనంలో తపస్స్వాధ్యాయ నిరతులు, దీప్తతేజులు అయిన మునుల పుణ్యావాసాలు నూట అయిదు ఉన్నాయి. ఈ పక్షులు ఆ తపోవన వృక్షాలలో చేరి ఎప్పుడూ కోలాహలం చేస్తూ, వారి ధ్యానాధ్యయన జపాలకు విఘ్నం కలుగజేస్తుండగా, చెవులు చిల్లులు పడజేసే ఆ శబ్దం వినజాలక మునులు కోపగించి శపించారట. తప్పు చేసిన ఈ పక్షుల రెక్కలన్నీ వారి మహాశాపాగ్నికి క్షణంలో కాలి రాలి పడిపోయాయట. అప్పటినుంచి ఈ పక్షులు పక్షరహితాలై కష్టంతో కాలం గడుపుతూ నీ శత్రుపక్షంవలె శ్రమపడి కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాయి."

మహామాత్యుని మాటలు విని రాజు చాల పరితపించాడు. పక్షులకు కలిగిన శాపంతో ఆయన మనస్సు కరుణారంజితమైంది. "అయ్యో! అరణ్యంలో శాంతంగా తపస్సు చేసుకొనే తాపసుల

తపః ప్రభావం ఈ విధంగా పరిణమించిందా? నిజమే! మునుల తేజస్సు, నిప్పుల తేజస్సు నిరాఘాటంగా కాల్చేవే కదా! ఆత్మసుఖం కోసం కోపతప్తమైన మనస్సును క్షమాగుణంతో చల్లార్చలేని కుహనా తపస్వులతో పనేమిటి? ప్రసన్నమైన బుద్ధి, పవిత్రమైన మనస్సు, మైత్రి, దయ, దానం, శమం, దమం- ఈ గుణాలు కలవారి తపస్సే శ్లాఘ్యమైనది కాని, ఈ గుణాలు లేనివారి తపస్సు కేవలం కాయశోషణమే. కోపిష్ఠుల తపస్సు, గర్విష్ఠుల బలము, లోభుల విభవము, దుష్టుల విద్య ఎందుకు? ఇలాటి కలుషచిత్తులు, తీవ్ర క్రోధనులు అయిన మునులను నేను సహించను. నా దేశంనుంచి వారు వెళ్ళిపోనీ!" అని రాజు మహామాత్యునితో అని, "నావశంలో ఉన్న భూమిని వదలిపొండి!" అని రాజపురుషులతో వారికి సందేశం పంపించాడు. పక్షులపై పక్షపాతంతో కోపగించుకొన్న మహీపతి సందేశాన్ని మునులు విని, సిగ్గుపడి, "ఈ చతుస్సముద్ర మేఖలావృతమైన భూమికంతా ఈ మాంధాతే రాజు. ఈయన వశంలో లేని దేశమెక్కడ ఉంది? ఎక్కడికి వెళ్ళగలం?" అని ఆలోచించి, సుర సిద్ధ సేవితమైన మేరుపర్వత పార్శ్వంలోని జంబూఖండ సమీపప్రాంతానికి వలస పోయారు.

మాంధాత మహాప్రభావంతో ఆయనరాజ్యంలో భూములు దున్నకనే పంటలు పండేవి. ఆకాశం రత్నాంబరాలను వర్షించేది. ఆయన ఆజ్ఞతో, ఇంద్రుడు కూడ సిగ్గుపడేట్టు మేఘాలు ఏడునాళ్ళు జడిగా పసిడివాన కురిశాయి. మహాప్రభావవంతుడైన ఆయన మహాపరాక్రమవంతులైన పద్దెనిమిదికోట్లమంది భటులుగల సైన్యంతో ఆకాశ మార్గాన జైత్రయాత్రకు బయలుదేరి, దివ్యపురుషులు వసించే పూర్వవిదేహమనే ద్వీపాన్ని వశపరచుకొన్నాడు. పిదప గోదానీయమనే ద్వీపాన్ని, ఉత్తర కురుభూములను, సుమేరుపర్వత పార్శ్వ ప్రదేశాలను ఆక్రమించుకొని, తన శాసనానికి ఎదురనేదేలేక పరిపాలిస్తూ, మేరుపర్వత కనకసానువులలో విహరించసాగాడు. అలా సుఖంగా విహరిస్తుండగా పెక్కు ఇంద్రకాలాలు గడచిపోయాయి.

సురసదృశుడైన ఆ రాజు ఒకమారు దేవతలను చూడడానికి గజాశ్వరథాది సైన్యసమేతుడై గగనమార్గంలో వెళ్ళాడు. ఆయన సైన్యంలోని ఏనుగులతో దిక్కులు కారుమబ్బులు కమ్మినట్టు కనిపించాయి. అప్పుడు ఏనుగులు, గుర్రాలు విడిచిన లద్ది మేరుపార్శ్వంలో తపస్సు చేసుకొంటున్న మునుల తలలపై పడింది. మునులు అది చూచి కుపితులై రోషారుణదృష్టితో ఆకాశం వైపు చూచారు. వారి కోపదృష్టులకు దిక్కులు నల్లబారిపోయాయి. అది చూచి మాంధాతతో ఉన్న దేవదూత వారివద్దకు వచ్చి "ఏమిటిది? ఎందుకీ కోపం? ఎందుకీ శాపాగ్ని విసర్జనేచ్ఛ? ఆయన ఎవరనుకున్నారు! సకల భూపాలురు శాసనాన్ని ఔదలదాల్చే పాకశాసన తుల్య వైభవుడైన మాంధాతృ మహీపతి. నరదేవుడైనా ఆ రాజు సైన్యంతోపాటు ఆకాశమార్గాన దేవలోకానికి వెళ్ళుతున్నాడు. ఆయన గుణగణాలు స్తుతించడం వల్ల నామాట పవిత్రమైంది. సర్వలోకాలకు సుఖసంపదలు కలిగిస్తూ ప్రేమ జ్ఞాన పూర్ణుడైన ఆయనకు ఐశ్వర్యమదం ఆవంతైనా లేదు. ధనమివ్వడం వల్ల ఆయన కుబేరుడు; శక్తిమంతుడు గనుక కుమారస్వామి; వృషభయోగం వల్ల ఈశ్వరుడు; లక్ష్మీ సమాగం వల్ల విష్ణువు; దిగంతాలకు ప్రసరించిన ప్రతాపం గలవాడు గనుక సూర్యుడు; జనరంజకుడు కావడం వల్ల చంద్రుడు; పోతరించినవారి బలాన్ని భేదించడం వల్ల ఇంద్రుడు. ఈ విధంగా ఆయన దేవతలందరి దివ్యరూపం ధరించి ఉన్నాడు. ఇక ఆయన త్యాగాన్ని గురించి చెప్పనక్కరలేదు. బలిచక్రవర్తి అతని



త్యాగగాథ విని పాతాళానికి వెళ్ళిపోయాడు. జలనిధి ఇంకా సంక్షోభపడడం మానలేదు. కనుక కోపం మానండి" అని హితవు చెప్పాడు.

కాని, ఆ మునులలో దుర్ముఖుడనే ముని, దేవదూత మాటలు వినిపించుకొనకనే శాపజలం ఆకాశం వైపు చల్లాడు. అది చూచి మాంధాత సైన్యాధిపతి దుర్ముఖముని వైపు తిరిగి నవ్వి "మహర్షీ! రోషాగ్ని ఉపసంహరించుకో. తపస్సును వ్యర్థం చేసుకోవద్దు. మహీపతి ఎదుట శాపం విఫలమై నీవు సిగ్గుపడుతావు. మేమందరం పక్షులం కాము కదా నీ శాపానికి రెక్కలు విరిగి పడడానికి?" అని అన్నాడు. సేనాపతి ఈ విధంగా అంటుండగానే, దుర్ముఖుని శాపం వల్ల మాంధాత ముందున్న సైన్యం ముందుకు నడవక ఉన్నచోటనే ఆగిపోయింది. అది చూచి మాంధాత ఆశ్చర్యపడి "ఏమిటిది?" అని అడిగాడు. సేనాపతి సంభ్రమంతో వచ్చి "మహారాజా! ఆ మహర్షులు శాపమిచ్చారు. అందువల్ల సైన్యం ముందుకు సాగడం లేదు. శాపం చుట్టుముట్టిన మీ సైన్యం ఆకాశంలో మేఘమండలం కప్పిన సూర్యమండలంవలె ఉన్నది" అని విన్నవించాడు. అది విని రాజు ముందు ఆగిన సైన్యాన్ని చల్లని చూపుతో చూచాడు. ఆ చూపుతో శాపం వల్ల కలిగిన ప్రచండోపద్రవం తొలగింది. పిదప రాజు ఆ మునులకు ప్రాణహాని కలిగించక వినోదార్థం వారి జడలు మాత్రం ఊడిపోయేట్టు చేశాడు. క్రోధ మోహాలు జయించని ఈ జడధారులకు మనమెందుకు బరువు చేటు అని సిగ్గుపడినవా అన్నట్టు జడలు రాలి భూమి మీద పడ్డాయి.

తర్వాత మాంధాతృ మహీపాలుడు మేరుగిరి శిఖరం చేరి, అక్కడ దేవతలకు ఆవాసమై కనులపండువైన సుదర్శనమనే పట్టణం చూచాడు. ఆ పట్టణానికి కావలి ఉన్న జలావాసులైన నాగులు, కరోట పాణులైన యక్షులు, ఎప్పుడూ పోతరించి ఉండే సురమాలాధరులనేవారు, మహారాజకాయికులనే బలవంతులైన దేవతలూ, కవచాయుధాలు ధరించిన మహారాజులనే వారు నలుగురూ క్రోధంతో మిట్టిపడే సైన్యంతో సహా మాంధాతను ఎదిరించారు. ఆయన వారినందరినీ అవలీలగా జయించి, వారిని తన సైన్యం ముందు దారి చూపుతూ వెళ్ళేట్టు చేసి, ముందుకు సాగిపోయాడు.

అటుపిమ్మట రాజు అక్కడి వింతలను ఒక్కొటొక్కటిగా చూచాడు. కల్పద్రుమ కోవిదార వృక్షాలతో మనోహరమైన పారిజాతమనే దేవనికేతనం కనిపించింది. మేరుపర్వత శిఖరానికి సిగదండవలె తన కాంతులతో ఆకాశాన్ని ధవళాతిధవళం చేస్తున్న సుధర్మ అనే దేవసభ కనిపించింది. బంగారుతోను, పగడాలు, వజ్రాలు మొదలయిన అమూల్యమైన రత్నాలతోను చేసిన స్తంభాలు, గోడలతో కండ్లు మిరిమిట్లు గొలిపే వైజయంతమనే ప్రసిద్ధ ప్రాసాదం చూచాడు. దాని మణిమయ భూమితలంలోను, గోడలలోను దేవతలు ప్రతిఫలించారు. అది చూస్తే, దేవలోకం ఒక్కటైనా పెక్కుగా కనిపించింది. ఆ భవనకాంతులు, రత్నతోరణ దీధితులు కలిసి చిత్రవిచిత్రంగా దిక్కులను వ్యాపించి వేయి ఇంద్రధనుస్సులతో అలంకరించినట్టు కనిపించింది. అక్కడి శృంగారసరసిలో తామరతీగలు- పద్మినులు-పద్మినీ జాతివారైన సురాంగనలు ఒకరినొకరు పోలారు; ఇరువురూ పద్మముఖులు, భృంగాలకలు గనుక. మందమారుతానికి కల్పవృక్షం పల్లవాలు కదలడం చూడగా, నందనవనలక్ష్మి ఆనందంతో అభినయం పడుతున్నట్టు తోచింది. ఇక మనోహరమైన చైత్రరథోద్యానం

చెప్పనక్కరలేదు. అది మధుమాధవులకు నిత్యోత్సవం; ప్రేమికులకు కామోత్సవం. మరొకవైపు భృంగరాజు చుట్టుముట్టి జుమ్మనగా మదసౌరభం దిక్కులకు విరజిమ్ముతూ రూపుదాల్చిన నందనవనం వలె ఉన్న ఐరావతాన్ని చూచాడు. సర్వ కామప్రదమూ, సర్వసుఖకరమూ, సర్వఋతుమనోహరమూ, సర్వాతిశాయి అయిన ఆ దేవసదనాన్ని రాజు చూచి ముహూర్తమాత్రం ఆశ్చర్యపడి ఆనందంతో కన్నులు చెమర్చగా "ఇవి సుకృతం చేసుకున్నవారికి భోగభూములు" అని అనుకున్నాడు.

ఇంద్రుడు భూమీంద్రుడైన మాంధాత రాక విని సంతోషించి సకల సురగణంతో ఎదురేగి సత్కరించి, రత్నరాజివిరాజితమైన తన సభకు పిలుచుకొని వెళ్ళాడు. తక్కిన దేవతలు మణిమయ మంచాలపై కూర్చున్న తర్వాత ఇంద్రుడు విరాగిశ్రేష్ఠుడైన ఆ నృపతికి తన అర్ధాసనమిచ్చి గౌరవించాడు. ఒకే ఆసనంలో ఆసీనులైన సురేంద్ర మనుజేంద్రులు రూపగుణాలలో సరిసమానులుగా కనుపించారు. అప్పుడు దేవతలందరి చూపూ ఒకమారు రాజుముఖంపై ప్రసరించింది. అది చూడగా తుమ్మెదలు మకరందపానం కోసం కమలాన్ని ముసిరాయనిపించింది. అప్పుడు ఇంద్రుడు రాజును చూచి, "రాజా! నీవు తేజోనిధివి. నీ పదవి శ్లాఘ్యమైనది. ఆకాశానికి సూర్యుడువలె నీవు భూమికి ఆభరణమై ఉన్నావు. నీ సామ్రాజ్య విజయధ్వజం నానాటికీ అతిశయించే ప్రభావంతో, కీర్తి అనే పతాకతో ముల్లోకాలలోను ఎగురుతున్నది. చెవులున్నందుకు నీకథామృతపానం, కన్నులున్నందుకు నీదర్శన రసానుభవం సుఖకరమని జనులను సరస్వతి ప్రేరేపిస్తూ ఉంటుంది. నీవు సత్కర్మలతో విభవం సంపాదించావు. కనుక కర్మలకు ఫలముంటుందనే వాదాన్ని నిస్సంశయంగా స్థిరపరుస్తున్నవాడివి నీవే. అన్ని ఇంద్రియాలలోకి నేత్రాలనే ఆశించడం ఎందుకు? నీబోటి పుణ్యచరితులను పూర్వపుణ్యవశంతో దర్శించగలమనే" అని ప్రశంసించాడు. యశోనిధి అయిన మాంధాత దేవేంద్రుని మాటలు విని పొంగిపోక "త్రిదశాధినాథా! ఇదంతా నీ ప్రసాద ప్రభావమే" అని వినయ వినమితాననుడై విన్నవించాడు.

ఈ విధంగా దేవతలు నిత్యాదరంతో సత్కరిస్తుండగా, స్వర్గంలో సుఖంగా ఉన్న రాజుకు షడింద్రకాలం గడిచింది. ఆయన పరాక్రమంపై విశ్వాసంతో నిర్జరులు నిశ్చింతగా ఉన్నారు. సురపతికి కూడ విజయం సులభమైంది. దానవులతో యుద్ధం పొసగినప్పుడు సురలు ఆ శౌర్య మహాతరుభుజచ్ఛాయలో హాయిగా విశ్రాంతి పొందారు. ఈ విధంగా రాజు తన పూర్వ సంచితపుణ్యంతో అక్షయమైన సుఖం అనుభవిస్తూ మరి ఆరు ఇంద్రుల కాలం గడిపివేశాడు.

సత్కర్మ ఫలభోగానికి లాంఛనం విమలమైన మనస్సు. పుణ్యపరిక్షయం ఆసన్నమైనప్పుడు మనస్సు కలుషమౌతుంది. అలాగే, మాంధాతకు అహంకారం, లోభం ఏర్పడి మనస్సు కలుషితమైంది. దానికి తగినట్టుగానే ఆయనకు ఆలోచనలు పొడమినవి: "దేవతల ఈ సంపదను పాలించినది నా బాహువే కదా! ఈ అర్ధాసనమనే మోసాన్ని ఇక సహించను. నేనొక్కణ్ణే ఇంద్రవైభవం అనుభవిస్తాను. నా యీ భుజం సకల జగద్భారం మోయగలదు. సురపతిని అవతలికి నెట్టివేసి, తనకుతానై వరిస్తున్న ఈ స్వర్గ సామ్రాజ్యలక్ష్మిని ఏకచ్ఛత్రంగా అనుభవిస్తాను" అని ఇంద్రునికి ద్రోహం చేద్దామనే తలంపు కలుగగానే అతని దివ్యతేజస్సు వాడిన పూలదండలాగ నల్లబడిపోయింది. సంపద అనే నది ఘనోదయంలో పొంగి, సౌజన్యమనే గట్టును కూల్చివేస్తూ, చంచలమైన మానసాన్ని కలుషితం చేస్తుంది.



పాపచింత గొప్పవారిని కూడా మదమత్తులను చేస్తుంది; శ్రేయస్సును పోగొడుతుంది; ఆపదలకు దూతివంటిది. ఎంతవారికైనా దానిని సహించడం కష్టం. కనుక పాపసంకల్పం కలుగగానే మాంధాత మహీపతి గొడ్డుపోయి, మొదలు నరికిన చెట్టువలె క్షణంలో భూమిపై కూలిపోయాడు.

అభ్యాసం లేకపోతే విద్య నశిస్తుంది. గర్వం బలిస్తే సిరి అడుగంటుతుంది. ద్వేషం సాధుత్వాన్ని ధ్వంసం చేస్తుంది. లోభం ఉన్నతిని లోపింపజేస్తుంది. పరాకాష్ఠను పొందిన అభివృద్ధి అహంకారం ఏర్పడితే వెంటనే పతనావస్థను పొందుతుంది.

మాంధాత పూర్వజన్మలో సర్వవిభువును పూజించాడు. ఆ పూజాఫలం వల్ల ఇంద్రుడు కూడ ఆశించగల రాజ్యాన్ని మరుసటి జన్మలో పొందగలిగాడు. ఆ జన్మలో సత్పాత్రదానం చేయడం వల్ల సురపతి వైభవానికి మించిన వైభవం, ఆశ్చర్యకరమైన విశేష వితరణగుణం కలిగాయి. ఆ పూర్వజన్మలో అతడు బంధుమతి అనే పట్టణంలో ఉత్కరికుడనే వర్తకుడుగా జన్మించాడు; శుచివర్తనంతో ప్రవర్తించాడు. ఒకనాడు ఆయన యింటికి సర్వభూత సంతారణ పరాయణుడైన విపశ్యి అనే సమ్యక్సంబుద్ధుడు భిక్షకు వచ్చాడు. ఉత్తరికుడు ఆ విపశ్యి భిక్షాపాత్రలో సంతోషంతో ఒక్క పిడికెడు పెసలు వేశాడు. అశ్రద్ధగా వేయడం వల నాలుగు గింజలు మాత్రం భిక్షాపాత్రలో పడ్డాయి; తక్కినదంతా నేలమీద పడింది. ఆ దానప్రభావంతో మరుసటి జన్మలో మాంధాతగా పుట్టి సకలద్వీపాధిపతి అయి ఇంద్రుని అర్ధాసనం అలంకరించాడు. పరధ్యానంతో తక్కిన పెసలన్నీ నేల మీద ఒలకబోయడం వల్ల ఫలావసానంలో దేవలోకంనుంచి భూమిపై కూలాడు.

దానకల్పవృక్షఫలం సాటిలేనిది; ఊహాతీతమైనది; స్వప్నమాయలో కానవచ్చేది కాదు; అదృష్టవంతులకు అపార విభవ భోగాలు చేకూరుస్తుంది.

ఈ విధంగా బుద్ధభగవానుడు భిక్షువులకు ఉపదేశించిన సందర్భంలో నిజ జన్మాంతర కథ తెలుపుతూ దానఫల వైభవం వివరించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మాంధాత్రవదానమనే నాల్గవ పల్లవం.

# 5. చంద్రప్రభావదానం

దేవతలు వచ్చి యాచించే వేళకు క్షీరసాగరం కలతపడి, చాలసేపు కంపించింది. ఇక కల్పవృక్షాలు ఫలమిచ్చే వేళలో కదలడం సహజం. కాని, పెక్కు పూర్వజన్మలలోను దానశీలి అయిన మహాసత్త్వుడు దేహాన్ని ఒడ్డేటప్పుడు కూడ ఎంతమాత్రమూ చలించక హర్షపులకితుడై ఉంటాడు.

కైలాసపర్వతమనే సాకుతో మందహాసం చేస్తున్నదా అన్నట్టున్న ఉత్తరదిక్కులో భువనానికే ఆభరణమైన భద్రశిల అనే పట్టణం ఉంది. ఆ పట్టణంలో ప్రజలు తమ ఉద్యానాలలో నాటి పెంచుతున్న లతలలాగ దానలత వర్ధిల్లుతూ వారికి ప్రీతి కలిగించేది. ఆ దానలతకు తెల్లని కాంతే పూగుత్తి. సర్వసంపదలే పండ్ల గుత్తులు. ఆ పట్టణ స్త్రీలు చక్కని చుక్కలు. త్రిపురారి మూడవకంటి సెగకు భయపడిన మన్మథుడు ఆ చక్కనిచుక్కల కనుబొమల సోయగం మరుగుజొచ్చినట్టు తోచేది. అక్కడి భవనాలు హేమమయాలు. ఆ భవనాలను ముక్తాహారాలతో అలంకరించారు. అప్పుడవి తారకామండిలతో ప్రకాశించే మేరుశిఖరపంక్తిలాగ కనిపించేవి.

ఆ పట్టణాన్ని చంద్రప్రభుడనే భూపతి ఏలేవాడు. పేరుకు తగినట్టుగా తెల్లని దేహచ్ఛాయ గల ఆ రాజు కైలాసంలాగ పట్టపగలే పండువెన్నెలలు కాచేవాడు. పండువెన్నెలలవంటి ఆయన దేహకాంతులు రాత్రులలో స్నేహగుణక్షయం లేకనే దీపాలై వెలుగుతుండేవి. శ్వేతచ్ఛత్రం కింద ఆయన ఉన్నప్పుడు తారకలు ఆయనను చూచి ఎక్కడ మోహపడుతాయో అనే అనుమానంతో తారకాధిపతి అయిన చంద్రుడే గొడుగుగా వచ్చి ఆయనను మరుగు చేస్తున్నట్టు తోచేది. ఆయన ఎప్పుడూ తన ఉత్తమకోశంలో ఉన్న సిరిని దానం చేస్తాడని ఆయనను చూడగానే పద్మిని సంకోచం పొందేది. త్యాగంతో విమల యశస్సు ఆర్జించిన ఆ రాజు తనకు సైన్యం కలదనే అహంకారాన్ని, పటాటోపాన్ని వదలిపెట్టాడు. చక్రమకుటాదులు మాత్రం లక్ష్మీ చిహ్నాలు గనుక ఉంచుకున్నాడు. అతని పుణ్యం ఉన్నతమైనకొద్దీ విభవం హెచ్చింది. విభవం హెచ్చినకొద్దీ ఆయనలో వినయం విలసిల్లింది. ధనుస్సు వంగినప్పుడే కదా గుణం కొసకు ఎక్కుతుంది? కాలదూరుడైన ఆ రాజుకాలంలో ప్రజలు నలభైలక్షల సంవత్సరాల ఆయుస్సు కలిగి సుఖంగా ఉండేవారు. లోకపాలురను మించిపోయే వైభవంగల ఆ భూపాలుని ఏలుబడిలో అరవైవేల పట్టణాలు సంపూర్ణ సంపదలతో తులదూగేవి. ఆయన పెక్కు యజ్ఞాలు చేశాడు. ఆయన సిరికి ఆయన కీర్తి తిలకంగాను, పుణ్యవిభూతులు భూషణాలుగాను, యజ్ఞధూమలతాభంగాలు ముంగురులుగాను శోభనిచ్చాయి.

ఆ చంద్రప్రభునికి ఇద్దరు మంత్రులుండేవారు. వారిలో ఒకని పేరు మహాచంద్రుడు. చంద్రుడు కలువల వికాసంతో పాటే ఉదయించి ఉజ్జ్వలుడైనట్టు ఆయన సంపద్వికాసంతో పాటే



అభివృద్ధి చెంది, చంద్రబింబంవలె ప్రజలను చల్లని చూపులతో చూచేవాడు. నిశ్చల లక్ష్యంగల ఆ మంత్రి చంద్రప్రభుని యశస్సనే నావలో తన ప్రజ్ఞాపతాకం ఎగురవేసి, ఆ నావను రాజ్యపారావారం దాటించే కర్ణధారి. రెండవ మంత్రిపేరు మహీధరుడు. ఆ అమాత్యకుంజరుడు పేరుకు తగినట్టు ఐదవ దిగ్గజంవలె ఆ రాజు రాజ్యభారమంతా భరించేవాడు. నీతికి బృహస్పతి, మంత్రజ్ఞుడు అయిన ఆ మంత్రి శత్రు సామంతరాజుల శౌర్యాన్ని మంత్రజ్ఞుడు సర్పవిషాన్ని పోగొట్టినట్టు రూపుమాపాడు. సత్పురుషునితో గుణం, గుణంతో సత్పురుషుడూ ఒప్పారినట్టు ఆ రాజు, మంత్రులు పరస్పరానురాగవిశ్వాసాలతో మెలగేవారు. కృతజ్ఞుడు, సరళస్వభావుడు అయిన ప్రభువు, భక్తినిర్భరుడైన ఉత్తమభృత్యుడు పుణ్యంకొద్దీ. అదృష్టంకొద్దీ లభిస్తారు. ప్రభువు గుణజ్ఞుడై "వీడు మంచివాడు, వీడు కాదు" అనే భేదం తెలుసుకోడంలోనే సకలసంపదలు భ్రాంతి లేకుండా శాశ్వతంగా అభివృద్ధి కావడానికి కిటుకు ఉంది.

ఒకప్పుడు ఆ మంత్రులిద్దరికి, తక్కిన మంత్రులకు కూడ దానవ్యసనంతో రాజు క్షీణించిపోయినట్టు కల వచ్చింది. దానికితోడు దుర్నిమిత్తాలు కూడా కలిగాయి. ఏదో ఆపద మూడుతుందనే భయంతో వారు రాజుహితం కోసం శాంతి స్వస్తిక క్రియలు చేయించడంలో శ్రద్ధ వహించారు. తపోవనాలలో ఉన్న విశ్వామిత్రాది మహర్షులు కూడ ఆ దుర్నిమిత్తాలు చూచి రాజుకు విపత్తు కలుగుతుందని ఆందోళన పడసాగారు.

ఇలా ఉండగా, గంధమాదన పర్వతప్రాంతాలలో రౌద్రాక్షుడనే బ్రాహ్మణబ్రువుడుండేవాడు. వాడు పూర్వజన్మలో బ్రహ్మరాక్షసుడు. సహింపరాని మాత్సర్యం, క్రౌర్యం, దౌర్జన్యం కలవాడు. వాడు గుణరహితుడు. కనుక సద్గుణాలంటే వానికి గిట్టదు. ఈ కారణంగా చంద్రప్రభునికి దానగుణం వల్ల కలిగిన అపూర్వకీర్తిని విని మండిపడి ఇలా అనుకున్నాడు: "ఆ రాజు కీర్తిని గగనంలో సిద్ధగంధర్వ గీర్వాణ లలనామణులు ఎప్పుడూ పాడుతూ ఉంటారు. సదా సర్వకాలం ఆయన గుణసంస్తుతి సూక్తులే నా చెవుల్లో పడుతూ ఉంటాయి. నేను సహజంగా ఇతరుల గుణోన్నతిని సహించేవాణ్ణి కాను. ఏం చేయను? ఆ దానశీలుని వద్దకు వెళ్ళి శిరస్సును ఖండించి యిమ్మని యాచిస్తాను. ఇవ్వననే మాటతో దానార్జితమైన కీర్తిని ధ్వంసం చేస్తాను. శిరస్సు ఇవ్వడా, కీర్తి కోల్పోతాడు. ఇచ్చాడా నా కసి తీరుతుంది" అని క్రౌర్యగుణ కఠినుడైన ఆ శఠుడు ఆలోచించి, ఇంద్రజాలాదిమాయలు ఎరిగినవాడు గనుక దుష్ట సంకల్పం మరుగుచేసి ప్రశాంతమైన వేషంతో భద్రశిలాపురికి వచ్చి, రాజు సన్నిధానం చేరాడు.

గుణదోషసమాకులమైన ఈ సంసారవనంలో కల్పవృక్షాలూ పుడుతూ ఉంటాయి, విషవృక్షాలూ పుడుతూ ఉంటాయి. దుర్నిమిత్తాలవలె ఘోరవినాశాన్ని సూచిస్తూ తీరని భయం కలిగించే దుష్టుల వల్ల ఎవరికి దుఃఖం కలుగదు? దుర్మార్గునికి చీకటికి భేదమేమిటో చెప్పండి. దుర్మార్గుడు గుణద్వేషి, ప్రకాశానికి శత్రువు, దోషాశ్రయుడు. దుర్మార్గుడు తాచుపామువలె భయంకరుడు. వీడిని ఎవరు సృష్టించారో? తాచుపాములాగ అకారణంగానే కాటు వేస్తాడు; విద్వేషవిషం కక్కుతాడు; చలం పూనుతాడు.

ఆ రౌద్రాక్షుడు నగరంలో ప్రవేశించగానే పురదేవత రాజుకు ప్రత్యక్షమై భయచకిత నేత్రాలతో "రాజా! జగజ్జీవితమైన నీ జీవితాన్ని ధ్వంసం చేయదలచి నీ శిరస్సును యాచించడం కోసం ఒక

బ్రాహ్మణాధముడు వస్తున్నాడు. వాడు దుష్టబుద్ధి గనుక వధింపదగినవాడు. వాణ్ణి నగరద్వారంలోనే ఆపాను. వాణ్ణి చూడగానే నా మనస్సు బెదరిపోయింది. ధైర్యం చిక్కబట్టలేకున్నది" అని అన్నది. యాచకుడు నగరద్వారంలోనే ఆగిపోయినందుకు భూపాలుడు సిగ్గుపడి మోము వాల్చి, పురదేవతతో ఇలా అన్నాడు: "దేవీ! యాచన కోసం వచ్చిన ఆ బ్రాహ్మణుని అడ్డగించవద్దు; నిరాఘాటంగా పురంలో ప్రవేశించనివ్వు. యాచకుడు తన ఆశ విఫలమైందని వదిలే నిట్టూర్పును నేను సహించలేను. యాచన చేసేవారికోసం తనువును వ్యయం చేయడం ఎంతో పుణ్యంతోగాని లభించదు. యుగాలతరబడి బ్రతికినా మానవునికి చావు తప్పదుగదా! ఈ లోకంలో యాచకుడు నిరాశపడి వెళ్ళిపోనివారి జీవితమే పవిత్రమైంది. నా క్షేమానుగుణంగా నాకీ మేలు చేయి. ఆశావిఘాతం వల్ల ఆ బ్రాహ్మణునికి కలిగిన సంతాపం పోగొట్టు. ఇంతమాత్రం చేయి." రాజు దృఢనిశ్చయాన్ని విని పురదేవత చింతతో వ్యధపడుతూ అదృశ్యురాలైంది.

పురదేవత అదృశ్యురాలు కాగానే, భయంకరమైన రంపం మెత్తని మనస్సులను పరపర కోసేవిధంగా రాజును నాశనం చేయదలచిన రంపంవంటి ఆ దుర్మార్గుడు నగరంలో ప్రవేశించాడు. ఆ దుష్టుడు యాచకులకు అడ్డులేని రాజద్వారం ప్రవేశించగానే భూమిపతికి ఏమి ముప్పు మూడుతుందో అనే శంకతో భూమీ, భూధరాలు కంపించాయి. ఆ దుష్టముఖుడు చంద్రుణ్ణి మింగే రాహువులాగ నరేంద్రుణ్ణి సమీపించి మొదట్లోనే అమంగళార్థమిచ్చే ఆశ్వీర్వాదంతో "రాజా! స్వస్తి. నేను బ్రాహ్మణ్ణి. నిర్జనమైన అడవిలో అణిమాది సిద్ధులు సాధించడానికి తపస్సు చేస్తున్నాను. సకలార్థి సురపాదపమైన నిన్ను ఈప్సితార్థసిద్ధి కోసం చేరవచ్చాను. నీచూపు కరుణామృతవర్షి. నీ మనస్సు సౌజన్య పూరితం. నీ శాంతి గుణం క్రోధరజస్సును కడిగివేసే నదివంటిది. నీ బుద్ధి దుఃఖార్తులను తల్లివలె ఆదుకొనేది. నీ సంపద దానజలాభిషేకంతో పవిత్రమైంది. నీ మాట సదా సత్యసమ్మితం. ఇలాటి గుణాలుగల నీవొక్కడివే జగద్బాంధవుడుగా ఉంటున్నావు. సిద్ధులను సాధించడానికి చక్రవర్తి శిరస్సు సంపాదించమని కొందరన్నారు. కనుక నీ శిరస్సును నాకు ఇవ్వు. శిరస్సును దానం చేయగల చక్రవర్తి నీకంటే మరొకరెవరు? లోకంలో కోరికలిచ్చే చింతామణి, కల్పవృక్షం వంటివి ఉన్నాయి. కాని, అవి సామాన్యమైన వాంఛితాలిచ్చేవే. దుర్లభమైన కోరికలిచ్చే నీవంటివారు అరుదు" అని కోరాడు.

ఆ మాటలు విని ఉదారహృదయుడు, సత్త్వశాలి అయిన ఆ రాజు ఎంతమాత్రమూ చలించక అర్థిసందర్శనంతో ఆనందం పొంగులువారగా, ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! నేను ధన్యుణ్ణి. అర్థుల మనోరథసిద్ధి కోసం నా జీవితం ఉత్తమమైన ఉపకరణమై వ్యయించడానికి అవకాశం కలిగింది. పరార్థం కోసం ప్రాణాలు అర్పించాలనే వాంఛ నాకు చిరకాలంగా ఉంది. నీవు నా ప్రాణాలను యాచించడం నా పుణ్యంకదా! నీ సిద్ధిసాధనకు నా శిరస్సు ఉపకరణం కావడం శ్లాఘనీయమైన విషయం. లోకంలో స్థిరంగా ఉండేది అర్థికి సమర్పించిన దానమేకదా!"

రాజు ఈ విధంగా యాచకునితో అనడం చూచి మహామాత్యులైన మహాచంద్రుడు, మహీధరుడు భయంతో వణుకుతూ రాజుతో ఇలా విన్నవించారు: "దేవా! స్వకీయ జీవిత రక్షణం మీకు ప్రథమధర్మం. మీరు జీవిస్తేనేకదా ఈలోకంలో తక్కిన జీవులు సుఖంగా జీవించడం? మీదేహం



సర్వజీవులకు ఆధారమైంది. కనుక శిరస్సును దానం చేయడం ఉచితం కాదు. హేమరత్నమయ శిరస్సు చేయించి, ఈ బ్రాహ్మణునికి దానం చేయండి. లక్షలాది యాచకుల మనోరథాలను సర్వవిధాల పూరించేవారిని రక్షించడం జగద్రక్షణవంటిది. కనుక మీ దేహరక్షణ ముఖ్యం. ఈ బ్రాహ్మణుని సంకల్పం క్రూరమైంది; మనస్సు కలుషితమైంది; మీ శిరస్సు ఇతనికెందుకు? రత్నఖచితమైన స్వర్ణశిరస్సు తీసుకొనివెళ్ళనీ! కల్పవృక్షాన్ని కూకటివేళ్ళతో నరికివేస్తే అర్థులకు ప్రయేజనమేమి? ఆకలిగొన్నవారు చింతామణిని నూరుకొని ముద్దచేసి తింటారా?" మంత్రుల మాటలకు ఆ బ్రహ్మబంధువు ఒప్పలేదు. తన సిద్ధిసాధనకు హేమరత్నమయమైన శిరస్సు ఉపయోగించదని భీష్మించాడు.

తర్వాత రాజు తన శిరస్సును భేదించి ఆ బ్రాహ్మణబ్రువునికి దానం చేసే ఉద్దేశంతో తన కిరీటం శిరస్సునుంచి తీసివేశాడు. ఆ కిరీటపు ముత్యాలసరాల కాంతులు చూడగా కిరీటం శిరస్సును వదలుతున్నందుకు దుఃఖంతో అశ్రుధారలు విడుస్తున్నట్టు కనిపించింది. రాజు మకుటం తీసివేయడం చూచిన వెంటనే ప్రజలు కూడ తమ ఉష్ణీషాలు తీసి భూమిపై వేశారు. అప్పుడు దిక్కులను కాల్చివేసేట్టు భయంకరంగా ఉల్కలు రాలాయి. రాజు శిరోదానానికే కృతనిశ్చయుడు కావడం చూచి, ఆ దారుణకృత్యం చూడజాలక మహామాత్యులిద్దరూ దేహత్యాగం చేశారు.

పిదప రాజు రత్నగర్భమనే ఉద్యానవనం ప్రవేశించి, ఒక పూచిన సంపెంగ చెట్టు కింద కూర్చుని తల తరుగుకొనడానికి ఉద్యమించాడు. అది చూచి వనదేవత దుఃఖంతో "రాజా! అలాటి సాహసం చేయకు" అని కోరింది. నవలతలు కదలుతున్న చిగురుటాకులతో, మత్తభ్రమర నినాదంతో, చేతులెత్తి, గొంతెత్తి ఆయనను ఆ సాహసం నుంచి నివారించడానికి ప్రయత్నించినట్టు అనిపించింది. కాని రాజు నిశ్చల సంకల్పంతో ఉద్యానదేవతను సమ్మతింపజేసి, విమలమైన బోధితో ప్రణిధానంలో మనసు లీనం చేసి "ఈ రత్నమయోద్యానంలో పుణ్యరాశిలాగ ఉన్నతమైన స్తూపమొకటి ప్రశాస్త పేరుతో నెలకొననీ. ఆ స్తూపం జీవకోటిని ఈ సంసార సాగరం నుంచి తరింపజేయనీ! ఈ సత్సంకల్పంచేత నేను ఏమాత్రం పుణ్యం సంపాదించినా దానివల్ల ఈ ప్రపంచంలోని దేహధారులు సంసారవిముక్తులుకానీ!" అని తలపోసి తన శిరస్సును కచకలాపంతో ఆ సంపంగి చెట్టు కొమ్మకు కట్టి, కోసి ఆ బ్రాహ్మణునికి ఇచ్చాడు.

ఆ చంద్రప్రభ నరపతి సత్త్వోత్సాహభరితమైన ప్రణిధానబలం వల్ల విమల పుణ్యకాంతులు దిగంతాలకు వ్యాపించాయి. ఆ కాంతులతో ఆ రాజ్యప్రజలు క్షణంలో మహామోహం తొలగిపోయి, నిరంతర సంసారాయాసం ఉడిగి పరినిర్వాణం పొందారు.

ఈ విధంగా బుద్ధభగవానుడు తన పూర్వజన్మ వృత్తాంత కథతో భిక్షువులకు పవిత్ర దాన ధర్మోపదేశం చేశాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో చంద్రప్రభావదానమనే ఐదవ పల్లవం.

# 6. బదరద్వీపయాత్రావదానం

మహావీర్యసంపన్నులు, పవిత్రమానసులు, సత్త్వగుణ మహోదధులు అయిన దానశీలురు పరార్థపూరణంలో మహోత్సాహం పొందుతారు. వారి సంకల్పాలు కూడా మన ఆలోచనకు అందవు. అలాటి మహాత్ముల సత్త్వోజ్జ్వలమైన ప్రభావ విలసితం ఆశ్చర్యకరమైంది. వారు మేఘమండలాన్ని దాటి ఆకాశాన్నంటే ఉన్నత పర్వతాలను మేడ ఎక్కినట్టు సులువుగా ఎక్కుతారు. అగాధజలంతో ఉల్లోల కల్లోలాలతో క్షోభోద్ధతమైన సముద్రాలను మడమలు కూడా అంటకుండా దాటివేస్తారు. భయంకరారణ్యాలను ఉద్యానవనాలులాగా దాటిపోతారు.

పూర్వం ఒకప్పుడు బుద్ధభగవానుడు ప్రజల అజ్ఞానాంధకారాలను ఉపదేశప్రకాశంతో పటాపంచలు చేస్తూ శ్రావస్తీనగరంలో ఉండేవాడు. ఒకసారి ఆయన భిక్షుసంఘాలు, వణిక్సమూహమూ వెంటరాగా కాలినడకన మగధదేశం నుంచి బయలుదేరివెళ్ళుతున్నాడు. ఆ దారిలో శాలాటవి అనే అరణ్యం ఉంది. అక్కడ దొంగలు పొంచి ఉండి, దారినిపోయే బాటసారులను దోచుకొనేవారు. ధనవంతులైన వర్తకులతోపాటు ఆ అడవిదారిని వెళ్ళుతున్న బుద్ధభగవానుని శాలాటవిలో గుంపుగా పొంచివున్న దొంగలు చూచి, "సర్వప్రాణి హితకారి అయిన ఈ బుద్ధభగవానుడు ముందు వెళ్ళిపోనీ. తర్వాత ధనరాసులతో సహా వర్తకసంఘాన్ని పూర్తిగా దోచుకుందాము" అని ఆలోచించారు. సర్వజ్ఞుడైన బుద్ధుడు వారి దురుద్దేశం గ్రహించి, నిర్వికారంగా చిరునవ్వు నవ్వుతూ, "ఏమిటి మీ ఆలోచన?" అని వారినడిగాడు. ఆ దొంగలు బుద్ధభగవానుని ప్రసన్న మందస్మితకాంతులతో అజ్ఞానతిమిరం తొలగిపోయిందా అన్నట్టు క్రౌర్యం వదలి "భగవన్! కర్మవశాన మేము దూష్యమైన జీవికతో గడుపు తున్నాము. మాకు మరణభయం లేదు; మరొక కృషి చేయము; ఇతరులను రక్షించము; ఇతరుల నుంచి దానం పొందము; సహజకలుషాత్ములమైన మాకు క్రౌర్యం కూడా ఉగ్గుతో బెట్టింది. ఈ స్వభావానికి ఏమి చేయగలం? ప్రకృతిసిద్ధమైన స్వభావం తీవ్రమైంది. సంస్కరించడానికి సాధ్యం కానిదీని. కనుక, దేవా! నీవు మా వృత్తిని పోగొట్టవద్దు. నీవు ముందు వెళ్ళిపో. నీవు వెళ్ళిపోయిన తర్వాత మేము ఈ వర్తకసంఘం సర్వస్వం కొల్లగొడుతాము" అని విన్నవించుకొన్నారు. వారి మాటలు విని బుద్ధభగవానుని మనసు కరుణాపూర్ణమైంది. క్షణకాలం ఆయన బుద్ధి ఊయలవలె ఊగింది. కాని, వెంటనే ఆయన తన వెంట వస్తున్న వర్తకసంఘాల వద్ద ఉన్న ధనమంతా లెక్కించి, తక్షణమే లభించిన ఒక నిధి నుంచి దానికి సమానమైన ధనం తీసి దొంగలుగుంపుకిచ్చి వర్తక సంఘాలను రక్షించాడు.

ఈ విధంగా బుద్ధదేవుడు ఆ అడవిదారిని వెళ్ళినప్పుడు ఆరుసార్లు ధనం చెల్లించి వర్తక సంఘాలను దొంగలబారి నుండి రక్షించాడు. మరల ఒకమారు బుద్ధభగవానుడు తన అనుచరులతో



పాటు ఆ దారినే రాగా, ఆయనను భోజనానికి పిలువాలని ఆ చోరులకు బుద్ధి కలిగింది. బోధిసత్త్వులు ఎలాటి ఉత్తములు! చూపుతో అజ్ఞానాంధకారం అణచివేసి ప్రకాశం కలిగిస్తారు! వారితో సంభాషిస్తేనే శుభాలు చేకూరుతాయి. ఇక వారి సత్సాంగత్యం సన్మార్గానికి సేతువు. ఆ జినభగవానుడు తన సరళమైన కృపాదృష్టితో సకల అశుభాలు నశింపజేసి వారి మనస్సును పరిశుద్ధం చేశాడు.

అర్థచర్య, సమానార్థభావం, త్యాగం, ప్రియవచనం అనే నాలుగు వస్తువులను సంగ్రహించుకొని నియతాత్ములై; కరుణ, ముదిత, ఉపేక్ష, మైత్రి అనే నాలుగు బ్రహ్మవిహారాలలో విహరిస్తూ సత్త్వశాలురై; అలోభం, అద్వేషం, అమోహం అనే మూడు కల్యాణాలవాలమైన గుణాలతో మనసు నిండారి మహాత్ములై; దానశీలం, క్షమావీర్యం, ధ్యానప్రజ్ఞ, ఉపాయమంత్రి, జ్ఞానసైన్యం కలిగి మనస్వులై ఇతరులను రక్షించడంలో అద్వితీయ వీరులైన అద్వయవాదులై; విద్యాత్రయంతోను, చతుర్విమల శీలాలతోను ప్రకాశిస్తూ; పంచావరణాలనుంచి విడివడి; షడాయతనాలను భేదించి; సప్తబోధ్యంగాలను సాధించి; ఆర్యాష్టాంగాలను ఉపదేశిస్తూ; నవసంయోగదూరులై; దశబలాలతో ఒప్పారుతూ ఉన్న జనులకు ఈ ప్రపంచంలోని జనుల ప్రవృత్తి తెలియనిది ఏముంది?

బుద్ధుని కారుణ్యంతో పరిశుద్ధులైన ఆ తస్కరులు ఆయన పాదాలపై తలలుంచి మోకరిల్లారు. అప్పుడు భగవానుడు వారి ఆహ్వానాన్ని అంగీకరించాడు. తన సందర్శనంతోనే క్షీణపాపులైన ఆ దొంగలు సమర్పించిన భోజ్యవస్తువులను బిక్షుసంఘంతోపాటు వెళ్ళి స్వీకరించాడు. తర్వాత దొంగలు జ్ఞానాంజనశలాకవంటి బుద్ధుని ప్రణిధానప్రభావంతో కన్నులు తెరచి, ఉజ్జ్వలమైన, స్థిరమైన పదాన్ని దర్శించి, వెంటనే తీవ్రవైరాగ్య పరిపాక హృదయులై, క్రౌర్యం వీడి ప్రసాదగుణ గరిష్ఠులై సన్యాసం స్వీకరించి, ప్రపంచంలో మన్ననలు పొందారు.

ఈ విధంగా ఆ చోరులకు ఆకస్మాత్తుగా కలిగిన కల్యాణం చూచి భిక్షువులందరూ "భగవన్! ఇదేమిటి? ఈ మనఃప్రవృత్తి పరివర్తనం ఎలా జరిగింది?" అనిప్రశ్నించగా, తథాగతుడు ఇలా సెలవిచ్చాడు: ఈ విధంగా ధనం చెల్లించి వర్తకసంఘాన్ని రక్షించడంతో వీరికీ నాకూ సంబంధం పూర్వజన్మలో ద్వీపయాత్రకు వెళ్ళినప్పుడు కూడా కలిగింది. ఆ సంగతి వినండి:

కోసలదేశంలో వారణాసి అనే పట్టణం ఉంది. అది కోసలభూములకు హర్షోత్కర్షాలు కలిగిస్తూ బహుముఖమైన విధిసృష్టికి అవధివలె ఉంటుంది. ఆ పట్టణంలో సురనది నిర్మల తరంగాలతో దయ, హృదయాన్ని చల్లబరిచినట్టు ప్రాణుల హృదయాలను సంతోషపెడుతూ ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నగరి సత్పురుషులకు అహింసవలె, విద్వాంసులకు విద్యవలె సర్వభూతాలకు క్షమవలె నిర్భయమైన సుఖకరమైన ఆవాసంగా ఉండేది. ఆ నగరంలో వికసత్కమలాశ్రయుడైన బ్రహ్మతో సమానుడైన బ్రహ్మదత్తుడనే రాజు ప్రజలను స్వర్గసుఖాలు కలిగిస్తూ రక్షించేవాడు. ఆ నగరంలో కుబేరునితో సమానుడు, సకల జలాలలకు జలనిధివలె ధనసంచయానికి ఆశ్రయము అయిన ప్రియసేనుడనే వణిక్శ్రేష్ఠుడు ఉండేవాడు. ఆ ప్రియసేనునికి సుప్రియుడనే కుమారుడుండేవాడు. ఆయన సౌజన్యానికి నిలయం. గుణాలప్రోవు. గుణాలు ఆయనను పొంది కృతార్థమైనవా అన్నట్టుండేవాడు. దానం, శీలం, క్షమ, వీర్యం, ధ్యానం, ప్రజ్ఞ- ఈ గుణాలు గల ఆ సుప్రియుడు పుణ్యలక్ష్మిని ఊరించడానికే బ్రహ్మసృష్టించాడా అన్నట్టు ఉండేవాడు. సరసోదారమైన నదులు సముద్రాన్ని పొందినట్టు సర్వవిద్యలు,

సకలకళలు ఆ ఉదారాశయుణ్ణి పొందాయి. గుణగణాలంకృతమైన చరిత్రతో, సర్వలక్షణ లక్షితమైన సుందర విగ్రహంతో ప్రశంసలు పొందుతూ పురుషోత్తమునివలె ఉన్న ఆ సుప్రియుణ్ణి లక్ష్మి కూడా ఆశ్రయించింది.

కాలక్రమాన తండ్రి తన పుణ్యకర్మలతో విలుచుకొన్న స్వర్గలోకానికి వెళ్ళగా, వ్యవహారభారమంతా ఆ సుప్రియుని భుజాలపై పడింది. ఆయన తన ఐశ్వర్యం చూచి ఇలా అనుకున్నాడు: "వంశపరంపరగా నాకు సంక్రమించిన ఈ ఐశ్వర్యం విస్తారమైందే. కాని, సర్వార్థుల మనోరథాలను తీర్చడానికి ఇది చాలదు. సత్పురుషునికి ఎంత గొప్ప సంపద లభిస్తే ఏమి? ముందు వచ్చిన అతిథులు అనుభవించిన మీదట భుక్త శేషంవలె తక్కిన అర్థులకు నిరుపయోగమౌతుంది. బ్రహ్మ రత్నాకరాన్ని అంత విస్తారంగా సృజించాడు. ఏమి ప్రయోజనం? ఇంతవరకు అది తనను యాచిస్తున్న ఒక అర్థి-బాడబాగ్ని-కోరికనే తీర్చకుండా ఉంది. ఇంతకూ అది అగస్త్యుని పుడిసిలిలో ఇమిడిపోయి అతని చిన్న కోరికను కూడ తీర్చలేకపోయింది కదా!! "లక్ష్మి, కౌస్తుభంవంటి వాటితో ఐదారుగురి కోరికలను మాత్రమే తీర్చగలిగాను. ఇతరుల కోర్కెలు తీర్చలేకపోయాను!-" అని ఇప్పటికీ సముద్రం ఔర్వానలంతో లోలోపల కుములుతున్నట్టున్నది. ఏమి చేయను? సిరి ఒక్కటే. అర్థులు పెక్కుమంది. అర్థులందరి కామితాలను పూరించదగిన సంపద దొరకడం కష్టమనే సంతాపం బలమౌతున్నది. నావల్ల ఇష్టార్థాలు సిద్ధించక తిరిగిపోయిన అర్థుల దుఃఖనిశ్వాసాలను భరించలేను. కనుక అసంఖ్యాకమైన విత్తం ఆర్జించడానికి ప్రయత్నిస్తాను" అని ఈవిధంగా సుప్రియుడు చాల దూరం ఆలోచించి, పెద్ద వర్తక సంఘంతోపాటు రత్నద్వీపపురానికి వెళ్ళి రత్నాలు సంపాదించి సేకరించుకొన్నాడు. రత్నాలు సేకరించుకొని కృతార్థుడై తిరిగి వస్తుండగా, దారిలో వర్తకసమూహం ధనాన్ని అపహరించడానికి సిద్ధంగా ఉన్న వనచరులైన దొంగలు కనిపించారు. వారు సాహసంతో తనతో వస్తున్న వణిక్సమూహం ధనాన్ని అపహరించాడనికి పూనుకోగా, సుప్రియుడు తన సర్వస్వమూ వారికిచ్చివేసి, ఆ సార్థవాహసమూహాన్ని రక్షించాడు. ఇలాగే సుప్రియుడు రత్నద్వీపానికి ఆరుసార్లు ధనం కోసం వచ్చి, ఆరుసార్లూ తన సర్వస్వమూ ఇచ్చి వర్తకులను రక్షించాడు. ఈ ఏడవమారు రత్నద్వీపంనుంచి తిరిగి వస్తుండగా, మరల చోరులు వర్తకులను దోపిడిచేయడానికి వచ్చారు. అప్పుడు సుప్రియుడు ఇలా అనుకున్నాడు:- "ఆహా! నేను దొంగలను అపారధనంతో ముంచివేశాను. అయినా, వీరు పరధనహరణోద్యమంనుంచి విరమించడం లేదు. ధనంతో జగత్తునే నింపివేస్తానని ఒకప్పుడు భావించాను. కాని, ఈ హతభాగ్యులైన దొంగల ఆశలనే తీర్చలేకపోతున్నాను. కార్యోత్సాహం లేక వ్యర్థప్రతిజ్ఞుణ్ణయి ముందు కూడ మాట నిలబెట్టుకోలేని నా ఈ జన్మ ఎందుకు?"

అతడు ఈ విధంగా సంతాపంతో నిర్జనప్రదేశంలో ఆలోచిస్తుండగా ఆ రాత్రి వంద సంవత్సరాలవలె గడిచింది. దుఃఖ సంతాపంతో గజేంద్రునివలె నిశ్చలంగా నిడుద నిట్టూర్పులు విడుస్తూ ఉన్న అతని స్వప్నంలో మహేశ అనే దేవత సాక్షాత్కరించి ఇలా అన్నది: "ఓ సుమతీ! దుఃఖపడవద్దు. దుఃఖం శరీరాన్ని శోషింపజేస్తుంది. నీసంకల్పం ఉత్తమమైంది. కనుక, నీ ఈప్సితం సిద్ధిస్తుంది. ధీరులై ప్రయత్నించే వారికి స్వప్నసంకల్పంలాగ దుర్లభమైందేదీ లేదు. తన ఆజ్ఞచేత వింధ్యపర్వతాన్ని నేలమట్టం చేసిన ఒకానొక బ్రాహ్మణుని శక్తి అనుపమానమైంది కదా! మహాత్ములకు కార్యసాధనకాలంలో



ఎగుడుదిగుడుగా ఉన్నది సమంగాను, దూరంగా ఉన్నది సన్నిహితంగాను, నీరు నేలగాను అయిపోతాయి. నీ ప్రయత్నం పరార్థంకోసం గనుక తప్పక ఫలిస్తుంది. సందేహమే లేదు. సత్త్వప్రధాన ప్రవృత్తులు గలవారు సందేహమానసులు కారు. దేవతలు నివసించే బదరద్వీపంలో రత్నాలున్నాయి. వాటిలో ఒక్కదాని ప్రభావంతోనే మూడు లోకాల కోరికలను పూరించవచ్చు. మర్త్యలోకం దాటి ఆ మహాభూమికి వెళ్ళాలి. సత్త్వహీనులు, ధృఢసంకల్ప రహితులు, దానిని చేరలేరు. కుమారా! విషాదం వదలి, బుద్ధిని స్థిరపరచుకొని, బదరద్వీపయాత్రకు నడుంకట్టు, సత్త్వగుణప్రభావం వెల్లివిరిసి, సంసారాన్ని తరింపగలిగిన నీవు ఆ ద్వీపాన్ని చేరడానికి దారిని జాగ్రత్తగా చెబుతాను విను:

"పడమటి దిక్కులో వంద గొప్ప సప్తద్వీపాలు, సప్త మహాపర్వతాలు, సప్తమహానదులు దాటిన పిదప అనులోమ ప్రతిలోమమనే సముద్రం ఉంది. అనుకూలమైన గాలి వీస్తే పుణ్యవంతులు ఆ సముద్రం తరించి తీరం చేరుతారు. తర్వాత అదే పేరుగల పర్వతం ఒకటుంది. అక్కడ గాలి వీస్తే కళ్ళు మూతలుపడి చీకటి కమ్ముతుంది. ఆ పర్వతంలో అమోఘమనే మహౌషధి ఉంది. అది కంటికి స్వాస్థ్యం కలుగజేస్తుంది. తర్వాత ఆవర్తమనే సముద్రం కనిపిస్తుంది. అక్కడ తీవ్రంగా వీచే గాలి ప్రాణికోటిని ఏడు సుడిగుండాలలో ముంచి తేలుస్తూ ఉంటుంది. తర్వాత ఆవర్తమనే పర్వతం ఉంది. అక్కడ దేవతలకు కూడ భయం కొల్పుతూ ప్రాణాలు తీసే శంఖనాభుడనే రాక్షసుడున్నాడు. అక్కడ శంఖనాభి అనే మహౌషధి ఉంది. దానిని ఒక నల్లతాచు చుట్టుకొని ఉంటుంది. ఆ ఓషధిని తల మీద, కళ్ల మీద పెట్టుకుంటే పుణ్యవంతుడు భద్రంగా ఉంటాడు. తర్వాత నీలోదమనే సముద్రం ఉంది. అక్కడ రక్తాక్షుడనే రాక్షసుడున్నాడు. ఘోరమకరాన్ని ఎక్కి తిరుగుతున్న ఆ రాక్షసుడు మకరి అనే బుద్ధవిద్యను ఎరిగినవానికి వశుడవుతాడు. పిదప నీలోదమనే పర్వతం ఉంది. దానిలో ధగధగ మెరిసే కళ్లతో, ఐదువందలమంది రాక్షసులతో నీలగ్రీవుడనే రాక్షసుడున్నాడు. అక్కడ అమోఘమనే ఔషధి ఉంది. దానికి ఒక నల్లతాచు చూపులతో, ఊపిరితో, స్పర్శతో, కోరలతో విషాగ్ని కక్కుతూ కాపలా ఉంటుంది. ఉపోషధవ్రతుడు, మైత్రీకరుణలు గలవాడు ఆ కృష్ణసర్పాన్ని పారదోలి ఆ మహౌషధిని సంపాదించగలడు. ఆ పర్వతంలో చెట్టూచేమా ఉండదు. ఎక్కడ చూచినా గుహలే. ఎక్కుదామంటే అడుగుపెడితే, జారిపడిపోయేంతటి నున్నని సానువులు. ఆ ఓషధిని సిగలో పెట్టికొని, కలికం వేసుకొన్న పుణ్యవంతుడు ఆ పర్వతాన్ని దాటిపోతాడు. ఆ మీదట వైరంభమనే పర్వతం ఉంది. దాని ఉత్తరం వైపు తామ్రాటవి అనే అడవి ఉంది. తామ్రాక్షమనే భయంకరమైన అజగరం ఆ అడవిలో పడిఉంటుంది. దాని భయంకర విషగంధానికి వాయువు కూడ జీవించదు. ఆ అజగరం ఆరునెలలు నిద్రపోతుంది. నిద్రపోతున్నప్పుడు దాని నోటినుండి జొల్లుకారి యోజనం వరకు వ్యాపిస్తుంది. ఆరు నెలలు మేలుకొని ఉంటుంది. అప్పుడు ఆకలితో నకనకలాడుతూ చిక్కిపోతుంది. ఆ తామ్రాటవిలో వెదురుపొదల మాటున శిలాఫలకం చేత మూయబడియున్న గుహను పగులగొట్టి, పగలూరాత్రీ ధగధగమని ప్రకాశించే ఒక ఓషధిని గ్రహించి, దానిని కంటికి కలికం వేసుకోవాలి. అవైర అనే బుద్ధవిద్యను జపిస్తున్నవానికి ఆ ఘోరమైన అజగరం వలన కాని, మరే భయంకర ప్రాణి వలన కాని భయం ఉండదు. తర్వాత వెదురుముళ్ళ పొదలతో సంకటం కలిగించే ఏడు మహాశైలాలను వీర్యశాలి అయినవాడు కాలికి రాగిరేకుల పాదరక్షలు తొడుగుకొని దాటి వెళ్ళుతాడు. తర్వాత ఒక శాల్మలీవనం, ఏడు ఉప్పునీటి నదులూ దాటి వెళ్లితే త్రిశంకువనే పెద్ద పర్వతం కనిపిస్తుంది. అక్కడ వజ్రాన్ని కూడా

భేదించే త్రిశంకులనే ముళ్ళు వుంటాయి. అవి కాళ్ళకు రాగిపాదరక్షలు తొడుక్కున్న వారికి గుచ్చుకోవు. తర్వాత త్రిశంకువనే నది, అయశ్శంకువనే పర్వతం, అక్కడ రెండు పాయలుగా చీలిన ఉపక్కల అనే నది ఉన్నాయి. తర్వాత అష్టాదశవక్రమనే ఎదురులేని పర్వతం, అదే పేరుగల నది, పిదప శ్లక్ష్ణమనే గిరి ఉన్నాయి. వాటిని దాటి వెళ్ళితే ధూమనేత్రమనే పర్వతం కనిపిస్తుంది. ఆ పర్వతంనుంచి వచ్చే పొగలు దిక్కులకంతా వ్యాపిస్తూ ఉంటాయి. చూపుతోను, స్పర్శతోను విషం వ్యాపింపజేసే, క్రూరపన్నగాలు దానిలో ఉన్నాయి. ఆ గిరిశిఖరం మీద ఒక గుంటలో, రాతిగుహలో జ్యోతీరసమనే మణి, జీవని అనే మహౌషధి ఉన్నాయి. ఆ గుహను భేదించి ఆ ఓషధిరసాన్ని శిరస్సుకు, పాదాలకు, హస్తాలకు పూసుకొని ముందుకు సాగిపోవాలి. బుద్ధమంత్రజపం చేస్తూ వెళితే ఆ క్రూరసర్పాలేవీ బాధించవు. పిదప భయంకర క్రూరమృగాలున్న ఆశీవిషపర్వతాలనే ఏడు పర్వతాలు ఆ పేరుతోనే ఉన్న అపార జలరాసులుగల ఏడునదులు ఉన్నాయి. వాటి నన్నిటిని పరహితకారి తన పుణ్యంతో దాటి ఆకాశాన్నంటే శిఖరాలున్న సుధాశైలమనే పర్వతాన్ని ఆరోహిస్తాడు. ఆ పర్వతం వెనుక పక్కన కల్పవృక్ష సంశోభితమై స్వర్గసన్నిభమైన రోహితకమనే పట్టణం కనిపిస్తుంది. అక్కడ ఇంద్రునివలె కీర్తివంతుడు, మహాసత్త్వుడు, సర్వజీవహితరతుడు అయిన మఘుడనే వ్యాపారస్తుడు ఉన్నాడు. పవిత్రబుద్ధితో బదరద్వీపయాత్రకు పూనిన నీకు దేశజ్ఞుడైన ఆ బేహారి దారి చెబుతాడు" అని మహేశాదేవి మంగళకరమైన సముచిత వాక్కులతో సుప్రియుణ్ణి ప్రోత్సహించి, అంతర్ధానమైంది.

సుప్రియుడు మేల్కొని అంతా బాగా ఆలోచించి, 'సరే అని నిశ్చయించుకొని, వాహనమెక్కి ఉత్సాహంతో బయలుదేరాడు. ఆ దేవి చెప్పినదారిని ఆయాసం లేకుండా ప్రయాణం చేస్తూ, తన పూర్వపుణ్యంతో పన్నెండు సంవత్సరాలకు రోహితక పట్టణం చేరాడు. అక్కడ రోహితక పట్టణంలో సార్థపతి అయిన మఘుడు కర్మవశాన అసాధ్యమైన వ్యాధితో అస్వస్థుడయ్యాడు. అందువల్ల రాచనగరువంటి ఆ వణిక్పుంగవుని ఇంట్లో ప్రవేశం దొరకక సుప్రియుడు కార్యసిద్ధికోసం ద్వారంలో కాచుకొనవలసివచ్చింది. తర్వాత తను వైద్యుడినని చెప్పుకొని భవనంలో ప్రవేశం సంపాదించాడు. సమయానుగుణంగా మాటలాడగల ప్రజ్ఞ కలవారు అందరికీ ప్రీతిప్రాతులవుతారుగదా! ఆయుర్వేదవిధానం తెలిసిన సుప్రియుడు మఘుని రోగలక్షణాలు చూచి, ఇక ఆయుస్సు ఆరు నెలలే ఉండడం గ్రహించి చింతాక్రాంతుడయ్యాడు. కాని, ప్రియంగాను, హితంగాను, మందులతో చికిత్స, పరిచర్య చేసి, అత్యల్ప కాలంలోనే మఘుని ప్రీతి చూరగొన్నాడు. సుప్రియుడు ప్రీతితో చేయడం వల్ల ఆ వణిక్పుంగవునికి చికిత్స కూడ ప్రీతిపాత్రమైంది. ఇష్టమైనవారు చేసిందీ. ఇచ్చిందీ అంతా మనస్సుకు ప్రియం కావడం సహజమేకదా! ఈ విధంగా ప్రియమైన ఉపచారంతో అతని వ్యాధి శమిస్తూ వచ్చింది. ఆధి, సత్సంగంవల్ల శమిస్తుంది; ఆధి శమించడంతో వ్యాధి కూడ తగ్గుతుంది.

ఇలా సుప్రియుడు నమ్మకం, చనువు కలిగిన తర్వాత తన వృత్తాంతం మఘునికి చెప్పేటప్పుడు తను వచ్చిన సంగతి ప్రీతితో వినిపించాడు. మఘుడు మహాత్ముడైన ఆ సుప్రియునికి బదరద్వీపయాత్రలోగల ఉత్సాహాన్ని, పరార్థపూరణంలో నిశ్చయాన్ని గ్రహించి ఆశ్చర్యంతో ఇలా అన్నాడు: "ఆహా! ఈ నిస్సారమైన సంసారంలో సారభూతమైన మణులవలె పరచింతాపరాయణులైనవారు కొందరు ఉద్భవిస్తారు. నవనవ యౌవనం, ప్రీతి కలిగించే ఆకృతి,



పరార్థపరాయణమైన మనసు-పూర్వసంచిత పుణ్యవశాత్తు నీలో అన్ని దానాలూ చేరాయి. నీవు పరార్థం కోసం ఇంత భూమిని దాటి ఇక్కడికి వచ్చావు. నీకు సహాయం చేస్తాను. కాని యిప్పుడు నేను వ్యాధిగ్రస్తుణ్ణి. ప్రతిప్రాణికి ప్రాణం ఇంత అని ఇదివరకే నిర్ణీతమై ఉంటుంది. నీ సంకల్పసిద్ధికోసం నా ప్రాణాలు పోనీలే. ఈ విధంగా ప్రాణాలు వ్యయించడమే సార్థకం. పరార్థకోసం జీవితవ్యయం కూడ అనేక లాభాలతో సమానం. నేను బదరద్వీపం చూడలేదు. కాని, విన్నాను. విన్న ఆయా గుర్తులను బట్టి మహాసముద్రంలో దిఙ్నిర్దేశం చేయగలను." తర్వాత మఘుడు తన యాత్రా వృత్తాంతం రాజుకు తెలిపి మిత్రులు, బంధువులూ వద్దంటున్నా వినక సుప్రియునితో సహా మంగళనౌక ఎక్కి పయనమయ్యాడు.

ఇలా ఉదారహృదయులైన వారిద్దరూ నావ ఎక్కి అనుకూల పవనాలు వీచడం వల్ల ఒకేధాటిగా యోజనశతాలు కూడా ప్రయాణం చేయగలిగారు. సముద్రంలో అక్కడక్కడ నీళ్ళు నానావర్ణంగా కనిపించడం చూచి సుప్రియుడు కుతూహలంతో "ఏమిటిది? నీరు ఎందుకిలా ఉంది?" అని మఘుణ్ణి అడిగాడు. "ఈ జలనిధి నీటిలోపల ఐదు ఇనుపకొండలు, రాగి, వెండి, బంగారు, కొండలు రత్నపర్వతాలు ఉన్నాయి. వాటి కాంతివల్ల లోపల ఓషధులున్నట్టు అడుగడుగునా నీరు నానావర్ణంగా మెరుస్తూ కనిపిస్తుంది" అని అంటూనే వ్యాధిగ్రస్తుడైన మఘుడు అంత్యకాలం సమీపించి, కీర్తిని మాత్రమే స్థిరంగా ఉంచి ప్రాణాలు వదిలాడు. మహాత్ముల మనోబలం వజ్రలేపంకన్నా దృఢమైంది. కాని దానికి అనుగుణంగా ఆయుస్సు కూడ దృఢమైతే ఇక అసాధ్యమేమిటి? సుప్రియుడు మఘుని మరణం వల్ల కలిగిన దుఃఖాన్ని అణచుకొని, నావను గట్టుకు చేర్చి అతనికి ఊర్ధ్వ క్రియలు చేశాడు. సత్త్వోత్సాహులైన మహాత్ముల ఉత్తమలక్షణమిదే. నిరాలంబమైన గడ్డుకాలంలోను వారి మనస్సు కర్తవ్యాచరణలో సుదృఢంగా ఉంటుంది.

పిదప సుప్రియుడు నావ యెక్కి సముద్రం దాటి, రత్నపర్వతం పక్కన ఉన్న వికటాటవిని చేరాడు. గొప్పవారి బుద్ధి వియోగదుఃఖం కలిగినా, విసుగు పుట్టినా, శత్రువులు ఎదుర్కొన్నా, రోగాలు వచ్చి కష్టాలు కల్గినా క్షీణించదు. సుప్రియుడు పర్వతం పక్కన చిగురుటాకులు పరచుకొని పడుకొని పర్వతం వైపు చూచాడు. అది ఆకాశాన్నంతా ఆశ్రయించుకొని, దిగంతాలకు వ్యాపించి మూర్తీభవించిన విఘ్నంలాగ, పోతరించిన మూర్ఖునిలాగ ఎదుట ఉంది. దానిని చూచి ఆయన ఏమీతోచక క్షణకాలం ఇలా ఆలోచించాడు: "నేను ఊరు విడిచి బయలుదేరి ఎంతోకాలమైంది. బదరద్వీపమనే పేరు కూడా ఎక్కడా వినబడడం లేదు. నా అపూర్వ పుణ్య సంపద వల్ల నా ప్రయత్నాలకు సహాయకారిగా ఉన్నవాడు కూడ కర్మవిప్లవం వల్ల అకాలంలో పగిలిన ఓడలాగ కాలధర్మం చెందాడు. నేను చేసే ఉపాయలన్నీ ధ్వంసమైనప్పటికీ, ఈ మహాప్రయత్నంనుండి విరమించను. సిద్ధినైనా పొందాలి; మరణమైనా పొందాలి. ఈ జన్మయాత్రలో పరోపకారం కోసం జీవితం వ్యయమయ్యే జన్మే లోకత్రయంలోను మన్నన పొందుతుంది."

ఈ విధంగా చింతాకులుడై ఆలోచిస్తున్న సత్త్వ గుణసాగరుడైన సుప్రియుణ్ణి ఆ రత్నపర్వతం మీద వసించే నీలుడనే యక్షుడు చూచి, కనికరించి దగ్గరికి వచ్చి "ఓయీ! పూర్వ దిక్కుగా యోజనం దూరం వెళ్ళి మూడు పర్వత శిఖరాలను పేము నిచ్చెనలెక్కి దాటిపో" అని చెప్పాడు. యక్షుడు

చెప్పినప్రకారం సుప్రియుడు ఆ అచలాన్ని అతిక్రమించి, ఉన్నత శిఖరాలతో విలసిల్లే స్ఫటికపర్వతాన్ని ఎదుట చూచాడు. పక్షులకు కూడా దుర్గమంగా, నున్నటి ఒకే బండరాయిగా, ఏవిధంగాను ఎక్కడానికి వీలుకాక ఎత్తుగా, తన సంకల్పంవలె నిశ్చలంగా ఉన్న ఆ స్ఫటిక పర్వతం చూచి అతడు ముహూర్త కాలం ఏమీ తోచక పటంలో గీచిన బొమ్మలాగ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అలా వెరగుపడిన ఆ సత్త్వసంపన్నుని ఆ పర్వతగుహలో నివసించే చంద్రప్రభుడనే యక్షుడు చూచి ఆశ్చర్యపడి "ఇక్కడనుండి తూర్పుగా ఒక కోసుదూరం వెళ్లు. అక్కడ అపూర్వ విలాసంగల చందనవనం కనిపిస్తుంది. మందమారుతాలకు అక్కడి లతావృక్షాలు కదులుతూ ఉంటాయి. అక్కడ ఒక గుహలో ప్రసర అనే మహౌషధి ఉంది. గుహాముఖద్వారంలో ఉండే మహాశిలను పెకలించి దేహరక్షణకోసం ఆ ఓషధిని తీసుకో. ఆ ఓషధీ ప్రకాశంతో స్ఫటికాచలానికి గల మెట్లు కనిపిస్తాయి. నీ ఈప్సితావాప్తికోసం ఆ మెట్లెక్కి వెళ్ళు. ఆ మహౌషధి వెంటనే కార్యానుకూలత కలిగిస్తుంది. దానిని వెతకడానికి శ్రమపడనక్కరలేదు. తనను స్వీకరించడానికి వచ్చినవారికి అది మెరుపులాగ మెరుస్తూ కనిపిస్తుంది" అని దారి చెప్పాడు.

సుప్రియుడు ఆ యక్షుడు చెప్పిన ప్రకారమే ఆ పర్వతం దాటి సుందర నగరాన్ని చూచాడు. ఆ నగరం ఎటు చూచినా మేరు శిఖరాలవంటి హేమమయ మందిరాలతో ప్రకాశపుంజంతో సర్వాశ్చర్యాలతో నిర్మించినట్టుగా వింతగొలుపుతున్నది. దానిని చూచి సుప్రియుడు విస్మయం పొందాడు. ఆ నగరమహాద్వారం బంగారు తలుపులు మూసిఉన్నాయి. కాపలాదారు తప్ప జనసంచారమేమీ కనిపించ లేదు. అది చూచి అతడు ఆ ఉద్యానవనంలో విశ్రమించాడు. ఇంతలో సాయంకాలమైంది. సూర్యుడు అనంత వ్యోమమార్గ ప్రయాణం వల్ల పరిశ్రాంతుడైనట్టు అస్తాచలానికి విశ్రాంతికోసం వెళ్లాడు. సహస్రాంశుడు అస్తమించగానే, రజనీరమణీమణి అభిసారికవలె తారాపతిని వెదుక్కుంటూ బయలుదేరినట్టు చీకటి నలుమూలలా కమ్మింది. పిదప తన ప్రకాశవైభవంతో సకల దిక్కులను నింపుతూ బోధిసత్త్వునివలె విమలుడైన సుధానిధి ఉదయించాడు. చీకటి మూకలను పూర్తిగా అణచి వేయగలిగిన వెన్నెల మనస్సుకు ఉల్లాసం కలిగిస్తూ సత్త్వప్రవృత్తివలె అంతటా వ్యాపించింది. దిక్కులకు దినంలో కలిగిన వియోగం వల్ల ఏర్పడిన మోహాన్ని చంద్రుడు పోగొట్టాడు. మహాత్ముల ఉన్నతాశయం పరోపకార ప్రవణంకదా!

అప్పుడు సుప్రియునికి చల్లటి చంద్రకిరణాలు తనువుకు సోకి కార్య సముద్రకల్లోల క్షోభలకన్నిటికీ ముద్రవంటి నిద్ర పట్టింది. రాత్రి ఇక గడచిపోతున్నదనగా, అతని గుణగణాలకు, సమర్థతకు మెచ్చిన మహేశాదేవి మరల స్వప్నంలో కనిపించి "ఓ మహాసత్త్వుడా! నీవు సుకృతివి. ఉత్తమ తత్త్వాభినివేశంతో పరార్థం కోసం విపుల క్లేశాలను అనుభవించావు. ఇక నీవు శ్రమపడవలసినది చాల స్వల్పం. కనుక ఉద్వేగపడవద్దు. నిత్యనూతనమైన సత్త్వం గలవారికి సర్వసిద్ధులూ చేకూరుతాయి. ఈ హేమనగరం కాక మరిమూడు నగరాలున్నాయి. అవి రత్న నగరాలు. ఒకదానికంటె మరొకటి విచిత్రమైనవి. నీవు వెళ్ళి ఆ నగరాల తలుపులు తట్టు. వరుసగా నలుగురు, ఎనమండుగురు, పదారుగురు, ముప్పై ఇద్దరు కిన్నెరకాంతలు వెలుపలికి వస్తారు. వారివల్ల నీకు కలిగే ప్రమాదం తెలియకపోయినా, నీవు జితేంద్రియుడివి. ఇక నేమి? త్వరలోనే వాంఛితాప్తి కలుగుతుంది" అని ఆదరంతో చెప్పి, ప్రోత్సహించింది.



సుప్రియుడు నిద్రనుంచి మేల్కొని, ఆ హేమనగర ద్వారాన్ని మూడుసార్లు చేత్తో తట్టాడు. తట్టీతట్టగానే తరలేక్షణలైన నలుగురు కిన్నెరలు వెలుపలికి వచ్చారు. మనస్సుకు ఉల్లాసం కలిగిస్తూ, నయనాలతో అమృతం కురిపిస్తూ, ముఖచంద్రకాంతులతో పట్టపగలే వెన్నెలలు విరజిమ్ముతున్న ఆ కిన్నెరలు లీలానిలచలితమైన ఆశ్చర్యతరువు పుష్పమంజరులా అన్నట్టు ఉన్నారు. ప్రియదర్శనలై, రూపుదాల్చిన మరుని జీవనౌషధులవలె ఉన్న ఆ కిన్నెరలు స్మరసుందరుడైన ఆ సుప్రియుని పూజించి, ప్రణయాభిలాషతోనా అన్నట్టుగా అతనికి ఆతిథ్యమిచ్చి చంద్రకాంతాసనంలో కూర్చోబెట్టి, తర్వాత తాము కూర్చొని, ప్రేమోపాయంగా కర్పూరం అందిస్తున్నట్టు పొంగే విలాస హసిత కాంతులను వెలయిస్తూ ఇలా అన్నారు: "ఆహా! మేము ధన్యులమయ్యాము. మేమే వెదుకుకొని రాదగిన సద్గుణాలంకృతకృతి అయిన నీవే ఇప్పుడు మాయింటికి వచ్చావు. అమృతమంటే ఎవరికైనా ద్వేషమా? చందనమంటే ఎవరికైనా అరుచా? చంద్రుడంటే ఆదరం చూపనివాడెవడు? అట్లే సజ్జనుడంటే ఇష్టపడనివాడుంటాడా? తామే ముందుపడి ప్రణయానికి పూనుకొనడమనేది స్త్రీలకు సౌభాగ్యభంగకర మనడం సంప్రదాయం. అయినా, నీదర్శనానందంతో ఇలా స్వేచ్ఛగా మాట్లాడు తున్నాము. ఈ కిన్నెరపురం, ప్రణయార్పితలమైన మేము, సౌభాషణికమనే ఈ రత్నం- ఇవన్నీ నీ స్వాధీనం."

ప్రణయోచితంగా వారన్న మాటలను సుప్రియుడు విని సత్త్వగుణంవలె తెల్లని దంతచంద్రికలను దిక్కులకు చల్లుతూ ఇలా అన్నాడు: "మీ సంభాషణామృతం ఎవరికి మాననీయం కాదు. మీరు ఆదరించేవి నాకు కూడా ఆదరస్థానమే . మీ దర్శనమే శ్లాఘ్యం. అందులోను నాపై మీకు కలిగిన అనుగ్రహం మరింత శ్లాఘాపాత్రం. వట్టి ముక్తాహారాలే తాపం పోగొడుతాయి. వాటిపై చందనం చిలకరిస్తే ఇక చెప్పాలా? చంద్రకళలవలె స్వచ్ఛాకృతులైన మీ ప్రవర్తనలు కూడ సముచితమైనవి, సుందరమైనవీని. ఔచిత్యసుందరమైన మనస్సు ప్రసాదవిమలమైన మనస్సు, వాత్సల్యసుకుమారమైన పలుకు ఎవరికి ఆదరం కలిగించవు? అతిథి సత్కారోచితమైనంతవరకు మీ సదాచారం సమ్మతించాను. మీకు ఆత్మార్పణం కులాచారమైంది. కాని స్త్రీలు పరాయత్తలు. మీరేమో కన్నెప్రాయం గడచిపోయినవారు; వరపరిగృహీతలు. కనుక చనువు వల్ల మీరు నాకు సోదరీమణులు. వాత్సల్యం చూపడం వల్ల తల్లులవంటివారు. పరవిత్తం విషంగాను పరవనితలను తల్లులుగాను, పరహింసను ఆత్మహింసగాను పరిగణించేవారికి తరుగులేని శుభాలు చేకూరుతాయి. కొండెం, అబద్ధం, పారుష్యం, భిన్నవాదం లేనివారిని అన్ని దిక్కులూ ఆశీర్వదిస్తాయి. అభిధ్యారహితమైన, వ్యాపాపరివర్జితమైన, మిథ్యాదృష్టి విహీనమైన మనస్సుగలవారు సన్మార్గగాములు. స్వభావంతోనే పది అకుశలమార్గాలు దాటివచ్చిన వానికి స్వర్గకుశలమార్గాలు నిరాఘాటమైనవి. ఉత్తములకు బుద్ధే ధన్యమైన ధనం. జితేంద్రియులకు విద్యే విమలదృష్టి. పురషోత్తములకు దయే పుణ్యం. పరిశుద్ధ మనస్కులకు ఆత్మే తీర్థం. ఇలాటి గుణగణం కలవాడు శీలవంతుడైతే విశేషంగా కీర్తనీయుడవుతాడు. ఉత్తములకు శీలమనేది రత్నరాశికన్నా, ముక్తాసమూహంకన్నా విశిష్టమైన ఆభరణమని పెద్దలంటారు." జితేంద్రియుడు, సత్త్వార్థి అయిన సుప్రియుడు ఆత్మగుణానురూపంగా అన్న ఈ మాటలు విని కిన్నెరలు సంతోషించి, తమ సుందరముఖాలతో భూలోకంలోనే వినోదంగా చంద్రలోకం సృష్టిస్తున్నట్టు ఇలా అన్నారు: "ఓ మహాత్మా! మణివలె అనర్ఘగుణోజ్జ్వలుడైన నీకు ఇలాటి ప్రభావం ఉచితమైనదే. నీ ప్రభావం

సత్పురుషులకు శిరస్సుల మీద, హృదయాలలోను, కర్ణాలకూ ఆభరణప్రాయమైంది. ఈ మణి నీలాగే మహోర్ణమైంది; మహా ప్రభావం కలది. దీనిని స్వీకరించు. దీనిని ధ్వజం మీద ఉంచితే యోజన సహస్రం వరకు అర్థులకు అభీష్టాలు వర్షిస్తూ ఉంటుంది." ఈ విధంగా ఆ తరుణులు చెప్పి రూపుగొన్న ప్రసాదగుణం వలె ఉన్న రత్న రాజాన్ని అతనికి సమర్పించారు. ప్రణయోపచణంతో సమర్పించిన ఆ రత్నాన్ని సుప్రియుడు స్వీకరించి రజతనగరానికి వచ్చాడు.

అక్కడ రెట్టించిన సంఖ్యగల కిన్నెరకామినులు ఆయనను సత్కరించారు. అక్కడ కూడా సుప్రియుడు విశుద్ధబుద్ధితో ముందు సంపాదించిన మణికన్నా ద్విగుణప్రభావం గల మణిని సంపాదించాడు. అట్లే మూడవ పట్టణానికి వెళ్లి, పదహారుమంది కిన్నెరకాంతల సత్కారం పొంది, ముందుదానికన్నా రెట్టింపు ప్రభావం గల మణిని సంపాదించాడు. పిదప ఆయన ఈ మూడుపురాలకన్నా అధిక శోభగల రత్నమయమైన నాల్గవ పట్టణానికి వెళ్ళాడు. అక్కడ ముప్పైరెండు మంది కిన్నెరసుందరులు ఆయనను సత్కరించారు. అక్కడ కూడ సుసంయుతుడైన సుప్రియుడు వారిని సద్ధర్మకథాప్రసంగాలతో సంతోషపెట్టాడు. వారు పూచిన నల్లకలువరేకులవలె దీర్ఘమైన కడకంటి చూపు కాంతులను ప్రసారింపజేస్తూ "మహాభాగ! కిన్నర రాజవంశ రత్నాకర చంద్రుడైన బదరుడనే మా అన్న ఈ ద్వీపాన్ని పాలిస్తాడు. ఆయన పేరుతోనే ఈ ద్వీపం ప్రసిద్ధి చెందింది. ఇది ఐశ్వర్యానికి పేరు పొందింది. ఈ రత్నం ప్రభానికరమైంది. పుణ్యవంతులు నియమానుసారంగా ఉపోషధవ్రతం ఆచరించి, ఈ రత్నాన్ని ధ్వజాగ్రంలో పెడితే, జంబుద్వీపంలో జనసందోహానికి అభీప్సితాలు వర్షిస్తుంది. స్థిరమైన పరహిత పూర్తికోసం దీనిని గ్రహించు" అని అంటూ ఆదరంతో అమరతరుఫలాన్ని కోసి, దానినుంచి ప్రేమాతిశయప్రణయసుభగమైన మణిని తీసి బహూకరించారు. సుప్రియుడు ఆ రత్నం స్వీకరించి, వేగంతో వాయువును కూడ జయించిన వాలాహమనే ఉత్తమాశ్వం ఎక్కి, వారినుంచి దారి తెలుసుకొని, స్వనగరమైన వారాణసి చేరాడు.

అప్పుడు వారాణసిని ఏలుతున్న విశదకీర్తి అయిన బ్రహ్మదత్తమహీపతి కాలవశాన తన విపులపుణ్యకర్మల వల్ల స్వర్గం అలంకరించగా, పౌరముఖ్యులు సుప్రియునికి- అతడు సకలప్రాణి వత్సలుడు, సర్వఫలదాయి, లోకరక్షణ వినిహితమతి అని తలచి- ఆ ధర్మరాజ్యం పట్టంకట్టారు. సుప్రియుడు తను నగరం చేరిన పదిహేనవదినం శిరస్స్నానాది విధుల తర్వాత ఉపోషధవ్రతం ఆచరించి, రత్నం ధ్వజాగ్రంలో ఉంచి, లోకాన్నంతా పరిపూర్ణ మనోరథం చేశాడు.

ఈ విధంగా సుప్రియుడు పరహితం కోసం యాత్ర చేసి, నూరు సంవత్సరాలపాటు గొప్పరాజ్యం పాలించి, ప్రజల కోరికలన్నీ తీర్చి, తన కుమారునికి పట్టం కట్టి, సర్వోపశాంతిని పొంది, తత్త్వజ్ఞుడై తుదకు పరబ్రహ్మభావం పొందాడు. పూర్వం సుప్రియజన్మలో నేను రత్నద్వీపయాత్ర చేసినప్పుడు సంతోషపెట్టిన దస్యులే వీరు.

అని శాస్త అయిన బుద్ధదేవుడు స్వవృత్తాంతకథనే చెప్పి భిక్షువులకు దానవీర్యం ఉపదేశించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో బదరద్వీపయాత్రావదానమనే ఆరవ పల్లవం.

# 7. ముక్తాలతావదానం

లోకకల్యాణకామన అనే విశుద్ధ కాంతితో వెలుగుతూ, విమల దృష్టులతోనే వివేకం బోధిస్తున్న మహానుభావులు ధన్యులు. వారి నామసంకీర్తనమే ఈ సంసార మోహాన్ని తొలగిస్తుంది.

పూర్వం బుద్ధదేవుడు కపిలవస్తుపురంలో న్యగ్రోధారామంలో భిక్షుపరిషత్సహస్రం సేవించగా ధర్మోపదేశం చేస్తుండగా, అమందానందం వర్షిస్తూ చందనంవలె చల్లని అతని వాగమృతాన్ని ప్రజలు దోసిళ్ళతో గ్రోలి ధన్యులవుతూ ఉండేవారు. శుద్ధోదన నరపతి కూడ ఆ ధర్మశ్రవణ సంగమంలో పుణ్యోపదేశ సలిలాలతో స్నానం చేసి విమలమైన నిర్వృత్తి పొందాడు.

ఒకనాడు శాక్యరాజ కులోద్భవుడైన మహుడనేవాడు బుద్ధదేవుని ధర్మోపదేశం విని ఇంటికి వచ్చి "ఆహా! బుద్ధభగవానుడు, ధర్మం, సంఘం - ఈ మూడున్నూ రత్నాలు. సిద్ధికోసం మన నిర్వాణంకోసం మహాఫలాలనిచ్చే ఈ మూడింటిని బుద్ధభగవానుడు అనుగ్రహించాడు" అని తనలో తాను అనుకుంటున్నాడు. ఉపదేశ విశేషంతో తనిసి అనుకుంటున్న అతని మాటలను అతని భార్య శశిప్రభ విని ప్రీతితో "పురుషులు పుణ్యవంతులు. కనుక బుద్ధభగవానుడు ఉపదేశించి అనుగ్రహిస్తున్నాడు. మేమేమో ఆడవారం. ఆయన ఉపదేశాలు వినదగనివారం. వాటికి నోచుకోకపోయాము" అన్నది. మహుడు, భార్య మాటలు విని "భద్రే! ఆ జగద్గురువుకు కరుణ చూపడంలో అలాటి భేదమేమీ లేదు. సూర్యకాంతి అంతటా ఒకేవిధంగా ప్రసరిస్తుంది. మేఘాలనుంచి వర్షం అంతటా సమానంగానే పడుతుంది. అలాగే సకలజీవానుకంపగల భగవానుని దృష్టి కూడ సమానమే. శుద్ధోదన మహారాజు మహాప్రజాపతి మాటప్రకారం అపరాహ్ణంలో భగవత్సన్నిధానంలో ధ్యానం చేస్తున్నాడు" అని అన్నాడు.

భర్త ప్రియమైన మాటలు విని శశిప్రభ శాక్యాంగనాగణంతోపాటు భగవానుని ఉపదేశం వినడంకోసం ఆ పుణ్యారామానికి వెళ్ళింది. ఆ ఉపవనంలో ప్రశమమనే అమృతంతో పెరిగి, సత్త్వమనే కుసుమాలు పూచి, మహాఫలాలు పండిన కరుణా కల్పవృక్షం వలె ఉన్న బుద్ధభగవానుని దర్శించి దూరం నుంచే గాలి వీచగా వంగిన లతవలె నమ్రతతో నమస్కరించింది. వంగినప్పుడు ఆమె కర్ణావతంసంగా పెట్టుకున్న కలువ జారి కిందపడింది. అది చూడగా, ఆమె లోభాన్ని వదిలివేస్తున్నట్టు తోచింది. బంగారుమేనిచాయతో రత్నాభరణాలు అలంకరించుకొనివచ్చిన ఆ శశిప్రభను ఆనందుడనే భిక్షువు చూచి, "అమ్మా! నీవేషం ప్రశమగుణ శూన్యమైనది. ఈ ముని తపోవనంలో ఐశ్వర్యదర్పాతిశయం చూపడం తగదు. ఇది విరక్తులుండదగిన స్థానం. గుణనియమసూక్తాలైన నీఆభరణాలు ఏమంటున్నాయో తెలుసా- ఇక్కడికి మమ్మల్ని తీసికొని రాకూడదు- అని నీతో అంటున్నాయి" అని

హితవు చెప్పాడు. ఆనందుని మాటలకు ఆమె సిగ్గుతో తలవంచుకొని, ఆభరణాలన్నీ తీసివేసి ఇంటికి పంపివేసి కూర్చున్నది.

అందరూ కూర్చున్న తర్వాత బుద్ధదేవుడు అందరినీ కుశలప్రశ్నలు వేసి అనిత్యతను గురించి ఇలా ఉపదేశించాడు: ఈ లోకంలోని ప్రాణులు మూఢులై మహామోహప్రభావంతో అనిత్యమైనదానిని నిత్యమని సదా భావిస్తారు. ఈ లోకులు సత్యమనే భ్రాంతితో అసత్యంలో రమిస్తున్నారు; సర్వభావాలు అభావం పొందుతాయని గ్రహించరు. కొందరు వ్యాకరణాలలో, కొందరు తర్కవాద వివాదాలలో, మరికొందరు శ్రుతి మార్గాలలో, కొందరు మంత్రతంత్ర వ్యాపారాలలో , ఇంకా కొందరు వివిధ కళాకౌశలాలలో సంసక్తులై, వాటిలోనే క్షయించి మరల జన్మయెత్తుతూ కొట్టుమిట్టాడుతున్నారు. అయినా, మోహంతో ఇదంతా అక్షయం, నిత్యం అనే ధైర్యం వారిని వదలదు. ఈ దేహం నానాటికీ ఆశలు పెరుగుతూ విషయాలనే ఘోరాపాయానికి గురి అయినది. ఈ సంసారం కౄరకామోద్రేకంతో, మోహావేశంతో భయంకరమైంది. కనుక వివేకవంతులు జన్మపరంపర అనే ఈ అవధిలేని వ్యాధి మరి తిరిగి రాకుండా హితకార్యాలు ఆచరించాలి" .

ఇలా భగవానుడు అనిత్య సంసార వివరణతో యుక్తంగా ధర్మోపదేశకుశలం శ్రోతలకు కలిగిస్తుండగా, దుస్సహమైన శైశవతారుణ్యాల నడివయస్సులో ఉన్న ఒక శాక్యవనిత రూపసౌభాగ్య గర్వంతో తన స్తనతటంపై రతిపతి యశస్సారం వలె వ్రేలాడుతున్న ముక్తాహారాన్ని మాటిమాటికీ కడగంటితో చూచుకుంటూ మురిసిపోతూ ఉన్నది. తన హారం చూచుకుంటున్న ఆమెను చూచి శశిప్రభ కోపం వచ్చి "అయ్యో! ఈ చపలురాలు ధర్మోపదేశంలోను తన హారమే చూచుకుంటున్నది. ఈ వస్తువులు క్షణికాలని చెబుతున్న విషయాన్ని ఈ మూఢురాలు వినకుండా ఉంది. నా ముక్తాహారం ఈమెకు చూపి ఈమె హారదర్శనోత్సాహం అణచివేస్తాను. సామాన్యంగా దేహులకు తనవద్ద ఉన్నవాటికంటే మేలైనవాటిని చూస్తే గర్వం అణుగుతుంది" అని అనుకొని, రోహిక అనే తన దాసిని పిలిచి "రోహికా! ఇంటికి వెళ్ళి త్వరగా నా ముక్తాహారం తీసుకురా." అని ఆదేశించింది.

ధర్మశ్రవణం జరుగుతున్నప్పుడు తన యజమానురాలు చేసిన ఆజ్ఞను ఆ దాసి విని ధర్మశ్రవణం మధ్యన, ఆ సమయంలో వెళ్ళవలసివచ్చినందుకు ఉద్విగ్నతతో నిట్టూర్చి "అయ్యో! నాకీ సదుపదేశకుశలంలో విఘ్నం కలిగిందే. పరాయత్త జీవితను కావడం వల్ల ధర్మోపదేశం వినలేకపోతున్నాను. పుణ్యసౌరభ భరితమూ, కారుణ్య కేసరాకీర్ణమూ అయిన బుద్ధదేవుని ముఖపద్మంనుంచి ఉపదేశ మకరందం పొందగల భాగ్యం ధన్యులకే లభిస్తుంది. లోకంలో సేవావృత్తి జీవులకు దుఃఖంలో దుఃఖపరంపర వంటిది. సేవావృత్తి స్వేచ్ఛను నాశనం చేస్తుంది; సుఖానికి భంగం కలిగిస్తుంది; దేహాన్ని ఆయాసపెడుతుంది. సేవాప్రయాసతో సంపాదించిన ధనమానకణాలు వేడినిట్టూర్పులకు సలసల కాగుతాయి. వాటిని అనుభవించడమే కష్టం. తన యజమానుని చూచిన వెంటనే సేవకునికి కలిగే ఫలమేమిటంటే- మానగ్లాని, గుణమ్లాని, కాంతిహాని, శ్రమాను. సేవ అనేది కాళ్ళకు ఇనుపసంకెల; సులభంగా చీటికిమాటికి అవమానం కలిగించేది; స్వవ్యాపారాన్ని ఎన్నటికి చేసుకోనీని మహావిఘ్నం; నిద్రాసుఖాన్ని నిర్మూలించేది; మన కోరికలెన్నటికీ ఫలించని విశాలజాలమార్గం వంటిది; సత్సాంగత్యానికి పిడుగు; శరీరాన్ని క్షయింపజేసేది: ముగ్ధులైనవారిని ఎండమావులవలె ఊరించే మరుస్థలి" అని ఆలోచిస్తూ నిదానంగా బయలుదేరింది. సేవకవృత్తిలో దేహం అమ్ముకున్నవారికి స్వేచ్ఛగా ఉండడం ఎక్కడిది?



అలా కష్టంతో వెళ్ళుతున్న దాసిని చూచి కరుణాకులుడై భగవానుడు దివ్యదృష్టితో క్షణం ఆలోచించి, "ఈమెకు ఈ జన్మలో మిగిలిన జీవితావధి ముగిసింది. నేనే ఈ దీనురాలిని ఉద్ధరించాలి"-అని నిశ్చయించుకున్నాడు. రోహితక వెళ్లుతున్న దారిలో ఒక ఆవు, దూడ నిలబడి ఉన్నాయి. త్వరగా వెళ్లుతున్న ఆ రోహితకను ఆవు చూచి తన దూడకు అపాయం కలిగిస్తుందేమోననే అనుమానంతో కర్మవశాత్తు ఆమెను కొమ్ములతో కుమ్మింది. అప్పుడు ఆ దాసికి బుద్ధదేవుని అనుగ్రహం వల్ల , జన్మాంతర సంస్కారం వల్ల బుద్ధుని సంస్మరణతో అతనియందు మనస్సు లగ్నమై ప్రణిధానం ఏర్పడింది. ఆహా! కర్మ తరంగాలు చెలరేగే ఈ సంసార మకరాకరంలో జన్మలనే సుడిగుండాలలో ప్రాణులు మునిగి తేలుతూ ఉండడం ఆశ్చర్యకరం. ప్రాణుల ఫాల ప్రదేశాలనే విపుల శిలాఫలకాలపై క్షేమకరం కాని కర్మ అనే రాతి ఉలితో జన్మమరణాక్షరాలు చెక్కి ఉన్నాయి. ఇవి చేత్తో తుడిచివేస్తే పోయేవా? అంతా కర్మాయత్తం! దానివల్లనే ప్రాణులకు నెమలిపురిలోని రంగుల పరిణామంలాగ చిత్రవిచిత్రమైన పరిణతి కలుగుతుంది. గర్భారంభంలోను, జన్మలోను, క్రమంగా పెరుగుతున్నప్పుడూను, తుదకు మరణంలోను దానిపరిణామ కాంతులే కనిపిస్తాయి. మరేవీ కించిత్తు కూడా కనిపించవు. పిదప ఆ దాసి తనపూర్వపు ఉచ్చనీచదశలను తలపోసి తన అనుపమదాసభావానికి లజ్జపడినదా అన్నట్లుగా , నిశ్చలురాలై విశుద్ధ ప్రణిధానంతో ధర్మవిమలమైన బుద్ధి లగ్నం చేసి ఈ సంసారం ఎడ సంశయంచేతనా అన్నట్టు మలినమైన జీవితాన్ని వదలింది.

పిదప కొంతకాలానికి ఆమె స్వర్గసంపదలకు సన్నిహితమైన సింహళద్వీపంలో పాలకడలిలో చంద్రరేఖవలె ద్వికాంతితో సింహళాధిపతికి పుత్రికగా జనించింది. ఆమె జన్మసమయంలో ఆకాశంనుంచి ముత్యాలవాన కురవడం వల్ల తండ్రి ఆమెకు ముక్తాలత అని పేరు పెట్టాడు. ఆమె పుణ్యం వలె లావణ్యంతో అభివృద్ధి చెందుతుండగా, ఆమె అంగాలు వివేక విలసితమైన సంతోషం వలె యౌవనం పొందాయి.

ఇది ఇలా ఉండగా, ఒకానొకప్పుడు శ్రావస్తీపురవాసులైన కొందరు వర్తకులు సముద్రం దాటి సింహళ ద్వీపానికి వచ్చారు. వారు రాజాంతఃపుర సమీపంలో విడిసి, ధర్మగాథా పరిపూర్ణమైన బుద్ధదేవుని ప్రబోధాలను చెప్పుకుంటూ రాత్రి గడిపారు. అంతఃపురసౌధంనుంచి రాజపుత్రి వారి బుద్ధోపదేశగాథలను వీనుల విందుగా విని, వారిని పిలిచి, "రాత్రి మీరు సంభాషించిన విషయం ఏమిటి?" అని సంతోషంతో ప్రశ్నించింది. వారు "అమ్మా! అది బుద్ధదేవుని భాషితం. సర్వదయానుకంపి అయిన ఆ భగవానునికి ఆ భాషితం స్వభావార్హమైంది" అని సమాధానమిచ్చారు. బుద్ధుడనే పేరు వినగానే ఆ రాజకుమారికి శరీరం పులకాంకితమై సంవిద్ జ్ఞానభవ్యానుభావం కలిగింది. మేఘగర్జనం విన్న మయూరివలె ఆమె ముఖమెత్తి "మహాభాగులారా! ఈ బుద్ధభగవానుడెవరు?" అని మరల ప్రశ్నించింది. ఆమె శ్రద్ధకు వారు సంతోషించి ఆదరంతో పుణ్యమయమైన భగవచ్చరితాన్ని పూర్తిగా తెలియజేశారు. ఆమె ఆ కథను విని ప్రాగ్జన్మకుశల జ్ఞానం కలిగి భగవానునికొక విజ్ఞప్తిలేఖ వ్రాసి వారి చేతికిచ్చింది.

ఆ వర్తకులు తర్వాత కొంతకాలానికి సముద్రం దాటి నిజపట్టణం చేరి, బుద్ధభగవానునికి ప్రణామం చేసి, ముక్తాలతా వృత్తాంతం నివేదించి, ఆమె పంపిన లేఖను అందజేసారు. సర్వజ్ఞుడైన బుద్ధదేవుడు అంతకు ముందే ఆ విషయం తెలుసుకున్నప్పటికీ, కృపతో ఆమె లేఖను చదువుకొన్నాడు. "భగవన్! మీనామ సంస్మరణమే సత్పురుషులకు పుణ్యపణ్యమూ, వ్యసనతాపతృష్ణాపహమూ, భవరోగ దివ్యౌషధమూ అవుతున్నది. మీ కథాక్రమశ్రవణంతోనే నాకు సంవిద్జ్ఞానం ఉదయించింది. ఆ జ్ఞానాస్వాదనమే నాకు గొప్ప అమృత ప్రవాహం" అనే ఆ లేఖార్థాన్ని బుద్ధదేవుడు గ్రహించి మందస్మితం చేశాడు. ఆ మందహాస కాంతులతో దిక్కులకు సత్త్వప్రకాశం కలిగింది. పిదప భగవానుడు చిత్రకారులకు కూడ అశక్యమై ప్రభావపూరితమైన తన చిత్రపటాన్ని ముక్తాలతకు పంపించాడు.

ఆ వర్తకులు ఆయన ఆజ్ఞతో మరల ఓడెక్కి సింహళద్వీపం చేరి రాజపుత్రి అయిన ముక్తాలతను చూచి, ఆమెకు బుద్ధదేవుని చిత్రపటం అందించారు. ఆమె ఆ చిత్రపటాన్ని హేమసింహాసనంపై ఉంచింది. జనులు ఆ చిత్రపటంలోని తథాగతుని రూపం దర్శించి తన్మయధ్యానంతో ఏకీభావం పొందారు. ఆ చిత్రపటంలో అడుగున శరణ్యాలయిన మూడుగతులు; ఐదు శిక్షాపదాలు; ప్రతీత్యసముత్పాదము యొక్క అనులోమక్రమం, ప్రతిలోమక్రమం, పరమామృత నిర్భరమైన ఆర్యాష్టాంగమార్గం లిఖించి ఉండడం పుణ్యవశాత్తు కనిపించింది. ఆ పటంపైన భగవానుడే స్వయంగా కనకాక్షరాలతో లిఖించిన భావనాయుతమైన సుభాషితమూ కన్నుల పండువుగా కనిపించింది. ఆ సుభాషితమిది: "జనన మరణ క్లేశావేశంతో ఘోరంగా బాధపడుతున్న ఓ జనులారా! క్రూరవిషయవ్యాలావళులు తిరుగుతూ, తారుణ్యమనే అంధకారం కమ్మిన ఈ మోహగృహం నుంచి వెలుపలికి నడిచి బౌద్ధధర్మం శరణు పొందండి. సంసారభయం మీకు ఉండదు."

ఆ పుణ్యమయమైన బుద్ధ ప్రతికృతిని చూస్తున్న రాజకుమారి అనాదికాల సంచితమైన అజ్ఞానవాసన వీడిపోయింది. ఉన్నతమైన ఆకృతితో మెరిసిపోతున్న బంగారుకాంతిగల మేనితో సుందరమైన భుజస్కంధాలతో, అభిరామమైన ఆజానుబాహువులతో, ధ్యాననిష్ఠతో అర్ధనిమీలితమైన నేత్రాలతో, లావణ్యధారవలె ఉన్న ఉన్నతమైన నాసికతో, ఆభరణశూన్యమైన దీర్ఘకర్ణయుగంతో, స్వభావరమణీయంగా ప్రకాశిస్తు లేచిగురుటాకువంటి అరుణవల్కలం కప్పుకొని సంధ్యాకాలమేఘం కమ్మిన మేరుపరత్వంలాగ ఒప్పుతూ, తన కాంతితో దిక్కులకు శీలం ఉపదేశిస్తున్నట్లు, ముఖచంద్రునినుంచి ఆనందామృతం వర్షిస్తున్నట్లు, క్షమకే క్షమాగుణాన్ని నేర్పుతున్నట్లు ఉన్న ఆ సుందరమూర్తిని ఆ పుణ్యవతి చూచి ప్రణామం చేసి, నిస్సారమైన శరీరంపైని వాంఛను తొలగించుకొని, శ్రేష్ఠమైన సత్త్వానుభూతిని పొందింది. ప్రణామం చేసినప్పుడు ఆమె కర్ణోత్పలం జారిపోవడం చూడగా ఆమె నిస్సారమైన శరీర వాంఛను వదలివేస్తున్నట్లు తోచింది. ఆమె వెంటనే బోధిభావం పొంది, శ్రోతాపత్తిఫలం కలిగించే సుగతుని ప్రభావాన్ని తలపోస్తూ హర్షవిస్మయాలతో "ఆహా! తన భాసుర శరీరకాంతితో మహామోహతమస్సులను దూరం నుంచే హరించిన తథాగతుడు ఎలాగో నా యీ కుశలచిత్తాంబుజానికి వికాసలక్ష్మిని కలిగించాడు. ఈ భవసాగరం దాటాను. ఉత్తమ ప్రణిధానం కలిగింది. క్షణంలో అతఃకరణం ప్రసన్నమైంది. తృష్ణాపరితాపశాంతికోసం శాంతామృత తరంగాలు చెలరేగుతున్నాయి" అని భగవానునికి ముక్తాదులు కానుకగా సమర్పించి, సంఘపూజ చేసి వర్తకులను వీడ్కొల్పింది.



అనంతరం వర్తకులు మహోదధి దాటి బుద్ధదేవుని సన్నిధికి వచ్చి నమస్కరించి, రాజకుమారి ముక్తాలత కానుకగా పంపిన ముక్తారత్న సమూహం ఆయనకు సమర్పించి సింహళద్వీపంలో జరిగిన వృత్తాంతం విన్నవించారు. అది విని ఆనందుడనే భిక్షువు 'ఏమిటిది?' అని అడుగగా, తథాగతుడు ఇలా అన్నాడు: "పూర్వం శాక్యగృహంలో ఉండే రోహితక అనే దాసి సత్కర్మ ప్రణిధానంతో ముక్తాలతగా జన్మించింది. పూర్వం వారాణసిలో మహాధనుడనే వణిక్ శ్రేష్ఠుడుండేవాడు. అతనికి పుణ్యవతి అయిన రత్నవతి అనే భార్య ఉండేది. ఆమెకు పిల్లలు లేరు. ఆమె భర్త కాలధర్మం చెందగా, ఒక స్తూపశ్రేష్ఠాన్ని పూజించి భక్తితో ఒక అమూల్యహారం సమర్పించింది. ఆ పుణ్యపరిపాకం చేత సింహళాధిపతికి పుత్రికగా ముక్తాలత అనే పేరుతో జన్మించి పరినిర్వాణం చెందింది. ఆమే మరొక జన్మలో ఐశ్వర్య మదమత్తురాలై పూజను అధిక్షేపించింది. ఆ కారణంగా మరుసంవత్సరమే దాసిగా పుట్టింది. మానవుడు తాను చేసిన శుభాశుభ కర్మానుసారంగా ఈ లోకంలో జన్మలు పొంది వాటికి అనుగుణమైన పరిణతిఫలాలు పొందుతాడు. నిఖిల కుశలాలకు మూలమైన ధర్మవల్లి నరులకు కీర్తి అనే ఉజ్జ్వలపుష్పాలను పూస్తూ, శుభఫలాలను ఇస్తుంది. కిల్బిష క్లేశమూలమైన అధర్మ విషవల్లి మానవులను భ్రమకూపంలో తోసి మోహాంధకారం కప్పి అనంతసంతాపం కలిగిస్తుంది. జనులారా! తీక్ష్ణతర మరుభూమిలాగ విస్తరించి కాలుతున్న ఈ సంసార మార్గంలో తీవ్రసంతాపాలు కలుగజేసే పాపాలు విడిచిపెట్టండి. ఎల్లప్పుడూ పుణ్యమే చేయండి. అలాటి పుణ్యకార్యం చేసేవారి మార్గం పుణ్యామృతంతో తడిసి, పుణ్యచ్ఛాయావృక్షాలతో చల్లగా ఉంటుంది.!

ఇలా బుద్ధభగవానుడు సత్ప్రణిధానఫలం చెబుతూ భిక్షువులకు భక్తిని ఉపదేశించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ముక్తాలతావదానమనే ఏడవ పల్లవం.

## 8. శ్రీగుప్తావదానం

ఉత్తమాశయుల మనస్సు అపకారం చేసినవారిపై కూడ కృపాయుతంగాను, క్రూరునిపై కూడ పల్లవకోమలంగాను, ద్వేషతప్తుడైన వానిపై కూడ అతిశీతలంగాను ప్రవర్తిస్తుంది.

పూర్వం సురపురం వలె గొప్పదైన రాజగృహమనే పట్టణం ఉండేది. దానిలో కుబేరునితో సమానుడైన శ్రీగుప్తుడనే గృహపతి ఉండేవాడు. అతడు ధనమదంతో సదా గర్వించి సుగుణాలు గిట్టక, సజ్జనులను ద్వేషిస్తూ, ఉత్తముల బుద్ధిని పరిహసించేవాడు. లక్ష్మి కఠినులు, అతివక్రులు, శూన్యులు, వాచాలురు అయిన ఖలులపైనే శంఖాలపై చూపినట్లు దాక్షిణ్యం చూపడం సహజం! శంఖాలు కఠినంగాను, వక్రంగాను, శూన్యంగాను, వాచాలం(మోగేవి)గాను ఉంటాయి. అవి దక్షిణావర్తాలయితే లక్ష్మీనివాసమౌతాయి.

ఒకప్పుడు శ్రీగుప్తుని ఇంటికి దుర్మార్గుడైన క్షపణకుడు వచ్చాడు. అతడు శ్రీగుప్తునికంటె పెద్ద, అతనికి జ్ఞాతిపుత్రుడు. అతడు శ్రీగుప్తునితో స్వేచ్ఛగా ఇష్టాగోష్ఠి జరుపుతున్నప్పుడు పుణ్యకార్యాలను ద్వేషించేవాడు గనుక ఇలా అన్నాడు: "గృధ్రకూటమనే పర్వతంలో సుగతుడు భిక్షుసంఘ పరివేష్టితుడై ఉంటున్నాడు. అందరూ సర్వజ్ఞుడు, సర్వజ్ఞుడు అనడం వల్ల అతడు త్రిజగత్పూజ్యుడైపోయాడు. అతనిలో భవ్యమైన ప్రతిభ ఏది మనకు కనిపించదు. మూర్ఖులు అతనిని భగవానుడు, భగవానుడు అని అంటూ గొప్పచేశారు. ఇలాటి ప్రసిద్ధ విషయాలలో ప్రజలెప్పుడూ ప్రాయశః ఇతరులు చెప్పినదానినే విచారణ చేయకనే గతానుగతికంగా తామూ చెబుతూ ఉంటారు. అతని వ్రతాది నియమాలన్నీ కేవలం ఆడంబరం, బూటకమనే నా అభిప్రాయం. కొంగ ఒంటికాలిపై మౌనంగా జపం చేయడం చేపలను మెక్కడం కోసమే కదా? కనుక, అతనిని అపహసించడానికి ఏదైనా వంచన చేద్దాం. ధూర్తులను వంచిస్తే ఇతరులు కూడా సంతోషిస్తారు."

ఆ క్షపణకుని మాటలు విని కర్మపాక విమోహితుడైన శ్రీగుప్తుడు పాపగర్తంలో పడడానికి అతడు చెప్పిన ఉపాయం ప్రకారం నడుచుకున్నాడు. తన ఇంట్లో ఒకగుంట తవ్వి దాని నిండ చంద్రనిప్పులు పోసి మూసిపెట్టి, విషమిశ్రితమైన భోజ్యపదార్థాలు సిద్ధపరచాడు. తర్వాత బుద్ధదేవుని సన్నిధికి వెళ్ళి మిథ్యాభక్తితో ఆయనను తన యింటికి విందుకు ఆహ్వానించాడు. సర్వజ్ఞుడైన బుద్ధుడు అంతా గ్రహించి, మందహాసంతో 'సరే' అని అతని ఆతిథ్యానికి అంగీకరించాడు. శ్రీగుప్తుడు ఇంటికి తిరిగి వచ్చాడు. అతని భార్య అగ్ని విష ప్రయోగాలనే అతని అకృత్యాలకు కోపగించుకొని సద్ధర్మం ఉపదేశించింది. శ్రీగుప్తుడు ఆ మాటలకు కినిసి, తన రహస్యం బట్టబయలు అవుతుందనే అనుమానంతో ఆమెను ఇంట్లో ఒకచోట కట్టివేశాడు.



ఈ సంగతులన్నీ తెలిసినప్పటికీ భగవానుడు జగద్వంద్యులైన చతుర్ముఖాది దేవతలు కొలువగా శ్రీగుప్తుని ఇంటికి వచ్చాడు. ఇంతలోగా శ్రీగుప్తుని దుష్టకార్యం నగరప్రజలలో పొక్కింది. పాపుల పాపకర్మలు ఎంత కప్పిపెట్టినా దాగవు; దిక్కులకు పరుగెత్తుతాయి. ఈలోగా ఒక ఉపాసకుడు భగవానుని సమీపించి, ఆయన చరణద్వయంపై పడి, నిప్పును, విషాన్ని తలపోస్తూ ఇలా విన్నవించాడు: "భగవన్! ఈ శ్రీగుప్తుని వినయం కృత్రిమం. ఇతడు తియ్యగా మాట్లాడుతూ రహస్యంగా అగ్ని విషాన్నప్రయోగాలు చేయదలచాడు. ఈ దుర్జనుణ్ణి ఏవిధంగానైనా పరిహరించండి. అనార్యుడు కుహనామాధుర్యంతో ప్రవర్తిస్తున్నప్పుడు, వానిని నమ్మి ఏపనీ చేయరాదు. తేనెపూసిన కత్తిని మింగితే పేగులు తెగిపోతాయికదా! గుణద్వేషి అయిన దుష్టుడు గుణవంతుల ప్రశంసను సహించడు. సజ్జనులకు సంతోషకారణమైంది దుర్జనులకు కోపకారణమౌతుంది. లోకత్రయ నేత్రపద్మవికాసి అయిన మీరు ఈ రాహువు ఇంట్లో ప్రవేశిస్తే జగత్తు గుడ్డిదైపోదా?" ఆ ఉపాసకుని మాటలు విని భగవానుడు మందస్మితకాంతులతో ఆ ఉపాసకుడు చేసిన శ్రీగుప్తుని తిరస్కారాంధకారాన్ని దూరంగా తొలగిస్తున్నాడా అన్నట్లు ఇలా అన్నాడు: "అగ్ని నా దేహాన్ని స్పృశించదు. విషం నన్ను బాధించదు. పరద్వేష దరిద్రులను ఇతరులద్వేషమేమీ ఉపద్రవపెట్టదు. అరోషశీతలమూ, శమామృతసిక్తమూ అయిన మనస్సు కలిగి, విషయాలను ద్వేషించేవానిని నిప్పు ఏమి చేస్తుంది? విషమేమి చేస్తుంది? ద్వేషదోషం పొంగినవారికి అమృతం విషమౌతుంది; కుసుమం కులిశమౌతుంది; చందనం చంద్రనిప్పవుతుంది; తిర్యగ్యోనిలో జనించిన ప్రాణి అయినా బోధిసత్త్వస్థితి పొంది కారుణ్యం, మైత్రి కలదయితే దాని శరీరాన్ని నిప్పు కాల్చదు. పూర్వం కళింగనృపతి మృగసంఘాలను తగ్గించదలచి ఖండద్వీపమనే అరణ్యానికి చిచ్చుపెట్టాడు. ఆ అరణ్యంలో ఉన్న ఒక తీతువుపిట్ట మైత్రితో బోధిని అవలంబించి చిచ్చు చల్లార్చింది. కనుక ద్రోహచింతలేని మనస్సు కలవారికి ఎప్పటికీ భయం లేదు. సత్త్వసంపత్తికి ఉదాహరణంగా మరొక వినోదకరమైన విషయం చెబుతాను విను: ఒకానొక కాలంలో ఒక ముని ఉండేవాడు. అతని ఆశ్రమంలో మనుజభాషణం ఎరిగిన ఒక కుందేలు చాల కాలంగా వసించేది. ఒకప్పుడు అనావృష్టి వల్ల కాటకం ఏర్పడింది. కందమూల ఫలాలు దొరకనందున ముని ఆకలితో క్షీణించిపోయాడు. అప్పుడతని వ్యథను ఆ కుందేలు సహించక దృఢసంకల్పంతో ఆ మునిని చూచి "భగవన్! నా మాంసంతో ఇప్పుడు మీ ప్రాణాలు కాపాడుకోండి. శరీరం సకలధర్మ సాధనం. కనుక రక్షణీయమైనది" అని అంటూ ఆ ముని వాత్సల్యంతో ఎంతవద్దన్నా వినక తన శరీరాన్ని దావాగ్నిలో పడవేసింది. దాని సత్త్వ ప్రభావంతో మండుతున్న జ్వాలలుగల దావాగ్ని తుమ్మెదలు ఝుమ్మనే మనోహరాంభోజవనంగా మారిపోయింది. కుందేలు దివ్యశరీరంతో ఆ కమలాలపై నిలబడింది. మునులందరూ దానికి ప్రణామాలు చేశారు. అది వారికి ధర్మోపదేశం చేసింది. ఈ విధంగా బోధిజ్ఞాన ప్రవృత్తులకు అగ్ని భయంగాని, విషభయంకాని లేదు" అని అంటూ బుద్ధదేవుడు శ్రీగుప్తుని భవనానికి వెళ్ళాడు.

బుద్ధదేవుడు శ్రీగుప్తుని ఇంట్లో కుడికాలు పెట్టగానే అగ్నికుండం తుమ్మెదలు మధురంగా ఝుంకరించే కమల సరోవరంగా మారిపోయింది. భగవానుడు ఆ తామరపూలపై ఆసీనుడయ్యాడు. శ్రీగుప్తుడు అది చూచి, భగవానుని కృపాదృష్టితో తన కలుషాలు కూలిపోగా, ఆయన చరణద్వంద్వంపై

పడి "భగవన్! నా పాపకృత్యం మన్నించు. మోహకూపంలో పడినవారిపైనే సజ్జనులు ఎక్కువగా కరుణ చూపడం సమంజసం. నా దుష్టమిత్రుడొకడు అవివేకంతో ఈ పాపిష్ఠిపనులు చెప్పాడు. మీకు సమర్పించదలచిన భోజ్య పదార్థాలలోను విషం కలిపాను. అయ్యో! ఇప్పుడు నాకే పశ్చాత్తాపమనే విషం వ్యాపించింది. మీ స్మరణమే నన్ను కాపాడాలి" అని కన్నీరు ధారకట్టగా విన్నవించాడు. కృపానిధి అయిన బుద్ధదేవుడు శ్రీగుప్తుని చూచి భిక్షుసంఘం వింటుండగా ఇలా అన్నాడు. "ఓయీ! సాధూ! దుఃఖపడవద్దు. మాకు నీపై వైముఖ్యమేమీ లేదు. ఘోరమైన వైరవిషం త్యజించడం వల్ల మాకు విషం తాపం కలిగించదు.

"పూర్వం వారణాసిలో శ్రీమంతుడైన బ్రహ్మదత్తుడనే రాజు ఉండేవాడు. అతనికి ప్రాణ సమాన అయిన అనుపమ అనే పత్ని ఉండేది. ఆమె ఒకనాడు ఆ పుర ప్రాంతవనంలో ఉండే సువర్ణభాసమనే నెమలి కేక విన్నది. వేణు వీణాస్వన సదృశమైన ఆ కేకను విని ఆమె కుతూహలంతో 'ఏమిటిది?' అని నరనాథుణ్ని అడిగింది. "ఈ పుర ప్రాంతవనంలో రత్నాల రెక్కల నెమలి ఒకటుంది. ఇది దాని మధుర కూజితం. ఈ ధ్వని యోజనాల పర్యంతం వినిపిస్తుంది" అని రాజు సమాధానం చెప్పాడు. "దాన్ని చూడాలని ఉంది. పట్టి తెప్పించండి" అని ప్రేమతో అనుపమ కోరింది. రాజు నవ్వి "వెర్రిదాన, అలాటి అద్భుతరూపంగల దానిని చూడడం దుర్లభం. నీవు నిర్బంధిస్తే దానికోసం ప్రయత్నించి చూస్తాను" అన్నాడు. పిదప దానిని పట్టుకొని రావడానికి రాజు పక్షులను పట్టేవారిని-దానిని చంపగూడదనే మాట తీసుకొని పంపాడు. స్త్రీలు వీడు వశుడా కాడా అని కంటితోనే పరీక్షించి, అనురాగాహతుడైనవానితో చేయరాని పనులు కూడ చేయిస్తారు. ప్రౌఢురాలయిన పత్నికి ప్రణయంతో వశుడైనవాని బుద్ధి, ధృతి, స్మృతి, కీర్తి ఆ ప్రియురాలకి పాదపీఠాలుగా పరిణమించి ఆమెపై ఈర్ష్యపడుతున్నవా అన్నట్టు నశిస్తాయి.

"తర్వాత శాకునికులు వనానికి వెళ్ళి ఆ మయూరరాజాన్ని పట్టడానికి వలలు విసిరి ఉచ్చులు వేశారు. కాని, అవి ఎన్నిసార్లు విసిరినా జారిపోయేవి. తమ యత్నం విఫలమైనందుకు వారు విచారపడుతూ, రాజు ఏమి చేస్తాడో, ఏమి శిక్ష విధిస్తాడో అని భయపడసాగారు. వారిని చూచి మయూరరాజు కరుణ కలిగి "అయ్యో పాపం వీరు జాలోపజీవులు. నన్ను పట్టుకొనకపోతే క్ష్మాపాలుడు క్రూరంగా శిక్షిస్తాడని భయపడుతున్నారు" అనుకొని "రాజునే పిలుచుకొని రండి పట్టుబడి వస్తాను" అని వారికి స్పష్టవాక్కులతో చెప్పింది. వారు తిరిగివెళ్ళి రాజుకు ఈ సంగతి తెలిపారు. రాజు సంతోషంతో వారివెంట వనానికి వెళ్ళాడు. రత్నచ్ఛదమయూరం తనంతట తాను పట్టుబడి రాజు వెంట వచ్చింది. రాజు దానిని అంతఃపురంలో పెట్టి భార్యతో సహా దానిని గౌరవంతో, ఆదరంతో చూడసాగాడు. అది కూడ చాల పరిచయంతో మెలగుతూ స్నిగ్ధశ్యామలాంబుదకాంతులీనే తన రెక్కల సౌరుతో ఆ రాజు నీలమణిమయభవనాలకు ఇంద్రధనస్సు అందాలు కలిగిస్తూ ఉండేది.

"ఇలా ఉండగా ఒకప్పుడు ఆ వసుధాధిపతి దిగ్విజయ యాత్రకు వెళ్ళుతూ ఆ నెమలికి ఉపచారం చేయవలసిందిగా రాణికి ఆదరంతో పదేపదే చెప్పాడు. భర్త వెళ్ళగానే రూప యౌవన దర్పాంధురాలైన ఆ అనుపమాదేవి కులమర్యాదను కూలదోసి తప్పుకు ఒడిగట్టింది. ఒక యువకుని చూచి ఆమె రాగిల్లి మరులుకొనగా, భయపడినదా అన్నట్టు లజ్జ దూరంగా తొలగిపోయింది.



చపలాక్షుల పద్ధతి మలినము, కుటిలము, తీక్ష్ణము, కర్ణసంస్పర్శనోచితమూను. పైకి చూడగా ఇదీ సుదృశులైన ఉత్తమురాండ్ర పద్ధతీ సమానమేనని తోస్తుంది. కాని, చపలాక్షులు పద్ధతిని తలచుకొని మనం తప్పు తప్పు అని చెవులు పట్టుకోవలసి వస్తుంది. ఈ సంసార మకరాకరంలో వివిదోన్మాదకారిణులైన కాలకూట విషజ్వాలలవలె ప్రాణాలు హరించే స్త్రీలు ఉంటారు. స్త్రీల మనస్సు కుసుమంకంటె సుకుమారం; రంపంకంటె క్రూరం. దాని విచిత్ర వైఖరిని ఎవరు వింగడించి తెలుసుకోగలరు? విలాసవతి అయిన ప్రియురాలిని కౌగిలించుకొని సంతోషించేవారు చల్లని తెల్లని నున్నని కత్తిని మింగేవారి వంటివారు.

"కామం కండ్లకు ఎక్కగానే రాణి ఇలా అనుకుంది: 'ఈ మయూరం శీలం తెలిసినది. మనుష్యభాష తెలిసినది; ఇది నా అంతఃపురంలో నాకు శల్యంగా ఉన్నది. ఇది నా ప్రవర్తనను తప్పక రాజుతో చెబుతుంది. నేను నింద్యమైన పనేమో చేశాను. ఇప్పుడు ఏమి చేయను? పాపకర్మ చేసిన నాకు తత్త్వం తెలిసి, చతురబుద్ధి కలిగి నా మర్మం ఎరిగిన ఈ నెమలిమీదే కాదు, ప్రతి జడపదార్థం మీదా శంక కలుగుతున్నది' ఇలా అనుకొని ఆమె ఆ నెమలికి విషాన్నం పెట్టింది. రాగమత్తలై ఖలాయత్తలైన స్త్రీలు ఏమేమి పనులు చేయరు? ఆమె విషాన్న పానాలు పెట్టి ఉపాచారాలు చేసినకొద్దీ ఆ మయూర రాజంకాంతి హెచ్చి మరిత అందచందాలు సంతరించుకుంది. రాణి మయూరం చావక స్వస్థంగా ఉండడం చూచి తన గుట్టు బట్టబయలవుతుందనే శంకతో భయపడి, శోకరోగ గ్రస్తురాలై ప్రాణాలు వదలింది. ఈ విధంగా ఆ నెమలికి విషంతో ఎలాటి కష్టమూ కలుగలేదు.

"రాగమనేది ఒక విషం. మోహమనేది మరొక విషం. ద్వేషమనేది విషమమైన ఇంకొక విషం. బుద్ధుడు, ధర్మం, సంఘం, సత్యం- ఇవి పరమామృతం. మోహమహాంబురాశి, ఘోరమైన విషం పుట్టిస్తుంది. రాగమనే మహోరగం ఘోరమైన విషం కక్కుతుంది. వైరమనే వనావని ఘోరమైన విషం పుట్టిస్తుంది. ఈ విషయవిషం పుట్టేక్రమం మరొకటి లేదు. ఈ శ్రీగుప్తుడు అధర్మరతుడై మరొకజన్మలోను ఇలాటి అగ్నికుండమే తవ్వించాడు. అప్పుడామె ఇతని సహధర్మిణి."

భగవానుడు ఈ విధంగా చెప్పి కరుణాలోకన జలాలతో శ్రీగుప్తుణ్ని రజోరహితుణ్నిగా చేసి, తన శాసనోన్ముఖుణ్ణిగా చేశాడు. తర్వాత శ్రీగుప్తుడు కుశలజ్ఞానంతో ప్రకాశపదవీ ప్రాప్తికోసం త్రిశరణ మార్గాలను స్మరిస్తూ విమలజ్ఞానం పొంది బుద్ధుని పరిచయానుగ్రహంతో పుణ్యధామం చేరాడు. సత్పురుషుల పవిత్రవీక్షణం మహత్కల్యాణాన్ని, ప్రమోద సుఖాలను కలిగిస్తుందికదా!

ఈ విధంగా బుద్ధభగవానుడు తనను అవమానించి పాపం చేసిన శ్రీగుప్తుని అజ్ఞానమోహం పోగొట్టి, కారుణ్య పుణ్యపూర్ణుడై అనుగ్రహించి, భవసంక్షయానికి, ఈ బంధభవనమైన సంసారంలో మరల భవగ్రంథులు నివారించడానికి నిర్వైర తే పరమసాధనమని భిక్షువులకు ఉపదేశించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శ్రీగుప్తావదానమనే ఎనిమిదవ పల్లవం.

# 9. జ్యోతీష్కావదానం

ధన్యులైన సజ్జనులకు అశుభం కూడ భవ్యస్వభావ సముద్భూతమైన శుభంగా పరిణమిస్తుంది. మూర్ఖులకు కుశలం కూడా అహితమై పోతుంది. ఇది ప్రపంచంలో కనిపిస్తున్న తీరు. అడవులలో రాత్రి కమ్ముకున్న చీకటిని మహాకాంతిప్రదమైన ఓషధి పటాపంచలు చేస్తూ అంతటా ప్రకాశం వ్యాపింపజేస్తుంది. కాని దానిని గూబల గుంపు చూడలేక పోతుంది.

పూర్వం బింబిసారభూపతి రాజధాని అయిన రాజగృహమనే నగరంలో సుభద్రుడనే పౌరుడు ఉండేవాడు. అతడు పరిపూర్ణమైన గృహస్థితి కలవాడు. ఏ దర్శనమన్నా సరిపడని మోహావిష్టుడైన అతనికి క్షపణకులపై (జ్యోతిష్కులపై) మాత్రమే మూర్ఖపు గురి ఉండేది. అతని భార్య సత్కుల సంజాత. ఆమె పేరు సత్యవతి. ఆమె పూర్ణ చంద్రబింబంతో ఒప్పే పూర్వదిక్కువలె గర్భవతి అయింది. అప్పుడు ఒకసారి కలందకనివాసమనే వేణువనంలో ఉన్న బుద్ధభగవానుడు అతని యింటికి భిక్షకు వచ్చాడు. అతడు భార్యతో సహా ఆయనకు పూజ చేసి "నా భార్య గర్భంలో ఉన్న శిశువు ఎలాటిది? ఏ రూపంలో పుడుతుంది?" అని ప్రశ్నించాడు. దానికి భగవానుడు "నీ పుత్రుడు దివ్య మానుష సంపదలను అనుభవించి, నా ఆజ్ఞతో సన్యాసి అయి, ముక్తిని పొందుతాడు" అని స్పష్టంగా చెప్పి నిజాశ్రమానికి వెళ్ళిపోయాడు.

బుద్ధదేవుడు వెళ్ళిన తరువాత ఆ గృహపతి యింటికి భూరికుడనే క్షపణకుడు వచ్చాడు. సుభద్రుడు బుద్ధదేవుడు చెప్పిన మాటలను ఆ క్షపణకునికి తెలియజేశాడు. ఆ మాటలు విని క్షపణకునికి ద్వేషవిషం పాకింది. గ్రహ విజ్ఞానంలో పరిశ్రమ చేసిన అతడు చాలసేపు ప్రశ్నను గుణించాడు. బుద్ధదేవుడు చెప్పినదే ప్రశ్నలోను తెలిసింది. "అతడు తన ప్రభావంతో చెప్పినది నిజం. సందేహం లేదు. కాని నా మాటలవల్లనే సుభద్రుడు బుద్ధుని సర్వజ్ఞత్వాన్ని తెలుసుకొంటే, శ్రమణులపై ఆదరం కలిగి, క్షపణకులపై శ్రద్ధ వదలుతాడు. కనుక అబద్ధం చెబుతాను" అని ఆ క్షపణకుడు ఆలోచించి, కోపంతో సుభద్రునితో ఇలా అన్నాడు: "సర్వజ్ఞమ్మన్యుడైన సుగతుడు చెప్పింది అబద్ధం. మానవుడు దేవార్హమైన దివ్యసంపదను ఎలా పొందుతాడు? ఈ శిశువు సత్యంగా సన్యసిస్తాడని ఆయన ఎలా ఊహించాడు? క్షుధాసంతప్తులై గత్యంతరంలేని దరిద్రులకు బాగా భిక్ష దొరికే శ్రమణవ్రతమేకదా శరణు. మీదు మిక్కిలి, ఓ గృహపతీ! నామాట నమ్మేట్లయితే విను. పుట్టబోయే ఈ శిశువు కులాన్ని సంతాపింపజేస్తాడు." ఇలా చెప్పి క్షపణకుడు వెళ్ళిపోయాడు.

తర్వాత క్షపణకుని మాటలను సుభద్రుడు ఆలోచించి, భార్యకు గర్భపాతం చేయడానికి బహువిధాల ప్రయత్నించాడు. ఎన్నిమందులిచ్చినా గర్భస్రావం కలుగకపోవడం చూచి రహస్యంగా పత్నిని గట్టిగా కొట్టి చంపివేశాడు. పిదప ఆమెను శీతవనమనే శ్మశానికి తీసుకొని వెళ్ళాడు. ఆ వార్త విని



క్షపణకులు సంతోషంతో గానం చేశారు. "ఆహా! భలే! ఇదేనా సర్వజ్ఞుడు ఈ శిశువుకు చెప్పిన జ్యోస్యం? శిశువు పుట్టకముందే తల్లి మరణించింది. గర్భంలోనే శిశువు మరణించింది. ఇదేనా ఈ శిశువుకు సర్వజ్ఞుడు చెప్పిన దివ్యమనుష్యత? ఇదేనా ఆయన చెప్పిన సన్యాసం?" అని క్షపణకులు పరిహాసం చేస్తూ అంతటా ప్రవాదం వ్యాపింపచేశారు. ఆ ప్రవాదం విని ప్రజలు తండోపతండాలుగా చూడడానికి శ్మశానానికి వచ్చారు.

ఈలోగా భూతభావనుడైన బుద్ధభగవానుడు దివ్యదృష్టితో అంతా గ్రహించి మందహాసంతో క్షణంసేపు ఆలోచించి, "అయ్యో! మనోవికారం కలిగించే మూర్ఖులు మోహానుబంధంతో దూరం నుంచే మేఘాలలాగ ప్రాణుల విజ్ఞాన ఆలోకాన్ని కప్పుతారు. శుభవినాశకుడైన ఆ క్షపణకుని మాట విని ముగ్ధబుద్ధి అయిన ఆ గృహపతి పాపకర్మకు కూడ ఒడిగట్టాడు" అని కరుణాకులుడై తను భిక్షుగణంతో సహా శీతవన శ్మశానానికి బయలుదేరాడు. భగవానుడు శ్మశానానికి వెళ్ళుతున్నాడని విని బింబిసారుడు మంత్రులతో సహా ఆ ప్రదేశానికి వెళ్ళాడు.

శ్మశానంలో సుభద్రుని భార్య కళేబరాన్ని చితిమీద పెట్టి నిప్పంటించాడు. అప్పుడు ఆమె పొట్టను చించుకొని కమలాసీనుడైన ఒక శిశువు సూర్యునివలె ఉదయించాడు. అగ్ని జ్వాలల మధ్యన ఉన్న ఆ శిశువుని ఎవ్వరూ తీయలేకపోయేవేళకు జనసమూహం నుంచి హాహాకారాలు విపరీతంగా వినిపించాయి. అప్పుడు బుద్ధుని ఆజ్ఞతో జీవకుడనే కుమారభృత్యుడు ఆతురతతో పెద్దపెద్ద అంగలు వేస్తూ త్వరగా వచ్చి ఆ శిశువును చితిమీదనుంచి పట్టుకుని తీసుకువచ్చాడు. బాలుని పట్టుకున్న క్షణంలో ఆ చితానలం జీవకునికి జినానుగ్రహం వల్ల హరిచందనంవలె చల్లగా అయింది. మంటలనుంచి పైకి తీసిన ఆ సుందర శిశువును, జీవంతో తొణికిసలాడే ఆ సుందర శిశువును చూచి క్షపణకులు సిగ్గుతో క్షణకాలం చచ్చినట్టు ఉండిపోయారు. సర్వభూతహితరతుడైన భగవానుడు ఇదంతా ఆశ్చర్యంతో చూస్తున్న సుభద్రుని పిలిచి "ఓయీ! నీపుత్రుణ్ణి తీసుకో!" అని అన్నాడు. కాని సుభద్రుడు ఏమిచేయడానికి తోచక డోలాందోళితమతితో, సంశయంతో, క్షపణకులేమి చెబుతారో అని క్షణంసేపు వారి ముఖాలు చూచాడు. వారు "శ్మశానవహ్నిలో పుట్టిన ఈ శిశువును గ్రహింపరాదు. ఈ శిశువు ఎక్కడ ఉంటాడో ఆ యిల్లు వృద్ధికి రాదు" అని సుభద్రునితో అన్నారు. వారి మాటలు విని ఆ మూర్ఖుడు ఆ శిశువును స్వీకరించకపోగా, బుద్ధదేవుని ఆజ్ఞతో బింబిసారుడు స్వీకరించి పోషించడానికి అంగీకరించాడు. జ్యోతిర్మధ్యం నుంచి ఉపలబ్ధుడు కావడం వల్ల జ్యోతిష్కునివలె ప్రకాశించడం వల్ల ఆ బాలునికి భగవానుడు జ్యోతిష్కుడు అని నామకరణం చేశాడు.

బింబిసార భూపాల భవనంలో ఆ శిశువు ఇలా పెరుగుతూ ఉండగా కొంత కాలానికి, దేశాంతరం వెళ్ళిన ఆ శిశువు మేనమామ తిరిగి వచ్చాడు. పుత్రుడు జన్మించగానే తన చెల్లెలు మరణించడం మున్నగు సమాచారం అతడు విని కోపంతో వణికిపోతూ, సుభద్రుని దగ్గరికి వచ్చి "మూర్ఖుడా! క్షపణక భక్తుడైన నీవు వారి మాటలు విని భార్యను చంపావు. పుత్రుణ్ణి వదలిపెట్టావు. ఏమి మంచి చేసినట్టయింది? స్వభావసిద్ధంగా జడమతులైన దుర్జనులు ఇతరుల చెప్పుడు మాటలకు రేగి, బేతాళులవలె నవ్వుతూనే సర్వనాశనం చేస్తారు. ఇప్పుడైనా రాజనగరునుంచి పుత్రుణ్ణి తెచ్చుకొనకపోతే, నీవు స్త్రీహత్య చేసినట్టు లోకానికి చాటి నీధనం అపహరింపజేస్తాను" అని

బెదరించాడు. ఆ మాటలు విని సుభద్రుడు భయపడి, భూపతి భవనం నుంచి కుమారుణ్ణి తెచ్చుకున్నాడు. బింబిసార భూపతి ఆ కుమారుణ్ణి పెంచిన ప్రీతిచేత ఇవ్వలేక ఇవ్వలేక ఎట్టకేలకు తండ్రికి ఇచ్చి పంపాడు.

తర్వాత కొంతకాలానికి సుభద్రుడు కాలధర్మం చెందగా, జ్యోతిష్కుడు సూర్యుడు కాంతికి నిధి అయినట్టు ఐశ్వర్యానికి నిధి అయ్యాడు. అర్థికల్పవృక్షమైన ఆ దానశీలి దివ్యమానుషీ సంపదను పొంది తన బుద్ధిని బుద్ధ ధర్మ సంఘాలనే త్రిశరణ్యాలలో లగ్నం చేశాడు. పుణ్యరత్నార్జన పరుడై అద్భుతమైన రత్నసమూహాన్ని సద్భక్తితో భిక్షుసంఘాలకు దానం చేశాడు. సముద్రాన్ని నదులు స్వయంగా చేరుతున్నట్టు వివిధ సంపదలు దేవ సమూహాలనుంచి అతని ఇంటికి తరలి వచ్చేవి. తృణంలోను, రత్నంలోను సమానభావం గల బుద్ధదేవుడు కూడ అతని ఇంట్లో రత్నపాత్రదానం స్వీకరించాడు.

ఒకమారు జ్యోతిష్కుడు స్నానం చేసి ఎండలో ఆరవేసిన గుడ్డ గాలికి కొట్టుకొనిపోయి బింబిసార భూపాలుని తలపై పడింది. భూపాలుడు అపూర్వ సుందరమైన ఆ వస్త్రం చూచి, అతని దివ్యవిభవానికి రిచ్చపడి, తన ఐశ్వర్యం దానిముందు గడ్డిపోచవంటిదని అనుకున్నాడు. ఇలా ఉండగా ఒకసారి జ్యోతిష్కుడు రాజును తన ఇంటికి అతిథ్యానికి ఆహ్వానించాడు. రాజు మణిమయమైన జ్యోతిష్కుని ఇంటికి వెళ్ళి, అక్కడ ఉన్నంతసేపు అది స్వర్గమనే అనుకున్నాడు.

తర్వాత కొంతకాలం గడవగా ధర్మశీలుడైన బింబిసార నరపతిని అతని కుమారుడు అజాతశత్రువు రాజ్యలోభం వల్ల మోసంతో చంపివేశాడు. కృతయుగ సదృశుడు, సద్గుణి అయిన ఆ బింబిసారుడు మరణించగానే, అతని కుమారుడైన అజాతశత్రువు రాజ్యాన్ని అధర్మంలాగ పొందాడు. రాజదుర్లభమైన జ్యోతిష్యుని యింటి సిరిని చూచి కన్నుకుట్టి అజాతశత్రువు జ్యోతిష్కుని వద్దకు వచ్చి, "నిన్ను నాతండ్రి పెంచాడు. న్యాయంగా నీవు నాకు సోదరుడివి. నీ విభవంలో అర్ధభాగం నాకిమ్ము. లేకపోతే భాగధన ద్రోహం వల్ల మనకు కలహం ఏర్పడుతుంది" అని అన్నాడు. క్రూరుడైన అజాతశత్రువు కుటిలతతో అన్న మాటలను జ్యోతిష్కుడు విని, రత్నసంపూర్ణమైన తన యింటిని అతనికిచ్చి, తాను మరొక యింటికి వెళ్ళిపోయాడు. కాని, కాంతి సూర్యుని అనుసరించినట్టు దివ్యరుచిర రత్నసమృద్ధమై లోకోపకారకమైన ఆ సంపద జ్యోతిష్కుడి వెంటనంటి వచ్చింది. ఇలా ఏడుసార్లు జ్యోతిష్కుడు సంపదను త్యజించినా, ఆ దివ్యలక్ష్మి రాజును తాకక సాధ్వి పతిని అనుసరించినట్టు అతని వెంటనే వచ్చింది. దోపిడి, దొంగతనం మున్నగు ఉపాయాలతో తన సంపదను రాజు హరించడానికి ఉద్యమించగా, జ్యోతిష్కుడు రాజు కోపించాడని గ్రహించి నిర్విణ్ణుడై ఇలా ఆలోచించాడు: "ప్రజల దురదృష్టవశాత్తు జనక సదృశుడు, వాత్సల్యపేశలుడు అయిన రాజు స్మృతిశేషుడయ్యాడు. నిర్వ్యాజ సరళుడైన ఆ రాజు తండ్రిలాగ పాలిస్తుండగా, ప్రజలు నమ్మకంతో హాయిగా రాత్రిళ్ళు నిద్రపోయేవారు. అలాటిరాజు మరెవరున్నారు? ధనవంతులకేమి? - గడ్డిపోచలలాగ ఎక్కడబడితే అక్కడ దొరుకుతారు. వివేకవంతులు కూడ రత్నాలలాగ లభ్యులే. కాని సౌజన్య సరళుడైనవాడు అమృతం కంటె కూడ దుష్ప్రాపుడు, నిర్వ్యాజమైన వైదగ్ధ్యం, వివేకపూరితమైన సరళత, నిరాడంబరమైన ఉన్నతి కలవారు జన్మించడం అరుదు. ఇప్పుడు ద్వేష దుశ్చరితుడై,



దుష్కర్మాచరణుడైన ఈ రాజు ప్రజల పాప పరిపాకంతో అకాలంలోనే కలలాగ దాపురించాడు. జగన్మిత్రుడైన సూర్యుని వంటి బింబిసార మహీపతి అస్తమించగా, దోషోదయంలాగ ఆయన కుమారుడు వృద్ధి చెంది లోకాన్ని చీకటితో ముంచుతున్నాడు. నిజానికి దుష్టులు మరణించిన సత్పురుషులకు అకారణ మిత్రులు సుమా! ఎందుకంటే, దుష్టుల చరిత్ర అనే నికషంపైన సత్పురుషుల కీర్తి రాపిడి పొంది మరింత వెలుగుతుంది గనుక. అందువల్ల ఈ రాజు ఏలుబడిలో ఉన్న భూమిని వదలి వెళ్ళడమే మంచిది. కాలం కలికాలమై రాజు కూడా కలి అయినప్పుడు జనులు జీవించడం ఎలా? గుణవంతుడైన నరపాలుని పాలనలో గుణవంతులైన సత్పురుషులకు వరచరిత్రులైన భార్యలు, అకళంకమైన కులం, భవ్యమైన సంపద, చంద్రసన్నిభమైన కీర్తి, స్థితి సముచితమైన చరితం, ఆపదలకు కారణం కాని సంపద కలుగుతాయి. ప్రజాసంఘం పాపరహితంగా ఉంటుంది. ధనమనే పాదులో పుట్టి, నిర్దోషమైన కామనలనే కుసుమాలతో కన్నులపండువు చేసే ధర్మద్రుమాన్ని దుష్టనృపతి అనే పెనుగాలి కూల్చకపోతే ప్రజలు సుఖాలనే పుణ్యఫలాలు అనుభవిస్తారు. కాలమో కలికాలం! పాలకుడేమో బాలకుడు! అతని ప్రతాపం ప్రేతాగ్నివలె అకాలంలో విప్లవం చెలరేపే దుష్టబేతాళాలతో నిండినది. ప్రీతి తగ్గింది; బుద్ధి మందగించింది. సుఖశ్రీకి యౌవనం గడచింది. ఇప్పుడు నాకు విభవ విస్తారమైన భోగాలపై అభిరుచి లేదు. ధనం, భూమి, ఇల్లు, ఇల్లాలు, సుతులు, భృత్యులు, వస్త్రాభరణాలు- ఇవన్నీ జీవికి అవధిలేని ఆధివ్యాధులు. సిరులు ఎండకాలపు తాపం వంటివి. అవి వృద్ధి పొందినకొద్దీ దేహికి తృష్ణాసంతాపం హెచ్చుతూనే ఉంటుంది. మానవులు పుట్టినది మొదలు ధనరాసులను ఆర్జించి కూడబెట్టినా లవణ సముద్రపు నీటితోలాగ దప్పి ఆరదు. ధనికులు అసంతృప్తులై 'లేదు లేదు' అనే జపం చేస్తారు. ఆ జపం ప్రశమం గురించి చేస్తే వారిలో ఒక్కరికైనా పునర్జన్మ ఉంటుందా? కలికలహ మహామోహ లోభాలకు కారణమై దుర్నిమిత్తమైన విత్తం ఎందుకు? వియోగానికి నిదానమై, వ్యసనాల -రాగాలు పుట్టించే భోగాలెందుకు? రాజభవనంలో సేవావమానాలు కలిగించే మిథ్యాభిమానాలెందుకు? ఈ వినాశ భయసమయంలో వైరాగ్య మొక్కటే భోగ్యమైనది. అదే ఆరోగ్యకరం. స్వబంధుమిత్రులతో సుఖమనుభవించే మంచి కాలం గడచిపోయి ప్రబలతర మోహకలుష మలినమైన కాలం దాపురించినప్పుడు దేహులు ప్రశమమనే సలిలాలతో మనస్సును శుద్ధం చేసుకొని ఆయాసం కలిగించని విజనమైన వనంలో వసించడం సుఖకరం." ఈ విధంగా జ్యోతిష్కుడు చాలసేపు ఆలోచించి పూర్తిగా విరాగి అయ్యాడు. దుఃఖం మూర్ఖులకు మోహం కలిగిస్తుంది; ధీమంతులకు వివేకం కలిగిస్తుంది.

తర్వాత జ్యోతిష్కుడు తన సర్వస్వం యాచకులకు దానం చేసి బుద్ధదేవుని ఆశ్రమానికి వెళ్ళాడు. ధనపాశం ఈడుస్తున్న బుద్ధిగలవాడు సత్యసుఖోన్ముఖుడు కావడం కష్టం కదా! రాజహంస పవిత్రమైన మానససరస్సును స్మరించినప్పుడు ఈ వసుంధర సామాన్య సరసివలె దానికి నచ్చదుగదా! దుస్సహమైన మోహధూమం కమ్మిన భోగానురాగానలం చల్లారి, సంతోషామృతమనే సెలయేటితో మనస్సు చల్లబడిన ప్రశమశీలుర యత్నాలకు తాగి తందనాలాడుతున్న వారాంగనల అస్థిర భ్రూభంగం వలె క్షణస్థాయి అయిన సంపదలు విఘ్నం కలిగించలేవు. తర్వాత అతడు సర్వజ్ఞుడైన బుద్ధదేవుని అనుగ్రహంతో సంసార మార్గయాసం పోయి, ప్రవ్రజ్య అనే విమలపదం స్వీకరించి, సర్వసమ దృష్టి కలిగి, అసమాన తేజస్వి అయి, ఇతర లక్ష్యవిరహితమైన మోక్షపదవిని పొందడం కోసం ముని అయ్యాడు.

జ్యోతిష్కుని ఆలాటి బోధిసిద్ధిని చూచి భిక్షువులు ఆశ్చర్యపడి అతని పూర్వజన్మ వృత్తాంతం అడిగారు. భగవానుడు ఇలా అన్నాడు. "అనేక జన్మక్షేత్రాలలో నాటిన కర్మబీజాల ఫలసంపదను జనులు నిస్సందేహంగా అనుభవిస్తారు. పూర్వం బంధుమంతుడనే రాజు పాలించే బంధుమతి అనే పట్టణంలో అనంగనుడనే గృహపతి ఉండేవాడు. ఆయన శ్రీమంతుడు, మహాకీర్తిమంతుడూను. ఆ పట్టణానికి ఒకసారి సజ్జనుల సుకృతవశాత్తు విపశ్యి అనే సమ్యక్సంబుద్ధుడు పాదచారి అయి వచ్చాడు. ఆయన వెంట నూట యిరవైవేలమంది భిక్షువులు వచ్చారు. అనంగనుడు శ్రద్ధతో ఎదురేగి, ప్రణమిల్లి వారిని ఆతిథ్యానికి ఆహ్వానించాడు. పిదప సర్వోపకరణాలతోను బుద్ధదేవుని మూడు నెలల పాటు సత్కరించాడు. రాజు బంధుమంతుడు కూడ వారిని ఆదరంతో ఆహ్వానించాడు. ఇద్దరూ స్పర్థతో ఆ సమ్యక్సంబుద్ధునికి సకల భోగాలు సమకూర్చి సేవించారు. అనంగనుడు పౌరార్హమైన సేవ, రాజు రాజార్హమైన గజధ్వజ మణిచ్ఛత్రచామరాది సమృద్ధిగల సంపదతో సేవ చేశారు. రాజు రాజలాంఛనాలతో సేవ చేయడం చూచి అనంగనుడు చింతపడ్డాడు. అప్పుడు అతని సత్త్వగుణసంపద గ్రహించిన ఇంద్రుడు అభిమానించి, సమ్యక్సంబుద్ధుని పూజించడంలో దివ్యలక్ష్మితో అతనికి తోడ్పడ్డాడు. ఆతడు దివ్యసంపదతో భగవానుని పూజించడం చూచి చక్రవర్తి సిరి లజ్జపడింది. చంద్ర సూర్యతారకలను దిసంతుచేసే దివ్యరత్నాలతో వాడని గంధమాల్యాలతో, దివ్యవస్త్రాలతో, ఒప్పారే కల్పద్రుమ ఫలాలతో, శచీదేవి భక్తినమ్రురాలై సవిలాసంగా చామరం వీస్తుండగా, ఆతడు సమ్యక్సంబుద్ధుని పూజించడం చూచి రాజు సిగ్గుతో తలవంచుకున్నాడు. ఆనాడు పుణ్యోదారుడైన అనంగనుడు భక్తితో శుభపరిణామ స్వరూపుడైన సుగతుని పూజించి ఫలం పొందాడు. నేడు ఆ విమలమానసుని క్షణకాల ప్రణిధానంతోనే దివ్య పదవిని పొంది, జ్యోతిష్కుడై జన్మించి, రెండవ సూర్యునివలె వెలుగుతున్నాడు.!"

విమలజ్ఞానంతో మూడు లోకాలూ ప్రకాశింపజేసే జినభగవానుడు భిక్షువులకు ఈ విధంగా ప్రణిధానం ఉపదేశించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో జ్యోతిష్కావదానమనే తొమ్మిదవ పల్లవం.

# 10. సుందరీనందావదానం

భవభీతులైన మానవుల హితం కోరి వాత్సల్యమృదుబుద్ధితో సర్వప్రాణి హితరతానుకంపతో, పట్టుదలతో, పరమానుగ్రహం కలిగించే భవ్యపురుషులు ఈ లోకంలో, ఎవరో కొందరుంటారు.

పూర్వం ఒకప్పుడు బుద్ధభగవానుడు కపిలవస్తుపురంలో న్యగ్రోధారామంలో బసచేశాడు. అప్పుడు శాక్యరాజసుతుడైన నందుడు ఆయనను దర్శించడానికి వెళ్ళాడు. అప్పుడు బుద్ధభగవానుడు భిక్షువులకు నిష్క్రమ్యోపదేశం చేస్తూ ఉన్నాడు. ఆయన ఆ ఉపదేశ కథా కథనం తర్వాత తన ఎదుట నిలబడ్డ నందుని చూచి, ప్రీతితో, సన్యాసం స్వీకరించమని కోరాడు. నందుడు ఆయనను పూజించి, తన కుశలాదికం నివేదించిన తర్వాత "భగవన్! ప్రవ్రజ్య పుణ్యలాభకరమే అయినా నాకు నచ్చడం లేదు. నేను సకలవస్తువులను సమకూర్చే ఉపస్థాయకుణ్ణి అయి భిక్షు సంఘానికి యథేప్సితంగా సర్వోపకరణాలతోను భిక్షయిస్తూ ఉపచారం చేస్తూ ఉంటాను" అని విన్నవించి, రత్నమకుటంతో ఆయన పాదపంకజాలను స్పృశించి భార్యాదర్శనసముత్సుకుడై స్వభవనానికి వెళ్ళిపోయాడు. అక్కడ రతివలె సుందరి అయిన సుందరి అనే తన ప్రియురాలితో ముహూర్తకాలం కూడ విరహం సహించక సుందరోద్యానవనంలో విహరించాడు.

సహజంగా గుణప్రియుడైన బుద్ధదేవుడు తర్వాత ఒకనాడు భిక్షు సంఘాలతో సహ తానే నందుని భవనానికి వెళ్ళాడు. అప్పుడు ఆనందంతో నందుడు ఆయన పాదాలకు వందనం చేసి, అర్హమైన గొప్ప ఆసనంపై ఆసీనుణ్ణి చేసి, పూజించి ఇలా విన్నవించాడు: "దేవా! మీరే స్వయంగా నాకు దర్శనమిచ్చి అనుగ్రహించారు. ఇది ఏపుణ్యప్రరోహపరిపాకమో! మహాత్ముల స్మరణం, శ్రవణం, దర్శనం అనేవి పుణ్యలత పండించిన ఫలసంతతికదా! సదాప్రకాశులైన ఈ మహామైత్రుల దర్శనంతో ఎవరి హృదయానికి వికాసలక్ష్మి కలుగదు? మహాత్ముల దర్శనం దానం కంటే ప్రియతరమైనది; పుణ్యం కంటే మహాఫలవంతమైనది; సదాచారం కంటే శ్లాఘ్యమైనది." బుద్ధదేవుడు భక్తి ప్రణయపేశలంగా ఇలా విన్నవిస్తున్న నందుని పూజను అభినందించి, ముందుకు వెళ్ళడానికి ఉపక్రమించాడు. నందుడు స్వచ్ఛమైన స్వర్ణపాత్రలో తన హృదయం వలె మధురమైన ఉపచార పదార్థాలను తీసుకొని భగవానుని అనుగమించాడు. భగవానుని మార్గంలో భక్తితో వెంటవెళ్ళుతున్న తన ప్రియుణ్ని సుందరి విరహాతురయై కడకంటితో చూచింది. ఆ ప్రియతమ పెద్దలముందు సరళతరళదృష్టులను పరపక భయంతో కనులు మూసుకొని క్షణకాలం తలవాల్చి ఉండడం "నీవు పోవద్దు!" అని మాటా పలుకూ లేక మౌనంగా గట్టిగా చెప్పినట్టు అనిపించింది. నందుడు ఉచ్ఛ్వాసంతో కదలుతున్న వదనం గల ప్రణయినిని చూచి, "ఇదిగో! త్వరలో వస్తాను!" అని అన్నాడు.

పిదప బుద్ధదేవుడు నందునితో సహ ఆశ్రమం చేరాడు. ఆశ్రమం చేరగానే నందుడు అంజలి ఘటించి ప్రియావిరహాన్ని సంహిచలేక "దేవ! ఇంటికి వెళ్ళుతాను" అని విన్నవించాడు. బుద్ధదేవుడు

ఆసనం అధిష్ఠించి ఎదుట ప్రణతుడై ఉన్న నందుని చూచి మందహాసంతో, "వెళ్ళడానికి ఇప్పుడేమి తొందర?" అని ప్రశ్నించి ఇలా అన్నాడు: "విషయ సుఖాస్వాదన సౌహార్దాలతో సమ్మోహితచిత్తులైనవారి బుద్ధి అయ్యో! గృహసుఖాలలో సక్తమై నిర్వేదానికి విముఖంగా ఉంటున్నది. ఆయుస్సుకు గుణమే ఆభరణం. గుణానికి వివేకం ఆభరణం. వివేకానికి శమం ఆభరణం. శమానికి వైరాగ్యం ఆభరణం. వైరాగ్య వివేక శూన్యచిత్తులై సల్లక్షణాలు లేనివారు పశువులవలె తమ కాలాన్ని కాలచక్రనేమి క్రమంగా గడుపుతారు? వారు అలా గడపడం ఆప్తులైన మిత్రులకు జాడ్యంగా, అసహ్యమైన హృదయశల్యంగా ఉంటుంది. అలాటివారి జీవితం వ్యర్థమని యుక్తాయుక్త విచారశీలురైన ప్రాజ్ఞులు భావిస్తారు. సత్త్వవంతులకు పుణ్యం, బుద్ధిమంతులకు విద్య, విద్యావంతులకు శీలం, భాగ్యవంతులకు సకలవస్తువులూ, శమగుణశాలురకు సుఖం చేకూరడం ఎప్పుడూ కష్టం కాదు. కాని, సమస్త వస్తువులను సంపాదించే ఆయుస్సులో స్వల్పాంశం సంపాదించడం కూడ కష్టం. అలాటి ఆయుస్సును నిష్ఫలంగా నాశం చేసుకొనేవాడు శోచనీయుడు. వానికి నమస్కారం! ఈ విషయ జలనిధి తరింపనలవికానిది. దీనిలో లావణ్యసారం నిండారి ప్రలోభం కలిగిస్తూ ఉంటుంది. సుందరులనే సుడిగుండాలు భ్రాంతి కలిగిస్తాయి. దర్పంతో చెలరేగే విషమ మకరకేతనుడనే మకరం క్షోభ కలిగిస్తూ ఉంటుంది. ఇక విరహమనే బడబానలం నిత్యం ప్రబలంగా సన్నిహితమై ఉంటుంది. కనుక ఈ విషయజలనిధి దాటడానికి ఏకైక శరణమైన సేతువు తీవ్రమైన వైరాగ్యమే కనుక రాజపుత్ర! జితేంద్రియుడవై ప్రవ్రజ్యను స్వీకరించు. ఈ సంపదలు స్త్రీలవలె పొందినప్పుడే సుఖమిచ్చేవి. కుశలం కోసం బ్రహ్మచర్యం అవలంబించి, ఈ నిస్సారమైన గృహ సంసార బంధనం వదలిపెట్టు." బుద్ధదేవుని కరుణాభరణమైన ఈ వాక్కులు విని నందుడు పూర్వపు చనువుతో "భగవన్! నేను ప్రవ్రజ్యను స్వీకరించాలనే మీరు సదా ప్రయత్నిస్తున్నారు. భిక్షుసంఘాల మేలు కోసం నేను గృహస్థుడుగా ఉండడమే మంచిది" అని విన్నవించాడు. కానీ, ఆయన బుద్ధదేవుని ఆజ్ఞను మీరలేక, ప్రియాప్రేమ మరొకవైపు లాగుతూ ఉండగా దోలాందోళితచిత్తుడై వ్యాకులపడ్డాడు. భగవానుడు సన్న్యాసం స్వీకరించవలసిందని అతనికి మళ్ళీమళ్ళీ ఉపదేశించాడు. ఉపకారం చేయదలపెట్టిన సజ్జనులు యోగ్యతాయోగ్యతలు ఆలోచించరుగదా!

ఇంద్రియాలు జయించని నందుడు ఇలా ఎంత ఇష్టపడకపోయినా ప్రవ్రజ్యాదీక్ష భగవానుని వాక్యం వల్ల తనంతట తానే ఆయన దేహాన్ని అలంకరించింది. వెంటనే నందుడు కాషాయవసనుడు, భిక్షాపాత్రపాణి అయి బంగారు కాంతితో, మహాపురుష లక్షణాలతో ప్రకాశించాడు. అతడు సుగతుని ఆదేశం ప్రకారం అనాగారిక వేషంతో దుమ్ముకొట్టిన దేహంతో భిక్షాపాత్రతో అరణ్యకవృత్తి అనుసరించాడు. కాని, సన్న్యాసి అయినప్పటికీ చంద్రునిలో మచ్చలాగ అతని హృదయంలో ప్రియురాలయిన సుందరి అంకిత అయింది. ఆశ్చర్యమేమిటంటే, స్ఫటికానికి రాగం అంటినట్టే మనస్సుకు అనురాగం ఏవిధంగానో అంటుకుంటుంది. ఎంత కడిగినా పోదు. అరుణ వల్కలాలు ధరించి విరహపాండురుడైన ఆ నందుడు సంధ్యాకాల మేఘం మరుగున ఉన్న చంద్రుని సొయగం పొందాడు. ఆతడు అరణ్యంలో తిరుగుతూ, విరహాగ్ని భరించలేక ధైర్యం కోల్పోయి మన్మథుని జన్మవిద్యవంటి సుందరిని మరువలేకపోయాడు.

ఆయన ఒక శిలాతలంపై ఆసీనుడై ఆ సంపూర్ణ చంద్రవదన వదనాన్ని నిశ్చలంగా నిర్మలంగా ధ్యానిస్తూ చాలసేపు ఇలా ఆలోచించాడు- "ఆహా! భగవానుడేమో ఎంతో ప్రయత్నించి నాకీ అనుగ్రహం



కలిగించాడు. రాగాధిష్ఠితమైన హృదయంగల నాకు చిత్తశుద్ధి కలగడం లేదు. సంసార చరితం వదలిపెట్టాను; నిస్సంగవ్రతం స్వీకరించాను. అయినా, ఆ మృగశాబాక్షిని నా మనస్సు మరువలేకున్నది. ప్రియురాలి ఈ కుంకుమరాగంతో వాసించే ఈ దేహానికి నారచీరలు కట్టాను. ఆమె పీనస్తనమండలంపై ప్రణయంగల ఈ చేతితో భిక్షాపాత్ర పట్టాను. నాకీ సన్యాస దీక్షతో రాగమే మితిమీరుతున్నది. ఇతరులకైతే బోధివల్ల కలిగే ధ్యానం, త్రిశరణావలంబనం నిరంతరం అభివృద్ధి చెందేవి. 'క్షణంలో వచ్చివేస్తాను వెర్రిదానా!' అని ఇక్కడికి రావడానికి ముందు ఆమెతో అన్నాను. వణుకుతూ పెద్దలముందు 'వెళ్ళవద్దు' అని నోటితో అనలేక, చేతిలోని వ్యజనాన్ని వదలి, నాచేతి కొస పట్టుకొని, కాలితో నేలరాస్తూ మరొకరు చూడకుండా నన్ను చూచింది. ఆ అత్యంత సుందర నిషేధంతో ఆమె నా మనస్సును కట్టివేసింది. ఆ హరిణలోచన నా వియోగశోకంతో ప్రలపిస్తూ ఇసుక దిబ్బపై చక్రవాకి లాగ, భవనంలో శయనంపై పడి పొర్లుతూ ఉంటుంది. సందేహమే లేదు. హా! ప్రియా! నేను సత్యం వదలి, నీ చిత్తం హరించి వట్టి దుర్మార్గునిలాగ ఈ కుహనావ్రతం స్వీకరించాను. ఈ వ్రతం పరిత్యజించి ప్రియురాలి వద్దకు వెళ్ళుతాను. అనురాగాగ్ని సంతప్తులకు తపస్తాపం దుస్సహం. బహుకాలానికి తిరిగివచ్చిన నృశంసుడైన నన్ను చూచి రాజపుత్రి కొత్త అలుకతో ఏమి చేస్తుందో? ఏమో? ప్రేమ దుస్సహమైన తిరస్కారం ఎల్లప్పుడూ వికారం కలిగించదు. నూనెలో కలిసిన నలుసును సులభంగా తీసివేయడం సాధ్యమా? బుద్ధదేవుడు వనంలో లేని సమయం చూచి ఇంటికి వెళ్ళాలి. ఇదే నా నిశ్చయం. ఈ శిలాతలం మీదే, గిరిధాతువులతో ఆ శశిముఖచిత్రం ధైర్యం తెచ్చుకొని చిత్రిస్తాను. సుధామ వలయానికి చంద్రునివంటి సౌందర్య స్రవంతి అయిన ప్రియురాలిని చిత్రించడం ఎలా? ఆమె చూపు ముగ్ధకురంగంతోను. తుమ్మెదలు కదలాడే కలువతోను పోటీ పడేది. ఆమె బింబాధరకాంతి లావణ్యసముద్రతీరంలోని పగడపు వనం. ముఖద్యుతి కళంకం లేని అమృతకిరణ సమూహపంక్తి వంటిది. ఇలాటి ఆశ్చర్యకరమైన సుషమగల శరీరం చిత్రించడం ఎలా? చిత్రించినా ఆ సౌందర్యం అబ్బుతుందా?"

నందుడు ఈ విధంగా తలపోసి, ఆ శిలాతలం మీద సుందరి చిత్రాన్ని కన్నీళ్ళతో తడిసి వణుకుతున్న వేళ్ళతో మెలమెల్లగా వ్రాశాడు. .ఇలా అతడు తన సంకల్ప ప్రతిబింబంవలె ఎదుట ఉన్న ప్రియురాలి రూపం చూచి బాష్పగద్గద కంఠంతో ఇలా అన్నాడు: "అయ్యో నయన సుఖవృష్టివంటి ప్రియురాలి రూపం చిత్రించుకొన్నాను. ఆ శరచ్చంద్రవదనను క్షణమైనా చూడనీకుండా బాష్పధార అడ్డు వస్తున్నది. తన్వీవిరహం కూడ లెక్కచేయకుండా సన్న్యాసవ్రతం స్వీకరించిన నాకు ఘోర సంతాపం కలిగించే ఈ శాపం ఏపాప విపాకం వల్లనో కలిగింది. సందేహమే లేదు. సుందరీ! విరిసిన తామర వనపు సొబగుగల చూపులతో నీవు స్నేహంతో తిలకించే నా దేహం కన్నీట నిండింది. తాత్కాలికంగా ఈ వియోగాంతరాయం వల్ల కలిగిన కోపం వదలిపెట్టు. నా మాటకు సమాధానం చెప్పు. ఎందుకు మౌనం పట్టావు? ఈ కాషాయవస్త్రం నీ రాగమయమే. ఈవ్రతం చిత్రవ్రతమే."

ఇలా చిత్రంతో మాట్లాడుతున్న నందుని, ఆ చిత్రాన్ని దూరం నుంచే భిక్షువులు చూచి అసూయాపరులై భగవానుని సన్నిధికి వచ్చి "దేవ! దుర్వినీతుడైన వానికి మీరు కేవలం వాత్సల్యంతో సన్న్యాసదీక్ష యిప్పించారు. కుక్కకు కుసుమమాల యిచ్చినట్టయింది. నందుడు స్వేచ్ఛగా శిలాతలం

మీద సుందరి ముఖం చిత్రించి దాని ఆలాపాలను జపిస్తూ, దానినే ధ్యానిస్తున్నాడు" అని విన్నవించారు. అది విని బుద్ధదేవుడు ప్రియావిరహమోహాతురుడైన నందుని కాననం నుంచి పిలిపించి "నందా! ఏమిటిది?" అని ప్రశ్నించాడు. నందుడు "భగవన్! కాంతాసంసక్తున్నయిన నాకు భిక్షుయోగ్యమైన ఈ వనంలో బుద్ధి కుదరడం లేదు. ఇది నిజమైన విషయం" అని విన్నవించాడు. నందుని మాట విని జినభగవానుడు తన ముఖ చంద్రకాంతులతో రాగతామరసాన్ని ముకుళింపజేస్తూ ఇలా ఉపదేశించాడు. "ఓ సాధూ! నీ బుద్ధి ఇంతగా రాగంలో తగులుకొనడం యుక్తం కాదు. కల్యాణాభినివేశం కలవారి మనస్సును విఘ్నాలు ఆకర్షించి శిథిలపరచవు. నీవు అవలంబించిన ఈ యోగం ఎటువంటిది? తనువును తృణసదృశంగా త్యజించే భోగాభియోగం కలది కదా? మరి నీకీ నింద్యమైన, క్షణభంగురమైన సుఖలవాస్వాదవాంఛ ఎందుకు? మారమార్గం దుస్తరం. అది సహజంగానే ఆముష్మిక కుశలాన్ని కూల్చివేస్తుంది; ప్రేమాంధులకు వెంటనే దుస్సహమైన బంధనజాతంగాను పరిణమిస్తుంది" అని భగవానుడు చాల సేపు నందునికి వైరాగ్యం ఉపదేశించి "ఇక్కడే ఉండు" అని చెప్పి తన అనుష్ఠానానికి వెళ్ళాడు.

నందుడు ఇదే వెళ్ళడానికి తగిన తరుణం అనుకొని సంతోషంతో సుందరీ దర్శనోత్సుకుడై ఇంటికి బయలుదేరాడు. తలుపులు మూసిన వనద్వారం నుంచి తప్పించుకొని చాలసేపటికి ఎలాగో నగరానికి పోయే మార్గం చేరాడు. సర్వజ్ఞుడైన భగవానుడు ప్రియానురాగంతో నందుడు వెళ్ళబోతున్నట్లు గ్రహించి, అతని వద్దకు వచ్చి "నందా! తొందరగా వెళ్ళుతున్నావే? ఎక్కడికి?" అని ప్రశ్నించాడు. "భగవాన్! ఈ వనంలో ఉండడానికి నాకు ఇష్టం లేదు. శాంతచిత్తులు కానివారికి ఏ క్రియ సిద్ధిస్తుంది? చామరాలతో హసించే సిరి, మణిమయమైన రమ్య హర్మ్యావళి, మందమారుతంతో కదిలే సుందరలతలతో కనులపండువైన నూతనోద్యానభూమి, కుసుమబాణుని కార్ముకలతవలె మధ్యేక్షామ అయిన తనుగాత్రి సుందరి జన్మాంతర వాసనలవలె రాగసక్తమైన నా మనస్సును వదలడం లేదు. పంజరబద్ధమైన పక్షిలాగ ఈవ్రతపంజరంలో చిక్కుకొని, సరాగమైన మనస్సుతో బ్రహ్మచర్యం అనుష్ఠిస్తున్నాను. ఈ ప్రవ్రజ్యను పరిత్యజించి వెళ్ళుతాను. నాకు అక్షయమైన నరకమే కలుగనీగాక! మంజిష్ఠారాగరంజితమైన వస్త్రం రంగును విడువదు కదా!" అని అంటూ తన భవనానికి వెళ్ళడానికి పెక్కుసార్లు ప్రయత్నిస్తున్న నందుని చూచి భగవానుడు అనుగ్రహబుద్ధితో నివారించి ఇలా హితవు చెప్పాడు. "నందా! విప్లవం చేయవద్దు. వినీ విననిది నిందితమైనది. విద్వాంసుల ఉపదేశం ప్రకారం సామాన్యులు నడుస్తారు. అలాంటప్పుడు వివేకంతో దోషాలు తొలగిపోయి శీలవంతులైన విద్వాంసులు నిస్సారసుఖం అపేక్షించి అకార్యాలకు పూనుకోరు. రాగం గాఢంగా హత్తిన నీకు జుగుప్సకు ఆటపట్టు, లజ్జాకరమూ అయిన నీచకర్మలో ఎందుకింత ఆసక్తి? యోనిలో పుట్టి యోనిసంసక్తులవుతూ, స్తనపాయులై, స్తనాలనే మర్దిస్తూ, అయ్యో! జన్మపరంపరలోనే లయమవుతూ సిగ్గుపడరుకదా! జనసీ జఘనాసక్తిని సజ్జనులు సదా వర్జిస్తారు. ఇలాటిది సమ్మోహ మూఢమైన చిత్తంగల పశువులందే కనిపిస్తుంది. భుజంగులు(కాముకులు) భుజంగాల లాగ భోగాలతో(సుఖాలతోను, పడగలతోను) భవబిలంలోనే నశించడం చూస్తున్నాము గనుక నీవు రామారమణాభిమానాన్ని వదలిపెట్టు. నీచమైన రతిసుఖం ఎవ్వరికీ సంతృప్తిని కలిగించనే కలిగించదు. ఏండ్లు పూండ్లు ఎంతకాలం దానిలోనే మునిగి తేలుతున్నా ఎవ్వడూ పరాఙ్ముఖుడు కాడు. ఇంకా ఆశ కెలకవేస్తూనే ఉంటుంది. గృహజాలం నుంచి విముక్తుడవయ్యావు.



మళ్ళీ అక్కడికే ఎందుకు పరుగెత్తుతావు? వలనుంచి తప్పించుకొన్న సారంగం మరల వలలో దూరుతుందా?" భగవానుని ఈ మాటలు విని, ఆయన ఆదేశానికి తల ఒగ్గి నందుడు సుందరిని స్మరిస్తూ మరల ఆశ్రమం ప్రవేశించాడు.

ఇలా ఉండగా ఒకమారు బుద్ధదేవుడు నందుణ్ని ఆశ్రమం ఊడ్వడానికి నియమించి ధ్యానం చేసుకొనడానికి వెళ్ళాడు. నందుడు ఎన్నిసార్లు ఊడ్చినా అతని హృదయం నుంచి రాగం తొలగనట్లే, దుమ్ము పోలేదు. తర్వాత ఆతడు నీటికోసం వెళ్ళి కడవను ఎన్నిసార్లు ముంచి పైకెత్తినా, అది వట్టిదవుతూ వచ్చింది. ఇదంతా తన ప్రయాణానికి విఘ్నమని విచారపడుతూ దానిని వదలిపెట్టి నందుడు సుందరీ సందర్శనోత్సుకుడై బయలుదేరాడు. సర్వజ్ఞుడైన సుగతుడు తన దివ్యదృష్టితో నందుడు వెళ్ళుతుండడం తెలుసుకొని, తర్వగా వచ్చి అతని మనోరథాన్ని స్తంభింపజేస్తూ ఇలా అన్నాడు: "శ్యామరక్త కాంతితో మండుతున్న దీపానికి పాత్రసంబంధంతో నూనెమడ్డి అంటినట్టు నీకు ఇంకా ఈ స్నేహం వదలలేదుకదా! అయ్యో! కాంతాభిలాష యిక చాలు. నీలిరాగం వలె అది నీహృదయానికి అంటుకొని వదలకుండా ఉండడం వల్ల నీవు విరాగివి కాకున్నావు. రతిసుఖం ప్రారంభంలో కాతరుడైనవాణ్ని కన్నుమిన్ను కాననివాణ్నిగా చేస్తుంది. ముఖ్యాంగసంగం తర్వాత జుగుప్సవలె కౌగిలించుకుంటుంది. ఇంద్రియాలు దేనిని విషయసుఖాస్వాదన సంబంధంతో పాపిష్ఠులైన మిత్రులలాగ దుస్సహమైన వ్యసనాలనే సుడిగుండాలలో పడవేస్తాయి. దుష్టసంసర్గం స్వల్పమాత్ర స్పర్శతోనే కుళ్ళివచ్చిన చేపకంపులాగ కంపుకొడుతూ అంటుకుంటుంది. ఉత్తమమిత్రుల సంసర్గం ఎప్పుడూ కుశలకరమై సుగంధంలాగ వ్యాపించి మెప్పు కలిగిస్తుంది." ఈవిధంగా భగవానుడు సదసన్మార్గాన్ని ఘ్రాణస్పర్శచేత అతనికి ప్రత్యక్షంగా చూపి ఉపదేశించాడు.

తర్వాత భగవానుడు నందుని పిలుచుకొని గంధమాదనానికి వెళ్ళాడు. అక్కడ కమలగర్భుని చమరీమృగాలు ఆయనకు తమ నవకమైన తోకలతో వీచాయి. అక్కడ ఆయన నందునికి ఒక గుడ్డి మర్కటిని చూపించాడు. దాని శరీరం దావానలంలో కాలి వికృతమై ఏవగింపు కలిగిస్తూ ఉన్నది. అప్పుడు భగవానుడు నందుని చూచి, "నంద! ఈ మాంద్యనింద్యతరాకృతిని చూచావా? ఇది కూడ ఒకరికి అందంగాను, ఉచితంగాను కనుపిస్తుంది. కురూపం అనేదేదీ లేదు. అనురాగంతో అంతా రమ్యంగానే కనిపిస్తుంది. ఈ లోకంలో ఎవరు ఎవరిని ప్రేమిస్తారో వారే వారికి సుందరులు. పక్షపాతం వదలి నీవే నిజం చెప్పు. దీనికీ, ఆ సుందరికీ లావణ్యంతో భేదం ఉందా? నేను కోరడం లేదు గనుక సౌందర్యంలో భేదం తెలుసుకోలేకపోతున్నాను. అవసరమున్నప్పుడు, మనకు కావలసివచ్చినప్పుడు మనోహరత దానంతట అదే కనిపిస్తుంది. ఆమెకూ, దీనికీ భేదమేమీ నాకు కనిపించడం లేదు. మాంసచర్మాస్థిమయమైన ఈ యంత్రంలో రమణీయత తాత్కాలికం" అని అన్నాడు. నందుడు బుద్ధదేవుని ప్రశ్నలకు చాల నొచ్చుకొని, "దేవ! మీప్రశ్న చాల అనుచితమైనది. పెద్దవారు గనుక, మీపై ఉన్న గౌరవంతో ఏమీ అనలేకుండా ఉన్నాను. ఏమిటి మీరు అంటున్నది? శోకసమయంలో ఈ పరిహాసమా? విశ్వగురువులైనవారు దేనికైనా సమర్థులు. అలాటివారికి నచ్చజెప్పగలమా? లోకోత్తరసుందరి అయిన సుందరికి రతి పరభాగం-తీసికట్టు- కదా? ఆమెను చూచి జగజ్జేత అయిన మరుడు కూడా రతిని మరచిపోతాడే" చంద్రునిలోనిది వెన్నెల కాదు; ఆమె కాంతే. లోక ప్రసిద్ధిని నమ్మే సామాన్య ప్రజలు గుణతారతమ్యం గ్రహించలేరు. పుష్పనిచయం తన వదనసౌరభసారాన్ని

అపహరిస్తుండడం చూచి కాబోలు, ఆమె ఆ పుష్పనిచయాన్ని దీర్ఘకేశపాశంలో కట్టివేసింది. ఆమె సవిలాస గతిని, లోచనకాంతిని దొంగలించినందువల్లనే కాబోలు హంసహరిణాలు భయపడి వనానికి పరుగెత్తాయి. ఆ అనుపమ సుందరి అయిన సారంగాక్షిని ఎన్ని సంకల్ప వికల్పాలతో కొట్టుమిట్టాడినా, ఎంత పరిచితులైనా చిత్రించడమే కష్టం. తారకాధిపతిని, ఆమె వదనాన్ని త్రాసులో పెట్టి తూచగా, వదనం కిందికివెళ్ళి తారకాధిపతి లేచిపోయాడు కనుకనే ఆకాశమెక్కాడు. లలితభ్రూలతా లాస్యలీలారమ్యమైన ఆమెవదన నందనవనం పుణ్యంతోగాని లభించదు. అది లభించకపోతే ఈ ప్రవ్రజ్య, ఈ సుకృతం ఏమి ప్రయోజనం? నాకు ఈ వ్రతపరికరాలు బరువుచేటుగా ఉన్నాయి" అని విన్నవించాడు.

రాగ నిర్భరమైన నందుని సమాధానం విని భగవానుడు తన ప్రభావంతో అతణ్ణి సురాలయానికి తీసుకువెళ్ళాడు. అక్కడ ఇంద్రుని లీలోద్యానంలో విహరించే అమృత మథన సమయంలో ఉద్భవించిన మనోహరలైన త్రిదశకాంతలను చూపాడు. వారి పాదపద్మవనం నుంచి ప్రసరించే అరుణారుణ కాంతులను చూస్తే, వారిని సముద్రతీరంలోని పగడపుదీవులు వెన్నాడుతున్నట్లు ఉంది. కమలాలను తోసిరాజని, విశాలలాస్యానికి మంత్రాంగం చేసే వారి చేతులు తమతోపాటు ఉద్భవించిన పారిజాతపల్లవాలా అన్నట్టు ఉన్నాయి. వారి వదనాలు కాంతిమాధుర్య లలితాలై, మదనానంద బాంధవాలై, విలాసంతో కమలాలను ముకుళింపజేస్తూ, చంద్రసుందరంగా ఉన్నాయి. సమ్మోహంగాను, జీవనమిచ్చేవిగానూ ఉన్న కృష్ణసారాలవంటి వారి చూపులు కాలకూటజ్వాలలు తాకిన అమృత ప్రవాహాలులా ఉన్నాయి. పూర్ణయౌవనలావణ్యాలైన ఆ దేవకాంతలను చూచి నందుడు ఆనందవదనుడై వెంటనే స్వేదంతో తడిసిపోయాడు. తామరవంటి ముఖం, పూచిన కలువలవంటి కన్నులు, కుందకుసుమాలవంటి మందహాసం, పూగుత్తులవంటి బిగిపాలిండ్లుగల వారిపై నందుని మనసు వెంటనే పడి ముందుకు వెనుకకు ఊగిసలాడే తుమ్మెదవలె తరళమైనది.

ఆ దేవకాంతాసక్తమానసుడైన నందుని చూచి బుద్ధదేవుడు ఇలా అన్నాడు: "నందా! వీరిని చూచి నీ మనస్సు ప్రీతి చెందింది గదా! వీరికీ, సుందరికీ లావణ్యంలో ఎంత అంతరముంది? పరభాగంతో హెచ్చులొచ్చులు స్పష్టంగా తెలుస్తున్నవి. ఈ అప్సరసల రూపం సుందరీరూపంకన్నా మేలుబంతి అయితే, వీరు కొంతకాలంలో నిన్నాశ్రయించేట్టు చేస్తాను. నీవు అంతవరకు మనోజాడ్యం వదలి, ప్రసన్న బుద్ధితో బ్రహ్మచర్యం అనుష్ఠించు. అంతలోగా నీకు అప్సరోగణం లభించేట్టు చేస్తాను." ఆ మాటలు విని నందుడు కృతనిశ్చయుడై "అట్లే!" అని స్వర్గాంగనల ఆశతో బ్రహ్మచర్య వ్రతానికి పూనుకున్నాడు. దివ్యాంగనేచ్ఛవల్ల ఆతనికి నిజపత్నిపై ఆదరం తగ్గిపోయింది. నిజమే! గుణగణ పణ్యం ఎక్కువగా ఉన్న వైపుకే స్నేహం మొగ్గుతుంది. దానికి నిలుకడా, నిజమూ లేదు. ఆహా! మానవుల ప్రీతి పరిచయాభ్యాసప్రవృత్తమైనది. సహవాసం తొలగితే, ప్రవాసంలో పరిశోషించి మరొకవైపుకు పరుగెత్తుతుంది. ప్రేమలు క్షణికమైన యౌవనం ఉన్నంతవరకు రమ్యంగా ఉంటాయి. రాగం కరిగిపోగానే ఆ ప్రేమలు హుళక్కి, అంతా అసత్యం, అంతా దుఃఖం. పిదప బుద్ధదేవుడు క్షణంలో నందుని ఆశ్రమానికి పిలుచుకొని వెళ్ళాడు. నందుడు మునుపటి నిశ్చయంతోనే నియతవ్రతంగా బ్రహ్మచర్యం అనుష్ఠించాడు. అన్యాయత్త చిత్తుడైన ఆతడు సుందరి లావణ్య సంపత్తిని మరచిపోయాడు.

ఇలా ఉండగా ఒకమారు నందుడు వనంలో తిరుగుతూ ఒకచోట కుతకుత ఉడికే కుంభాలతో నిండిన - కుంభీపాకనరక-భూమిని చూచాడు. అది చూచి వణికిపోయి అక్కడ ఉన్నవారిని దుఃఖంతో "ఈ ఘోర నరకానికి కారణమేమి?" అని ప్రశ్నించాడు. వారు "ఈ భూమిలో ఎర్రగా కాగిన నూరు



కుంభాలున్నాయి. ఆనందరాగి అయిన నందరాజపుత్రునికోసం ఇది కల్పితమైంది. ఆ మిథ్యావ్రతుడు ఇంకా వైరాగ్యం పొందలేదు. స్వర్గాంగనాసంగమాశతో బ్రహ్మచర్యం జరుపుతున్నాడు. మిథ్యావ్రతులు, లుబ్ధులు, రాగద్వేషరక్తచిత్తులు అయిన వారికి నిత్యతప్తాలైన ఈ కుంభాలలోనే శాశ్వత నివాసం" అని సమాధానం చెప్పారు. ఆ మాటలు విని నందునికి ఒళ్ళు జలదరించింది. తన దేహం ఆ నరకంలో పడినట్టే భావించి పశ్చాత్తప్తుడయ్యాడు.

అక్కడి నుంచి ఆశ్రమానికి తిరిగివచ్చి రాగవాసనను విడనాడి, లోకోత్తర బ్రహ్మచర్య నియమం పాలించి, సంయమం సంపాదించాడు. ఆవరించిన ఘనమోహం తొలగిపోగానే , ఆయనకు సంశయం ఛిన్నమై శరత్కాలంలోని సముద్రజలం వలె మనస్సు నిర్మలమైంది. అతనికి కామితాలు అణగిపోయాయి. ప్రశాంతి కలిగి ఉత్తమనిష్ఠ ఏర్పడింది. బుద్ధి ప్రసన్నమైంది. తర్వాత ఆతడు ఒకనాడు బుద్ధుని సన్నిధికి వచ్చి "భగవాన్! ఇక నాకు సుందరి కాని, సురసుందరులుగాని అక్కరలేదు. ఈవిషయశ్రీలు పతనంతో కూడినవి. త్వరలోనే మాసిపోయేవి. వస్తువులు అనిత్యమైనవని భావించినకొద్దీ నిరావరణ వృత్తులు ప్రసన్నమవుతాయి" అని అన్నాడు. క్రమంగా అర్హత్వమును పొందిన నందుడు ఈ విధంగా పలకడం చూచి, ఇతని సిద్ధి నిర్వాణశుద్ధమైందని బుద్ధదేవుడు అనుకున్నాడు. అంతట భిక్షువులు సుగతునితో "దేవ! నందునికి ఏ కుశల కారణాల వల్ల ఈ జ్ఞానఫలం కలిగింది?" అని ప్రశ్నించారు. "సుకృతాభ్యాసి అయిన నందునికి జన్మాంతరార్జితమైన పుణ్యాల వల్ల ఈ కుశలమూలాలయిన ఫలసంపదలు లభించాయి. విఖ్యాతమైన సత్కులంలో జననం, మన్మథ సమానమైన రూపం, సుఖాలను కలిగించే సంపద, సజ్జనానుమతమైన ఇష్టమైన చరితం, శాంతి సలిలస్నాతమైన మనస్సు, సహజ సరళ ప్రవర్తనం- ఇవన్నీ జనులకు కుశల కుసుమం కలిగించే విస్తృత ఫలాలు" అని జినదేవుడు వారికి సమాధానం చెప్పి నందుని పూర్వజన్మ వృత్తాంతం ఇలా తెలిపాడు.

"పూర్వం అరుణావతి అనే పట్టణంలో అరుణుడనే రాజు ఉండేవాడు. ఆయన విపశ్యుడనే సమ్యక్సంబుద్ధుని స్తూపాన్ని భక్తితో మణులతో తాపించాడు. ఆ మహాపుణ్యాన్ని మైత్రుడనే బ్రాహ్మణునికి పంచియిచ్చాడు. ఆ మైత్రుడు ఆ పుణ్యప్రణిధానం వల్ల ఒక గృహపతికులంలో జన్మించి భిక్షుసంఘానికి జంతుకాస్థానసత్ర క్రియలు ఒనరించి సంతోషపెట్టాడు. ప్రత్యేకబుద్ధోపస్థాయకుడైన ఆ పుణ్యశీలుడు స్థూపం నిర్మించి మాలలతో అలంకరించాడు. ఆ పుణ్యప్రణిధానం వల్ల కాశీపతి అయిన కృపికి దివ్యలక్షణాలతో ద్యుతిమంతుడనే పేర కుమారుడుగా పుట్టాడు. అర్హతుడైన కాశ్యపుడనే సమ్యక్సంబుద్ధుడు నిర్వాణం చెందగా, కాశీపతి సప్తరత్నమయమైన స్తూపం నిర్మించాడు. ఆయన స్తూపంపై రాజకుమారుడైన ద్యుతిమంతుడు దిక్కులు పిసాళించే బంగారు గొడుగును స్థాపించాడు. ఆ ప్రణిధానం వల ఇప్పుడు నందుడై శాక్యకులంలో పుట్టాడు. ఇలా నందుడు పూర్వజన్మ పరంపరాప్రాప్తమై, సత్కార్య ఫలితమైన అపారపుణ్యంతో ఉన్నతవంశంలో జన్మించి, అపూర్వ రూపాన్ని సమాన భోగాలను పొందాడు. తుదకు శమగుణప్రాప్యమైన సౌగతసంపత్తిని పొందాడు."

ఈ విధంగా భగవానుడు నందుని కుశలానికి కారణం చెప్పి బిక్షు సంఘానికి ఆయా సుకృతోపదేశాలు చేశాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సుందరీ నందావదానమనే పదమపల్లవం

# 11. విరూఢకావదానం

నిర్మల బుద్ధిగలవారు విమలకుశల సోపానాలతో ఉన్నత పదవిని అధిరోహిస్తారు. మలిన మతులు ఘోరాంధకార బంధురమైన నరక కుహరాల్లో పడుతారు.

పూర్వం శాక్యుల మహానగరమైన కపిలవస్తులో మహానుడనే శాక్య ముఖ్యుడు ఉండేవాడు. ఆయన ఇంట్లో సుముఖి అయిన దాసకన్యక ఉండేది. ఆ కన్య శాస్త్రాలలో పరిశ్రమ చేసింది; సర్వకళలలోను కుశలురాలు. ఆమె పేరు మాలిక. గుణాలప్రోవయిన ఆమె పేరుకు తగినట్టు మదనుని మాలికలాగ ఉండేది. తన యజమాని ఆజ్ఞపై ఆమె ఒకమారు పూలు కోయడానికి ఉద్యానవనానికి వెళ్ళింది. అక్కడ, ఎదుట వస్తున్న బుద్ధదేవుని దర్శించింది. ఆయనను దర్శించి ఆమె మనస్సు ప్రసన్నమైంది. పవిత్రాత్ములు స్వచ్ఛమైన శరత్కాలంవలె మానసాన్ని ప్రసన్నం చేస్తారుగదా! లోకోపకారప్రీతి మనసులో వెల్లువెత్తిన ఆమె "నే నిచ్చే భిక్షను కూడ భగవానుడు స్వీకరిస్తే ఎంత సుకృతం?" అని అనుకుంది తనలో. సర్వజ్ఞుడు ఆమె సత్సంకల్పాన్ని గ్రహించి, కరుణాకులుడై భిక్షాపాత్ర ముందుకు చాచి "భద్రే! భిక్ష వేయి" అని అడిగాడు. ఆమె భిక్ష యిచ్చి, నమస్కారం చేసి, పరిపూర్ణ మనోరథురాలై దాస్యదుఃఖ నివృత్తి కోసం ప్రణిధానం చేసింది.

ఒకమారు ఆ దాసకన్య తండ్రికి మిత్రుడైన ఒకానొక బ్రాహ్మణుడు ఆ ప్రాంతానికి వచ్చాడు. ఆయన జ్యోతిష్కుడు. ఆమెను చూచి ఆశ్చర్యపడి "అయ్యో! నా మిత్రుడు శ్రీమంతుడు అయిన ఆ గృహపతి కుమార్తెవుకదా నీవు! బంధువిహీన కావడం వల్ల ధనభోగ విరహితవై, దాస్యం అనుభవిస్తున్నావు. ఆహా! సంపదలు మోహమనే వర్షాకాలంలో క్షణం సేపు మెరిసే మెరుపులవంటివి; సంసారమనే సర్పం నాలుకవలె చపలమైనట్టివీని. గడచినవాటికి విచారపడవద్దు. నీ హస్తరేఖాలక్షణాలను బట్టి చెబుతున్నా. నీవు త్వరలోనే భూమీశుని వల్లభవు అవుతావు. లక్ష్మీకమల కోమలమైన నీచేతిలో మాల, చక్రం, అంకుశం - ఈ ఆకారపు రేఖలు నాకు కనిపిస్తున్నాయి" అని చెప్పి వెళ్ళాడు.

ఇలా ఉండగా మన్మథుని భోగాలకు నెచ్చెలి, తుమ్మెదల చుట్టము, లతాలింగన సౌభాగ్య భవ్యమూ అయిన వసంతకాలం వచ్చింది; ప్రకృతికంతా కొత్త సోయగం తెచ్చింది. ఆశోకమంజరి కాంతల మానమద ద్విపద్వేషి అయి ఆ మధుకేసరి నాలుకవలె కనిపించింది. కాంతల కపోల లావణ్యాన్ని దొంగిలించిన చంపకపుష్పాలు వారి కేశపాశంలో బందీలయాయి. వసంతరాజు తన సహకార వర్గంతో విరహిణులను వధించడం ప్రారంభించాడు. దొరలు నిష్కారణంగానే ఇతరులను వధిస్తూ ఉంటారు. ముగ్ధసుందరుల సౌందర్యవిభూతి వెంటనే చతురుల పాలయినట్టు మామిడి పూగుత్తులు పూర్తిగా తుమ్మెదల పాలయాయి. చూతలతాచాపంలో శిలీముఖాలను తొడిగిన చూతాయుధుడైన మన్మథుడు విరాజిల్లుతున్నాడు - అని మన్మథుని వందిమాగధులు జయగీతాలు ఆలపించినట్టుగా కోకిలలు పంచమం వినిపించాయి. ఈ



సందర్భంలో కోసలాధిపతి ప్రసేనజిత్తు వేటకు బయలు దేరి, గుర్రం మరొక దారికి ఈడ్వగా ఆ ప్రాంతానికి వచ్చాడు. ధనుర్ధారి అయిన ఆ మనోహరాంగుడు కపిలవస్తుపురం ఉద్యానవనం వద్ద గుర్రం దిగి రెండవ రతిలాగ అనన్యరూప లావణ్యవతి అయిన ఆ దాసకన్యను చూచాడు. ఆమెను చూడడంతోటే మెత్తబడిన ఆయన మనస్సులో మన్మథుడు ఆ చూపులదారినే వింతగా అడుగుపెట్టాడు. తనను చూడగానే అకస్మాత్తుగా భయపడి సిగ్గుపడుతున్న ఆమెను చూచి, ఆమె శరీరలావణ్యకాంతికల్లోనిలో కొట్టుకొనిపోతూ రాజు ఇలా అనుకున్నాడు: "తరలతారక, శ్యామ అయిన ఈ నూతన శశిముఖి ఎవరు? ఈమె కాంతి అనవరతం నేత్ర శతపత్రాలు వికసింపజేస్తున్నదే. ఈమె ముఖం కుముదాయుధుడైన మనోహర వసంతునిలాగ వకుళామోద విభ్రాంత భ్రమరం, పాటలాధరం. ఆహా! యౌవనానికి ఆభరణమైన ఈమె అమ్లాన లావణ్యం ఏమని చెప్పను? నాబోటి ధీర హృదయుని ధైర్యం కూడ కరిగిపోయింది. మధుమంజరి గుణవిశేషం మొదటినుంచీ అద్భుతమే. ఆరు కాళ్ళున్న షట్పదం కూడ ఒక్క అడుగూ ముందుకు వేయలేకపోతుంది!"

ప్రసేనజిత్తు ఈ విధంగా తలపోసి, ఆమెను వనదేవత అని భావించి, తర్వాత ఆమె వృత్తాంతం అడిగాడు. ఆమె క్రమంగా తన సంగతి తెలియజేసింది. పిదప ఆమె చల్లని పరిశుభ్రమైన జలం అందించి, ఆతిథ్యమిచ్చి, చిగురుటాకు వీవనతో విసిరింది. ఆమె అతిథ్యానికి రాజు చాల సంతసించాడు. తర్వాత ఆమె ఆయన పాదాలు ఒత్తింది. రాజు అలసి ఉన్నాడు గనుక అమె మృదు కరస్పర్శతో వెంటనే నిద్రపోయాడు. క్షణంలో వేట బడలిక తీరు మేల్కొని దివ్య స్పర్శ వల్ల ఆమె రూపాంతరం పొందిన రతీదేవి అని అనుకున్నాడు. ఇంతలో కోసలేశ్వరుడు వచ్చిన వార్తను ఆమె యజమాని విని అక్కడికి వచ్చి, ఆయనను సముచితరీతిగా సత్కరించాడు. రాజు ఆ కన్యను తనకిచ్చి పెండ్లి చేయవలసిందని ఆమె యజమాని మహానుణ్ణి సాదరంగా కోరాడు. మహానుడు తన కుమార్తెవలె పెంచిన, మన్మథమంగళ మాలికవలె ఉన్న ఆ మాలికను అర్హుడైన ఆ రాజపుంగవునికి దానం చేశాడు.

రాజు తేటనవ్వులతో మన్మథ వైజయంతివలె ఉన్న ఆ మాలికను పిలుచుకొని ఏనుగెక్కి స్వనగరానికి వెళ్ళాడు. ఆ నగరాజువంటి గజరాజుపై కదిలే ముంగురులనే తుమ్మెదలతో, రాజవసంతునితో ఉన్న ఆ మాలిక నవమాలికలాగ ఒప్పారింది. రాజు ఆ సుందరితో సహా రాజధాని చేరి మణిమయమైన రాచనగరులోని విశాలభవనాలలో విహరించాడు. వర్షాకార అనే పేరుగల రాజు మొదటిభార్య మాలికను చూచి ఆమె చంచలగతిలేని రాజలక్ష్మి అని భావించింది. మాలిక దివ్య స్పర్శగలది; వర్షాకార అపూర్వ రూపసంపద గలది. వారిద్దరూ పరస్పర గుణోత్కర్షంతో విస్మితులయ్యారు. పెద్దభార్య దివ్య రూపవతి; రెండవభార్య దివ్య స్పర్శవతి అనే వింత ప్రవాదం జనంలో వ్యాపించింది.

ఈ దివ్యరూప దివ్యసంస్పర్శలకు కారణమేమిటని భిక్షువులు ఆశ్రమంలో బుద్ధదేవుణ్ణి ప్రశ్నించారు. ఆయన ఇలా అన్నాడు: "పూర్వం శ్రుతవరుడనే బ్రాహ్మణ గృహస్థుకు కాంత, శిరీషిక అనే ఇద్దరు భార్యలుండేవారు. కాంతకు ఒక సోదరుడు ఉండేవాడు. ఆయన సన్యసించి, క్రమంగా తపస్సాధనతో ప్రత్యేకబుద్ధ సిద్ధి పొందినవాడు. ఆయన ఒకమారు తన చెల్లెలి యింటికి వచ్చాడు. ఆమె పతి అనుమతితో ఆయనకు స్వాగతమిచ్చి సవతితోపాటు మూడు నెలలు భక్తితో ఉపచారం చేసింది. ఆయనకు వారు సుందర మృదుభోగాలతో ఉపచారం చేయడం వల్ల ఈ జన్మలో చారురూప సంస్పర్శలు

గలవారుగా పుట్టారు. సుమతులు నిగ్రహం గల ఇంద్రియ సమూహోమనే వినయ విలసిత గోగణంతో తపస్తాపతప్తమైన ఈ దేహమనే క్షేత్రాన్ని మొదట దున్ని మెత్తబడిన తర్వాత సకాలంలో సత్కర్మ శక్తి శుభభీజాలను విత్తి ఆ సత్కర్మశక్తి, పరిపాకంతో పండిన ఫలసంపదను అనుభవిస్తారు." సర్వజ్ఞుని ఈ మాటలు విని భిక్షువులు అది యిలాగే అయి ఉంటుందని నిశ్చయించి ప్రశాంతచిత్తులయ్యారు.

కాలక్రమాన ప్రసేనజిన్మహారాజుకు, మాలికాదేవికి ఒక కుమారుడు ఉదయించాడు. అతనికి విరూఢకుడని నామకరణం చేశారు. అతడు క్రమంగా పెరిగి పెద్దవాడై, విద్యలన్నిటిలో ఆరితేరాడు. అతనికి సమానవయస్కుడైన దుఃఖమాత్రికుడనే పురోహితపుత్రుడు ప్రియమిత్రుడుగా ఉండేవారు. ప్రసవసమయంలో తల్లికి చాల కష్టం కలిగినందున ఆ పురోహితపుత్రుని పేరు దుఃఖమాత్రికుడని ప్రసిద్ధిపడింది. విరూఢక రాజపుత్రుడు ఆ పురోహితసుతునితోపాటు ఒకనాడు గుర్రమెక్కి వేటకోసం శాక్యోద్యానానికి వెళ్ళాడు. అక్కడి ఉద్యానపాలకులైన శాక్యులు గర్వంతో ఆయుధాలెత్తి "ఇడుగో! మన దాసీపుత్రుడు!" అని అతనిని అవమానించారు. అతడు చాల దుఃఖంతో తన పట్టణానికి తిరిగి వెళ్ళి శాక్యులు పొగరుతో తనపై పగ పూనడం తలచి ఆలోచించాడు. దేహులకు కులదర్పాపవాదం మనశ్శల్యం వంటిది. వారిపై పగదీర్చుకోవాలని అతని మనసు కుమిలిపోయింది. అధికారం, రాజ్యం ఉంటేనేగాని పగతీర్చుకొనడం సాధ్యం కాదు. కనుక అతనికి తండ్రి జీవించి వుండగానే, రాజ్యం ఆక్రమించుకోవాలని ఆశ కలిగింది. అందువల్ల భేదోపాయంతో చారాయణుడు మొదలయిన ఐదువందలమంది మంత్రులను తండ్రినుంచి విడదీసి తనవశం చేసుకున్నాడు.

ఇలా లోలోపల కుట్రలు జరుగుతుండగా ప్రసేనజిత్తు వివేకం కలిగి, ధర్మోపదేశం వినాలనే మహాదరంతో రథమెక్కి చారాయణుడు రథం తోలగా, సర్వజ్ఞుడైన బుద్ధదేవుని దర్శించడానికి బయలుదేరాడు. ఆశ్రమం చేరిన తర్వాత భగవానునికి పాదాభివందనం చేసి ప్రసన్న బుద్ధితో ధర్మోపదేశం విన్నాడు. ఇంతలోగా చారాయణుడు త్వరగా నగరానికి వెళ్ళి రాజపుత్రుడైన విరూఢకునికి పట్టం కట్టాడు. ఇక్కడ రాజు భగవానుని అనుమతి పొంది, నగరానికి తిరిగి వెళ్ళబోగా, పరిజనులుగాని, రథంగాని, మంత్రి చారాయణుడుగాని కనుపించలేదు. ఆ పృథివీపతి కాలినడకనే మెల్లిగా బయలుదేరాడు. ఇంతలో ఎదుట దూరంలో వర్షాకార, మాలిక వస్తుండడం కనిపించింది. రాజు వారిని "ఏమిటిది? ఇలా వస్తున్నారు?" అని ప్రశ్నించగా, వారు విరూఢకుని పట్టాభిషేక వార్తను తెలిపారు. ప్రసేనజిత్తు చాల కష్టపడి, మాలికను పుత్రుని ఐశ్వర్యం అనుభవింపమని చెప్పి వదలిపెట్టి, పెద్దభార్య అయిన వర్షాకారతో పాటు తనమిత్రుడైన అజాతశత్రురాజధాని అయిన రాజగృహపట్టణానికి బయలుదేరాడు. ఆ రాజు దారిలో ఛత్రం లేని దానివల్ల ఎండకు వాడిపోతూ, ఆకలి దప్పితో బాధపడుతూ మరుభూమి వడగాలికి శ్వాసాలను కక్కుతున్నట్టుగా రొప్పుతూ నడిచాడు. సుఖం ఎల్లకాలం ఎవరికి ఉంటుంది? ఎల్లకాలమూ ఎవరు జీవించి ఉంటారు? సంపదలు వెంటనే క్షీణించడం కూడా తరుచు చూస్తున్నాము. ఆయన ఆకలి బాధకు భరించలేక తన పూర్వజన్మ దీర్ఘకర్మవలె ఉన్న ఒక పొడుగాటి ముల్లంగి గడ్డను తిని నీళ్ళు తాగాడు. వెంటనే విషూచి తగిలి మరణించాడు. ప్రాణులు అపాయనికాయమైన ఈ కాయం అనిత్యమని తెలుసుకోక మోహంతో దానిని రక్షించుకొనడానికి ఆశపడుతారు. కోసలేశ్వరుడు వచ్చిన సంగతి విని అజాతశత్రువు ఎదురుగా వచ్చి దుమ్ముకొట్టిన ముఖంతో ఉన్న అతనిని చూచాడు. కాని ఏమి ప్రయోజనం? అదివరకే



ప్రసేనజిత్తుడు మరణించాడు. భార్య వర్షాకార కూడ పతివియోగ దుఃఖంతో ప్రాణాలు త్యజించింది. అజాతశత్రువు ఆయనకు ఆమెకు ఉత్తరక్రియలు చేసి దుఃఖశాంతికోసం బుద్ధదేవుని దర్శించడానికి వెళ్ళాడు.

అజాతశత్రువు భగవానునికి నమస్కరించి, "భగవన్! నిర్ధనుడైన కోసలేశ్వరుడు మిత్రుడైన నా పట్టణానికి వచ్చి మరణించాడు. నేను పాపిష్ఠుణ్ణి. నా సంపద కాల్చనా? అజ్ఞానం వల్ల నా సంపదను మిత్రుని ఉపకారానికి వినియోగించకపోయి అపకీర్తిపాలయ్యాను. ఆపత్సమయాన మనసులో ఎంతో ఆశపెట్టుకొని వచ్చిన మిత్రుని వద్దకు వచ్చినవాడు నిష్ఫలుడైపోతే, ఆ మిత్రుని జన్మ ఎందుకు? మిత్రోపకరణంగా సంపదను, దీనోపకరణంగా ధనాన్ని, భయార్తులకు ఉపకరణంగా ప్రాణాలను వినియోగించేవారు ధన్యజీవులు. దేవా! ప్రసేనజిత్తు ఈ జన్మలో ఇలాటి దుర్దశా పరిపాకం పొందడానికి పూర్వజన్మలో ఏమి దుష్కర్మ చేశాడు?" అని కన్నుల నీరు నింపుతూ ప్రశ్నించాడు. భగవానుడు తాపం శమింపజేసే దశనచంద్రికలను వెల్లివిరియజేస్తూ ఇలా అన్నాడు. "ఓరాజా! దుఃఖపడవద్దు. ఇది ఈ సంసారపద్ధతి. అసత్యమైన ఈ పదార్థాల అనిత్యత ఇలాటిదే. ఈ సంసారమనే విస్తృతమైన వనంలో కాలమనే సహజచంచలమైన భృంగం స్వేచ్ఛగా జనించిన ప్రజలనే పూవుల ప్రాణకింజల్క పుంజాలను కబళిస్తుంది. చకితహరిణీలోచనలతో చంచలమైన ఈ భోగాలు తరంగాలవంటివి. జనులు అనుభవించే సిరి, మేఘాలలో మెరుపులాగ క్షణకాలం కనిపించిమెరిసేది. శరీరంలోని నవవయస్సు కమలంపై సోకే బాలాతపరాగంవలె కొంతసేపే ఉండేది. సంసారమరుభూమిలో జీవమనే జలబిందువులు క్షణంలో హరించుకు పోతాయి. మైత్రీపాత్రమైన మనస్సు, పరహితరతి, ధర్మధనం, మదాతిరేకాన్ని పోగొట్టగల శమసౌభాగ్యం, తత్త్వచింత- ఈ గుణాలు విషయ సుఖవిముఖులకు ఈ అసారమైన సంసారంలో ఎలాటి వికారాలను, పరిభవాన్ని కలిగించవు. దేహి కష్టం కలుగగానే, రాతి దెబ్బ తగిలినట్టు వెంటనే దుఃఖపడతాడు; కాని, ఆదెబ్బకు ప్రతిక్రియ చేయడు. వివేకరహితుడై సంసారాయాసాన్ని చూస్తున్నప్పటికీ మోహంతో కుశలం ఆలోచించని దేహిని ఏంచేస్తాం?

"పూర్వం సుశర్మ అనే ఒక విప్రుడు ఎక్కడినుంచో సంపాదించిన ముల్లంగిగడ్డను తల్లిచేతి కిచ్చి, స్నానం చేయడానికి నదికి వెళ్లాడు. ఈలోగా ఒక ప్రత్యేకబుద్ధుడు భిక్షాపాత్రధారియై అక్కడికి వచ్చాడు. ఆమె ఆయనకు ఎదురుగా వెళ్ళి నమస్కరించి ఆ ముల్లంగిని భిక్ష యిచ్చింది. కొంతసేపటికి సుశర్మ స్నానం చేసి వచ్చి, ఆకలితో తాను తెచ్చిన ముల్లంగిని తెమ్మన్నాడు. "నాయనా! దానిని నేను అతిథికి సమర్పించాను. నీకు పుణ్యం కలిగింది. అంగీకరించు" అని ఆమె అన్నది. తల్లి మాటలు విని విప్రుడు బాణం తగిలినవాడిలాగ బాధపడ్డాడు. "నా ముల్లంగి తిన్న నీ అతిథికి విషూచి తగిలి, అతని కడుపు చీల్చుకొని ప్రాణాలతోపాటు వెలుపలికి రానీ!" అని కోపంతో కఠినంగా పలికాడు. ఈ విధంగా తీవ్రపరుషవాక్కులతో పాపం సంపాదించిన ఆయనకు మరుసటి జన్మలో అవసానదశలో విషూచిక తగిలింది. అతడే మరొకజన్మలో సంపాదించిన పుణ్యపరిపాకం వల్ల ఇప్పుడు ప్రసేనజిత్తుగా పుట్టి విస్తారరాజ్యం సంపాదించి, దానితోపాటే నశించిపోయాడు. సంసారపథపాంథులైన ప్రాణులకు శుభాశుభ కర్మ అనేదే చేతిలో ఉన్న పాథేయం. అదే అనుభవానికి వస్తుంది." అజాతశత్రుభూపాలుడు బుద్ధదేవుని తథ్యమూ పథ్యమూ అయిన మాటలు విని "ఇది ఇలాగే అయిఉంటుంది." అనుకొని నమస్కారం చేసి వెళ్ళిపోయాడు.

ఇది ఇలా ఉండగా, రాజ్యం పొందిన విరూఢకుడు పురోహిత పుత్రుడైన దుఃఖమాత్రికుని ప్రోత్సాహంతో శాక్యులపై పగతీర్చుకోదలచాడు. బుద్ధిని మోహం కప్పినట్టు సైన్యంలోని రథగజాశ్వాల ధూళితో దిక్కులను కప్పుతూ శాక్యనగరంపై దండెత్తాడు. అతని ఈ దుష్టచేష్టితం సర్వజ్ఞుడైన బుద్ధదేవుడు గ్రహించి, శాక్యనగరానికి వెళ్ళి, దాని సమీపంలో ఒక ఎండిపోయిన మానుకింద నిలబడ్డాడు. సైన్యంతో శాక్యనగరానికి వస్తున్న విరూఢకుడు దూరంనుంచే మోడుకింద నిలబడి ఉన్న బుద్ధదేవుని చూచి, రథం దిగి, ముందుకు వచ్చి నమస్కరించి "భగవన్! దట్టమైన నీడ యిచ్చే ఆకులు, పొడుగాటి కొమ్మలు ఉన్న పచ్చని చెట్లు ఉండగా, ఈ ఎండిపోయిన చెట్టుక్రింద ఎందుకు విశ్రమిస్తున్నారు?" అని ప్రశ్నించాడు. విరూఢక మహారాజు మాట విని జినదేవుడు "రాజా! జ్ఞాతుల నీడ చందనం కంటె చల్లనిది. జ్ఞాతులతో సమానమైన ధనం, జ్ఞాతి సమూహంతో సమానమైన ధైర్యం, జ్ఞాతులతో సమానమైన నీడ, జ్ఞాతుల వంటి ప్రియజనం లేదు. ఈ శాక్యులు నాకు జ్ఞాతులు. వారి పట్టణప్రాంతంలోని ఈ ఎండిపోయిన మాను కూడ వారిపై ప్రీతి వల్ల ప్రియమే అయింది" అని అన్నాడు. విరూఢకుడు ఆ మాటలు విని బుద్ధదేవుడు శాక్యులపై అభిమానం కలవాడని గ్రహించి వెనుదిరిగి పోయాడు.

తర్వాత భగవానుడు శుద్ధమైన సత్త్వగుణంగల శాక్యులకు రానున్న ఆపదను తెలుసుకొని, వారి శ్రేయస్సుకోసం హితవు చెప్పాడు. ఆయన ఉపదేశం వల్ల కొందరికి స్రోతాపత్తిఫలం, మరికొందరికి సకృదాగామి ఫలం, ఇంకా కొందరికి అనాగామి ఫలం కలిగింది. తక్కిన శాక్యులు మూఢమతులై అలాటి ఫలం పొందలేక పోయారు. ఈ లోకంలో పట్టపగలే చీకటయిన పక్షులూ ఉన్నాయికదా!

బుద్ధోపదేశంతో తిరిగి వెళ్ళిపోయిన విరూఢకుని వైరసర్పాన్ని పురోహితపుత్రుడు మరల ఉసిగొల్పాడు. దానితో విరూఢకుడు శాక్యకుల వినాశానికి మరల సంకల్పించాడు. వైరానలాన్ని దుష్టుడనే అనిలం ఎగసన దోయడం సహజమే కదా! దుర్జనులు ఘోర మంత్రాంగంతో అకస్మాత్తుగా రెచ్చిపోయిన క్రూరరాజులు భయంకర అభిచారాది మంత్రాలతో తక్షణం ఆవేశించే బేతాళులలాగ ప్రాణాలు తీస్తారు. గజరథాది దళాలతో నిండిన విరూఢకుని సైన్యం దారివెడలి వస్తుండగా, శాక్యులు తమ నగర మార్గాలన్నిటినీ రక్షించడానికి పూనుకున్నారు. నగరవాసులలో కలకలం పుట్టింది. ఈ అవస్థ చూచి శాక్యపక్షపాతి అయిన మహామౌద్గల్యాయనుడు వారి రక్షణకు పూనుకోగా, భగవానుడు ఇలా అన్నాడు:- "కర్మ దోషం వల్ల శాక్యులకు ఈ విపత్తు సర్వథా వచ్చి పడింది. నీవు వారిని రక్షించడానికి పూనుకోవడం ఆకాశానికి సేతువు కట్టడం వంటిది. దేహులకు అకస్మాత్తుగా శుభాశుభమైన విభవాలు వస్తూ పోతూ ఉంటాయి. స్వకీయ జన్మలో స్వయంగా వ్రాసుకున్న కర్మాక్షరాలు ఊరికేపోవు." ఆ మాటలు విని మహామౌద్గల్యాయనుడు నమస్కరించి వెళ్ళిపోయాడు.

విరూఢకుడు సైన్యంతో దగ్గరికి వస్తుండగా, శాక్యులు శత్రువులు విడిచిన బాణాలు దేహంలో చొచ్చుకొని పోయినప్పటికీ ఒక్క ప్రాణిని కూడ హింస చేయరాదు అని ప్రతిజ్ఞ చేసుకొని కర్రలు కూడ ధరించకనే, శత్రువుల కార్ముకాలను వారించక ధీరులై నిలబడ్డారు. ఇంతలో కర్మవశాత్తు పరదేశానికి వెళ్ళిన శంపాకుడనే శాక్యుడు స్వనగరానికి తిరిగి వచ్చాడు. వానికి ఈ ప్రతిజ్ఞ సంగతి తెలీదు. వాడు తమ నగరంలో యుద్ధసన్నద్ధుడైన విరూఢకుని చూచి, కోపంతో, ఒక్కడే ఎదిరించి పలువురు భటులను హతమార్చాడు. ఆ పురుష సింహాని పరాక్రమానికి ఎరలయిన వీరకుంజరులు ముత్యాలవంటి యశస్సుతో



కనులపండువు చేశారు. శత్రువులను చూచి కోపంతో రెచ్చిపోయిన ఆయనకత్తి ప్రతాపంతో విపులమైన రిపువాహినిని కాల్చివేసింది. తాము చేసుకొన్న శపథానికి భంగంగా శత్రువులను చంపడం వల్ల శాక్యులు శంపాకుణ్ణి నగరంలో చేరనివ్వలేదు. క్రూరమైన కృత్యం చేయడం వల్ల స్వజనులు కూడ అతనిని వదలివేశారు. ధర్మబంధువులై సజ్జనులు తమవాడైనా క్రూరుడైతే విముఖులౌతారు. ఉచితానుచితాలు తెలిసినవారికి ధనం కంటే దాతృత్వం, స్వజనులకంటే సత్కర్మ, ఆయుస్సుకంటే యశస్సు ఇష్టమైనవి. అలా వెలివేయబడిన శంపాకుడు బుద్ధదేవుని సన్నధికి వచ్చి, తన శ్రేయస్సుకోసం ఆయన చిహ్నమేదైనా ఇమ్మని అభ్యర్థించాడు, భగవానుడు తన పవిత్రకేశాలు, నఖాలలో కొంత ఆయనకు అనుగ్రహించాడు. ఆయన వాటిని స్వీకరించి, వాకుడమనే మండలానికి వెళ్ళాడు; అక్కడ తన శౌర్యోత్సాహాలతోను, ప్రజ్ఞాప్రభావంతోను రాజ్యం సంపాదించాడు. ధీరులైన వారికి సంపదలు అన్నిచోట్ల సులభంగా లభిస్తాయి. సమర్థులకు సంపద సహజలక్షణం; విద్వాంసులకు యశస్సు సహజం; కృషి చేసేవారికి సర్వసిద్ధులూ భార్యలలాగ ఆశ్రయిస్తాయి. శంపాకుడు అక్కడే రాజ్యం పాలిస్తూ, ఆ కేశనఖాంశంపై స్తూపం నిర్మించి, శ్రేష్ఠమైన రత్నాలతో తాపించాడు.

ఇక్కడ విరూఢకుడు ఏ విధంగానైనా పగసాధించే తలంపుతో, యుక్తితో నగరద్వారాలు భేదించుకొని, తక్షణం నగరంలో ప్రవేశించాడు. అక్కడ డెబ్భైయేడు వేలమంది శాక్యులను చంపి, వేయిమంది శాక్య కన్యకలను, శాక్యకుమారులను బందీలుగా పట్టుకున్నాడు. ఐదువందలమంది శాక్యులను ఏనుగులచేత మట్టించి, ఆయుధాలచేత కొట్టించి, ముష్టియుద్ధం చేత మర్దించి, నగరాన్ని యమనగరం చేశాడు.

శత్రువుల వల్ల శాక్యులకు కలిగిన ఈ వినాశాన్ని భగవానుడు కర్మానుబద్ధమని బావించి, క్షణంసేపు దుఃఖాకుల మనస్కుడయ్యాడు. అంతట కరుణా తరంగితులైన భిక్షువులు ఆయన వద్దకు వచ్చి, "దేవ! ఈ ఘోరఫలం అనుభవించడానికి శాక్యులు ఏ దుష్కర్మ చేశారు?" అని ప్రశ్నించాడు. దానికి సర్వజ్ఞుడైన భగవానుడు ఇలా సమాధానం చెప్పాడు. "నిజకర్మ విపాకం వల్లనే శాక్యులకు ఈ వినాశం కలిగింది. పూర్వం ఒకనదినుంచి చేపలవారు రెండు పెద్ద చేపలను గాలం వేసి లాగి బాధించారు. మరుసటి జన్మలో ఆ చేపలవారే సంపన్నులై పుట్టి ధనహరులై, గృహపతులై పుట్టిన ఆ రెండు చేపలను పట్టి కాల్చివేశారు. ఆ చేపలు, గృహస్థులు విరూఢక పురోహిత పుత్రులే. చేపలవారుగాను, తస్కరులుగాను ఉండి, శాక్యులై పుట్టినవారి మృత్యువునకు కారణమయ్యారు." భగవానుడు చెప్పిన ఈ విషయాన్ని విని సకల భిక్షువులు కర్మఫల సంతతి తిరుగులేనిదని భావించారు.

విరూఢకుడు విజయగర్వంతో తన పట్టణానికి తిరిగి వెళ్ళాడు. ఆయన కుమారుడైన జేత అనే బాలుడు తండ్రిని చూచి, చనువుతో బాల్యచాపల్యంతో "నాయనా! శాక్యులందరినీ హతమార్చారా? వారు మనకేమీ అపరాధం చేయలేదే?" అన్నాడు. జేత మాట విని విరూఢకుడు మండిపడి వాణ్ణి చంపివేశాడు. మదించి కనిపించిన దానినంతా చంపుదామనే కండకావరం గల ఏనుగు తన కాలి కింద ఉన్న కట్టుకొయ్యను నలిపివేసినట్టు పోతరించిన దుర్మార్గుడు తనకిందవారిని తొక్కివేస్తాడు, చంపుతాడు. ఇంకా ఏమేమి చేయడు?

తర్వాత విరూఢకుడు కొలువు తీర్చి. తన భుజాలు చూచుకుంటూ, ఇలా అన్నాడు. "ఆహా! నా కోపాగ్నిలో శత్రువులు మిడతలవలె మాడిపోయారు. యమపురి తోరణస్తంభాలలాగ విశాలమైన నాయీ భుజాలు శాక్యుల నిశ్శేషవధ దీక్షతో గురుత్వం పొందాయి." తన పరాక్రమాన్ని శ్లాఘించుకుంటున్న విరూఢకుని మాట విని బందీలయిన శాక్యకన్యలు ఉద్వేగంతో తలలు వంచుకొని, ఇలా తీవ్రంగా అన్నారు. "కర్మపాశ బద్ధులైన జీవులు తమ పక్షంవారి బలం ఉన్నప్పటికీ, పక్షాలు(రెక్కలు) ఉన్నప్పటికీ పక్షులు వలనుంచి తప్పించుకొని ఎగిరిపోలేనట్టు మరణాన్ని దాటలేరు. ఈ సృష్టి అంతా కర్మ తంత్ర యంత్రితం. దాని ప్రభావం వల్ల నిప్పు చల్లారిపోతుంది; బాడబాగ్ని నీటిలో ప్రవేశిస్తుంది; చండకిరణుణ్ని రాహువు చులాగ్గా మింగివేయదగిన అదను చూచి పట్టుకుంటాడు. కర్మచేష్టితమంతా ఆలోచనకు అందనిదీ, ఆశ్చర్యమైనదీని." ఈ మాటలు విని రాజు తొకతొక్కిన పాములాగ ఘోరకోపవిషం కక్కుతూ, వారి చేతులు తెగగొట్టవలసిందని ఆజ్ఞాపించాడు. తలవరులు రాజాజ్ఞ ప్రకారం ఒక పుష్కరిణీ తీరంలో ఆ శాక్య కన్యల చేతులు తెగగొట్టారు. ఆ క్రూరకర్మ జరిగిన పుష్కరిణి ఇప్పటికీ 'హస్తగర్భ' అనే పేరుతో ఉన్నది. దయారహితులు లతలపై కుమ్మునిప్పులు చల్లుతారు; కమలినిని రంపంతో కోస్తారు; పూలమాలలపై రాళ్ళవర్షం కురిపిస్తారు. కరకమలాలు తెగిన ఆ శాక్యకన్యలు తీవ్రబాధతో బుద్ధదేవుని ధ్యానించి, శరణు వేడారు. సర్వజ్ఞుడు వారి మర్మభేదకరమైన వ్యధను తెలుసుకొని, వారిని ఊరడించడానికి శచీదేవే తగినదని ఆమెను స్మరించాడు. ఆయన తలవగానే శచీదేవి వారికి ప్రత్యక్షమై శాక్యకన్యకలను స్పృశించింది. తాకగానే వారికి మరల హస్తాబ్జాలు మొలుచుకొని వచ్చాయి. వారు దివ్య వసనాలు ధరించి, ఈ శరీరం వదలి, దివ్య శరీరంతో మనశ్శాంతితో స్వర్గానికి వెళ్ళారు. పిదప దేవతా సమానలు, దివ్య పద్మోత్పలాంకితలు అయిన ఆ కన్యలు శాస్త అయిన సుగతుని ధర్మోపదేశంతో ఉత్తమ లోకం పొందారు.

ఈ సమాచారం విన్న భిక్షువులు "భగవన్! శాక్యకన్యల కర్మఫల మేమిటి?" అని ప్రశ్నించగా, భగవానుడు ఇలా అన్నాడు, "శాక్యకన్యలు భిక్షువులను చేతులు తిప్పితిప్పి వెక్కిరించారు. ఆ కర్మ పరిపాకంతో ఈ ఘోర కృత్యానికి గురి అయ్యారు. నా ధ్యానంతో మనస్సు ప్రసన్నత పొంది శుభగతి చెందారు." ఈ విధంగా ప్రసంగవశాన బుద్ధదేవుడు భిక్షువులకు కర్మఫలపాక వైచిత్రిని ఉపదేశించాడు.

ఈ మాటలను విరూఢక మహారాజు ఆజ్ఞతో అంతటా తిరుగుతున్న ఒక గూఢచారి విని, రాజు దగ్గరికి వెళ్ళి, "మహారాజా! బుద్ధదేవుడు భిక్షువులకు ఉపదేశించే సమయంలో 'భూపతికి స్వకర్మఫలం సమీపించింది. రాజు, పాపాత్ముడైన పురోహితుడు ఏడుదినాలలో నిప్పులో పడి మరణించి అవీచి అనే నరకంలో పడుతారు' అని అన్నాడు" అని విన్నవించాడు. విరూఢకుడు భయపడి, పురోహితునితో సహ ఏడునాళ్ళపాటు జలగృహంలోనే వసించాడు. ఏడునాళ్ళు ముగియడానికొక క్షణం ఉందనగా, అంతఃపురంలో సూర్యరశ్మికి సూర్యకాంత మణులనుంచి నిప్పు పుట్టి, ప్రళయాధ్వరాగ్నివలె విజృంభించింది. విరూఢకుడు సపరివారంగా భగ్గున మండిపోయి, అవీచి అనే నరకంలో పడ్డాడు. ఈ లోకంలో ద్వేషాసూయలతో మండే స్వభావంగల పాపులు పరలోకంలోను అగ్నిజ్వాలలకు గురి అవుతారు, చల్లని స్వభావంగల పుణ్యవంతులు అన్నిలోకాలలోను స్థిర సుఖం అనుభవిస్తారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో విరూఢ కావదానమనే పదకొండవ పల్లవం

# 12. హారీతికాదమనావదానం

సుధాద్రవదనులైన సత్పురుషులు సుధార్ద్రాగ్రలైన చంద్రకిరణాలవలె దుఃఖాన్ని పోగొట్టి సుఖసంపదను ఇస్తారు; ప్రజలకు ప్రాణం పోసి, అజ్ఞానాంధకారాన్ని హరించి సన్మానసానికి వికాసహాసం కలిగిస్తారు.

పూర్వం ఈ భూమికంతా సారమనదగిన రాజగృహనగరంలో సమస్త భూపాలుర సారమనదగిన బింబిసారుడనే భూమీంద్రుడు ఉండేవాడు. ఆయన భుజం క్షమకు ఆధారమై, మనస్సు క్షమకు ఆధారమై ఉండగా ప్రజలు సకల చింతలకు దూరులై న్యాయంగా కప్పం చెల్లిస్తూ సుఖంగా ఉండేవారు. త్యాగశౌర్యాలతో దిక్కులను నింపుతున్న ఆయన హస్తం ఒకవైపు రత్నరాసులను వదలుతూ అర్థుల ఆశలు పూరిస్తూ, మరొకవైపు శత్రుభీకరంగా కత్తిని పట్టింది.

ఇలా ఉండగా ఒకమారు రాజగృహంలో అకస్మాత్తుగా సంపద వచ్చినవారికి గర్వం కలిగినట్టు ప్రజలలో ఆందోళన ఏర్పడింది. జనుల యోగక్షేమచింతే ఉత్సవమై, జనక సమానుడైన ఆ రాజు ఒకనాడు కొలువుదీరి ఉండగా, ప్రజలు ఇలా విన్నవించారు. "దేవా! దివ్య ప్రభావంగల మీ పరిపాలనలో నీతినియమాలకు కట్టుబడిన ప్రజలు, సముద్రంలాగ మేర మీరరు. ఇలా నియమంతో సన్మార్గంలో ప్రవర్తిస్తున్న ప్రజలకు అకస్మాత్తుగా ఒక ఉపద్రవం వచ్చింది. స్వధర్మంలో ఉంటూ, రాజ్యరహస్యం కాపాడుతున్న ప్రజల చేతలవల్ల పుణ్యంవల్ల, యక్షులనుంచి ఆపదలు కలుగడం లేదు కాని, రాజా! మాయిండ్లలో బాలింతరాండ్ర పిల్లలను అసంయమం సత్కర్మఫలాన్ని హరించినట్టు ఎవరో అపహరిస్తున్నారు. అవి భూతాలో? మాయో? తెలీదు. అందువల్ల వంశాలు నిస్సంతుగా అయిపోతున్నవి." ఆ మాటలకు రాజు హృదయం తల్లడిల్లిపోయింది. సజ్జనుల అంతరంగాన్ని దుఃఖం మడికయ్యలోని నీటిలాగ చొచ్చుకుపోతుంది. ఆ దుఃఖం విషంలాగ సర్వాంగాలను వ్యాపించగా, రాజు క్షణంసేపు భ్రాంతహృదయుడయ్యాడు. "నా భుజాధీనం కాని ఈ దైవకృతానికి నేనేమి చేయగలను? కంటికి కనిపించని వాటికి ప్రతిక్రియ ఎలా చేయడం? ఒకదినం గడువివ్వండి. వ్రతస్థుణ్నై మీ సంతానం అపహరణ నివారణను గురించి ఆలోచిస్తాను. మీమీ ఇండ్లకు పొండి" అని రాజు వారితో అన్నాడు. రాజు మాట విని పౌర ప్రముఖులు సంతోషించి గౌరవచిహ్నంగా దోసిలి ఒగ్గి ఇలా విన్నవించారు. "దేవ! నీ ప్రియవచనాలు విన్నాము. మాపై నీకుగల శ్రద్ధను చూచాము. నీపై మా చింతాభారమంతా పెట్టాము. ఇక ఇప్పుడు మాకు శ్రమ లేదు. నీ అనుగ్రహదృష్టి గర్వం లేనిది; ఉదారమైంది. అదే ప్రజలకు జీవితాన్ని వర్షిస్తున్నట్టు ఉంది. అలాంటప్పుడు తాపాన్ని పోగొట్టే అమృత సదృశమైన నీ మృదు స్వాదు వాక్కు ఏమేమి చేయదు? సత్కర్మ నిరతుడు, కృతజ్ఞుడు, కారుణ్యనిధి, అందరికీ సులభంగా దర్శించదగినవాడు, సౌజన్య సరళుడు అయిన ప్రభువు భాగ్యంకొద్దీ లభిస్తాడు. చిత్తవికాసం పొందిన సత్పురుషుల పరిచయం అమృతం కన్నా పేశలమైంది. పలుకు పంచమంకన్నా శ్రావ్యమైంది. ప్రవర్తన శరత్కాల చంద్రబృందకాంతికన్నా కూడ

ఆనందాతిశయం కలిగించేది; మనస్సు పూవుకన్నా కోమలం; సౌజన్యం హరిచందనంకన్నా చల్లనై సంతాపాన్ని పోగొట్టేది." పౌరప్రముఖులు ఈ విధంగా విన్నవించి, ప్రసాది అయిన ఆ రాజుకు తద్గుణోదారమైన ఆశాకుసుమమాలికను వెదజల్లుతున్న వారివలె అంజలిచేసి వెళ్ళిపోయారు.

బింబిసారుడు నియతవ్రతుడై శాంతిస్వస్తికసంభారాలతో నగరంలో భూత పూజావిధిని జరిపించాడు. ఆ నగరంలో నివసించే హారీతిక అనే యక్షిణి పిల్లలను అపహరిస్తున్నదని పురదేవత ఆయనకు తెలిపింది. అది విని బింబిసారుడు ఈ దోష శాంతికి ఉపాయం తెలుసుకొనడానికి సకల దుఃఖజ్వరాయాసాలకు చేదుకాని మందైన బుద్ధదేవుని దర్శించడం కోసం పురజనులతోను, మంత్రులతోను కలందకమనే వేణు వనాశ్రమానికి వెళ్లాడు. అక్కడ ప్రియదర్శనుడైన బుద్ధదేవుణ్ని దూరం నుంచే చూచి నమస్కరించి ఆయన సన్నిధిలో కూర్చుని పౌరుల దుఃఖం విన్నవించాడు. జగద్బంధువు, కరుణానిధి అయిన భగవానుడు పౌరుల సంతతి అపహరణను విని క్షణకాలం నిశ్చలంగా ఆలోచించి రాజును పురజనులను పంపివేసి, భిక్షాపాత్ర, చీవరం గ్రహించి యక్షిణి గృహానికి వెళ్ళాడు.

జినభగవానుడు యక్షిణి గృహానికి వెళ్ళే వేళకు, యక్షిణి అక్కడ లేదు. అది చూచి, భగవానుడు ఆమె పుత్రుడు ప్రియంకరుడనేవాణ్ని ఎవరికీ తెలియకుండా వెంట పిలుచుకొనివచ్చాడు. బుద్ధభగవానుడు వెళ్ళిన వెంటనే యక్షిణి ఇంటికి వచ్చింది. ఆమెకు చాలమంది పిల్లలున్నారు. వారిలో ఆమెకు ప్రియమైన పుత్రుడు ప్రియంకరుడు. అతడు కనిపించకపోగా, ఆ పుత్రఘాతిని దూడపోయిన ఆవువలె సంభ్రమంతో "హా! ప్రియంకర! హా! పుత్ర! నీ ముఖం ఎక్కడచూడను?" అని గొంతెత్తి ఏడుస్తూ ప్రలపిస్తూ, జనపదాలు, అరణ్యాలు, దిక్కులు దిక్కులూ వెదికి, తన కుమారుణ్ని చూడక నిరాశపడి సముద్రం చుట్టుముట్టిన పర్వతద్వీపానికి వెళ్ళింది. అక్కడ నుంచి ఘోరారణ్యాలలోను, నగరాలలోను తిరిగి, మానవలోకం దాటి, విమానోద్యానాలున్న స్వర్గభూములలోను, లోకపాలుర పురాలలోను విశ్రాంతి లేకుండా వెదికి వెదికి అలసిపోయింది. ఆమె బాధ చూచి కుబేరుడు "నీ పుత్రుడు సుగతాశ్రమంలో ఉన్నాడు" అని చెప్పాడు. ఆ మాటలు విని పుత్రవియోగ దుఃఖిత అయిన యక్షిణి వేణువనాశ్రమానికి వచ్చి బుద్ధ భగవానుని శరణుపొంది, తన దుఃఖవృత్తాంతం తెలిపింది.

ఆ యక్షిణి దీనాలాపాలను బుద్ధ భగవానుడు విని మందహాసంతో "హారీతి! నీకు ఐదువందలమంది పుత్రులున్నారు గదా!" అన్నాడు. ఆ మాటలు విని యక్షిణి దుఃఖందెబ్బ తినగా "భగవన్! లక్షమంది పుత్రులున్నప్పటికీ ఒక్క పుత్రుని నాశం కూడ సహించరానిది. పుత్రుని కంటె ప్రియమైంది మరొకటి లేదు. మరి, పుత్రక్షయంకన్నా దుఃఖం మరొకటి ఉందా? పుత్రస్నేహవిషయం ఎంత వ్యధ కలిగించేదీ పుత్రులు కలవారికే తెలుస్తుంది. పుత్రప్రీతి అకారణమైనదీ సహజమైనదీని. పుత్రుడు వికలుడు, మలినుడు, క్షీణుడుగా ఉన్నా తల్లికి చంద్రసమానుడే" అన్నది. వాత్సల్యం తొణికిసలాడే యక్షిణి మాటలు విని భూతానుకంపి అయిన భగవానుడు ఇలా అన్నాడు. "నీకు ఎందరో కుమారులున్నారు. వారిలో ఒక్కడు కనిపించకపోయినందుకే నీవు ఇంతగా శోకిస్తున్నావు. ఒక్క సంతానమే గలవారి వ్యధ ఎలాంటిదో" నీవు పిల్లలతల్లివైనా సదా ఇండ్లల్లో ప్రవేశించి, తల్లులకు తెలీకుండా వారి పిల్లలను ఆడపులి జింకపిల్లలను చంపితిన్నట్టు తింటున్నావు. మనకు దుఃఖం కలిగే పనిని మనం ఇతరులకు చేయగూడదు. దుఃఖానుభవం అందరికీ సమానమే. నీవు బుద్ధ ధర్మ సంఘాలనే మూడు శిక్షాపదాలూ ఆశ్రయించి, హింసను విడనాడితే



నీ ప్రియకుమారుణ్ని పొందగలుగుతావు!" భగవానుని హితవచనాలు విని యక్షిణి త్రిశరణాలు పొంది, హింసను విడనాడింది. తర్వాత పుత్రుడైన ప్రియంకరునితో పాటు వెళ్ళిపోయింది.

భిక్షువులు "ఆమె పూర్వజన్మవృత్తాంతం ఏమిటి? ఆమె కర్మఫలక్రమం ఏమిటి?" అని ప్రశ్నించగా, భగవానుడు ఆ వృత్తాంతం ఈ విధంగా తెలియజేశాడు. "పూర్వం ఈ పట్టణంలోనే కొందరు పౌరులు పర్వతోద్యానాలకు వెళ్ళి నృత్యగీత వినోదాలతో విహరించారు. ఆ దారినే ఒక ఘనస్తని, హరిణాక్షి అయిన గోపకాంత తలపై చల్లకుండ పెట్టుకొని అమ్మడానికి వెళ్ళుతూ, గర్భిణి కావడం వల్ల ఏనుగులాగ నెమ్మదిగా నడుస్తూ, వినోద కాలక్షేపం చేస్తున్న ఆ పౌరులను మదనపరవశయై ఆశతో చూచింది. వనమృగీముగ్ధమై విలాసార్ద్రమైన ఆమె చూపులకు వారు కూడ లొంగిపోయి దుశ్శీలంతో ఆమెను ఆహ్వానించారు. వెంటనే వారు ఆమెకు మద్యం తాగించి శీలం అపహరించారు. మద్య మదపరవశ అయిన ఆమెకు తను చేసిన తప్పు తెలియలేదు. పిదప ఆ పౌరులు వెళ్ళిపోయారు. రతి శ్రమవల్ల ఆమె గర్భం, కోపంతోనా అన్నట్టు ఎర్రగా భూమిపై పడింది. దానితో ఆమె ధైర్యం కూడ సడలింది. ఈలోగా ఆమె పుణ్యవశాత్తు దేహానికీ, మనస్సుకూ సంతోషం కలిగించే ఒక ప్రత్యేకబుద్ధుడు ఆ దారిన వచ్చాడు. ఆమె దూరం నుంచే ఆయనను చూచి వంగి నమస్కారం చేసి, చల్ల అమ్మిన డబ్బుతో ఐదువందల మామిడిపళ్ళు అర్పిస్తానని మనస్సులో మొక్కుకుంది. తర్వాత ఇప్పుడామె పుణ్యవంతమైన యక్షకులంలో పుట్టింది. ఐదువందల మామిడిపండ్లు సమర్పించడానికి మొక్కుకుంది గనుక ఆమెకు ఐదువందలమంది పుత్రులు కలిగారు. శీలం మరువడం వల్ల హింసానిరతమైన ఆమె, ప్రత్యేకబుద్ధుని నమస్కరించడం వల్ల పాపం తొలగి, ఇప్పుడు శిక్షాపదాలు ఆశ్రయించింది."

ఈ విధంగా ఈ సంసార సాగరానికి కుశలసేతువైన సర్వలోకశాస్త బుద్ధదేవుడు ఆ యక్షాంగన విచిత్రమైన కర్మపాకం వివరించి ప్రజల మనస్సును సత్కార్యోన్ముఖం చేశాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో హారీతి కా దమనావదానమనే పండ్రెండవ పల్లవం.

# 13. ప్రాతిహార్యావదానం

మహాత్ముల అమేయ ప్రభావ విభవం నిత్య నూతనమైంది; మహాద్భుతమైంది; సంకల్ప మాత్రంతోనే సకల సిద్ధులూ ఒనగూర్చుతుంది; స్వప్నం, మాయ కాదు; దాని తీరే వేరు. అది ప్రజలకు కన్నుల పండువుగాను, వీనుల విందువుగాను ఉంటుంది; దానిని ప్రజలు చూచి ఆశ్చర్యంతో నోటమాట లేక మానులై పోతారు. నిర్వ్యాజంగా ప్రజాహితం చేకూర్చుతుంది. అలాటి ప్రభావ విభవానికి నమస్కారం.

పూర్వం రాజగృహంలో బింబిసార భూపాలుని పూజలందుతూ వేణువనాశ్రమంలో ఉన్న బుద్ధదేవుని చూచి కొందరు సర్వజ్ఞమ్మన్యులైన మూర్ఖులు గుడ్లగూబలు వెలుగును సహించనట్లు, మాత్సర్య విషం తలకెక్కగా, ఆయన గొప్పదనం సహించలేకపోయారు. దిన పశ్చాద్భాగంలో రాత్రి పుట్టిన నల్లని చీకట్లు ఎప్పుడూ దినంతో పోటీ పడుతూ పరభాగం పొందుతూ- పైకి తేలిపోతూ- ఉంటాయి. మస్కరి, సంజయి, అజితుడు, కకుదుడు, పూరణుడు, జ్ఞాతిపుత్రుడు మొదలైన మూర్ఖులైన క్షపణకులు, ఇతరులు మారమాయా మోహితులై అసూయా ద్వేషదోషం పొగలాగ కప్పగా, కండ్లు తెలియక బింబిసారుని కొలువుకు వచ్చి ఇలా విన్నవించారు. "రాజా! సర్వజ్ఞమ్మన్యుడై వనంలో ఉండే ఆ శ్రమణునికి, మాకు గల మాహాత్మ్య ప్రభావాన్ని మీరు పరీక్షించండి. తమ మహాత్మ్యం వల్ల జనులను వశపరచుకొనగల మహాశ్చర్యకరమైన ఒకానొక శక్తిని ప్రాతిహార్యమంటారు. అలాంటి ప్రాతిహార్యం ఎవరు సభలో చూపించగలుగుతారో, అలాటివారికే జగత్త్రయంలోను మన్నన కలుగనీ.!" బింబిసారుడు వారి మాటలు విని వారి గర్వప్రదర్శనానికి విముఖత చూపుతూ "కుంటివాళ్లయిన మీకు కొండను దాటాలనే ఆశ ఎందుకు? అగ్గితో మిడుతలకేమిటి పోటి? ఇది అసమంజసం. ఈలాటి మాటలు చెప్పకండి. మరొకమారు చెబితే నగరం నుండే వెళ్లగొడుతాను" అని మందలించాడు. గుణజ్ఞుడైన బింబిసారుడు తిరస్కరించగా, ఆ దుష్టులు ఆకాశంలో వేలాడుతున్నట్టు ఆసరా లేక వెళ్లిపోయారు. కాని, "బింబిసారనరపతి మూర్ఖతా పక్షపాతి. మరొక రాజు వద్దకు వెళ్ళి ఈ ఎత్తు వేద్దాం" అనివారు ఆలోచించారు. ఈలోగా బుద్ధదేవుడు శ్రావస్తీ సమీపంలోని జేతవనారామానికి రాగా, వారు దిక్కులు పట్టి పోయారు.

తర్వాత వారు కోసల భూపతి అయిన ప్రసేనజిత్తు వద్దకు వెళ్లి ఆ ప్రాతిహార్యస్పర్ధను విన్నవించారు. గుణభేదం తెలిసిన ఆ ప్రసేనజిత్తు వారి పొగరు అణచాలనే కోరికతో, బుద్ధభగవానుని మహిమ చూపించాలనే ఉత్సాహంతో జేతవనారామానికి వెళ్లి, భగవానునికి వినయంతో నమస్కరించి ఇలా విన్నవించాడు: "భగవాన్! ఈ తీర్థ్యులకు గర్వశాంతి చేయండి. వీరు ఈ మహిమా స్పర్ధతో మీ ప్రభావం చూచే ఆశకొద్దీ చేసుకొంటున్న ఆత్మగుణ శ్లాఘతో మా చెవులు చిల్లులు పడ్డాయి. ప్రభూ! సజ్జనులను ఆవర్జించే ప్రభావం చూపండి. తీర్థ్యులనబడే వీరి అజ్ఞానాంధకారం పూర్తిగా నశించనీ." ఇలా రాజు విన్నవించగా నిర్వికారచిత్తుడు, ఉదారహృదయుడు అమర్షహీనుడు అయిన భగవానుడు సంతోషంతో ఇలా అన్నాడు:

"వివేకాభరణార్హమైన గుణాలు ఇతరుల గర్వభంగం చేయడానికో వివాదానికో, గర్వించడానికో కాదు. యుక్తాయుక్త విచారం లేక పోటీపడి ఇతరుల ఉత్కర్షను హరించే మాత్సర్యమలినాలైన గుణాలెందుకు? తన గుణంతో ఇతరుల గుణాలను ప్రకాశింపజేయక కప్పిపుచ్చే అపవిత్రుడు స్వయంగానే ధర్మాన్ని ధ్వంసం చేసేటట్టివాడు. సద్గుణాల పరీక్షే ఇతరులకు లజ్జాకరం. కనుక పరిశుద్ధ గుణులకు పోటీ పడడం ఉచితం కాదు. గుణవంతుడైనప్పటికీ ఇతరుల మీద ప్రసన్నభావం లేనివాడు గుణాలను గ్రహింపలేడు. దీపం పట్టుకున్నవానికి దాని నీడ చేతిపైన పడుతూ ఉంటుంది కదా! పరోత్కర్షకు అవమానం కలిగినప్పుడు దాన్ని తమ అవమానంగా భావించేవారే సర్వజ్ఞులు. ఇంతకన్నా నాకు ఎక్కువ తేలీదు." ప్రశమగుణానుగుణమైన భగవానుని మాట విని, రాజు అద్భుతాలు ప్రదర్శించవలసిందని మరీ మరీ అభ్యర్థించాడు. భగవానుడు అతికష్టం మీద అంగీకరించాడు. రాజు సంతుష్టుడై ఏడునాళ్ల గడువు పెట్టి తన రాజధానికి వెళ్లిపోయాడు.

ఈ సందర్భంలో ప్రసేనజిన్మహారాజు సవతి తమ్ముడు కాలుడనేవాడు అంతఃపుర సమీపంలో మేడప్రక్కన నడుస్తున్నాడు. సవిలాసంగా వెళ్లుతున్న ఆయన భుజంపై కర్మవశాత్తు గాలికి మేడ మీద ఉన్న రాజపత్ని చేతిలోని పూలదండ జారిపడింది. కొందరు దుర్మార్గులైన కొండెగాళ్లు అది రాజసోదరుని తప్పుగా కొందరితో వదంతి వ్యాపింపచేసి రాజు చెవిలో పడేట్టు చేశారు. రెండు నాల్కలు గల అల్పులు చిన్నసందు దొరికినా రెండునాల్కలుగల పాములు చిన్న సందుదొరికినా పెద్దవాటిలో ప్రవేశించినట్టు ప్రభువు శూన్యహృదయంలో ప్రవేశించి, అన్ని విధాల అపకారం చేస్తారు. రాజు ఆ కొండెగాళ్ళ మాట విని, వారి ప్రోత్సాహంతో సోదరునిపై ఈసుతో అతని చేతులు కాళ్లు నరికి వేయవలసిందని ఉత్తరువు చేశాడు. రాజసోదరుణ్ణి తలవరులు వధ్యభూమికి తీసుకొనిపోయి కర్మవైపరీత్యం వల్ల కాళ్లు చేతులు నరికారు. ఆయన మూర్ఛపడి భూమిపై ఒరగగా, అతని తల్లి, బంధువులు గుండెలు అవిసేట్టు ఏడ్చారు. తీవ్రబాధకు గురి అయిన అతనిని క్షపణకులు కళ్లుత్రిప్పుకుంటూ కొంతసేపు చూశారు. అప్పుడు ఆ రాజపుత్రుని బంధువులు దుఃఖిస్తూ, అతనిని రక్షించే అభిలాషతో, ఆ క్షపణకుల వద్దకు వచ్చి, "మీరు సర్వజ్ఞులమని చెప్పుకుంటున్నారుకదా! ఈ రాజపుత్రుడు నిర్దోషి. ఈయనను అనుగ్రహించి, స్వస్థుణ్ణి చేయండి" అని కన్నీరు కురిపిస్తూ వేడుకున్నారు. వారు ఏమీ చేయలేక మౌనంతో సిగ్గుపడి అక్కడినుంచి వెళ్ళిపోయారు. సుగతుని శాసనం వల్ల ఆ దారిని ఆనందుడు వెళ్ళి సత్యప్రభావంతో ఆ రాజకుమారునికి మరల కరచరణాదులు కలిగేలా చేశాడు. రాజపుత్రుడు కాళ్లు చేతులు యథాప్రకారం రాగా, జినదేవుని శరణుపొంది, ఉపస్థాయకుడయ్యాడు.

ప్రసేనజిత్తు బుద్ధదేవుని మహిమా ప్రదర్శనం కోసం పెద్ద విశ్రాంతి గృహం నిర్మించాడు. ఏడు రాత్రులు గడిచాయి. రాజు క్షపణకాదులతో కొలువు తీర్చాడు. బుద్ధభగవానుని సంకల్పంతో ఆ భూమి కల్పవృక్షవతిగా అయింది. ఈ మహిమ చూడడానికి దేవతలు కూడ వచ్చారు. కల్పవృక్షం కింద ఒక రత్న సింహాసనం వెలసింది. ఆ సింహాసనంపై బుద్ధదేవుడు ఆసీనుడయాడు. తేజోమయుడైన ఆతని గండప్రదేశం నుంచి మంటలు పుట్టి భూమండలమంతా వ్యాపించాయి. కమలవన సదృశమైన ఆ మంటలు సమస్తభువనాలు నశించిపోతాయనే భయంతో క్రమంగా అణిగిపోగా కరుణాంబురాశి అయిన ఆయన దేహం నుంచి పూర్ణామృత తరంగాలవలె విమలమైన కాంతులు వ్యాపించాయి. వేయిచంద్రుల కాంతిని కూడా తిరస్కరించే లావణ్యరాశి, తేజస్సమూహంతో సూర్యమండలాన్ని కూడా తోసిరాజంటున్న బుద్ధదేవుని నాగనాయకులు పూర్వపుణ్యప్రాప్తమైన అపూర్వసుఖంలాగ కళ్ళారా చూశారు. తర్వాత ఆ బుద్ధదేవుని

ముందున్న భూమి నుంచి వైడూర్యపు తూండ్లతో, అరుణారుణరత్నాల రేకులతో, స్వర్ణకేసర కర్ణికలతో, దివ్యసువాసనలతో తుమ్మెదలను ఆకర్షించే పద్మాలు మొలిచాయి. ఆ పద్మాలతో వెంటనే, అందమైన బంగారుకాంతితో స్నేహం ఒలికే చూపులతో బుద్ధమూర్తులు ఆసీనులై ఉదయించారు. అమృతపేశలంగాను, చంద్రద్యుతి శీతలంగాను ఉన్న ఆ బుద్ధమూర్తులను చూడగానే లోకుల కండ్లు తనిసి చల్లబడ్డాయి. ఆ బుద్ధమూర్తుల మధ్య బుద్ధదేవుడు పర్వతాల మధ్య మేరు పర్వతంలాగ, దేవవృక్షాల మధ్య పారిజాత తరువులాగ ఉన్నతంగాను, కాంతిరాశిగాను ప్రకాశించాడు. దేవవనితలు ఆ బుద్ధమూర్తుల శిరస్సులపై తమ కరకమలాలతో పుష్పమాలికలు కురిపించినారు. అప్పుడు బుద్ధమూర్తుల మధ్యన విరాజిల్లే బుద్ధదేవుని ముఖాంబుజం రెప్పవేయకుండా చూస్తున్న మానవులు కూడా క్షణం సేపు అనిమిషులయ్యారు. వ్యోమాంగణం దేవదుందుభి శంఖ తుర్యాది వాద్యాల నినాదంతోను, కుసుమవర్ష మహాట్టహాసంతోను, సిద్ధ గంధర్వ కిన్నెర, మునీశ్వర, చారణాదుల స్తుతివాదంతోను నిండిపోయింది. అప్పుడు బుద్ధదేవుని దంతకాంతిదవళమైన అరుణాధరాలతో, ముంగురులనే కేసరాలతో ఒప్పారే ముఖారవిందం నుంచి ఉత్తమసౌరభంతో మధురస్వరంతో తమ పుణ్యవశాత్తు వెలువడిన మధురోపదేశామృతాన్ని జనులు క్రోలి ధన్యులయ్యారు. "పాపాలు మానండి. పుణ్యబీజాలు నాటండి. వైరం వదలిపెట్టండి. మృత్యువిషహరమైన జ్ఞానామృతం పానం చేయండి. ఈ దేహం శాశ్వతంగా కుశలకర్మలకు నెచ్చెలి కాదు. సంపద చంచలం. యౌవనం ముసలితనానికి ముందున్నట్టిది. ఈ కాయం అపాయాలకు నికాయం. ఈ ప్రాణాలు శరీరకుటీరంలో ముహూర్తమాత్రం ఉండే బాటసారులవంటివి. కనుక ధర్మమయమైన నిత్యశ్రేయస్సుకు ప్రయత్నించండి." ఈలాటి ఉజ్జ్వల జ్ఞానంతో ప్రకాశిస్తూ, వివేక విమలమైన కుశలోపదేశంతో జనుల అజ్ఞానమనే వింశతిశృంగశైలం పిడుగుపడ్డట్టుగా కూలిపోయింది.

క్షపణకాది తీర్థ్యులు భగవానుని మహిమాప్రభను చూచి మంత్రహతమైన విషసర్పాలలాగ, సూర్యకాంతికి వెలవెలపోయిన దీపాలలాగ గర్వం విరిగి నిశ్చేష్టులై గీచిన బొమ్మలలాగ ఉండిపోయారు. అప్పుడు ఆ తీర్థ్యులను ప్రతీహారులు వజ్రపాణి అనే బుద్ధశిష్యుని ఆజ్ఞతో అంతఃపురం నుంచి బయటికి తరిమివేశారు. వారు చెట్టుకొకరు, గుట్టకొకరుగా పారిపోయారు. వారిని చూచి దయార్ద్రచిత్తుడు, భీతులకు శరణ్యుడు అయిన భగవానుడు ఇలా అన్నాడు. "పిరికివారు భయపడి చెట్టు గుట్ట గుహ భూమి మణి మొదలయిన వాటిని ఆశ్రయిస్తారు. కాని బుద్ధిని ప్రబోధింపజేసి, మనస్సును నాయందు లగ్నం చేసి, ధర్మాన్ని సంఘాన్ని శరణు పొందినవారికి జగత్రయానికి భయం కలిగినా ప్రమాదం లేదు. వారు ఇతరులను దీనంగా శరణు పొందవలసిన అవసరం ఉండదు. కమ్ముకుంటూ తొలగింపరాని పరలోక తీవ్ర తిమిరాలను నాశం చేయగల చండకిరణమండలం ధర్మమే. దుస్సహమైన పాపసంతాపాన్ని శమింపజేసే మేఘం దానమే. మోహమనే మహాప్రవాహంలో కొట్టుకొనిపోయి అగాధమైన గహ్వరంలో పడుతున్నవారికి చేతి ఆసరా ప్రజ్ఞే. అంతటా, అన్ని విధాల, అందరికీ శరణ్యమైనది. దైన్యం కలిగించనిది పుణ్యమే."

ఈవిధంగా సుగతచంద్రుడు సభలో అజ్ఞానాంధకారం కనులగప్పినవారి కనువిప్పుకోసం దంతమణికాంతులతో వెలుగులు చిమ్ముతూ విశుద్ధ ధర్మోపదేశాన్ని సుస్థిరమైనట్టుగా చేసి జేతవనాశ్రమానికి వెళ్ళిపోయాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ప్రాతిహార్యావదానమనే పదమూడవ పల్లవం.

# 14. దేవావతారావదానం

మహాత్ముల ప్రభావం ముందూ వెనకా ఉంటూ జనులకు కుశల కర్మమార్గంలో రత్నదీపంగా వెలుగుతూ ఉంటుంది.

పూర్వం బుద్ధదేవుడు అమరపురిలో పారిజాత వృక్షసమీపంలో కోవిదారవృక్షం కింద సొబగులు మీరే పాండుకంబలమనే శిలాతలం మీద ఆసీనుడై దేవసంఘాలకు ధర్మోపదేశం చేసి, మానవులను అనుగ్రహించడం కోసం జంబూద్వీపానికి అవతరించాడు. అలా అవతరిస్తున్న భగవానుని వెంట అమరులు తమ విమానాలలో వచ్చారు. ఉద్యానాలవంటి ఆ విమానాలతో భువనాంగణం నిండిపోయింది. బుద్ధదేవుని దంతకాంతులీనే ఉపదేశ కర్పూరంవలె సుందరమైన చామరం చతురాననుడు వీయసాగాడు. కళంకమనేది లేక చంద్రపాండురమైన నూరుకమ్ముల ఛత్రాన్ని, రూపుదాల్చిన భగవదనుగ్రహం వలె ఉన్నదానిని ఇంద్రుడు పట్టుకున్నాడు. బుద్ధదేవుడు ఈ విధంగా దేవతలు కొలువగా సంకాస్యనగర సమీపంలో ఉదుంబర వనప్రాంతంలో దిగాడు. పుణ్యవంతులు అసంఖ్యాకంగా వచ్చి ఆయనను ఆనందంతో సేవించారు. ఆ జనసమ్మర్దంలో ఉత్పలవర్ణ అనే భిక్షుణికి భగవానుని దర్శించడానికి అవకాశం లేకపోయింది. "ఇలా ఉంటే నాకు ఎన్నటికీ భగవానుని దర్శనం దొరకదు. రాజురూపం ధరించి ఆయనను దర్శిస్తాను. అప్పుడు కిటకిటలాడే ఈ జనం నా రాజరూపం చూచి ఆదరంతో లోపలికి ప్రవేశమిస్తుంది. లేకపోతే మరొక విధంగా ఆయనకు నమస్కరించడం దుర్లభం. జనులు ఐశ్వర్యం చూచి గౌరవించేవారే కాని, గుణాన్ని చూచి కాదు. ఆహా! జనులు తృణాగ్రంవలె చంచలమూ, నిస్సారమూ విరసమూ అయిన ధనం చూచి, వ్యామోహం చెందుతున్నారు" అని ఆలోచించి నృపరూపం పూర్వజన్మ వాసనావశాన నిర్విచారంగా ధరించింది. ఉజ్జ్వలమైన రత్నమకుటం, గండస్థలంపై తాండవించే కుండలాలు ఆమె ఈ నూతన రూపం చూచి తురాయి నవ్వినదా అన్నట్టు తల ఎత్తింది. రాజరూపంలో ఉన్న ఆమెను చూచి ప్రజలు, రాజనే గౌరవంతో పక్కకు తప్పుకొని దారి ఇచ్చారు. ఆమె మెడలో ధరించిన ముక్తాహారాలు ముందుకు వంగి ఊగగా భగవానునికి వంగి నమస్కారం చేసింది.

ఈ సందర్భంలో సదస్సులో ఉన్న ఉదయి అనే భిక్షువు రాజరూపంలో ఉన్న ఆమెను చూచి మందహాసంతో "తన మాహాత్మ్యం వల్ల రాజరూపం ధరించి, జనమంతా తప్పుకొని గౌరవించగా, మహావిభూతితో భగవానుని పాదాలకు నమస్కరిస్తున్న ఈమె ఉత్పలవర్ణ అనే భిక్షుకి. కలువరంగు, కమ్మని కలువతావి కలది కావడం వల్ల ఈమెను నేను గుర్తుపట్ట గలిగాను" అని అన్నాడు. తర్వాత బుద్ధదేవుడు "భిక్షుణి గర్వంతో మహాత్మ్యం చూపడం ఉచితం కాదు. అహంకారమనేది జ్వరం వంటిది. అది కూడ ప్రశమగుణం హరిస్తుంది" అన్నాడు. తర్వాత భగవానుడు ఆయా విమలోపదేశాలు చేసి, దేవతలకు సెలవిచ్చి, భిక్షుసంఘంతో సహా స్వస్థానం చేరాడు. అక్కడ భిక్షువులు నమస్కరించి, భిక్షుణి పూర్వ

జన్మ కర్మసంబంధమైన కథను తెలుపవలసిందని అడిగారు. వారికి సర్వజ్ఞుడు ఈ విధంగా చెప్పాడు:

పూర్వం వారణాసిలో మహాధనుడనే బేహారి ఉండేవాడు. అతనికి ప్రాణ సమానురాలయిన ధనవతి అనే భార్య వుండేది. ఆమె చాల సుందరి. చేతులనే చిగుళ్ళతో యౌవనమనే ఉద్యానవనంలో పూగుత్తిలాగ ఉన్న ఆ తవ్వి సకాలంలో పుష్పఫలవతి అయి, గర్భం ధరించింది. ఈలోగా ఆమె భర్త వ్యాపారం కోసం సముద్రద్వీపానికి వెళ్ళదలచగా ఆమె వియోగదుఃఖం సహించక, భర్తతో "మనకెంతో ధనసంపద ఉంది. ఘోర గంభీర సముద్రాన్ని దాటి కూడ ఇంకా అభివృద్ధి చేయవలసిన అవసరమేముంది? ధనసంపాదనం చాల అపాయభరితమైంది. గుణసంపాదనం నిరపాయమైంది. ధనార్థులు స్వదేశం నుంచి పరదేశాలకు వెళ్ళుతారు. కొందరు అంతదూరం వెళ్ళికూడ నిష్ఫలులై దుఃఖంతో తిరిగివస్తారు. మరికొందరు ధనవంతులై కడుపులో చల్ల కదలకుండా తిరిగివస్తారు. ఇదంతా పూర్వకృత కర్మబలం" అన్నది. తన ప్రియురాలి మాటలు సార్థవాహుడు విని ఇలా అన్నాడు. "వెర్రిదాన! ధనార్జనకోసం ప్రయత్నించేవాడు ప్రశంసార్హుడే. ధనార్జనకు పూనుకొనక కుంటివాడివలె దగ్గరున్న మూలధనం తింటూ సుఖంగా ఉన్నవాడు ఆ సుఖభోగాలతోపాటు నేడోరేపో క్షీణించిపోతాడు. దరిద్రులకు స్వగృహంలోను జనులు రంపంలాగ నిష్ఠురులుగా ఉంటారు. ధనవంతులను పరలోకంలోను ప్రేమస్నిగ్ధవచనాలతో ఆదరిస్తారు. సన్నగా ఉన్నా ఎదుగుతున్న వెదురును జనులు కట్టిపెట్టరు. వినాశం సమీపించినవాడు సంపూర్ణత్వం పొందలేడు. అభ్యుదయం పొందినవాడు మూర్ఖుడైనా విద్వాంసులు నమస్కరిస్తారు; వృద్ధుడైనా స్త్రీలు ప్రీతిగా చూస్తారు; నపుంసకుడైనా శూరులు సేవిస్తారు. వ్యాకరణం భుజించి కావ్యామృతపానం చేసి ఎంతవిచక్షణుడైనా క్షణంసేపు ఆకలిదప్పులు వదలినవాడున్నాడా? డబ్బుగలవాడ్ని గుణవంతులందరూ ప్రశంసిస్తారు. డబ్బుంటే ఎలాటి గుణం అబ్బదు? దారిద్ర్యదోషం మానవులను నిస్తేజులను చేస్తుంది. అలాటివారి గుణాలు నిర్మాల్యం వంటివి. ధనంతోనే గుణాలు వస్తాయి. గుణవంతుడు ధనవంతుడు కాలేడు. ధనవంతుడే ధన్యుడు; గుణవంతుడు ధన్యుడు కాడు. ఈ కాయం దుష్కృతాల వల్ల నశించిపోయేది. కనుక దీనిలోని గుణాలకు ఆయుస్సు ధనమే." ప్రాణాలకన్న ధనమే అధికమని భావిస్తున్న భర్త మాటలు విని ఆమె భ్రమరాలు ముసిరిన లతా అన్నట్లు కాటుకకంటి నీరు కార్చింది.

తర్వాత ఆ మహాధనుడు తన భార్యతోసహా ఓడపై సముద్రంలో ప్రయాణం సాగించాడు. తీవ్రమైన తృష్ణ కలవారికి సముద్రం చేతిలోని జలపాత్రవంటిది కదా! పూర్వకర్మవాత ప్రేరణచే అతని ఓడ అతని జీవితమనోరథాలతో సహా పగిలింది. కర్మశేషం వల్ల మహాధనుడు భార్యతో పాటు పగిలిన ఓడ పలక పట్టుకుని మునుగుతూ తేలుతూ కశేరుద్వీపం చేరి అక్కడ మరణించాడు. అనాథ అయి ఆశ అడుగంటిపోయిన ఆ ధనవతి దుఃఖిస్తుండగా, గరుత్మంతుని వంశంవాడైన సుముఖుడనే పక్షిరాజు చూచి, మానవాకృతితో ఆమె వద్దకు వచ్చి "లోలాక్షి! ఊరడిల్లు. ఇది నీ యిల్లు. భయపడకు. ఈ భూమి దివ్యభోగభూమి. మేము నీ స్నేహం కోరేవారమే. ఓ కల్యాణి! ఈమకరాకరమైన సముద్రం చాల ఘోరమైనది. పుణ్యవశాత్తు దీనినుంచి బైటపడి ప్రాణాలు దక్కించుకున్నావు" అని సంపూర్ణ గర్భిణి అయిన ఆమెను నెమ్మదిగా తన రత్నమయ భవనానికి పిలుచుకొనిపోయాడు. ఆమె అక్కడ సుందరరూపుడైన ఒక కుమారుణ్ని ప్రసవించింది. ఆ కుమారుడు పెరిగి పెద్దవాడవుతుండగా, చతురుడు,



ప్రియవాది అయిన ఆ సుముఖుడు ఆ ముగ్ధను ఒప్పించి తన వశం చేసుకొన్నాడు. స్త్రీలు సరళస్వభావులు, మృదుహృదయులు కావడం వల్ల తమను అభిమానించి సమీపంలో ఉండేవారిని తీగలు చెట్లను అల్లుకున్నట్లు స్వయంగానే అల్లుకుంటారు. ఆ ఘనస్తని సుముఖునితో పాటు దివ్యోద్యానాలలో విహరిస్తూ తండ్రిని పోలిన ఒక కుమారుని కనింది. ఆ కుమారునికి పద్మముఖుడని పేరుపెట్టారు. అతనికి యౌవనం అంకురిస్తుండగా, కాలక్రమాన పక్షిరాజయిన సుముఖుడు కాలధర్మం చెందాడు. తర్వాత పద్మముఖుడు తండ్రిపదవిని పొందాడు. గుణవంతులకు కుల సంపదలు నిర్వివాదంగా స్వాధీనమవుతాయి.

ఇలా కులక్రమాగతమైన ఐశ్వర్యం పొందిన పద్మముఖుని చూచి తల్లి అతని ప్రభావానికి ఎక్కడా అడ్డు లేదని భావించి, ఏకాంతంగా అతనితో ఇలా అన్నది. "కుమారా! ఈ నిరంకుశుడనే కుమారుడు నాకు వ్యాపారి అయిన మహాధనునివల్ల కలిగినవాడు. నీ శక్తితో ఇతణ్ని వారణాసికి రాజును చేయి. స్వదేశంలోనే సంపదలను ప్రీతితో అనుభవించడం ప్రజలకు అభిమతం కావడం సహజం." తల్లి ఈ విధంగా చెప్పగా విని పద్మముఖుడు అన్నపై అపార పక్షపాతంతో అతనిని భుజంపై ఎక్కించుకొని గగనమార్గంలో వారాణసికి వెళ్లి వాలాడు. అప్పుడక్కడ బ్రహ్మదత్త నరపాలుడు కొలువు తీరి ఉన్నాడు. పద్మముఖుడు వజ్రతీక్ష్ణమైన తన గోళ్లతో బ్రహ్మదత్త నరపతిని కొట్టి చంపివేసి, ఆ సింహాసనంలోనే అన్నను అభిషేకించి, భయభీతులైన మంత్రులందరితో "గతించిన రాజుపై భక్తితో ఎవరైనా నేను అభిషేకించిన రాజుకు ఎదురు తిరిగితే, వారు కూడా ఆ రాజుగతినే పొందుతారు" అని హెచ్చరించి మరల వచ్చి చూస్తానని అన్నకు మాట యిచ్చి స్వదేశానికి వెళ్లిపోయాడు. పిదప మంత్రులు గుట్టు చెడకుండా ఆయుననే బ్రహ్మదత్తుడని ప్రచారం చేసి కొలుస్తూ ఉండేవారు. నిరంకుశుడు కూడా తన వారిలోను, పెరవారిలోను బ్రహ్మదత్తుడుగానే పేరు పొందాడు.

ఈలోగా, హస్తిపాలురు ఒకమారు చూలయిన ఒక ఆడఏనుగును అడివినుంచి తోలుకొని వచ్చారు. అది సగం ఈనింది. సగం లోపలే అడ్డగించినట్లు ఉండి పోయింది. దానిని చూచి మంత్రి "రాజా! పతివ్రతలయిన స్త్రీలు దీనిని చేత్తో తాకితే ఇది పూర్తిగా ఈనుతుందని జ్యోతిష్కులు తెలిపారు" అని రాజుకు విన్నవించారు. రాజు సరేనని ఆ విధంగానే చేయించవలసిందని ఉత్తర్వు చేశాడు. తర్వాత మంత్రులు అంతఃపుర స్త్రీలను ఆ పిడిఏనుగును తాకి సత్యం చేయవలసిందిగా అభ్యర్థించారు. కాని ప్రయోజనమేముంది? అంతఃపురంలోని స్త్రీలందరూ దానిని తాకి సత్యం చేసినా, ఏనుగు ఈనకపోవడం చూచి, నగరులోని వారంతా సిగ్గుపడ్డారు. ఈలోగా అక్కడికి ఒక గోపాంగన వచ్చింది. దానిని సత్యం చేయవలసిందని మంత్రులు కోరారు. ఆమె తన శీలంపై సత్యం చేసి పిడి ఏనుగును తాకగా, గర్భం పూర్తిగ సడలి పిల్ల భూమి మీద పడింది. రాజు తన అంతఃపుర స్త్రీల శీలదారిద్ర్యం గ్రహించి ఆ గోపకాంతే జగత్రయంలోని పతివ్రత అని నిశ్చయించుకున్నాడు. పిదప రాజు ఆమెపై కలిగిన గౌరవంతో ఆమె కుమార్తె పోశుంబ అనేదాన్ని పెండ్లాడి, పట్టపురాణి పదవికి అర్హురాలిగా చేశాడు. కాని, ఆమె లావణ్యాన్ని, స్త్రీసహజమైన చాపల్యాన్ని తలచుకొని అనుమానంతో నిద్రపోవడం కూడ మానివేశాడు.

ఇలా ఉండగా, పక్షి రాజయిన పద్మముఖుడు ఒకమారు తన అన్నను చూడటానికి అత్యంత స్నేహంతోను, ఉత్కంఠంతోను వచ్చాడు. రాజు అతనిని ప్రీతితో ఆలింగనం చేసుకొని సత్కరించి, ఏకాంతంలో తన సంగతిని తెలిపి, "శీలసత్యం పరీక్షించడం వల్ల నా అంతఃపుర కాంతలందరిలోను దోషం

కనిపించింది. కనుక, వారిపై విముఖతతో కొత్తగా పెండ్లి చేసుకున్నాను. రూపయౌవన సంపన్నురాలయిన ఆమెపై కూడా నాకు నమ్మకం లేదు. ఒక చోట తప్పు చూచినవారి మనసు అంతటా శంకిస్తుంది. కనుక తమ్ముడా! ఆమెను నిర్మానుష్యమైన నీపట్టణంలో ఉంచు. నేను శీలశంక వదలి పెట్టి నెమ్మదిగా ఉంటాను. అక్కడి నుంచి ప్రతిరాత్రీ ఒక పక్షి ఆమెను నా ప్రాసాదానికి తీసుకొని వచ్చి, తెల్లవారగానే తీసుకొనిపోయేటట్టు ఏర్పాటుచేయి. ఇది నామనోరథం" అని అన్నాడు. అన్నమాట విని పక్షిరాజు ఇలా అన్నాడు. "సోదరా! ఈర్ష్యాశంకాకళంకితమైన మనస్సుతో ఇలాటి వ్యర్థపు పనులు చేయవద్దు. ఎప్పుడూ ఈర్ష్యావశాతురుడైన మానవుడు రమ్యమైనదాన్ని అనుభవించలేడు; భోజనంలో రుచి ఎరుగలేడు; సరిగా దేనినీ చూడలేడు; కంటినిండా నిద్రపోలేడు. కామంగల నపుంసకుడు, సుఖంగల విద్యాంసుడు. నమ్రతగల ధనవంతుడు, ఓర్పుగల ప్రభువు, మాన్యుడైన యాచకుడు, స్నేహంగల దుష్టుడు, పతివ్రత అయిన స్త్రీ అనేవి ఎక్కడి మాటలు? సరళత్వం ఉన్నప్పటికీ కుటిలమై, స్థిరత్వం ఉన్నా చంచలమైన లతలు పొరుగున ఉన్న చెట్లను అల్లుకున్నట్టు స్త్రీలు కులీనులయినప్పటికి, సరళత్వం ఉన్నా కుటిలలుగాను, స్థిరబుద్ధి ఉన్నా చంచలలుగాను ఉంటూ ఇరుగు పొరుగువారిపై పడుతారు. స్త్రీల అవయవాలలోను దోష రహితమైంది కనిపించదు; దృష్టి చంచలం. అధరం రాగసహితం. కనుబొమలేమో వంకర. పాలిండ్లు కఠినం. కనుక కుశలులైనవారు సుందరులను విలాసంతో పర్యటిస్తున్న భ్రమరంలాగ అనుభవిస్తారు. పద్మలత మూలం వెదికేవానికి బురద తప్ప మరేమి దొరకుతుంది? కామినులు అద్భుతమైనవారు. పవిత్ర శీలం లేని ఆ స్మితవదనలకు ఒక రమణునిపైనే మనసు నిలువదు. అయినా నీవు కాదు కూడదు అని నిర్బంధం చేస్తే నీ ఇష్టప్రకారమే కానీ. పగటిపూట నిర్జనమైన నా పురోద్యానంలో ఆమెను ఉంచు." తమ్ముని మాటలకు రాజు సంతసించి, అతనిని సత్కరించి తన భార్య సోశుంబను అతనితో పాటు కశేరు ద్వీపానికి పంపాడు. సోశుంబ పగలెల్లా కశేరుద్వీపంలో ఉంటూ, రాత్రిపూట పక్షినెక్కి మింటి మార్గాన దివ్యగంధంగల పూలమాలను తీసుకొని వారాణసికి వచ్చిపోయేది. తుమ్మెదలు చీకట్లవలె ముసరడం వల్ల 'తిమిరాలు' అని పేరుపొందిన పారిజాత సంతతికి చెందిన వృక్షం పుష్పాలతో ఆమె ఆ మాలికను కూర్చేది.

ఇది ఇలా ఉండగా, ఒకమారు వారాణసివాసి అయిన మానవుడనే బ్రాహ్మణ యువకుడు సమిధల కోసం అడవికి వెళ్ళాడు. అక్కడ ఒక కిన్నర కామినిని చూచి అతనికి కామ వికారం కలిగింది. అతనిని చూడగానే ఆమె కూడా అంతా మరచిపోయింది. కాంతిమయి అనే పేరుగల ఆ కాంత నవాభిలాష తంత్రిలాగ తనను ఆ ద్విజయువకునికి అర్పింపగా, అతనిని తన గుహాగృహానికి తీసుకొనివెళ్లి తనరత్నాభరణకాంతితో గుహలోని చీకట్లు పోగొడుతూ అతనితో విహరించింది. ఇలా విహరిస్తుండగా కొంత కాలానికి అతనికొక కుమారుడు పుట్టాడు. ఆ శిశువు బాల్యంలోనే బలవంతుడు, గాలివలె మహావేగం కలవాడు కావడం వల్ల తల్లి వానికి శ్రీఘ్రుగుడు అని పేరు పెట్టింది. కాంతిమయి నిర్విఘ్నంగా అతనితో సుఖిస్తూ, ఎంతయినా తృప్తి చెందక అతనిని గుహలో పెట్టి గుహద్వారం రాతిబండతో మూసి వెళ్లేది. శ్రీఘుగుడు పెరిగి పెద్దవాడై తనతండ్రి చెప్పగా గుహా నిర్బంధ వార్తను విని చింతావిస్మయాక్రాంతుడయ్యాడు "తండ్రీ! శిలాపిహిత ద్వారమైన ఈ గుహలో గుడ్డివానికి వలె నీకు స్నేహం కూడ బంధనమే అయిందే. నీ నివాస స్థలమైన వారాణసికే వెళ్లుదాము రా. గుహద్వారంపై మూసిన రాతిబండ పెద్దదైనా నేను అనాయాసంగా తీసివేస్తాను. స్వదేశవిరహాక్లేశం దుస్సహం కదా! ఎలా భరిస్తున్నావు?



స్వదేహంలాగ స్వదేశం విడువడం కష్టం. స్వదేశవిరహి అయినవాడు ద్రవిణ సంభారాన్ని భారంగాను, భోగాన్ని నిరుపభోగంగాను, గుణాలను, గ్రంథగుణాలు(ముడి దారాలు)గను భావిస్తాడు" అని శ్రీఘ్రుగుడు తండ్రిని ఓదార్చి గుహా గేహద్వారంపై ఆనించిన పెనుబండను తొలగించి ప్రయాణానికి సిద్ధంగా ఉన్న తండ్రితోపాటు వారాణసికి బయలుదేరాడు.

వారు అలా వెళ్ళగానే కిన్నరి వచ్చి గుహ శూన్యంగా ఉండడం చూచి, ఇలా అనుకుంది: "అయ్యో! ఆ దుర్జనుడు నా స్నేహాన్ని విస్మరించి ఎక్కడికో వెళ్ళిపోయాడుగదా! రెండు నాల్కలున్న భుజంగులకు(కాముకులకు, పాములకు) కౌటిల్యం ఉండడంలో ఆశ్చర్యమేముంది? ద్విజాతులు ఎంతకాలం దగ్గర ఉన్నా సంతోషపడరు. పై పైనే అనురాగం చూపుతూ చిలుకలలాగ పారిపోతారు." ఈ విధంగా అనుకొని కాంతిమయి ప్రియుని అవమానం భరించక అతని ప్రీతినే మానుకుంది. నిజమే! ప్రేమ పూవువంటిది. అవమానం సహించదు. కాని, ఆ కిన్నరికి కుమారునిపై మాత్రం మమత తగ్గలేదు. "అయ్యో! నా కుమారునికి ఏవిద్య వచ్చు? దేనితో అతడు భూమిపై జీవిస్తాడు?" అని ఆలోచించి, తన చెలికత్తెతో అతనికోసం వీణను పంపింది. స్త్రీలకు తమ భర్తలపై ప్రీతి సంభోగ సుఖపణ్యమే; పుత్రులపై ప్రీతి అపర్యుషితవాత్సల్యంతో నిశ్చలంగా ఉండేది. కాంతిమతి చెలికత్తె వేగగామిని గనుక దుర్మార్గం చేశామనే సిగ్గుతో వేగంగా వెళ్లుతున్న తండ్రీ కొడుకులను దారిలో కలుసుకొని, శ్రీఘ్రుగుడికి తల్లి యిచ్చిన వీణను అప్పగించి, "ఈ వీణ మొదటి తంతిని తాకవద్దు. పనులకు విఘ్నం కలిగిస్తుంది" అని హెచ్చరించి తిరిగి వెళ్ళింది. శ్రీఘ్రుగుడు ఆ వీణను స్వీకరించి, స్వదేశంలో స్వగృహంలో తండ్రిని పేర్చి వీణాప్రవీణుడై పోయినచోటెల్లా లాభగౌరవాలు పొందాడు.

శ్రీఘ్రుగుడు ఈ విధంగా వీణానిపుణుడై అందరి మనస్సులూ చూరగొంటూ ఉండగా, అతని దివ్యవీణావాదన చాతుర్యానికి ముగ్ధుడైన ఒక వర్తకుడు అంబుధి ద్వీపానికి వెళ్ళుతూ అతణ్ని కూడా ఓడపై తనవెంట తీసుకొని వెళ్ళాడు. ఓడలో అతడు వీణ వాయిస్తూ ఉంటే అమృతపు సొనగా ఉన్న వీణామూర్ఛనలకు సముద్రం కూడా క్షణక్షణానికి తరంగరహితమైనదా అన్నట్టు నిశ్చలమైంది. ఇంతలో శ్రీఘ్రుగుని వేళ్ళు పొరపాటుతో వీణ మొదటి తంతిని తాకాయి. దానితో తుపాను చెలరేగి ఓడ పగిలి బేహారులందరూ మరణించారు. శ్రీఘ్రుగుడు మాత్రం భగ్ననౌకనే అంటిపెట్టుకొని మేఘాలు కమ్మి గాలి వీవగా కర్మశేషం వల్ల క్షణంలో కశేరుద్వీపం చేరాడు. అక్కడ అతడు సముద్రతీరంలో ఉన్న దివ్యోద్యానం ప్రవేశించి మేలి పూగుత్తులవంటి పాలిండ్లు గల సోశుంబ సుందరిని చూచాడు. తన శరీరకాంతితో అచేతన పదార్థాలను కూడా ఆకట్టివేస్తున్న సోశుంబ తిమిర పుష్పాల మాలను కూరుస్తున్నది. ఆమె కూడ సుందరాకారుడు, ధీరుడు, శైశవతారుణ్యసంధి మధ్య వయస్సుగలవాడు అయిన శ్రీఘ్రుగుణ్ని చూచి ఆశ్చర్యపడి మన్మథుడనే మారుతం తగిలి కదలిపోయిన కరపల్లవాలతో, రాలిపోయిన శీలకుసుమంతో లతలాగ అతనికి నమస్కరించింది. వారిద్దరికీ చిరకాల రూఢమైనట్టుగా ప్రీతి ప్రబలంగా ఏర్పడింది. పూర్వజన్మ స్నేహలీనమైన మనస్సులు పరస్పరం వదలవు. ఆ సోశుంబ పగలు అతనితోను, రాత్రి రాజుతోను విహరించేది.

క్రమంగా తన ప్రియురాలి వామాచరితం గూఢకాముకుడైన శ్రీఘ్రుగుడికి తెలిసింది. తన్నుగూడ పక్షి మీద వారాణసికి తీసుకు వెళ్ళమని ఆమెను బ్రతిమాలాడు. పక్షి మీద ఎక్కి కళ్ళుమూసుకొంటే తీసుకుని

వెళ్ళుతానని ఆమె వానికి చెప్పింది. దానికి ఒడంబడి శ్రీఘ్రుగుడు ఆమెతోపాటు పక్షిమీద ఎక్కాడు. కాని, మధ్యన కళ్ళు తెరిచి చూద్దామని చాపల్యం కలిగింది. ఆమె ఎంత వద్దన్నా వినక కండ్లు తెరిచాడు. పాపం! కండ్లు రెండూ గుడ్డివైపోయాయి. ఆమె భయంతో వణుకుతూ అతన్ని అంతఃపురోద్యానంలో దింపి, దుఃఖం దిగమింగి రాజు శయనాగారం చేరింది. మనోవ్యథతో రాత్రి గడిపి, ఆమె కశేరు ద్వీపానికి వెళ్ళడానికి, మానడానికీ మనసొప్పక చింతపడుతూ ఉంది.

అప్పుడు వసంతకాలం. మామిడిపూవుల తావితో గుబాళిస్తున్న వసంత ఋతువు మన్మథుని విలాసాలకు యౌవనంలాగ అంతటా విలసిల్లింది. కోకిలాలికుల రుతంతో ఆ కాలం వియోగులకు భయంకరంగా పరిణమించింది. అప్పుడు అశోకం ఎర్రగా చిగిర్చి వియోగులకు దుస్సహమైంది. రాజు ప్రకృతి ప్రభావంతో కామమోహితుడై సోశుంబను ఒక్క దినమూ వదలక తీరని కోరికతో ఉద్యానానికి వెళ్ళి విహరించదలచాడు. ఆమెతోపాటు రాగానికి, మదానికి, కామానికి సంసారంవలె ఉన్న ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ కూడ చిరుగాలికి ఊగులాడే లతవలె సొబగులు కులికే తన దయితనే చూస్తూ మురిసిపోయాడు. పరప్రేమ విషాక్రాంతురాలైన సోశుంబ మనసులో మనసు లేక ఉంది. నిజమే! చింతాశల్యం మనస్సులో ఉన్నప్పుడు సుఖం సుఖంగా కనిపించదు. పామున్న పుష్పమాలను ధరించినవారు మోహం చెందినట్టు రాగాతిరేకం కలవారు మనసులో మరొకణ్ని తలుస్తున్న స్త్రీలు కౌగిలించుకున్నప్పటికీ మోహితులౌతారు.

ఆ ఉద్యానంలో రహస్య లతానికుంజంలో ఉన్న గుడ్డి శ్రీఘ్రుగుడు సోశుంబ తిమిర పుష్పమాల తావులు ఆఘ్రాణించి కామవికారంతో తను రహస్యంగా అక్కడ దాగి ఉన్నాననే సంగతి మరచిపోయి "ప్రియురాలు ధరించిన తిమిర కుసుమ మాలికా సౌరభం ఆమె ముఖపద్మ మదగంధంతో కలిసి, భ్రమర మాలికలరవమనే మధుర వీణానిక్వణంతో సహా దూరం నుంచి మందమారుతానికి అల్లనల్లన వస్తున్నది." అని పాడడం ప్రారంభించాడు. కామవికారావిష్టులు ఎవరికీ భయపడరు గదా! హృదయాన్ని విప్పి, చెబుతున్న ఆ గీతం విని రాజు ఉద్యానవనమంతా గాలించి ఒక పొదరింటిలో ఒక గుడ్డివాడుండడం కనుగొన్నాడు. రాజు అనుమానంతో గాఢానురాగమదమత్తుడైన అతణ్ని "సోశుంబను ఎరుగుదువా? ఆమె దేహలక్షణాలు నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు. ఆ అంధుడు దానికి బింబఫలంవలె పాటలాంగి అయిన సోశుంబను ఎరుగనా? రాగసామ్రాజ్యమైన ఆమె అధరంపై మన్మథుడు అధిష్ఠించినట్టు ఉంటాడు. ఆమె ఊరుమూలంలో మన్మథుడు వ్రాసినట్టు ఒక సుందరమైన స్వస్తిక చిహ్నం ఉంది. స్తనమండలం మీద సౌందర్య కల్లోలినీ కల్లోలంవలె అందాలు చిందే సుడి ఉన్నది.!" అని సమాధానమిచ్చాడు. ఆ మాటలు విని రాజు సంతాపంతో వాడిన రాగకుసుమాన్ని మనో నిర్మాల్యంవలె వెంటనే వదలిపెట్టాడు. "నూరువిధాల జాగ్రత్తపడినా స్త్రీలకు శీలరక్ష ఉండదు. గగనకుసుమమాలలాగ అన్ని విధాల పతివ్రత అయిన స్త్రీ ఉండదు!" అని అనుకొని ఆ గుడ్డివానితో సోశుంబను గాడిదపై ఎక్కించి నగరం వెలుపలి శ్మశానవాటికకు పంపాడు.

సిగ్గులేని ఆ సోశుంబ రాత్రి ఆ అంధునితోపాటు వెళ్ళుతుండగా దారిని ఒక అడవిలో ఒక దొంగలగుంపు పైనపడింది. దొంగలగుంపు నాయకుడు సోశుంబను నగలతో సహా పట్టుకున్నాడు. ఇంతలో జనం పోగయి దొంగల గుంపును తరిమివేసి, నిరపరాధి అయిన ఆ అంధుణ్ణి దొంగఅనుకుని



కొట్టి చంపివేశారు. దొంగలనాయకుడు సోశుంబతో రాత్రల్లా గడిపి నగలు వస్త్రాలు కూడ ఒలుచుకొని కారండవ అనే నది దాటి వెళ్ళిపోయాడు. సోశుంబ ఆ నదీతీరంలో దిసమొలతో కాటుక కన్నీటితో చనుగట్టును మలినం చేస్తూ విలపించింది. అప్పుడు ఆ నదిగట్టుకు మాంసంముక్క నోటితో కరచుకొని ఒక నక్క వచ్చింది. అది నీటిపైకి ఎగిరిన చేపను పట్టుకుందామన్న ఆశతో నోటిలోని మాంసంముక్కను గట్టుపై పెట్టి నీటిదగ్గరికి వచ్చింది. చేప నీటిలో మునిగిపోయింది. ఒక గ్రద్ద వచ్చి గట్టుమీది మాంసంముక్కను తన్నుకుపోయింది. అప్పుడు ఆ నక్క రెండూ దక్కనందున చింతతో ఏమీ తోచక నిశ్చలంగా చూస్తూ నిలబడిపోయింది. ఆ నక్కను చూచి సోశుంబకు ఆ దుఃఖదశలోను నవ్వు వచ్చింది. తను దుస్థితిలో ఉన్నప్పటికీ పరాయివారు తప్పు చేసినప్పుడు నవ్వు రావడం సహజం. అనుచిత సమయంలో ఆమె నవ్వినందుకు నక్క సిగ్గుపడి కోపగించుకొని "బలె! లోకమంతా నిన్ను చూచి నవ్వుతున్నది. సిగ్గులేక నన్ను చూచి నవ్వుతావా? రాజును వదలి గుడ్డివాణ్ణి చెట్టబట్టినావు; వాణ్ణి వదలి దొంగను చేరావు. ఇలా త్రిభ్రష్ట అయిన నీవా ఉభయభ్రష్టమైన నన్ను ఎగతాళి చేయడం? నీ పరిహాసం ఉండనీ. నీకు నేను యుక్తితోనే పరిహాసం చేస్తాను. విషమస్థితిలో ఉండేవారిని పరిహసించేవారు దుష్టులు" అని చెప్పి, వారాణసికి వెళ్ళింది. అక్కడ రాచనగరు చేరి "రాజా! నీ ప్రియురాలైన సోశుంబ నదీతీరంలో సద్బుద్ధితో తపస్సు చేస్తున్నది. పోయి చూడు." అని అన్నది. రాజు ఆ జంబుకం మాటలు విని అక్కడికి వెళ్ళి ఆమెకు నగలు గుడ్డలు కట్టబెట్టి నగరుకు పిలుచుకొని వచ్చాడు. మానవులు అనురాగం ఏమాత్రం మిగిలి ఉన్నా తమకు ఇష్టమైన వారి లోపాలను కప్పిపెడుతారు.

ఆ సోశుంబే ఉత్పలవర్ణ. ఆ శ్రీఘ్రుగుడే ఈ ఉదయి. పూర్వజన్మపుణ్యం వల్ల ఇప్పుడు బిక్షువ్రతం అనుష్ఠిస్తున్నారు. అనురాగ సంబంధంతో రసార్ద్రమై కామవిధేయమైంది ఈమె మనస్సు. కనుక ఆ క్షణకాలం ఈమె శమగుణం వదలి రాజరూపంతో నన్ను దర్శించి నమస్కరించింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో దేవతారావదానమనే పద్నాల్గవ పల్లవం

# 15. శిలానిక్షేపావదానం

ప్రభావవంతుల బలం, అతులధైర్యం, వీర్యం ఆశ్చర్యకరంగానే ఉంటాయి. మహదాశ్రయం వల్ల అన్నిటికీ మహిమ అబ్బుతుంది కాబోలు!

బుద్ధభగవానుడు స్వేచ్ఛగా పాదచారియై సంచరిస్తూ, ఒకమారు మహా బలవంతులైన మల్లవంశీయుల రమ్య రాజధాని అయిన కుశీపురికి వెళ్లాడు. మల్లులు ఆయన శుభాగమనం విని కుశలం కోరుతూ, ఆయనకు ఉపచారం చేసే ఉద్దేశంతో దారిని గడ్డీగాదం, ముండ్లు, రాళ్లు, గులకరాళ్లు దుమ్ము లేకుండా శుభ్రపరచి చందనోదకం చిలకరించారు; తమ దేశాన్నంతా అలంకరించారు. ఇలా దారిని సరిచేస్తుండగా ఒక చోట భూమిలో కూరికొనిపోయి దారికి అడ్డంగా ఉన్న పెద్దరాయి ఒకటి కనిపించింది. అది వింధ్యగిరి వధువులాగ ఉన్నది. దానిని వారు గునపాలు గొడ్డళ్లు మొదలయిన వాటితో తవ్వి, పగ్గాలు కట్టి పెకలించి లాగివేయడానికి ప్రయత్నించారు. నెలనాళ్లు గడిచాయి. కాని ఆ గండశిలలో సహస్రాంశం కూడ విరిగిపడలేదు.

ఇంతలో సంసార సంతాపాన్ని పోగొట్టే అమృత కిరణుడు, సర్వమానసాలను ఉల్లాసపెట్టే లోక బాంధవుడు, ఘనాంధకార విరతితో సఫల దర్శనుడు, లోకులను అనుగ్రహిస్తూ తన ప్రకాశాన్ని విస్తరింప జేస్తున్నవాడు అయిన బుద్ధదేవుడు శరదృతువువలె ఏతెంచాడు. ఆయన రాగానే విపులక్లేశంతో అలసిసొలసిన మల్లులను చూచాడు. వారు ఆయనకు నమస్కారం చేసి, తాము చేస్తున్న పనిని విన్నవించారు. అపార పరాక్రముడైన ఆయన వారితో "అయ్యో! సంసార కర్మలాగ క్లేశమనే ఫలమిస్తున్న ఈ పనికి ఎందుకు వృథాగా ప్రయత్నిస్తున్నారు? ప్రారంభంలో విపరీత కష్టం కలిగిస్తూ కొంత సాగిన తర్వాత సంశయం కలిగిస్తూ, సిద్ధించినప్పటికీ అనుపాదేయమైన పనిని ప్రాజ్ఞులు చేయరు" అని చెప్పి ఆ విపుల శిలను కాలిబొటనవేలు తాటించి కదిపి, ఎడమచేతితో ఎత్తి కుడిచేతితో పట్టుకొని, పైకి విసిరివేశాడు. అది బ్రహ్మలోకాంతం వరకు వెళ్ళి జగత్త్రయానికే ఆశ్చర్య చర్యల దూతలాగ తిరుగసాగింది. బుద్ధభగవానుడు ఆ రాతిని పైకి విసిరిన వెంటనే ఆకాశవాణివలె ఒక ధ్వని పుట్టి అంతటా వ్యాపించింది. "ఈ సర్వ సంసారం అనిత్యమనే నిశ్చయబుద్ధి గల సర్వధర్మ నిరతుడైనవానికి శాంత నిర్వాణమనే పరమసిద్ధి కలుగుతుంది" అని ఆ ధ్వని స్పష్టంగా వినిపించింది. తర్వాత ఆ మహాగండశిల భగవానుని చేతిలో మేరుపర్వత శిఖరాకారంగా కనిపించింది. దానిని భగవానుడు నోటితో ఉప్పని ఊదాడు. అది పరమాణు పరంపరగా పిండిపిండిగా అయి దిక్కులలో పడింది. ఆ పరమాణువులన్నిటినీ భగవానుడు ఒక్కటిగా చేర్చి మరొకచోట పెద్దరాయిగా కూర్చి జగత్త్రయానికే విస్మయం కలిగించాడు.

భగవానుని బలాతిశయంతో విలసిల్లే పరాక్రమాన్ని మల్లులు ఆశ్చర్యంలో రెప్పవాల్చకుండా చూచి, నమస్కరించి "దేవా! నీ బల వీర్యాతిశయం మహాప్రభావయుతమైంది. ఇది ఇంత అని దేవతలు కూడ



నిశ్చయించలేరు. అనుగ్రహ ప్రవృత్తమైన నీ మహాబలంతో అధోగతి నిమగ్నులైన ఈ ప్రాణులను ఉద్ధరించినట్టుగా భూమిలో పాతుకుపోయిన ఈ గండశిలను ఎత్తావు. అత్యాశ్చర్య కర్మలు జరుపుతున్న నీ వీర్య ప్రజ్ఞాబలాలు ఇంత అని ఎవరు తెలుసుకోగలరు?" అని విన్నవించారు. ఆశ్చర్య నిశ్చలులై ఇలా విన్నవిస్తున్నవారిని జినదేవుడు చూచి గండశిలమీదే ఆసీనుడై ఇలా అన్నాడు. "ఈ భువనత్రయంలోని ప్రాణికోటుల బలాన్ని ఒక్కటి చేసినా ఒక్క బుద్ధుని బలంతో సమానం కాదు. సుగతప్రభావం అపారమైంది. దానికి సముద్రజలాలు కడవలమేర; జగత్తులు పరమాణువుల మేర. కనుక దానిని దాటడం శక్యం కాదు. సుమేరు సంఖ్యను తులామానంతో కచ్చితంగా తెలుసుకొన్నవాడు కూడ సుగతుని గుణగౌరవాన్ని తెలుసుకోలేడు" అని జినదేవుడు ఉపదేశించగా; బ్రహ్మేంద్రాది దేవతలు వచ్చారు. భగవానుడు వారికి కూడా కుశలోపదేశం చేశాడు. మల్లులు ఆయన ఉపదేశంతో ఆ యా బోధిని పొంది, సశ్రావకమనే ప్రత్యేక సమ్యక్సంబుద్ధపదవిని సంపాదించారు. మల్లులలో కొందరు ఆయన ఉపదేశం వల్ల స్రోతఃప్రాప్తి ఫలాన్ని, మరికొందరు సకృదాగామి ఫలాన్ని, ఇంకా కొందరు అనాగామి ఫలాన్ని, ఇతరులు అర్హత్పదవిని సంపాదించారు.

ఈ విధంగా భగవానుడు భిషగ్వరునివలె మల్లుల ఆశయానుశయధాతుగతులను పరీక్షించి, ప్రకృతిని తెలుసుకొని కుశలాభివృద్ధికోసం చతురార్య సత్య సమప్రకాశ విశదమైన అపూర్వోపదేశం చేశాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శిలానిక్షేపావదానమనే పదేనవ పల్లవం.

# 16. మైత్రేయవ్యాకరణావదానం

అసంగమనేది విశుద్ధికి ధామము. అది కుశల కామనను కలిగించి లోకులను సంసారానికి దూరులను చేసి, మనోమాలిన్యాన్ని, వైరరజస్సును తొలగించి సుకృతాలను చేయించి శ్రేయస్సును కలిగిస్తుంది.

పూర్వం సుగతభగవానుడు ఒకప్పుడు నాగులు తమ పడగలనే వంతెనగా చేయగా, దానిమీద గంగను దాటి, గట్టు చేరిన తర్వాత భిక్షువులను చూచి "ఇక్కడ అద్భుతమైన కాంతులతో వెలిగే రత్నమయమైన యూపస్తంభమొకటి పూర్వం ఉండేది. మీకు చూడాలని కుతూహలం ఉంటే ఇప్పుడు చూపిస్తాను" అన్నాడు. ఈ విధంగా చెప్పి, భగవానుడు దివ్యలక్షణ యుక్తమైన తన చేతితో భూమిని తాకి, నాగగణం ఎత్తిపట్టిన రత్నయూపస్తంభం చూపించాడు. ఆ యూపస్తంభాన్ని భిక్షువులు చాలసేపు రెప్పవాల్పకుండా చూచి చిత్రంలోని రూపాలవలె నిశ్చలులై ఆశ్చర్య చకితులయ్యారు. "ఈ ఆశ్చర్యగాథ ఏమిటి?" అని భిక్షువులందరూ ప్రశ్నించగా, భగవానుడు తన దంత కాంతులతో అతీతానాగత జ్ఞానాన్ని వెదజల్లుతున్నాడా అన్నట్టు ఇలా అన్నాడు:

పూర్వం ఒకప్పుడు ఒక దేవపుత్రుడు కాలవశాత్తు ఇంద్రశాసనం వల్ల స్వర్గ పరిచ్యుతుడై మహాప్రణాదుడనే రాజుగా భూలోకంలో అవతరించాడు. ఆ రాజు భూలోకంలో తనకు ధర్మానుసరణం జ్ఞాపకం చేయడానికి ఇంద్రుణ్ని ఒక సముచితలాంఛనం ఇవ్వవలసిందని కోరాడు. ఇంద్రుడు అతని భవనంలో ఉన్నత పుణ్యం వలె వెలుగులు చిమ్మే ఒక రత్నయూపస్తంభాన్ని నిర్మించవలసిందని విశ్వకర్మను ఆదేశించాడు. విశ్వకర్మ అలాటి యూపస్తంభం నిర్మించాడు. ఆ రాజ్యంలోని ప్రజలు కుతూహలంతో ఆ రత్న యూపస్తంభం చూస్తూ, మైమరచి కృష్యాది కర్మలు మానివేయగా రాజు కోశాగారంలోని ధనం మారుతూ వచ్చింది. అప్పుడు రాజు దానిని జాహ్నవీ జలంలో పారేశాడు. సూర్యునిలాగ వెలుగుతూ రత్నాలు తాపిన ఆ యూపస్తంభం ఇప్పటికీ పాతాళంలో నిలిచింది. కాలక్రమాన దీనికి వినాశం ఏర్పడుతుంది. పరిణామంలో అక్షయంగా ఉండేది ఈ లోకంలో ఏదీ లేదు. ఎనభైవేల సంవత్సరాలు గడిచిన తర్వాత ముందు ముందు శంఖధవళకీర్తి అయిన శంఖుడనే రాజు జన్మిస్తాడు. కల్పద్రుమ సమానుడైన ఆ రాజు పుణ్యవశాత్తు లభించిన ఈ యూపాన్ని తన పురోహిత పుత్రుడైన మైత్రేయుడికి ఇస్తాడు. అర్థి చింతామణి అయిన ఆ మైత్రేయుడు ఈ యూపస్తంభాన్ని స్వీకరించి, వెంటనే ముక్కలు చేసి లోకదారిద్ర్యం పోగొడుతాడు. మైత్రేయుడు యూపాన్ని దానం చేసి సమ్యక్సంబుద్ధుడై, అనుత్తరజ్ఞాననిధియై దేవతలతో పూజలు పొందుతాడు. శంఖభూపతి యెనభైవేలమంది అంతఃపుర స్త్రీలతో, అమాత్యగణంతో సహా సన్న్యాసదీక్ష స్వీకరిస్తాడు. శంఖభూపతి పూర్వజన్మలో చేసిన ప్రణిధానం వల్ల కలిగిన కుశలోదయం- పూర్వకర్మ అవశ్యం అనుభవించవలసిఉన్నది. కాబట్టి- అంతంలో ఫలిస్తుంది.



పూర్వం మధ్యదేశంలో వాసవసమానుడైన వాసవుడనే రాజు, ఉత్తరాపథంలో ధనసమ్మతుడనే రాజు ఉండేవారు. వారిద్దరికీ వైరాగ్ని రగిలి, ఐశ్వర్యస్పర్ధ ఏర్పడి, మనస్సు యుద్ధసమారంభ రభసమైంది. ధనసమ్మతుడు గజరథాది సైన్యంతో దండెత్తి వచ్చిన వాసవుని నగరం ప్రవేశించి, గంగాతీరంలో కొంచెం కూడ స్థలమనేదే లేకుండా దండు విడిశాడు. అక్కడ బ్రహ్మశక్రాది దేవతలు పాదార్చన చేస్తున్న రత్నశిఖ అనే సమ్యక్సంబుద్ధుని చూచాడు. "ఆహా! వాసవమహీపతి మహాపుణ్యవంతుడు. ఈయన దేశంలో త్రిదశవందితుడైన ఈ సమ్యక్సంబుద్ధుడున్నాడు" అనుకొని ఆశ్చర్యపడ్డాడు. తర్వాత ఆ రత్నశిఖి ప్రభావంతో మహీపతులిద్దరి వైరరజస్సు శాంతించింది; మిథ్యామోహం క్షీణించింది. వాసవ మహీపాలుడు తన శత్రువైన ధనసమ్మతునితో సంధి చేసుకుని సమ్యక్సంబుద్ధుని సర్వభోగాలతోను పూజించాడు. "కుశలానికి మూలకారణమైన ఈతని అనుగ్రహం వల్ల గొప్పవాడు కావాలి- అని నమస్కరిస్తున్నా" అని మనసులో అనుకుని పూజాంతంలో ధ్యానం చేశాడు. అప్పుడు గంభీరమైన శంఖనాదం వినిపించింది. "నీవు శంఖుడనే చక్రవర్తివవుతావు. అంతంలో బోధి కలిగి కుశలం పొందుతావు" అని రత్నశిఖి తన ఎదుట నమస్కరించి నిలబడ్డ వాసవభూవల్లభునితో అన్నాడు.

ఈ విధంగా వాసన మహారాజు పూర్వపుణ్యవశంతో ఉత్తమ ప్రణిధానం చేసి, రత్నశిఖి ఆజ్ఞ ప్రకారం శంఖుడనే నృపతిగా పుట్టి సంపదలు పొందుతాడు. మైత్రేయుడు కూడా తన విమల బుద్ధిని బోధిలో లగ్నం చేస్తాడు. సజ్జనసంగమం కల్యాణాభినివేశానికి మొట్టమొదటి పుణ్య నౌకవంటిది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మైత్రేయ వ్యాకరణావదానమనే పదహారవ పల్లవం.

# 17. ఆదర్శముఖావదానం

చిత్తశుద్ధితో, నిర్మలప్రణయంతో చేసిన స్వల్ప దానకుసుమం ఫలాంశంతోనైనా మేరు పర్వతం, రోహణగిరి, సుధా సముద్రం చేసిన అపారదాన సంపత్ఫలం పోలదు.

పూర్వం మహానుభావుడైన సర్వజ్ఞుడు అనాథపిండదుని ఆరామమైన మనోహర జేతవనంలో విశ్రమించి సదుపదేశాలు చేస్తుండగా, బుద్ధ శిష్యుడు, కరుణానిధి అయిన ఆర్య మహాకాశ్యపుడు ఉపవనం చివర నగర సమీపానికి పాదచారియై వెళ్లాడు. అక్కడ నగర ప్రాంతంలో బాట పక్కనే పడి కుష్ఠరోగంతో బాధపడుతున్న ఒక స్త్రీ ఆయనను యథాలాపంగా చూచింది. "ఈ మహానుభావుని భిక్షాపాత్రంలో భిక్ష వేసే అర్హత నాకు పూర్వపుణ్యం వల్ల లేకపోయిందికదా!" అని మనః పూర్వకమైన శ్రద్ధతో అనుకుంది. అద్భుత శ్రద్ధగల ఆమె మనోరథాన్ని కరుణాకులుడైన ఆర్యకాశ్యపుడు గ్రహించి తన భిక్షాపాత్రను చాచి, ఆమె భిక్షను స్వీకరించాడు. ఆ కుష్ఠరోగిణి అతిశయ చిత్త ప్రసాదంతో ఆ భిక్షాపాత్రంలో అన్నం గంజి వేస్తున్నప్పుడు, ఆమె చేతి వేలొకటి విరిగి దానిలో పడింది. కాలక్రమాన ఆమె ఆ కుష్ఠగ్రస్తమైన అనిత్య శరీరాన్ని పాతకంవలె వదలి తుషితులనే దేవతల లోకంలో ఉద్భవించింది. ఇంద్రుడు కుష్ఠరోగిణి చేసిన దానాద్భుతం తెలుసుకొని దాన పుణ్యంపై ఆదరంతో కాశ్యపుని భిక్షాపాత్రను అమృతంతో నింపాడు. కాని, ప్రశమామృత పూర్ణుడైన ఆ భిక్షువు ఆ అమృతాన్ని నిస్పృహతో తృణంగా భావించి పాత్రను బోర్లించి వేశాడు. కరుణానిధులైన సత్పురుషులు దుర్గతి పొందినవారిని ప్రణయంతో ప్రీతితో చూస్తారు; సంపత్తుతో విర్రవీగుతున్నవారి ముఖం చూచి కన్నులు మూసుకొంటారు.

ఆ కుష్ఠరోగిణి తుషిత దేవలోకంలో ఉద్భవించినట్లు విని ప్రసేనజిత్తు భగవానునికి గొప్పవిందు చేశాడు. ఆ రాజు పరమాశ్చర్య సంపద చూచి ఆర్య ఆనందుడు "ఈ వైభవానికి ఈ రాజు చేసిన పూర్వజన్మ పుణ్యమేమిటి?" అని ప్రశ్నించగా, భగవానుడు ఇలా అన్నాడు. "పూర్వం ఒక గృహపతి కుమారుడు దారిద్ర్యం వల్ల దాసుడై, వ్యవసాయం చేసేవాడు. ఒకనాడు మడి దున్ని ఆకలితో అలసిపోయి, తన తల్లి తెచ్చిన ఉప్పు, నూనె లేని అలసందల పిండిని తినడానికి చేతులు కాళ్ళు కడుక్కొని కూర్చున్నాడు. అప్పుడు అకస్మాత్తుగా ఒక ప్రత్యేకబుద్ధుడు అక్కడికి వచ్చాడు. ఆ గృహపతి కుమారుడు ప్రసన్నచిత్తంతో ఆ అలసందల పిట్టును ఆ ప్రత్యేకబుద్ధునికి భిక్ష యిచ్చాడు. అతడే కాలక్రమాన ప్రసేనజిద్భూపాలుడుగా జన్మించాడు. ఆ దానకణానికి ఈ విభవం మొదటి ఫలం."

ఈ మాటలు విని ఆనందుడు చాల ఆశ్చర్యపడ్డాడు. ప్రసేనజిన్మహారాజు భక్తితో భగవానుని గొప్పగా పూజించి రాజార్హమైన అఖిల భోగాలూ నివేదించి ఆయనముందు కోటి నూనెకడవలతో దీపమాలికలు వెలిగించి గౌరవించాడు. అప్పుడొక దరిద్రవనిత చిన్న దీపమొకటి వెలిగించింది. నూనె



అయిపోవడం వల్ల అన్ని దీపాలు ఆరిపోయాయి. కాని, ఆ దరిద్రవనిత దీపం ఆరిపోలేదు. సర్వజ్ఞుడు ప్రణిధానంతో ఆమె మున్ముందు శాక్యముని పదవి పొందగలదని తెలుసుకొని, ఆమెకు తెలియజేశాడు.

ప్రసేనజిత్తు భగవానునిముందు రత్నదీపాలు వెలిగించి, నమస్కారం చేసి, దగ్గర కూచుని వినయంతో చనువుగా ఇలా విన్నవించాడు. "భగవాన్! ప్రణిదానం వల్లను ఆ యా పుణ్యానుభవం వల్లను మీరు అనుత్తర అయిన సమ్యక్సంబోధిని ఎవరికి అనుగ్రహించలేదు? ఆ అనుత్తర సమ్యక్సంబోధిని పొందాలని చనువునుబట్టి అభ్యర్థిస్తున్నా. కల్పవృక్షాలను నిర్వికల్ప ఫలప్రాప్తికోసం కదా జనులు సేవిస్తారు." రాజు విన్నపం విని భగవానుడు ఇలా అన్నాడు. "రాజా! అనుత్తర అయిన సమ్యక్సంబోధి దుర్లభం. అది తామర తూండ్ల తంతువు కంటే సూక్ష్మమైంది. పర్వతాలకంటే ఎత్తైంది, సముద్రంకంటే గంభీరమైంది. సుఖంతో లభించేది కాదు. నేను పెక్కు పూర్వ జన్మలలో పెక్కుదానాలు చేసినా, దానిని సంపాదించలేకపోయాను. ఆ అనుత్తర సమ్యక్సంబోధికి చిత్తప్రసాద విమలమైన జ్ఞానం మూలకారణమని పెద్దలంటారు. నేను మాంధాతజన్మలో చతుర్ద్వీపాధిపతినై దానఫలం బహుకాలం అనుభవించాను. కానీ, బోధిని సంపాదించలేకపోయాను. సుదర్శన జన్మలో దానప్రభావంతో అపార చక్రవర్తి వైభవం పొందాను. కాని బోధి కలుగలేదు. పూర్వం కుశలాత్ముడనే పేరుతో కురూపుడైన రాజపుత్రుడుగా పుట్టాను. పిశాచమనుకొని నన్ను నా భార్య కూడ వదలిపెట్టింది. లక్ష్మితో తులతూగేవాణ్ని. భూ మిదానమంటే నాకప్పుడు మహాప్రీతి. కురూపిగా ఉండడం వల్ల చాల విచారపడేవాణ్ని. అన్ని గుణాలు ఒక్కటే చోట ఎక్కడ ఉంటాయి? రూపం మహావికారంగా ఉండడం వల్ల దేహత్యాగం చేసుకొనడానికి సిద్ధపడగా శచీపతి ప్రత్యక్షమై, దివ్య చూడామణిని అనుగ్రహించి, మన్మథాకారుణ్ని చేశాడు. తర్వాత విపుల రాజ్యం ఏలుతూ యజ్ఞాలు ఆచరించాను. నా రాజ్యంలోని అర్వైవేల నగరాలు బంగారు యూపస్తంభాలతో మనోహరమైన మేరుపర్వత శోభను పొందాయి. ఆ జన్మను దానజలార్ద్రం చేసి పుణ్యం సంపాదించాను. కాని, బోధిని పొందలేక పోయాను. త్రిశంకు నరపాలుడుగా జన్మించినప్పుడు సత్యప్రభావంతో దుర్భిక్షంలో వర్షం కురిపించాను. కాని, బోధి కలుగలేదు. మిథిలలో మహాదేవ నృపజన్మలో యజ్ఞాలు చేసి పుణ్యసంపద చూరగొన్నాను. కాని, బోధి పొందలేదు. అదే మిథిలానగరంలోను నిమిభూపాలుణ్నై పుట్టి దానతపోయజ్ఞాలతో పుణ్యం సంపాందిచాను. కాని, బోధిని సంపాదించలేక పోయాను.

"పూర్వం నందుడనే నృపతికి ఐదుగురు కుమారులు ఉండేవారు. వారిలో నలుగురు దుర్మార్గులు. ఐదవవాడయిన ఆదర్శముఖుడనే వాడు గుణవంతుడు. కాలక్రమాన ఆ నృపాలుడు అంత్యకాలం సమీపించగా, నా అనంతరం కర్కశులైన నలుగురు కుమార్లూ రాజ్యానికి అర్హులు కారు. విమల ప్రజ్ఞాశాలి, సచ్చరిత్రుడు అయిన ఆదర్శముఖునిలో రాజ్యశ్రీ ప్రతిబింబించి శోభ పొందుతున్నది' అని తలపోసి, అమాత్యులను పిలిపించి, ఇలా అన్నాడు. 'అంతఃపురజనం ఎదురేగి గౌరవించేవాణ్ని, తల అల్లలలాడని వాణ్ని, ద్వారాల క్రింద, బావులోను, పర్వతాలలోను, చెట్లకింద ఆరు విధాలైన నిధులను చూడగలవాణ్ని రాజుగా అభిషేకించండి.' రాజు ఈ విధంగా ఉత్తరువు చేసి స్వర్గధామం చేరాడు. అమాత్యులు రాజు చెప్పిన లక్షణాలతో అందరినీ పరీక్షించి ఆదర్శముఖునికి పట్టం కట్టారు. ఆ ఆదర్శముఖుని పరిపాలనతో ధర్మం నాలుగు పాదాలతో నడిచేది. ధర్మనిర్ణయ సందర్భంలో వాది ప్రతివాదులు ఆయనను

చూచినమాత్రానే, జయ పరాజయాలు ఒప్పుకొని నిలబడిపోయేవారు. ఆయనవద్దకు వింతవింత అభియోగాలు వచ్చేవి. ఒకమారు దండి అనే బ్రాహ్మణునికి ఎలాటి కారణమూ లేక హత్యాపాపం వచ్చింది. అలాటివాణ్ని దయాలువైన రాజు ఎదురేగి గౌరవించాడు. ఒక గృహస్థుడు గుర్రం తన్నగా మరణించాడు. గోయుగంకోసం తక్షవాసి అయిన ఒక పౌరుడు గొడ్డలితో నరికి చంపాడని ఆ గృహస్థుభార్య అభియోగం తెచ్చింది. పశుపక్ష్యాది ప్రాణుల హృదయం ఎరిగినవాడు గనుక ఆలాటి ధర్మసందేహాలు వచ్చినప్పుడు తన మనస్సును శోధించుకొని తన మనస్సులో న్యాయమని తోచిన దానిని నిర్ణయించి తీర్పు చెప్పేవాడు. ఒకసారి పన్నెండు సంవత్సరాల పాటు అనావృష్టి వల్ల దుర్భిక్షం ఏర్పడగా, ఆ రాజు సకలప్రాణులకు తిండిపెట్టి ప్రాణాలు నిలిపాడు. ఆ ఆదర్శముఖుణ్ని నేనే. ఆ జన్మలో ఈ విధంగా పుణ్యం సంపాదించాను. కాని, మహోత్తమమైన సమ్యక్సంబోధి ఏర్పడనే లేదు. అనేక జన్మశతాల మహాభ్యాస ప్రయాసచేత లుప్తసంవరణమైన ఈ విమలజ్ఞానం పొందాను. కనుక ఓ రాజా! ఈ అనుత్తర సత్యాసంవిత్సమ్యక్సంబోధి జ్ఞానప్రజ్ఞతో సంపాదించదగింది. మోహమనే రాత్రి గడవగా సంసారాంధకారాన్ని రూపుమాపే దినశ్రీవంటి ఆ సమ్యక్సంబోధి అజ్ఞాన మేఘాలు తొలగి హృదయాకాశం విమలమైన వారికి నిర్వ్యాజమైన ఆనందభూమి అవుతుంది. అది దానపుణ్యాలతో లభించేది కాదు."

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ఆదర్శముఖావదానమనే పదిహేడవ పల్లవం

## 18. శారిపుత్రప్రవ్రజ్యావదానం

సంసార సాగరానికి సేతువును నిర్మించేవాడు కల్యాణ కారకుడైన జ్ఞానాచార్యుడే; బంధువు కాదు, మిత్రుడు కాదు, సోదరుడు కాదు; తల్లి కాదు; తండ్రి కాదు.

పూర్వం ఒకప్పుడు బుద్ధభగవానుడు రాజగృహనగర సమీపంలోని కలందక నివాసమనే వేణువనాశ్రమంలో విహరిస్తున్నప్పుడు భిక్షుభావంతో తన్ను శరణు పొందిన కౌలికుడు, ఉపతిష్యుడు అనే పరివ్రాజకులను శమధనులుగా చేశాడు. పిదప శారిపుత్రుని వంతు వచ్చింది. ఆతడు భిక్షుభావం పొందాలనే ఆదేశం తనంతటనే జరిగింది. ఆ ఆదేశం వల్ల శారిపుత్రుడు అర్హత్వం పొంది మోక్షపదవికి అర్హుడయ్యాడు. ధనవంతులకు అర్హమైన ఆ అద్భుతాన్ని భిక్షువులు తిలకించి శారిపుత్రుని పూర్వ వృత్తాంతం తెలుపవలసిందని కోరారు. భగవానుడు ఇలా సెలవిచ్చాడు:

"పూర్వం అగ్నిమిత్రుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతనికి గుణవతి అయిన భార్య ఉండేది. ఆమెను తండ్రి ముద్దు ముచ్చటకోసం శూర్పిక అని పిలిచేవాడు. ఆమెకు ప్రథమశీలుడనే అన్న ఉండేవాడు. అతనిని కూడ శూర్పుడని పిలిచేవాడు. ప్రత్యేకబుద్ధుడైన ఆయన ఒకమారు అగ్నిమిత్రుని ఇంటికి వచ్చాడు. ఆమె భర్త ఆజ్ఞతో అతనిని గృహస్థార్హమైన భక్తిశ్రద్ధలతో ప్రీతితో పరిచర్య చేసింది. ఆయన ఆమె పరిచర్యలు పొందుతూ ఒకనాడు తన కాషాయం చిరుగులను అతుకులను వేసుకొని కుట్టుకుంటున్నాడు. అప్పుడు ఆమె కాషాయ చీవరంలో చొచ్చుకుపోతున్న సూదిని చూచి పూర్వకర్మవశాన 'ఈ కాషాయాన్ని కత్తిరిస్తున్న కత్తెరవలె గంభీరంగా లోపలికి చొచ్చుకొనిపోయే సూదివలె పరాప్రజ్ఞా నాకు కలుగుగాక!' అని ఆదరంతో ప్రణిధానం చేసింది. ప్రత్యేకబుద్ధునికి వినయంతో సేవ చేసినందువల్ల, ఆ ప్రణిధానం వల్ల ఆమె ఈ జన్మలో ప్రజ్ఞావంతుడైన శారిపుత్రుడుగా పుట్టింది. కనుకనే శారిపుత్రుడు తీక్ష్ణతరబుద్ధి కలిగి కల్యాణపాత్రుడై సద్బుద్ధికి కల్పవల్లిగా ఉన్నాడు."

ఈ కథను విన్న భిక్షువులు "అయితే శారిపుత్రుడు అధమమైన నాట్యకులంలో ఎందుకు జన్మించాడు?" అని ప్రశ్నించారు. దానికి భగవానుడు ఇలా అన్నాడు: పూర్వం ఒక జన్మలో ఈ శారిపుత్రుడు మహామతి అనే రాజపుత్రుడై సజ్జనుల మన్నలను పొందాడు. శ్రీమంతుడైనప్పటికీ అతని మనస్సు ప్రవ్రజ్యను తీసుకుందామనే ఉండేది. మనః పరిపాకం గలవారి బుద్ధిని సంపదలు కలుషితం చేయవు. "యువకులైన రాజపుత్రులకు కులోచితం కాదు" అని తండ్రి ప్రీతితో నచ్చజెప్పి ఎంతో శ్రమపడి అతని ప్రయత్నం మాన్పించాడు.

ఒకనాడు ఆ రాజపుత్రుడు ఏనుగెక్కి వెళ్ళుతూ ఒక పేద ముసలివానిని చూచాడు. చూచి మనసు కరిగింది. అతనితో "ఈ లోకంలో ధనవంతులు నిర్భాగ్యులు. సన్యాసం స్వీకరింపదలిస్తే బంధువులు వద్దని

నిర్బంధంగా నివారిస్తారు. కనుక వారు సన్యాసం స్వీకరించలేరు. నిన్నెవరు నివారించారు?!" అని ప్రశ్నించాడు. "నేను దరిద్రుడ్ని. సన్యాసం తీసుకుందామంటే భిక్షాపాత్ర లేదు. కాషాయ చీవరం లేదు. శమోపకరణాలు ధనముంటేనే లభిస్తాయి" అని వృద్ధుడు సమాధానమిచ్చాడు. రాజపుత్రుడు ఈ మాటలు విని అతనిని తపోవనానికి పిలుచుకువెళ్ళి సన్యాసం ఇప్పించి, పాత్రచీవరాలు ఇచ్చాడు. ఆ వృద్ధుడు త్వరలోనే ప్రత్యేకబుద్ధుడై రాజపుత్రుని వద్దకు వచ్చి దివ్యమాహాత్మ్యం ప్రదర్శించాడు. ఆ మహాత్మ్యం చూచి "పెద్ద వంశంలో పుట్టడం వల్ల ప్రవ్రజ్య నాకు దుర్లభమైంది. దారిద్ర్యం, అవివేకం ఉండడం వల్ల నీచకులంలో పుట్టినవారికీ అది దుర్లభం. కనుక అధమకులంలో పుట్టి వివేకవంతుడ్ని అవుతాను" అని ధ్యానించాడు. ఆ రాజకుమారుడే ఇప్పుడు ఆ ప్రణిధానం వల్ల శారిపుత్రుడుగా పుట్టాడు. ఈతడే మరొక జన్మలో మహాత్ముడైన కాశ్యపునితో ప్రవ్రజ్యాదీక్ష స్వీకరించాడు. అప్పటినుండి ప్రజ్ఞానిధులలో అగ్రణి అయిన ఈ శారిపుత్రుడు సత్యనిధి అయిన కాశ్యపుడు మహానుగ్రహంతో ఆదేశించిన కుశల మార్గాన్ని నియమనిష్ఠలతో అనుసరిస్తూ వచ్చాడు. "నీవు సంవిద్జ్ఞానవంతులలో శ్రేష్ఠుడైన ఈ మౌద్గల్యాయనుడూ కాలక్రమాన శాక్యమునికి ఇష్టశిష్యులవుతారు" అని ఆ కాశ్యపుడే భవిష్యవాణి తెలిపాడు. మరొక జన్మలో దరిద్రుడు, కార్మికుడు ఎవరో మహర్షి దయతో పాత్రచీవరాలు ఇవ్వగా గ్రహించి ఇప్పుడు మీకు మాహాత్మ్యం ప్రదర్శించి అతుల ప్రభావవంతుడయ్యాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శారిపుత్ర ప్రవ్రజ్యావదానమనే పద్దెనిమిదవ పల్లవం.

# 19. శ్రోణకోటికర్ణావదానం

పుణ్యాతిశయ ప్రభావం అపూర్వమైంది. అక్షయమైందీని. అది జన్మాంతరంలోను అంటిపెట్టుకొని వచ్చి, శుభాలు ప్రసాదిస్తూ అందరికీ ప్రత్యక్షంగా కనిపించి ఆశ్చర్యం కలిగిస్తుంది.

పూర్వం భగవానుడైన తథాగతుడు అనాథపిండదుని ఆరామమైన జేతవనంలో విహరిస్తూ ఉండేవాడు. అప్పుడు ఆ సమీపంలోని వాసవ అనే గ్రామంలో బలసేనుడు అనే గృహస్థు ఉండేవాడు. అతడు ఆశాతటాలకు వ్యాపించి ఫలభారంతో చేరవచ్చినవారికి నీడ, పండ్లు ఇస్తున్న ఛాయావృక్షంలాగ అర్థుల ఆశలను తీర్చేవాడు. ఆయన భార్య పేరు జయసేన. ఆమెకు కాలక్రమాన పూర్వపుణ్యం వల్ల మూర్తీభవించిన ఆనందోత్సవంలాగ కమలలోచనుడైన ఒక కుమారుడు కలిగాడు. ఆ కుమారుని చెవులకు రత్నదీపప్రభలు చిమ్మే కర్ణాభరణాలు ఉండేవి. వాటికి శతకోటి హేమటంకాల విలువ కూడ తక్కువే. శ్రవణ నక్షత్రంలో పుట్టడం వల్ల, రత్నకోటి విలువగల సహజ కర్ణాభరణాలు ఉండడం వల్ల ఆ బాలునికి శ్రోణకోటికర్ణుడు అనే పేరు పడింది. ఆ కుమారుడు క్రమంగా పెరిగి పెద్దవాడయి, నిర్మల కాంతితో, పరిపూర్ణ కళలతో చంద్రునిలాగ అందరికీ అమందానందం కలిగించాడు.

ఇలా ఉండగా, ఆ శ్రోణకోటికర్ణునికి రత్నాలు సంపాదించాలనే బుద్ధి పుట్టింది. కుబేరసంపదగల తండ్రి వద్దన్నప్పటికీ వినక, కన్నీళ్ళు పెట్టుకుంటున్న తల్లిమాటను కాదని నిందించి, ప్రియభాషి అయినప్పటికీ విషం(నీరు, విషం) వర్షిస్తున్న చంద్రునిలాగ రత్నాలకోసం పెద్దవర్తకుల సంఘంతో పాటు దూర ద్వీపాంతరానికి వెళ్ళాడు. ఘోరమకరాకరమైన సముద్రం దాటి నిర్జనారణ్యంలో వెళ్ళుతుండగా, కర్మవశాత్తు దారిలో వర్తకుల గుంపుతో విడిపోయాడు. సార్థవాహుల సమూహం అతనికోసం చాలసేపు వెదికి కనుక్కోలేక దుఃఖంతో కష్టపడుతూ, స్వదేశానికి తిరిగివచ్చింది. అతడు అలసిపోయి, ఎండకు కాగిన మరుభూములున్న దక్షిణదిక్కున బావిలో పడి ముందుకు పోయినట్టుగా విశ్రాంతి అనేదే లేక ముందుకు సాగిపోయాడు. సాగిపోతూ ఇలా అనుకున్నాడు. "ఆహా! ధనం ఉన్నప్పటికీ ఇంకా ధనం సంపాదించాలనే నా ప్రయత్నం ఫలప్రాప్తి అవినీతిచేత కష్టాన్ని కలిగించినట్టు కష్టాన్నే కలిగిస్తున్నది. మానవులకు ఈ ధనార్జనావేశం సంతోషం పోగొడుతుంది. సకలాపవాదాలకు అవకాశమిస్తుంది. నింద్యమై ఆపదలు కలిగిస్తుంది. మేరు పర్వతం లభించినా ధనసంపాదనలో సంతృప్తి ఉండదు. ఈ ప్రపంచంలో దేహులకు ద్వేషం, మోహం వాసనావశమైనవి. ఎంత నడిచినా తరుగని ఈ మరుభూమి, అంతులేని సంపదలాగ చాల ఆయాసం కలిగిస్తూ, విరసమై (నీళ్ళులేనిదై, రసహీనమై), కళ్ళకు మిరుమిట్లు గొలుపుతూ తృష్ణను ఇనుమడింపజేస్తున్నది. ఈ మరుభూమిలోని ఎండమావులు దప్పిగొన్న లేళ్ళకు, నాకు కూడ భ్రాంతి కలిగిస్తున్నవి. దప్పి! అలసట! నీళ్ళులేని మరుభూమి! ఏమి చేయను? ఎక్కడికి వెళ్ళను? దిక్కులన్నీ మండుతున్నట్టు కనిపిస్తున్నాయి."

ఈ విధంగా అతడు ఆలోచిస్తూ, ఎక్కడైనా మంచినీరు దొరుకుతుందనే ఆశతో నెమ్మదిగా ముందుకు వెళ్ళుతూ ఆయాసమే రూపుదాల్చివచ్చిందా అన్నట్టున్న ఒక ఆయసపురం(ఇనుప పట్టణం) చూచాడు. ఆ పట్టణద్వారంలో భయానికి సోదరుడా అన్నట్టు ఘోర స్వరూపంతో, చింతనిప్పులలాంటి కండ్లతో కాలకరాళుడైన ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. శ్రోణకోటికర్ణుడు పురద్వారం దగ్గిరికి వెళ్లి "నీళ్ళు నీళ్లు! నీళ్లు ఇవ్వండి నీళ్ళు!" అని పలుమార్లు అడిగాడు. కాని ఎవరూ పలకకపోవడం వల్ల తనే ఆ నగరంలో ప్రవేశించాడు. చుట్టుపట్ల చూడగా ప్రేతలోకం కనిపించింది. కొరువుల్లాగ కాలి ధూళి, మలం పేరుకొని ఎండిపోయి, ఎముకలు నరాలు మిగిలిన దేహాలతో దిసమొలగా ఉన్న ప్రేతాలను చూచి బాధపడ్డాడు. ఆ ప్రేతాలు నీళ్ళు లేక దప్పితో బాధపడుతున్న ఇతణ్ణి నీళ్ళిమ్మని అడిగారు. ఆ ప్రేతాల దుఃఖం చూచి బాధతో అతడు తన దుఃఖం మరచిపోయాడు. తీరని దప్పితో "నీళ్లు నీళ్లు" అని అతిదీనంగా ప్రలపిస్తున్న ఆ ప్రేతాలను చూచి ఆయన "ఈ మరుకాంతారంలో పాపిష్టివాణ్ణయిన నాకు నీళ్ళెక్కడ దొరుకుతాయి? ఈ దుస్సహమైన కష్టంలో మిమ్మల్ని ఎవరు ఏ కర్మవల్ల పడదోశారు? మీరెవరు? మీకు ఏమి దుష్కర్మ వల్ల ఈ బంధనం ఏర్పడింది? నేను కూడ మీ కష్టంతో బాధపడుతూ తిరుగుతున్నా. కష్టంలో ఉన్నవారిని చూడనివానికి, చూచినా వారి కష్టాలను పోగొట్టగలిగినవానికి నిద్ర సుఖంగా పడుతుంది" అని అన్నాడు. వారు శ్రోణకోటికర్ణుని మాటలకు "మేము మానవులం. విరుద్ధ కర్మలు ఆచరించి, మోహసంచయం నుంచి మళ్ళనందువల్ల ఈ వ్యసనసంకటంలో పడ్డాము. అహంకారాసూయాది వ్యసనాలతో మదోన్మత్తులమై ఇతరులను ఆక్షేపిస్తూ, వారి ధైర్యం పోగొట్టి అడ్డులేక అనార్యులుగా సంచరిస్తూ, విషసమానమైన మాటలతో సుజనుల హృదయాలలో నిర్దయగా నిత్యం ములుకులు నాటాము. దానం చేయలేదు; సరికదా ఇతరుల విత్తం అపహరించాము. పరదారలను అపహరించాము; పరదారను ఆకర్షించడానికి వివిధాంగ వికారాలు చేశాము. వంచకులమై, నీచకర్మలు చేశాము. కనుక ఇప్పుడీ ఘోరమైన ప్రేతనగరంలో కష్టాలకు గురి అయ్యాము." అతడు వారు చెప్పినది విని ఆ నగరంలో ఇతరత్రా కూడ అలాటి అప్రియమైన ప్రేతాలనే చూచి కరుణార్ద్రచిత్తుడయ్యాడు. తర్వాత అతడు పూర్వ పుణ్యబలంతో ఆ దుర్గమమైన ప్రేతనగరంనుంచి వెలుపలికి వచ్చి, చల్లని నీడగల చక్కని వనం చేరాడు. అపుడు సాయంకాలమైంది. దూరాధ్వసంతప్తుడై అలసిపోయిన సూర్యుడు దప్పిగొన్న గుడ్డివానివలె మెల్లమెల్లగా అస్తగిరినుంచి నీటిలోకి జారాడు. అశేషదిక్కులను ప్రకాశింపజేసే పుణ్యంలాగ ఉన్న పగలు క్షీణించగా, అందరినీ ఆవహించి మామూలుగా చేసే పాపంలాగ అంధకారం వ్యాపించింది. పక్షుల కలకలారావం, తుమ్మెదల ఝుంకారం అణిగిపోయి కమలవన వికాసలక్ష్మి నిద్రాముద్రిత అయింది. శీతకిరణుడైన చంద్రుడు దయతోనా అన్నట్టు వెన్నెల అనే అమృత శలాకతో చీకట్లు పోగొట్టి జగన్నేత్రాన్ని స్ఫారతారంగా తెరిపించాడు. వృద్ధిక్షయాల పరివర్తనం కలిగి ప్రపంచానికి అనేకాద్భుతాలు చూపిస్తున్న సుధాకరుడు ఈ సంసారమనే పగలు రాత్రులను పరిహసిస్తున్నాడా అన్నట్టు కనిపించింది. ఇలా దిగ్వధువుల మణిదర్పణంలాగ ఉన్న చంద్రుడు నేత్రాలకు ఆనందసుధను వర్షిస్తూ, సర్వాంగాలకూ సుఖం కలిగిస్తూ మూర్తీభవించిన సంతోషంలాగ ఉదయించాడు.

ఆ పండువెన్నెలలో శ్రోణకోటికర్ణుడు వినోదం కోసం మారురూపంతో స్వర్గమే భువికి దిగివచ్చినదా అన్నట్టున్న అసమానకాంతిగల ఒక విమానం చూచాడు. ఆ విమానంలో నలుగురు



మదవతులైన త్రిదశాంగనలు ఉన్నారు. వారిని చూడగా, చంద్రోదయమైంది కదా అని విహరించడానికి నాలుగు దిక్కులూ వచ్చాయా అన్నట్టుంది. వారితోపాటు వినోదిస్తున్న ఒక సుందరాకారుడు రూపు దాల్చిన తారుణ్యప్రేమ సంభారమా అన్నట్టు కనిపించాడు. ఆ సుందరుడు ధరించిన రత్నకేయూర కిరీటకాంతులు దూరదూరాలకు వ్యాపిస్తూ దిఙ్ముఖాలకు ఆశ్చర్యరాగం అలదుతున్నట్టు ఉంది. వారి ఆ విలాససుఖసంపదను చూచి శ్రోణకోటికర్ణుడు "ఇది సుకృతవృక్ష మహాఫలం" అని అనుకున్నాడు. పిదప ఆ సుందరాకారుడు మధురపానీయ భక్ష్యభోజ్యాలతో సత్కరించగా, అతడు ఆ రాత్రి సుఖంగా గడిపాడు. తెల్లవారింది. ప్రభాతకాంతికి-చిరుగాలికి పూలు రాలినట్టు- నక్షత్రాలు రాలి మరుగైపోయాయి. అంతా అనిత్యమన్నట్టు చంద్రుని సిరి సమసిపోయింది. రాత్రి పూర్తిగా గడచి భువనచక్షువు, సర్వప్రాణుల సుఖదుఃఖాల సాక్షి అయిన సూర్యుడు ఉదయించగా, ఆ విమానం, ఆ సురవనితలు క్షణంలో అదృశ్యులైపోయారు. ఆ యువకుడు ముఖకాంతి తరిగిపోయి భూమిపై కూలిపోయాడు. అతడు భూమిపై పడీపడగానే, ఆయన వీపుపై కుక్కలగుంపు త్రైలోక్య శాపపాపం వల్ల కలిగిన సర్వక్లేశరాశిలాగ పరుగున వచ్చిపడింది. ఆ కుక్కలు ఆతని మెడనుంచి, ముఖం నుంచి మాంసం పీక్కుతినడం ప్రారంభించాయి; రక్తం ధారలు కట్టసాగింది. అతడు ఏడుస్తూ ఉండగా అవి అతణ్ణి పూర్తిగా తినివేశాయి.

సాయంకాలమైంది. మరల ఆ విమానం కనిపించింది. దానిలో ఆ నలుగురు అప్సరసలూ, కాంతిమంతుడైన ఆ యువకుడు కనిపించారు. శ్రోణకోటికర్ణుడు విస్తుపోయి, "మిత్రుడా! ఏమిటీ ఆశ్చర్యం? చెప్పు" అని ఆ యువకుణ్ణి ప్రశ్నించాడు. ఆ సుందరాంగుడిలా అన్నాడు. "వయస్యా! విను. సుకృతివయిన శ్రోణకోటికర్ణుడవనే నిన్ను ఎరుగుదును. నేను కూడ వాసలగ్రామవాసినే; దుష్కర్మ చేసే పశువధకుడుగా పుట్టాను. ఎప్పుడూ పశువుల మాంసం కోసి విక్రయించేవాడిని. కరుణానిధి అయిన ఆర్య కాత్యాయనుడనే భిక్షువు ఒకమారు భిక్షకు వచ్చి "ఈ కర్మ మానివేయి. దుస్సహమైన ఈ హింసాక్లేశం మొదలు నరికిన చెట్టులాగ దేహులకు స్వదేహంపైనే పడుతుంది" అని హితవు చెప్పాడు. ఆ కృపానిధి మాటలు అనార్యుణ్నయిన నేను వినకపోయి, హింసాపాపం మాననందున, ఆయన మరల ఒకమారు నావద్దకు వచ్చి "పగలు నీవు నిర్దయుడివై ఎప్పుడూ హింస చేసే పక్షంలో, రాత్రన్నా నామాట విని పంచశీలవ్రతం స్వీకరించు" అని ఆ సర్వసత్త్వహితైషి నాకు ప్రయత్న పూర్వకంగా శీలసమాదాన పుణ్యబుద్ధిని కలిగించాడు. తర్వాత కాలక్రమాన నేను కాలధర్మం చెంది ఈ దశ పొందాను. పగలు నిప్పుల వర్షం, రాత్రి సుధావర్షం. రాత్రేమో శీలసమాదాన ఫలం. పగలేమో హింసాఫలం. నా పుణ్యపాపాల ఫలం బట్టి సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాను. సఖుడా! పాపాత్ముడైన నాపై దయ చూపు. స్వదేశానికి వెళ్ళిన తర్వాత నా కుమారునితో రహస్యంగా నా మాటగా ఇది చెప్పు. నా యింటి ఆవరణం చివర బంగారు నాణేల పాతు ఉంది. దానిని పైకి తీసి దానం చేసి, నన్ను పాపదూరుణ్ని చేయమను. ఆర్యకాత్యాయనుణ్ని నిత్యం భిక్ష యిచ్చి సత్కరించవమను." ఈ విధంగా ఆ సుందరుడు వినయంతో చెప్పిన మాటలను శ్రోణకోటికర్ణుడు విని "అట్లే చెబుతాను" అని చెప్పి ముందుకు నడిచాడు.

ఉదయం కావచ్చింది. ఆయన ముందుకు వెళ్లుతుండగా మరల మరొక దివ్య విమానం మణి పద్మలతలు చెక్కినది, రెండవది నందనవనంలాగ ఉండేది, కనిపించింది. దానిలో రత్న భూషణాలు ధరించి రూపు దాల్చిన రతీపతిలాగ ఉండే సుందరాకారుడొకడు దివ్యకాంతతో పాటు కనిపించాడు.

మునుపటి సుందరాంగుడిలాగే ఇతడు కూడ శ్రోణికోటికర్ణుణ్ని ప్రీతితో సత్కరించి ఆతిథ్యమిచ్చాడు. కష్టాల మధ్య సుఖసుధలాగ ఆ దీర్ఘమైన పగలు ముదామయంగా గడిచింది. ఇంతలో సాయంకాలమైంది. పద్మినీపతి అయిన సూర్యుడు ఆకాశమనే విమానం మీదనుంచి పడిపోగా జగత్తు ఘోరంగా దుఃఖించినట్లు చీకట్లు వ్యాపించాయి. తర్వాత నిశాపతి పాండురోగిలాగ తెల్లబారిన ఒంటితో, శీతజడుడై వెన్నెలను కక్కుతూ మెల్లిగా పైకి వచ్చాడు. ఎవరో రాక్షసస్త్రీ రాత్రికాగానే సుకుమారమైన నీ రెండను నమిలి మింగగా మిగిలిన పుర్రెముక్కలాగ చంద్రుడు కనిపించాడు. కాలపురుషుని చందనపు పూతలాగ వెన్నెల వ్యాపించగా, ఆ విమానం ఎక్కడా కనిపించలేదు ఆ స్వర్గమృగేక్షణ కూడ కనిపించలేదు. ఆ యువకుడు విమానం నుంచి కిందికి పడిపోయాడు. అతన్ని సర్పరూపంలో ఉన్న నూరుకాళ్లజర్రి ఏడుచుట్లు చుట్టుకొని తలపై రంధ్రం చేసి మెదడులోని రక్తాన్ని తాగుతూ క్రమంగా తలనే డుల్లగా చేసింది. ఈ భీభత్సం చూడలేక ఉదయలక్ష్మి అరుణ కరాలనే(కిరణాలనే) ఎర్రచేతులతో, ప్రభాతవాయువులనే నిట్టూర్పులతో ముఖం కప్పుకొని, తారకలనే, తారకలను(కనుగుడ్లను) మూసుకోగా, మరల ఆ దివ్య విమానం, దివ్యసుందరి అద్భుత శరీరంతో దివ్యాభరణ భూషితుడైన ఆ యువకుడు అవతరించాడు.

శ్రోణకోటికర్ణుడు మునుపటిలాగే ఆశ్చర్యపడి, ఆ యువకుని వృత్తాంతం అడిగాడు. ఆ యువకుడు ఇలా అన్నాడు: "నేను మీ వాసవగ్రామవాస్తవ్యుణ్ణయిన బ్రాహ్మణుణ్ని, నాపేరు మనస. నా పక్కయింటివాని భార్య మలయమంజరి అనే తరుణి, కాముకుడైన నాకు స్వైరిణి అయి ప్రియురాలయింది. ఆ గ్రామంలో పరదారరతివ్యగ్రమైన నా బుద్ధి మేకలాగ విషయగ్రామంలో చిక్కుకుని, పూర్తిగా నశించింది. అప్పుడు ఆర్యకాత్యాయనుడు నా చౌర్య కాముకప్రసంగ పాపం గ్రహించి, దయతో ఏకాంతంగా నాకు ఇలా హితవు చెప్పాడు: "రూపం కోసం పాకులాడి పరాంగనా సంసర్గప్రీతితో కామాగ్నిలో మిడతలాగ పడి వెంటనే మాడిపోవద్దు. రతాసక్తులై పరుల దారలపై ఆదరంకల కాముకులు; రక్తాసక్తులై నరులను చీల్చడంలో ఆదరంకల హింసకులవలె పతన ప్రమాదం ఎరుగరు. పరవధూస్పృహ గలవారు ఒళ్లు గగుర్పొడిచే సంభోగంలో ఆసక్తి చూపడం నరకంలో ఆసక్తి చూపడం వంటిది. అక్కడ నిద్ర ఉండదు. అలసటతో భయంతో వణుకు పుడుతుంది. ఆడగద్దలు ముక్కులతో, గోళ్లతో, దంత నఖక్షతాలు చేస్తాయి. కనుక అబ్బాయి "ఈ చెడుదారి నుంచి మరలు. పరస్త్రీని తాకినా పాతకం కలుగుతుంది! అశుద్ధంపై ఇష్టం కుక్కలకే కదా!" అని అర్యకాత్యాయనుడు నిషేధించినప్పటికీ శుద్ధబుద్ధి కాని నేను అనివార్యమైన రాగాసక్తితో పరాంగనా సంగతిని మానలేదు. అప్పుడు కాత్యాయనుడు మరల నావద్దకు వచ్చి పగలన్నా సక్రమంగా ఉండమని ఆర్యశీలదీక్ష ఇచ్చాడు. పగలు శీల సమాదానం వల్ల, రాత్రి పరస్త్రీగ్రహణం వల్ల పుణ్యపాప సంజనితమైన ఈ స్థితి ఏర్పడింది. నీవు వాసవ గ్రామం చేరిన తర్వాత నా కుమారునికి నా మాటగా ఈ సంగతి చెప్పు. అగ్నిశాలలో బంగారు దాచాను. దానిని తీసి సత్పాత్రదానం చేసి, కాత్యాయనుని పూజించమను" ఆ సుందర యువకుడు చనువుతో అనిన మాటలను విని శ్రోణకోటికర్ణుడు సరేనని సమాధానం చెప్పి ముందుకు సాగిపోయాడు.

అక్కడ అతనికి ఎదుట మణిమయ విమానంలో దివ్యలలన ఒకతె కనిపించింది. లావణ్య క్షీరవారాశినుంచి అనాయాసంగా ఉదయించిన లక్ష్మిలాగ ఉంది. ఆమె ఆ విమానం నాలుగు కోళ్ళకు నాలుగు ప్రేతాలు నరాలతో కట్టి ఉండడం చూచాడు. ఆ దివ్యకాంత శ్రోణకోటికర్ణుని గుర్తించి స్నేహంతో



పలకరించి సురలు అనుభవించగల పానభోజనంతో సత్కరించింది. ఆమె విమానం కోళ్ళకు కట్టిఉన్న ప్రేతాలు దీనంగా తమకు కూడ ఒక్క పిడచ వేయమని మూతి దగ్గర చేయిపెట్టి అతనికి సైగ చేశాయి. అతడు దయతో కాకులకు పిడచ వేసినట్లుగా అన్నం ముద్దలు విసిరాడు. అతడు విసరిన అన్నపు పిడచ ఒకటికి ఊకగాను, రెండవదానికి ఇనుముగాను, మూడోదానికి మాంసంగాను, నాల్గోదానికి చీముగాను మారింది. వాటి ఆ దుర్దశ చూచి శ్రోణికోటికర్ణునికి చాల కష్టం కలిగింది. పద్మాలను వెలవెల పోయేట్టు చేసే ముఖకాంతిగల ఆ దివ్యలలనను "ఏమి ఈ అద్భుతం?" అని ప్రశ్నించాడు. ఆమె ఇలా అన్నది: "శ్రోణికోటికర్ణ! వీరికి ఏమి ఇచ్చినా, ఎంత ఇచ్చినా తృప్తి కలుగదు. నా విమానం మొదటి కోడుకు కట్టిన ప్రేత వాసవ గ్రామావాసి అయిన నందుడనే బ్రహ్మణుడు. ఆయన భార్యను నేను. నాపేరు సునంద. రెండవ కోడుకు కట్టిన ప్రేత నా కుమారుడు. వాని పేరు నిష్ఠురుడు. వెనుకటి కోళ్ళకు కట్టిన వారిలో ఒకటి నా దాసి, మరొకతి నా కోడలు. ఒకనాడు నేను నక్షత్రయోగ పూజచేసి భైక్షోపహారం ఏర్పాటు చేశాను. అప్పుడు ఆర్యకాత్యాయనుడు మా యింటికి వచ్చాడు. నేను ఎంతో సంతోషంతో ఆయనకు పూజ చేసి భిక్ష యిచ్చాను. ఆయన నా పూజలు స్వీకరించి తన దివ్య తేజస్సుతో దిక్కులకే విమలానుగ్రహం ప్రసాదిస్తున్నాడా అన్నట్టు వెళ్లిపోయాడు. ఇంతలో ఈ నా భర్త స్నానం చేసి ఇంటికి వచ్చాడు. నేను సంతోషంతో కాత్యాయనునికి భిక్ష చేసిన సంగతి తెలిపారు. "దుర్మార్గుడైన ఆ బోడి శ్రమణుణ్ని ఎందుకు పూజించావు?" అని కోపోగ్రుడై అజ్ఞానంతో **నన్ను అదలించాడు.** "చేసిన వంటను ఆ బోడి శ్రమణుడు ముందుగా తినడం కన్నా ఇనుపగుండ్లు తిన**కూడదూ?" అని** ఈ నాకుమారుడు ఆక్షేపించాడు. ఈ నా కోడలు ఎప్పుడూ అందరికన్నా మొదట కనుమరుగుగా భోజ్యపదార్థాలు తినేది. ఆ నాడు "ఆర్యకాశ్యపునికి భిక్ష ఇవ్వకముందే ఏమైనా తిన్నావా?" అని అడుగుగా, "నేను తినలేదు. నా మాంసం తిన్నంత ఒట్టు!" అని ఒట్టు పెట్టుకుంది. ఈ దాసి దొంగతనంగా ఆ భక్ష్యాలను అమ్ముకుంది. నేను అడుగగా "అలా చేస్తే నా చీము నెత్తురు తిన్నట్టు" అని ఒట్టు పెట్టుకుంది. వీరు ప్రేతత్వం పొంది తమ మాటలకు అనుగుణమైన తిండి తింటున్నారు. నేను ఆర్యకాశ్యపుని అనుగ్రహంతో దివ్యభోగాలను అనుభవిస్తున్నాను. నీవు స్వదేశానికి వెళ్లిన తర్వాత నా కుమార్తెతో ఇలా చెప్పు. "మీ తండ్రి మన ఇంట్లో నాలుగు హేమనిధానాలు పూడ్చిపెట్టాడు. వాటిని పైకితీసి నీ జన్మస్థితిని బట్టి అనుభవించు. తండ్రి సోదరుడైన ఆర్యకాత్యాయనుణ్ణి ఎల్లప్పుడూ పూజించు" అని. ఓ శ్రోణికోటికర్ణా! ఇక దేశాటన శ్రమ మానుకో స్వదేశానికి తిరిగి వెళ్ళు. నీవు ఇల్లు వదిలి పన్నెండు సంవత్సరాలు పూర్తయాయి." ఈ విధంగా ఆమె అని, నిద్రపోతున్న అతన్ని మూహూర్తమాత్రంలో స్వదేశం చేర్పించవలసిందని ఆ ప్రేతచతుష్టయానికి ఆజ్ఞ చేసింది.

శ్రోణికోటికర్ణుడు నిద్రపోయి, వెంటనే లేచి చూచాడు. తాను తన ఊరి ఉద్యానవనంలో ఉన్నట్టు తెలుసుకున్నాడు. తన వియోగం వల్ల తలిదండ్రులు అంధులైపోయారని విన్నాడు. తన తండ్రి యిల్లు దేవలోకంలో ఉన్నట్లు భిక్షులు, ద్విజులు, అతిథులు పూజలు పొందుతున్నట్టు అతని కండ్లకు కనిపించింది; చాల ఆశ్చర్యపడ్డాడు. సకల పదార్థాలు క్షణికం కావడం వల్ల అనిత్యమని అతడు నిశ్చయించి స్నేహరాగం, మమత వదులుకొని ఇలా ఆలోచించాడు. "ఆహా! ఈ సమ్మోహనిద్ర ఎలాంటిది? రాత్రీ పగలూ నిరతమూ స్వప్న మాయావిలాసాలతో ఆశ్చర్యం కలిగిస్తూ ఉంటుంది. తల్లి జన్మమార్గధాత్రి;

తండ్రి విత్తులు నాటే పక్షివంటివాడు. ఈ దేహం పాంథ పూజాసనం. పాంథులు విశ్రమించే అతిథి గృహం వంటిది. అలాంటప్పుడు ఈ సంసారనియమాలేమిటి? సంపదలేమో సంసారమనే మేఘాలలో తిరుగుతూ, దిక్కులనే ఆశాతటాలకు వ్యాపిస్తూ, అంటీఅంటనట్టు బంగారు కాంతితో మెరిసే మెరుపులవంటివి. కాయమూ క్షయ భయ జరా రోగాది సకలాపాయాలకూ నిలయం. అయినా, ప్రాణులకు విరాగం ఏర్పడదు. సంపదకు స్వస్తి. స్వజనానికి నమస్కారం. స్త్రీలపై దాక్షిణ్యం చాలు. ప్రవ్రజ్యే నాకు ఇష్టం." ఈ విధంగా ఆయన భావించి ఇంటికి వెళ్ళి అంధులైన తలిదండ్రులను ఊరటగొల్పాడు. అతని పుణ్యప్రభావం వల్ల వారికి కన్నులు కూడ వచ్చాయి, తర్వాత వారిని కూడ ఆతడు శమధామమైన విశుద్ధమైన ధర్మపథంలో ప్రవర్తింప జేశాడు. వర్తకసంఘంతో విడిపోయి, దారి తప్పి, కృశుడై బహు కాలానికి తిరిగి వచ్చినప్పటికీ సత్త్వగుణసంపద తగ్గనివాడు కావడం వల్ల అతడు స్వజనుల కృపేమీ కోరలేదు. సంసారక్లేశంతో విహ్వలులైనవారికి ఇతరుల జాలి అవసరమేముంది? పిదప అతడు పశుపాలకుడు, విప్రవనిత మొదలయినవారు నమ్మకంగా చెప్పి పంపిన నిధి ప్రాప్తిని గురించిన మాటలను వారివారికి తెలియజేశాడు.

తర్వాత అతడు ప్రశాంతచిత్తుడై ఆర్యకాత్యాయనుని వద్దకు వెళ్ళి సన్న్యాసం స్వీకరించాడు. అవివేకులకు ఏది కష్టం కలిగిస్తుందో, వివేకులకు అదే ఇష్టం కలిగిస్తుంది. సన్న్యాసం స్వీకరించిన మీదట శ్రోణికోటికర్ణుడు ప్రథమదశ అయిన స్రోతఃప్రాప్తిఫలాన్ని, పిదప సకృదాగామి, అనాగామి ఫలాలను, అంతంలో అర్హత్ఫలాన్ని పొందాడు. ఆయన త్రైధాతుకుడై రాగం త్యజించి, మట్టిని బంగారును, అసిని, చందనాన్ని సమబుద్ధితో చూస్తూ, ఆకాశపాణిసమానుడయ్యాడు. కొంతకాలం తర్వాత ఆర్యకాత్యాయనుని ఆజ్ఞతో శ్రావస్తిలోని జేతవనంలోను, వేణువనంలోను విహరిస్తున్న బుద్ధదేవుని దర్శించడానికి వెళ్ళాడు. భగవానుడు ప్రీతితో నమస్కారపూర్వకంగా చేసిన ఆతిథ్యం స్వీకరించి శ్రోణికోటికర్ణుడు హర్షనిర్భరుడై ఇలా విన్నవించాడు. "భగవాన్! నేను మీ ధర్మకాయాన్ని ఇంతవరకూ చెవులారా విన్నాను. ఇప్పుడు రూపకాయాన్ని పుణ్యవశాత్తు దర్శిస్తున్నాను. మీ దర్శనామృతం అనల్పసుకృతంతో పొందదగింది. ఈ అమృతం ఎంత తాగినా తనివి తీరదు. ఈ అమృతపానం చేయనివారు దురదృష్టవంతులు. నీవు నిరీహుడివి. అయినా, నీ దివ్యమూర్తి అందరికీ నిన్ను దర్శించాలనే ఈహ(స్పృహ) కలిగిస్తుంది. నీ దృష్టి నిర్లిప్తమైంది. అయినా, ఇతరులను హర్షాతిరేకంలో ముంచుతుంది. నీ కథలు చెప్పుకొనడం, నిన్ను ధ్యానించడం, నిన్ను దర్శించడం, నిన్ను సేవించడం కుశల తరు మహాఫలాలు." భగవానుడు ఇది విని అతనిని చాల అనుగ్రహించి, సమారామంలోని విహారంలో ఉండమని ఆదేశించాడు. అతడు ఆ ఆదేశం ప్రకారమే ఆ విహారం చేరాడు. తర్వాత ఒకప్పుడు భగవానుడు ఆ విహారానికి వెళ్ళి ఆతని మధుర ధర్మాచరణను, అధ్యయన నిరతిని తిలకించి ప్రశంసించాడు.

శ్రోణికోటికర్ణుని ఆ ప్రశమసంపదను చూచి, భిక్షువులు అతని పూర్వజన్మ వృత్తాంతం తెలుపవలసిందిగా కోరగా, భగవానుడిలా అన్నాడు.

పూర్వం వారాణసిలో కాశ్యపుడనే సమ్యక్సంబుద్ధుడు తన కర్తవ్యం నిశ్శేషం కావడం వల్ల పరినిర్వాణం చెందగా, క్రికి అనే రాజు అక్కడ రత్నమయమైన చైత్యం నిర్మించాడు. మహోన్నతమైన ఆ చైత్యం ఆ నరపతి పుణ్యాతిశయాన్ని స్వర్గానికి స్వయంగా తెలుపడానికి పైకి లేచిందా అన్నట్టు ఉండేది.



దాని జీర్ణోద్ధార స్థాపనాది సంస్కారానికి రాజు నిర్ణయించిన ధనాన్ని అతని తర్వాత రాజ్యానికి వచ్చిన అతని కుమారుడు లోభమోహితుడై ఇవ్వలేదు. అప్పుడు ఉత్తరాపథం నుంచి వచ్చిన అర్థదుడనే వ్యాపారి ఆ సంస్కారమూల్యకోసం తన కర్ణాభరణం ఇచ్చివేశాడు. కొంతకాలం తర్వాత మరల వచ్చినప్పుడు కూడ ఎంతో ధనమిచ్చి "నేను పుణ్యవంతుడిని కావాలి" అని ధ్యానం చేశాడు. ఆ పుణ్యంతోనే ఆ సార్థవాహుడే శ్రోణకోటికర్ణుడుగా పుట్టి నేడు పుణ్యవశాన మహాపదవిని పొందాడు. అప్పుడు కర్ణభూషణం దానం చేయడం వల్ల ఇప్పుడు కర్ణభూషణ లక్షణంతో జన్మించాడు. ఈయన రత్న సంపాదనకోసం దూరద్వీపాలకు వెళ్ళుతున్నప్పుడు తల్లిని పరుష వాక్యాలు పలికి వెళ్ళాడు గనుక విదేశాలలో చాల శ్రమ పడవలసి వచ్చింది. విమల గుణ సత్కర్మ అనే పెద్ద ధవళవస్త్రంలో మధ్య దుష్కర్మ అనే చిన్న నల్ల నూలు పోగు కూడ స్పష్టంగా కనిపిస్తుంది. సత్కర్మాచరణకు అనుగుణమైన సత్సోత్సాహం, ప్రవాసాలలో నెచ్చెలివంటి ధైర్యం, విషయ సంకటాలను దాటడానికి సేతువువంటి పరాక్రమం, ఆపదలలో అత్యధికమైన దయ, అంతంలో శమ పరిచితమూ, ప్రసాదమయమూ అయిన బుద్ధి- ఇవి పుణ్యప్రాప్తికి పరమావధి; ఇదే ఉజ్జ్వల ఫలాలను ప్రసాదిస్తుంది."

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శ్రోణికోటికర్ణావదానమనే పందొమ్మిదవ పల్లవం.

# 20. ఆమ్రపాల్యవదానం

రెండు నాలుకలు కలవారి మధ్య(పాముల మధ్య)బతకడం ఎలాగ? అందరూ నాయకులైతే సుఖం ఏది? కర్మబలం ముందు స్వశక్తి ఏమి సాగుతుంది? ప్రజ్ఞాప్రకర్ష ఉంటే అపాయం ఎలా కలుగుతుంది?

పూర్వం విదేహరాజ్యంలోని మిథిలా నగరంలో జలసత్త్వుడనే రాజు ఉండేవాడు. ఆయన భుజ పృథ్వీభారాన్ని నిర్వహించగా, ఆదిశేషుడు బరువు తొలగి విశ్రాంతి తీసుకొన్నాడు. ఆ దేవేంద్రవిభవునికి ఖండుడనే మహామాత్యుడు ఉండేవాడు. వాడు షాడ్గుణ్య పరిజ్ఞానం కలవాడై బృహస్పతిలాగ ఉండేవాడు. మహామాత్యుడు నీతిజ్ఞుడనే గౌరవం వల్ల రాజు కార్యభారమంతా తను చూడక అతనిపైనే పెట్టి జనాన్ని చూడనందువల్ల ప్రజలందరూ తమ పనులు చేయించుకొనడానికి ఆ మహామాత్యుని ముఖమే చూడసాగారు; అతని దయనే అపేక్షింపసాగారు. ప్రజల ప్రణయభారం జలప్రవాహ భారంలాగ గతానుగతికం. దానిని అడ్డగిస్తే ఇంకా హెచ్చుతుంది. ప్రజలందరూ మహామాత్యుణ్నే ప్రేమించడం చూచి తక్కిన మంత్రులు మాత్సర్యగ్రస్తులై, అందరూ ఒక్కటై అతణ్ని పడవేయాలని కుట్రపన్నారు. ఆ భేదోపాయ కోవిదులు మహామాత్యునికి తెలీకుండా రాజు దగ్గిరికి వెళ్ళి మహామాత్యుని అధికార ప్రభావాన్ని చెప్పి, అతనిపై అనుమానం కలిగించారు. రాజు వారి మాటలు విని మనసుమారి మహామాత్యునికి విముఖుడైపోయాడు. అబలలు, బాలురు భూపాలురు చెప్పుడు మాటలు వినేవారుకదా మరి! ఆంతర్యం తెలియని చపల భూమిపాలురు కాకులవంటివారు; శంకించదగనివారిని శంకిస్తారు. శంకించదగినవారిని శంకించరు. ప్రభువుకు తనపై విరక్తి కలిగిందని మహామాత్యుడు అనుమానించి, గోపుడు, సింహుడు అనే తన యిద్దరు కుమారులతో రహస్యంగా ఇలా అన్నాడు."దుర్మార్గులైన కొండెగాళ్ళు కొండేలు చెప్పి రాజుకు నాపై విశ్వాసం లేకుండా చేశారు. రాజు నా గుండె చీల్చి చూపించినా నమ్మేట్టులేడు. ప్రభువు నాపై విరక్తుడై నాతో మాట పలుకూ లేక, చూడడం వినడం మాని వృద్ధుని శరీరంలాగ కుంచించుకుపోతున్నాడు. కొండెగాళ్ళు చీలదీసిన తర్వాత అభిమానం అతకడం కష్టం. రాతితో ముక్కలు ముక్కలు చేసిన తర్వాత మణి మళ్ళీ అతుక్కుంటుందా? రెండు నాలుకలుగల కుటిలురు చుట్టుముట్టిన ప్రభువు అర్థక్రియాకారి, గుణవంతుడు అయినప్పటికీ రెండు నాలుకల కుటిల సర్పాలు చుట్టుకున్న చందన వృక్షంలాగ కొలువదగినవాడు కాదు. ఘోరవిద్వేష విషావిష్టులైన కొండెగాళ్ళనే సర్పాలకాటుకు వెరచేవాడు ప్రభువనే నిధిని కోరి సుఖం పొందగలడా? కనుక ద్వేషదోషం ఆవరించిన ఈ రాజును వదలి మరొక దేశానికి వెళ్ళుదాము. శంకాశల్యాలు ఏర్పడిన ఈ పదవిలోను, ఈ దేశంలోను నేను ఉండి ఏమి ప్రయోజనం? నన్ను కాపాడగలవారు, సమర్థులు, అపారధనం కలవారు, సుసంహతులు అయిన సజ్జనులు విశాలానగరంలో ఉన్నారు. అక్కడ వసించడం నాకు ఇష్టం."

ఖండామాత్యుడు ఈ విధంగా వారితో ఆలోచించగా, వారు సరేనని అందుకు అంగీకరించారు. తర్వాత మహామాత్యుడు ఉద్యానానికి వెళ్ళుతున్నాననే నెపంతో తన కుమారులతోపాటు రహస్యంగా





విశాలానగరానికి వెళ్ళిపోయాడు. మహామాత్యుని ప్రయాణం రాజు తెలుసుకొని అతనిని వెనక్కు మళ్ళించాలనే ఉద్దేశంతో వెంటనే వెంట పరుగెత్తాడు. కాని, ఎంత ప్రయత్నించినా అతనిని అందుకోలేకపోయాడు. వదలిపెట్టినది మళ్ళీ దొరుకుతుందా? మూర్ఖులు సజ్జనులను అవమానించి, వారిని కోల్పోతారు. అలాటి మూర్ఖులవద్ద ఉపకారం కోరేవారెవ్వరూ కృతార్థులు కాలేరు. విశాల నగర వాసుల గుణగుణాలకు ఆకృష్టుడైన ఖండామాత్య శేఖరుడు విశాల చేరగానే అక్కడివారు అతనిని ప్రేమమర్యాదలతో సత్కరించి, సంఘముఖ్యపదవిలో నియమించారు. ఆ సంఘం(గణం) ఆ అమాత్యుని బుద్ధి వైభవంతో అభివృద్ధి చెందింది. ఒకప్పుడు కూడా నీతిదూరమైన పరాభవం పొందలేదు.

కొంతకాలానికి ఆ మహామంత్రి చిన్న కుమారుడైన సింహునికి ఇద్దరు కుమార్తెలు పుట్టారు. మొదటి కుమార్తె పేరు చైల అని, రెండవ కుమార్తె పేరు ఉపచైల అని పెట్టారు. మొదటి కుమార్తె గుణవంతురాలు సుందరి. వారు పుట్టినప్పుడే, విద్వాంసుడైన ఒక జ్యోతిష్కుడు చైలకు కలిగే కుమారుడు తండ్రిని చంపి రాజవుతాడని, ఉపచైలకుమారుడు పూర్ణ లక్షణయుతుడు అవుతాడని చెప్పాడు. మంత్రి జ్యేష్ఠ పుత్రుడైన గోపుడు శౌర్యమదంతో ఉద్యానాలను పాడుచేయడం మొదలయిన పనులవల్ల గణరాజ్యాలకు శత్రువయ్యాడు. గణరాజ్యాలవారు కోపగించుకొన్నప్పటికీ తండ్రిపై గల గౌరవంతో అతనికి, అతని తమ్మునికి విశాలానగర సమీపంలో రెండు జీర్ణోద్యానాలను బహూకరించారు. ఒకడేమో తన వనంలో తన సుకృతానికి అనుగుణంగా సుగతప్రతిమను చేయించి ప్రతిష్ఠ చేశాడు. మరొకడు తన వైభవానికి అనుగుణంగా భువనాభరణమైన విహారం స్థాపించాడు. తర్వాత తండ్రి గణరాజ్యాల కోపానికి భయపడి బలదర్పితుడైన గోపుణ్ని పొరుగుమండలంలో ఒక పనిలో నియమించాడు.

తండ్రి ఖండామాత్యుడు కాలధర్మం చెందగా, గణరాజ్యాలవారు చిన్న కుమారుడైన సింహుణ్ని సజ్జనుడని తండ్రి స్థానంలో గణముఖ్య పదవిలో నియమించారు. తండ్రిపదవి తనకు రానందుకు పెద్దకుమారుడైన గోపుడు గణరాజ్యాలు తన్ను అవమానించినట్టు భావించి గణరాజ్యంలో ఉండడానికి ఇష్టపడక పరిహారమేమిటని ఆలోచించాడు. "కంటకాకీర్ణమై, వ్యాఘ్రాదిక్రూర సత్త్వాలున్న అరణ్యంలోనన్నా వసించవచ్చును గాని, అనేక నాయకులు కలిగి విశృంఖలమైన దేశంలో ఉండరాదు. నానా మతాలు, నానా కార్యాలు, నానా ఆలాపాలు ఉన్న గణరాజ్యంలో కొలువు చేయడం ఎలాగ? గణరాజ్యంలో ఒకరికి ఇష్టమైనది మరొకరికి రుచించదు." అభిమాన ధనుడైన గోపుడు ఈ విధంగా ఆలోచించి, రాజగృహం చేరి గుణలక్ష్మీ నిలయుడైన బింబిసార నరపతిని ఆశ్రయించాడు. బింబిసారుడు అతనిని ప్రీతితో గౌరవించాడు. అతడు బింబిసారునికి విశ్వాసపాత్రుడయ్యాడు. బంగారుకు రాపిడి పెట్టినట్టు గుణసమ్మేళనం తత్కాలమే ప్రకాశిస్తుందికదా!

ఇలా ఉండగా, బింబిసారుని దేవేరి మరణించింది. ఆమె వియోగాగ్నితో రాజు బాధపడుతూ ఉండడం బుద్ధిమంతుడైన గోపుడు చూచి తన తమ్ముని రెండవ కుమార్తె అయిన ఉపచైలను పెండ్లాడ వలసిందని రాజుకు ఆలోచన చెప్పాడు. తర్వాత రాజు ఆదేశంతో ఆ కన్యను తీసుకొని రావడానికి గూఢచారిగా విశాలానగరానికి వెళ్ళాడు. గణరాజ్యంలో పుట్టిన కన్యను గణరాజ్యంలోని వారే అనుభవించాలి గాని, ఇతరులకు ఇవ్వరాదని వైశాలికులు పూర్వమొక నియమం చేసుకొన్నారు. ఈ నియమం గోపునికి తెలియదు. ఆ విశాలా నగరద్వారంలో నగరరక్షణకు యక్షునికి మారు ఒకపెద్ద

ఘంటఉంది. పెరవారు నగరంలో ప్రవేశిస్తే ఆ ఘంట తనంతట తానే మోగుతుంది. గోపుడు రహస్యంగా ఆ నగరంలో ప్రవేశించి, తన తమ్ముని ఉద్యానవనంలో విహరిస్తున్న పెద్దకుమార్తె చైలను చూచి, తొందరపాటు వల్ల ఉపచైల అని భ్రాంతిపడి ఆమెను రథమెక్కించి రాజగృహానికి బయలుదేరాడు. ఇంతలోగా నగరద్వారం ఘంట గణగణమని మోగింది. అది విని వీరభటులు పరిగెత్తి వచ్చారు. గోపుడు వారిని చంపి, రాజగృహం చేరి, రాజ ప్రాసాదానికి వెళ్ళి రాజు ఎదుట ఆ కన్యను నిలబెట్టాడు. అప్పుడు తను చేసిన పొరపాటు తెలిసింది. ఉపచైలకు మారుగ తమ్ముని పెద్దకుమార్తె అయిన చైలను తీసుకు వచ్చానని. అప్పుడతడు "దేవా! నేను అన్యమనస్కుడు కావడం వల్ల ఈ కన్యను పిలచుకొని వచ్చాను. ఈమెకు కలిగే కుమారుడు పితృహంతకుడౌతాడని జ్యోతిష్కులు చెప్పారు. కనుక ఈమె మీకు మహిషి కాదగింది కాదు. మీరు బ్రతికి ఉంటే కదా ప్రజలు సకల సంపదలూ ఉండి వర్థిల్లుతారు." అని విచారంతో విన్నవించాడు. గోపుడు ఈ విధంగా చెప్పినప్పటికి, బింబిసారుడు ఆమెను చూచిన మీదట ఆమె ముఖకాంతికి లొంగిపోయి కర్మబంధంచేత ఈడ్వబడినాడా అన్నట్టు ఆమెను వదలలేకపోయాడు. తర్వాత గోపుని మాటలకు నవ్వి, "తండ్రిని కొడుకు చంపినట్టు ఎక్కడైనా, ఎప్పుడైనా, విన్నామా? కుమారుడే పుడితే నేనే స్వయంగా అభిషేకిస్తాను" అని సమాధానం చెప్పి, ఆమెను పెండ్లాడి సుఖంగా ఉన్నాడు. పూర్వ కర్మ తరంగాలు అలా ప్రబలంగా ఉండగా, వేరే బుద్ధులు ఎలా పుడుతాయి? రాజుకు కాలక్రమాన చైలాదేవియందు కుమారుడు కలిగాడు. "ఈ కుమారుడు పితృద్రోహి అవుతాడు" అని జ్యోతిష్కులు చెప్పారు. బింబిసారుడు ఒకప్పుడు అరణ్యంలో మృగయా వ్యసనంతో తిరుగుతూ తపోవన మృగాలను పట్టుకొన్నప్పుడు ఇలాటి శాపం కలిగింది కూడాను.

ఆ సమయంలో వైశాలిలోని గణప్రముఖుడైన మహానునికి ఆమ్రవనంలో అరటిబోదెనుంచి ఉదయించిన ఒక కన్య లభించింది. ఆమె అతని యింటిలో సుందరాకారంతో పెరిగినకొద్దీ, ఆమె మనసులో విపుల ప్రీతి, దానచింత చిగుర్చుతూ వచ్చాయి. ఆమెను బంధువులందరూ చనువుతో, ప్రేమతో 'ఆమ్రపాలి, ఆమ్రపాలి' అని పిలిచేవారు. ఆమె నెమ్మదిగా సూనుహీనమని బాల్యం వదలి యౌవనం పొందింది. పెంపుడు తండ్రి మహానుడు ఆమెకు పెండ్లిచేయదలచి తత్ప్రయత్నం చేశాడు. గణరాజ్యంలో పుట్టిన కన్య గణరాజ్యానికే నన్న నియమానికి ప్రతికూలం కావడం వల్ల అతని ప్రయత్నాన్ని అతని గణం సహించలేదు. తండ్రి దీనికి చాల దుఃఖపడ్డాడు. అది చూచి ఆమ్రపాలి "తండ్రీ! గణానికి అలాటి ఆచారం ఉంటే గణభోగ్యంగానే ఉంటాను. కాని, ఈ ఒక్క నియమం మాత్రం పాటించాలి. ఒకరు నావద్ద ఉండగా మరొకరు రాగూడదు. నా ఇంట్లో ఉండడానికి పణం దినానికి ఐదువందల కార్షాపణాలు. (ముప్పైరెండు గురిగింజల ఎత్తు వెండినాణెం ఒక కార్షాపణం) అలా వచ్చినవాడు ఏడునాళ్ళు మాత్రమే నా ఇంట్లో ఉండాలి. అంతకు మించి ఉండరాదు. ఈ నియమం ఉల్లంఘించేవాడు ఎవడైనాసరే వధార్హుడు కావాలి" అని అన్నది. తండ్రి ఈ నియమాన్ని గణానికి తెలిపాడు. గణంలోని వారు చాలా బాగుందంటే చాలాబాగుందని ఆ నిశ్చయానికి ఆదరంతో తలొగ్గారు.

తర్వాత ఆమె విలువైన నగలు ధరించి రత్నభవనంలో బంగారు మహడీ ఎక్కి పట్టపగలే పండువెన్నెలలు వెదజల్లుతూ విహరించేది. నిర్ణీతమైన డబ్బు చెల్లించి ఆమెను కోరివచ్చిన ప్రతి కాముకుడూ ఆమెను చూచిన తక్షణం ఆమె ప్రభావంతో శక్తిహీనుడైపోయేవాడు. వచ్చినవారంతా పాము పడగ కప్పిన



చందనశాఖవలె ఉన్న ఆమెను చూడలేకనే పోయేవారు అన్నప్పుడు, తాకడానికి తహతహపడేవారేరీ! ఆ సుందరి నడుము విరిగిపడుతుందేమో అన్నట్టి బరువైన చనుకట్టుతో యౌవనానికే యౌవనావస్థను పొందించింది. శరీర సుఖరహితమైన ఆమె అద్భుతరూపం పాతాళంలోని హేమలతా పుష్పంవలె నిష్ఫలమైపోయింది. ఆమె వినోద కాలక్షేపం కోసం నానా దేశాలనుంచి, వచ్చిన చిత్రకారులతో నానాదేశ రాజుల చిత్రాలను తన భవనంలో గీయించింది. ఆ విధంగా అందరి రాజుల చిత్రాలు గీయిస్తూ ఒకనాడు రతిపతివంటి బింబిసారుని రూపం గీయించింది. ఆ సుందరరూపం చూడగానే, మనసు కలగి "మిత్రుడా! అమృతకాంతులు చల్లుతూ ప్రీతిలతామాధవుడైన ఈ వసుధాధిపతి ఎవరు? ఈ భూమిపుని ప్రణయభాగిని అయి, ఊర్వశి సౌభాగ్యగర్వాన్ని, లక్ష్యాన్ని ధ్వంసం చేసిన ధన్యురాలెవరు?" అని ఆ చిత్రం వ్రాసిన చిత్రకారుణ్ణి కుతూహలంతో అడిగింది. "ఈయన బింబిసార భూపతి. సుకృత సంపదల సారం వంటివాడు. ఈయన శౌర్యరూపాలతో తులదూగడానికి స్వర్గ నాయకులైన దేవతలెంతటివారు? మన్మథుడు కూడ ఆ మనోరథం తలపెట్టడనుకుంటాను" అని ఆ చిత్రకోవిదుడు ఆమెతో అన్నాడు. ఆమె బింబిసార భూపాలుని చిత్రపటాన్నే చూస్తూ ఉండి పోయింది. వెంటనే అభిలాషతో ఆయన్పై కొత్త సుముఖత చూపింది.

అక్కడ రాజగృహంలో బింబిసారుడు ఒకనాడు కొలువు ముగిసిన తర్వాత రహస్యభవనంలో గోపునితో ఇలా అన్నాడు. "మిత్రమా! మిత్రులు స్వేచ్ఛగా చెప్పుకొంటున్న మధురసంవంటి నామనస్సులోని ఒకమాట కొంచెం విను. విశాలాపురిలోని గణరాజ్యాలవారు కదళీస్కందంనుంచి జనించిన రంభోరు అయిన ఒక సుందరిని ఉమ్మడి సొమ్ముగా చేసుకొన్నట్టు విన్నాను. తేజస్వులయినవారే ఆమెను ప్రేమించదగినవారట. ఆమె ప్రభావంతో ఆశ నశించినవారు పద్మసరసిన ఏనుగులు కలత పెట్టినట్టు ఆమెను దూషింపజేయలేరట. వింటేనే ఆనందం కలిగిస్తున్న అయోనిజ అయిన ఆ స్త్రీ ఎవరి మనస్సుకు నవనవోత్సాహ కౌతుకాలు కలిగించదు? నా మనస్సు, చూపు ఒకేమారు ఆమెపై ఆశగొన్నాయి. ఆమె గుణశ్రవణంతో ఈ చెవిని కూడ ధన్యం చేసుకుందామని ఆశపడుతున్నాను." గోపుడు రాజు మాట విని, "దేవ! అది భుజంగగణపరీతమైన మన్మథ నిధి. మీకు మన్మథుడు ఎలాటి దారి చూపాడు? వీసమంత జారినా అఖాతంలోకి పడిపోయే దుస్సహ దుర్గమ మార్గమది. ఆమెను పిలుచుకొనిరావడం సాధ్యం కాదు. కాని, అక్కడికి మీరు వెళ్ళడం ఉచితం కాదు. ఏ ఉపాయమూ తోచని ఉభయ సంశయమైన ఈ విషయంలో ఏమి చెప్పను?" అని అన్నాడు. గోపుడు ఇంతగా చెప్పినా నరపతి ఆ ఉత్కంఠను, పట్టుదలను వదలలేదు. విద్వాంసులు కూడ కామాతురులైనప్పుడు ఉచితరీతిని మరుస్తారు!

తర్వాత బింబిసారుడు గోపునితోసహా వైశాలికపురికి వెళ్ళి మారువేషంతో ఆమ్రపాలి మందిరం చేరాడు. ఆమ్రపాలి ఇదివరకే చిత్రంలో కన్నులకు పరిచితుడైన రాజును ప్రత్యక్షంగా చూచి సిగ్గుతో తలవంచుకుని, నేల చూడసాగింది. ఆమె సిగ్గుతో ఏమీ పలుకక ఒడలు పులకించి వణకుతూ ఉండగా, రణిస్తున్న ఆమె మణిమేఖలే ఆయనకు స్వాగతమిచ్చినట్టయింది. బింబిసారుడు తన రూపాన్ని అక్కడి చిత్రంలో చూచి ధన్యుణ్ణయానని అనుకుంటూ, ఆ లావణ్యనదిని నయనాంజలితో పానం చేశాడు. సిగ్గుతో ఆ సుందరి, ఆభిజాత్యంతో ఆ భూపతి మౌనంతో ఉండగా, గోపుడు చిరునవ్వు నవ్వుతూ ఆమెతో ఇలా అన్నాడు. "సుందరీ! నీవు భక్తివిశేషంతో చిత్రంలో రూపాన్ని వ్రాసుకొని ధ్యానావధానాలు

చేసినందున ఈ మా దేవర ప్రత్యక్షమయారు. నీవు వీరిని చిత్రంలో వ్రాసుకొన్నావు. వీరు నిన్ను మనసులో వ్రాసుకొన్నారు. మీ యిద్దరిలోనూ ఎవరు ప్రేమదూత అయ్యారో చెప్పలేను." ఈ విధమైన ప్రసంగంతో నిండు సంతోషం కలిగిన వారిద్దరికీ, ఆ సమయంలో మన్మథుడు ఆదేశించినదంతా ఆస్వాదనీయమైంది. ఇంతలో ఊరివాకిలిగంట గణగణమని మోగింది. పట్టణవాసులందరూ గగ్గోలు పడ్డారు. ప్రచ్ఛన్న కాముకుడైన రాజు ఎవరూ చూడకుండా ఆమె భవనంలో ఏడు రాత్రులున్నాడు. సకాలంలో పుష్పించిన లతలాగ ఆమె గర్భం ధరించింది. ఆ సంగతిని సిగ్గుతో తలవాల్చి నెమ్మదిగా ఆయనకు తెలియజేసింది. రాజు నియమం ప్రకారం ఏడు రోజులు గడువు ముగియగా, భావిపుత్రుని ఆనవాలు తెలుసుకొనడానికి నమ్మకమైన గుర్తుగా ఉంగరం ఆమెకిచ్చి వెళ్ళిపోయాడు.

సుందరాకారంతో కనులపండువు చేస్తున్న ఆ బింబిసారమహీపతి వెళ్ళగానే, ఆమ్రపాలి విరహాంధకారంతో ముఖాబ్జం ముడుచుకుపోయి, దుఃఖంతో నిట్టూరుస్తూ, నవ్వనేదే లేక సాయంకాలపుహోరు గాలులతో కళలేని రాత్రిలాగ ఉండిపోయింది. చెంపకు చేయి చేర్చి, మనసులో మహీపతిని తలచుకొంటూ, శరీరం పసివాళ్ళువాడగా కనులు మూసుకొనే ఉండిపోయింది ఆమె. తర్వాత కొంతకాలానికి ఆ కల్యాణి సద్బుద్ధి వినయాన్ని ఉదయింపజేసినట్లు; తండ్రి ప్రతిబింబంవంటి కుమారుణ్ణి ప్రసవించింది. ఆ కుమారుడు చంద్రబింబంలాగ క్రమంగా పెరుగుతూ ఉండగా, "వీడు బింబిసారుని పుత్రుడు" అనే ప్రథ జనంలో ఏర్పడింది. ఆ కుమారుడు తోటి బాలురతో ఆటలాడుతున్నప్పుడు ఆ బాలురు కోపంతో అతణ్ణి ఆయా అపవాదాలతో ఉడికిస్తూ బాధించసాగారు. ఆ సంగతిని తల్లి వద్ద కుమారుడు మొరపెట్టుకున్నాడు. ఆమె, తనకుమారునికి ఇక చదువదగిన వయస్సు వచ్చిందని గ్రహించి, బింబిసారుడు తనకు లోగడ ఇచ్చిన అభిజ్ఞానాంగుళీయకంతో సహా అతణ్ణి ఒక పెద్దవర్తక సంఘంతో బింబిసారుని రాజధాని అయిన రాజగృహానికి పంపించింది. బింబిసారుడు తనతో సమానమైన ఆకారం గల ఆత్మజుణ్ణి చూచి, సంతోషగర్వాలతో ఆలింగనం చేసుకొని స్వీకరించాడు.

ఆమ్రపాలి వృత్తాంతం అందరికీ తెలిసిపోయిన తర్వాత ఒకనాడు భిక్షువులు కుతూహలంతో ఆమె పూర్వజన్మకథను తెలుపవలసిందని బుద్ధదేవుణ్ణి కోరారు. బుద్ధదేవుడు ఇలా అన్నాడు. "పూర్వం రాజగృహంలో రాజోద్యానంలో మాలతి అనే ఉద్యానపాలిక ఉండేది. ఆమె ఒకమారు అకస్మాత్తుగా తన ఎదుట వస్తున్న ప్రసాదార్ద్రుడు, ప్రత్యేక బుద్ధుడు అయిన ఒక రాజర్షిని దర్శించి, మామిడిపూతతో పూజించి "నేను రాజుకు అయోనిజ అయిన భార్యగా పుట్టాలి." అని నిండుమనసుతో కోరుకుని ప్రణిధానం చేసింది. ఆ పుష్పచయ పూజాపుణ్యం అనుభవించే భాగ్యశాలినే ఆమ్రపాలిక." ఆమె పూర్వ చరిత్రను విని భిక్షువులు చాల విస్మయం చెందారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ఆమ్రపాల్యవదానమనే ఇరవైయవ పల్లవం.

## 21. జేతవనప్రతిగ్రహోవదానం

మానవుల ధనం పిడికిలిలో పట్టుకున్న పాదరసకణం వంటిది. కనుక తన ప్రభూతైశ్వర్యాన్ని దీనుల, అనాథుల కోరికలు తీర్చడానికి అర్పించి, పుణ్యారామాలు, విహారాలు, చైత్యాలు భగవత్ప్రతిమలు ప్రతిష్ఠించి, కీర్తి సంపాదించి అక్షయపదవితో వెలుగొందేవాడే ధన్యుడు.

శ్రావస్తీ నగరంలో దత్తుడనే గృహపతి ఉండేవాడు. ఆయనకు పుణ్యసంపదలు మూర్తీభవించాయా అన్నట్లుగా ఉన్న సుదత్తుడనే కుమారుడు ఉండేవాడు. ఆ కుమారుడు బాల్యంలోనే తను ధరించిన నగలను యాచకులు అడిగితే ఇచ్చివేసేవాడు. ప్రాగ్జన్మవాసనాభ్యాసం ఎవరు అడ్డగించినా ఆగేదా? ఇలా నిత్యం నగలు దానం చేయడాన్ని తండ్రి కోపగించుకొని వద్దన్నాడు. అప్పుడు ఆ బాలుడు నదిలో పడిపోయిన ఇతరుల నగలను ఏరుకొని వచ్చి, తాను తన నగలను దానం చేయలేదని తండ్రికి సాక్ష్యం చూపేవాడు. అతని కంటికి భూమిలో గుప్తమైన ఎక్కడెక్కడి నగలూ కనిపించేవి.

కొంతకాలానికి తండ్రి స్వర్గానికి వెళ్ళాడు. నిధిదర్శి అయిన సుదత్తుడు దరిద్రులకు, అనాథలకు నిరంతరం అన్నదానం చేయడం వల్ల అనాథపిండదుడనే ఖ్యాతి వచ్చింది. ఆ దానశీలునికి కాలక్రమాన ఒక పుత్రుడు కలిగాడు. అతడు పెరిగి పెద్దవాడయిన తర్వాత పుత్రవత్సలుడైన అనాథపిండదుడు అతనికి పెండ్లి చేయదలచి, కన్యాన్వేషణ కోసం మధుస్కంధుడనే బ్రాహ్మణున్ని రాజగృహానికి పంపాడు. ఆ బ్రాహ్మణుడు మగధ దేశానికి వచ్చి రాజగృహం చేరి, అక్కడ మహాధనుడనే ఒక గృహపతి ఇంటికి వెళ్ళి, కన్యను అభ్యర్థించాడు. "గృహపతీ! శ్రావస్తిలో అనాథపిండుదుడనే విఖ్యాతిగాంచిన గృహపతి ఉన్నాడు. ఆయన కుమారుడైన సుజాతునికి నీ కన్యను ఇవ్వు" అని ఆ బ్రాహ్మణుడు అడుగగా, "దేవా! ఈ సంబంధం ఉత్తమమైంది; మా కులోచితమైందీని. కాని, మావంశంలో చాల హెచ్చుగా కన్యాశుల్కం గ్రహించే ఆచారం ఉంది. మీకు శక్తి ఉంటే శ్రేష్ఠమైన నూరు రథాలు, ఏనుగులు, గుర్రాలు, కంచర గాడిదలు చెరినూరు, దాసీలు వందమంది, నూరు నిష్కాలు(మాడలు) శుల్కంగా చెల్లించాలి" అని మహాధనుడు సమాధానమిచ్చాడు. ఆ బ్రాహ్మణుడు మందహాసంతో "అనాథపిండదుని ఇంటికి ఈ శుల్కం చాల స్వల్పం" అని అంటూ మహాధనుడు కోరిన శుల్కానికి ఒప్పుకున్నాడు. తర్వాత ఆ గృహపతి ఆ బ్రాహ్మణుణ్ణి ఆదరంతో భోజనానికి ఆహ్వానించాడు. ఆ బ్రాహ్మణుడు సంబంధం నిశ్చయమైనట్లు లేఖ ద్వారా అనాథపిండదునికి తెలిపి, మహాధనుని ఇంట్లో భక్ష్యభోజ్యాలను ముక్కువరకు మెసవాడు. పాపం! రాత్రి మసూచి తగిలి మహాబాధతో కేకలు వేయసాగాడు. రాత్రి నిద్రాసుఖం కూడా పాగొట్టుకొనే విధంగా జిహ్వాచాపల్యంతో భోజనం చేసేవారు పరలోక సుఖం కోసం జన్మకర్మ ఎలా చేస్తారు? ఇంటిని అశుద్ధం చేస్తాడనే భయంతో అతన్ని పరిచారకలు వెలుపలికి పంపివేశారు. శఠులైన సేవకులు సహజంగానే ఉపేక్షతో ఉంటారు. ఆ బ్రాహ్మణుని శుభకర్మకొద్దీ సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు ఆ దారిని వచ్చారు. వారు

మసూచీ పీడితుడై ఒడలు తెలియక పడి ఉన్న ఆ బ్రాహ్మణుణ్ని చూచి వెదురాకులతో అశుద్ధం నెమ్మదిగా తీసివేసి, మట్టితో తుడిచి ధర్మమార్గం ఉపదేశించి వెళ్ళిపోయారు. ఆ బ్రాహ్మణుడు వారి సమక్షం చిత్తప్రసాదం పొంది భౌతికకాయం వదలి చతుర్మహారాజికులనే దేవతల కులంలో జన్మించాడు. తర్వాత విశ్రవణుని ఆజ్ఞతో మర్త్యలోకంలోని రాజగృహం శిబిరద్వారం పూజాధిష్ఠానంలో నివసించాడు.

అనాథపిండదుడు లేఖద్వారా సంబంధం నిశ్చయమైనట్టు తెలుసుకొని బ్రాహ్మణుడు మాట యిచ్చిన ప్రకారం కన్యాశుల్కంతో రాజగృహానికి శ్రావస్తి నుంచి బయలు దేరాడు. ఆయన కాబోయే వియ్యంకుని భవనానికి వచ్చిచూడగా, రాజార్హమైన భక్ష్యభోజ్య సామగ్రి గుట్టలు గుట్టలుగా పడిఉండడం కనిపించింది. అది చూచి, ఆశ్చర్యపడి అనాథపిండదుడు నిష్కపట హృదయంతో "ఈ అపార భక్ష్యోత్సవం ఏమిటి? రాజును భోజనానికి ఆహ్వానించారా?" అని మహాధనుణ్ని ప్రశ్నించాడు. "సంఘపరీతుడైన బుద్ధభగవానుణ్ని ఆహ్వానించాను. సంఘానికి ఇది నా మహోత్సవం" అని మహాధనుడు సమాధానమిచ్చాడు. బుద్ధుడనే పేరు వినగానే అనాథపిండదునికి ఒళ్ళు పులకించి చంద్రకాంత శిలవలె వెంటనే చెమర్చింది. కొందరి పేరు వినగానే పరమార్థం తెలియకనే పూర్వజన్మానుబంధమైన ఏదో సహజభావం పెల్లుబికి వస్తుంది. నవనీరదం నినదించగా, నెమలి సంతోషం అంచులువారి లలిత నృత్య వృత్తిని కాంక్షిస్తుంది. అనాథపిండదుడు ముఖంపై కొత్తవెలుగుతో అన్నాడు గదా: "ఆర్యా! బుద్ధ భగవానుడెవరు? సంఘమనేదేమిటి? అది విని ఆ గృహపతి చిరునవ్వు నవ్వి "ఆహా! భువనత్రయశాస్త అయిన బుద్ధదేవుణ్ని ఎరుగవా? సంసార పాశభయంతో శరణు పొందదలచిన వారికి ఆయన శరణు. ఆ జినదేవుణ్ని తెలియనివాడు దురదృష్టవంతుడుకదా! మోహంలో పడి, జన్మను వృథా చేసుకొని, అజ్ఞాన తరణోపాయమైన వయస్సును పాడుచేసుకొన్నవాడు ఎందుకు? బుద్ధభగవానుడు గౌతముడనే శాక్యరాజకులోద్భవుడు. ఆయన అనాగారికుడై (సన్యాసియై) సంబుద్ధితో అనుత్తరమైన సమ్యక్సంబోధిని సంపాదించాడు. ఆయన తర్వాత, ఆయన అనుగ్రహంతో గతరాగులై సన్యసించిన భిక్షువుల సమూహాన్ని సంఘమంటారు. నా కుశలాన్ని కోరుకుంటున్న నేను నా పుణ్య ధనం వల్ల బుద్ధదేవుణ్ని, సంఘాన్ని ప్రేమతో ఆహ్వానించాను" అన్నాడు. ఆయన మాటలు విని అనాథపిండదుడు రాత్రి ఆ మాటలే స్మరిస్తూ, బుద్ధచింతతోనే నిద్రపోయాడు. రాత్రి ఇంకా ఒక జాము మిగిలి ఉండగా, అనాథపిండదుడు ఎవరో లేపినట్టు ఉదయమైందని లేచి పురద్వారం నుంచి బయలుదేరి శిబికాద్వారం చేరాడు. అక్కడ మధుస్కంధుడు ఆయనకు శ్రేయోమార్గం ఉపదేశించాడు.

తర్వాత ఆయన దప్పిగొన్నవాడు సాటిలేని రుచిగల అమృతాన్ని పొంది తనిసినట్టు ప్రమోదభారంతో తనిశాడు. భగవానుని దూరం నుంచే దర్శించి, అలసిన బాటసారి చల్లని చెట్టునీడను చేరి సంతాపం పోగొట్టుకొన్నట్టు విశ్రాంతి శీతలమైన శ్రాంతిని పొందాడు. సుగతుని దర్శించగానే అనాథపిండదుని మనస్సు శరత్కాలం రాగానే ఆకాశం మేఘాల తెరలు తొలగిపోయి నిర్మలమైనట్టు నిర్మలమైంది. ప్రసన్న మనస్కులైన పుణ్యశీలుర ప్రభావమే అలాటిది. వారి అనుగ్రహంతో చిత్తవృత్తులు నిర్మలమై, నిర్విఘ్నమై పోతాయి! అనాథపిండదుడు అప్పుడిలా తలపోశాడు. "ఆహా! మోహం తొలగిపోగానే నాకు ప్రశమసంపద ఏర్పడింది. వికార విచ్ఛేదం కలిగింది. అహంకారం శాంతించింది. ఇంతకుముందే బుద్ధదేవుని దర్శించకపోవడం ఎంత దురదృష్టం? ధన్యజీవులు కానివారికి ఈ శాంతిమూర్తి దర్శనభాగ్య



కలుగుతుందా? ఆహా! నేను ఆయనను సమీపించే కొద్దీ నాలో విరాగం హెచ్చుతున్నదే? ఈయన చూపు అమృత మధురమూ, ఉదారమూను. కాంతి చంద్రకాంతిలాగ చల్లనిది. ప్రవర్తన తరుణ కరుణాపూరితం. బుద్ధి ప్రసాదమయమైనది. వీతరాగుల నిస్సంసార ప్రవత్తి కూడ ప్రియమే సుమా!" అని అతడు ప్రసన్నచిత్తంతో బుద్ధదేవుని సమీపించి ఆనందంతో పాదపద్మాలకు అభివందనం చేశాడు. భగవానుని ముఖారవిందంపై కూడ అనాథపిండదుని కలుసుకున్నందుకు సంతోషించి అనుగ్రహించినట్టు సంపూర్ణ కారుణ్య పూరితమైన కాంతి వెలసింది. ఆయన జన్మరజస్సును పరిశుద్ధం చేసే సుధానదివలె మిలమిలలాడుతూ ఊరట కలిగించే చూపును అనాథపిండదునిపై ప్రసరింపజేశాడు.

పిదప భగవానుడు అతనికి చతురార్యసత్యాల జ్ఞానం కలిగించే కల్యాణ ధర్మోపదేశం చేశాడు. ఆయన శాసనంతో అనాథపిండదుడు సమస్తక్లేశ సంతతిని త్యజించి ఇలా విన్నవించాడు. "ఇప్పటికే కాలం మించిపోయి మీ శరణుపొందాను. నిరంతరాపన్న వాసనలవల్ల ఈ సంసారంలో నా మనసు ఇక నిలవడం లేదు. మీ దర్శనం ఎప్పుడూ చేసుకోదలచాను. మహాత్ముల సందర్శనం అశుభాన్ని తొలగించి తక్షణశుభాన్ని కలిగించి, సముచితాచారాన్ని సూచిస్తుంది. కనుక మీ విహారం కోసం మా పట్టణంలో అమూల్య రత్నమందిరాలతో సుఖార్హమైన ఒక విహారం ఆదరంతో నిర్మింపజేస్తాను. మేము సంపదలతో చేసే సేవలు, సపర్యాపరిచర్యలు స్వీకరిస్తూ ఆ విహార నివాసంతో మమ్మల్ని అనుగ్రహించండి." భగవానుడు "అలాగే" అని అతని ప్రార్థనను అంగీకరించాడు. సజ్జనులు తమపై ప్రీతిగలవారి అభ్యర్థనను తోసివేసి ప్రగల్భం చూపరుగదా" అనాథ పిండదుడు ఈ విధంగా సుగతదేవుని ఆహ్వానించి భగవానుని ఆదేశంతో తన వెంట వస్తున్న శారిపుత్ర భిక్షువుతోపాటు శ్రావస్తీ నగరానికి బయలుదేరాడు.

శ్రావస్తీ నగరంలో బంగారువంటి జేతకుమారుడు ఇచ్చిన ప్రభూతకాంచనంతో అనాథపిండదుడు తను ఉద్దేశించిన విహారానికి మూలబంధం వేసాడు. దేవతలు భక్త్యుత్సాహాలతో ఆ కార్యానికి సహాయం చేయగా, త్రిదివాకారమైన విహారం నిర్మితమైంది. జేతకుమారుడు కూడ భక్తిశ్రద్ధలతో భగవానుని యశఃపుణ్య ప్రతిష్ఠకోసం ద్వారకోష్ఠం నిర్మించాడు.

ఈ అద్భుత విహార నిర్మాణం చూచి క్షపణకాది తీర్థ్యులు ఈర్ష్యాద్వేషాకులులై లేనిపోని అపవాద వివాదాలతో కయ్యానికి కాలు దువ్వారు. వారిలో ప్రముఖుడైన రక్తాక్షుడనే క్షుద్రపండితుడు, ప్రతిదానికీ రెక్కలున్న నల్లతాచులాగ ఎప్పుడూ ఎగిరిపడేవాడు, తనను వాదంలో జయించనిదే విహారం నిర్మించడానికి వీలు లేదని అడ్డగించాడు. దానిపై అనాథపిండదుడు ఆర్య శారిపుత్రుణ్ణి వాదానికి పిలిపించాడు. శారిపుత్రుడు రాగానే రక్తాక్షుడు ప్రభావోత్కర్షం చూపవలసిందని పందెం వేసి, ఇంద్రజాల బలంతో ఎదిగిన ఒక మామిడి చెట్టును కల్పించాడు. శారిపుత్రుడు తన ప్రభావంతో నోటితోనే ఊది ఆ మామిడి చెట్టును ఆ తీర్థ్యుని ఉత్సాహంతోపాటు కూల్చివేశాడు. తర్వాత రక్తాక్షుడు వికసించిన కమలాలతో ఒక సరస్సును కల్పించాడు. శారిపుత్రుడొక ఏనుగును కల్పించగా, ఆ ఏనుగు ఆ సరస్సును, పద్మాలను తొక్కివేసి పంకమాత్ర శేషంగా చేసింది. రక్తాక్షుడు దానితో రక్తాక్షుడై తన రొమ్మునుంచి ఏడు పడగల నాగుబామును వెలికిలాగాడు. శారిపుత్రుడు గరుడిని కల్పించి దాని రెక్కల గాలితో ఆ సప్తఫణ సర్పాన్ని ఎగురగొట్టించాడు. పిదప రక్తాక్షుడు బేతాళుణ్ణి ఆవాహన చేశాడు. శారిపుత్రుడు బేతాళుణ్ని మంత్రబలంతో బంధించి, రక్తాక్షునిపైకే తిప్పాడు. బేతాళుడు రక్తాక్షుణ్నే చంపబోయాడు. రక్తాక్షుడు

బేతాళుడు వెంటబడి తరుమగా భయంతో అభిమాన జ్వరం నశించి శారిపుత్రని కాళ్ళపై పడి శరణు వేడాడు. ఈ విధంగా రక్తాక్షుడు, ఆ పరాజయంతో శరణ్యుడైన బుద్ధదేవుని శరణుపొంది సన్న్యసించి వీతరాగుడై, శుద్ధబోధిని పొందాడు. తక్కిన తీర్థ్యులు విద్వేష క్రోధాలు పట్టలేక ఏవిధంగానైనా భిక్షువులను చంపుదామని భావించి విహారం కట్టడపు పనివారిగా చేరారు. ఆ ధర్మద్రోహులను కూడ శారిపుత్రడు క్రమంగా కనిపెట్టాడు. ఆయన దృష్టి పడిన మాత్రానే, వారు స్నేహపూర్ణ హృదయులయారు. శారిపుత్రుడు వైద్యరాజులాగ వారి ఆశయానుశయ ధాతు ప్రకృతులను గమనించి ధర్మోపదేశంతో వారికి అనుత్తరమైన గతిని కల్పించాడు.

ఈ విహార నిర్మాణ కార్యం నిర్విఘ్నంగా కొనసాగగా, శారిపుత్రుడు మందహాసంతో అనాథపిండదునితో ఇలా అన్నాడు. "ఈ విహార సూత్రపాతం (మూలబంధం వేయడం) జరిగినక్షణమే తుషిత దేవలోకంలో గొప్ప స్వర్ణమయ విహారం రూపొందింది." ఆ మాటలు విని అనాథపిండదుడు సంతోషం రెట్టింపు కాగా, విహారాన్ని హేమరత్న వరాగారంగా సిద్ధపరచాడు. ఆ విహారం చూడడానికి వచ్చేవారికి దారిలో అతడు రాజార్హమైన వైభవోపచారాలు ఏర్పాటు చేసి, జినదేవునికి విన్నపం పంపాడు. శ్రావస్తికి జినదేవుని రాకతో ముల్లోకాలూ సంతోషంతో పొంగిపోయాయి. అప్పుడు అనాథపిండదుడు ఆ జేతవన విహారాన్ని బుద్ధదేవునికి దానంగా ధారపోశాడు. ఆ వారిధార పడవలసిన ప్రదేశంలో పడక భగవానుని మాటపై వెంటనే మరొకచోట పడింది.

ఆ వినోదం చూచి భిక్షువులు ఆశ్చర్యపడి "దేవా! వారిధార స్తంభించిపోయిన కారణమేమిటి?" అని ప్రశ్నించారు. భగవానుడు ఇలా అన్నాడు. "ఈతడు పూర్వబుద్ధులకు ఇక్కడే ఈ స్థలాన్నే దానం చేశాడని వారిధార మరొకచోట పడింది. ఈయన పూర్వం విపశ్యి అనే సమ్యక్సంబుద్ధునికి ఈ శ్రేష్ఠారామ ప్రదేశం దానమిచ్చాడు. ఈతడు పుష్యుడనే పేరుతో జన్మించినప్పుడు శిఖి అనే బుద్ధునికి , తర్వాత రఘు జన్మలో విశ్వభువుకు ఈ స్థలాన్నే దానమిచ్చాడు. మరల ఇప్పుడు దానినే నాకు దానమిచ్చాడు. ఇకముందు ఇతడు సుధనుడనే పేరుతో జన్మించి మైత్రేయునికి దీనినే దానమిస్తాడు. క్షాంతి, సత్త్వం గలవాడు గనుక భూమిలోని గుప్తధనాలను చూడగలడు. ఈతడు మరొక జన్మలో హేమకుడనే గృహపతిగా పుట్టి పరినిర్వాణం చెందిన ఒక ప్రత్యేకబుద్ధునికి అంత్యసంస్కారం చేశాడు. ఒక రత్నకలశంతో ఆ ప్రత్యేకబుద్ధుని అస్థికలు భద్రపరిచాడు. ఆ ప్రణిధానం వల్ల ఇప్పుడు రత్నకోశార్హుడు, సువర్ణవంతుడు అయ్యాడు."

జగచ్ఛాస్త అయిన జినదేవుడు చెప్పిన విషయాన్ని భిక్షువులు అమృతసారంగా విని అనాథపిండదుడు సత్కర్మలతో సంపాదించిన పూర్వపుణ్య పుష్పాల దివ్య పరిమళానికి చాల ఆనందించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో జేతవనప్రతిగ్రహోవదానమనే ఇరవై ఒక్కటవ పల్లవం.

## 22. పితాపుత్రసమాదానావదానం

గొప్పతనమనేది మణివలె మహార్హమైనది. భవ్యులైన వారికది గుణగౌరవంతో అలవడుతుంది. గుణంలేని దేహగురుత్వం పెద్ద రాతి గుండ్లకున్న గౌరవంవలె నిష్ఫలమైనది.

శ్రీమంతుడు, శుద్ధిసుధకు నిధానమైనవాడు అయిన శుద్ధోదనుడు ఒకప్పుడు తన రాజధాని అయిన శాక్యనగరంలో వైరాగ్యదీక్షతో సుగతత్వం పొందిన తన కుమారుణ్ని తలచుకొని, చాల ఉబలాటపడుతూ ఇలా తలపోశాడు: "నా కుమారుని ముఖం ఎప్పుడు చూస్తాను? అది పుణ్యగుణాలకు అధివాసమైనది; సరస్వతికి నివాసమైనది; పద్మ సౌభాగ్యం కలది; మనశ్శాంతికి విలాససౌధమైనది. అలాటి కుమారుని వదనం ఎప్పుడు చూస్తాను." కుమారుణ్ని చూద్దామనే అభిలాషతో అతణ్ని పిలుచుకొనిరమ్మని నేను జేతవనానికి పంపిన వారందరూ అతణ్నే రెప్పవాల్చకుండా చూస్తూ ఉపదేశామృతం గ్రోలుతూ అనిమిషులైపోయి అక్కడే ఉండిపోయారు. అతని వద్దకు నాకు సాటివాడైన ఉదాయిని చనువుతో పంపాను. అతడు తిరగిరాలేదు. లేఖపట్టుకొని వెళ్ళిన ఆయన స్వర్గమనోహరమైన జేతవనంలోనే నా కుమారుని అమృతవాక్కులు వింటూ లేఖత్వం (దేవత్వం) పొందాడేమో! నేను చెప్పిపంపిన సందేశ వాక్యాలను ఆయన మరచిపోయి ఉంటాడు. ఇది నిజం. ప్రతివారూ ఆత్మహితం కోరేవారే; పరార్థమంటే చల్లబడిపోతారు. "వచ్చి నన్ను చూచి వెంటనే నా దేహాన్ని తాకి అమృతప్రవాహంతో నన్ను అభిషేకించు. ముహూర్తకాలం నిస్సంగత్వం నుంచి విశ్రమించు. దయ కలిగి ఈ బంధుకార్యం చేయి" అనే నా సందేశ వచనాలు విని కూడా నా కుమారుడు నన్ను చూడడానికి క్షణమైనా ఆలసిస్తాడా? పల్లవ సుకుమారమైన ఆతని మనస్సుకు చనవును తోసివేయడం స్వభావం కాదు." శుద్ధోదనుడు ఈ విధంగా అనుకుంటూ తన్మయుడై తన కుమారుణ్ని చూడడానికా అన్నట్లు రెండడుగులు ముందుకు వేయగా, అతడు జేతవనానికి పంపిన ఉదాయి బుద్ధదేవుని అనుగ్రహానికి చిహ్నంగా ప్రవ్రజ్యాదీక్షతో, సంతోషంతో ఎదురుపడ్డాడు. తొణికిసలాడే ఆనందంతో సన్న్యాసదీక్ష స్వీకరించి తనకుమారునితో సదృశమైన నిశ్చయంతో వచ్చిన ఉదాయిని చూడగానే శుద్ధోదనునికి ఉత్కంఠ హెచ్చి, ధైర్యం కూలిపోయి, మూర్ఛ వచ్చింది. ఇలా మూర్ఛితుడైన రాజు పరిచారకుల శిశిరోపచారాలతో కొంతసేపటికి తెప్పరిల్లి " కుమారుడు వస్తాడా?" అని డగ్గుత్తికతో ప్రశ్నించాడు. "దేవ! బుద్ధదేవుడు కొన్నినాళ్ళు గడచిన తర్వాత మీ వద్దకు వస్తాడు" అని ఆదరంతో పలికాడు ఉదాయి.

పిదప కొన్నాళ్ళు గడచిన తర్వాత సర్వార్థసిద్ధుడైన భగవానుడు భిక్షుగణాలతోను, దేవ సంఘాలతోను ఆకాశమార్గంలో శాక్యనగరానికి వచ్చాడు. పై నుంచి ఆయనపై దేవసుందరులు తమ పాణిసరోజాలతో మందార పుష్పమాలికలను సమర్పించారు. అది చూడగా, ఆయన ఆకాశగంగ నురుగుల

సొబగులుగల సురపర్వతంలాగ కనిపించాడు. బుద్ధదేవుని అనుగమిస్తున్న దేవతలు పయనించే విమానాల రాపిడికి మేఘాలు ముక్కలు ముక్కలై, విమానాల బంగారు చిరుగంటలు మోగాయి. ఆ మోత దిగ్వనితల ముఖాలు శాస్త ఎడ భక్తితో చేసిన స్తవమా అనిపించింది. గగనం శూన్యమైనదికదా! అలాటి గగనం సురసిద్ధ విద్యాధర సంఘాలతోను, వారు భక్తితో పట్టుకున్న శ్వేతచ్ఛత్రాలతోను ఎందరో సూర్యులతో నిండిపోయినట్టుగా కనిపించింది. ఆకాశమార్గంలో వస్తున్న ఆ సర్వలోకోపకారబుద్ధి, సర్వాకృతి, సర్వమయుడు అయిన బుద్ధదేవుణ్ని దిక్కులనుంచి, భూమి నుంచి అందరూ మహాసంతోషంతో చూచారు. లోకుల లోచనాలకు సంతోషరాశి, సుకృతోత్సవాలకు పుణ్యావధి అయిన ఆ తేజోనిధిని ప్రజలు దర్శించి ఆశ్చర్యతరంగాలలో ఓలలాడారు. దివ్యప్రభావంతో వెలుగుతూ జగత్తుకే ఆశ్చర్యం కలిగిస్తున్న ఆ జగద్గురువైన కుమారుణ్ని ఉదాయి "అదుగో వస్తున్నారు" అని సూచించగా చూచి శుద్ధోదన మహీపతి దూరం నుంచే అంజలి ఘటించి నమస్కరించాడు.

పిదప బుద్ధదేవుడు ఆకాశం నుండి భూమి మీదకి అవతరించి, ఆర్యజనులు వెంటరాగా, రాజు పరిచర్యలు చేస్తుండగా. సర్వదిగ్భాగాలునిండి కాంతితో ప్రకాశిస్తున్న న్యగ్రోధవన రత్నభూమికి దయ చేశాడు. అక్కడ శాసనంతో లోకత్రయాన్ని సాసించే భాస్వచ్ఛరీరుడు చిత్ర విచిత్ర రత్నాలు తాపిన పాదపీఠ సహితమైన హేమాసనాన్ని మేరుపర్వతాన్ని అధిరోహించినట్టు అధిరోహించాడు.

మనస్సుకు చల్లగా చంద్రుడిలాగ ఉన్నాడు; కండ్లకు అమృత ప్రవాహంలాగ ఉన్నాడు. తను కోరగా తరలి వచ్చాడు. అలాటి కుమారుణ్ని శుద్ధోదన క్షితిపతి సంతోషంతో సంతృప్తితో రెప్పవాల్చక చూస్తూ, క్షణకాలం అనిమిషత్వం పొందాడు. కుమారుని రూపం రాజు మెడలోని మణిహారంలో ప్రతిబింబించింది. అది చూడగా రాజు ఆయనను ప్రీతిరసంతో తాగివేసి కడుపులో పెట్టుకున్నాడా అన్నట్టు ఉంది. రాజు బాష్పగద్గద కంఠంతో సంతోషం పొంగులు వారుతుండగా కుమారునితో ఇలా అన్నాడు. "కుమారా! నీ ఉపదేశం వల్ల అందరికీ హిమాచలమంత సంతోషం కలిగి శుభాలు సమకూరుతున్నాయి. నాకు మాత్రం ఎందుకీ విరహోపదేశమో తెలీకుండా ఉంది. స్నేహంతో, సంతోషంతో, గుణగౌరవంతో నా బుద్ధి బలవంతంగా ఎంత అడ్డగించినా నిలవక నిన్ను ఆలింగనం చేసుకుందామని, ఎప్పుడూ నీదగ్గరే ఉందామని, పాదాభివందనం చేద్దామని, ఒకేమారు ఉబలాటపడి పరుగెత్తుతున్నది. నేను చెప్పే మాట గుణరహితమైనా, విరసమైనా, క్రమం తప్పినా, నీపై నాకున్న చనువుకొద్దీ నీవు వినాలి. స్నేహంలో అవాచ్యమైనదేదీ లేదు. తాపిన నూతన రత్నాలతో మిరుమిట్లు గొలిపే ఈ స్వర్ణభవనాలు వదలి శూన్యవనాలలో ఎందుకు తిరుగుతావు? సుందరులు తమ చేతులలోని బంగారు బిందెలతో సుగంధతోయాలు పోయగా, స్నానం చేసేవాడివి. దుమ్ముపడి ఎండకు కాలిన మరుభూముల నీళ్ళలో ఒంటరిగా ఎలా స్నానం చేస్తావు? రత్నకాంతులీనే కుండలాలు నీ చెక్కిళ్ళపై అందంగా వేలాడడం ఎరుగవా? చంద్రధవళమైన చందనం, సుఖం పరిత్యజించిన నీకు అకస్మాత్తుగా సంతోషం కలిగించడం మానివేసిందా? ఆదిశేషునిలాగ తెల్లని రాజ్జ్వలమైన పెద్ద చాందినీ మంచం పరుపుపై పడుకోవా? లక్ష్మీ నూతనాలింగన భోగానికి యోగ్యమై నవనవలాడే నీ దేహం పాడుపక్కలను ఎలా సహిస్తుంది? కాంతల మందహాస తరంగాలలాగ సున్నితమైన వస్త్రాలు ధరించే నీ శరీరం ఈ నారచీరలకు తగిందా? లీలా కమలం పట్టుకోదగిన నీ చేతికి ఈ భిక్షాపాత్ర ఎలా వచ్చింది? నీ కంఠసీమ సోత్కంఠలైన కాంతల గాఢాలింగనాలకు అర్హమైంది; సంభోగలక్ష్మి సంతోషంగా గడిపినట్టిది.



అలాటి ఇప్పుడు హారాలు కూడా లేక హఠాత్తుగా ప్రణయానికే తలవంపులు తెస్తున్నది. రూపమా, పుష్పచాపుని లజ్జింపజేసేది. ఐశ్వర్యమా మదగజ కుంభాలవంటి చనుగట్టుగల కామినులు సులభంగా లభించేది. వయస్సా రతికి విలాసోపవనం వంటిది. అలాంటప్పుడు ఎందుకూ అనుగుణం కాని ఈ విరాగమెందుకు నాయనా?"

తండ్రి మాటలు విని శీలనిధి అయిన ఆ సుగతదేవుడు చంద్రరేఖవంటి తీగచిరునవ్వుతో నానారాజశేఖరులపై అనురక్త అయిన రాజలక్ష్మికి సిగ్గుకలిగిస్తూన్నాడా అన్నట్టు ఇలా అన్నాడు. "రాజా! జరారోగహతమైన ఈ జీవితం నీటి తరంగ రేఖవలె చంచలం కాకపోతే, విషయాభిలాష కూడ నిరంతరం ప్రహర్షామృతం వర్షించేదిగానే ఉండేది. శమామృతం తాగి తనిసిన వారికి శూన్యవనభూమి స్థిరమైన నివాసం. ఐశ్వర్య లీలా మదవిహ్వలులకు హర్మ్యాలు నివాసమైనవి; అవి చివరికి నశించేవి. రాజులు కుంకుమపూవు కలిసిన జలాలతో స్నానం చేసి ఎల్లప్పుడూ సరాగులవుతారు. సంతోషశీలురు మనోనైర్మల్యం వలె పరిశుద్ధమైన నీటితో స్నానం చేసి విమలురు అవుతారు. కరుణాకులురైన వారి చెవికి అందం విద్యేకాని కుండలాలు కావు. చేతికి అందం దానమేకాని కంకణాలు కావు. దేహానికి అందం పరోపకారమేకాని చందన చర్చలు కావు. ముత్యాలకాంతితో మందహాసం చేస్తున్నట్టున్న ఈ నగలు రాజులు అనుభవించగా మిగిలినట్టివి; మోహంతో ఎందరు వల్లభులనో మభ్యపెట్టినట్టివి. కనుక సజ్జనులకు ఇవి భోగ్యమైనవి కావు. రాజులు రాగాతురులు, శత్రుభయంతో తపిస్తున్నవారు, ధనధ్యానమే ఎప్పుడూ చేసేవారు. అలాటివారికి మెత్తని శయ్యలపై కూడ నిద్రపట్టకపోవచ్చు. కాని, ప్రశాంతుడైనవాడు ఎక్కడ బడితే అక్కడ సుఖంగా నిద్రిస్తాడు. పాము కుబుసంలాంటి అందమైన వస్త్రాలతో అబ్బేది భుజంగవృత్తి. చీవరంతో అబ్బేది సజ్జనవృత్తి. ఈ భిక్షాపాత్రం పవిత్రం, స్నిగ్ధం, అమృత సదృశం అయిన అన్నం ప్రసాదిస్తుంది. రాజులకు ఛత్రాలు వారి ముఖాన్ని ఇతరులు చూడకుండా కప్పిపెడుతాయి. వీవనల గాలి మనస్సును చంచలం చేస్తుంది. హరిచందనంతో ఆర్ద్రమైన ముక్తాహారాలు హృదయానికి రాగసంగమనే రోగం కలిగిస్తాయి. ఐశ్వర్యాన్ని వియోగమనే రోగం వెన్నాడుతూనే ఉంటుంది. కాంతలు క్షణం సేపు అందంగా ఉండేవారు. విలాసమా విరసమైంది. ఈ విధంగా ఎల్లకాలం అపాయం కాపురం చేసే భోగాన్ని ఎవరు సంతోషంతో అనుభవిస్తారు? భోగోపభోగం విషప్రయోగం లాగ ఒంటిని మొద్దుబారజేస్తుంది; ఎప్పుడూ జృంభాలను (ఆవలింతలను, విజృంభణను) కలిగిస్తుంది. ఇంకా ఇంకా అనుభవిద్దామనే నోరూరా జేస్తుంది. సుఖ సంపద నవచంద్ర రేఖవంటిదని, యౌవనం ప్రభాత కుసుమం వంటిదని, ఈ శరీరం కర్మోర్మిమాలలతో కొట్టుమిట్టాడేదని గ్రహించి నేనీ అనురాగం వదలి పెట్టాను. కదిలే చామరాలతో, రెపరెపలాడే ధ్వజపుంజాలతో, తోకలల్లార్చే గుర్రాలతో, చెవులు కదలిస్తూ తాళాలు వేసే ఏనుగులతో పాటు రాజ్యలక్ష్మి స్వభావ చంచల. ఈ విలాసాలన్నీ క్షణభంగురాలు." బుద్ధదేవుడు శుద్ధోదనుని క్షేమం కోరి ఆయా మాటలు చెప్పి, ఆయనకు మహోత్కృష్టమైన చిత్తసంతోషం కలిగించి శాంతిసుధాపూరం ప్రవహించే చూపుతో అక్కడ సమావేశమైన జన పరిషత్తును చూచాడు.

తర్వాత బుద్ధదేవుడు శాక్యకులంలో పుట్టిన బుద్ధిమంతులు డెబ్బై వేలమందికి ధర్మం బోధించాడు. ఏడువేలమందిని శమగుణ విశేషవంతులనుగా చేశాడు. శాక్యగణంలో కుశలమార్గం పొందిన శుక్లోదనుడు మొదలైనవారు, ఆ గణసంఖ్యకు సమానమైన వేలమంది ద్రోణోదనుడు మున్నగువారు,

అమృతోదనుడు మున్నగువారు గొప్ప చిత్తశాంతిని పొందారు. ఆయన ఉపదేశం వల్ల కొందరు శ్రావకబోధి కలవారు, మరికొందరు ప్రత్యేకబోధికలవారు, ఇంకా కొందరు సమ్యక్సంబోధి నిరతులు, మరికొందరు అనుత్తర బోధిసక్తులు, ఇంకా కొందరు గగన ప్రసన్నులు అయ్యారు. కొందరికి స్రోతః పరిప్రాప్త ఫలం, ఇంకా కొందరికి సకృదాగామి ఫలం, మరి కొందరికి అనాగామి ఫలం, తక్కినవారికి క్లేశవిముక్తిగల అర్హత్ ఫలం సిద్ధించాయి.

ఆ పరిషత్తులో పాపశాపాల రాశి, పేర్చిన అజ్ఞానంతో మోహాంధకారం ప్రబలినవాడు అయిన దేవదత్తుడనే శాక్యుడు అక్కడివారు సత్యమార్గం అనుసరించడం చూచి, "ఇదంతా మాయ. రాజుకింకా పుత్రవాత్సల్యం పోలేదు. పుత్రుని అభివృద్ధికి విర్రవీగిపోతున్నాడు" అని గేలి చేశాడు. అది చూచి మౌద్గల్య భిక్షువు జినశాసనంతో ఆ పాపరాశికి మహాద్భుతాలు ప్రదర్శించి అతని మదం అణచి వేశాడు. రాజు భగవానుని ప్రభావం చూచి అద్భుతమేమీ కాదని, సామాన్యమైన పురుషకారమేనని అనుకున్నాడు. నిజమే మరి! ఉత్కర్షకృత్యాలు పదిసార్లు చూచి అలవాటయితే ఆశ్చర్యం కలగదు.

మరుసటిదినం భగవానుడు సురేంద్రుడు తెప్పించిన మేరు పర్వతశిఖర సమాన కాంతిగల కనకమయ విమానంలో రత్నమయమైన సింహాసనాన్ని అధిష్ఠించాడు. మహాకాంతిమంతులయిన బ్రహ్మేంద్రాది దేవతలు బారులు తీరి కూర్చున్నారు. వారి తలపాగాల తురాయీలు దిక్కులకు చంద్రకిరణ మాలికలు కట్టినట్టు ప్రకాశించాయి. శుద్ధోదన మహారాజు అక్కడికి వచ్చాడు. భగవానుని దర్శనానికి వస్తున్న దేవతలతో ఆ విమానం కిటకిటలాడుతున్నది. ఒకరిని ఒకరు తోసుకుపోవడంవల్ల వారి హారాలు కదలిపోతున్నాయి. ఇలా దేవతలతో క్రిక్కిరిసిన విమానం నాలుగు ద్వారాలలోను రాజు ప్రవేశించడానికి అవకాశం కలుగలేదు. అప్పుడు కుబేరాది దేవతలు కనుబొమల సైగతోనే అడ్డుగా ఉన్నవారిని తప్పుకోమని చెబుతూ రాజును ఇష్టంతో లోపలికి పిలుచుకొని వచ్చారు. ఆయన అక్కడి వైభవం చూచాడు; నోటమాట లేదు. వెర్రివానివలె కళాకాంతిలేని ముఖంతో అప్రతిభుడైపోయాడు. తర్వాత చాలసేపటికి జినశాసనంతో వారు ఆయనను ముందుకు తీసుకొని వచ్చారు. ఆయన తలవంచి ప్రశాంత మనస్సుతో నమస్కరించి జినదేవుని ముందు నిలబడ్డాడు. అప్పుడు బుద్ధభగవానుడు చతురార్య సత్యప్రబోధకమైన ధర్మోపదేశం చేశాడు. అది అపూర్వజ్ఞానంతో శుద్ధోదనుని వింశతి శృంగమైన సత్కాయదృగ్భూధరాన్ని కూడా కూల్చి వేసింది.

పిదప శుద్ధోదనుడు తన జన్మ సార్థకమైనదని భావించి, శాక్య నగరానికి తిరిగి వెళ్ళి శుక్లోదనునితో "ఇక, రాజ్యభారం నీవు స్వీకరించు" అని కోరాడు. శుక్లోదనుడు "భగవానుని ఉపదేశాన్ని ఆచరించి సంతోషపెట్టగలను గాని, రాజ్యాన్ని కాదు" అని సమాధానం చెప్పాడు. అది విని శుద్ధోదనుడు ద్రోణోదనుని అడిగాడు. అతడు కూడా రాజ్య పరాఙ్ముఖుడు కాగా, అమృతోదనుని కోరాడు. అమృతోదనుడు కూడ వైరాగ్యయోగంతో రాజ్యం నిరాకరించగా, భద్రకుడనేవాడు శుద్ధోనుని కోరికను కాదనలేక రాజ్యలక్ష్మిని స్వీకరించాడు. తర్వాత శుద్ధోదనరాజు శుచిగాను, ప్రీతితోను రాజార్హమైన భోగాలతో జినదేవుని పూజించి ఆతనికి న్యగ్రోధారామం దానం చేసి, శుద్ధమనోరథుడయ్యాడు. శుద్ధోదనుని ఆజ్ఞతోను, తల్లిప్రేరణతోను ద్రోణోదనుని కుమారులిద్దరిలో అనిరుద్ధుడనేవాడు సన్న్యసించాడు. మహానుడనే రెండవవాడు గృహి అయ్యాడు.



రాజ్యం చేస్తున్న భద్రకునికి కూడా విరక్తి కలిగి వనవాసం చేయాలనే అభిలాష కలిగింది. వివేకవంతుల ప్రశమాభిలాషయుతమైన మనస్సును నూతన సంపద కూడ అడ్డగించదుగదా! దేవదత్తునికి రాజ్యాభిషేకం చేసుకోవాలనే మనసు ఉందని తెలుసుకొని భద్రకుడు అతణ్ని పిలిపించి "నాకు ప్రవ్రజ్యాదీక్షాకాలం సమీపించింది. ఏమంటావు? రాజ్య పరిపాలనభారం స్వీకరిస్తావా?" అని ప్రశ్నించాడు. దేవదత్తునికి తను చాల వివేకవంతుడనే దంభం ఎక్కువ. కనుక సభలో తన మనోభిప్రాయం మరుగుపరచి "రాజా! రాజ్యంపై నాకు అభిలాష లేదు. ప్రవ్రజ్య స్వీకరించి నీవంటివాణ్నే అవుతాను" అని డంబంగా పలికాడు. భద్రకుడు దొంగవినయం చూపే ఆ కుటిలుని మాయ మాటలు విని "ఇదిగో! నీ సంకల్పానికి శాక్యగణమే సాక్షి" అన్నాడు. ఆ మాటలకు దేవదత్తుడు అదరిపోయాడు. అతనికి అర్థతాపం, భోగానురాగం ఇంకా తీరలేదు. కనుక "అయ్యో! ఎందుకు అకస్మాత్తుగా ఇలా అన్నాను. సన్న్యసించిన తర్వాత కూడా రాజ్యం పొందడం అయ్యేనా?" అని మనసులో కుమిలాడు.

పిదప భద్రకుడు మొదలయిన రాజకుమారులు తమతమ రాజ్యాలు వదలి ఆర్యవృత్తప్రీతిగల శుద్ధోదనుణ్ని ముందు పెట్టుకొని రథ గజాది సైన్యం వెంటరాగా, శాక్యదేవుణ్ని దర్శించబోయారు. ఇలా అందరూ వెళ్ళుతూ ఉండగా డేగ రక్తసిక్తమైన మాంసం ముద్దను అపహరించినట్టుగా దేవదత్తుడు రాజకిరీటంలోని పద్మరాగమణిని, తన ప్రభాంకురాలతో సూర్యునిలాగ వెలుగుతున్నదానిని, తస్కరించాడు. దానిని తస్కరించినవానికి ఘోరనరకం తప్పదని జ్యోతిష్కులు శకునం **చెప్పారు. దా**నిని విని దేవదత్తుడు ఆందోళన పడ్డాడు. తప్పు చేసినవానికి మనసులో ఉలుకు ఉండనే ఉం**టుంది. అదే** వానికి దుర్నిమిత్తం. తక్కిన శకునాలు. దుర్నిమిత్తాలు దానికి పునరుక్తాలే కాని మరేమీ కావు. శాక్యసింహుని సన్నిధి చేరిన తర్వాత భద్రకుడు శుద్ధోదనునికి సంతోషం కలిగిస్తూ దేవదత్తుడు మొదలయిన వారితో సహ చీవర భిక్షాపాత్రలు ధరించి ప్రవ్రజ్యను స్వీకరించి భూమినే వైరాగ్యమయిగా చేశాడు. విరాగంతో తమ హారాంగద కుండలాది ఆభరణాలు తీసివేసిన శుద్ధోదనుని కేశపాశాన్ని, రాజకుమారుల కేశపాశాన్ని ఉపాలి అనే నాపితుడు కన్నీళ్ళు నింపుతూ తీసివేశాడు. ఆ కల్పకుడు(నాపితుడు) మూర్ఖుడు, నిమ్నకులజుడూ అయినప్పటికీ జినాజ్ఞతో ప్రవ్రజ్యను స్వీకరించి పూజ్యుడయ్యాడు. ఉత్తమచిత్త ప్రసాదానికి పాండిత్యం, జాతి కారణం కావుగదా! సంఘాన్ని శరణు పొందేటప్పుడు ఆ సంఘంలో కల్పకుడు కూడా ఉండడం భద్రకుడు చూచి "రాజునై ఉండి ఈ నిమ్నుని పాదాలకు ఎలా నమస్కరించడం?" అని అనుకొని కదలకుండా ఉన్నాడు. రాజదర్పం, అహంకారం ఇంకా సడలక సంశయాత్ముడైన భద్రకుణ్ని భగవానుడు చూచి నవ్వుతూ "ప్రవ్రజ్యతో మోహమహానుబంధం గల జాత్యభిమానం తొలగాలి" అన్నాడు. భద్రకభూపతి ఆ మాట విని రాజపుత్రనితో సహా ప్రణామం చేశాడు. అప్పుడు పృథివి కంపించింది. భగవానుడు హితవు చెప్పినప్పటికీ పరుషవాక్కయిన ఆ దేవదత్తుడు మాత్రం నమస్కరించలేదు.

భద్రకుడు నమస్కరించినప్పుడు భూమి కదలినందుకు భిక్షుగణం ఆశ్చర్యపడి, "దానికి కారణమేమిటి?" అని ప్రశ్నించింది. "ఈ రాజు మునపటి జన్మలోను ఉపాలి అనే ఈ కల్పకునికి ప్రణామం చేశాడు" అంటూ భగవానుడు ఆ గాథ తెలిపాడు. "పూర్వం కాశీపురంలో భద్ర అనే వేశ్య ఉండేది. దానికి సుందరకుడనే యువకుడు సేవ చేసేవాడు. వాడు చాల దరిద్రుడు. రాగమనేది సర్వవ్యసనాలను నేర్పుతుంది మరి! ఒకమారు ఆ గణిక అతనిని పూలు కోసుకొని రావడానికి పంపించింది. అతడు ఆమె

సమాగమ మనోరథంతో తుమ్మెదవలె కొత్తకొత్త పూలు కోసుకోనే ఆశతో అరణ్యంలో తిరుగుతూ అలసిపోయి ఒక గీతం పాడుకున్నాడు. ఈలోగా వేటకు అడవికి వచ్చిన బ్రహ్మదత్త మహీపాలుడు తిరుగుతూ అలసి సొలసి అక్కడికి చేరాడు. అప్పుడతడు సుందరుడు పాడుతున్న "ఓ మధుకరమా! కొత్తకొత్త పూలకోసం ఆశపడి ఎందుకు తాపం పొందుతావు? త్వరగా వెళ్ళు. వికసించిన కమలాననం గల కమలిని సాయంకాలం కాగానే ముకుళిస్తుంది" అనే గీతాన్ని తీగపొదలచాటునుంచి విన్నాడు. విని ముందుకు వచ్చి, మందహాసకాంతిని తాను ధరించిన హారాలకాంతితో కలుపుతూ "మిత్రమా! ఈ ఎర్రటి ఎండలో ఈ గీతరసాభియోగమేమిటి? అని ప్రశ్నించాడు. "భూమిపతీ! సూర్యుడు తాపకరుడు కాడు; కాముడు అంతకన్నా హెచ్చు తాపం కలిగించేవాడు. స్వకర్మ దుఃఖమే ఈ ప్రపంచంలో మానవునికి కష్టం కలిగిస్తుంది గాని ఎండకు కాగిన మరుభూములు కావు" అని సుందరకుడు సమాధానం చెప్పాడు. ఆ అర్థవంతమైన మాటలు విని రాజుకు అతనిపై ప్రీతి ఏర్పడింది. సంభాషణలో మనస్సును తాకే సుభాషితం ఎవరి ఆదరాన్ని పొందదు?

"పిదప ఆ సుందరుడు ఆ నిర్జనారణ్యంలో శ్రమపడి ఉన్న ఆ రాజుకు శీతలోపచారాలతో అలసట పోగొట్టాడు. రాజు ప్రసన్నుడై కృతజ్ఞతతో అతనిని తనవెంట తన రాజధాని అయిన వారణాసికి పిలుచుకొని వెళ్లి, తనకు కారడవిలో నీళ్ళిచ్చి ఉపచారం చేసి, ప్రాణదానం చేశాడనే సంతోషం మనసులో ముప్పిరిగొనగా, నా మనస్సు తెలిసి వర్తించిన ఇతనికి ఏమి ఇద్దామని ఆలోచించి, అర్ధరాజ్యం ఇవ్వడానికి ఉద్యుక్తుడుకాగా, సుందరకుడు "భద్ర లేకుండా ఈ సుఖం ఎందుకు? ఆమె ప్రీతిసుధతో అభిషిక్తుడైనవాడే ధన్యుడు. ఇంతకూ, ఈ అర్ధరాజ్యమేమిటి? కొంచెమైనప్పటికీ అఖండితంగా ఉండే సంపదే మెరుగు. పూర్తి రాజ్యమే ఉండాలి. ఒక్క రాజ్యానికి ఇద్దరు రాజులుంటే ఎప్పుడూ వివాదాలు ఏర్పడుతూ ఉంటాయిగదా. ఒక భోగ్యానికి భోక్తలు ఇద్దరుంటే ఇక కలహమే రూపు తీర్చుకుంటుందన్నమాట. కనుక ఈ నృపతిని చంపివేసి, సమస్తరాజ్యం గ్రహించి సంపూర్ణుడవుతాను" అని ఆలోచించాడు. కాని మరుక్షణంలోనే అతనికి తీవ్రమైన పశ్చాత్తాపం కలిగింది. మరల ఈ విధంగా ఆలోచించాడు. "అయ్యో! నాకు ఎలాటి నింద్యమైన ఆలోచన కలిగింది? ఏమిటీ దౌర్జన్యం? ఇలా కృతఘ్నుతతో సంకల్పించడం మహాపాపం కదా. ఈ కళంక లేపం వల్ల మనస్సే లజ్జ పడాలి కదా! రాజ్యానికి స్వస్తి. సుఖాలకొక నమస్కారం. సమ్మోహానికి తల్లి అయిన లక్ష్మి క్షమించనీ. అనుభవమూ ఆలోచనా లేనివారికి ఈలాటి దుర్బుద్ధి పుట్టడం మొదటి స్వభావం. సంపద విషవల్లివలె వాసన చూడగానే మానవులకు మైకం కలిగిస్తుంది; మూర్ఛ వచ్చేట్టు చేస్తుంది; కండ్లకు చీకట్లు కమ్మేట్టు చేస్తుంది." ఈ విధంగా సుందరకుడు రాత్రల్లా ఆలోచించాడు. ఆతని మనస్సు పరిశుద్ధమైంది. దానితో ప్రత్యేకబోధి పొందాడు.

ఉదయం రాజు తను ఆలోచించిన ప్రకారం అర్ధరాజ్యం స్వీకరించవలసిందని సుందరకుని చాల బ్రతిమాలినాడు. తృష్ణ తొలగిన ఆ సుందరకుడు రాజ్యం స్వీకరించలేదు. మహానుభావుడైన ఆ రాజు అతన్ని ప్రత్యేకబుద్ధభావం పొందినవాణ్నిగా క్రమంగా గుర్తించి ఆతని పాదపద్మాలపై తన సిగపూలదండలు జీరాడేటట్టు దండప్రణామం సమర్పించి తనచిత్త ప్రసాదానికి అనుగుణంగా ఇలా విన్నవించాడు. "సత్కర్మ విపాకంతో పుట్టి శమగుణాన్ని పట్టాభిషేకం చేసుకొనే వివేకం నమస్కారార్హమైనది. దాని ప్రభావంతో మానవులు వీతరాగులై రత్నాకర మేఖల అయిన భూమిని కూడ త్యజించగలుగుతారు." సుందరకుడు రాజు



మాట విని, ఆయన అభ్యర్థనపై ధనం స్వీకరించి గంగపాలుడనే పేరుతో అతనికి అంతరంగ సేవకుడై శాంతిపదం పొందాడు. పిదప ఉత్తమ కర్మప్రాప్తితో అతడు సన్న్యసించి, సజ్జన పూజ్యతను పొందాడు. రాజు ఆయనకు వందనం ఆచరించాడు. అప్పుడు కూడా భూమి ఆరు విధాలుగా కంపించింది. అప్పుడు వందనం ఆచరించిన బ్రహ్మదత్తుడే ఈ భద్రకుడు. అప్పుడు రాజుకు కుశలం కలిగించిన గంగపాల కల్పకుడే ఈ ఉపాలి.!

ఈ విధంగా భగవానుడు తెలిపిన ఆశ్చర్యోదంతాన్ని భిక్షువులు విని కుశలప్రాప్తికి స్వచ్ఛమైన చిత్తమే హేతువని భావించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పితాపుత్ర సమాదానావదానమనే ఇరవై రెండవ పల్లవం.

# 23. విశ్వాంతరావదానం

చింతామణి కన్నా అధిక కాంతులు విరజిమ్ముతూ అపూర్వ ప్రభావంతో వెలిగే పురుషమణులుంటారు. సత్త్వగుణధనులైన అలాటివారు తమకు ప్రియమైన దారపుత్రాదులను దానమిచ్చినప్పటికీ, ముఖంలో కొంచెమైనా దైన్యరేఖ పొడగట్టనివ్వరు. అలాటి సర్వలోకానింద్యులు అందరికీ వంద్యులవుతారు.

జినభగవానుడు ఒకమారు శాక్యపురంలో విహరిస్తున్నప్పుడు దేవదత్తుని ప్రసక్తి ప్రసంగవశాత్తు వచ్చింది. అప్పుడు భిక్షువులు కోరగా భగవానుడు అతని పూర్వవృత్తాంతం ఈ విధంగా తెలిపాడు.

పూర్వం లక్ష్మికి విశ్వాస వసతిగా, విశ్వోపకారం చేయదలచిన సుకృతానికి జన్మభూమిగా ఉన్నట్టి విశ్వ అనే పట్టణం ఉండేది. ఆ పట్టణాన్ని సంజయుడనే రాజు ఏలేవాడు. అతడు శత్రువులనే చీకట్లను పారదోలే సూర్యునివంటి పరాక్రమశాలి; ప్రజానయనాలకు ఆనంద సుధానిధి. ఆతని చరితం కూడ విచిత్రం. అతనికి విశ్వంతరుడనే కుమారుడు ఉండేవాడు. ఆయన చాల వదాన్యుడు. ఆ అపూర్వత్యాగి తన దానగుణంతో కల్పవృక్షకీర్తిని కూడ అపహరించాడు. ఆయన చాల చతురుడు గనుక సరస్వతి, లక్ష్మి, బుద్ధి పరస్పరం అసూయ పడకుండా సరస్వతిని సత్యంతో, లక్ష్మిని దానంతో, బుద్ధిని విద్యతో అలంకరించాడు. ఆయన సత్యవాక్య పరిపాలకుడని, దానశీలుడని, విద్యావివేకవంతుడని కీర్తి దిగంతాలకు వ్యాపించింది. మొగలిచెండులోపలి చిన్న రేకుల పొట్టల విశదసుందరమైన ఈ కీర్తి దిక్కాంతలకు కర్ణావతంసమైంది.

ఆ విశ్వంతరుడు ఒకమారు ఒక అర్థికి విజయసామ్రాజ్య మనోరథాన్ని హరించే కాంతులీనుతూ దివ్యరత్నాలంకారశోభితమైన రథాన్ని దానం చేశాడు. ఆయన ఈ విధంగా రథాన్నే దానం చేయడం చూచి ప్రజలు ముక్కుపై వేలు పెట్టుకున్నారు. తండ్రి అయిన విశ్వమహారాజు సంతోషం తరిగి చింతాక్రాంతుడై మహామాత్యులను పిలిపించి, మహోద్వేగంతో, చింతాకుల మనోరథంతో ఇలా అన్నాడు: "కుమారుడు శత్రువులను ఓడించే జైత్రరథాన్ని దానం చేశాడు. దాని ప్రభావంతోనే మనం మహారథులున్న సైన్యం సంపాదించాము. శౌర్యప్రదమైన ఆ రథం వల్ల జయకుంజమైన కుంజరం వల్ల నా సిరి స్థిరంగా నిలిచింది." రాజు మాటలు విని మంత్రులు ఇలా విన్నవించారు. "దేవా! ఈ దోషం మీదే. మీరు కుమారునిపై వాత్సల్యంతో పొరపాటు చేశారు. ధర్మం ఎవరికి హర్షం కలిగించదు? దానం ఎవరికి సమ్మతం కాదు? కాని, చెట్టును మొదట్లోనే కొట్టివేస్తే, ఫలాభిలాషులు వ్యర్థంగా తిరిగి పోవలసివుంటుంది. ఆ రథాన్ని దానం తీసుకున్న బ్రాహ్మణుడు పరదేశంలో అమ్మివేశాడు" అని మంత్రులందరూ బాణాహతులవలె కష్టపడ్డారు.

ఇలా ఉండగా ఒకమారు సుకృత పరిపాకం వలె హృదయాలకు ఆనందం కలిగించే మదనోత్సవమైన వసంత ఋతువు వచ్చింది. ప్రేయసీ ప్రియులకు స్వయంగ్రహాశ్లేష సుఖం ప్రసాదిస్తూ మధుకరార్థులకు



మధుదానం చేస్తున్న వసంతుని కీర్తులా అన్నట్టు పుష్పవనాలు వికసించి జగత్తు తెల్లబడింది. అప్పుడ అర్థి కల్పతరువైన ఆ రాజకుమారుడు రాజవర్ధనమనే ఏనుగెక్కి వికసించిన తరులతాదులను చూడడానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో సామంత నృప ప్రేరితులైన కొందరు బ్రాహ్మణులు అతనిని చూచి స్వస్తి వాచన పురస్సరంగా ఇలా అన్నారు. "రాజకుమారా! నీవు ఈ లోకంలో జంగమమైన చింతామణివని పేరు పొందావు. నిన్ను చూడగానే సిరి అర్థులను గాఢాలింగనం చేసుకుంటుంది. ఈ ఉత్తమ జన్మలో ప్రపంచంలో ఇద్దరి గొప్పదనమే అందరూ చెప్పుకొంటారు. వారిలో మొదటివాడు దానజలార్ద్రహస్తుడైన నీవు. రెండవది దాన(మదం) జలార్ద్ర హస్తం (తొండం)తో స్థిర సంపదగల గజరాజు. ఓ పుణ్యోదార! కుంజరాన్ని మాకు దానం చేయి. మరొకదాత యిలాటి దానం చేయలేడు." బ్రాహ్మణులు ఈ విధంగా యాచించగానే ఆ రాజుకుమారుడు శంఖధ్వజ చామరాంకితమై సజీవమైన సామ్రాజ్యంలాగ ఉన్న ఆ ఏనుగును వారికి దానం చేశాడు. ఇలా బోధిప్రధానమైన ప్రణిధానంతో విమలచిత్తుడైన రాజకుమారుడు రథాన్ని, ద్విపాన్ని దానం చేసి ఆనందనిర్భరుడయ్యాడు. జయకుంజరమని విఖ్యాతిగన్న తన భద్రగజాన్ని కుమారుడు దానం చేసినందుకు రాజు చాల విచారపడి ఇక రాజ్యలక్ష్మికి రక్షణ లేదని భావించాడు. తను రాజ్యభ్రష్టుడు కూడ అవుతానేమోనని భయపడి, కోపం చేసుకొని కుమారుణ్ని పట్టణం నుంచి వెళ్లగొట్టాడు.

రాజకుమారుడు తండ్రికి నమస్కరించి భార్య అయిన మాద్రిని, జాలి అనే కుమారుణ్ని, కృష్ణ అనే కుమార్తెను పిలుచుకొని అరణ్యానికి వెళ్ళాడు. అరణ్యంలో కూడ తన వద్ద మిగిలిన వాహనాదికం అర్థులకు ఇచ్చివేశాడు. గొప్పవారికి సంపత్తులోను, విపత్తులోను సత్త్వగుణం సమంగానే ఉంటుంది. ఒక్కనాడు మాద్రి కందమూల ఫలాలు తేవడానికి వెలుపలికి వెళ్ళింది. అప్పుడొక బ్రాహ్మణుడు రాజపుత్రుని వద్దకు వచ్చి "మహానుభావా! నాకు పరిచారకులెవరూ లేరు. నీవు సర్వస్వదాత అని పేరు పొందావు. కనుక సమర్థులైన నీబాలబాలికలిద్దరినీ నాకు దానం చేయి" అని కోరాడు. విశ్వంతరుడు ఈ మాట విని ముందు వెనకా ఆలోచించకనే తనకు ఇష్టమైన ఆ యిద్దరినీ వెంటనే ఆ బ్రాహ్మణునికి దానం చేసి, వారి వియోగ వ్యథను ఎలాగో భరించాడు. లోకంలో ధనం, పుత్రులూ, భార్య అందరికీ ఇష్టమే కాని, దయావంతులైన వదాన్యులకు దానంకంటే ప్రియమైంది మరొకటి లేదు. కొంతసేపటికి కందమూల ఫలాలు తీసుకొని మాద్రి వచ్చింది. తన కుమారుడు, కుమార్తె కనిపించలేదు. పుత్రవత్సల అయిన ఆమె తల్లడిల్లి భర్త ఎదుట మూర్ఛపడింది. ఆమె మూర్ఛతేరిన తర్వాత భర్త పుత్రదాన వృత్తాంతం తెలియజేశాడు. ఆమె అది విన్నంతనే, శోకాగ్ని తప్తురాలై, పెద్దగా విలపించింది. ఆమె మనస్సులో అపత్యస్నేహ దుస్సహమైన దుఃఖాగ్ని ప్రియునిపైగల ప్రేమతోనా అన్నట్టు లోలోపల పుటపాకం చెందినట్టయింది.

ఈలోగా రాజకుమారునికి మరొక పరీక్ష వచ్చింది. సురపతి అతని వదాన్య నిష్ఠను పరీక్షించగోరి బ్రాహ్మణవేషంతో అతని వద్దకు వచ్చి "ఓమహాదాతా! నాకు దాసీలెవరూ లేరు. నీవు నీ భార్యను నా పరిచర్యకోసం దానం చేయి" అని యాచించాడు. సత్త్వగుణ సాగరుడైన ఆ రాజకుమారుడు వియోగదుఃఖాన్ని వివేకంతో అణచుకొని, స్వకీయ జాయను వెంటనే అతనికి ధారపోశాడు. మాద్రి భర్త తనను అకస్మాత్తుగా దానం చేసినందుకు దెబ్బతిన్న జింకలాగ బెదరిపోయింది. అది చూచి రాజకుమారుడు ఆమెకు మనసులో బోధివాసనను కలిగిస్తూ ఇలా అన్నాడు. "ఓ కల్యాణి! ఊరడిల్లు.

దుఃఖపడవద్దు. ప్రియసంగమం కలలోని ప్రేమవలె అసత్యమైంది. ఈ బ్రాహ్మణునికి శుశ్రూష చేస్తూ, బుద్ధిని ధర్మంలో ప్రవర్తింపజేయి. ఈ అస్థిరలోకయాత్రలో సజ్జనులకు ధర్మమే శాశ్వతమిత్రం. సజ్జనులైన స్వజనాన్ని చూచాను. బంధువుల స్వభావాలు చూచాను. క్షణమాత్రమే పరిమళించి వాడిపోయే మిత్రులనే పూలహారాలను మెడలో వేసుకొని అనుభవించాను. దారాపుత్రులకోసం యౌవనాన్ని, జీవితాన్ని నిరంతరం గడిపాను. ధర్మంకంటే ఆప్తుడైన, స్థిరపరిచయంగల మిత్రుడు లేడు." రాజకుమారుడు ఈ విధంగా ఆమెకు హితవుతో ధైర్యం చెప్పి తన మనస్సును కూడా కుదుటబరచుకొన్నాడు. అప్పుడు లోభపరిత్యాగం వల్ల ఆయన ముఖం అపూర్వ కాంతితో భాసించింది. ఆ సమయంలో వియోగశోక వికల అయిన మాద్రిని చూచి శచీపతి మనసు కరిగింది. అతడు నిజరూపంతో ప్రత్యక్షమై "పుత్రీ! దుఃఖపడవద్దు. నేను త్రిదశేశ్వరుణ్ని. యాచకులకు నిన్ను ఈయన దానం చేస్తాడని తెలిసే, నేను వచ్చి నిన్ను దానమిమ్మని కోరాను. ఇప్పుడు నా దానివైన నిన్ను నీ భర్తవద్ద న్యాసంగా(కుదువగా) భద్రపరుస్తాను. ఇక ఈయన నిన్ను మరెవ్వరికీ దానం చేయడానికి వీలు లేదు. పరుల సొమ్మును ఇతరులకు ఎలా ఇస్తాడు? నీవు నీ కుమారునితోను, కుమార్తెతోను కలుసుకొనడానికి కూడా తప్పక ఏర్పాటు చేస్తాను" అని చెప్పి, మాయమైపోయాడు.

అక్కడ ఇద్దరు పిల్లలను దానం తీసుకొని వెళ్ళిన బ్రాహ్మణుడు విశ్వుని పట్టణానికి వెళ్ళి, ధనాశతో వారిద్దరినీ అమ్మచూపాడు. విశ్వుడు వారు రాజకుమారుని సంతానమని తెలుసుకొని కన్నీరు నిండగా, చాల ధనమిచ్చి వారిని స్వీకరించాడు. కాలక్రమాన విశ్వమహీపతి పరలోకం చేరగా, పౌరులు అమాత్యగణం కోరడం వల్ల ఆ రాజ్యాన్ని విశ్వంతరుడు స్వీకరించాడు. కాని అతడు రాజ్యవిషయాలలో విరక్తుడై దానమే వ్యసనంగా ఉండేవాడు. అతని సత్త్వగుణ ప్రభావంతో ప్రజలందరూ ఐశ్వర్య సంపన్నులై యాచకుడనేవాడే లేకపోయాడు. ఆయన ధనంతోనే పూర్వవైభవం పొందిన ఆ జంబుకుడనే బ్రాహ్మణుడు కృతఘ్నుడై ఈ సంపదంతా నా ప్రభావం వల్లనే కలిగిందని ప్రజలతో అన్నాడు. ఆ విశ్వంతరుణ్ని నేనే. ఆ ద్విజుడే ఈ దేవదత్తుడు.

ఈ విధంగా దేవదత్తుని పూర్వజన్మ కథనంతో భగవానుడు భిక్షువులకు దానోపదేశం చేశాడు.

దానమనేది మానవులకు ఘోరాఖాత పతనంలో పట్టుగొమ్మ; గాఢాంధకారం కమ్మినప్పుడు దారి చూపే వెలుగు; దుస్సహ దుఃఖసమయంలో ఊరట; పరలోకంలో బంధువు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో విశ్వాంతరావదానమనే ఇరవైమూడవ పల్లవం.

# 24. అభినిష్క్రమణావదానం

సూర్యుడు సకలలోకాలోక సృష్టికోసమే ప్రకాశిస్తాడు. చంద్రుడు ఇతరులకు శ్రేష్ఠమైన అమృతం ప్రసాదించడం కోసమే సంపూర్ణుడవుతాడు. ఈ విశాల జగత్తులో ప్రాణికోటి తరించడానికి విపుల కుశలసేతువుగా ఒకానొకడు పవిత్రమైన జన్మ స్వీకరిస్తాడు.

పూర్వం శాక్యపురాన్ని శుద్ధోదనుడనే శ్రీమంతుడైన రాజు పరిపాలించేవాడు. ఆయన కీర్తి చంద్రునికి పుట్టినిల్లైన రెండవ సుధాసింధువుగా ఉండేవాడు. ఖలులను ఆశ్రయించడమే లక్ష్మి స్వభావం. కాని అద్భుతకర్మలు చేసే ఆయన పరిపాలనలో లక్ష్మి గుణగణాలను ప్రేమించేది అయి గుణపక్షపాతిని అయింది. ఆయన ధవళకీర్తులు అఖిల దిక్కులతోను, తీర్థాలతోను, వనాలతోను వ్యాపించి వివేకవంతులలాగ ఇప్పటికీ మునివ్రతం ఆచరిస్తున్నవా అన్నట్టు ఉన్నాయి. ఆ రాజును చూస్తే విశ్వకర్మకుమారుడు శుద్ధమాత(బాగా కొలిచేవాడు= శుద్ధోదనుడు) అవుదామని పూర్వం ప్రణిధానం చేసి అమలకాంతులతో మర్త్యలోకంలో అవతరించాడా అన్నట్టు తోస్తుంది. సత్పురుషునికి కీర్తివలె, చంద్రునికి కుముద్వతివలె ఆయనకు మహామాయ అనే దేవేరి ఉండేది.

ఆ మహామాయాదేవి ఒకరాత్రి తెల్ల ఏనుగు ఆకాశమార్గంలో వచ్చి తన గర్భంలో ప్రవేశించినట్టు, తాను పర్వతం ఎక్కిపోయినట్టు, మహాజనులు తనకు నమస్కారం చేస్తున్నట్టు కలగన్నది. అప్పుడు తుషితదేవలోకంనుంచి బోధిసత్త్వుడు లోకానుకంపతో ఆమె గర్భంలో ప్రవేశించాడు. భువననందనుడైన బోధిసత్త్వుణ్ని గర్భంలో ధరించిన ఆ మహామాయాదేవి చంద్రుడు లోపల ఉన్న క్షీరసముద్ర వేలలాగ, దౌహృదచిహ్నాలతో, పాండురకాంతితో ఒప్పారింది. ఇక్ష్వాకు రాజవంశ్యుడైన ఆ బోధిసత్త్వుణ్ని గర్భంలో ధరించిన ఆమె నిధిని కడుపులో పెట్టుకున్న భూమాతవలె శుభలక్షణాలతో కనిపించింది. ఆమెను వేవిళ్ళు కూడ వింతగానే కలిగాయి- దానం చెయ్యడం , పుణ్యకర్మలు సలుపడం వంటివి. నిజమే! సహకర సౌరభం అంకురావస్థలోను అనుమానం లేనిదికదా! ఆమె నవమాసాలు గడిచిన తర్వాత లుంబినీవనంలో అదితి దివాకరునిలాగ ఒక నిండైన కుమారుణ్ని కనింది. ఆ కుమారుడు తల్లిగర్భకోశంలోని మావి తాకకుండా, గర్భం భేదించుకునిఆవిర్భవించాడు. ఆమె అతని ప్రభావం వల్ల సహజంగానే ప్రసవవేదన తొలగి, స్వస్థశరీరురాలయింది. వజ్రసారాంగుడైన ఆ శిశువు మాతృగర్భం నుంచి ఆవతరిస్తున్నప్పుడు అతని శక్తి తెలుసుకొనడానికి శక్రుడు క్షణంసేపు అపాడు. కాని, అంతకుమించి ఆపలేక పోయాడు. ఆ శిశువు పుట్టీపుట్టగానే, ఏడు అడుగులు ముందుకు నడిచి, నాలుగు దిక్కులనూ పరికిస్తూ సుస్పష్టంగా "ఈ నిర్వృతి పూర్వం(ప్రాచీనం), లోకంలో దీని గతి దక్షిణం (సమర్థం), ఈ జాతి పశ్చిమం(వెనుకటిది), ఈ నిర్వృతి సంసారంకంటే ఉత్తరం(శ్రేష్ఠం)" అని అన్నాడు. ఇలా అంటున్న ఆ అక్షయబలుడైన జగద్గురువును ధరించడానికి శక్తి లేనిదా అన్నట్టు పృథివి కంపించింది. దేవతలు ఆ శిశువును ఆకాశగంగా

జలంతో స్నానం చేయించి, యశశ్శుభ్రమై, సత్త్వగుణంవలె విశదలలితమైన ఛత్రం ధరించారు; చామరం వీచారు. ఆ శిశువు అవతరించినప్పుడు ఆకాశంలో ఒక దివ్యప్రభ వెలిగింది. అప్పుడు కిష్కింధాద్రివాసి అయిన అసితముని మేనల్లుడైన నారదుడు ఆ ప్రభావ విశేషం చూచి ఆశ్చర్యపడి ఆసిత మునిని "నూరుగురు సూర్యులు వెలిగినట్టు వెలుగు కనిపిస్తున్నదే. కొండగుహల వారువమూల చీకట్లు కూడా పటాపంచలయ్యాయే! ఏమిటీ వింత?" అని ప్రశ్నించాడు. అసితముని దివ్యదృష్టితో చూచి, "వత్సా! బోధిసత్త్వుడు జన్మించడం వల్ల ఈ పుణ్యప్రభావపటలం వ్యాపించింది. కుశలప్రాప్తి కోసం అతణ్ణి త్వరలోనే చూద్దాము" అని సమాధానం చెప్పి, ఆనందంతో విశ్రమించాడు.

కుమారుడు జన్మించడం వల్ల సర్వార్థాలూ సిద్ధించడం చూచి శుద్ధోదనుడు అతనికి సర్వార్థసిద్ధి అని నామకరణం చేశాడు. శాక్యపురంలో శాక్యవర్ధనుడనే యక్షుడుండేవాడు. అతనికి నమస్కరించడం వల్ల శాక్యుల శిశువులు బాలారిష్టాలు లేక చల్లగా పెరిగేవారు. ఆ పద్ధతి ప్రకారం శుద్ధోదనుడు తన కుమారుణ్ణి ఆ యక్షునికి నమస్కారం చేయడానికి పంపాడు. ఆ యక్షుడు ఆ బోధిసత్త్వుణ్ణి చూడగానే, ఆయన పాదాలపై పడి నమస్కారం చేశాడు. పిదప రాజు ఆ కుమారుణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకుని, అతని దేహలక్షణాలను సాముద్రిక శాస్త్రజ్ఞులతో అడిగించాడు. లక్షణజ్ఞులు అతని లక్షణాలను పరీక్షించి ఆశ్చర్యంతో ఇలా అన్నారు: "దేవ! దేహలక్షణాలతో ఈతడు దివ్యకుమారుడుగా కనిపిస్తాడు. ఈ లక్షణాలున్నవాడు విశ్వవిశ్రాంత శాసనుడు, ఇంద్రుణ్ణి కూడా అదుపులో పెట్టగల సత్యమార్గవర్తి అయిన చక్రవర్తిగా పుడుతాడు. ఈయన పాదాలు చక్రచిహ్నాలుగల దీర్ఘాంగుళిదళాలతో, ఎర్రగా, సుందరంగా కమలాలలాగ కోమలంగా ఉన్నాయి. వేళ్లమధ్యన సందులు చక్కగా ఉన్నాయి. భుజాలు మోకాళ్ల వరకూ వేలాడుతూ సిరి కురుస్తూ ఉన్నాయి. గుహ్యప్రదేశం ఏనుగుగుహ్యంలాగ గూఢంగా ఉన్నది. ఆకారం మర్రిచెట్టులాగ నిండుగా ఉన్నది. సుళ్లన్నీ దక్షిణావర్తాలు. శరీరం ఎత్తుకు తగిన పుష్టి కలదై రజోమలం కొంచెం కూడా తాకనిది; బంగారుచాయతో వెలుగుతున్నది. చేతులు, పాదాలు, భుజాలు, కంఠాగ్రం-సప్తచ్ఛదాకారంతో ఉన్నాయి. శరీరం మీదిభాగం సింహంలా గంభీరంగా ఉన్నది. అంగాలు పెద్దవిగా, స్పష్టంగా ఉన్నాయి. సమానమైన తెల్లని నలభై దంతాలున్నాయి. ముక్కు అందమైనది. నాలుక పలచగా దీర్ఘంగా ఉంది. కంఠధ్వని మేఘ దుందుభి గంభీరంగా ఉన్నది. కనుగుడ్లు నల్లనివి. కనురెప్పలు గోవురెప్ప వంటివి. సహజ ఉష్ణీషంతో ఉన్నది శిరస్సు. కనుబొమల మధ్యప్రదేశంలో తెల్లని ఊర్ణాంగం, రొమ్ముపై స్వస్తికచిహ్నం, చేతిలో లేఖాశృంగచిహ్నాలూ ఉన్నాయి. శిరస్సు ఛత్రాకారం. రాజా! ఈ శుభలక్షణాలతో ఈ కుమారుడు చక్రవర్తి అన్నా అవుతాడు; లేదా సమ్యక్సంబోధిసంబుద్ధుడైన సర్వజ్ఞుడన్నా అవుతాడు." నిమిత్తజ్ఞులు ఈ విధంగా తెలిపి వెళ్లగా, రాజు చాల హర్షించాడు. కాని, ఏడునాళ్లకే ఆ జగచ్ఛాస్త తల్లి పరలోకం వెళ్లింది. ఆ శిశువు జన్మించగానే, శాక్యులందరూ మునులవలె శాంతులయ్యారు. అందువలన ఆ శిశువుకు శాక్యముని అనే పేరు వచ్చింది. రాజు ఆ శిశువు తేజస్సును చూచి, ఇతడు దేవతలకు కూడా దేవుడని నిశ్చయించి దేవాతిదేవుడని ముద్దు పేరు పెట్టుకున్నాడు.

ఇలా ఉండగా తత్త్వదర్శి అయిన అసితముని నారదునితోపాటు ఆ శిశువును చూడటానికి శాక్యపురికి వచ్చాడు. బాలార్కుని వలె కల్పప్రకాశి అయిన ఆ శిశువును చూచి అతని ముఖకమలం వికసించింది. శుద్ధోదన మహీపాలుడు అతనికి ఎదురేగి, నమస్కరించి ఆతిథ్యమిచ్చాడు. ఆ ఋషి



రాజుని చూచి "రాజన్! నీవు గుణగణాలతోపాటు పుత్రునితోను ప్రీతిపాత్రుడయావు. ఈ బాలుని లక్షణాలు మోక్షలక్ష్మీ సమాగమకారణాలని, చక్రవర్తి శ్రీదాయకాలనీ అంటారు. వీటి ఫలం శాశ్వతమైనది. పద్మాకరం తన వికసిత పద్మాలతో లోకులకు కన్నులపండువు చేసి ధన్యులను చేసినట్టు సంబుద్ధుడైన నీకుమారుడు బోధివైభవంతో లోకులకు సుఖాంబుజం ప్రసాదించి ధన్యులను చేస్తాడు. బోధిక్షీరసాగరుడైన ఈ శుద్ధసత్త్వుని వాగమృతంతో విబుధులు (దేవతలు, విద్వాంసులు) జీవించి ధన్యులౌతారు. ఈ పుణ్యవంతమైన లోకంలో నేనొక్కణ్ణే దురదృష్టవంతుణ్ణి. ఎందుకంటే ఈయనను సర్వకాలాలలోను దర్శించలేకపోతున్నాను గనుక.

అసితముని రాజుతో ఈ విధంగా చెప్పి సెలవు తీసికొని గగనమార్గంలో తపోవనానికి వెళ్ళి మనస్సును ప్రసన్నం చేసుకొని, దేహత్యాగం చేయదలచాడు. అప్పుడు నారదుడు అంత్యోపదేశం చేయవలసిదిగా కోరగా అసితముని ఇలా అన్నాడు. "వత్సా! సర్వార్థ సిద్ధకుమారుడు అమృతోపదేశం చేస్తాడు. ఆ రాజకుమారునితో అనామయమైన అమృతోపదేశం స్వీకరించి సంసార జలధిని తరిస్తావు" అని చెప్పి దేహత్యాగం చేశాడు. నారదుడు అతనికి దేహ సంస్కారం చేసి వెంటనే వారాణసికి వెళ్ళి, సిద్ధికోసం కాత్యాయనుడనే పేరుతో వేచి ఉన్నాడు.

ఇక్కడ శాక్యనగరంలో కుమారుడు నానాటికీ పెరిగి పెద్దవాడవుతూ సకల విద్యలలోను పారగుడై, సర్వలిపులలోను ప్రవీణుడై, బ్రాహ్మిఅనే నూతన లిపిని కూడా సృష్టించాడు. ఆయుతగజబలుడని విఖ్యాతి పొందాడు. ఆ మహాబలునికి విశాలానగరవాసులు ప్రీతితో ఒక మదగజాన్ని బహూకరించారు. అతడు చక్రవర్తి అవుతాడని వైశాలికులు పంపిన కుంజమనే ఈ బహుమానకుంజరాన్ని దేవదత్తుడనే శాక్యుడు అసూయాద్వేషాలతో చంపివేశాడు. పడిపోయిన ఆ గజాన్ని నందుడు ఏడడుగులు ఇవతలికి లాగాడు. సర్వార్థసిద్ధికుమారుడు దానిని ఎత్తి పురప్రాకారానికి అవతల విసరివేశాడు. ఒకమారు ధనుర్విద్యా ప్రదర్శన జరిగింది. కుమారుడు ఏడు తాటిచెట్లను ఒక్కబాణంతో పడగొట్టి భూమిని కూడా భేదించాడు. ఈ విధంగా ఛేద్యభేద్యాస్త్ర శస్త్రాలతో అందరినీ మించిపోయాడు. అతడు తనతో సమానమైన రూపగుణాలుగల యశోధర అనే కన్యను శుద్ధశీలుడు ఉన్నతిని పొందినట్టుగా వివాహం చేసుకొన్నాడు.

ఇలా ఉండగా ఒకమారు మహావాతం వీచి సప్తయోజన విస్తారమైన ఒక మహావృక్షం రోహిక అనే నదిలో కూలిపోయి ప్రవాహానికి అడ్డు ఏర్పడింది. అందువల్ల ఆ నది ముందుకు ప్రవహించడం మాని భ్రష్టఅయిన వనితవలె ఎదురెక్కి పట్టణానికి జలప్రళయం తెచ్చింది. రాజకుమారుడు ఆ మహావృక్షాన్ని పైకి తీసి, విరిచి పారేసి, ప్రజలను, మత్స్యాది జలజీవులను జలకల్లోల విప్లవంనుంచి రక్షించాడు. ఒకమారు సిద్ధార్థకుమారుడు దేవదత్తుడు ఉద్యానవనంలో తీక్ష్ణమైన బాణంతో కొట్టిన హంసను బతికించాడు. దానివల్ల దేవదత్తునికి చాల కష్టం కలిగింది. కుటిలులైనవారు సమానకులగుణుల ఉన్నతిని సహించకపోవడం సహజమే. ఒకమారు గోపిక అనే రాజకన్యక కందర్పసుందరుడైన కుమారుణ్ణి చూచి ఉత్సుకురాలయింది. ఆమె తన కుమారుని మనసెరిగిన వధువని నిశ్చయించి, రాజు ఆమెను అతనికిచ్చి పెండ్లిచేసి మన్మథుని మనోరథం పూరించాడు.

కొంతకాలానికి కొందరు జ్యోతిష్కులు శుద్ధోధనుని వద్దకు వచ్చి, ఇక ఆరునాళ్ళు గడిచి, ఏడవనాడు నీ కుమారుడు చక్రవర్తిగాని, మునిగాని అవుతాడని దృఢంగా చెప్పారు. వారి మాట విని

నృపాలుడు సన్న్యాసానికి భయపడి కుమారుని చక్రవర్తి పదవికోసం దినాలు లెక్కపెడుతూ ఆలోచించసాగాడు. ఇలా ఉండగా సర్వార్థసిద్ధికుమారుడు ఒకనాడు కదం తొక్కే కమనీయమైన గుర్రాలు పూన్చిన రథం ఎక్కి ఉద్యానవనంలో విహరించడానికి వెళ్ళాడు. దారిలో అతడు ముసలితనం ముంచుకొనిరాగా జీర్ణజర్జరితాంగాలతో, నెరిసి విరిసిపోయిన వెంట్రుకలతో పండి ఎండిపోయిన ఒక వ్యక్తిని చూచాడు. పిదప తన దేహాన్ని చూచుకొని "అయ్యో! ఈ దేహం పూర్తిగా పండితే ఈ విధంగా జుగుప్సితమైన ఆకారం పొందుతుంది. ఈ దేహం వయస్సు పూర్తిగా అయినా సంతృప్తిని పొందదు. ముసలితనం నెరసిన వెంట్రుకల సాకుతో ముసలివానిని నవ్వుతున్నట్టు ఉంటుంది. స్నాయుపాశబద్ధమైన, అస్థిపంజరమైన ఈ శరీరంలో ఈ వృద్ధుడు మోహవిహంగమాన్ని పెంచుతాడనుకుంటాను. ఓ సారథీ! ఈ వృద్ధుడు ఇక్కడ ఏమి చేస్తాడు? తపోవనానికి ఎందుకు వెళ్ళడు? వృద్ధుని దేహం లాగ నా బుద్ధి కూడా కుంచించుకుని పోతున్నది. ముసలివాడు పట్టుకోసం కర్ర పట్టుకుంటాడేగాని ధర్మబుద్ధిని ఆశ్రయించడు. ముసలితనంలో దేహం కుటిలమై వంకరటింకరై పోవడం వల్ల అవివేకం సహజం కాబోలు! ఈ వృద్ధుడు తొస్సిపోతూ, జొల్లుకారుతూ జారిపోతున్న పండ్లలాగ ఉన్న మాటలతో ఏవగింపు కలిగిస్తున్నాడు. చూపు పోయింది. దేహం క్షీణించింది. బలమా లుప్తమైంది. చెవులు మూసుకుపోయాయి. అయినా, వృద్ధుడు మోహంతో తారుణ్యంలో ఉన్న ప్రియురాలిని తలంచుకొంటాడు. వృద్ధుడు ఎందుకంత అసహ్యంగా తెల్లబారిపోయాడనుకున్నారు? అతిప్రియ అయిన ఈ తనువు చంచలమై విరక్తం(రక్తహీనం, రాగహీనం) కావడం వల్లనే సుమా!" అని చాలసేపు ఆలోచించాడు. ఈ కాయం సాపాయమని, ఆపదల సమూహమని అనుకున్నప్పుడు అతనికి నిర్వేదం కలిగింది. మరొకమారు రాజకుమారుడు దారిలో కుళ్ళిపోయిన పీనుగువలె చీముకట్టిన ఒక పాండురోగిని చూచాడు. వెంటనే తన దేహంవైపు చూచుకొని "ఈ దేహంలో రోగాలు పుట్టడం సహజం. చిత్రమేమిటంటే శరీరం సందిగ్ధమనే గాబరా ఏర్పడడం వల్ల అతనికి రాజ్యభోగంలోను, ఇతర భోగాలలోను ఆదరం పోయింది. మరొకసారి అతనొక శవం చూశాడు. బంధుజనులు దానిని వస్త్రాలతోను, పూలమాలలతోను అలంకరించి అంత్యక్రియల కోసం శ్మశానానికి తీసుకొని వెళ్ళుతున్నారు. దానిని చూచిన వెంటనే రాజకుమారుని ఉద్వేగం, దయ, దుఃఖం, జుగుప్స పెల్లుబికాయి. ఈ సంసారం నిస్సారమని, దీనికి పరిహారమేమిటని దీర్ఘంగా ఆలోచించాడు. "ఆ శవం మెడలో వేసిన పూలదండ మహాప్రస్థాన యాత్రలో దీర్ఘపురాకృత కర్మమయమాలలాగ ఉన్నది. ఈ మాల ధరించి వీడు ప్రేతవనానికి వెళ్ళుతున్నాడు. విషయ విలాసాలలో మునిగి తేలుతున్న మనుష్యులు మరుక్షణంలోనే కర్రలాగ, రాయిలాగ అయిపోతున్నారే. ఈ దేహం అస్థిరమైనది. స్థిరమైనదనే అభిమానం మానవులకెందుకు? ఉద్వేగ జలాలున్న సంసార సాగరంలో బుడగ వంటిది. ఈ శరీరం కాలానిలుని తాకిడికి ఎప్పుడుపడితే అప్పుడు రాలిపోయే కర్మలత కొనపూవువంటిది. ఈ శరీరం. మాయ అనే మత్తకాసిని నయనవిభ్రమరేఖ వంటిది. ఈ శరీరం, స్థిరమైనదనే అభిమానం మానవులకెందుకు? పరహితమైనది పల్లెత్తుమాట కూడ పలుకలేదు. ధర్మవచనం ఒక్కటైనా వినలేదు. కుశలకుసుమాన్ని ఒక్కమారైనా వాసన చూడలేదు. సత్యస్వరూపం చూడనే లేదు. శాంతిపదాన్ని తాకనే లేదు- అని మానవుడు చింతిస్తూనే ఆయుస్సు గడిచి ఆకస్మాత్తుగా చల్లబడిపోతాడు" అని రాజకుమారుడు ఆలోచించి ఈ శరీరం విపదాప్లుతమని నిశ్చయించాడు. అతనికి అన్ని విషయభోగాలలోను వైరస్యం ఏర్పడింది.



మరికొంత ముందుకువెళ్ళే వేళకు భిక్షాపాత్ర, కాషాయం ధరించిన ఒక సన్యాసి కనిపించాడు. ఆ సన్యాసిని శుద్ధావాస కాయిక దేవతలు అక్కడ కల్పించారు. అతణ్ణి చూడగానే రాజకుమారునికి సన్యసిద్దామనే బుద్ధి కలిగింది. ఇష్టవస్తువు చూడడం వల్ల వారివారి స్వభావం స్పష్టమౌతుంది. రాజపుత్రుడు నగరుకు తిరిగివెళ్ళిన తర్వాత అడుగడుగునా అతనికి కలిగిన వైరాగ్యకారణాలను సారథి శుద్ధోదన నృపాలునికి తెలియజేశాడు.

పిదప రాజకుమారుడు తండ్రిమాటతో గ్రామాలు చూడడానికి వెళ్ళాడు. దారిలో ఆయన మూతలు తీసిపెట్టిన నిధులను చూచాడు. ఆ నిధులు పూర్వపు ఋషులు భద్రపరచినవి. స్త్రీలు వాటిని ఎత్తిపట్టుకున్నప్పటికి రాజకుమారుడు వాటిని తీసుకోకపోగా, అవి సముద్రంలో పడిపోయాయి. తర్వాత అతనికి కర్షకులు కనిపించారు. వారి తలనిండ ధూళి పడి ఉంది. కాళ్లూ చేతులూ పగిలి ఉన్నాయి. ఆకలితో దప్పితో అలసి సొలసిపోయి ఉన్నారు. నాగలి, కొఱ్ఱు మొదలయిన పనిముట్ల వల్ల గాయాలయినవారు. ఇలా బాధపడుతున్న వారిని చూచి రాజకుమారుని మనస్సు కరుణార్ద్రమైంది. వెంటనే వారికి కావలసినంత ధనమిచ్చి దారిద్ర్యం పోగొట్టి, ఎడ్లకు కూడ కష్టం తొలగించాడు. తర్వాత వెనుదిరిగి వెళ్ళుతూ మధ్యాహ్నపు మండుటెండలో తల్లడిల్లిపోయాడు. ఒళ్లు చెమటతో ముద్దయింది. రథధ్వని విని మేఘధ్వని అనుకుని నెమళ్ళు దిక్కులకు పరుగెత్తుతూ నీలహరిత కాంతులను వ్యాపింపజేస్తున్నాయి. అంతలో ఒక పచ్చని అడవి కనిపించింది. అక్కడ అతడు కుండలాలు గండస్థలంపై వ్రేలాడుతుండగా రథం దిగి ఒక నేరేడు చెట్టు నీడను చేరి విశ్రమించాడు. ఆయన రొమ్ముపై చెమటబిందువులు ఒంటిని అంటిపెట్టుకొని ఉంటే ముక్తాహారాలలాగ కనిపించాయి. పొద్దు తిరిగినకొద్దీ అన్ని చెట్ల నీడా కదలిపోయింది. కాని శుద్ధోదనపుత్రుడు విశ్రమించిన నేరేడుచెట్టు నీడమాత్రం ఆయన దేహం మీదినుంచి కొంచెమైనా కదలిపోలేదు. ఆ చెట్టునీడ అతనికి వడదెబ్బవల్ల కలిగిన అలసటను సంసార సాగరంలో అలసిపోయినవాని శ్రమను తీవ్రమైన వైరాగ్య వాసనలాగ పోగొట్టింది. ఇంతలో శుద్ధోదనుడు పుత్రుణ్ణి చూద్దామనే ఆతురతతో సైన్యంతో పాటు ఆ వనానికి వచ్చాడు. సైన్యం ముందు నడుస్తున్న ఏనుగులపై తుమ్మెదలు మదజలవాసనకు మూగుతున్నాయి. పరిచారికలు వేస్తున్న చామరాలకు ఆ తుమ్మెదలు చెదరిపోతున్నాయి. శుద్ధోదనుడు కుమారుని ప్రభావం వల్ల చెట్టునీడ కదలకుండా ఉండడం చూచి గౌరవాద్భుత భావాలు హృదయంలో వ్యాపించగా, తనకు నమస్కరించిన కుమారుణికి తానూ నమస్కరించాడు. అనంతరం రాజకుమారుడు తండ్రితో పాటు నగరానికి తిరిగి వెళ్ళుతూ నగరం చివరిలో శవసంకులమైన పితృవనం చూచాడు. కొంచెంసేపు రథం ఆపమని సారథితో చెప్పి, ఉద్వేగంతో ఇలా అన్నాడు. "సారథీ! ఈ కాయానికి అపాయం ఏర్పడి ఈ ప్రాణులదశ చూడు. ఇంత జరిగినా మోహంతో మనస్సు రాగార్ద్రమౌతున్నదే! పరస్త్రీ దర్శనంతో సంతృప్తిపడిన ఈ మానవుని కళ్ళను కాకులు పొడిచి రుచి చూచి, అబద్ధాలు చెప్పిన నాలుకను లాగుతున్నాయి చూశావా? ఆ గద్దను చూడు. మదనిర్భరుడైన కాముకునివలె ఆ స్త్రీశవం చనుమొనలపై నఖక్షతాలు చేస్తూ సుఖిస్తున్నట్టు పెదవి కొరుకుతున్నది. చెట్లమీదినుంచి కాకులు రెట్ట వేస్తున్నాయి. అది చూడగా చెట్లు ఉమ్మి వేస్తున్నట్లు, కుళ్ళిపోయి కంపుగొడుతున్న శవాల పూతిగంధానికి ఏవగించుకొని వాలిపోయి మూర్ఛపోతున్నట్టు, గద్దలు శవాల పేగులను లాగుతూ ఆ ప్రదేశాన్నంతా అస్తవ్యస్తం చేస్తుండడం చూచి సంహిచక కదలుతున్న పల్లవకరాలతో ముఖం కప్పుకున్నట్టు ఉంది. అక్కడ చూడు, ఆ స్థూలకాయుడైన యువకుడు కదలకుండా పడి ఉన్నాడు.

జంబుకి(ఆడనక్క) అతని గుండె హరించి మెడ పట్టుకొని రక్తం కనిపించగానే ఆశతో గోళ్ళతో గీకుతూ, పళ్ళుగాట్లు పడిన పెదవి నమలుతూ, అనురాగంతో కామం వెల్లివిరిసినదానివలె కామకేళికి సరభసంగా పూనుకుంటున్నట్టు కనిపించడంలేదూ?" ఈ విధంగా అంటూ సంసార భీభత్స భయంతో వైరాగ్యం పెచ్చుపెరిగి ఈ క్లేశనిర్వాణోపాయం ఆలోచిస్తూ పట్టణంలో ప్రవేశించాడు.

రాజకుమారుడు నగరంలో ప్రవేశించినప్పుడు, ఒకమేడమీది నుంచి ఉన్నతవంశ సంజాత, కస్తూరి పరిమళం విరజిమ్మేది అయిన మృగజ అనే మృగలోచన చూచింది. చెవులవరకు వ్యాపించిన ఆమె రాగతరళమైన కనులు ఆయనను చూడగానే ఉద్రిక్తమయాయి. ఆ బేల ఆయనను చూడగానే, లజ్జను సహించని మన్మథుడు ఉసిగొల్పినట్టు ముందున్న చెలితో "చంద్రునివంటి ఈతని స్పర్శతో మదనసంతాప తప్తమైన నిర్వాణం పొందించుకొనే ధన్యురాలెవతో?" అని అన్నది. రాజుపుత్రుడు నిర్వాణం అనే మాట వినగానే, తలయెత్తి పద్మవనాలు సృష్టించే చూపుతో చూచాడు. ఆ వనిత మాటలకు, ఆమె రూపానికి అతడు తనిసి, ఆమెకు గుణోజ్జ్వలం సువృత్తం అయిన హారాన్ని మనస్సుతోసహా యిచ్చాడు. రాజు అతని అనుకూలమైన చూపులను బట్టి భావం గ్రహించి ఆ వనితను రప్పించి తనయుని అంతఃపురంలో ఉంచాడు. రాజతనయుడు తనకు ప్రియమైన శాంతిని అన్వేషిస్తూ ఆరువేలమంది అతివలున్న అంతఃపురం ప్రవేశించాడు.

అప్పుడు జ్యోతిష్కులు రాజును దర్శించి "నీ కుమారుడు ఉదయం వేళకు మునిగాని, చక్రవర్తిగాని అవుతాడు" అని స్పష్టంగా తెలిపారు. రాజు కుమారుని సన్న్యాసానికి భయపడి, బాగా ఆలోచించి, పురద్వార కవాటాలు మూయించి, జనుల రాకపోకలను ఆపివేయించాడు. తర్వాత ద్రోణోదనుడు మొదలయిన తమ్ములను నగర ద్వారాలలో కాపలా పెట్టించి అమాత్యసైనికులతో సహా తా నా నగరం మధ్యన జాగరూకుడై ఉన్నాడు.

అక్కడ అంతఃపురంలో ప్రవేశించిన రాజకుమారుణ్ని గర్భవతి అయిన యశోధర పలకరించింది. ఆమె చంద్రోదయం కానున్న శరత్కాల గగనలక్ష్మివలె పాండురచ్ఛాయతో ఉన్నది. నగరద్వార రక్షణం ఇక ఒకరాత్రి మాత్రమే మిగిలింది. ఆ ఉదయమే రాజకుమారుని మనస్సులో శమమనే సూర్యుడు దినమంతా సంసార యాత్రచేసి, శాంతిని పొందగా, సాయంసంధ్య కాషాయాంబరం పట్టుకుని సిద్ధంగా ఉన్నదా అన్నట్టుంది. చంద్రుడు నెమ్మదిగా సర్వదిక్కులు తమోమోహాన్ని తొలగించి సంతోషంతో భూమిని పూర్ణ ప్రకాశవతినిగా చేశాడు. ఆకాశం తన మనస్సు నుంచి రాగం తాపంగల రవి వెళ్ళిపోగా, చంద్రుడనే శుద్ధహృదయంతో వికారం లేని ప్రశాంతిని పొందినదా అన్నట్టు చంద్రుడు వెలుగొందాడు. ఆ సమయంలో రత్నహర్మ్యలపై పడిన చంద్రకాంతి సంతోషంతో హసిస్తూ కాంతలతో కలకలలాడే అంతఃపురంలో విహరిస్తున్న రాజకుమారునికి అంతా నిస్సారంగాను, విరసంగాను తోచింది. అప్పుడు గగన స్వచ్ఛమైన అతని మనస్సులో పెల్లుబికే విరాగస్మృతితో ఇలా అనుకున్నాడు. "ఈ నారీగణమంతా మదనాగ్ని మిణుగురుల గుంపు; తీవ్ర వ్యసనాలకు, సంతాపానికి తావలం; కనుక పరత్యజించదగింది. ఇక ఇప్పుడు ఇంటిని వదలి శీతలతర వృక్షాలతాతలం ఆశ్రయించి ప్రశమ సంసారంలో మనస్సు లగ్నం చేయడం సముచితం. ఈ కాంతలు చల్లని వెన్నెలలో మైమరచి నిద్రపోతున్నారు. కొందరి కనులు మూతపడి ఉన్నాయి. కొందరికి గుడ్డలు జారి పక్కలపై పడ్డాయి. కొందరు కలలో ఏమో కలవరిస్తున్నారు.



కొందరికి కేశపాశం వీడి భుజాలపై పడింది. మందానిలానికి కదలుతున్న దీపాలు ఈ భామినీ బృందాన్ని చూచి లజ్జపడుతున్నట్టు ఉన్నది. ఇక వెంటనే అరణ్యానికి బయలు దేరుతాను. ఒళ్ళు వాలిపోయి, లజ్జ లేకుండా గుడ్డలు వీడి నిద్రిస్తున్న వారికీ మరణించినవారికీ భేదమేమిటి?"

రాజపుత్రుడు ఈ విధంగా ఆలోచించి, అంతఃపురం నుంచి వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడయ్యాడు. అప్పుడు నగర ద్వారరక్షకులు ఒకరినొరకు "ఓహోయ్! ఎవరక్కడ? మేల్కొని ఉన్నారా? మేల్కొన్నవారికి కలత లేదు. ప్రభువు మనస్సు చూరగొనడానికి అందరూ మేల్కొనే ఉన్నారు. ఈ సంసారగృహంలో వివేకవంతుడు మేల్కొంటాడు. ప్రమత్తుడు మోహాంధకారంలో నిద్రపోతాడు. ఈ లోకంలో మెలకువే జీవితం. బతికిన వానికీ, చచ్చినవానికీ ఏమిటి మరి భేదం?" అని హెచ్చరించుకుంటున్నారు. ఈ సంభాషణను రాజపుత్రుడు మేడ మీదినుంచి విని తనప్రయాణానికి ఇది ఉపశ్రుతి అనుకొని తన మనోరథం సన్మార్గంలో బయలుదేరిందనే భావించాడు. పిదప అతడు క్షణం నిద్రించి, దానిలోనే నివృత్తిలక్షణమైన కలగని అనుత్తర జ్ఞాననిధి తనను సమీపించిందని భావించాడు.

ఇంతలో అకస్మాత్తుగా యశోధరాదేవి మేల్కొని భయంతో తాను కన్న కలను భర్తకు తెలిపింది. "ప్రభూ! శయనం, ఆభరణాలు, అంగాలు విరిగినట్లు, లక్ష్మి మనలను విడిచివెళ్లిపోతున్నట్టు కలగన్నాను" అని ఆమె భర్తతో అన్నది. ఆ మాట విని రాజకుమారుడు "వెర్రిదానా! సత్యవిరహితమైన ఈ సంసారమే, ఒక స్వప్నం. ఈ స్వప్నంతో మరొక స్వప్నం ఎలాటిది? నాకు కూడా ఒక స్వప్నం వచ్చింది. నా బొడ్డు నుంచి ఒకతీగ పుట్టి ఆకాశమంతా వ్యాపించినట్టు నేను మేరుపర్వతం తలగడగా పడుకొని పూర్వపశ్చిమ సముద్రాలను రెండు భుజాలతోను, దక్షిణసముద్రాన్ని రెండు పాదాలతోను ధరించినట్టు కలగన్నాను. ఈ స్వప్నం నీకు శుభకరం. భర్తకేది శుభమైతే భార్యలకూ అదే శుభం" అని ఓదార్చాడు. భర్తమాట విని యశోధర ఏమీ పలుకలేక పోయింది. ఆమె మరల నిద్ర కమ్మి కండ్లు మూసుకొంది.

అప్పుడు బ్రహ్మేంద్రాది అమృతాశనులందరూ వచ్చి బోధిసత్త్వునికి సత్ప్రోత్సాహం కలిగించారు. రాజకుమారికి సహాయం వెళ్లడానికి నలుగురు దేవపుత్రులను వారు నియమించారు. ఆ దేవపుత్రులు వడిగా నడిచేవారు, భూమిని పర్వతాలను, సముద్రాలను ధరించడానికి సమర్థులైనవారూను. అప్పుడు ఇంద్రుని ఆజ్ఞతో పాంచికుడనే యక్షుడు రాజకుమారుడు హర్మ్యం నుంచి దిగడానికి సోపానపంక్తి నిర్మించాడు. దానిమీదుగా రాజకుమారుడు దిగి, ఛందకుడనే సారథిని లేపి, తన ఉత్సాహంలాగ ఉన్న కంఠకమనే గుర్రాన్ని తెమ్మన్నాడు. ఆ గుర్రం తీక్ష్ణరుచిరమైంది. లక్ష్మీకటాక్షంవలె నిగనిగలాడేదీని. దానిని రాజకుమారుడు తలపై తడివి, వీపుపై తట్టగానే అది లోబడిపోయిది. సజ్జనుల శమగుణం బయట లోపల గూడ సమానమైంది. దాని ప్రభావానికి శిశువులు కూడా లోబడుతారు. రాజకుమారుడు తన బలం తెలుసుకోవడం కోసం భూమిపై పెట్టిన అడుగును ఆ దేవపుత్రులు నలుగురూ కదలించ లేకపోయి ఆశ్చర్యపడ్డారు. అనంతరం రాజకుమారుడు నిశ్చంచలమైన ఆ కంఠకాశ్వాన్ని ఛందకునితో పాటు ఎక్కి తన హృదయం వలె నిర్మలమైన ఆకాశంలో బయలు దేరాడు. ఆయన వెళ్లిపోతూ ఉంటే తలపాగా కుట్టు గాలికి సుళ్ళుతిరిగి ఎగురుతూ, ఆ రాజ్యలక్ష్మి శోకోచ్ఛ్వాసంవలె కనిపించింది. ఆయన ఆభరణకాంతులకు ఆకాశమంతా చిత్రవిచిత్ర వర్ణయుతమైంది. దానిని చూడగా ఆకాశం కూడా రకరకాల దారాలతో, పనితనంతో నేసిన చీవరం ధరించినట్టు తోచింది. అంతఃపుర దేవతలందరూ ప్రత్యక్షమై,

వెళ్లిపోతున్న అతని కన్నీళ్లు జలజల జాలువారుతుండగా కలువరేకులవంటి కండ్లను తిప్పితిప్పి చూచారు. రాజపుత్రుడు నృపబాంధవ సహితమై సంసారం వలె విస్తీర్ణమై పట్టణాన్ని దూరం నుంచే ప్రదక్షిణం చేసి "క్షమించు" అని వేడుకొని వెళ్లిపోయాడు.

రాత్రి గడవడానికి ఇక ఒక క్షణం ఉంది. అందరూ నిద్రపోతున్నారు. మహోరుడనే రాజబంధువునికి తటాలున మెలకువ వచ్చింది. ఆకాశంలో వెళ్లుతున్న రాజకుమారుణ్ణి చూచి, మొదట చంద్రుడేమోననుకుని తర్వాత చాలసేపు ఆలోచించి కళ్లు బాష్పాలతో నిండగా బిగ్గరగా ఇలా అన్నాడు: "కుమార! రుచిరాకార! బంధువులకు జీవనమై బంధుజీవనం(ఎఱ్ఱటి మంకెనపువ్వు) వంటి నీకు ఈ విరక్తి చిత్రంగా ఉందే? ఇలా విడిచిపోవడం యుక్తం కాదు. నీవు వంశానికి కీర్తి తెస్తావని నీ పై తండ్రి ఎంతో ఆశపెట్టుకుని ఉన్నాడు. అన్ని ఆశలకు (ఆశలకు, దిక్కులకు) ఆభరణప్రాయుడైన నీవు తండ్రిని ఎందుకు నిరాశపడ జేస్తావు?" శాక్యమహాముని మాటలు విని సర్వార్థసిద్ధికుమారుడు ఇలా సమాధానమిచ్చాడు. "ఓ బాంధవుడా! బాంధవప్రీతి బంధనశృంఖల. మిథ్యాగృహ సుఖప్రియమైన ఈ దేహం నశించేది. కనుక విషయసుఖమనే ఉగ్రవిషంతో బాధపడేవారికి అరణ్యమే అమృతాయతనం. విషయసంకులమైన ఈ సంసారంలో మానవులకు చేత్తో లాగగా కలిసి ఎగిరి తలపై నాట్యం చేసే మూడు పడగల నాగుబాములాగ మృత్యువు తలపై ఎక్కి కూర్చుని ఉంది. మెడలోనేమో విషలతల చిగురుటాకుల దండ. మండిపోతున్న నిప్పులవలె గహనమైన దుర్గమమార్గంలో తెలియకనే ప్రవేశిస్తూ, పొరపాటుతో సంతోషిస్తున్నారు" ఈ విధంగా చెప్పి రాజకుమారుడు ఆకాశమార్గాన క్షణంలో నగరం దాటి, పొలిమేరలో భూమి మీద దిగి గుర్రమెక్కి వేగంగా వెళ్ళిపోయాడు. రాజకుమారుడు వెళ్లిపోయిన వృత్తాంతం మహోనుడు శుద్ధోదనునికి, అంతఃపురానికి తెలియజేశాడు. అంతఃపురంలో హాహాకారాలు చెలరేగాయి.

రాజకుమారుడు బ్రహ్మేంద్ర కుబేరాది దేవతలతో సహా ద్వాదశ యోజనాలు వెళ్ళి ఒక్క అడవి చేరాడు. అక్కడ గుర్రం మీదినుంచి దిగి, నగలన్నీ ఊడ్చివేసి, ముఖకాంతితోనే ఆనందం తెలుపుతూ, ఛందకుణ్ణి చూచి, "ఛందక! నీవీ నగలు, గుర్రం తీసుకొని రాజమందిరానికి వెళ్లు. మాయాబంధనాలైన వీటితో నాకిక పనిలేదు. నేనీ అరణ్యంలో శమసంతోషాలు బంధువులుగా వసిస్తాను. ప్రాణి ఒంటిగానే జన్మిస్తాడు. ఒంటిగానే మరణిస్తాడు. విషమమైన విషయాలతో కలిగే భోగాలు వదలి ఎవడు విరాగ విశేషం వల్ల కలిగే శ్రమకు లోనవుతాడు? పరిభవాలకు పుట్టిల్లయిన ఈ సంసారంలో మన పరిస్థితి ఇది. కనుక మదనుని ఆర్భాటాన్ని అరికట్టి శాంతినే ఆశ్రయిస్తాను" అని చెప్పి ముత్యాలసాకుతో అతని వియోగానికి దుఃఖిస్తూ కన్నీరు కురిపిస్తున్నవా అన్నట్టున్న ధగధగ మెరిసే ఆభరణాలను దేహం నుంచి తీసి అతని ఒడిలో వేశాడు. తర్వాత తన ఖడ్గంతో సిగను తరిగి ఆకాశంలోకి విసిరివేశాడు. ఇంద్రుడు దానిని పట్టుకొని ఆదరంతో స్వర్గానికి తీసుకొని వెళ్లాడు. ఆ మహాత్ముడు కేశపాశాన్ని క్లేశపాశమని భావించి తరిగి వేసిన చోట సజ్జనులు 'కేశప్రతిగ్రహం' అనే చైత్యం నిర్మించారు.

ఛందకుడు గుర్రాన్ని తీసుకొని నెమ్మదిగా ఏడునాళ్లకు శాక్య నగరసమీపం చేరి, దుఃఖంతో రాజకుమారుణ్ణి వదలి వట్టి గుర్రం తీసుకొని "కుమార! కుమార!" అని పలవించే రాజును ఎలా చూడను?! అని ఆలోచించి, అక్కడే ఆగిపోయాడు. జీను లేని గుర్రం మాత్రం మూర్తీభవించిన శోకం వలె పట్టణంలో ప్రవేశించింది. దానిని చూచి అంతఃపుర స్త్రీలు, రాజు, అమాత్యులు విలపిస్తుండగా



దిక్కులు ప్రతిధ్వనించాయి. అందరూ ఉత్కంఠంతో బిట్టు విలపిస్తూ, ఆ కంఠకాశ్వం మెడ కౌగిలించుకొని, కన్నీటితో తడిపివేశారు. యజమాని వదలిపెట్టడం వల్ల అంతకుముందే విషణ్ణమైన ఆ తురంగం వారి దుఃఖం చూడలేక ప్రాణాలు వదిలింది. బోధిసత్త్వుని పుణ్యస్పర్శతో పవిత్రమైన ఆ హయం సంసార విమోచన కోసం బ్రాహ్మణకులంలో పుట్టింది. సిద్ధార్థుడు ఇంద్రుడిచ్చిన కాషాయచీవరం ధరించి సన్న్యాసి అయ్యాడు. ఆ చీవరం ధరించినచోట మహాజనులు 'కాషాయగ్రహణం' అనే చైత్యం నిర్మించారు.

"ఈ విభవం అభవ ప్రవృత్తికి (పునర్భవ రాహిత్యానికి), ఈ జన్మ, జన్మ విమోచనానికి, ఈ విజనప్రదేశవాసం ప్రజలను మోహకూపం నుంచి ఉద్ధరించడానికి" అని కుశలకాముడైన సర్వార్థసిద్ధి రాగాన్ని, కామాన్ని వదలి గుణాలతో ప్రజల హృదయాలు చూరగొని ప్రశంసలనందుకున్నాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో అభినిష్క్రమణావదానమనే ఇరవైనాల్గవ పల్లవం.

# 25. మారవిద్రావణావదానం

జన్మభయదూరులై, సంసారప్రభావాన్ని అణచివేయగలిగి, సుందరీలోచన చక్రవర్తి అయిన మన్మథుణ్ని తమ ఆదేశానువర్తిగా చేసుకునే మహానుభావులకు జయమగుగాక!

ఈ విధంగా బోధిసత్త్వుడు తపోవనం చేరి, అక్కడ తపస్సు చేస్తూండగా, ఆయన ఉపస్థాపకులు ఐదుగురు వారాణసిలో సన్యసించారు. శాక్యముని తన తపశ్చర్యతో మునీంద్రులను కూడా ముగ్ధులను చేశాడు. పిదప ఆయన పాదచారిగా జనులతో పాటు సేనాయని అనే గ్రామానికి వెళ్లాడు.

ఆ గ్రామంలో సేనుడనే గృహపతికి నంద, నందబల అనే ఇద్దరు సుశీలులైన కుమార్తెలున్నారు. వారు శుద్ధోదన పుత్రుని ప్రసిద్ధి విని ఆయనను పెండ్లాడడానికి పన్నెండు సంవత్సరాలుగా వ్రతం అనుష్ఠిస్తున్నారు. పరిమళం వెల్లివిరిసే పూలమాలలతో సూత్రంలాగ బాలలకు హృదయంలో అభిలాష సూత్రప్రాయంగా ఉండడం సహజమే. ఆ బాలికలు వ్రతాంతంతో ఆవులను దూడలు తాగిన తర్వాత పితికి ఆ పాలుతో పరమాన్నం వండి స్ఫటికస్థాలిలో ఉంచారు. పరమాన్నం సిద్ధం కాగానే సురపతి, బ్రహ్మ అక్కడికి వచ్చారు. ఆ కన్యలు తమ వ్రతసమాప్తిలో అతిథులు లభించినందుకు సంతోషిస్తూ అతిథిభాగం వారికి సమర్పించబోగా, "సకల గుణగణ పూర్ణుడైనవానికి మొదట పరమాన్నం సమర్పించండి. నాకంటే ఈ బ్రాహ్మణుడు గుణాధికుడు. నాకంటే ముందుగా వచ్చినవాడు" అని ఇంద్రుడన్నాడు. ఆ మాటలు విని చతురాననుడు "నా కంటె గొప్పవారయిన శుద్ధావాసనికాయిక దేవతలున్నారు" అని అన్నాడు. ఆ శుద్ధావాసనికాయిక దేవతలు ఆకాశం నుచి "సర్వప్రతినివిష్టుడైన, బోధిసత్త్వుడు తపస్సుతో కృశించి నిరంజన అనే నదిలో స్నానం చేస్తున్నాడు" అని అన్నారు. ఆ మాటలు విని ఆ కన్యలిద్దరూ ఆయనను ఆహ్వానించి, భక్తితో ఆ పరమాన్నం మణిపాత్రలో వడ్డించి, ఆయనకు సమర్పించారు. బోధిసత్త్వుడు పరమాన్నం స్వీకరించి రత్నపాత్రను తిరగి వారికి ఇచ్చాడు. "ఇచ్చినది తిరిగి పుచ్చుకోము" అని అంటూ ఆ కన్యలు ఆ రత్నపాత్రను తీసుకోలేదు. బోధిసత్త్వుడు ఆ పాత్రను నదిలో విసర్జించాడు. మెరిసిపోతున్న ఆ పాత్రను నాగులు తీసుకొని వెళ్లారు. ఇంద్రుడు ఇది చూచి గరుడరూపంలో నదీజలం సంక్షోభపరచి వారినుండి దానిని లాక్కున్నాడు.

కన్యకల ఆతిథ్యానికి ప్రసన్నుడైన బోధిసత్త్వుడు " ఈ పరమాన్న దానం మీరు ఏ ఉద్దేశంతో చేశారు?" అని ఆ కన్యలను ప్రశ్నించాడు. "తపోనిధీ! శుద్ధోదనాత్మజుడు, ఆనందనిధి అయిన సర్వార్థ సిద్ధికుమారుణ్ని పతిగా కోరి ఈ వ్రతం ఆచరించి పరమాన్నం దానం చేశాము" అని ఆ కన్యలిద్దరూ సమాధానమిచ్చారు. మన్మథుని లీలలకు ప్రారంభంవలె ఉన్న వారి సరస వచనాలు పద్మదళాన్ని నీరు అంటనట్టు ఆయన మనస్సును అంటలేదు. "అయ్యో! ఆ శుద్ధోదన కుమారుడు సన్యసించాడని మీరు వినలేదా? అతనికి లోలనేత్రలైన స్త్రీలన్నా, సిరులన్నా ఇష్టం లేదు" అని వారితో ఆయన అన్నాడు. ఆ



అప్రియవాక్యాలు విని ఆ కన్యలు నిట్టూర్చి "ఈ దానధర్మం ఆయన సిద్ధికే తోడ్పడనీ!" అని అన్నారు. చూడకనే కలిగిన స్నేహంతో ఏర్పడి మనస్సులో చిరకాలంగా నాటిన పక్షపాతం ఎంత చేసినా వెనక్కు తిరగదు. పక్షపాతం(పక్షవాతం) కూడా అలాంటిదే. బోధిసత్త్వుడు వారి మాటలు విని ప్రసన్నుడై వారినుంచి సెలవు తీసుకొని విశ్రాంతికోసం అడవికి వెళ్లిపోయాడు. అమృతం వంటి పరమాన్నం భుజించడం వల్ల ఆయనకు దివ్యమైన బలం కలిగింది. కనక తపస్సుకోసం చల్లని నీడచెట్లున్న కొండను ఎక్కాడు. అక్కడ పర్యంకబంధంలో తపస్సుకు సుఖంగా కూర్చోగా అహంకారం వలె నిక్కినీల్గిన శిఖరాలుగల ఆ పర్వతం కూలిపోయింది. పర్వతం కూలి పోయినందుకు అతడు "అయ్యో! ఈ విధంగా జరగడానికి నేనేమి అనుచితకర్మలు చేశాను?" అని చింతిస్తూ, నిట్టూరుస్తుండగా, ఆకాశదేవతలు " ఓ సాధూ! నీవు అనుచితమైన పనేమీ చేయలేదు. అచ్చిన్నుడు, ఉత్తప్తకుశలుడు అయిన వానిని భూమి భరించజాలదు. నిరంజనానదిని దాటి వెళ్లితే వజ్రాసనమనే బోధిసత్త్వుల దేశం ఉంది. అక్కడ నీకు నిశ్చల తపస్సు జరుగుతుంది" అని తెలిపారు. బోధిసత్త్వుడు దేవతలు చెప్పిన దారిని బయలుదేరాడు. ఆయన అడుగు పెట్టినచోటెల్లా పద్మాలు విరిశాయి. ఆయన వెళ్లుతున్న దారివెంట భూమి సలిలసమృద్ధితో అడుగుపెట్టగా కంచుపాత్రవలె కంగున మోగుతూ విధేయురాలుగా గమనానుకూల అయింది. అతనికి అనుత్తరజ్ఞానవిధాన సాధనం ఫలించగల శుభశకునాలు పెక్కు కలిగాయి.

ఆ నిరంజనీయలోకంలో కాలికుడనే గుడ్డి నాగరాజున్నాడు. అతడు బుద్ధుని ప్రభావం వల్ల చూపు వచ్చి భూమిపై శబ్దం విని లోపలి నుంచి పైకి వచ్చాడు. సర్వలక్షణసంపన్నుడు, కాచిన బంగారు రంగు కలవాడు అయిన బోధిసత్త్వుని చూచి అంజలి ఘటించి, ఇలా స్తుతించాడు: " ఓ నలిననయనుడా! సుందరాకారుడా! నీవు ఈ యౌవనంలో సంపదలకు విరహం కలిగించి, ఈ వనంలో విహరిస్తూ ఈ సంసారసాగరంలో ప్రాణులకు అపార శాంతివిశేషాభ్యుదయానికి హేతువయిన సత్యసేతువయావు; నీ రూపం ఎవ్వరికీ, ఏ ప్రాణికి కష్టం కలిగించనిదీ, అనాయాసంగా సుఖం కలిగించేదీని. అదిగో చూడు. జింకలు భయకాతురతతో మేతమాని పరిగెత్తిపోవడం లేదు. పక్షులు దగ్గరలోనే సవిలాసంగా నీ చుట్టూ తిరుగుతున్నాయి. క్రూరమృగాలు, తక్కిన జంతువులు ఎంతో నమ్మకంతో తిరుగుతున్నాయి. ఇటు చూడు. గున్న ఏనుగు పద్మమనుకొని సింహంపంజాను లాగబోతున్నది. నెమలి చక్కగా కేకవేస్తూ పురి విప్పి గాలి వీస్తూ సంతోషపెడుతున్నది. బెదురుచూపుల హరిణి నిర్భయంగా హరిణం వెంటబడింది. ప్రశమసంవిత్సంపాదనకు పుణ్యప్రసాదపూరితమైన స్థితి ఇదే. కనుక నీవిప్పుడే శుద్ధబుద్ధత్వం పొంది బోధిసిద్ధుడవుతావు. కుముద్వతిని చంద్రుడులాగ లోకత్రయాన్ని సంతోషోజ్జ్వలం చేస్తావు. దిననాథుని దీప్తకాంతితో కమలం వికసించి దానిలోని మధుపశ్రేణి వెలుపలికి వచ్చినట్టు నీ దివ్యావలోకనంతో దివ్యప్రకాశం కలిగిన ప్రజల హృదయం నుంచి సంబంధం తెగి వెలుపలికి వచ్చిన మోహాంధకారాలు మరల హృదయంలో ముసరడం లేదు." ఈ విధంగా వినయంతో స్తుతిస్తున్న నాగరాజును బోధిసత్త్వుడు ప్రసన్నబుద్ధితో పలుకరించి నిరంజనానదిని దాటి వజ్రాసనప్రాంతం చేరాడు.

వజ్రాసనప్రాంతంలో ఆయున నిశ్చలమైన ఒక బోధివృక్షమూలంలో ఇంద్రుడిచ్చిన దక్షిణాగ్రదర్భలతో సంస్తరం సిద్ధపరిచాడు. ఆ సంస్తరంపై పర్యంకబంధంలో ఆసీనుడై నిశ్చయాన్ని నిశ్చలం చేసి, యోగ నిష్ఠుడయ్యాడు. అప్పుడు ఆయన మథనానంతరం నిస్తబ్ధమైన దుగ్ధాబ్ధిలాగ కనిపించాడు.

అసాధారుడు, క్షమాధారుడు (క్షమకు ఆధారుడు), కాంచనరుచి, ధీరలలితాకృతి, అచంచలుడు అయిన ఆయన క్షమాధారుడు(భూమికి ఆధారుడు), కాంచనరుచి అయిన మేరుపర్వతంలా ప్రకాశించాడు. ఆ స్రవక్షయపర్యతం నాకు ఈ పర్యంకబంధం స్థిరంగా ఉండనీ"- అని ఆయన సంకల్పించి, స్మృతిని ప్రతిముఖం చేసి యోగనిష్ఠుడయ్యాడు.

అప్పుడు ఆయన సంయమం పట్ల మాత్సర్యం వహించిన మారుడు లేఖహారుని రూపంలో వచ్చి, బోధిసత్త్వునితో ఇలా అన్నాడు. "నీకీ అకామ కామన ఏమిటి? లోకంలో ఇలాటిది బంధనం కలిగిస్తుంది. నీ బుద్ధి అకాలంలో తొడిగిన మొగ్గవంటిది. వెర్రితలలు వేసింది. నీకామన ఏమి బాగుంది? నీవు మరణించావనే అనుమానంతో దేవదత్తుడు నీ పట్టణం స్వాధీనం చేసుకున్నాడు: అంతఃపుర కాంతలను చెరబట్టి శుద్ధోదన నృపాలుని కూడా బంధించాడు." శోకామర్షవిషాలను వదలిపెట్టిన సర్వార్థసిద్ధి ఈ వాక్యాలు విని, ఎంత మాత్రమూ వికారం పొందక "ఆహా! మారుడు నా తపస్సుకు విఘ్నం కలిగించడానికి వచ్చాడు. ఈ దుశ్చరితుడు జగత్తును శిఖండిలాగ ఆడిస్తాడు"- అని ఆలోచించి "ఓరీ మార! నీ దౌర్జన్యానికి అంతు లేదా? ఒక్క హింసాయజ్ఞంతోనే నీవీ గతి పొందావు. నేను చేసిన యజ్ఞ దాన తపస్సులను శ్లాఘించుకొనను. ఆత్మగుణశ్లాఘం వల్ల పుణ్యపుష్పం వాడి రాలిపోతుంది" అని నిందించాడు. ఆ నిందకు దేహుల చిత్తచోరుడైన మారుడు తన ప్రయత్నం విఫలమైనందుకు కోపంతో వెళ్లిపోయాడు.

తర్వాత లలితసుందరులు, లాలిత్యకలితనయనాలతో ముఖంపై జీరాడే భృంగాల(అలకల) వంపులతో భృంగతరంగాలు ముసిరే మామిడి కొమ్మలులాగ ఉన్నవారు అయిన ముగ్గురు కొమ్మలు ప్రత్యక్షమయారు. వారు ఆయన తపశ్చర్యతో అసంతృప్తి పడి భయపడిన మారుని కన్యకలు; ఆయన తపస్సును భంగపరచడానికి వచ్చారు. వారు తామరపూలవంటి అడుగులు పెడుతూ ఉంటే, తపోవనమంతా రాగరంజితమైనట్టు తోచింది. వారు కళ్లతో హరిణిని, నడక వయ్యారంతో కరిణిని, ముఖసౌందర్యంతో నళినిని మలినం చేశారు. యౌవనానికి ఆభరణమై, అనురాగమనే మైపూతతో, లావణ్యమనే చీనిచీనాంబరాలతో మెరిసే వారి అంగాలు చూచి జడపదార్థాలకే కామోద్రేకం కలిగింది. వజ్రాసనంలో ధ్యాననిశ్చలలోచనుడైన బోధిసత్త్వుణ్ని చూచి వారికి కూడ విస్మయధ్యానధారణ ఏర్పడింది. విస్మయంతో అట్లే నిశ్చలంగా నిలిచిపోయారు. బోధిసత్త్వుని సంకల్పబలంతో వారికి మదరాగమయమైన యౌవనం మాయమై వెంటనే ముదిమి కలిగింది. అది చూచికొని వారు చాల సిగ్గుపడ్డారు.

తన కుమార్తెలను ప్రయోగించడం ఈ విధంగా ఎదురు తిరగడం చూచి, మారుడు భగ్నమనోరథుడై సైన్యాన్ని సన్నద్ధం చేయడానికి ఆరంభించాడు. అన్ని విధాల ఆయుధాలు, నానాప్రాణిసంతతి భయాలు ఉన్న ముప్పైఆరుకోట్ల సైన్యంతో దండెత్తివచ్చి, కోప క్రూర శరాసనం ఎక్కుపెట్టి, వికారం పెల్లుబుకగా, బోధిసత్త్వుని పైకి ఉరికాడు. మారుడు, అతని బలాలు దుమ్ము, విషం, రాళ్లతో సహా విడిచిన బాణాలన్నీ బోధిసత్త్వునికి మందారాలు, కమలాలు అయాయి. మరొకమారు మారుని బలాలు శస్త్రవృష్టి కురిపించాయి. దేవతలు అతని పర్యంకబంధాన్ని వజ్రంవలె సుస్థిరం చేశారు. మారుడు తన సైన్యంతో ఇక జయం సాధించే సంకల్పం మానుకొని సమాధికి ఇక విఘ్నం చేయడానికి కర్ణకఠోరంగా గంటలు వాయించే స్ఫటికవృక్షం కల్పించాడు. గణగణ మోగే ఆ గంటల చెట్టును, మారుణ్ని, అతని బలాలను వ్యోమదేవతలు ఎత్తి చక్రవాటంలో విసిరివేశారు.



అంతట భగవానుడు నిర్విఘ్నంగా తపస్సమాధి కొనసాగించి ప్రసన్న నిర్మలజ్ఞానం పొంది సర్వజ్ఞుడు, సర్వగామి, సర్వజాతిస్మృతివేత్త అయాడు. అనుత్తరజ్ఞాన సమ్యక్సంబోధిని పొందిన ఆ సర్వజ్ఞుడు సర్వభూతాల కర్మగతిని కనుగొన్నాడు.

పరాజితుడైన మారుడు అంతటితో విరమించక శాక్యనగరానికి వెళ్ళి "తపఃక్లేశంతో బోధిసత్త్వుడు అస్తమించాడు" అనే ప్రవాదం ఆకాశం నుంచి వ్యాపింపజేశాడు. ఆ ప్రవాదం విని పుత్రస్నేహవశుడైన శుద్ధోదనుడు తలపై పిడుగుపడినట్టు కూలిపోయాడు. ఇక అంతఃపురజనం స్థితిని చెప్పవలెనా? వారు, రాజు ప్రాణత్యాగం చేయాలని నిశ్చయించారు. అది చూచి సచ్చరిత పక్షపాతులైన వ్యోమదేవతలు ఈ విధంగా అన్నారు. "రాజా! నీ కుమారుడు అమృతపానం చేసి, సమ్యక్సంబుద్ధుడయ్యాడు. అతడు చూచినవారికి కూడ మృత్యుభయం లేదు!" గగన దేవతల ఈ మాటలు విన్న అంతఃపుర జనానికి, అమాత్యులకు, రాజుకు అమృతము జల్లుపడినట్టు వెంటనే ప్రాణాలు వచ్చాయి. ఆ మహోత్సవానంద సమయంలో బోధిసత్త్వుని మహిషి యశోధరాదేవి సుందరుడైన కుమారుడ్ని ప్రసవించింది. ఆనాడు రాహుగ్రస్త చంద్రగ్రహణం కూడ. ఆ శిశువు జన్మవిషయమై శంకిస్తున్న శుద్ధోదన నరపతికి నమ్మకం కలిగించడానికి యశోధరాదేవి ఆ శిశువుకొక రాయికట్టి నీటిలో పడవేసింది. ఆ శిశువు అందరూ ఆశ్చర్యపడేట్టు రాయితో పాటు పైకి తేలాడు. ఆ శిశువుకు రాహులుడని నామకరణం చేశారు.

అక్కడ తపోవనంలో బోధిసత్త్వుడు ఏడునాళ్ల వజ్రపర్యంక బంధాసనంలో నిశ్చలంగా ఆసీనుడై తపమాచరించాడు. అది చూచి దేవతలు కూడ ఆశ్చర్యపడ్డారు. ఆయనను బ్రహ్మకాయికులనే ఇద్దరు దేవతలు మేల్కొల్పారు. పరమానందసుధ పెల్లుబుకుతుండగా, ఆయన మేల్కొని ఇలా బిగ్గరగా అన్నాడు. "ఆహా! నే నీ సుఖస్థితిని మొట్టమొదట తెలుసుకొన్నాను. దీనిముందు సురాసురైశ్వర్య సుఖం దుఃఖాలపుట్ట. అందాలు చిందే తరుణాంగనలు, అమృతం తొణికిసలాడే స్వర్గసంభోగసుఖం ఈ అశేష త్యాగలీలాసుఖంతో పోటీ పెట్టి చూస్తే, దుమ్మూ ధూళీవలె నిస్సారం కదా! విషమ విషయ క్లేశమయమైన ఈ సంసారమార్గంలో తిరుగుతూ, తాపంతో అలసిసొలసి, శాంతిని శరణు పొందాను. చందనచ్ఛాయవలె నాకు సకలాంగ సుఖదాయకమైన నిర్వృతి లభించింది. శాంతి శీతల ప్రాంతంలో విశ్రమించినవారి సుఖానికి ఏది సాటి?"

ఆ సమయంలో త్రపుస భల్లికులనే ఇద్దరు వర్తకులు పెద్ద వర్తక సమూహంతో పుణ్యపరిపాకం వల్ల ఆ అరణ్యానికి వచ్చారు. దేవతా ప్రేరణగా వారు భగవానుని సమీపించి నమస్కరించి, భిక్ష స్వీకరించవలసిందని కోరారు. దయావిధేయుడైన సర్వజ్ఞుడు వారి మాటలు విని "పూర్వులు భిక్షాపాత్రలో భిక్ష తీసుకున్నారు. పాత్రలేక వట్టి చేతితో తీసుకోలేదు" అని అనుకుంటుండగా, మహారాజికులనే దేవతలు నాలుగు స్ఫటిక భిక్షాపాత్రలిచ్చి స్వర్గానికి వెళ్లారు. పిదప భగవానుడు భిక్షాపాత్రలో భిక్ష గ్రహించి, ఆ యిద్దరు వర్తకులకు త్రిశరణ్యాలు ఉపదేశించి అనుగ్రహించాడు.

సాధుసంగం విస్తారసుకృతానికి సాక్షి; పుణ్యనిక్షేపాలు కలిగించ గల సామర్థ్యం కలది; ఆపదలన్నిటినీ క్షయింపజేస్తుంది; ప్రార్థనలకు కల్పవృక్షం వంటిది. శుభపరిణామ దీక్షను సిద్ధింపజేసేది. ఇలాంటి సాధుసంగం, పుణ్యం వల్ల ఎవరికో భాగ్యశాలికి అబ్బుతుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మారవిద్రావణావదానమనే ఇరవై ఐదవ పల్లవం.

# 26. శాక్యోత్పత్త్యవదానం

కుశలానుబంధి అయిన గొప్ప వంశం ఉత్తమజాతి వంశం(వెదురు) వంటిది. వంశమేమో గుణసంగ్రహోచితమైన చారువృత్తం (ఉత్తమ చరితం) గలది, విశుద్ధరుచి చేత సత్ప్రకాశం(సత్యప్రకాశం) తెలిపేదీ, ముక్తామయమైనదీ (ఆమయరహితమైనదీ), జగదలంకరణమైనదీ అయిన రత్నాన్ని ప్రసవిస్తుంది. వెదురేమో గుణసంగ్రహోచితమూ(అల్లె తాడు కట్టడానికి ఉచితమైనదీ), చారువృత్తమూ(చక్కగా గుండ్రంగా వుండేది), విశుద్ధరుచితో సత్ప్రకాశం(మంచికాంతిని) ఇచ్చేదీ, జగదలంకరణమైనదీ, ముక్తామయమైన (ముక్తారూపమైన) రత్నాన్ని ప్రసవిస్తుంది.

భగవానుడైన తథాగతుడు కపిలవస్తు నగరంలో న్యగ్రోధారామంలో విశ్రమించి వుండగా, శాక్యులు తమ వంశం పూర్వ చరిత్ర తెలుపవలసిందిగా ప్రార్థించారు. వారి ప్రార్థనను మన్నించి భగవానుడు తాను స్వకులోత్పత్తిని గురించి చెప్పక మౌద్గల్యాయనునికి తన ప్రభావంతో విమలజ్ఞానం కలిగించి, శాక్యోత్పత్తిని గురించి చెప్పమని ఆదేశించాడు. మౌద్గల్యాయనుడు జ్ఞానచక్షువుతో అతీతాన్ని యథాతత్త్వంగా గ్రహించి, గతచరితం స్మరించి ఇలా అన్నాడు:

"పూర్వం ఈ జగత్తంతా జలమయంగా మహార్ణవంగా ఉండింది. అప్పుడు గాలి సోకడం వల్ల నీరు పాలలాగ మారింది. ఆ నీరు క్రమంగా ఘనీభవించి కఠినం కాగా, వర్ణరసస్పర్శశబ్దగంధమయి అయిన పృథివి ఆవిర్భవించింది. ఆ భూమి మీద కర్మపరిక్షయం వల్ల కాంతిమయులైన దేవతలు జారిపడ్డారు.

"అప్పుడు వారితో సమానమైన రంగు, కాంతిగల ప్రాణులు అధిక సత్త్వబలాలతో పుట్టాయి. వారికి తీవ్రమైన దప్పి కలిగింది. అప్పుడు వ్రేలితో భూమిలోని వస్తువులను రుచి చూచారు. ఆ ఆహారదోషం వల్ల గురురూక్షవైవర్ణ్యాలు పొందారు. వసుంధర క్రమంగా వారికి అన్నదాత్రి అయింది. వారు చీకట్లనుంచి వెలువడి ఇళ్ళు వాకిండ్లు, భూమి పుట్ర చేసుకొన్నారు. వారినుంచి భూమి రక్షణలో క్షతంనుంచి ప్రజలను కాపాడడం వల్ల ఈ పేరు వచ్చింది. అతని వంశంలో మహాకాంతితో ఉపోషధుడు అనేవాడు సముద్రం నుంచి పారిజాత వృక్షం ఉదయించినట్టు ఉదయించాడు. పారిజాతకుసుమాలు ఎప్పుడూ వాడనట్టే అతని కీర్తికుసుమమూ ఎప్పుడూ వాడలేదు. అతనికి అయోనిజుడైన మాంధాత అనే కుమారుడు పుట్టాడు. చక్రవర్తి అయి జగత్తునంతా ఏకచ్ఛత్రంగా పాలించిన అతని వంశం గొప్పగా విస్తరించింది. అతని వంశంలో కృకి అనే రాజు పుట్టాడు. అతనికి భగవానుడైన కాశ్యపుడు చిత్తప్రసాదం కలిగించాడు. ఆతని వంశంలో ఇక్ష్వాకు పుట్టాడు. అతనకి విరూఢకుడు కలిగాడు. ఆ విరూఢకుడు చిన్న కుమారునిపై ప్రీతితో జ్యేష్ఠపుత్రులందరినీ వెళ్ళగొట్టాడు. వారందరూ స్వదేశంపై ఆశ వదలుకొని, కపిలుడనే మహర్షి ఆశ్రమం చేరారు. వారు కుర్రతనం వల్ల పెద్దగా కేకలు వేస్తూ తన ధ్యానకాలంలో విఘ్నం



కలిగిస్తూ వుండం వల్ల వారికోసం కపిలమహర్షి కపిలవస్తువు అనే పట్టణం నిర్మించాడు. కొంతకాలానికి విరూఢకుడు మనసు మారి పుత్ర వాత్సల్యంతో తన జ్యేష్ఠకుమారులందరినీ పిలుచుకొని రావలసిందిగా మంత్రులకు ఆజ్ఞ యిచ్చాడు. "రాజన్, వారు ఉత్తమమైన పురం పొందారు. సంతానం, సంపద కూడ గొప్పగా పొందారు. కనుక వారిని మరల పిలుచుకొని రావడం అశక్యం- వారు రావడానికి అశక్యులు" అని మంత్రులు మనవి చేశారు. ఇలా తండ్రి వారిని గురించి శక్యాశక్య విచింతన చేయడం వల్ల వారికి శాక్యులనే పేరు వచ్చింది. వారిలో వంశకరుడు నృపురుడు అనేవాడు. ఆ వంశంలో ఇరవైఐదువేలమంది రాజులు వెళ్ళిపోగా దశరథుడనే రాజు జన్మించాడు. అతని వంశంలో సింహహనుడనే రాజు పుట్టాడు. పరరాజకుంజరులకు యుద్ధములో అతడు సింహంలాగ సహింపరాని వాడుగా వుండేవాడు. అతనికి శుద్ధోదనుడనే వాడు జ్యేష్ఠపుత్రుడు; తర్వాతివాడు శుక్లోదనుడు, వాని తమ్ముడు ద్రోణోదనుడు, కడగొట్టువాడు అమృతోదనుడు. శుద్ధ, శుక్ల, ద్రోణ, అమృత అనే నలుగురు కుమార్తెలూ ఉదయించారు. శుద్ధోదనునికి ఈ భగవానుడు మొదటి కుమారుడు, రెండవవాడు నందుడు, శుక్లోదనునికి తిష్యుడు, భద్రకుడు అని ఇద్దరు కుమారులు, ద్రోణోదనునికి అనిరుద్ధుడు, మహాన్ అని ఇద్దరు పుత్రులు, అమృతోదనునికి ఆనందుడు, దేవదత్తుడు అనే వారిద్దరు పుట్టారు. శుద్ధాదేవికి సుప్రశుద్ధుడు, శుక్లాదేవికి మాలికుడు, ద్రోణాదేవికి భద్రాణి, అమృతాదేవికి వైశాలి పుట్టారు. భగవానుని పుత్రుడు రాహులుడు. అతనితో ఈ వంశం ప్రతిష్ఠించబడింది."

ఈ విధంగా ఉజ్జ్వలజ్ఞానమయుడైన మౌద్గల్యాయనుడు తమ వంశ క్రమాన్ని యథావత్తుగా చెప్పగా విని శాక్యులు భగవానుని ప్రభావంతో తమ అంతరంగం మరింత పరిశుద్ధం చేసుకొన్నారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శాక్యోత్పత్త్యవదానం అనే ఇరవై ఆరవ పల్లవం

# 27. శ్రోణికోటీవింశావదానం

వివేకబంధువు, పుణ్యోపపన్నుడు అయిన మహాపురుషుని సత్త్వ ప్రభావం గొప్పది. అది నూరుజన్మలెత్తినా కస్తూరి కట్టిన గుడ్డలా వాసన వదలదు.

సర్వ జగజ్జంతువుల సంతాపాన్ని పోగొట్టే కరుణాప్రాదంవంటి జినదేవుడు రాజగృహనగరంలో వేణువనంలో విహరిస్తున్న సమయమది. అప్పుడు చంపానగరంలో పోతలుడనే గృహపతి వుండేవాడు. అతడు మహాశ్రీమంతుడు. అతడు తనధనంతో ధనదుడైన కుబేరుని ధనదర్పాంధ్యం కూడ పోగొట్టాడు. అతని ధనం ఈప్సితం నెరవేడానికో అన్నట్టు పెక్కు కోరికలుగల కుమారుడొకడు అతనికి కలిగాడు. సంపదలెప్పుడూ సుఖానికి సఖులుగదా! ఆ కుమారుడు శ్రవణ నక్షత్రంలో పుట్టడం వల్ల, అతడు పుట్టినప్పుడు రాజు ఇరవై కోట్లు దరిద్రులకు దానం చేయడం వల్ల ఆ కుమారునికి శ్రోణికోటీవింశుడనే పేరు పడింది. విభవాన్ని(ఐశ్వర్యాన్ని) సుకృతం లాగ అతడు వంశాన్ని అలంకరింపజేశాడు. అతడు చదువుకొని, సకలార్థాలతో పాటు వృద్ధిపొందుతూ, తండ్రి కార్యాలను కూడ చక్కబెట్టి అతనికి విశ్రాంతి కలిగించాడు.

ఇలా వుండగా ఒకమారు ఆ పట్టణానికి మౌద్గల్యాయనుడు వెళ్లాడు. సూర్యమండలం నుంచి ప్రభాపుంజం జరిగి వచ్చినట్లున్న అతనిని చూచి, శ్రోణికోటీవింశుడు ఆశ్చర్యపడి "అయ్యా! నీవెవరు? దిగంతరాలను ప్రకాశింపజేస్తూ సూర్యునివలె ఉన్నావు. త్రిదశేశుడివా? చంద్రుడివా? కుబేరుడివా?" అని ప్రశ్నించాడు. మౌద్గల్యాయనుడు నవ్వి "నేను దేవతను కాను; విబుధాదీశవంద్యామాన గుణసంపదగల బుద్ధ భగవానుని శిష్యుణ్ణి, నీవు ఆ మహామునికి పిండపాతం(భిక్ష) చేయి. సత్త్వశుద్ధోదయావాప్తమైన పిండపాతం భగవానునికి భోగ్యమూ, ప్రియమూను"అని ఉపదేశించాడు. శ్రోణకోటీవింశుడు జాత్యా రవి పూజకుడైనా, భగవానుని నామధేయం చెవిని బడగానే, ఒళ్ళు పులకించింది. ఎవ్వనికి ఏ ప్రాగ్జన్మ వాసనాయుక్తమైన స్వభావం వుంటుందో అది ఈషణ్మాత్రం ప్రేరణ పొందినా, ప్రస్ఫుటమౌతుంది.

అనంతరం వాడు దేవభోగ్యమైన వింశతిస్థాలీ భాగపు భక్ష్యభోజ్యాలను భక్తి శ్రద్ధాయుక్తమైన మనస్సుతో భగవానునికి పంపాడు. అతడు పంపిన భోజనసామగ్రిని స్వీకరించవలసిందని భక్తబృందం అనురోధం చేయడం వల్ల భగవానుడు దానినంతా తనే స్వీకరించాడు. ఆ సమయంలో రాజోచితమైన స్థాలీభాగం తీసుకొని బింబిసారుడు వచ్చాడు. శ్రోణుడు పంపిన స్థాలీభాగం సుగంధం బింబిసారుడు ఆఘ్రాణించి, బహుశా ఇంద్రుడు పంపి వుంటాడని భావించాడు. పిదప పాత్రశేషం భగవానుడు ఇవ్వగా బింబిసారుడు ఆస్వాదించి, శ్రోణుడు పంపాడని తెలిసి చాల ఆశ్చర్యపడ్డాడు. బింబిసార నరపతి భగవానునికి ప్రణామం చేసి రాజధానికి తిరిగి వచ్చిన పిదప శ్రోణుని మహాదైశ్వర్యం తలచుకుని "ఆ



మహాయశుణ్ణి స్వయంగా వెళ్ళి చూస్తాను" అని నిశ్చయించి చంపానగరానికి యాత్ర సిద్ధం చేయండని మంత్రులను ఆదేశించాడు.

రాజు ప్రయాణ సమాచారం పోతలునికి తెలిసి నీతిజ్ఞుడైన తన పుత్రుణ్ణి ఏకాంత ప్రదేశానికి పిలిచి రహస్యంగా ఇలా అన్నాడు. "పుత్ర, వర్ణాశ్రమ గురువయిన నరపతి నిన్ను స్వయంగా చూడడానికి రావడమనేది గొప్ప విషయమే. కాని దీనిలో ఏదో దోషముందని నాకు తోస్తున్నది. రాజులు తమ దృష్టిలో పడినవాడిని పక్షపాతం గలవారివలె నటిస్తూ, వెంటనే గుణచ్యుతులై గుణచ్యుతాలైన (నారి నుండి విడువబడిన) శరాల్లాగ చంపుతారు. అతిశయమైన విభవోన్నతి గలవారిని భృత్యులు కూడ ద్వేషిస్తారు అన్నప్పుడు అభిమానసారులైన మహీపతుల సంగతి చెప్పాలా? రూపంలోను, వయస్సులోను, ప్రభావంలోను, విభవంలోను, విద్యలోను తన కుమారునితో పోటీ వచ్చినా తండ్రి సహించడు. ద్వేషమయమైన ఈ లోకంలో గుణాలను కప్పిపుచ్చుకొని బ్రతకవలసివుంది. పద్మం ఆచ్ఛాదితగుణమైనా తీక్ష్ణభానుడు వదలడు. ఉద్ధతుణ్ణి అందరూ ద్వేషిస్తారు. వినయవంతుణ్ణి అందరూ ప్రేమిస్తారు. గాలి నీల్గి నిలబడివున్న చెట్టును కూలదోస్తుంది కాని, వంగిన రెల్లును కాపాడుతుంది. నీవే వెళ్లి దర్శించవలసిన భూపాలుడు తానే నీయింటికి రావడమనేది నీకు దర్పమోహ కారణమవుతుంది. ఇది నీకు శ్రేయస్కరం కాదు. కనుక, నీవే ఇక్కడనుంచి వెళ్లి నమస్కరించదగిన ఆ ప్రభువుకు నమస్కరించి, నక్షత్రరాశివంటి ముక్తాహారాన్ని ఉపాయనంగా సమర్పించు."

తండ్రి మాటలు విని శ్రోణుడు రత్నవిభూషితుడై మహీపతిని సందర్శించడానికి నావ యెక్కి బయలుదేరాడు. బింబిసారుని రాజధాని చేరి అతనిని దర్శించి ప్రణామం చేసి లక్ష్మీదేవి హర్షహాసం వలె వున్న ముక్తాహారం కానుకగా ఇచ్చాడు. రాజు తను వెళ్లకముందే తన వద్దకు వచ్చిన శ్రోణుని, హేమరోమాంక చరణుని చూచి ఆశ్చర్యంతో ఇలా అన్నాడు. "ఆహా! నాదెంత పుణ్యం! నీవు నాకు పుణ్యంతో పొందిన పూర్వజన్మ బంధుడివి. నిన్ను చూడగానే నా మనోవృత్తి ప్రసన్నమైంది. గుణాలను మించినది ఐశ్వర్యం, దాన్ని మించినది సుఖం, సుఖానికంటే ఉత్తమమైంది ఆరోగ్యం, దానికంటే గొప్పది సాధుసంగమం. ఓ సాధో! నీవు వేణువనంలో భగవానుని దర్శించావా? ఆయన పాదపద్మయుగళం నీవు తప్పక దర్శించాలని నా అభిప్రాయం." క్షితినాథుడు సౌజన్యంతో, తనపై పక్షపాతంతో ఇలా అనగానే, శ్రోణికోటీవింశుడు కూడా కొంత చనువు తీసుకొని ఇలా అన్నాడు. "ఓ దేవా! నీ అతుల్య కల్యాణకరమైన అనుగ్రహం వల్ల నాకిప్పుడు భగవానుని దర్శించడానికి యోగ్యత కలిగింది." శ్రోణికోటీవింశుడు ఇలా అనగానే, తథాగతుణ్ణి దర్శించడానికి రాజు, అతనితోపాటు కాలినడకనే వేణువనానికి బయలుదేరాడు.

శ్రోణికోటీవింశుడు జన్మమొదలు భూమిపై అడుగుపెట్టినవాడు కాడు గనుక అతని సేవకులు అమూల్యవస్త్రాలతో అతడు నడిచే దారిని కప్పారు. అతడు భగవానునిపై గల భక్తి వినయాలకొద్దీ, రాజుపై గౌరవంకొద్దీ, సిగ్గుపడుతూ, భూమిపై గుడ్డలు పరవడం వద్దని సేవకులకు ఆజ్ఞాపించాడు. భూమి దివ్యవస్త్రాలతో ఆచ్ఛాదితమైంది. పుణ్యవంతులకు సంపదలు అప్రయత్నంగానే ఉపకరణాలు ఒదిగిస్తాయి. ఆ దివ్య వస్త్రాలను కూడా అవతలికి తోసి అతడు భూమిపై అడుగుపెట్టగా, శైల వన సాగరసహితయైన పృథ్వి కంపించింది. తర్వాత అతడు భూమిపతితో పాటు వేణువనాన్ని చేరి భగవానుని దర్శించి, అతనికి

పాదవందనం చేశాడు. పాదాభివందనం చేసి సంతోషంతో, శమ వివేకంతో ఎదుట కూర్చున్న అతనిని భగవానుడు తన ఆలోకనామృతంతో అభిషేకించాడు. ఆశయానుశయాన్ని ధాతుప్రకృతిని వైద్యునిలాగ భగవానుడు పరిశీలించి అతనికి సత్యసందర్శనం కోసం ధర్మోపదేశం చేశాడు.

ఆ ఉపదేశం విని వింశతి శృంగాలు గల అతని సత్కాయదృష్టిశైలం జ్ఞానవజ్రంతో భగ్నమై, అతనికి స్రోతాపత్తిపదం లభించింది. వెంటనే అతనికి తనంతటనే ప్రవ్రజ్యాదీక్ష కలిగింది. అది చూచి రాజు విస్మితుడై తన రాజధానికి వెళ్లిపోయాడు. శ్రోణుడు తీవ్రనిష్ఠతో భగవానునికి సపర్య చేశాడు. అతడెంత తీవ్రవ్రతధారి అయినా, వాసనాశేష సంస్కారం వల్ల ఒకానొకప్పుడు బంధుస్మృతి, భోగస్మృతి కలిగాయి. అప్పుడు భగవానుడు సిగ్గుపడుతున్న అతన్ని పిలిచి, నవ్వుతూ, "మనస్సులో ఏదో వితర్కం పుట్టింది. వీణ తీగ వదులుగా వున్నా, మరీ గట్టిగా బిగించినా అపస్వరం పలుకుతుంది. సమంగా వుండేది మధురస్వరం పలుకుతుంది. కనుక, సామ్యం ఆశ్రయించాలి" అని ఆదేశించాడు. ఆ ఆదేశంతో శ్రోణుడు సర్వసామ్యం అవలంబించి, పశ్చాత్తాపం వర్జించి విమలజ్ఞానం పొందాడు.

శ్రోణుని అద్భుతసిద్ధిని చూచి మహాశ్చర్యం పొందిన భిక్షువులు కారణమేమిటని ప్రశ్నించగా భగవానుడు ఇలా అన్నాడు.

"శ్రోణుడు జన్మాంతరంలో ఆర్జించిన శ్రేయస్సును వినండి. పుణ్యానుభావం లేనిది అద్భుత సంపదలు కలుగవుకదా! పూర్వం విపశ్యి అనే సమ్యక్సంబుద్ధుడు బంధుమతి అనే పట్టణానికి వెళ్లాడు. అక్కడ కొందరు సుకృతులు అతనిని భక్తితో భోజనానికి ఆహ్వానించారు. ఆ మహానుభావుడు వారానికొకరి యిల్లు ప్రకారంగా వెళ్లి ఆతిథ్యం స్వీకరించాడు. ఒకనాటి వారభోజనం ఇంద్రసోముడనే దరిద్ర బ్రాహ్మణకుమారుడు ఏర్పాటు చేశాడు. అతడు ఎంతో ప్రయత్నంతో భక్తితో పవిత్రమైన భోజనం సిద్ధపరచి, ఆయన నడిచే దారిని గుడ్డలు పరచి, భోజనం వినయంతో సమర్పించాడు. ఆ భోగప్రణిదానంతోనే మహాధనవంతుడు, సువర్ణరోమచరణుడు, దేవసమానుడు అయిన శ్రోణికోటిగా జన్మించాడు. గుడ్డ పరవనిదే ఇతడెప్పుడూ నేలమీద అడుగు పెట్టలేదు. కనుకనే ఆ గుడ్డలేనిదే అడుగు పెట్టగా భూమి కంపించింది."

సుగతుని దశనకాంతిలాగే దశదిక్కులనూ ప్రకాశింపజేసే సుధావదాతమైన అతని మాటలను పానం చేసి, భిక్షుసంఘం స్థిరమైన కుశలం కోసం దృఢసంకల్పం కలదిగా అయింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శ్రోణికోటీవింశావదానమనే ఇరవై ఏడవ పల్లవం

# 28. ధనపాలావదానం

దుర్మార్గులు దౌర్జన్యంతో దుస్సహమైన మహాపకారాలు చేసినా, మహాత్ములు మనస్సులో వికారం పొందరు. సర్పాలు, పర్వతాలు ఆకులం చేసినా సముద్రం హృదయం నుంచి అమృతస్వభావం వదలిందా?

భగవానుడు రాజగృహంలో కలందకమనే వేణువనంలో విహరిస్తున్న దినాలవి. బింబిసారునికి అజాతశత్రువనే కుమారుడుండేవాడు. అతడు శత్రువిద్రావణుడు. అతనికి శాక్యవంశీయుడైన దేవదత్తుడనే మిత్రుడుండేవాడు. అతడు వేతాళునివలె అజాతశత్రువునకు క్షుద్రమైన మంత్రాలోచన చెప్పేవాడు.

అజాతశత్రువు ఒకనాడు సుఖాసనాసీనుడై వుండగా, దేవదత్తుడు వచ్చి ఇలా అన్నాడు. "రాజన్! నీ ఆశ్రయం నాకింత వరకూ ఏమీ ఫలించలేదు. పరస్పరం బూటకపు ఉపచారాలు లేక సుఖదుఃఖాలలోను, మంత్రతంత్రాలలోను మనోరథాలలోను పరస్పరం కాపాడు కోవడం వల్ల మిత్రశబ్దం ప్రవర్తిల్లింది. వేణువనంలో సుఖంగా వున్న ఆ శాక్యశ్రమణుని చంపి దేవవందితమైన ఆ పదవిని పొందదలచాను. శత్రువులను క్షయింపజేయని, యశస్సు పొందని, గౌరవం పొందని మిత్ర సంపద ఎందుకు? రాజగృహంలోని మహాధనుడనే వాని ఆహ్వానంతో ఆ దాంభిక భిక్షువు తక్కిన భిక్షువులతోపాటు రేపు ఉదయం వస్తాడట. ఆతడు రాజమార్గంలో వస్తున్నప్పుడు క్రోధాంధమైన ధనపాలకమనే ఆ మదగజాన్ని వదలి పెడదాం." దేవదత్తుడిలా అనగా అజాతశత్రువు బుద్ధుని ప్రభావం తెలిసినవాడు గనుక మిత్రవత్సలుడైనప్పటికీ ఏమీ సమాధానం చెప్పక తలవంచుకొని వున్నాడు.

దేవదత్తుడు అతని మౌనాన్ని అంగీకారంగా భావించి, రాజ సౌహార్దదుర్మదంతో హస్తిపాలకుడైన మహామాత్రుని వద్దకు వెళ్ళి, అతనికి కానుకలిచ్చి సంతోషపెట్టి, "రేపు ఉదయం భిక్షుశతపరివృతుడై శ్రమణుడు నగరానికి వస్తాడు. అప్పుడు నీవు ధనపాల మదగజాన్ని పురికొల్పాలని రాజు సెలవిచ్చాడు" అని చెప్పాడు. దేవదత్తుని మాటకు ద్విపాధిపుడు సరేనన్నాడు.

సర్వజ్ఞుడు భగవానుడు ఆ పాపాత్ముల అభిప్రాయం తెలుసుకున్నప్పటికినీ, ఐదువందలమంది భిక్షువులు వెంటరాగా మరుసటి ఉదయం నగరంలో ప్రవేశించాడు. ఆ సమయంలో మావటివాడు ధనపాల మదగజాన్ని అతని మీదికి వదిలాడు. ఆ మదగజం దారిని తగిలిన మేడలను, మానులను కూల్చివేస్తూ, క్రోధాంధమై భగవానునిపైకి ఉరికింది. గురువుకు కూడా లొంగని దుష్టవిద్వాంసునివలె ద్వేషిస్తూ, అంకుశానికి లొంగక, మదమలినమై, తన సేవలోనే మగ్నులైవున్న భృత్యులను కూడా తరచు కర్ణచాపలం వల్ల (చెప్పుడు మాటలు వినడం వల్ల) ప్రాణాలు హరిస్తున్న దుష్టజనపతిలాగ తన మదజలం వెంటబడి సేవచేస్తున్న భృంగాలను తరచు కర్ణ చాపలం వల్ల(చెవులు కొట్టుకొనడం వల్ల చంపివేస్తూ, మందిరాలను కూలుస్తూ, చెట్లను పెల్లగించి వేస్తూ, వస్తున్న ఆ ఏనుగును చూచి జనమంతా చిందరవందరగా

పరిగెత్తారు. ఎక్కడ చూచినా హాహాకారమే చెలరేగింది. ఆ మదగజం చెవులు కొట్టడం వల్ల రేగిన గాలితెరలకు దాని గండస్థలం మీది సిందూరం వాకలైకట్టి భయంతో పరుగెత్తిన స్త్రీల రక్తదుకూలమనే భ్రమ కలిగిస్తూ రాజవీధి నిండిపోగా, ఉద్దండోచ్చండశుండాదండం తిప్పడం వల్ల కలిగిన శబ్దంతో దిక్కులన్నీ భయపడి అలసి ఎటుచూచినా పరువిడే భ్రమరాలతో తమ సంరంభం తెలిపినట్లు కనిపించింది. పట్టణం పాడయిపోతున్నదని ప్రజలు బాధపడి కోలాహలం చేస్తుండగా, ప్రమత్తమతి అయిన దేవదత్తుడు పెద్ద హర్మ్యం ఎక్కి వినోదం చూడసాగాడు. భగవానుణ్ని ఏనుగు ఎలా తాకి పట్టుకొంటుందో చూద్దామని చాల ఉత్సుకతో ఉన్నాడు. గుణవంతులను ధ్వంసం చేసి దుర్మార్గులు సంతోషపడుతారు.

గజభయంతో భిక్షువులందరూ పరుగెత్తిపోగా, భగవానుని వద్ద ఆనందుడొక్కడే నిలబడ్డాడు. అప్పుడు భగవానుని చేయి నుంచి ఐదు సింహాలు కరాళకేసరసటలతో ఆయన నఖాంశువులతో నిర్మింపబడినవా అన్నట్టు బయలు వెడలాయి. ఏనుగు దర్పాపస్మార నివారణమైన పంచాననగంధం సోకగానే మూత్రపురీషాలు విడిచి, వెంటనే పరాఙ్ముఖమైంది. వేగంగా పరుగెత్తుతూ, మదముడిగి చూడగా, దశదిక్కులా పెద్ద మంటలు కనిపించాయి. ప్రపంచమంతా జ్వలజ్జ్వలనజ్వాలాకులం కావడం చూచి, చల్లబడి, శాస్త అయిన బుద్ధదేవుని పాదపద్మ సన్నిధికి చేరింది. తన వాంఛలన్నీ సంకోచం పొందగా, చింతాకులిత మనస్సుతో, క్రుంగిపోయిన ముఖకాంతితో, పరితాపంతో గమనం కూడా శిథిలమైపోగా, క్లేశంతో వేడినిట్టూర్పులు విడస్తూన్న ఆ గజం కరం (తొండం) దైన్యం పొంది, దాన (మద) జలం, మధుపకోలాహలం లేక, లోభాంధుని మహావ్యయోత్సవం వలె భారంగా అయింది.

భయంతో తన పాదతలసన్నిధికి వస్తున్న ఆ ఏనుగును కారుణ్యాసాగరుడైన శాస్త, చక్రస్వస్తికాది శుభలక్షణలక్షితమైన చేతితో తాకాడు. పిదప తన చేతిని దాని కుంభస్థలంపై పెట్టి ఇలా అన్నాడు: "పుత్ర! నీచేతల మూలంగానే ఇలాటి దశను పొందావు. వివేకాలోకాన్ని కప్పే మేఘం వంటిది మాంసపర్వతం వంటిది, మోహ సంభారం వంటిదీ అయిన ఈ దేహం నీకు భారమైనది; పాపం వల్ల పొందావు." ఈ మాటలు అనగానే ఏనుగు భయపడి, ఊపిరితీసుకొన్నట్లై తన కట్టుకొయ్యలో దూరి కదలకుండా నిలబడింది. దేవదత్తుని మహోత్కటమైన సంకల్పం, కుంజరంలాగే విరుగగా ప్రజలు మహా సంతోషంతో అద్భుతపడుతూ వుండిపోయారు.

తర్వాత సుగతుడు మహాధనగృహపతి యింట భోజ్యప్రతిగ్రహం చేసి, భిక్షువులతోపాటు వేణువనానికి బయలు దేరాడు. అప్పుడు గజేంద్రుడు కూడా వచ్చి, అతని పాదాబ్జాలు తొండంతో తాకి, కుంజర రూపం వదలి ధవళకాంతితో చతుర్మాహారాజిక దేవతలలో పుట్టి వెంటనే సుగతుని దర్శనానికి వచ్చాడు. సుగతుడు ఆశ్రమం చేరిన తర్వాత, అర్కసంకాశుడైన అతనిని ఆ దివ్యపురుషుడు తన మణికుండలాలు వెలిగిపోతుండగా, తన కేయూరముకుట ప్రభాపల్లవాలు మేఘమండలానికి ఇంద్రచాపకాంతిని కలిగించగా నమస్కరించి శాస్త ఎదుట కూర్చుని, విగతకల్మషుడై సత్త్వగుణంవలె శుభ్రమైన దివ్యపుష్పాలు అతనిపై చల్లి "భగవన్! నీ పాదపద్మ సంస్పర్శనంతో నాదుర్దశాదుఃఖ సంతాపం శమించి సంతోషం కలిగింది. భగవానుని దృష్టి శమగుణంతో శ్లాఘ్యమైనది. వ్యసన విషదోషతాపం శమింపజేసేది. సుధావృష్టి వంటిది. ఆ దృష్టి ప్రసరించిన పశువు కూడ ఖరతరమైన వికార వ్యతికరం మాని, మోహం తొలగి, శాంతిని పొందుతుంది" అని విన్నవిస్తుండగా భగవానుడు భవశాంతి నిమిత్తం సత్యదర్శన సంశుద్ధమైన



ధర్మోపదేశం చేశాడు. అతడు తన కిరీటపు ముత్తేల ధవళకాంతితో భవభ్రమను పరిహసిస్తున్నవాడివలె సుగతుని చరణాలకు నమస్కరించి, తన ముఖశశితో ఆకాశాన్ని ప్రకాశింపజేస్తూ వెళ్ళిపోయాడు.

అతడు వెళ్లిన తర్వాత భిక్షువులు ప్రశ్నించగా, భగవానుడు తద్వృత్తాంతం ఇలా తెలిపాడు: "పూర్వకల్పాంతరంలో కాశ్యపుడనే శాస్త శాసనకాలంలోను, ప్రవ్రజ్యదీక్ష పొందినప్పటికీ శిక్షాపదాల ఎడ నిరాదరుడయ్యాడు. అనాదరం వల్ల కుంజరజన్మ, సంఘాన్ని సేవించడం వల్ల భోగం, సత్యదృష్టిబలంతో కడపట సుగతశాసనపరిగ్రహమూ కలిగాయి. కర్మోపదిష్ట సంబంధ భక్తి భోగాలతో సంస్కారం పొందిన ఎవరినీ ప్రాగ్జన్మ విహితమైన కర్మ వదలదు. ఆ ఘోరమైన విపత్తులో, భిక్షువులందరూ నన్ను వదలి ప్రాణభయంతో పారిపోయారు. ఒక్క ఆనందుడు మాత్రం వదలలేదు. దీనికి కూడా పూర్వ సంబంధం వుంది.

"పూర్వం శశాంకశీతమనే సరస్సులో పూర్ణముఖము, సుముఖము అనే రెండు సుందర రాజహంసలు, తోడబుట్టినవి ఉండేవి. పూర్ణముఖం బ్రహ్మదత్తమహీపతి వారణాసిలో నిర్మించిన బ్రహ్మమతి అనే రమ్యమైన పుష్కరిణికి వెళ్లింది. అక్కడ అది ఐదువందల హంసలతో అలలకు అల్లలనాడే కమలాల కేశరాలు, కింజల్కాలతో పరిపింజరమై విహరించింది. అది పూర్వపుణ్యానుభావంతో రూపాతిశయోజ్జ్వలం కావడం వల్ల ఆ నగర పౌరులు తమ పనులు కూడా మానుకొని కనురెప్పపాటు కూడా మరిచి దాన్నే చూచేవారు. ఈ సంగతి రాజు వరకూ ప్రాకింది. రాజు దానిని చూడదలచి, పట్టుకోవడానికి కుశలులైన జాలరివారిని పంపాడు. కమలాలీలాస్మితం వలె తెల్లని ఆ రాజహంసను జాలరులు పట్టుకొనగానే, ఐదువందల హంసలూ పరిగెత్తి పోయాయి. వాటిలో ఒక్కటి మాత్రం పట్టుబడకపోయినా పట్టుబడినట్టు వుండి, ప్రేమపాశవశీభూతమై దానికోసం దుఃఖించింది. జాలరులు ఆ రెంటినీ రాజువద్దకు తీసుకొనివెళ్లారు. రాజు పట్టుబడిన రాజహంసను చూచాడు. పట్టుబడకపోయినా స్నేహబద్ధమై వచ్చిన ఆ రెండవదాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. ఆ పూర్ణముఖమనే రాజహంసను నేనే. వెంట వచ్చిన హంస ఆనందుడు. అప్పటి హంసలలాగే ఇప్పుడు భిక్షువులూ నన్ను వదిలిపెట్టి వెళ్లారు.

"మరొక సంగతి కూడా వినండి. పూర్వం వారణాసిలో తుష్టి అనే రాజుండేవాడు. అతని కీర్తిని శత్రురాజులు తమ మనఃఫలకాలపై వ్రాసుకొన్నారు. అతనివద్ద సంగ్రామాగ్రేసరుడు, అతనికి చాల ఇష్టుడూ అయిన కరదండి అనే దాక్షిణాత్యయోద్ధ వుండేవాడు. ఒకమారు ఘోరసంగ్రామం సంభవించగా, అతని ఐదువందలమంది అమాత్యులూ అతనిని వదలిపెట్టి వెళ్లిపోయారు. కరదండి మాత్రం వదలలేదు. ఆ భూపాలుణ్ని నేనే. కరదండి ఎప్పుడూ నన్ను వదలని ఈ ఆనందుడే.

"మరొక జన్మలో నేను సింహమై పుట్టాను. ఒక బావిలో పడిపోయాను. నా అనుచరులైన శృగాలాలు నన్ను ఉపేక్షించి వెళ్లి పోయాయి. ఒక్క నెల గడిచింది. నా వెంటనుండే ఒక నక్క మాత్రం తన గోళ్ళతో పొడుగాటి బొరియ తోడి నన్ను కాపాడింది. కాపాడిన జంబుకమే ఆనందుడు. ఉపేక్షించిన నక్కలే భిక్షువులు.

"పూర్వం ఒక మృగ యూథపతి కూటపాశంలో చిక్కుకున్నాడు. బోయవాడు రాగానే వెంటవున్న మృగాలన్నీ పారిపోయాయి. ఒక మృగి మాత్రం అనురక్త కావడం వలన కన్నీళ్లతో ప్రీతిశృంఖలతో

పరిగెత్తారు. ఎక్కడ చూచినా హాహాకారమే చెలరేగింది. ఆ మదగజం చెవులు కొట్టడం వల్ల రేగిన గాలితెరలకు దాని గండస్థలం మీది సిందూరం వాకలైకట్టి భయంతో పరుగెత్తిన స్త్రీల రక్తదుకూలమనే భ్రమ కలిగిస్తూ రాజవీధి నిండిపోగా, ఉద్దండోచ్చండశుండాదండం తిప్పడం వల్ల కలిగిన శబ్దంతో దిక్కులన్నీ భయపడి అలసి ఎటుచూచినా పరువిడే భ్రమరాలతో తమ సంరంభం తెలిపినట్లు కనిపించింది. పట్టణం పాడయిపోతున్నదని ప్రజలు బాధపడి కోలాహలం చేస్తుండగా, ప్రమత్తమతి అయిన దేవదత్తుడు పెద్ద హర్మ్యం ఎక్కి వినోదం చూడసాగాడు. భగవానుణ్ని ఏనుగు ఎలా తాకి పట్టుకొంటుందో చూద్దామని చాల ఉత్సుకతో ఉన్నాడు. గుణవంతులను ధ్వంసం చేసి దుర్మార్గులు సంతోషపడుతారు.

గజభయంతో భిక్షువులందరూ పరుగెత్తిపోగా, భగవానుని వద్ద ఆనందుడొక్కడే నిలబడ్డాడు. అప్పుడు భగవానుని చేయి నుంచి ఐదు సింహాలు కరాళకేసరసటలతో ఆయన నఖాంశువులతో నిర్మింపబడినవా అన్నట్టు బయలు వెడలాయి. ఏనుగు దర్పాపస్మార నివారణమైన పంచాననగంధం సోకగానే మూత్రపురీషాలు విడిచి, వెంటనే పరాఙ్ముఖమైంది. వేగంగా పరుగెత్తుతూ, మదముడిగి చూడగా, దశదిక్కులా పెద్ద మంటలు కనిపించాయి. ప్రపంచమంతా జ్వలజ్జ్వలనజ్వాలాకులం కావడం చూచి, చల్లబడి, శాస్త అయిన బుద్ధదేవుని పాదపద్మ సన్నిధికి చేరింది. తన వాంఛలన్నీ సంకోచం పొందగా, చింతాకులిత మనస్సుతో, క్రుంగిపోయిన ముఖకాంతితో, పరితాపంతో గమనం కూడా శిథిలమైపోగా, క్లేశంతో వేడినిట్టూర్పులు విడస్తూన్న ఆ గజం కరం (తొండం) దైన్యం పొంది, దాన (మద) జలం, మధుపకోలాహలం లేక, లోభాంధుని మహోవ్యయోత్సవం వలె భారంగా అయింది.

భయంతో తన పాదతలసన్నిధికి వస్తున్న ఆ ఏనుగును కారుణ్యసాగరుడైన శాస్త, చక్రస్వస్తికాది శుభలక్షణలక్షితమైన చేతితో తాకాడు. పిదప తన చేతిని దాని కుంభస్థలంపై పెట్టి ఇలా అన్నాడు: "పుత్ర! నీచేతల మూలంగానే ఇలాటి దశను పొందావు. వివేకాలోకాన్ని కప్పే మేఘం వంటిది మాంసపర్వతం వంటిది, మోహ సంభారం వంటిదీ అయిన ఈ దేహం నీకు భారమైనది; పాపం వల్ల పొందావు." ఈ మాటలు అనగానే ఏనుగు భయపడి, ఊపిరితీసుకొన్నట్లై తన కట్టుకొయ్యలో దూరి కదలకుండా నిలబడింది. దేవదత్తుని మహోత్కటమైన సంకల్పం, కుంజరంలాగే విరుగగా ప్రజలు మహా సంతోషంతో అద్భుతపడుతూ వుండిపోయారు.

తర్వాత సుగతుడు మహాధనగృహపతి యింట భోజ్యప్రతిగ్రహం చేసి, భిక్షువులతోపాటు వేణువనానికి బయలు దేరాడు. అప్పుడు గజేంద్రుడు కూడా వచ్చి, అతని పాదాబ్జాలు తొండంతో తాకి, కుంజర రూపం వదలి ధవళకాంతితో చతుర్మహారాజిక దేవతలలో పుట్టి వెంటనే సుగతుని దర్శనానికి వచ్చాడు. సుగతుడు ఆశ్రమం చేరిన తర్వాత, అర్కసంకాశుడైన అతనిని ఆ దివ్యపురుషుడు తన మణికుండలాలు వెలిగిపోతుండగా, తన కేయూరమకుట ప్రభాపల్లవాలు మేఘమండలానికి ఇంద్రచాపకాంతిని కలిగించగా నమస్కరించి శాస్త ఎదుట కూర్చుని, విగతకల్మషుడై సత్త్వగుణంవలె శుభ్రమైన దివ్యపుష్పాలు అతనిపై చల్లి "భగవన్! నీ పాదపద్మ సంస్పర్శనంతో నాదుర్దశాదుఃఖ సంతాపం శమించి సంతోషం కలిగింది. భగవానుని దృష్టి శమగుణంతో శ్లాఘ్యమైనది. వ్యసన విషదోషతాపం శమింపజేసేది. సుధావృష్టి వంటిది. ఆ దృష్టి ప్రసరించిన పశువు కూడ ఖరతరమైన వికార వ్యతికరం మాని, మోహం తొలగి, శాంతిని పొందుతుంది" అని విన్నవిస్తుండగా భగవానుడు భవశాంతి నిమిత్తం సత్యదర్శన సంశుద్ధమైన



ధర్మోపదేశం చేశాడు. అతడు తన కిరీటపు ముత్తేల ధవళకాంతితో భవభ్రమను పరిహసిస్తున్నవాడివలె సుగతుని చరణాలకు నమస్కరించి, తన ముఖశశితో ఆకాశాన్ని ప్రకాశింపజేస్తూ వెళ్ళిపోయాడు.

అతడు వెళ్లిన తర్వాత భిక్షువులు ప్రశ్నించగా, భగవానుడు తద్వృత్తాంతం ఇలా తెలిపాడు: "పూర్వకల్పాంతరంలో కాశ్యపుడనే శాస్త శాసనకాలంలోను, ప్రవ్రజ్యదీక్ష పొందినప్పటికీ శిక్షాపదాల ఎడ నిరాదరుడయ్యాడు. అనాదరం వల్ల కుంజరజన్మ, సంఘాన్ని సేవించడం వల్ల భోగం, సత్యదృష్టిబలంతో కడపట సుగతశాసనపరిగ్రహమూ కలిగాయి. కర్మోపదిష్ట సంబంధ భక్తి భోగాలతో సంస్కారం పొందిన ఎవరినీ ప్రాగ్జన్మ విహితమైన కర్మ వదలదు. ఆ ఘోరమైన విపత్తులో, భిక్షువులందరూ నన్ను వదలి ప్రాణభయంతో పారిపోయారు. ఒక్క ఆనందుడు మాత్రం వదలలేదు. దీనికి కూడా పూర్వ సంబంధం వుంది.

"పూర్వం శశాంకశీతమనే సరస్సులో పూర్ణముఖము, సుముఖము అనే రెండు సుందర రాజహంసలు, తోడబుట్టినవి ఉండేవి. పూర్ణముఖం బ్రహ్మదత్తమహీపతి వారణాసిలో నిర్మించిన బ్రహ్మమతి అనే రమ్యమైన పుష్కరిణికి వెళ్లింది. అక్కడ అది ఐదువందల హంసలతో అలలకు అల్లలనాడే కమలాల కేశరాలు, కింజల్కాలతో పరిపింజరమై విహరించింది. అది పూర్వపుణ్యానుభావంతో రూపాతిశయోజ్జ్వలం కావడం వల్ల ఆ నగర పౌరులు తమ పనులు కూడా మానుకొని కనురెప్పపాటు కూడా మరిచి దాన్నే చూచేవారు. ఈ సంగతి రాజు వరకూ ప్రాకింది. రాజు దానిని చూడదలచి, పట్టుకోవడానికి కుశలులైన జాలరివారిని పంపాడు. కమలాలీలాస్మితం వలె తెల్లని ఆ రాజహంసను జాలరులు పట్టుకొనగానే, ఐదువందల హంసలూ పరిగెత్తి పోయాయి. వాటిలో ఒక్కటి మాత్రం పట్టుబడకపోయినా పట్టుబడినట్టు వుండి, ప్రేమపాశవశీభూతమై దానికోసం దుఃఖించింది. జాలరులు ఆ రెంటినీ రాజువద్దకు తీసుకొనివెళ్లారు. రాజు పట్టుబడిన రాజహంసను చూచాడు. పట్టుబడకపోయినా స్నేహబద్ధమై వచ్చిన ఆ రెండవదాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. ఆ పూర్ణముఖమనే రాజహంసను నేనే. వెంట వచ్చిన హంస ఆనందుడు. అప్పటి హంసలలాగే ఇప్పుడు భిక్షువులూ నన్ను వదిలిపెట్టి వెళ్లారు.

"మరొక సంగతి కూడా వినండి. పూర్వం వారణాసిలో తుట్టి అనే రాజుండేవాడు. అతని కీర్తిని శత్రురాజులు తమ మనఃఫలకాలపై వ్రాసుకొన్నారు. అతనివద్ద సంగ్రామాగ్రేసరుడు, అతనికి చాల ఇష్టుడూ అయిన కరదండి అనే దాక్షిణాత్యయోద్ధ వుండేవాడు. ఒకమారు ఘోరసంగ్రామం సంభవించగా, అతని ఐదువందలమంది అమాత్యులూ అతనిని వదలిపెట్టి వెళ్లిపోయారు. కరదండి మాత్రం వదలలేదు. ఆ భూపాలుణ్ని నేనే. కరదండి ఎప్పుడూ నన్ను వదలని ఈ ఆనందుడే.

"మరొక జన్మలో నేను సింహమై పుట్టాను. ఒక బావిలో పడిపోయాను. నా అనుచరులైన శృగాలాలు నన్ను ఉపేక్షించి వెళ్లి పోయాయి. ఒక్క నెల గడిచింది. నా వెంటనుండే ఒక నక్క మాత్రం తన గోళ్ళతో పొడుగాటి బొరియ తోడి నన్ను కాపాడింది. కాపాడిన జంబుకమే ఆనందుడు. ఉపేక్షించిన నక్కలే భిక్షువులు.

"పూర్వం ఒక మృగ యూథపతి కూటపాశంలో చిక్కుకున్నాడు. బోయవాడు రాగానే వెంటవున్న మృగాలన్నీ పారిపోయాయి. ఒక మృగి మాత్రం అనురక్త కావడం వలన కన్నీళ్లతో ప్రీతిశృంఖలతో

తను కూడ కదలకుండా పడివుంది. మృగయూధపతిని చంపడానికి లుబ్ధకుడు రాగా, 'బాణంతో మొదలంటూ నాజీవితం తీసుకో' అని కోరింది. అది స్పష్టంగా దృఢసంకల్పంతో చెప్పినందుకు, అది చూపిన స్నేహానికి బోయ ఆశ్చర్యపడి ప్రీతితో రెంటిని వదలిపెట్టాడు. ఆ మృగయూధపతిని నేనే. ఆ కురంగిక, ఆనందుడు. ఇలాగా ప్రీతి సంబంధం ముందునుంచి అనువర్తిస్తున్నది."

సుగతుని మాటలు విని భిక్షువులందరూ సిగ్గుతో ప్రభాభిరామమైన ఆనందుని ముఖాన్ని స్పృహార్ద్ర దృష్టులతో ఆనందంతో చూచారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ధనపాలావదానమనే ఇరవై ఎనిమిదవ పల్లవం

# 29. కాశీసుందరావదానం

దేహాన్ని ముక్కముక్కలు చేసినా, కోపాగ్నిని అణచివేసి, శాంతినే హెచ్చింపజేసే సత్త్వవంతులు సత్త్వగుణవిశేషం జయించుగాక! అదే సర్వసత్త్వాల (జంతువుల) సుఖానికీ కారణభూతమైనది.

ఒకమారు భగవానుడు ధర్మోపదేశసందర్భంలో, తన ముందున్న కౌండిన్యుని ప్రస్తావనం రాగా, భిక్షువుల ప్రశ్నలకు సమాధానంగా ఇలా అన్నాడు:-

వారాణసి నేలిన బ్రహ్మదత్త మహీపతికి కాశీసుందరుడు, కలిభువు అనే ఇద్దరు కుమారులుండేవారు. యౌవరాజ్యభారానికి అర్హుడైన కాశీసుందరుడు రాజ్యం ధర్మాధర్మమయమైనదని తలచిన మీదట చాలసేపు ఇలా చింతించాడు. "తారుణ్యమా క్షణంలో క్షయం పొందేది. జీవితమా వీచీచంచలం. రాజ్యమా స్వప్నవివాహం వంటిది. మోహమూలమైన ఈ విషయాలలో నాబుద్ధి చొరదు. రాగప్రలాపాలతో, మాయామోహోత్సవాలతో నిండి, వేశ్యారోదనం వలె నిస్సారమైన ఈ సంసారంలో నిజమన్నది లేదు. ప్రవ్రజ్య శ్రేష్ఠమైనది. ఆగారంకంటే అనాగారికవృత్తి ఉత్తమమైనది. ఖడ్గవృత్తి సంసక్తాలైన ఈ ఐశ్వర్యాలతో ప్రయోజనమేమిటి?"

వివేకవిమలాశయుడైన రాజకుమారుడు ఈ విధంగా ఆలోచించి, అడవికి వెళ్లిపోదలచి, తండ్రివద్దకు వెళ్లి ఇలా మనవి చేశాడు. "తండ్రీ! ఈ భోగవర్గమంతా నాకు నచ్చదు. కనుక యౌవరాజ్యాభిషేకోత్సవ సమారంభం మానుకోమని ఉత్తర్వు చేయి. క్రోధాగ్నితప్తులై వధ, బంధనం, భయం, ఆయాసం కలిగించే రాజసంపదలు తండ్రీ నాకు ఇష్టం లేదు. క్రూరతరమైన కృత్యాలతో మండుతున్న పార్థివశ్రీలు శ్మశానాగ్ని శిఖలవలె ఎవరికి ఉద్వేగం కలిగించవు? ఛత్రాలతో వెలుతురును కప్పుకొని, చామరాల గాలితో కదలుతూ మదమత్తులైన క్షితీశ్వరులు పాతకగర్తంలో పడుతారు. మృదువులైన భోగాలకు, వస్త్రాలకు అలవాటై సుకుమారమైన రాజుల దేహానికి తుట్టతుదకు పిడుగుకన్నా క్రూరమైన కష్టం కలుగుతుంది. చింతాసంతతితో సంతాపంతో తీవ్రతృష్ణతో (ఆశతో, దప్పితో) ప్రలపించే రాజ్యజ్వరగ్రస్తులకు మోహమూర్ఛ అనేది తొలగదు. రాజులు రెండునాలుకలున్న పాములవంటివారు; వాటిలాగే వంకర నడకలతో, రత్న కాంతులతో ఛిద్రాలను (రంధ్రాలను, లోపాలను) చూస్తూ ఇతరులను చంపుతారు. వంశశతోచ్ఛిష్ట అయిన తన్ను రాజులు తమ వంశం దాటి మరెక్కడికీ వెళ్లదని భ్రాంతి పడుతారే అని రాజ్యలక్ష్మి రాజుల హారచామరవ్యాజంతో పరిహసిస్తున్నట్టు ఉంటుంది. లక్ష్మి, గతించిన రాజులను స్మరిస్తూ, వీచినప్పుడు వికసించిన చామరాలవ్యాజంతో నిట్టూరుస్తూ, ముక్తాహారాల వ్యాజంతో అశ్రువులు వదలుతున్నట్టు నాకు అనిపిస్తుంది. కనుక నేను ప్రవ్రజ్య స్వీకరించి జనావాసరహితమై, సంతోషమనే చల్లని నీడతో సంతాపం శమింపజేసే అరణ్యాలకు వెళ్లుతాను. విశ్రాంతిలేక సంసారపథ పాంథుణ్ణయిన నాకు సాపాయమైన ఈ కాయమే దుర్వహంగా వుంది. ఇక పృథివీభారం ఎక్కడ వహించగలను?"

రాజు, కొడుకు పలుకుతున్న అత్యంత అప్రియమైన మాటలు విని, ప్రవ్రజ్యాశబ్దానికి చకితుడై ఇలా అన్నాడు: "నాయనా! ఈ గొప్పవంశము, సామ్రాజ్యమూ అభివృద్ధి చెందడానికి వృద్ధుడైన నేను నీపైనే ఎంతో ఆశ పెట్టుకున్నాను. అలాటి సమయంలో నా సంకల్పానికి భంగం చేయకు వత్సా. ఈ నీ మహాకాంతిగల యౌవనం వనవాసార్హం కాదు. ఉత్తమ రాజనీతియుక్తులు, సత్యదర్శనసమర్థులు, జితేంద్రియులు అయిన నరపాలురకు ప్రజాపాలనమే తపస్సు. సరోరుహం నీటిలో వుండే, నీటిని అంటకుండా వుంటుంది. అరణ్యంలో వున్న అశోకవృక్షానికి కూడా లలనాచరణాహతి తప్పదు. తన యింటిలోని భోగాలతో దృష్టి మారిపోయినప్పుడు ఈ విషయాలను క్షణంలో త్యజించవచ్చు. ఇంటిలోని సుఖాన్ని, స్వజనాన్ని వదలి ఇంటినుంచి వెళ్లిపోయినవాడు అంతవరకు అలవాటయిన భోగాలు లేకపోవడం సహించడు. ధర్మం వింటారు, ధ్యానిస్తారు, ఇంట్లో వుండే ఆచరిస్తారు. అరణ్యంలో శుష్కమనస్కుల శ్రవణస్మరణక్రియలు శుష్కిస్తుంటాయి. దర్భముండ్లు గుచ్చుకొని పాదాలకు గాయం తగిలి రక్తం కారుతున్నవానికి అంతకన్నా పరలోకంలో దుఃఖమేముంటుంది? ప్రేతాలవలె ఇతరులు ఇచ్చే అన్నాన్ని ఎప్పుడూ తింటుంటారు. పుత్ర, వనంలో నివసించడం ధూళి కప్పుకొనడం వంటిది. బ్రహ్మచర్యపాలనం సముద్రాన్ని ఎండింపజేయడం వంటిది. దావాగ్నిధూమంతో కనుబొమలు, ముఖం చిట్లించుకుంటూ, నక్కలు, గూబలు వసించే గుహలు చూస్తూ, సింహాలు చంపిన ఏనుగుల రక్తంతో ఎర్రగా వుండే అడవులలో ఇల్లు విడిచిపోయి ధైర్యంగా వుండగల వారెవ్వరు? కామి అయినవాడు సంయమం కావాలని కోరుతాడు. సంయమినంటూ అడవిలో వున్నవాడు యువతిపొందు కోరుతాడు. విషయసుఖాలతో సంతృప్తి పడనివాడు తీవ్రమైన వ్రతాలు ఆచరించి సంతోషపడగలడు. ఆకలిగొన్నవాడు తినడమేమిటా అని చూస్తాడు. ఒంటరిగాడు జనంతో వుండామని కోరుతాడు. జనవనమంటే అసహ్యపడేవాడు వనవాసం కోరుతాడు. ఉన్నది వదలి మరొకటి వెదకడం, మరల తిరిగివచ్చి అవమానం పొందడం జనుల స్వభావం. కనుక నాయనా, నన్ను వదలి అడవికి వెళ్లవద్దు. నీ శత్రువులకు వనవాసం చేద్దామనే బుద్ధి కలుగుగాక! రాజసంపదలు మానవతులయిన స్త్రీలలాగ వ్యక్తమౌక్తికహాసినులు, కరవాలలతలవంటివి. ఒకమారు వదలితే తిరిగిరావు."

ఈ విధంగా తండ్రి పలుమారు హితవు చెప్పినా, అతడు తన నిశ్చయంనుంచి కదలలేదు. మహాత్ముల సంకల్పం వజ్రరత్న శిఖ వంటిది కదా! తల్లులు, అమాత్యులు, బంధువులు, పౌరముఖ్యులు కూడ అతనిని ఎంతో బ్రతిమాలారు. అయినా అతడు మెత్తబడక మౌనంగా మూడునాళ్లపాటు నిరాహారుడుగా ఉన్నాడు. అప్పుడు సచివుల రాజుతో "రాజభోగిగానో, తపస్విగానో స్వేచ్ఛగా ఎక్కడో బతకనివ్వండి. తన యిష్టంప్రకారం నడిచే వ్యక్తి ఇతడు" అని మనవి చేశారు. అది విని రాజు ఎట్టకేలకు కన్నీరు కురుస్తుండగా సెలవివ్వగా, పౌరజనులు ఆక్రందనాలు చేస్తుండగా మౌనియై తపోవనానికి వెళ్లాడు.

తపోవనంలో రాజకుమారుడు వైరాగ్య పరిపాకంతో మైత్రీ పవిత్రము, వివేకదయితమూ అయిన దయను సర్వప్రాణులయందూ ప్రర్తింపజేశాడు. అతని ప్రభావం వల్ల సర్వవనవాసప్రాణులకు జాతి వైరానలం శమించి చల్లని చిత్తవృత్తులు కలిగాయి. పుళిందులు ప్రాణివధ మాని జింకలతో ఆడుకోసాగగా, సింహాలు ఏనుగులను చీల్చడం మాని వాటిని కౌగలించుకోగా, కిరాతాంగనలు నెమలి యీకల వస్త్రాలు లేక, ముక్తాహారాలు లేక నిట్టూర్పులతో పెదవులు ఎండగా ఉండిపోయారు. కాశీసుందరుడు అబ్ధివసన అయిన క్షమను(భూమిని) వదలినా, సర్వభూతక్షమను పొందాడు. ఈ విధంగా అతడు క్షాంతివాది అని విఖ్యాతి పొందాడు.



ఇలా వుండగా మహికి హర్షంవంటి బ్రహ్మదత్తుడు స్వర్గానికి వెళ్లగా భూతోద్వేగమో అన్నట్టు అతని రెండవకుమారుడు కలిభువు గద్దెయెక్కాడు.

ఇంతలో ఝుంకారం చేస్తూ తిరుగాడే భ్రమరరాజు అనే కనుబొమముడివేస్తూ ముఖం చిట్లించుకొంటూ, ముని సంయమ విద్వేషి అయిన వసంతుడు వచ్చాడు. మదనోన్మాదభూతము, మృగలోచనల మాన విధ్వంసదూత అయిన చూతవృక్షం కాంతి చెలరేగింది. రక్తాశోకవృక్షాన్ని పక్కన వుండే లతలు ఆలింగనం చేసుకొంటాయనే అనుమానంతో అసూయపడినవాడులా మలయానిలుడు అశోకపుష్పాలు రాల్చుకొనిపోయాడు. కోకిలాలాపసంకులమూ, ఉద్యానయౌవనమూ అయిన ఆ వసంతకాలంలో అంతఃపుర కాంతలతో పాటు రాజు అడవుల అందం చూద్దామనే కుతుకంతో బయలుదేరాడు. నానా వర్ణపుష్పాలు కింద రాలి అందంగా వున్న అడవులను చూస్తూ ఆ రాజు క్రమంగా తపోవనం చేరాడు. వనస్థలులలో యువతులతో సహా చాలసేపు విహరించి, రతివిశ్రాంతుడైన ఆ రాజు క్షణంలో అక్కడ నిద్రపోయాడు.

అప్పుడు అంతఃపురాంగనలు అపూర్వకుసుమాలతో నవ్వినట్లున్న పుష్పమంజరులను కోస్తూ నడతీగలవలె తపోవనమంతటా తిరిగారు. అక్కడ ఒకచోట క్షాంతివాది అయిన కాశీసుందరుడు వివిక్తప్రదేశమనే సంతృప్తితో అంతరంగంలో శాంతిని మననం చేస్తూ నిశ్చలంగా ఉన్నాడు. మనీషులకు కూడా వందనీయుడై, అమందానందం వర్షిస్తూ కృశుడైనా సౌందర్యం తరగక పాడ్యమినాటి చంద్రునిలా కనబడుతూ పరిణామ మనోజ్ఞమూ, రేఖాసంస్థానంతో ప్రకాశిస్తూ, ఆకృతి చెదరని పులాణచిత్రరూపంవలె, అద్దం మీది బొమ్మవలె వున్న ఆ సంయమిని చూచి, అంతఃపుర కాంతలు గీచిన బొమ్మలలా కదలకుండా వుండిపోయారు. ఇంతలో రాజు మేల్కొని, ప్రియురాండ్రను కానక, వనంలో వెదకుతూ, వారంతా మునిచుట్టూ మూగి వుండడం చూచాడు. దుర్మార్గుడైన ఆ రాజు ఈర్ష్యావిషాకులుడై బుసగొడుతూ, మాటలనే విషం కక్కుతూ, "ఎవడు నీవు? విచిత్రమైన మునివేషం వేసుకొని, ముగ్ధహృదయులను మభ్యపెడుతున్నావు. నిజంగా నీవు నారీప్రతారకుడివి. పరస్త్రీలను హరించడానికి ధ్యానం, తద్విఘ్న నివారణకు జపం, సరళ హృదయులను సమాధానపెట్టడానికి తపస్సనేది ధూర్తులకు మంచి ఉపాయమే. వనంలోని విషవృక్షంలాగ, వల్కలాలు ధరించిన ధూర్తుడవైన నీ ప్రవృత్తి కూడ ముఖమాధుర్యం కలిగించి మోహం పుట్టించేదే. వేషమేమో మునివేషం, చేష్టలేమో ఇలాటివి. నీవు కోరే సిద్ధిని, నీ అంతరతత్త్వాన్ని ఎవరు తెలుసుకోలేరు?" అని క్రోధంతో గర్జించాడు.

ఆ మాటలు విని అక్రోధమధురాశయుడైన క్షాంతివాది నిర్వికారమైన మనస్సుతో ఇలా అన్నాడు. "నేను క్షాంతివాది మునిని, నన్ను అనుమానించవద్దు. నాకు కాంతలన్నా లతలన్నా ఒక్కటే." ఆ మాటలు విని "సరే నీ క్షాంతి నిప్పుడు చూస్తాను" అంటూ కలిభువు తన కత్తితో అతని రెండు చేతులూ నరికివేశాడు. రెండుచేతులూ నరికినా ఓర్పుతో వున్న అతని క్షమాస్వభావానికి ఈర్ష్యపడి, రాజు అతని రెండు కాళ్ళూ నరికివేశాడు. ఖలులు కుక్కలవంటివారు. దారిలో అశుభంగా మొరుగుతారు. నాలుకతో దూషిస్తారు. (కుక్కలు నాలుకతో నాకి పాడుచేస్తాయి). తుదకు అంగాలను కొరికివేస్తాయి. సరళులైన మహాత్ములు సరళవృక్షాలవలె కొట్టినా క్షమతో వుంటారు. స్కంధం (చేతులు, బోదెలు) ఛేదించినా మౌనంగా వుంటారు. తీవ్రమైన తాపం(ఎండ, కష్టం) కలిగినా చల్లగానే వుంటారు.

ఆ విధంగా కాలుసేతులు నరకబడిన క్షాంతివాది ఘోరమైన వ్యధను ఓర్చుకొని ధైన్యం వల్ల కలిగిన మనస్సంక్షోభాన్ని పొక్కనీక ఓర్పుతో ఇలా అలోచించాడు. "తక్కిన పనులన్నీ మాని వీడు నా అంగాలు ఛేదించినట్లే, నేను కూడ తక్కిన ఆలోచనలు మాని సంసార విషమక్లేశాలను ఛేదిస్తాను" అని శాంతినే ధ్యానించాడు. కలిభువు ఈ విధంగా కోప మోహాలతో తన జ్యేష్ఠభ్రాత అయిన మునిని అవమానించి రాజధానికి బయలుదేరగా, రేగిన ధూళికి భూదేవి శోకమ్లానవలె కనిపించింది.

పిదప క్షాంతివాది వ్యధకు కోపించి అతని క్షాంతిదేవత కాశీనగరంలో అనావృష్టిని, దుర్భిక్షాన్ని కలిగించింది. మునిని పరాభవిచడం వల్ల దేవత కోపించి ఈ విప్లవం కలిగిందని నైమిత్తికులవల్ల తెలుసుకొని రాజు, మునిని ప్రసన్నుని చేసుకొనడానికి తపోవనానికి బయలుదేరాడు. అతనికి సాష్టాంగప్రణామం చేసి క్షమించండి అని ప్రార్థిస్తూ, పశ్చాత్తాపంతో నిశ్చేతనుడై వుండిపోయాడు. అది చూచి క్షాంతివాది రాజుతో "రాజన్, నీపై నాకు అణుమాత్రమైనా కోపం లేదు. కర్మ రేఖా పరిచ్ఛేదం వల్ల ఇలాటిది సంభవించింది. భవితవ్యత దేనినీ చూడదు. అది స్వతంత్రమైనది. ధైర్యాన్ని, గుణాలను, ధనాన్ని, తపస్సును, గౌరవాన్ని దేన్నీ చూడదు. ప్రతిప్రాణి జన్మస్థలంలోను నిజకర్మమహీరుహం వేళ్ళు తన్నుకొని నిలిచివుంది. దాని విత్తనాలు పేగుల్లోను, ప్రసవంలోను పరంపరంగా వస్తూ, పెరిగి కాలపరిపాకం వల్ల చిత్రవిచిత్రంగా పండి పగులుతాయి. ఆ పండ్లనే ప్రతిజీవీ అనుభవిస్తాడు. కనుక, రాజా, నీపై నాకు కొంచెమైనా కోపవికారం లేదు. ఈ మాట నిజం. చూడు నా రక్తం పాలైంది. నీవు నా అంగాలు ఛేదిస్తున్నప్పుడు, తర్వాత, నా మనస్సు కలుషం కాకపోవడమే సత్యమైతే, ఆ అంగాలు మరల నాకు అతుక్కొనీ." అని సత్యప్రమాణం చేశాడు.

పరిశుద్ధమైన మనస్సుతో ముని తీవ్ర సత్యోపయాచనం చేయడం వల్ల ఆ అంగాలు మరల అతని దేహానికి అతుక్కొని, స్వాస్థ్యం కలిగించాయి. రాజు ఈ దివ్యచర్యకు ఆశ్చర్యపడి ముకుటతటంతో అతని పాదాలు తాకి, "మునీశ్వరా! నీవు తపస్సుతో మహాప్రభావంతుడివి. నీకు కావలసింది ఏముంది? ఓ కరుణానిధీ, మోహాంధుణ్ణయి పాపపంకంలో పడిన నన్ను పుణ్యాహస్తావలంబంతో ఉద్ధరించు" అని ప్రార్థించాడు. దానికి ముని సమాధానంగా, "రాజా, మునిగినవారిని ఉద్ధరించడానికి, బద్ధులయినవారి విమోచనానికి, భయపడినవారి ఆశ్వాసనానికి, విమోహమూఢుల నిర్వాణానికి అనుత్తర సమ్యక్సంబోధిని నేను ప్రార్థిస్తాను. నేను అనుత్తరసమ్యక్సంబోధిని పొందినప్పుడు జ్ఞానఖడ్గంతో నీ మోహం ఛేదిస్తాను" అని అంటూ అతని వద్ద సెలవు పుచ్చుకొని తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. రాజు అతనినే మనస్సులో ధ్యానిస్తూ రాజధానికి తిరిగివచ్చాడు.

ఆ క్షాంతివాదిని నేనే. ఆ కలిభువే ఈ కౌండిన్యుడు. సమ్యక్సంబోధిని పొందినమీదట ఇతనిని ఇప్పుడు నేను మోహసముద్రం నుంచి ఉద్ధరించాను.

ఈ విధంగా సుగతుని ముఖారవిందం నుంచి వెడలిన మధుర మధుసదృశమైన ప్రసన్న వాక్కును భిక్షుసంఘం భ్రమరంవలె పానం చేసి అనిర్వచనీయమైన సంతోషం పొందింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కాశీసుందరావదానమనే ఇరవై తొమ్మిదవ పల్లవం

# 30. సువర్ణపార్శ్వావదానం

సత్త్వసారసరళుడై సౌజన్యపుణ్యస్థితి అయిన మహాత్ముడు శ్లాఘ్యుడు. ధర్మమార్గగమనంలో విఘ్నంగా ఉన్న దురాత్ముడు నింద్యుడు. వీరిద్దరి చరిత్రలూ మననం చేస్తే ఒళ్ళు పులకించడం, కళ్ళు బాష్పాలతో నిండడం, ఏమి చెప్పడానికీ మాట రాకపోవడం సమానంగానే జరుగుతాయి- ఇదే విచిత్రం!

ఒకమారు ఉపదేశసమయంలో దేవదత్తుని ప్రస్తావన వచ్చినప్పుడు భిక్షువులు ప్రశ్నించగా, భగవానుడు పూర్వవృత్తాంత సంశ్రయమైన కథను ఇలా తెలిపాడు.

పూర్వం వారాణసిలో మహేంద్రసేనుడనే రాజు వుండేవాడు. అతని సిరిని చూచి తక్కిన రాజులంతా సిగ్గుపడిపోయేవారు. అతనికి దివ్యకీర్తివలె చంద్రప్రభ అనే భార్య వుండేది. రాజు ప్రభావం వల్ల ఆమె స్వప్నాలన్నీ సత్యమయ్యేవి.

అప్పుడు పరిసరారణ్యంలో సువర్ణపార్శ్వమనే మృగయూథపతి వుండేది. అది హేమమయచ్ఛవి గనుక దానిపేరు సువర్ణపార్శ్వమనే సార్థకంగా వుండేది. దాని దృష్టిచ్ఛటలు నీలరత్నాలు పొదిగిన ముక్తాహారనిభప్రభలులా వనలక్ష్మికి భూషణంగా వుండేవి. పగడాల తీగలవంటి కొమ్ములతో, చిత్రరత్నాలు తాపిన చర్మంతో దాని కాంతి ఆశ్చర్యసుధాంబోధిలహరి లాగ ప్రకాశించేది. అది బోధిసత్త్వావతారం కావడం వల్ల దాని దేహమట్లా సుందరంగా వుండేది. సురూపత అనేది పుర్వజన్మ సుకృతమనే చిత్రానికి లక్షణమే కదా! దానికి దీర్ఘదృష్టి అనే వృద్ధవాయసం నెచ్చెలి. వేటగాండ్ర రాకను కనిపెట్టడం కోసం అది ఎప్పుడూ దిక్కులు చూస్తూ వుండేది. అవి రెండూ పరస్పరం ఇష్టకథలతో ప్రీతితో నిర్జనమైన అరణ్యాలలో తిరుగుతూ వుండేవి. తిర్యగ్జంతువులకు కూడా మానవవాక్కు పూర్వపుణ్యం వల్ల కలుగుతుంది.

ఒకమారు ఆ యూథపతి తక్కిన జింకలతో పాటు నీటికోసం వేణుమాలినీ నది తీరానికి వచ్చింది. అప్పుడు అక్కడ పెద్దగా ఆక్రందన వినిపించగా జింకలన్నీ మెడలు వయ్యారంగా కదలించుకుంటూ పారిపోయాయి. సువర్ణపార్శ్వం మాత్రం కదలకుండా, కృపాపాశంతో ఏమిటో ఈ ఆక్రందనధ్వని అని చూడసాగింది. ఆ ఆక్రందన ధ్వని నదిలోనుంచి వస్తున్నది. ఒక వ్యక్తి కట్లతో పాటు మునిగిపోతూ ప్రాణరక్షణకోసం కేకలు వేస్తున్నాడు. అది చూచి సువర్ణపార్శ్వం బాణంతో ఆయువుపట్టుపై దెబ్బ తిన్నట్టు నిలబడిపోయి, అతనిని రక్షించడానికి సంకల్పించింది. వానిని ఉద్ధరించడానికి సన్నద్ధమైన నెచ్చెలిని చూచి దీర్ఘదృష్టి వాయసం "నెచ్చెలీ, నీ ప్రయత్నం ఉచితమైనది కాదు. దుర్మార్గులు విపత్కాలంలో పూలలాగ మెత్తబడుతారు. విపత్తు గడచిన తర్వాత వజ్రంలాగ కరుకవుతారు. తమ కాయమే వీరికి మిత్రం. వీరు చేసిన మేలు మరుస్తారు" అని నివారించాడు. అయినా సువర్ణపార్శ్వం లక్ష్యపెట్టక కరుణాకులమై

నదిలో దిగి, ఆ వ్యక్తిని బయటికి దీసి, కొమ్ములతో కట్లు విప్పింది. కుటిలకుడనే ఆ వ్యక్తి జింక కాళ్ళమీద పడి కృతజ్ఞత తెలిసి వెళ్ళబోగా జింక "మిత్రుడా! నేనిక్కడ వున్నట్టు ఎవరికీ తెలుపవద్దు. నా చర్మంపై ఆశతో లుబ్ధకులు బంగారురంగుతో వున్న నన్ను పట్టుకొని బాధపెడతారు" అని వినయంతో కోరింది. ఆ దుష్టుడు "అలాగే" అని అంటూ దానిని పొగడి వెళ్ళిపోయాడు.

ఇలా వుండగా రాజు భార్య చంద్రప్రభాదేవి ఒక బంగారు రంగుగల జింక ఆసనంపై కూర్చుని ధర్మోపదేశం చేస్తున్నట్టు కలగనింది. ఆమె స్వప్నాలన్నీ నిజమవుతాయి గనుక, ఆమె మేల్కొని రాజును "దేవా, నాకు స్వప్నంలో అద్భుతమైన సువర్ణహరిణం కనిపించింది. రాహువుభయంతో శశాంకుని ఒడినుంచి దిగివచ్చినట్టున్న ఆ జింకను ప్రత్యక్షంగా చూడగోరుతున్నా" అని చనువుతో కోరింది. ప్రియురాలి ముచ్చట తీర్చడానికి రాజు కావలసినంత డబ్బు చెల్లించి వేటగాండ్రను అరణ్యాలకు పంపాడు. వారు వనాలన్నీ వెదికి తిరిగివచ్చి, వట్టి చేతులతో వచ్చినందుకు క్రుద్ధుడైన నరపతితో ఇలా మనవిచేశారు. "రాజా! కొండలు కోనలూ వున్న ఈ జగత్తునంతా గాలించాము. తీరిక అనేదే ఎరుగము. అలాటి జింక మాకండ్లపడలేదు. ఆశ్చర్యంతో అందరి దృష్టినీ ఆకర్షించే సుందరలోచనాలతో స్వప్నసంపన్నరూపమైన హిరణ్యహరిణం ఎక్కడైనా వుంటుందా? మీ చిత్తవినోదమే గనుక అవసరమైతే, దేవా, శిల్పులతో బంగారు లేడిని నిర్మింపజేయండి." ఆ మాటలు విన్నప్పటికీ రాజు వారికి మరింత ధనమిచ్చి స్వర్ణమృగాన్వేషణలో మరింత పట్టుదల చూపాడు.

రాజు బంగారులేడికోసం బాగా ధనమిస్తాడని విని కుటిలకుడు రాజు సన్నిధికి వచ్చి, ధనగ్రహణంలో లుబ్ధకులకన్నా లుబ్ధుడై ఇలా అన్నాడు: "మహారాజా! మీ ప్రసాదం. నేను బంగారులేడిని చూపుతాను. నేను వనంలో కనకసారాంగమైన సారంగం చూచాను." ఆ మాటలు విని రాజు ప్రహర్షంతో ఉత్ఫుల్లలోచనుడై "భద్ర, ఎక్కడ? ఎక్కడ చూచావు?" అని పదేపదే అంటూ అతడు దారిచూపుతూ ముందు నడవగా, సైన్యాలు వెంటరాగా, ఎత్తిన ధవళాతపత్రంతో తను చంద్రుడు ఉదయించిన ఉదయాచలంవలె భాసిస్తూ బయలుదేరాడు.

దీర్ఘదృష్టివాయసం ఒక చెట్టు చిగురుకొమ్మపై వాలిన గజవాజబృందతో రేగిన ధూళితో అడవి కప్పడం చూచి సువర్ణపార్శ్వం దగ్గరికి వచ్చి, "నెచ్చెలీ, నేనప్పుడు చెప్పిన హితం నీవు వినకపోయావు. నీవు విడిపించిన మనిషే ఇప్పుడు ఎక్కుపెట్టిన విండ్లవారితో వస్తున్నాడు. నేను అడ్డగించినా నిన్ను చంపనిదే తృప్తి పొందడు. భయంకర విప్లవంలో ఎక్కడికి వెళ్ళగలం? ఏమి చేయగలం? ఏ హితం పాటించగలం-కలిసి అందరూ చావడం తప్ప. ఈ కృతఘ్నుడు, క్రూరచరితుడు, సంఘ పాతకుడు అయిన క్షుద్రుణ్ని నీవే విషవృక్షాన్ని కాపాడినట్టు నీ వినాశం కోసం కాపాడావు. దుర్మార్గుడు బడబానలంలాగ తన శరీరమిచ్చేవారిని కూడా సంహరించకుండా తృప్తిపడడు. లోలోపలే వుండి బలాన్ని కొరికివేస్తాడు. కృతఘ్నులకు ఉపకారం చేయడం, కుటిలులను విశ్వసించడం, మూర్ఖులకు ఉపదేశించడం వారి తప్పేమీ కాదు, చేసేవారి తప్పే" అని కాకి అంటూ వుండగానే రాజు సైన్యంతోపాటు దగ్గరికి రానేవచ్చాడు.

అప్పుడు సువర్ణపార్శ్వం తన జింకలగుంపు హితం ఆలోచించి, "ఈ సుభటుల సేన ఈ ఘోరారణ్యమంతా తిరుగుతుంది. నా కారణంగా ఒక్క ముహూర్తకాలంలో వనమంతా మృగరహితం



అయిపోతుంది. కనుక నేనే సైన్యప్రధానుని వద్దకు వెళ్ళి పట్టుబడుతాను. నేను ఒకడు చచ్చినా చస్తాను. ఈ మృగాలన్నీ బ్రతకనీ" అని నిశ్చయించి, రాజు దగ్గరికి వెళ్ళింది. మహాత్ములు ఇతరుల ప్రాణరక్షణకోసం తమ ప్రాణాలను తృణంగా భావిస్తారు.

స్వర్ణపార్శ్వం వడిగా ముందుకి రావడం కుటిలకుడు చూచి సంతోషంతో "అదిగో, అదే బంగారు లేడి" అని వెంటనే తన చేతులెత్తి రాజుకు చూపాడు. వెంటనే పిడుగులాగ ద్రోణశాపంతో అతని రెండు చేతులూ పాపపాదపం పల్లవాలలాగ రాలిపోయాయి. అది చూచి రాజు విచారపడుతుండగా స్వర్ణహరితం తత్పూర్వచరితం చెప్పింది. రాజు ఆశ్చర్యపడి, ఆ కృతఘ్నుని చరితాన్ని ధిక్కారంతో కంటగించుకున్నాడు.

తర్వాత రాజు ప్రీతితో, మహావైభవంతో, గౌరవంతో ఆ మృగాన్ని రాజధానికి తీసుకొనివెళ్లి, రత్నాసనంపై కూర్చోబెట్టి అంతఃపురజనం, అమాత్యులు. ఇతరభటవర్గంతో సహా దానిముందు కూర్చున్నాడు. బోధిసత్త్వస్వరూపమైన ఆ హరిణం ఆ పరిషత్తులో దివ్యబుద్ధితో ధర్మోపదేశం చేసింది. దానితో వారంతా శిక్షాపదాన్వితులయారు.

ఆ సువర్ణ పార్శ్వమన్న సారంగం నేనే. క్రూరుడైన కుటిలకుడు ఇప్పుడు దేవదత్తుడుగా పుట్టాడు.

భవభీతిని భేదించే భగవానుడు సుకృతభాసురము, ఉదారసత్త్వగుణ రుచిరము, ప్రశమమయమూ అయిన సువర్ణపార్శ్వం చరితం చెప్పగా విని బిక్షుగణం పుణ్యపరిపాక వివేకం కలిగి, కుశలమార్గానుయాయి అయింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సువర్ణపార్శ్వావదానమనే ముప్పయ్యవ పల్లవం

# 31. కల్యాణకార్యవదానం

ప్రపంచంలో సుజనదుర్జనులకు భేదం ప్రత్యక్షలక్షణాలతో పరీక్షించబడినట్టు స్పష్టంగా తెలుస్తుంది. సూర్యుడు ప్రపంచాన్ని తన ప్రకాశంతో నింపుతాడు. అంధకారం ప్రపంచాన్ని నల్లగా కమ్మివేస్తుంది.

సర్వజ్ఞుడైన సుగతుడు పూర్వవృత్తాంతమంతా కరతలామలకంగా తెలుసుకుంటూ, మరల దేవదత్తుని ప్రసక్తి రాగా మరొక సంగతి చెప్పాడు:

పూర్వం పాటలిపుత్రంలో భూమిపురందరుని వంటి పురందరుడనే రాజు ఉండేవాడు. అతడు పుణ్యసంపదలకు మందిరం. అతనికి గుణగణోన్నతుడైన కల్యాణకారి, నిర్గుణుడైన అకల్యాణుడు అనే ఇద్దరు కుమారులు వుండేవారు. కల్యాణకారి సర్వార్థికరుణాకల్పపాదపమై తన తండ్రి సంపదను ఛత్రావశేషంగా దానం చేశాడు. పుణ్యసేనుడనే రాజు దూతను పంపి తన కుమార్తె మనోరమను కల్యాణకారికి యివ్వదలచినట్టు వార్త అందజేశాడు. వివాహసమయం సమీపించగా, కల్యాణకారి తండ్రి వద్దకు వెళ్లి: "తండ్రీ! వివాహసమయం సమీపించింది. నాకీ పెండ్లి ఇష్టం లేదు. వాత్సల్యంతో నీవు నాకు రాజ ప్రకృతి సంపదలు అప్పగించావు. దానవ్యసనినైన నేను నీ ధనాగారన్నంతా వట్టిపోయేట్టు చేశాను. కనుక నేను పడవ యెక్కి సముద్రం దాటి రత్నద్వీపం వెళ్లి దివ్యరత్నాలు ఆర్జించుకొని వస్తాను. దివ్యసంపదలు పొందిన తరువాత వివాహమాడుతాను. ధనరహితునికి కళత్రం సుఖ సంపదలకు బెదురువంటిది" అని మనవి చేసి, తండ్రి ఆజ్ఞ పొంది అతని పాదాలకు నమస్కరించి, లోలకల్లోలాలింగితాంబరమైన జలధిలో పడవతో దిగాడు. అతని తమ్ముడు అకల్యాణుడు పైకి సౌజన్యం కనబరుస్తూ, మనసులో అన్నకు ద్రోహం తలపెడుతూ, వెంట బయలుదేరాడు.

ఇద్దరు సోదరులూ బయలుదేరుతున్నప్పుడు కల్యాణకారి తమ్ముడితో "తమ్ముడూ, కర్మవిప్లవం వల్ల సముద్రంలో మన పడవ కూలిపోయే పక్షంలో నీవు నా భుజం పట్టుకో. నేను నిన్ను నా భుజం మీద మోసుకొని కాపాడుతాను. దానికి నువ్వు అడ్డుచెప్పరాదు" అని అనగా, శఠుడైన ఆ అకల్యాణుడు అలాగేనని ఒప్పుకున్నాడు. ద్రోహం చేయదలచిన ఖలుడు ఎక్కడలేని ప్రేమను అవలంబిస్తాడు. పిదప పుణ్యాలవలె వాయువులు అనుకూలం కావడం వల్ల రాజకుమారుడు రత్నద్వీపం చేరి, దివ్యరత్నాలు సంపాదించి వెనుకకు మరలి వస్తుండగా, పెద్ద తుఫాను వీచి పడవ విరిగిపోగా, అకల్యాణుడు అన్న చెప్పిన మాట మేరకు కల్యాణకారి కంఠాన్ని వెంబడించిన పాములాగ పట్టుకున్నాడు. కర్మపరిపాకం వల్ల ఇద్దరూ త్వరలో గట్టు చేరారు.

గట్టు చేరిన తర్వాత కల్యాణకారికి త్వరలో కలుగనున్న గుడ్డితనానికి ప్రథమదూతిక అన్నట్టు నిద్ర ముంచుకొని వచ్చింది. నిద్రిస్తున్న అతని రత్నాలు చూచి అకల్యాణుడు క్రూరుడై నిద్రలోనే అతనిని తుదముట్టించదలచి, అతన్ని గట్టిగా కట్టివేసి, తనను సముద్రం నుంచి తరింపజేసిన అతని నేత్రతారకలను చిదిపివేసి, రత్నాలను తీసుకొని వెళ్లిపోయాడు.

కల్యాణకారి గతప్రభుడై మదగజం కమలాలు పెరికివేయగా కళాహీనమైన కమలాకరంలా అయిపోయాడు. వెలుగు తెలియక శోకంతోను, అంధకారంతో, సూర్యచంద్రులు లేని కృష్ణపక్ష ప్రారంభంలాగ వున్నాడు. ఇలా బాధపడుతుండగా, అక్కడికి ఒక గోపపతి వచ్చాడు. అతడు నేత్రవిహీనుడైన రాజపుత్రుని చూచి, అతని వ్యథతో తానూ బాధపడి, తన యింటికి పిలుచుకొని వెళ్లి పరిచర్య చేశాడు. అతని గుణ సౌజన్య స్నేహావేశాలకు వశుడయిపోయాడు.

రాజకుమారుడు గోపపతి ఇంట్లో వుంటూ తన మనశ్శాంతి కోసం పూర్వం నేర్చుకున్నవాడు గనుక చేతోవినోదిని అయిన వీణను వాయిస్తూ కాలం గడిపాడు. శోకాగ్నితప్తమనస్కులకు సత్సంగమం, వివేకపూరితమైన కథాశ్రవణం, కావ్యాసవం, ప్రియమిత్రుని మైత్రి, విహారం, వీణాస్వనం, కుసుమ మనోహరమైన వనంలో వాసం అమృతావగాహనం వంటివికదా! ఆ గోపపతి పత్ని గీతవీణావిచక్షణ. అతడు వీణ వాయిస్తుండగా వింటూ అతనిపై మరులుగొన్నది. వీణతో ఉపదేశం పొందినదా అన్నట్టు ఆ కుటిల నవరాగంతో (నూతన అనురాగంతో, నూతన స్వరాలతో) మూర్ఛనలు పోతూ, ఉత్కంఠంతో ఇలా ఆలోచించింది: "ఈ సుందరుడు ఎప్పుడూ నాకళ్లల్లోను, మనస్సులోనూ వుంటున్నాడు. ఇతడు నాతో ప్రేమతో వ్యవహరించకపోతే, నా తాపం చల్లారదు. ఈ వీణ ధన్యం. ఇతని గోళ్లు తగిలి కులుకుతూ, రాగిణి అయి ఎంతో పుణ్యంతో ఒళ్లో కూర్చునే యోగ్యత పొందింది." ఇలా తలపోసి, కంపించే తన కర పల్లవాలతో అతని కరాంభోజాలు తాకుతూ, స్వేచ్ఛగా సవిలాసంగా అతనితో "లలనాసుభమైన నా సిగ్గు, నా మనస్సూ త్వద్గతమైనవి. నీవు కృతఘ్నునివలె నా ప్రీతిని స్మరించకుండా వున్నావు. స్మరపరవశలైన స్త్రీలు సిగ్గు విడిచి, శీలాన్ని, కులాచారాన్ని, అభిమానాన్ని, అనుమానాన్ని దేనినీ చూడరు. ప్రణయంతో నా సంకల్పం సఫలం చేయి. సమ్మానింపబడిన మానినులు దేవతలలాగ ప్రీతితో చూస్తారు"అని తన మనసు విప్పి చెప్పింది. గొంతు బొంగురుపోతూ ఆ చపల విశృంఖలంగా చెప్పిన ఆ మాటలు విని రాజపుత్రుడు భయంతో గుండె చలించిపోగా ఇలా విన్నవించాడు: "తల్లీ! ఉత్తమునికి శీలపరిచ్యుతి తగదు. ఛీ! నష్టశీలుని జీవితం కిల్బిషవిష స్పృష్టమైనది. పరాంగనా పరిష్వంగాన్ని అంగీకరించేవాడు శలభమై నరకాగ్నిశిఖలను ఆలింగనం చేసుకొంటాడు. పరోపకార నిరతులు, పరదార పరాఙ్ముఖులు అహింసా వ్యసనులు అయినవారు మరణించినా పరలోకంలో జీవిస్తారు."

రాజకుమారుడు అలా అనగానే గోపపతి భార్య భగ్నమనోరథురాలయింది. స్త్రీలకు ప్రీతిని నిరాకరించడం మరణంకన్నా బాధాకరంకదా! తన మనోరథం విఫలమయిందనే విషం కక్కుతున్న ఆ భుజంగి తన పతితో ఒకనాడు ఇలా అన్నది: "ఓ సాధో! సరళుడైన నీవు పరులయెడ వాత్సల్యం చూపడం కూడ ప్రమాదానికే. గుణశీలాలు తెలియకనే ఎవడు తన యింటిని అప్పగిస్తాడు? ఇతరులపై ఎక్కువ నమ్మకం వుంచడం నీకు మంచిది కాదు. ఒకరి గుప్తమైన చిత్తాన్ని మరొకరు ఎలా తెలుసుకోగలరు? పరదార సహస్రాక్షుడైన ఈ అంధుణ్ని ఇంట్లో పెట్టుకున్నావు. నీ దీనాంధజనవాత్సల్యానికి ఫలం అనుభవించు. ఎవరూ లేకపోడం చూచి నన్ను సంగమం కోసం బ్రతిమాలినాడు. వాడికి కండ్లుంటే నేను పరిగెత్తుకురావడం ఎలా జరిగేది?" భార్య మాటలకు గోపపతి కోపతప్తుడై రాజకుమారుణ్ని దూరంగా వదలిపెట్టి వచ్చి, తన యింటిని, మనస్సును చల్లబరిచాడు. తండ్రి కుమారుణ్ని వదలిపెట్టడం, మిత్రుడు తన మిత్రుణ్ని చంపడం ఇదంతా బంధుచ్ఛేదంలో అసిధారలవంటి దారల ప్రభావమే. కనుబొమల

కౌటిల్యం, చూపుల చాపల్యం, తీక్ష్ణత, కుచాల కాఠిన్యం ఇవన్నీ స్త్రీలకు హృదయంలో వుంటాయి.

ఇక్కడ కల్యాణకారి కొందరు వ్యాపారులు తోడ్పడగా దారి పట్టుకొని నడుస్తూ, తన తండ్రి మరణించగా, తన తమ్ముడు రాజయ్యాడని విన్నాడు. పిదప తనకు కన్యను వాగ్దానం చేసిన పుణ్యసేనమహారాజు పట్టణాన్ని కొంతకాలానికి చేరి దూరమార్గాయాసం తగ్గినట్టుగా సంతృప్తి పడ్డాడు.

ఆ పట్టణంలో పుణ్యసేనుడు తన కుమార్తె అయిన మనోరమను వాగ్దత్తం చేసిన రాజపుత్రుడు సముద్రంలో మునిగిపోయాడని వినడం వల్ల కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. స్వయంవర మండపంలో ఆహుతులైన రాజులందరూ యథాక్రమంగా ఆసీనులు కాగా, మనోరమ రత్నాల పల్లకిలో స్వయంవర మండపానికి వచ్చి రాజులనందరినీ చూచింది. అతడు గ్రుడ్డివాడైనా ఆమె చూపులకు ఇష్టుడయాడు. నిజమే కుముద్వతికి అన్ని గ్రహాలలోను మేఘాలమధ్య మరుగైన చంద్రుడే కదా ప్రియుడు! రాజుకుమారి తమనంతా గడిచిపోవడం వల్ల నరపతులందరూ ఫలమేమీ దక్కలేదని సిగ్గుతో వెళ్లిపోగా, మనోరమ అంధుడైన ఆ రాజకుమారుని కంఠంలో పూలహారం వేసి, "నీదానిని" అని నెమ్మదిగా మధురంగా పలికింది. ఆ స్త్రీచేష్టితానికి చకితుడై రాజకుమారుడు ఏకాంతంలో ఇలా అన్నాడు: "నీవు ప్రజ్ఞాదరిద్రురాలివి. ఇలా చేయడం తగదు. స్మరసౌహార్ద మిత్రులు, పద్మనేత్రులు అయిన రాజులు వుండగా, వ్యర్థుణ్ని, అంధుణ్ని అయిన నన్నెందుకు వరించావు? కళ్లుగలవారి భార్యలు కూడా ఇతరుల ముఖాలు చూస్తారు. అలాంటప్పుడు గ్రుడ్డివాని భార్య పట్టపగలే ఇతరులను అభిసరిస్తుంది. నాకు లలనలతో అవసరం లేదు. వారిపైన నాకు విశ్వాసం లేదు. స్త్రీలు, నదులు కుటిలంగా వెళ్లుతూ, కులకూలాలను పడదోయవా?" రాజపుత్రుడు ఈ విధంగా పరుషంగా మాట్లాడగా నృపాత్మజ సిగ్గుపడి- "నాథ! అంతటా అలా అనుమానించడం తగదు. ఒకచోట తప్పు చూచి, శంకతో, దుష్టురాలు కాని స్త్రీకి కూడ దోషం అంటగట్టడం ఏమి న్యాయం? నీమీదే నాకు ప్రీతి వుండడం నిజమైతే, నామనస్సు అనన్యశరణమైతే, నీకన్నొక్కటి నిర్మలంగా కలుగనీ!" అని అన్నది.

ఆమె అలా అనగానే, సత్యానుభావంతో అతని కుడికన్ను విచ్చిన తామరపూవువలె మొలిచింది. రాజపుత్రుడు సంతోషించి, ఆ సులోచన అయిన మనోరమను సమాధానపరచి, ఆమె ముఖాంభోజలావణ్య గుణానికి ఆశ్చర్యపడుతూ, "ప్రియే, మీ తండ్రి నిన్ను వాగ్దత్తం చేసిన కల్యాణకారి అనే సుందర రాజకుమారుణ్ని నేనే. నా కండ్లు పీకివేసేటప్పుడు కూడా నాకు వైరమన్నది లేకపోవడం సత్యమైతే, నా రెండవ కన్ను స్పష్టం కానీ! అని సత్యోపయాచనం చేశాడు. వెంటనే తన రెండవ కన్ను నిర్మలమైంది. ఈ సంగతి పుణ్యసేనుడు సొంతం తెలుసుకొని, చాల సంతోషించాడు. కల్యాణకారి మనోరమతో మురుస్తూ, మామగారి సహాయంతో తన రాజ్యం మరల సంపాదించుకున్నాడు.

ఆ కల్యాణకారి నేనే. ఆ తమ్ముడే దేవదత్తుడు. ఆ పూర్వానుభావంతో ఇప్పటికీ అలాగే వున్నాడు.

ఈ విధంగా ఉదారమూ ఉపకార నిర్మలమూ అయిన బోధిసత్త్వచరితాన్ని, తత్తుల్యమైన ఖలచేష్టితాన్ని విని, భిక్షువులు అసమాన విస్మయం పొందారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కల్యాణకార్యవదానమనే ముప్పై ఒకటవ పల్లవం

# 32. విశాఖావదానం

సజ్జనుల స్త్రీలు అపమార్గం పడితే రాగరహితలవుతారు. సరాగ, తిమిరోన్ముఖి అయిన సంధ్య రవిని పర్వతం నుంచి క్రిందికి తోసివేస్తుంది.

జ్ఞానసాగరుడైన బుద్ధభగవానుడు దేవదత్తుని బహుజన్మాంతరాశ్రయమైన చరిత్రను పలుమారు చెప్పినప్పటికీ, మరొకమారు ఇలా మరొక సంగతి చెప్పాడు.:

పూర్వం కళింగదేశంలో అశోకుడనే రాజు వుండేవాడు. అతడు ప్రఖ్యాత విక్రముడు, శత్రుభంగకారి. అతనికి శాఖ ప్రశాఖ అనుశాఖ విశాఖులని నలుగురు కుమారులు ఉండేవారు. వారందరూ తారుణ్యమత్తులు కావడం వల్ల తండ్రి భార్యాపిల్లలతో వారిని తన రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. వికారావమానాలతో పుత్రస్నేహం కూడా నశించడం సహజం.

వారు వూరు వదలిపోతూ, తమ దుర్దశవలె దుస్సహమైన వికటాటవిని ప్రవేశించి పాథేయం కూడా అయిపోగా, ఆకలితో ఇలా ఆలోచించారు. "ఈ స్త్రీలు మనకు విపత్కాలంలో కాళ్ళకు కట్టిన గుది గొలుసులవంటివారు. మనం కష్టపడి సంపాదించుకొన్న ఆకు అలములోను భాగానికి సిద్ధమౌతున్నారు." ఈ విధంగా ఆలోచించి వారు తమ స్త్రీలను వధించడానికి నిశ్చయించారు. దుర్దశతో దగ్ధభాగ్యులైనవారికి ఇలాటి ఘోరమైన బుద్ధి పుడుతూంటుంది. వారిలో విశాఖుడు మాత్రం పాపసంకల్పం చేయలేక వారినుంచి వేరయి భార్యతో పరుగెత్తిపోయాడు.

అలా పరుగెత్తుతుండగా అతని భార్య కలంకవతి అనేది చాల నీరసించిపోయి, చాల దూరం పరిగెత్తి రావడం వల్ల అలసిపోయి మూర్ఛపడి వెంటనే మరణించింది. విశాఖుడు కరుణార్ద్రచిత్తుడై తన శిరసు గాయం చేసి రక్తం తీసి ఆమెకు తాపించాడు. ఆ రక్తపానంతో ఆమెకు ప్రాణాలు వచ్చాయి. సత్త్వసాగరుడైన విశాఖుడు తన అంగాలు కోసి ఆ మాంసంతో ఆమెకు ఆహారం కల్పించాడు. ఇలా వారిద్దరూ క్రమంగా ఘోరారణ్యం దాటి, నీడ చెట్లతో పచ్చగా కనిపించే ఒక కొండవాగు తీరాన్ని చేరారు. అక్కడ వారిద్దరూ విశ్రమించి వుండగా, కాళ్ళు చేతులు తెగి పెద్దగా ఏడుస్తూ ప్రవాహంలో కొట్టుకొనివస్తున్న ఒక మనిషి కనిపించాడు. ఆ కష్టదశలోవున్న అతనిని చూచి విశాఖుడు కరుణాశ్లిష్టుడై నదిలో దూకి, చేతులతో వాడిని ఎత్తి గట్టు చేర్చాడు; తర్వాత తోయఫలమూలాలతో వానికి ప్రాణం తెప్పించి, కొన్నినాళ్ళకే గాయాలు మానేట్టు చేశాడు. వాడు స్వస్థుడైనప్పటికీ నడవలేక పోవడం వల్ల, ఎక్కడికీ పోక విశాఖుని భార్య సకాలానికి భోజనం పెట్టి ఉపచరిస్తుండగా అక్కడే వున్నాడు.

విశాఖుడు భార్యతో చాల విరలంగా సంగమించేవాడు. విజిగీషువులైన శూరులు సింహాలలాగ అల్పరతులు. కనుక విశాఖుని భార్య దివ్యౌషధి రసాహారపరిపూర్ణ శరీర అయి ఆ వికలాంగునిపై మరులు

గొన్నది. స్వేచ్ఛాస్పర్శసుఖం కోరే స్త్రీలను స్నేహం ఏమీ పూసుకొనిరాదు. గుణం బంధించదు. గౌరవం కట్టుబాటులో వుంచదు. ఆ ఘనస్తని రాత్రిళ్ళు నిశ్శబ్దంగా ఆ వికలాంగునితో రమిస్తూ, నిశ్శంకంగా క్రీడించడానికి అవకాశం లేదనే అసంతృప్తితో పతి దీనికంతా విఘ్నప్రాయుడుగా వున్నాడని తలచి, అతన్ని చంపివేయడానికి జారునికి మాట యిచ్చింది. కలుషలయిన కాంతలు పాపకర్మలలో శిక్షా కుశలలు గదా!

నొసట పాపకర్మలు వ్రాసిపెట్టిన, జిత్తులమారైన ఆ స్వైరిణి పతిని చంపడానికి పన్నాగాలు ఆలోచించి, "తలనొప్పి, ఘోరమైన తలనొప్పి" అంటూ నొసట గుడ్డ కట్టుకొని బాధ అభినయించింది. ఆమె తీవ్రమైన శిరోరుజను చూచి పార్థివాత్మజుడు దాని ప్రతీకారానికి పెక్కు యుక్తులు ఆలోచించాడు. ఆమె విషాదచింతలతో స్తంభించిపోయి, నిట్టూరుస్తున్న అతనిని చూచి, మంచుతో తడిసి మ్లానయై చలికి గీపెడుతున్న భ్రమరాలున్న పద్మినిలాగ, రుద్ధకంఠంతో ఇలా అన్నది. "నేను కన్యగా వున్నప్పుడూ ఇలాటి తలనొప్పి వచ్చింది. వైద్యులు పాషాణభేది లేపనంతో పోగొట్టారు. ఈ కొండతూర్పున పాషాణభేది వ్యాపించి వుంది. పగ్గం కట్టి దిగి సాధ్యమైతే తీసుకుని రా. నేను ఆ పగ్గం నా చేతులతో గట్టిగా పట్టుకుంటాను." ఆ మాటలకు రాజకుమారుడు ప్రణయంతో అంగీకరించాడు. ఆమె తన చేతులతో పగ్గం పట్టుకొనగా, అతడు రాతిబండలను తాకి గర్జిస్తున్న గిరి నదీతటాన దిగాడు. దిగిన తర్వాత మందును వెదకడంలో నిమగ్నుడైనాడు. కలంకవతి పగ్గాన్ని వదలి వేసింది. స్త్రీచిత్తంవలె చపలమైన నీరున్న మహాగర్తంలో అతడు దభేలున కూలిపోయాడు.

కూలిపడినా, శుభకర్మశేషం వల్ల ఒళ్లు విరగక ప్రవాహంలో కొట్టుకొనిపోతూ, ఇలా ఆలోచించాడు. "ఈ గిరి నారీచిత్తసదృశమైన తన అంతరంగమైన సుడిగుండం చూపుతూ, స్త్రీల విషయంలో నియమంతో వుండాలని నాకు ఉపదేశిస్తున్నట్టు ఉంది. ఇది నిజం. స్త్రీలు మాయలవంటివారు. వారి మతి ఎటు ప్రసరిస్తుందో తెలుసుకోలేము. స్వప్నంలోని సంకల్పాలాగ అందనివారు. రాగద్వేషవ్యసనవిషమాయా విన్యాసాలు చేయడంలో ఆసక్తలు. కామంతో సకలజనతనే మోహింపజేస్తారు. క్షణమాత్ర పరిచయమైనా సరే కూలదోస్తారు. మాయలు కూడ సోకగానే క్షణంలో కూలదోస్తాయి." ఈ విధంగా ఆలోచిస్తూ తీవ్రమైన నదీవేగంతో సుకృతంతోనా అన్నట్టు పుష్కలావతీ పట్టణం చేరాడు.

ఆ సమయంలో ఆ పట్టణం రాజు సంతులేక మరణించాడు. నిమిత్తజ్ఞులైన అమాత్యులు సులక్షణుడైన ఆ రాజపుత్రుని పిలుచుకొనిపోయి, విధివత్తుగా మంగళోదకాలతో పట్టాభిషేకం చేశారు. స్త్రీచరితం చూచాడు గనుక రాజకుమారుడు వివాహమంటే విముఖుడయాడు.

విశాఖుడు వెళ్లిపోయిన పిదప కలంకవతి కూడ ఓషధీబలం మందగించగా, కాలం గడువను గడువను జీవికవిషయంలో వ్యాకులత చెందింది. వికలాంగుణ్ని భుజం మీద మోసుకొని, గ్రామపురమార్గాలలో నిలబడి పతివ్రతనని చెప్పుకుంటూ బిచ్చం అడుగుతూ తిరుగసాగింది. పతివ్రతా గౌరవంతో అందరూ ఎక్కువ డబ్బు యిచ్చేవారు. విపత్తులో మిథ్యాశీల ప్రవాదం కూడ సంపద కలిగిస్తుంది. కలంకిని ఈ విధంగానే తిరుగుతూ పుష్కలావతీ పట్టణం చేరింది. సతి అని అందరి మన్ననలు పొందుతూ రాజద్వారసమీపం చేరింది.

స్త్రీచరిత ద్వేషి అయిన రాజు పతివ్రతను తప్పక పూజిస్తాడనే ఆలోచనతో అతనిపై భక్తితో పురోహితుడు అతనితో ఇలా అన్నాడు. "దేవా! దూర దేశాంతరంనుంచి ఎవరో పతివ్రత వచ్చింది. ఆమె



చరణన్యాసం వల్లనే ఈ భూతధాత్రి పవిత్ర అయింది. చూడు దేవా! ఆ సాధ్వి తన భుజంపై భర్తను మోసుకొని వున్నది. పతివ్రతలను నమస్కరించడం వల్ల మానవులకు ఆయుస్సు వృద్ధి చెందుతుంది." పురోహితుడు ఆమెను చూడవలసిందని ఈవిధంగా ప్రార్థించగా, రాజు అతనితో ఇలా అన్నాడు. "అయ్యో బ్రాహ్మణుడా! నీవు సరళస్వభావుడివి. స్త్రీ స్నేహంతో వున్నదనేది కేవలం ప్రవాదం. నిష్కపట అనడం మతిభ్రమం. సతి అనడం గగనకుసుమం. స్త్రీ పాపిష్టురాలనడం నిస్సందేహం. స్త్రీలు ప్రబ్బలి తీగలవంటివారు. స్త్రీ నిప్పులురాలు, ప్రబ్బలి నిప్పుల, రెండూ అగ్ని రోహిణులు, జనసంగమంలో(జనం తాకినప్పుడు, సంగమ సమయంలో) సరళలు. వేళ్ళు కనిపించవు, బంధించివేస్తాయి ప్రబ్బలితీగలు. కారణం కనిపించని బంధనాలు స్త్రీలు. స్వభావంతోనే భేదద్రోహైకశీలలు, దుశ్చరితలు. కనుక స్త్రీలకు నమః, నమః, నమోనమః. దుష్టస్త్రీ చరితంతో అపకారం పొంది, దాని చింతతో వ్యథితమనస్కుడైన నాకు ఈ పృథివి రత్నపూర్ణ అయినా రుచించదు. కొండలేడివలె ముగ్ధలుగా కనిపిస్తారు. ఇతరులను వంచించడంలో తీక్ష్ణస్వభావలుగా వుంటారు. దేహం ఇవ్వడానికి ఇష్టపడుతారు. కాని పురుషుల జీవితాలను హరిస్తారు. పూవు పడినా భయపడుతారు. నిప్పును తాగుతారు. సరలకుటిలలైన స్త్రీలు ఎన్నిసార్లు ఆలోచించినా అర్థం కారు. అయినా నీవు, బలవంతపెడుతున్నావు. గనుక ఆ స్త్రీని చూస్తాను." అని ప్రాసాదమెక్కి ఆమెను చూచాడు.

వికలాంగునితో సంబంధంగల పాపిష్టురాలు తన భార్య అనే తెలుసుకొని, సచివులకు ఆమె సమాచారం వివరించాడు. ఆమె కూడ రాజును గుర్తుపట్టి క్షణకాలం తల వంచుకొని, జనులు చెవులు మూసుకుని ఛీకొట్టగా త్వరగా నగరం వదలి వెళ్లిపోయింది. ఆ విశాఖుణ్ని నేనే. ఆ వనితే ఈ దేవదత్తుడు.

జినుడు చెప్పిన ఈ ఇతివృత్తం విని భిక్షుగణం వాని చరితాన్ని నిందించింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో విశాఖావదానమనే ముప్పదిరెండవ పల్లవం

# 33. నందోపనందావదానం

శుద్ధాత్ములైన వారి స్వభావం అమృతప్రాయం, పుణ్యప్రశమానుభావం. దాని ప్రభావంతో క్రూరులు కూడ వెంటనే క్రోధ విషముక్తులవుతారు.

ఒకప్పుడు తథాగతుడు జేతవనారామంలో విహరిస్తున్నప్పుడు, ఆయన ఆజ్ఞతో బిక్షుగణం గిరికాననాలు తిరుగుతూ తపస్సు చేయడానికి వెళ్లినది. భిక్షువులు సుమేరుపర్వతం చరియలలో ఉండి ధ్యానపరాయణులై, కొంతకాలానికి చిక్కి పాలిపోయిన ముఖాలతో తిరిగి వచ్చారు. వచ్చి భగవానునికి పాదపద్మాభివందనం చేసి, తక్కిన భిక్షువులు అడుగగా తమ దేహదౌర్బల్యం కారణం ఇలా వివరించారు. "నందోపనందకులనే నాగసర్పాలు వైనతేయునికి కూడా కంటబడక సుమేరు పర్వతాన్ని మూడు చుట్లు చుట్టుకొని ఉన్నాయి. అవి ఎప్పుడూ నిప్పును కక్కే మూడు రకాల ఊపిరి వదలుతాయి. దాని తాకిడికి రాళ్లు కూడా బూడిద అయిపోతున్నాయి. మేము ధ్యానయోగంలో వున్నప్పుడు ఆ విష నిశ్వాసాలతో శరీరం కాలి పాలిపోయిన ముఖాలతో, చిక్కిశల్యాలై బైటపడ్డాము." వారు ఇలా చెప్పగా శాస్త్రభిక్షుసంఘం ప్రార్థనల వల్ల నాగులను అణచివేయడంలో సమర్థుడైన మౌద్గల్యాయనుణ్ని అక్కడికి పంపాడు.

మౌద్గల్యాయనుడు శిఖరాలతో ఆకాశాన్ని అంటుతున్న సుమేరు పర్వతం చేరి, యోగంతో అంతర్హితుడై, పడుకొని ఉన్న నాగేంద్రులను రెంటిని చూచాడు. వాటిని అతడు మేల్కొలిపి, మేల్కొనేలోగా తను మహానాగాకారం ధరించి, చుట్టివేశాడు. అవి మేల్కొని తమను చుట్టివేసిన ఆ భీషణాకృతిని చూచి, నరరూపం ధరించి భయవిహ్వలచిత్తంతో పారిపోదొడగినాయి. మౌద్గల్యాయనుడు కూడ నాగాకారం వదలి, స్వకీయరూపంతో వారిని వెంటాడుతూ, "ఓ నాగులారా! ఎక్కడికి తొందరగా పరిగెత్తుతున్నారు? భయం వదలండి. మిమ్మల్ని పరిగెత్తించిన ఆ నాగం లేదు. ఆ నాగమనేది ఎన్నటికీ లేకపోతే, మీరు శరణ్యుడైన బుద్ధునికి పాదాభివందనం చేయరా?" అని ప్రశ్నించాడు.

ఆ నాగులు అతడు చెప్పినది విని వినయంతో "భగవంతుని దర్శనంతో మాకు అనుగ్రహం కలిగించు, ఆర్యా, కలిగించు" అని కోరాయి. మౌద్గల్యాయనుడు వారిరువురినీ భగవానుని సన్నిధికి తీసుకొని వెళ్లి, వారి సంగతి మనవి చేసి కూర్చున్నాడు.

శరణాగతులై, రత్నప్రభాభూషితభూతలులై ప్రణామం చేస్తున్న నాగేంద్రులను భగవానుడు చూచి, "నానుంచి శిక్షాపదాలు పొంది సర్వభూతాలకు అభయమిచ్చేవారయ్యారు. శరణప్రాప్తిసమయం నుంచి మీరు నిర్భయులయ్యారు." అని వారిని చూపులతోనే దోష విషద్వేశవివర్జితులనుగా చేసి పంపివేశాడు. మహాశయుల సందర్శనంతోనే, ప్రభాపదేశంతో శమామృతం శరీరం తాకగా, ద్వేషవిషతాపంతో తపించే హింస్రజంతువులు గూడా చల్లబడిపోతాయి.



నాగేంద్రుల పూర్వజన్మవృత్తాంతమేమిటని భిక్షువులడుగగా భగవానుడిలా తెలియజేశాడు:

"పూర్వం వారాణసిలో కృకి అనే రాజు వుండేవాడు. అతడు కాశ్యపునినుంచి ధర్మోపదేశం పొందాడు. అతడు నందోపనందులనే మంత్రులకు రాజ్యం అప్పగించి, బోధిసంసక్తుడై సత్యదర్శనంతో నిర్వృత్తి పొందాడు. మంత్రులిద్దరూ ధర్మాధర్మమయంగా రాజ్యం పాలించి కాశ్యపునికి సర్వోపకరణాలతో కూడిన విహారం నిర్మించారు, వారిద్దరూ కాలక్రమాన ఈ నాగేంద్రులై పుట్టారు. విహారం నిర్మించిన పుణ్యంతో వారికి మేరుపర్వతనివాసం కలిగింది."

ఈ విధంగా పూర్వజన్మలో చేసిన సత్కర్మపరిచిత సుకృతమైన ఫణివరచరితం జినుడు చెప్పగా విని, భిక్షునివహం విషధరనియమనాన్ని ప్రశంసించింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో నందోపనందావదానమనే ముప్పయి మూడవ పల్లవం

# 34. గృహపతిసుదత్తావదానం

పరహిత భావనతో ఇచ్చిన తను ధన కణ శేషమైనా, అపరిక్షయగుణ కల్పనతో సుపుణ్యావిశేషంగా పరిణమిస్తుంది.

కొంతకాలం గడువగా ఒకమారు నందోపనందులు భగవానుని ధర్మోపదేశం వినడం కోసం వచ్చారు. ప్రసేనజిన్మహారాజు కూడ భగవానుని దర్శనం కోసం వచ్చాడు. నందోపనందులు అక్కడ తనకు ప్రణామం చేయలేదని రాజుకు కోపం వచ్చింది. తర్వాత అతడు సుగతునికి నమస్కరించి వెళ్లి పిదప వారిని పట్టుకొనడానికి ఆలోచించాడు. వారు అతని ఆలోచన గ్రహించి, శస్త్రవృష్టి కురిపిస్తూ ఆకాశానికి ఎగిరారు. రాజు కూడా శస్త్రవృష్టి కురిపించాడు. సర్వజ్ఞుని ఆజ్ఞతో మౌద్గల్యాయనుడు నరపతి శస్త్రవృష్టిని తామరపూవుల, కలువల రేకులుగా మార్చివేశాడు. రాజు మరల భగవానుని వద్దకు వెళ్లి అక్కడికి మరల వచ్చిన ఫణీశ్వరులను భగవానుని ఆదేశంతో మన్నించాడు.

పిదప రాజు ప్రార్థనపై భగవానుడు భిక్షుగణంతోపాటు రాజమందిరానికి భిక్షకోసం వెళ్లాడు. భక్ష్యాలు కాలుస్తుండగా, రాత్రి నగరంలో నిప్పంటుకుంది; భగవానుని ప్రభావంతో వెంటనే శాంతించింది. భగవానుడు భోజనం చేసి మరలిన తర్వాత రాజు "నగరంలో ఎవరూ రాత్రి నిప్పు వెలిగించకూడదు. వెలిగిస్తే శిక్ష" అని చాటించాడు.

ఇది ఇలా వుండగా ఆ నగరంలోనే సుదత్తుడనే గృహపతి కుమారుడు వృద్ధిబలుడనే వానిని రాజు మిథ్యాదోషంతో చంపించాడు. శాస్త్ర శాసనం వల్ల అదివరకే జ్ఞానధైర్యాలు పొందివుండడం వల్ల సుదత్తుడు పుత్రుడు మరణించినా, దుఃఖపడకనే కాలం గడుపుతూ, పుత్రుడు లేడనే కారణంతో తన సంపదనంతా దరిద్రులకు దానం చేసి, ఒక్క పణం మాత్రం మిగుల్చుకున్నాడు. ఒక్క పణం మాత్రమే మిగుల్చుకొని పూర్తిగా దానధర్మాలు చేయడం వల్ల తర్వాత స్వల్పంగా దానం చేయడం వల్ల 'గృహీసుదత్తుడు' అనే పేరు అతనికి వచ్చింది. గృహమంటే స్వల్పం.

ఒకేమారు అతడు దర్శనానికి వచ్చి, స్వల్పదాని అనే పేరు వచ్చింది కదా అని సిగ్గుపడుతుండగా, భగవానుడు దయతో, "ఓ గృహపతీ! అల్పదానంతో సిగ్గుపడనక్కరలేదు. శ్రద్ధతో అర్పించిన కణమే కనకశైలమవుతుంది. పూర్వం వేలముడనే బ్రాహ్మణుడు బహుతరంగా దానం చేశాడు. శ్రద్ధ లేని దానివలన వృద్ధి పొందలేదు. జంబుద్వీపగతులైన జనానికంతా భోజనం పెట్టేవాని పుణ్యంకంటే, బోధియుతుడైన ఒక్కనికి భోజనం పెట్టినవాని పుణ్యం గొప్పది" అని సమాధానపెట్టగా, సుదత్తుడు సంతోషించి, భగవానుని ప్రణమిల్లి ఇంటికి వెళ్లిపోయాడు. రాత్రి దీపం వెలిగించి బుద్ధానుశాసనం చదువుతుండగా, నిప్పు వెలిగించాడనే నేరారోపణపై రాజపురుషులు అతనిని బంధించి, కారాగారంలో వేశారు. కారాగారానికి శక్రబ్రహ్మాది దేవతలు వచ్చి, ధనం స్వీకరించమని కోరారు. అతడు నిరాకరించగా, అతని ఇంట ధర్మోపదేశం ప్రవర్తిల్లింది. పట్టణంలో నిప్పంటుకుంది. రాజు అతని ప్రభావం తెలుసుకొని, అతనిని విడుదల చేయగా, ఎక్కడా నిప్పు కనిపించలేదు.

ఆ గృహపతి ఒకమారు జినదర్శనానికి వెళ్లి ముందు నిలబడి వెనుక వచ్చిన ప్రసేనజిత్తును చూడలేదు. తర్వాత చూచినా, భగవానుని ఎదుట అతనికి నమస్కారం చేయలేదు. జగత్పూజ్యుని ఎదుట మరొకరు పూజార్హులు కారు. రాజు జినదేవునినుంచి సెలవు తీసుకొని నగరుకు చేరిన పిదప పట్టణం నుంచి గృహపతిని వెళ్లగొట్టాలని ఆజ్ఞాపించాడు. అది చూచి సుదత్తుని రక్షించే ప్రసాదిని అనే దేవత నరపతిపై క్షుద్రజంతువులు వదలింది. అవి అతనిని కరిచాయి. దానికి అతడు భయపడి అమాత్యాంతఃపుర పరిజనులతో సహ జినదేవుని సన్నిధికి వచ్చి, అతని ఆదేశంతో సుదత్తుని వద్దకు వెళ్లి సంతోషపెట్టాడు. ఈ విధంగా సుదత్తగృహపతి సతత ప్రత్యాసత్తితో పరామృతనిర్భరమైన శాంతిని పొందాడు. విమల మనస్కుల అంతేవాసులు విఘ్నాయాస ప్రయాసలేవీలేక వివేకమహానిధిని స్వాయత్తం చేసుకుంటారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో గృహపతి సుదత్తావదానమనే ముప్పయి నాల్గవ పల్లవం

# 35. ఘోషిలావదానం

దాతకు క్షణకాలంలో దానంలో సహాయం చేసినవారికి కూడా దాతతో సమానమైన ఫలం లభిస్తుంది. పరోపకార ప్రణయపరులను పాపకర్మ అనుసరించదు.

భగవానుడొకప్పుడు జేతవనారామంలో విహరిస్తున్న సమయమది. కౌశాంబీనగరంలో ఉదయనుడనే వత్సభూపాలుడుండేవాడు. అతని కీర్తిని ఇప్పటికీ విద్యాధరవధువులు గానం చేస్తారు. అతని రాజ్యంలో సుధనుడనే గృహపతి వుండేవాడు. అతడు గనులనుండి లోహాలు తీయించి జీవనం చేస్తూ, ధనాదానంలో సమర్థుడుగా వుండేవాడు. ఒకమారు అతడు కార్యార్థిగా ఆస్థానానికి రాగా, ఉదయనుడు అతనిని మాటలతోనే కార్యార్థిగా వచ్చాడని గ్రహించి, ఆదరంతో ఇలా అన్నాడు. "ఓ గృహపతీ! నీ మాటలతోనే నీవద్ద సువర్ణనిధి వున్నట్టు తెలుసుకున్నాను. నీవు సువర్ణ సంచయంలో చాల సమర్థుడివి." ఆ మాటలు విని గృహపతి నవ్వుతూ, చేతులు జోడించి, "నా యింట్లో కాంచనసంచయం ఉన్నమాట నిజమే, దేవా, స్వద్వృత్తిచింతానిరతుడు, వాత్సల్యపేశలుడు, తండ్రివంటి సంరక్షకుడు నీవు వుండగా నాకు ఏమిటి కొరత? రాజు లంచం తిందామని నిష్కరుణుడై పులిలాగ ప్రవర్తిస్తే ధనవంతులు నిర్ధనులౌతారు. ధనహీనులు నిధనం పొందుతారు. రాజు ధర్మధనుడయితే. ప్రజలు నిశ్శంకగా ధనమార్జిస్తారు. ఆర్జించినదానిని భాగాలు పంచుతారు. పంచినదానిని అనుభవిస్తారు" అని మనవి చేశాడు. బుద్ధిమంతుడైన ఆ గృహపతి సముచితంగా చెప్పిన దానిని రాజు విని, దంతకాంతితో అనుగ్రహిస్తున్నవానివలె, "బుద్ధిమంతుడవైన నీవు నాకు కార్యసచివుడు కాగలవాడివి. ధీధుర్యులైన నీవంటివారివల్లనే ధరణీభరం ధరించబడుతున్నది" అని అన్నాడు. ఆ మాట విని గృహపతి వినయంతో "దేవ, నాబోటివారు రాజసేవలో సభామండల పండితులుగా వుండగలవారు కారు. సేవ అనేది స్వాతంత్ర్యమనే ఉద్యానానికి విచ్ఛేదం, మంచి నిద్రాసుఖం అమ్ముకొనడం, సంసార దుఃఖదైన్యంవలె భయంకరమైనదీని. సేవకుడు "అయ్యా, ఇదిగో ఉన్నాను" అంటూ ప్రభువులు తన తలమీద కాలుపెట్టే పాదపీఠంవలె అయి కృతకృత్యుణ్ణయానని అహంకారం పొందుతాడు. సేవాయాస ప్రయాసంతో సంపాదించిన సంపదల అనుభవం కూడ దుష్టుల పొత్తుతో ప్రభుభ్రూభంగంవలె కుటిలమూ, క్షణస్థాయీని. ఇంతచేసినా రాజు యిచ్చిన సంపదలు ఎంత ప్రయత్నించినా నిలిచేవి కావు; దర్పంతో ఉగ్రమైన మొసలిలాగా పట్టుతప్పి పారిపోతాయి; క్షణకాలం నవనవాశ్లేషంతో ప్రణయం చూపే వారరమణివలె రమణీయమైనవీని" అని సేవను తిరస్కరిస్తూ ఎంత మొరపెట్టుకున్నా వినక, రాజు అతనిని మంత్రిగా నియమించాడు. ప్రభువుల ఇష్టాన్ని ఎవరు కాదంటారు?

అతనిని సర్వాధికారమిచ్చి, పెద్ద పదవిలో పెట్టగానే తక్కిన మంత్రులందరూ సహించలేక, విద్వేషపూరితులయారు. రాజు అతని ధర్మచింతను పరీక్ష చేయడానికి దుర్మార్గులను ప్రేరేపించి అసత్కార్యం చేయడానికి పురికొల్పగా, అతడు అలాటి పనులు చేయలేదు. రాజు కోపగించుకున్నట్టుగా ప్రవర్తించి అతనితో అధర్మశాసనాలు చేయించాలని ప్రయత్నించాడు. కాని, అతడు అధర్మసంయుక్తమైన శాసనాలు చేయలేదు. ఒక జన్మసుఖం కోసం బహు జన్మశతాలు బాధపెట్టే సాధునిందితమైన పని చేయనని అతడు స్పష్టంగా చెప్పాడు. భయంతోను, ధర్మంతోను, ఉపధతోను పరిశుద్ధుడైన అతనిని భూమీపతి స్వేచ్ఛగా వదలివేశాడు. అతడు సకలార్థులకు అవిచ్ఛిన్నంగా దానసత్రం ఏర్పాటు చేశాడు. యశస్వి అయిన అతని దానసత్రం కీర్తి అంతటా వ్యాపించగా, కల్పవృక్షంపై ప్రజలకు ఆదరం తగ్గిపోయింది.

ఇలా ఉండగా దక్షిణాపథం నుంచి తీర్థయాత్రకోసం కొందరు మునులు బయలుదేరి దారిలో నీళ్లులేని అడవిలో చిక్కుకున్నారు. వారు దప్పికతో అలమటిస్తూ మూర్ఛపోతూ, నిశ్చేతన వస్తువులను గూడ నీళ్లడగడం ప్రారంభించారు. "దేవ గంధర్వ నాగులలో ఎవరైనా సరే దయాంబుధి అయినవారు మాకు నీరు ఇచ్చి పుణ్యం కట్టుకోండి" అని వారు యాచించారు. అప్పుడు రత్న కేయూర కంకణధ్వనితో ఒకచేయి బంగారు చెంబు పట్టుకొని ఒకచెట్టు మధ్యనుంచి బయలుదేరింది. ఆ చేయి ఆ చెంబును వంచింది. వారు అమృతాస్వాదం గల జలం కుత్తుకబంటిగా తాగి ప్రాణాలు కుదుటపరచుకున్నారు. మరల వారు జలం కోరారు. మరల ఆ పాణిపద్మం చెట్టు మధ్యనుంచి బయలుదేరి వారికి ఆశ్చర్యం కలిగించింది. వారు "అదృశ్య వృక్షనిలయం నుంచి ఉద్భూతుడైనవాడివి నీవు ఎవ్వడివి?" అని ప్రశ్నించారు. ఆ హస్తం ఇలా అన్నది: "విశ్రుతకీర్తి, సంపదలకు ఆశ్రయము అయిన అనాథపిండదుడనే గృహపతి శ్రావస్తిలో ఉన్నాడు. అతడు సర్వస్వదాత. నేను ఆయన గృహసమీపంలో నివసించే కొండెగాడిని. నిత్యం వచ్చే అర్థులకందరికీ చేయెత్తి అతని యిల్లు చూపేవాడిని. ఆ పుణ్యంతో మరణాంతరం దేవత్వం పొంది ఇక్కడ విహరిస్తున్నాను. అర్థులకు దిక్కు చూపిన ఈ నా చేయి ఈ విధంగా ప్రకాశిస్తున్నది."

ఆ మునులు ఆ బాహువువద్ద సెలవు తీసుకొని, అక్కడినుంచి బయలుదేరి ముందుకి సాగిపోయి, ఆకలిగొని, దట్టమైన నీడగల ఒక చెట్టు చూచారు. అక్కడికి వెళ్లి ముందులాగే ఆ చెట్టును భోజనం కోరారు. ఆ చెట్టునుంచి "అదుగో అక్కడ పుష్కరిణీతీరంలో చిన్న పడవలో నిండుగా దివ్యభోజనం సిద్ధంగా వుంది. ఇష్టమైనంత భుజించండి" అని అద్భుత గంభీరమైన వాక్కు వినిపించింది. ఆ ప్రకారమే వారు దివ్యభోజనం భుజించి, "నీ వెవరు?" అని ఆ దివ్య పురుషుణ్ణి ప్రశ్నించారు. ఆ తరుసంశ్రితుడైన దివ్యపురుషుడు తన వృత్తాంతం వారికిలా విపులంగా వినిపించినాడు. "శ్రావస్తిలో అనాథపిండదుడనే గృహపతి ఉన్నాడు. అతడు జరిపే సంఘభోజనాలలో పెరుగుకుండలు అందించే బ్రాహ్మణుణ్ణి. ఆ సంఘభోజనాంతంలో మిగులుబొగులూ తినేవాడని. భిక్షువులకు రాజభోజనం, నాకేమో ఉప్పులేని మిగులూబొగులూ చూచి ఖేదపడి, అనాథపిండదుని మాటతోను, భోజనంపై లాలసతోను అష్టాంగయుక్తమైన పోషధవ్రతం ఆరంభించాను. ఆ వ్రతం సమాప్తి చేయకనే చాపల్యంతో రాత్రిభోజనం చేశాను. దానివల్ల నన్ను ప్రజలు ఖండపోషధుడని అనేవారు. ఆ ఖండవ్రతంతోనే నేను మరణాంతరం దేవపుత్రత్వం పొందాను." ఈ మాటలు విని మునులు ముందుకు కదిలారు.

వారు ముందుకు వెళ్లుతూ, "తీవ్రతపస్సుతో మనం ఎంతో బాధపడుతున్నాము. ఇంతవరకూ కుశలమనేదాన్ని తాకలేకపోతున్నాము. పోషధవ్రతమే చేద్దాము. నిరపాయంగా, సుఖోపాయంగా హితం చేకూరుతుందంటే ఎవరు వద్దంటారు?" అని ఆలోచిస్తూ కౌశాంబీనగరంవైపు వెళ్లారు. ఆ నగరం చేరి

దానప్రసిద్ధుడైన సుధనుని గృహానికి వెళ్లారు. అక్కడ అతడితో సత్కారం పొంది, అడవిలో జరిగిన వింతలను అతనికి తెలిపి, అతనితోపాటే అనాథపిండదుని యింట ఆదరంతో పూజలు పొంది, తాము చూచిందీ, విన్నదీ తెలియజేశారు. ధర్మసచివుడైన అనాథపిండదుడు వ్రతార్థులైన మునులను, మిత్రుడైన సుధనుణ్ని భగవానుని సన్నిధికి తీసుకొని వెళ్లాడు. భగవానుడు వారిని అనుగ్రహించాడు; దానితో వారు సత్యదర్శన సంబుద్ధులై సుగతిని పొందారు.

మునులు వెళ్లిపోయిన తర్వాత భగవానుడు పక్షపాతార్ద్రమైన దృష్టితో సుధనుణ్ని చూచి, సమ్యక్జ్ఞానభాజనుణ్నిగా చేశాడు. సుధనుడు సత్యసందర్శనంతో కుశలోదయం పొంది కౌశాంబికి మరలిపోయిన తర్వాత జినునికి గొప్ప విహారం నిర్మించాడు. భగవానుని ఆదేశంతో చుందుడు అనే భిక్షువు ఆ విహార నిర్మాణంలో సహాయపడడం వల్ల ఆ విహారం చుందవిహారమనే పేరు పొందింది. ఆ విహారంలో రాధ అనే దాసి అయిన పరిచారిక ఉండేది. "నేను వచ్చే జన్మలోనైనా దాసి కాకుండా పుట్టాలి" అనే శ్రద్ధాప్రణిధానంతో ఆ పరిచారిక శీర్ణవస్త్రం భగవానునికి సమర్పించింది. ఆ చీవరం - శీర్ణవస్త్రం భగవానుని రంగుతో కలిసిపోయింది.

సుధనుని ఉజ్జ్వలాద్భుతమైన పుణ్యసంభారం చూచి, భిక్షువులు ప్రశ్నించగా, భగవానుడు అతని పూర్వజన్మ చరితం ఇలా చెప్పాడు. "పూర్వం వారాణసిలో సుంధానుడనే గృహపతి ఉండేవాడు. దానకుంజరుడైన అతనికి దానధార ఎప్పుడూ క్షీణించలేదు. ఒకమారు పన్నెండేండ్ల కరువు వచ్చింది. అప్పుడతడు అర్థులకందరికీ అవిచ్ఛిన్నంగా అన్నసత్రం పెట్టాడు. అతని కోశాగారపతి అయిన పద్మాకరుడనేవాడు దానసహాయకుడుగా ఉండేవాడు. సంపదలలో కలిసి పనిచేసేవారు వుంటారుగదా! ప్రత్యేకబుద్ధ సంఘానికి భోజనకాలం తెలిపే బుద్ధిమంతుడైన ధర్మదూత అనేవాడు అతని మంత్రి. కర్మవశాత్తు ధర్మదూత మరణించగా, కుకురుడనేవాడు భోజనకాలం తెలిపేవాడు. ఆ సుంధానుడనేవాణ్ని నేనే. కోష్ఠికుడు(కోశాగారపతి) అనాథపిండదుడు. సంఘధర్మదూత ఉదయన నరపతి. తర్వాత కాల నివేదకుడైన కుకురుడే సుధనుడు. రాజాజ్ఞను ఘోషించడం వల్ల ఘోషిలుడనే మరొక పేరు కూడ వచ్చింది.

ఈ విధంగా భవభేది అయిన భగవానుడు చెప్పిన సుకృతసౌరభ సారసుధారసమైన సముచిత చరితాన్ని భిక్షువులు మంచి మనసుతో, శ్రవణాంజలులతో పానం చేశారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ఘోషిలావదానమనే ముప్పైఅయిదవ పల్లవం

# 36. పూర్ణావదానం

కమలం బురదలో పుట్టినా, అశుచిగా వుండే పరిసరవస్తువుల స్పర్శలేక వుంటుంది. కనుక జాతి, సహజ పరిచితమైన అంతర్గత విమల గుణాలకు కారణం కాదు.

శ్రావస్తిలో జేతవనారామంలో జినకల్పద్రుమం సర్వప్రాణుల స్వస్తిధ్యానపరాయణమై వుండగా, శూర్పారమనే పట్టణంలో రత్నసంచయానికి సాగరునివంటివాడు, మతిమంతుడు అయిన భవుడనే సార్థపతి వుండేవాడు. అతనికి కేతకి అనే భార్యకు భవిలుడు, భవభద్రుడు, భవనంది అని ముగ్గురు కుమారులు కలిగారు. అతడు ఒకమారు వ్యాధిగ్రస్తుడై చావడానికి సిద్ధం కాగా, పత్నీపుత్రులు ఉద్విగ్నులై కఠినభావంతో ఉపేక్షించారు; అప్పుడు మల్లిక- అతని దాసి శ్రద్ధగా పరిచర్య చేయడం వల్ల స్వాస్థ్యం పొందాడు. ఈ ఉపకారానికి సార్థపతి కృతజ్ఞుడై ప్రణయంతో ఆమెను భోగించడం వల్ల ఆమెకు కుమారుడు కలిగాడు. పుట్టినప్పుడు తండ్రికి సర్వార్థాలూ పూర్ణం కావడం వల్ల పూర్ణేందు**సుందరుడైన** ఆ బాలునికి పూర్ణుడు అనే పేరు వచ్చింది. కేతకికి కలిగిన పుత్రులు ముగ్గురూ పెళ్ళి పేరంటం అయిన పిదప ధన సంపాదన కోసం సముద్రాంతరాలకు వెళ్ళారు. పూర్ణుడు తండ్రి భాండశాలలోనే ధనార్జన చేశాడు. పెద్దవారు ముగ్గురూ లక్షలకొలది బంగారు గణించి స్వనగరానికి మరలివచ్చారు. సముద్ర యాత్ర చేయడం వల్ల వారికెంత ధనం లభించిందో దానికంటె హెచ్చుగానే పూర్ణునికి యింట్లో బేరం వల్ల వచ్చింది.

అది చూచి వృద్ధుడైన జనకుడు అవసానదశలో వారిని పిలిచి "రాబడికోసం ఎక్కువగా ఆశించడం పెక్కు క్షయాలకు కారణమౌతుంది. చూచారుగదా, మీరు ఎంతో పరిశ్రమ చేసి సముద్రాలు గడిచి గణించినంత, పూర్ణుడు కష్టపడకనే సంపాదించాడు. శుభకర్మ విపాకంతో సంపదలు లభిస్తాయి. ఒకరి చేతినుంచి ధనం పరిగెత్తి పోతుంది. మరొకరికి ఉన్నచోటనే ఊడిపడుతుంది. సన్మార్గం పరిత్యజించకుండా యుక్తాయుక్తవివేకంతో దేశకాలాలెరిగి ప్రవర్తించే ఉత్తములకు అన్ని చోట్ల సంపదలే. ధర్మపరులైన బుద్ధిమంతులు స్వగృహంలోనే ధనులవుతారు. ఇతరులు సముద్రాలు దాటివెళ్ళి ప్రాణాపాయం పొందుతారు. ఉత్తములైనవారు శ్లాఘ్యమైన ధనోపనిషత్తును యత్నంతో తెలుసుకోవాలి. ద్రోహరహిత పరిశుద్ధ బుద్ధులకు, స్వాధీనం తప్పనివారికి సంపదలు చేకూరుతాయి. ఐకమత్యంలో కలత పుట్టకుండా కాపాడుకోండి. కలతపడిన కులంనుంచి కుండనుంచి నీరు ఒలికినట్టు కల్యాణసంపద జారిపోతుంది. కొరువులు కదలించకపోతే మంటలు ఆరిపోతాయి. కాని పెద్దవంశంలో కదలిక పుడితే సంపదలు ఆరిపోతాయి. అన్నదమ్ములలో భేదభావం రాత్రిళ్ళు భార్యలు ద్వేషవిద్యను బోధించడం వల్ల కలుగుతుంది. అది అణగడం కష్టం. ఉన్నతులు, స్వాధీనం తప్పనివారు అయిన అన్నదమ్ములలో భేదభావం, పుట్టుదు- ఎంతవరకంటే కుఠారధారలాగ వనిత లోపల ప్రవేశించనంతవరకు. స్త్రీలు అన్నదమ్ములను

ఐశ్వర్యకథనంతోను, పరుషనిందతో గురువును, ఏకాభిలాషంతో మిత్రుణ్ణి విడదీస్తారు. స్త్రీలు నవ్వుతూ కనుబొమలు తిప్పుతూనే మిత్రుని మైత్రి కూకటివేళ్ళతో తెగిపడే మాటలు చల్లగా అంటారు" అని ఐశ్వర్యానికి సంబంధించిన హితవు చెప్పి మరణించాడు.

తండ్రిమాటతో వారు ధనాన్ని అవిభక్తంగానే వుంచి, జ్యేష్ఠులు దేశాంతరంలో ధనార్జనపరులయారు. పూర్ణుడు ఇంట్లోనే వుండి ధనసంపాదన చేయసాగాడు. జ్యేష్ఠులు ఇంటికి తిరిగివచ్చినమీదట, స్త్రీల చెప్పుడు మాటలు వినడం వల్ల కూడుగుడ్డల విషయంలోనే భేదం ఏర్పడింది. ఆస్తిపంపకంలో జ్యేష్ఠులు విద్వేషవశంతో దాసీపుత్రుడని పూర్ణునికి భాగమివ్వలేదు.

కాలక్రమాన పూర్ణుడు ధనవంతుడయాడు. ఒకనాడు పూర్ణుడు దారిలో ఎండ కాస్తున్నా చలికి బాధపడుతున్న కట్టెలవాణ్ణి చూచాడు. పూర్ణుడు వానికి డబ్బిచ్చి కట్టెలమోపును కొని ఇంటికి వచ్చాడు. ఆ మోపులోని కట్టెలను పొయిలో పెట్టగా, అవి అగ్నికే తాపం పోగొట్టే దివ్యచందనం కట్టెలని తెలిసింది. సుకృతం వలె లభించిన ఆ చందన కాష్ఠాలతో పూర్ణుడు మహాధనవంతుడై సార్థవాహులకు సేవ్యుడై, రాజుకు గౌరవపాత్రమయ్యాడు. రత్నాకరం దాటి ఆరు సార్లు వెళ్లి విశేషధనం ఆర్జించి, అర్థులకు సర్వస్వదానం చేసి సర్వవ్యాపారస్థులకు తరశుల్కాది అనుగ్రహం కలిగించాడు. (శుల్కాదులను రద్దు చేయించాడు.)

శ్రావస్తీవాసులైన వణిక్కులు కోరగా, అతడు మరల ఓడ ఎక్కి సముద్రద్వీపానికి వెళ్ళాడు. అతడు తిరిగి వచ్చిన మీదట వణిక్కుల సాతు సుగతునికి సంబంధించిన శైలగాథలను పాడుతుండడం విన్నాడు. "ఎవరి గీతాలివి?" అని అడుగగా వారంతా "మహామతిమంతుడు బుద్ధభగవానుడు గానం చేసిన గాథలివి" అని అన్నారు. బుద్ధుడనే పేరు వినగానే అతనికి హర్షం కలిగింది. మానవులకు స్వవాసనారూఢ విషయం కొద్దిపాటి ప్రేరణతోనే వ్యక్తమౌతుంది. ఆ సార్థవాహులు విస్తరంగా చెప్పిన సుగతుని కథలు విని, ఆతనిపైనే మనస్సుతో అతనిని దర్శిద్దామనే ఉత్సుకతతో, ఇంటికి వచ్చిన వెంటనే అన్నీ వదలిపెట్టి, మిత్రుడైన అనాథపిండదుని చూడడానికి శ్రావస్తికి బయలు దేరాడు. అతనితో తనకు ప్రవ్రజ్య స్వీకరించాలనే అభిలాష ప్రకటించి, అతనితో పాటు భగవానుని సన్నిధానానికి వెళ్ళాడు.

పూర్ణుడు మోహధ్వాంత దివాకరుడైన సర్వజ్ఞుణ్ణి దర్శించగానే, తత్పాదస్పర్శతోనే కృతకృత్యుణ్ణయానని భావించుకున్నాడు. భగవానుడు అతని ప్రవ్రజ్యాసంకల్పాన్ని తెలుసుకొని, తన దశన జ్యోత్స్నతో దిక్కులను వివేకవిమలంగా చేస్తూ "హే భిక్షో! నిరాశంకమూ, నిర్విపక్షమూ, క్షయరహితమూ, ప్రసిద్ధమూ అయిన ఈ ధర్మవినయంలో నీ యిష్టం వచ్చినట్టు బ్రహ్మచర్యను చరింపుము" అని ప్రసాదశీతల వాక్కులు అనగానే పూర్ణుని శరీరాన్ని ప్రవ్రజ్య వెంటనే ఎవరికీ కనబడకనే పరివేష్టించింది. తర్వాత అతడు ప్రశమం వల్ల శత్రు మిత్ర భేదం వదలి సమతను పొందాడు.

పిదప అతడు సుగతుని శాసనంతో క్రూరజనాశ్రయమైన శ్రోణాపరాంతమనే దేశానికి, సుగతుడు తన క్షాంతిని పరీక్షింపగోరి వెళ్ళమనగా, వెళ్ళాడు. అతడు దారిలో ఒక అడవిలో నడుస్తుండగా, వేటకు అమంగళకరుడయిన, భిక్షువు ఎదురు వచ్చాడనే కోపంతో ఒక లుబ్ధకుడు విల్లు ఎక్కుపెట్టి చంపడానికి పరుగెత్తి వచ్చాడు. పూర్ణుడు నిర్వికార చిత్తంతో, ఉద్వేగరహితంగా, భయరహితంగా "ఊ కొట్టు" అని



ముందుకు పోగానే, ఆ లుబ్ధకుడు శాంతుడయిపోయాడు. వెంటనే పూర్ణుడు అతనికి ధర్మం ఉపదేశించాడు. అతడు తన సహచరులచో పాటు బోధిని పొందాడు. తర్వాత ఆ లుబ్ధకుడు సర్వోపస్కర సంపద గలవి, సుగతార్హమైనవి ఐదువందలు రమ్యమైన విహారాలు నిర్మించాడు. పూర్ణుడు కూడ జ్ఞానసంపూర్ణుడై మునులు వాంఛించే వైరాగ్యలక్ష్మితో దేవతలకు కూడా పూజనీయుడయాడు.

ఇలా ఉండగా, పూర్ణుని అన్న భవిలుడు కాలవశాత్తు ధనహీనుడై ధనసంపాదన కోసం పరిజనంతో సముద్రయాత్ర ప్రారంభించాడు. అనుకూల పవనాలు వీవడం వల్ల అతని ఓడ కొన్నినాళ్ళకే గోశీర్ష చందనవనం చేరింది. భుజంగ గణ సంకులమైన ఆ చందనవనాన్ని భవిలుని జనం ఐదువందల గొడ్డళ్ళతో నరకబోగా, దాని యజమాని అయిన యక్షగణాధీశుడు మహేశ్వరుడనేవాడు కోపంతో కాలికమనే విషవాయువును వదిలాడు. ఆ పెద్దవాయువుతో ప్రాణసంశయం కలుగగా, భవిలుని అనుచరులందరు శర్వశక్రాది దేవతలను రక్షణ కోరుతూ ఆక్రందనం చేశారు. ఆర్తరావాలు చేస్తున్న వారిని చూచి భవిలుడు చాలసేపు ఆలోచించి, పశ్చాత్తాపంతో "నా చిన్న తమ్ముడు పూర్ణుడు నా హితం కోరుతూ, సముద్రవ్యాపారం బహుక్లేశకరం, అల్పసుఖకరం ఎందుకు వెళ్ళడం? అని మొదట్లోనే చెప్పాడు. ఆ ధీమంతుని మాట వినక ధనలోభంతో ఈ వ్యసనార్ణవంలో పడ్డాను" అని వారితో అన్నాడు. పరిజనంలోని వణిక్కులంతా, పూర్ణుని లోకవిశ్రుతమైన ప్రభావం విన్నవారే గనుక అతన్ని మనసారా ధ్యానించి అతనినే శరణు పొందారు. "జగత్క్లేశ విషదోషాపహరి, ఉదీర్ణకరుణాసుధాసంపూర్ణ చేతస్కుడు, అయిన పూర్ణునికి నమస్కారం!" అని అందరూ ఒకే గొంతుకతో ప్రార్థించగా, ఆ ధ్వని ఆకాశమంతా నిండింది. ఆ వృత్తాంతాన్ని పూర్ణుని కులదేవతలు శ్రోణాపరాంతంలో ఉన్న పూర్ణునికి తెలియజేశారు. పూర్ణుడు వారి ఉపద్రవం విని వెంటనే సమాధిసన్నద్ధుడై గగనమార్గంలో ఆ ఓడ వున్న చోటికి వచ్చాడు. ఆ ఓడలో పర్యంకబంధంలో మేరుపర్వతం వలె నిశ్చలంగా సమాధిమగ్నుడై ప్రళయవేగం గల ఆ వాయువు గతిని అడ్డగించాడు. పూర్ణుడు తను విడచిన విషవాయువును స్తంభింపజేశాడని విని యక్షగణాధిపుడు అతనిని సంతోషపెట్టి చందనకాననం వారికి వదలి వెళ్ళిపోయాడు. పూర్ణుని ప్రసాదం వల్ల భవిలుడు చందన వృక్షాలు గ్రహించి అతనితోపాటే, అతని శిష్యునివలె స్వనగరం చేరాడు. పూర్ణుడక్కడ అన్న అనుమతితో గోశీర్ష చందన వృక్షాలతో సుగతోచితమైన చందనమాల అనే ప్రాసాదం నిర్మించాడు.

అప్పుడు పూర్ణుడు ధ్యానించగానే భగవానుడు జేతవనం నుంచి శతయోజనాలు దాటి గగనమార్గంలో శూర్పారపట్టణానికి వచ్చాడు. గగన మార్గంలో వస్తున్న భగవానుని దేహకాంతితో ముందున్న జగత్తంతా స్వర్ణకపిశవర్ణమైంది. పట్టణసమీప ప్రాంతంలో వున్న ఇల్లాండ్రు ఆయనను దర్శించి తీవ్రచిత్తప్రసాదంతో ప్రశమోన్ముఖలయారు. భగవానుడు వారికి కుశలోపచితమైన సత్యోపదేశం చేశాడు. ఆ స్త్రీలు దానిని గ్రహించి కుశలం పొందారు. భగవానుడు వారికి దర్శనమిచ్చిన ప్రాంతంలో వారు నిర్మించిన చైత్యం పౌరాంగనమనే పేరుతో నేటికీ పూజింపబడుతున్నది. తర్వాత భగవానుడు సపరివారముగా చందనమాల ప్రాసాదం ప్రవేశించి, జనసంఘాన్ని భరించదగిన స్ఫటికవేదికను నిర్మించాడు. పిదప ఆ కరుణానిధి రత్నాసనాసీనుడై సర్వసత్త్వ శాంతికోసం నిర్వాణోపదేశం చేశాడు. ఈ లోగా కృష్ణగౌతములనే మునీంద్రులిద్దరు తమ అనుచరులతో పాటు అక్కడికి వచ్చి శాస్త్రశాసనం స్వీకరించారు. అనంతరం

సుగతుడు ప్రాసాదాన్ని పరిగ్రహించి, భిక్షుగణంతో సహ జేతవనానికి బయలుదేరాడు. వెళ్లుతూ, మరీచిలోకస్థ అయిన మౌద్గల్యాయనుని తల్లిని ఆర్యసత్యాలతో ధర్మమార్గంలో పెట్టాడు.

జేతవనం చేరిన తర్వాత విస్మయం పడిన భిక్షువులందరూ పూర్ణుని పుణ్యానికి కారణమేమని ప్రశ్నించగా సుగతుడు ఇలా సెలవిచ్చాడు:

"పూర్ణుడు ఒక జన్మలో కాశ్యపుడనే సమ్యక్సంబుద్ధునికి విహారాధికారి, సంఘోపస్థాపకుడు అయి వుండేవాడు. అతడొకనాడు విహారం ఊడవకుండా వుండడం చూచి, వంతుల పద్ధతిని విహారసమ్మార్జనం చేసే భిక్షువును "కొవ్వెక్కిన ఏ ఉపధివారికుని (వారం ఏర్పాటయిన వాని) వారమీదినం? ఈ దినం ఇంకా విహారం ఊడ్వనే లేదే? ఏ దాసీపుత్రుని వారమిది?" అని తూలనాడాడు. ఈ పారుష్యపాపం వల్ల నరకదుర్గతిని అనుభవించి, ఐదువందల సంవత్సరాలపాటు దాసీపుత్రుడుగా పుట్టాడు. సంఘోపాసనమే ఇతని గొప్ప పుణ్యానికి కారణమైంది. దానివల్లనే నిశ్శేషభవక్లేశోజ్ఝితమై అర్హత్వం సంపాదించాడు."

ఇలా పుణ్యోపచయంతో కలిగిన పుణ్యుని అద్భుత ప్రభావం సుగతుడు చెప్పగా భిక్షుసంఘం విని పుణ్యాన్ని ప్రశంసించడంలో నిమగ్నమైంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతో పూర్ణావదానమనే ముప్ఫయిఆరవ పల్లవం

# 37. మూకపంగ్వవదానం

సంసారంపై నిస్పృహతో ఆకించన్యసుఖంకోసం వైరాగ్యలక్ష్మిని ఆశ్రయించిన మహాత్ములు సర్వం వదలి ప్రశాంతికోసం వనానికి వెళ్ళుతారు. అక్కడ కూడ వ్రతాడంబరమూ, పరికరసంచయ సంరంభమూ కలిగితే, ఇంట్లో వున్న కోశపరిచ్ఛదాది ఉపకరణాలు చేసిన అపరాధమేమిటి?

జినుడు జేతవనారామంలో ఉన్నప్పుడు ప్రవ్రజ్యను స్వీకరించిన శాక్యరాజపుత్రులముందు చిత్ర విచిత్రమైన చీవరాలు, మంచి భిక్షాపాత్రలు, యోగపట్టాలు మొదలయిన పరికరాలు రాశిగా పడివుండడం చూచి భగవానుడు ఇలా అనుకున్నాడు: 'ఆహా! వీరికి ఇంకా బంధహేతువు తొలగలేదు. ఈ దేహానికి అభిమానవంయమైన పరికరాలను సేకరించుకొనడం చాలా ఇష్టం. కాయం, దానికి పరిష్కారం(అలంకరణం), దానికి ఉపకరణసామగ్రి, దానిని సంగ్రహించడం- ఈ విధంగా, ఆహా! ఇదొక బంధశృంఖల.'

ఈ విధంగా ఆలోచించి, వారి కుశలం కోసం "మూడు నెలలపాటు ఉపస్థానం జరుపాలి. భిక్షువులెవ్వరూ నన్ను చూడగూడదు" అని నియమం చేశాడు. ఈ నియమాన్ని అందరూ పాటిస్తుండగా, ఆరణ్యకవ్రతం ఆచరిస్తున్న ఉపసేనుడనే భిక్షువు, నిరాడంబరమైన చీవరం ధరించినవాడు కార్యార్థియై వచ్చి, ఇతరులు నివారిస్తున్నప్పటికీ వినక వెళ్ళి, సుగతుని దర్శించి కృతకృత్యుడై అతనికి నమస్కరించి వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళుతుండగా, భిక్షువులందరూ అతనిని చుట్టుముట్టి "ఆర్య, నీకు భగవానుడు ఎలా దర్శనమిచ్చాడు? మూడు నెలల వరకు ఎవరికీ దర్శనమివ్వనని నియమం చేశారే. సంఘనియమాన్ని ఉల్లంఘించి, నీవు భగవానుని ఎలా దర్శించావు?" అని ప్రశ్నించారు. ఉపసేనుడు వారి మాటలు విని, నవ్వుతూ, "నే నేమీ నియమోల్లంఘనం చేయలేదు. అరణ్యకుడైన నాకు దర్శనంలో నిషేధమేమి లేదని భగవానుడు స్వయంగా చెప్పాడు. పరిచ్ఛదోపకరణాదులు త్యజించి, నిర్ముక్తబంధనులై వృక్షమూలం ఆశ్రయించి, ధూళిధూసరులైన వారికి దర్శనంలో నిషేధం లేదు. ఇది ఇప్పటికి, తక్కినది రేపటి ఉదయానికి అని పాత్రచీవరాది వస్తువులను సంగ్రహించుకొనడంలో ఆసక్తులైనవారికే దర్శననిషేధం. ప్రశమవ్రతోపకరణాలను సేకరించడంలో పట్టుదల చూపుతున్నవారికి మంచుముక్కలు తేలాడుతున్న చల్లని నీటితోను దప్పి తీరదు. వారు ఎదుట నిధినిధానాలు తెరిచివుంచి ఇంకా చాలదనే దారిద్ర్యంతో బాధపడుతారు. వారికి చందన పాదపం సంతాపం కలిగిస్తుంది." అని అన్నాడు.

ఉపసేనుని మాటలు విని శాక్యభిక్షువులు సిగ్గుతో ఉత్సాహం తగ్గి, "ఈ నియమం భగవానుడు మనలను ఉద్దేశించి చేసిందేగాని, మరొకరికోసం కాదు. ఎందుకంటే విచిత్రచీవరచయం కట్టుకున్నవారం మనమే కదా! ఇచ్ఛలు వదలుకొన్నవారు శాస్తకు ప్రియులు. విపరీత వాంఛలు గలవారం మనం అప్రియులం.

కనుక ఇచ్చలను వదలి ఆయనకు ప్రియులమవుదాం" అని వెంటనే ఆలోచించి, తాము చుట్టుకున్న చారుచీవరనికరం వదలి భగవత్సమీపానికి వెళ్ళారు. ఇచ్చలు వదలగానే, భగవానుడు జ్ఞానవజ్రంతో సత్కాయ దృష్టిశైలాన్ని భేదించి, వారిని అనుగ్రహించాడు. ఆ శాక్యరాజకుమారులు తర్వాత స్రోతఃప్రాప్తి ఫలం పొందారు.

వారు అంత త్వరగా స్రోతాపత్తిఫలం పొందడానికి కారణమేమిటని భిక్షువులడుగగా, తథాగతుడు ఈ విధంగా పూర్వవృత్తాంతం తెలిపాడు:

పూర్వం వారాణసిని బ్రహ్మదత్తుడనే రాజు పాలించేవాడు. దిగ్గజంవంటి అతని దానార్ద్రమైన బాహువు భూమిని వహించింది. ఆయనకు ముక్తాలత లాగ గుణశాలిని(దారం గలది, గుణాలు గలది), సత్పురుషుని కీర్తివలె యశస్విని అయిన బ్రహ్మావతి అనే భార్య వుండేది. విమలహృదయ అయిన ఆమె గర్భిణి అయి జలక్రీడకు వెళ్ళి అక్కడ బ్రహ్మదత్తుని ప్రతిబింబంవంటి పుత్రుణ్ని ప్రసవించింది. ఉదకమధ్యంలో పుట్టడం వల్ల అతనికి ఉదకుడు అని పేరు పెట్టారు. ఆతడు తండ్రి మనోరథాలతోపాటు పెరుగుతూ ఉండేవాడు. ఆ రాజకుమారుడు పుట్టిననాడే అతని ఐదువందలమంది మంత్రుల భార్యలు తమ భర్తలకు అనురూపులైన పుత్రులను కన్నారు.

ఆ రాజకుమారుడు పూర్వజన్మ జ్ఞానం కలవాడు గనుక తన పూర్వ చరితం స్మరించి, తను చేయదగిన సుకృతానికి సమయం ఆసన్నమైనదని భావించాడు. "పూర్వం ఒక జన్మలో నేను అరవైసంవత్సరాలు యౌవరాజ్యం చేసి బహుకాలం నరకంలో తాపం పొందాను. ఈ జన్మలోను యౌవరాజ్యం దాపురించింది. ఎంత బ్రతిమాలినా ఈ పాతకం చేయను" అని నిశ్చయించి, రాజభోగపరాఙ్ముఖుడై, తండ్రికి ఉద్వేగం కలిగించేట్టుగా కుంటి మూగగా అభినయించసాగినాడు. సర్వలక్షణాలూ వున్నప్పటికీ, రాజపుత్రికి తగని కుంటితనంతో, మూగతనంతో బంధుజనులకు దుఃఖం కలిగిస్తూ ఉండడం వల్ల 'మూకపంగు' అనే పేరు పడింది.

మంత్రిపుత్రులు శస్త్రాస్త్రాలలోను, శాస్త్రాలలోను అభివృద్ధి చెందగా, రాజపుత్రుడు లేవలేడు, మాట్లడలేడు. రాజు వైద్యులను పిలిపించి, కుమారుని రోగనిదానం చేసి చికిత్స చేయమన్నాడు. వైద్యులు పరిశీలించి "రాజన్, రాజకుమారుని దేహంలో వైకల్యమేమీ లేదు. సుఖం మరిగి అభ్యాసం వల్ల కలిగినదైతే, భయం కలిగితే లేచి మాట్లడవచ్చు" అని అన్నారు. వైద్యుల మాటప్రకారం రాజు కుమారుణ్ని భయపెట్టడం కోసం ఊరికేనే వధ్యభూమిలో వదలమని ఉత్తరువు చేశాడు. అప్పుడు రాజభటులు ఊరికేనే అతనిని నిందిస్తూ రథంలో వధ్యభూమికి తీసుకొని వెళ్లుతుండగా, అతడు రథసారథిని చూచి, "ఏమిటి వారాణసిలో జనమెవరూ లేరా?" అని ప్రశ్నించాడు. రాజభటులు వెంటనే అతనిని రాజసన్నిధికి పిలుచుకొని వెళ్ళి జరిగిన సంగతి చెప్పారు. కాని రాజు బ్రతిమాలినా కుమారుడు మరల మాట్లాడలేదు. రాజభటులు మరల అతనిని వధ్యభూమికి తీసుకొని వెళ్ళారు. అక్కడ ఒక శవాన్ని చూచి "ఈ శవంలో ఇంకా ప్రాణం వుందా, లేక పూర్తిగా చచ్చిందా?" అని భటులను ప్రశ్నించాడు. రాజభటులు మరల అతనిని తండ్రివద్దకు తీసుకొని వెళ్ళగా, మరల మౌనం అవలంబించాడు. మరల వారు వధ్యస్థానానికి తీసుకొని వెళ్ళగా, దారిలో వారితో "ఈ ధాన్యరాశి భుక్తమైనా మరల భుజించబడుచున్నది" అన్నాడు. కాని, మరల తండ్రివద్ద మౌనం అవలంబించాడు. తన కుమారునికి దోషమేమీ లేదని రాజు ప్రకటించగా "ఒక వరమిస్తే



మాట్లాడుతాను. నడుస్తాను" అని రాజకుమారుడన్నాడు. రాజు సంతోషించి, వరమిస్తానని వాగ్దానం చేయగా, అతడు లేచి నడిచి, "నేను కుంటిని కాను, మూగను కాను, బుద్ధి లేనివాడినీ కాను. జన్మాంతరక్లేశం స్మరించి వైక్లబ్యం పొందాను. పూర్వం నేను అరవైసంవత్సరాలు యౌవరాజ్య సుఖం, అనుభవించి, అరవైవేల సంవత్సరాలు నరకగర్భంలో బాధలు పడ్డాను. రాజ్యభయం వల్ల నేను మూగలాగ, పంగువులాగ అభినయించాను. ప్రవ్రజ్యతో బ్రహ్మచర్యం అవలంబిస్తాను. ఇదే నేను కోరే వరం" అని రాజును ప్రార్థించాడు.

ఆ మాటలు విని రాజు విచారంతో ఇలా హితవు చెప్పాడు: "నాయనా! నీవు మూగవాడు కావని ధైర్యం కలిగింది. విరక్తుడవని విచారం కలిగింది. పుత్రా, ఈ రాజ్యం ధర్మమూలం. కనుక త్యజించనక్కరలేదు. నృప సంపదలు యజ్ఞ దాన ప్రజాపాలనలతో పుణ్యపూర్ణాలైనవే. నాకు నీవు ఒక్కడివే కుమారుడివి కదా. నీవు నన్ను వదలిపోతే నిద్రలేక పక్కపడుతాను. సంపూర్ణ చంద్రునివలె రుచిర, ముత్యాలహారాలతో హసించేదీ అయిన సంపదను వదలి ఎలా ప్రవ్రజ్యాభిలాష కలిగింది? విస్తారమైన, రాజ్యసుఖార్హాలైన శయ్యలు వదలి వనాంతవాసవ్యసనివై దుమ్ముకొట్టిన ప్రదేశాలలో ఎలా పడుకోగలవు? కాంతలు, లీలాముకురాలు, మణిమందిరాలు ఉన్న రాజధానిని వదలి, ఎప్పుడూ తిరుగులాడే ఘోరవ్యాఘ్రాలతో, ముసలి అజగరాల ఊర్పులకు గలగలలాడే ఆకులలములతో భయం కొల్పుతూ నీడలు, కనిపించని, లతాకుంజాలు లేని వనస్థలులు చేరితే, అవి నీకు ఎలా ప్రీతిని కలిగిస్తాయి?" తండ్రిహితవు విని రాజపుత్రుడు మరల ఇలా మనవి చేశాడు: "తండ్రీ! చల్లగా, నిర్మలజలాలతో సంతోష శశిశీతలాలు, వైరాగ్య సుందరాలు అయిన వనస్థలులు ఎవరికి ప్రియంగా వుండవు? క్షణమాత్రసుఖంకోసం దుర్జనులను ఆకర్షించే పరదారలవలె దీర్ఘనరకంలో పడవేసి అపాయం కలిగించే ప్రియురాండ్రు నాకు ప్రియులు కారు. ధ్యానం,మంత్రం, పరిజ్ఞానం, ఇంద్రియనిర్జయం- రాజుల ఈ యోగం హింసాప్రయత్నంతో నరకప్రదమైనది. విచ్చుతున్న మొగ్గలతో సంసారాన్ని పరిహసిస్తున్నట్టు వున్న కాననభూములు సహజంగానే బుద్ధిమంతులకు శమమయమైన ప్రీతిని కలిగిస్తాయి. వ్యజనపవనాలతో ఉబ్బి, చింతాక్రాంత అయిన నరపతుల సిరి నాకేమీ సుఖకరం కాదు. కనుక, తండ్రీ, తపోవనం వెళ్ళడానికి నాకు అనుమతి దయచేయి. సర్వభూతాల లలాటం మీద ఈ అనిత్యత్వం వ్రాసి వుందని గ్రహించు."

కుమారుని మాటలు విని రాజు ఇది యిక తప్పదని ఆలోచించి, ఆశ్చర్యంతో ఇలా అన్నాడు: "పుత్ర, వనం వివేకవిమలమనే భావంతో నీవు వెళ్ళదలిస్తే, మొట్టమొదట నా సందేహాలు పోగొట్టి పిదప బయలుదేరు. నీవు వధ్యభూమికి వెళ్ళేటప్పుడు అన్నమాటల అభిప్రాయం వివరించు." తండ్రి అడిగినందుకు రాజకుమారుడు "నన్ను వధించి తిరిగి వెళ్ళినవారెవ్వరూ ఇక్కడ వుండరు. పుణ్యాత్ముడు మరణించినా జీవిస్తాడు. పాపాత్ముడు జీవించినా మరణించినట్టే. ధనవంతులు ధాన్యరాశిని భుజించినట్టు మొదట పుణ్యాన్ని సమూలంగా అనుభవిస్తారు- ఈ అభిప్రాయంతో నేను ఆ మాటలన్నాను" అని తన మాటలు అర్థం వివరించాడు. దానిని విని రాజు అతనిని ఆదరంతో కౌగిలించుకొని, "పుత్ర, కుశలానికి ఏది ఉచితమో, అది చేయి" అని అన్నాడు.

తర్వాత రాజకుమారుడు కన్నీళ్ళతో తండ్రి అనుమతించగా, ఐదువందలమంది మంత్రిపుత్రులతోసహ తపోవనానికి వెళ్ళాడు: వారందరితోపాటు ఒక మహర్షి వద్ద ప్రవ్రజ్యాదీక్ష

స్వీకరించాడు.

ఒకమారు ఆ మంత్రికుమారులు కుండలు, వల్కలాలు ఏరాళంగా తమవద్ద వుంచుకొనడం రాజకుమారుడు చూచాడు. ఆ కుండ వల్కల సంచయాన్ని అసహ్యించుకుంటూ, వారిని చూడననే నియమంతో, కొంతకాలం ఒంటరిగా విజనప్రదేశంలో వున్నాడు. ఈవిధంగా మాట్లాడననీ, ఎవరినీ చూడననీ నియమం పెట్టుకున్నా, ఒక్క మృగాన్ని స్వాగతమని చెబుతూ పలకరించాడు. అది చూచి మంత్రికుమారులందరూ ఆశ్చర్యపడి, "మృగమూ, మృగవ్రతుడూ ఈయనను దర్శించారు. ఇద్దరికీ ఉపకరణాలేవీ లేవు. అజినాలు గాని, దండసంభారాడంబరాలుగాని లేవు. ఈ ఆడంబరం గురించే ఈయన మనతో నియమం చేసుకొన్నాడు. అందువల్ల వ్రతోపకరణవ్యగ్రత కూడా పనికిరాదు" అని ఆలోచించి వ్రతోపకరణసంచయమంతా వారు ఆ నదిలో పారవేసి, పరిశుద్ధులై ఆయన సమీపం వెళ్ళారు. సుగతుడు తన నియమ గృహంనుంచి వెలుపలికి వచ్చి, వారి ఆశయానుశయధాతుప్రకృతులను తెలుసుకొని ధర్మశాసనం చేశాడు.

ఆ రాజపుత్రుణ్ణి నేనే. మంత్రికుమారులే శాక్యులు. మరల ఇప్పుడు త్యాగోపదేశం నేను వీరికి చేయవలసివచ్చింది.

ఇలా శాక్యకుమారుల వ్రతగాథను జినుడు చెప్పగా, భిక్షుగణం విని, అశ్రితవత్సలుడైన అతనిని పూజించింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మూకుంగ్వవదానమనే ముప్పయి ఏడవ పల్లవం

# 38. క్షాంత్యవదానం

పృథులభారం వహిస్తున్నా వ్యథపడక, శేషునివలె నిర్వికార భావంతో ప్రపంచాన్నే అద్భుతపరుస్తూ, ధృతిశీలులైన సుకృతవంతులు క్షమను (క్షాంతిని, భూమిని) వహిస్తూ వెలుగొందుతారు.

పూర్వం ఉదుంబుడనే యక్షుడు తన పూర్వపుణ్య విపర్యయంతో ప్రజలను తీవ్ర కష్టాలతో భయపెడుతూ, ప్రజలకు శత్రువై తన క్షయం కోసమా అన్నట్లు ప్రజలను వధిస్తూ వుండేవాడు. లోకానుకంపి, అనాథబంధువు అయిన భగవానుడు ఆ కాలంలో కాలుడుగా ప్రవర్తించిన ఆ యక్షుణ్ణి అణచి, శరణాగతుణ్ణి చేసుకొని, వానికి శమను, శిక్షోపదేశాన్ని అనుగ్రహించి వినయమార్గంలో నడిపించాడు.

భువనోపతాపి అయిన ఆ యక్షుడు అణిగిపోగా, ఇంద్రుడు సంతోషించి, భిక్షుగణంతోపాటు సంచరిస్తున్న సుగతుని దర్శించి నమస్కరించి, మందహాసం చేస్తున్న అతనితో ఇలా అన్నాడు: "భగవన్, మీ ముఖాంబుజంపై ఈ అద్భుతమైన స్మితచంద్రలేఖ అకస్మాత్తుగా ఎందుకు తోచింది? సత్త్వసుధాసముద్రులైనవారు అకారణంగా లోకసామాన్యంగా నవ్వరు" అని ప్రశ్నించాడు. త్రిదశేశ్వరుని ప్రశ్న విని, సర్వదర్శి అయిన భగవానుడు ఇలా అన్నాడు. "మహేంద్ర, ఈ ప్రదేశంలో సంభవించిన నా పూర్వ వృత్తం స్మరణకు వచ్చి నవ్వుకున్నా. అది విను:

"పూర్వం ఈ వనంలో క్షాంతిరతి అనే ముని వసించేవాడు. అతడు రోషదోషాన్ని వెళ్ళగొట్టి, రాగరజస్స్వభావమైన ఈ ప్రపంచంపై రాగరజస్స్వభావం గల(ఎరుపు, పుప్పొడి) తామరపై చంద్రునిలాగ ద్వేషం వహించాడు. అప్పుడు ఒక వసంతకాలంలో ఉత్తరాపథాధిపతి వనాలోకనకౌతుకంతోనూ తన అంతఃపురవనితల వినోదం కోసమూ ఆ ముని ఆశ్రమోపాంతప్రాంతం చేరాడు. ఆ రాజు పేరు కలి. అతడు చాల కామి. అంతఃపుర వనితలతో క్రీడిస్తూ, వారి పాదప్రహారాలతో అశోకవృక్ష శోభను, వారు ఉమ్మివేసిన ఆసవంతో వకుళవృక్షశోభను వహించాడు. తమ తపస్సుకు భంగం కలిగింది ఈ వసంతకాలంలో- అని తాపసులు బొమముడితో ముఖం నల్లబరుచుకుంటున్నారా అన్నట్లు కామాగ్నిధూమాలవలె తిరుగుతున్న తుమ్మెదల పిండుతో దిక్కులన్నీ చీకట్లు కమ్మాయి. రాజకాంతలు విలాసంగా తిరుగుతూ, గాలికి కదిలే ముంగురులతో, స్తనభార నమ్రతతో, ఎర్రటి పెదవులతో పాటలపల్లవాధరలు, పుష్పస్తబకావనమ్రలు అయిన లతల విలాసాలు పుణికి పుచ్చుకున్నారు.

"రాజాంగనలు ఈవిధంగా ఆ వనంలో తిరుగుతూ తిరుగుతూ, అచంచలధ్యానసమాధిలో వున్న వీతరాగుడైన ఆ మునిని చూచి, కౌతుకవిభ్రమాలతో అతనిని పరివేష్టించారు. అప్పుడు రాజు అక్కడికి వచ్చి, స్త్రీలు మూగిన అతనిని చూచి, ఈర్ష్యాప్రకోపానలంతో మండిపడి. దుర్నిరీక్ష్యుడై ఆ ముని కాలుచేతులు ఖండించాడు. అతడు కాలుసేతులు తునిగినా, ధీరుడై రాజును పల్లెత్తుమాట అనలేదు.

అంతేకాక, అతనికి ప్రతికూలమైన గంధర్వ యక్షోరగ దేవసంఘాన్ని కూడ అపాయం చేయవలదని నివారణ చేశాడు."

"రాజు మునికాలుసేతులు నరికి తనదారిని తాను తన నగరానికి వెళ్ళాడు. ఆ తపోవనంలోని మునులు ఛిన్నావయవుడైన మునిని చూచి, స్వభావంతో శాంతులైనా క్రోధంతో కంపించిపోయి రాజును శపించడానికి పూనుకున్నారు. శాంతిరతుడు వారిని వారించి "సహించండి, రాజును క్షమించండి" అని మాత్రమే అన్నాడు. క్షమాసమాలింగిత మానసులు క్రోధక్రియలతో కలవరు. "నా కాలుసేతులు నరికేటప్పుడు గూడ నాకు వికారంగాని, కోపం గాని కలుగకపోవడమే సత్యమైతే, నా దేహం మరల క్షతహీనమౌతుంది" అని అతడు అనగానే, వెంటనే వ్రణం ఆరి, కాలుసేతులు మొలిచాయి. అప్పుడు అతనిని దేవత సత్త్వసితమైన పుష్పాలతో పూజించింది. రాజు తాను చేసిన కిల్బిష కాలకూట విస్ఫోటంతో చేష్టలుడిగి, నది సుడిగుండంలో చిక్కుకుని తిరుగుతూ, మరణించి, సంవర్తపాక నరకం పొందాడు.

"శాంతిరతి అనే మహర్షిని నేనే. దేవదత్తుడే కలిమహారాజు. అతీతవిషయ స్మరణంతో నవ్వు వచ్చింది."

భగవానుడు చెప్పిన ఇతివృత్తం విని త్రిదివపతి ఆశ్చర్యంతో, సంతోషంతో వేయికండ్లూ విప్పారగా, సూర్యకిరణాలతో వికసించిన కమలాకరంవలె కలకలలాడుతూ స్వర్గలోకానికి మరలి వెళ్ళాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శాంత్యవదానమనే ముప్పయి ఎనిమిదవ పల్లవం

# 39. కపిలావదానం

అత్యంతం ఉన్నతి పొందిన మహాత్ముల వినాశదోషానికి కారణం దుర్జన సమాగమమే. కల్పవృక్షాలు పుష్పఫలాలతో పాటు జలసంగతి వల్ల వేళ్ళు ఊడిపడ్డాయికదా!

భగవానుడైన తథాగతుడు రుచిరాగారశాలిని అయిన వైశాలీ నగరంలో వల్గుమతీ నదీతీరంలో విహరిస్తుండగా, ఒకనాడు సెంబడివారు దుస్తరమైన ఆ నదినీటిలో వల ఒగ్గి ఘోరమైన మకరాన్ని పట్టుకొన్నారు. దానిని వేయిమంది ఈడ్చి గట్టుకు తీసుకురావలసివచ్చింది. పద్దెనిమిది తలలతో, సింహ ద్విరద ముఖాలతో భయంకరంగా పర్వతంవలె వున్న ఆ మకరాన్ని లాగుతున్నవారు కూడా భయపడి పగ్గాలు వదలి, ఆశ్చర్యంతో దృష్టి స్తంభించగా, క్షణకాలం వుండనూలేక పోనూలేక బాధపడ్డారు. కర్మవైచిత్ర్యంగల ఈ సంసారంలో గహనాశ్చర్యం కలిగించే వికారాలు అనంతకోటి! వాటిని లెక్కపెడుతూ ఎవడుంటాడు? అప్పుడక్కడికి సర్వజనత్రాణకృతక్షణుడు, భూతభావనుడు అయిన జినుడు వచ్చాడు; ఆబాలవృద్ధం ఆశ్చర్యపడుతుండగా చూచి నదీతీరంలో ఉపవిష్టుడైనాడు. భిక్షుగణం కూడా పరివేష్టించింది. అప్పుడు ఆ మొసలిని చూస్తున్న ప్రజలంతా వెనక్కు తిరిగిన సముద్రంలాగ భగవానుని వైపు మళ్ళారు. ఆయనను చూడగానే కైవర్తులు(సెంబడివారు) ప్రాణిబంధనమైన ఆ పెద్దవలను సంసారం వదలినట్టు వదిలారు. వారు తాము పట్టిన మత్స్యకుంభీరనక్రాదిసంభారమంతా ఆయన మాటతో మరల ఏటిలో వదలి, చేసిన పాపాలకు వగస్తూ నిశ్శబ్దంగా వున్నారు. కొందరు ఆ మహామకరాన్ని లాక్కుని వచ్చి ఆయన ఎదుట పెట్టారు.

దానిని చూచి భగవానుడు దంతకాంతితో కరుణానదిని సృష్టిస్తున్నవానివలె ఇలా అన్నాడు: "పుత్ర! నీవు కపిలుడివి కదా! నీవు చేసిన దుష్కృతం నీకు జ్ఞాపకం వుందా? వచోదుశ్చరితానికి ఈ పరిపాకం కలిగింది. అనుభవిస్తున్నావు. నీ అనిష్టానికి నెచ్చెలి అయిన నీ తల్లి ఇప్పుడెక్కడుంది?" సర్వజ్ఞుడు ఈ విధంగా ప్రశ్నించగా, ఆ మహామకరం తన పూర్వజన్మను స్మరించి, "విభో! నేను కపిలుణ్నే. నేను చేసిన దుష్కృతం జ్ఞాపకం వచ్చింది. వచోదుశ్చరితానికి ఈ పరిపాకం అనుభవిస్తున్నాను. నా తల్లి నాకు నరకమార్గం చూపుతూ మొదటే నరకానికి వెళ్ళింది" అని దుఃఖసాగరంలో ఓలలాడుతూ సమాధానమిచ్చింది. భగవానుడు మరల దానితో "తిర్యగ్యోనిగతుడవైన నీకు ఈ అకాలంలో ఏమి చేయను? ప్రమత్తుల పాపారంభాలు రభసహసితోల్లాసాలతో నరకపరిపాకం పొందగా, పశ్చాత్తాపం విషతుల్యమైన క్లేశావేశాలతో ప్రతిరాత్రి అశాంతి సంతాపాలను, రోదనశరణాలను కలిగిస్తుంది. దుఃఖక్షయం కోసం క్షణకాలం నాపై నీ మనస్సును లగ్నం చేయి. ప్రసన్నచిత్తుడవై కాలక్రమాన స్వర్గం చేరుతావు. వత్సా, ఈ హితం విను. ఆలోచించి చేయి. సర్వసంస్కారాలు అనిత్యమైనవి. శాంతినిర్వాణమొక్కటే

అభయమైనది" అని ఉపదేశించాడు. భగవానుని ఆజ్ఞతో అది ప్రసన్నతను పొందగా, అక్కడ మూగిన జనసంఘం ఆశ్చర్యంతో నిశ్చలంగా వుండిపోయింది. ప్రజల అభ్యర్థనపై ఆనందుడు ఆ మహామకరం పూర్వవృత్తాంతం అడుగగా భగవానుడు ఇలా అన్నాడు:

ఈ అకుశలశీలుని వృత్తాంతం వినండి. భద్రకమనే కల్పంలో ప్రజలు అయుతయుగపరిమితమైన ఆయుస్సుతో వుండేవారు. ఆ యుగంలో కాశ్యపుడనే తథాగతుడు ఉద్భవించాడు. అప్పుడు వారాణసిలో కల్పవృక్షంవలె అందరికీ అన్ని కోరికలూ తీర్చే క్రికి అనే మహీపాలుడుండేవాడు. అతడొకనాడు సహస్రాక్షునివలె విబుధాస్థానంలో కొలువుతీర్చి ఉండగా, వాదిసింహుడనే బ్రాహ్మణ విద్వాంసుడు వచ్చాడు. రాజు అతనికి వెంటనే దర్శనమిచ్చి, ఆసనమిచ్చి సత్కరించగా, ఆ పండితుడు రాజును ఆశీర్వదించి ఇలా అన్నాడు: "బుధాధిపసభాసీనుడైన, స్వస్తిమతి(శుభమతి) అయిన ఓ విభూ! నీకు స్వస్తి. మేము నీ సచ్చరితామృత పానంలో లుబ్ధులం. నీ దర్శనం కోరే రాగులం. నీవు సర్వగుణాశ్రయుడవుగదా! ఈ దోషాలు- లుబ్ధత్వం, రాగత్వం, ద్వేషం, ముఖరత్వం- మా కెందుకు అంటగట్టావు? యాచకులు కూడ నిరంతర రత్నవర్షంలో నానార్థిసార్థుల కోరికలు పూరించగలుగుతున్నారంటే, దైన్యరహితంగా దానం చేసే నీవైభవ విజృంభితమే గాని మరొక్కటి కాదు. రాజన్! స్వభావపరిచత గుణాల వల్ల, సద్గురువులను సేవించడం వల్ల, విబుధులను జయించే విద్యాంశలేశం మాకు లభించింది. ఈ విద్వత్కమలభరితమైన సభలో మా విద్యాంశలేశపు ఉత్కర్షను కొన్ని మాటలతో చూపుతాము. సజ్జనులకు నిజగుణగణనంలో సిగ్గు కలుగుతుంది. అయినా ప్రౌఢవాదాభిలాషం ఊరుకోవుండనీయదు. గుణగణాలను చెప్పుకోమంటుంది. రాజా! నాకు ప్రతివచనం ఇవ్వగల విద్వాంసుడు ఒక్కడైనా ఉన్నాడేమో ఈ జగత్తులో వెదికించు."

సందర్భగర్భంగా, గంభీరంగా, ఆ పండితుడన్న ఉత్కటమైన వాక్కును క్షితిపతి విని ఆశ్చర్యపడి, వెంటనే ఇలా ఆలోచించాడు. "ఈ పండితుడు ప్రతిద్వంద్వి ఎవడూ లేక మదోద్ధతుడై వెళ్ళిపోతే నాదేశం కీర్తిని ధ్వంసం చేస్తాడు. మూర్ఖుడైన రాజు గుణదోషపరిశీలకుడైతే ఆ దేశంలో ఎవ్వరూ విద్యార్జన పరిశ్రమమే చేయరు. వివేకమనే విమల కాంతి గలిగిన, ధర్మారామం వంటివాడు అయిన రాజు వుంటే సదాచార క్రియలవలె విద్యలు కూడా పెరుగుతాయి. కనుక ఈ పండితునికి తప్పక మదనిగ్రహం చేయాలి. దేశంలో విద్యాదరిద్రత రాజుదోషమే" అని ఆలోచించి, విద్వాంసులకు గురువైన కర్వటవాసి అయిన విప్రుణ్ణి మహామాత్యులతో వెదికించి పిలిపించాడు.

ఆ ఉపాధ్యాయుడు రాజసభకు వచ్చి, వాదిసింహుని తర్కకర్కశమైన దర్ప కేసరాలను ఖండించాడు. అశేషవాదులను జయించిన వాది సింహుని పరాజయంతో సరస్వతి సిగ్గుపడినట్టు మౌనం వహించింది. మనీషుల గుణోత్కర్షాలు నక్షత్రాలవలె కాంతిమంతమై మీదమీద కనిపిస్తాయి. పిదప, రాజు వాదిసింహునికి అత్యధికంగా ధనమిచ్చి, జయించిన కర్వట పండితునికి నగరసమానమైన ఒక కర్వటం(రెండువందల గ్రామల మధ్యన గల సుందరనివాసం) బహూకరించాడు. ఆ పండితుడు రాజునుంచి గజాశ్వాదులు పొంది, చారుకేయూర కంకణ భాసితుడై సిరితో పాటు స్వభవనం చేరాడు. భూమిపతులు బాహుబలంతో సిరులు జయిస్తారు; వణిక్కులు సముద్రాల వల్ల జయిస్తారు; విద్యావంతులు గుణోత్కర్షంతో సంపాదిస్తారు.



కొంతకాలానికి ఆ పండితునికి కుమారుడు కలిగాడు. సుఖంలో మరొక సుఖం కలుగడం పుణ్యకర్మల లక్షణం. అతనికి కపిలుడని పేరు పెట్టారు. అతని వెంద్రుకలు పింగళవర్ణంతో మెరిసేవి. అతడు పెద్దవాడై విద్యలు నేర్చి, తండ్రికన్నా గొప్ప పండితుడయ్యాడు. పెద్దకులంలో వైదుష్యం, వైదుష్యంలో ఐశ్వర్యం, ఐశ్వర్యంలో సత్పుతోత్కర్షం ఇవన్నీ సుకృతవృక్షం ఫలాలు.

కొంతకాలానికి తండ్రి వ్యాధిపీడితుడై మరణాసన్నుడై, పుత్రునికి ఏకాంతంలో ఇలా బుద్ధి చెప్పాడు. "పుత్ర! నేను బాల్యంలో గుణాలను, యౌవనంలో ద్రవ్యాన్ని ఆర్జించాను. కాని పరలోక సుఖార్జనం చేయలేదు. కాలం ఇప్పుడు సరిగ్గా లెక్కపెట్టుకొని అప్పిచ్చినవాడులా సమీపించగా, నేను ఎక్కడున్నాను? నా విద్య లెక్కడ? ధనమెక్కడ? -అని వివశుణ్ణయాను. గుణపుష్పాలు, సుఖఫలాలు , ధనమనే దృఢమూలాలు గల మానవునిపైనే బాగా పూచి పండి వేళ్లుతన్నిన వనంపై పిడుగులాగ అకాలంలో కాలుడు దుస్సహుడై పడుతాడు. మానవుడు సకలవిద్యాకళలతోను జన్మను గడిపి వేస్తాడు. క్షణిక సుఖం కోసం ధనాన్ని దగ్గిర వుంచుకొంటాడు. మోహానికి శిష్యుడై పశువులను శిశువులను ప్రేమిస్తాడు. దేహం రాలిపోయే ముహూర్తంలో తానెవరో? అవన్నీ ఏవో? స్నేహమోహవశీభూతుడినై ఈ హితవు నీకు చెబుతున్నా. నీవు బహుశ్రుతుడివి. సంసారసారశరణమేదో నీకు తెలుసు. పెద్దలను ప్రణమించు. పరుషాలు పలకకు. ప్రయత్నపడి పరోపకారం చేయి. పాపాలు మనలను పడదోసేటప్పుడు ఈ పుణ్యాలు అవలంబనీయాలు. అలోభంతో శోభించే ఐశ్వర్యం, ఇతరులపై అద్వేషం, స్వసుఖాలపై మోహం లేకపోవడం- ఇవి మూడూ కుశలద్రుమానికి మూడు వ్రేళ్లు. వీటిపైనే అశేషాఖిలసత్ఫలశ్రీ ఆధారపడివుంది. ఈ భువనమండలం ఎంతవరకు సూర్యుడు ప్రకాశిస్తాడో, అంతవరకు నీబోటి విద్వాంసుడు, వాది లేడు. అయినా, భిక్షువులతో ఎప్పుడూ వాదించకు. బౌద్ధభిక్షువులు గంభీరజ్ఞాన దుర్బోధ ప్రబుద్ధులు. నేను ముందొకమారు ఒకపదానికి అర్థం చెప్పమని ఒక భిక్షువును అడిగాను. నీకు ప్రశ్నించడమనేదే తెలీదే? విద్వాంసుడనని వేరే అంటున్నావు- అని అతడు నవ్వాడు. కనుక భిక్షువులతో వాదం కేవలం పాండిత్య పీడనం. బలప్రభావం తెలుసుకొందామని తలతో కొండను తాకకూడదుగదా!" ఈ విధంగా తనయునికి హితవు చెప్పి తండ్రి పరలోకంవెళ్లాడు. కాయావసథ పాంథులైన దేహులు స్థిరంగా వుండరు.

కాలక్రమాన కపిలుడు గొప్ప వాగ్మి అయి, అఖిల పండితులను ఓడించి, రాజు నుంచి బహుతరంగా ధనసమ్మానాలు పొందాడు. ఒకనాడు అతని తల్లి కాచర అతనికి ఏకాంతంలో "పుత్రా ! నీవు వాదుల దర్పం అణగగొట్టేవాడివి. దిగ్గజాలను కూడ జయించగలవు. అలాటివాడివి దర్పాంధులైన శ్రమణులను ఎందుకు వదిలావు? పరాకాష్ఠతను పొందినవాడు ప్రతిపక్షుల పట్ల ఓర్పు చూపితే, వీడు అసమర్థుడని అపకీర్తి కలుగుతుంది" అని దుర్బోధ చేసింది. తల్లి మాటలు విని ఆ విద్వద్వరేణ్యుడు "శ్రమణులతో వాదించవద్దని తండ్రి నిషేధించారు. పత్రాలు ఆలంబనంగా వాదించడమనే మన బ్రతుకు ఏమి బ్రతుకు? గుణమాన్యులైన వారి ముఖాన్ని నేను వాదంలో జయించి నల్లగా మాడుస్తున్నాను. ఘోరవిద్వేషానికి కారణమై దుస్సహమైన ఈ చండపాండిత్య మెందుకు కాల్పనా? దీని ప్రయత్నమంతా గొప్పవారి సుఖభంగానికే కారణమౌతున్నది. మాయ లేనిదే బుద్ధి. లోభం పోగొట్టేదే సంపత్తి. గర్వం లేనిదే విద్య. ఓర్పుగల శక్తే శక్తి. ఇతర పండితులతోనే విద్వేషాలు, పోట్లాటలు వద్దంటే, ఇక ప్రఖ్యాతులైన భిక్షువులతోనా వాదవిగ్రహాలు? వారు జగత్పూజ్యులు. ప్రమాణపరినిష్ఠితులైన శ్రమణకులు నాకు

అజేయులు. వారి నైరాత్మ్యశాసనం ప్రతిపక్షులకు కొరకరానికొయ్య" అని వినయంతోను, గౌరవంతోను అన్నాడు. ఆ మాటలకు తల్లి కోపించి, "సరే లే. నీతండ్రి పాపులైన శ్రమణుల చేటకుడు. గొప్ప బ్రాహ్మణకులంలో పుట్టి ప్రాజ్ఞుడు, బహుశ్రుతుడు అయినా, భిక్షువుల పక్షంలో పడ్డాడు. నీవు కూడ అలాటివాడివి ఎలా అయ్యావు? నీ గొప్ప ప్రమాణఖడ్గంతో శ్రమణులను నిగ్రహించు. తనను కప్పిన మేఘసమూహాన్ని చీల్చనిదే, సూర్యుడు వెలుగుతాడా?" అని ప్రేరేపించింది.

మాతృభక్తుడైన కపిలుడు తల్లిమాట కాదనలేక భిక్షువుల ఆశ్రమాలకి వెళ్లదొడగినాడు. వెళ్ళుతూ, దారిలో ఒక భిక్షువును జిజ్ఞాసతో గ్రంథసారాన్ని, ప్రమాణాన్ని గురించి సమయోచితంగా ప్రశ్నించాడు. ఆ భిక్షువు "గాఢశబ్దార్థనిర్ణయంగల లక్షత్రయ ప్రమాణం మాకు శాస్త్రం. అది నీబోటి తీర్థికులకు దుర్లభమైనది. ఎందుకు హద్దు దాటినవారవుతారు? ఎక్కడ సంసారవర్త్మను అధిగమించడం జరుగుతుంది? ఎందుకు సుఖదుఃఖాలు లోకాన్ని బంధిస్తాయి? అనే శాస్త గంభీర శబ్దార్థాలుగల మాటలు(శ్లోకం) సర్వజ్ఞుణ్ని ఉపాసించనివారికి అర్థం కావు." అన్నాడు. కపిలుడు ఆ శ్లోక గాంభీర్యానికి ఆశ్చర్యపడి దానినే మననం చేస్తూ కాశ్యపుని పుణ్యతపోవనానికి వెళ్లాడు. ఆ శ్లోకమిది:

*కుతః పారేఽతివర్తంతే క్వ చ వర్త్మాతివర్తంతే,*

*సుఖదుఃఖే చ లోకస్య క్వచిత్సమభిబధ్నతః*

కాశ్యపుని తపోవనంలో భిక్షుగణాన్ని చూచి హృదయం, ముఖం ప్రసన్నం కాగా, మత్సరం మాయమైపోగా, వారియెడ ఉన్న అశ్రద్ధను వదలి "ద్వేషకాలుష్యంతో వీరిపై ఎవరు క్రౌర్యం అవలంబించగలరు? వీరి సందర్శనంతో మనస్సు విమలమౌతున్నది గదా!" అని చాలసేపు ఆలోచించి, వారితో వివాదం వద్దనుకొని, దూరాధ్వఖిన్నుడై స్వగృహానికి మరలి వచ్చి తల్లితో, "అమ్మా! నీవు ఊరికే నన్ను కలికర్మకు(వివాదానికి) ప్రోత్సహించావు. గూఢార్థ గ్రంథవాదులైన శ్రమణులు అజేయులు. దారిలో ఒక భిక్షువు చెప్పిన ఒక శ్లోకం వినే నేను అర్థంకాక నేలను చూచాను. వారి గ్రంథాల పరిచయమూ, అభ్యాసమూ లేనిదే వారితో వాదించడం సాధ్యం కాదు. వారేమో ప్రవ్రజ్య స్వీకరిస్తేనేగాని తమ శాస్త్రాలను బోధించరు" అని విన్నవించాడు. ఆ మాటలకు తల్లి చాల కోపించి "అయ్యో! నీవు నా కడుపున భారంగా పుట్టావు. సంఘర్షణ పడదామనే బుద్ధి లేని, కోపమే తెలియని, దైన్యంతో అందరికీ నమస్కరించే మగవాడితో ప్రయోజనమేమిటి? లోకంలో సర్వరత్నాలకు రాపిడి పెడితేనే కాంతి హెచ్చుతుంది. తేజస్సూ, జీవమూ లేని మగప్రాణితో ఏమిటి ప్రయోజనం? వారి గ్రంథాలు చదవడానికి దొంగప్రవ్రజ్య ఎందుకు స్వీకరించవు? తలపైని వెంట్రుకలు గొరిగిస్తే గడ్డి మొలుస్తుందా?" అని మరింత ఉసిగొల్పింది.

తల్లి మాటలకు అతని మనస్సు ప్రళయవాతధూళి కప్పిన ఆకాశంలాగ కలుషితమైంది. తరువాత అతడు కుహనాశమప్రణయ అయి(దొంగసన్యాసి వేషం వేసుకొని), కాశ్యపుని తపోవనానికి వెళ్లి, ప్రవ్రజ్య స్వీకరించి, సౌగతశాస్త్రాలు నేర్చుకున్నాడు. క్రమంగా గుణగౌరవం వల్ల ధర్మకథకుడై ఆచార్యసింహాసనం అధిష్ఠించి. ధర్మోపదేశం చేశాడు.

ఇలా ఉంటూ, తల్లి ప్రేరణతో ఆ ఉపదేశనంలో క్రమంగా భిక్షుధర్మాలకు విరుద్ధమైన విషయాలు కూడ చెప్పడం ప్రారంభించాడు. తమ ధర్మానికి భంగం కలుగడం వల్ల వ్యధితులైన భిక్షువులు, అడ్డు



తగిలితే, వారిని వెక్కిరించడం మొదలుపెట్టాడు. "దర్పముఖరులైన మీరూ, మీ మొద్దు పెదవులు, పారపండ్లూను. ఊరికే అతిగా వాదిస్తారు. సత్యం తెలుసుకోకుండా నా వ్యాఖ్యానాలను పాడుచేస్తున్నారు" అని హేళన చేయసాగాడు. "మీరు గాడిద ముఖాలవారు, కోతి మూతులవారు, ఒంటె ముఖాలవారు. వ్యాఘ్ర ముఖాలవారు, గుర్రం మూతులవారు, పశువుల మూతులవారు. పిల్లి. జింక, కుక్క, పంది మూతులవారు. మీ ముఖాలు చూడడం అసహ్యం. మీరు ఊరికే ఉంటేనే సహించలేమే! వికటంగా కూస్తే ఎలా సహించడం?"- అని కనుబొమలు ముడివేసి తరచు నిందించడం సాగించాడు. అతని వాక్యబాణాలతో భిక్షువులు మనస్సులు తెగి అతనికి ఎదురుచెప్పకనే మరొక చోటికి వెళ్లిపోయారు. తర్వాత ఆ వాక్పాతకంతో పశ్చాత్తాపం పొంది తల్లిని వదలివేశాడుగాని, ప్రవ్రజ్యను వదలలేకపోయాడు. "శ్రమణులు నా కుమారుణ్ని లాక్కుపోయారు" అని అరుస్తూ అతని తల్లి ఉన్మాదిని అయి, ప్రాణాలు కోల్పోయి నరకంలో పడ్డది. కపిలుడు కూడా కొంతకాలానికి పాపం పండి, మరణించి, వాక్పారుష్యంతో ఇలాటి రూపం పొందాడు. భిక్షువులను ఏయే మృగాల ముఖాలవారని నిందించాడో ఆయా ముఖాలు ఇవే. కర్మబీజం వల్ల సమాన రూపమైన ఫలమే పుడుతుంది.

ఈ విధంగా భగవానుడు పూర్వగాథ చెప్పి, నానాబోధివిధాయకమైన శాశ్వతధర్మం ఉపదేశించి జనాన్ని అనుగ్రహించాడు.

జినుడు తన ఆశ్రమానికి వెళ్లిన పిదప మకరం అహరహం, అతనినే ధ్యానిస్తూ, దేహం వదలి, దేవలోకం చేరింది. క్షణమాత్రం సుగతునిపై చిత్తముంచడం వల్ల చతుర్మహారాజిక దేవతలలో అవతరించింది. తర్వాత పూర్ణేందువదనంతో పూలమాలలు, కుండలాలు ధరించి, రూపుగొన్న ఆనందమో అన్నట్లు సుగతుని చూడడానికి వచ్చింది. సుగతునిపై దివ్యకుసుమాలు చల్లి, కిరీటం నేలను తాకగా, దేహప్రభలతో దిక్చక్రం పూరిస్తూ, నమస్కరించింది. భగవానుడు దానికి ధర్మోపదేశం చేశాడు. దానితో అది స్రోతాపత్తిఫలం పొంది, సత్యం దర్శించి దేవలోకానికి వెళ్లిపోయింది.

జినుడు మహాకాయమైన ఆ మకరాన్ని పాపపంకంనుంచి గడ్డి పోచలాగ ఉద్ధరించానని, ఆ జనాన్ని కూడ దుఃఖసముద్రం నుంచి ఉద్ధరించాడు. పుణ్యశీలులైనవారు వ్యసనంలో మునిగినవారి క్లేశాలను సమూలంగా తొలిగిస్తారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కపిలావదానమనే ముప్పైతొమ్మిదవ పల్లవం

# 40. ఉద్రాయణావదానం

ఈ దేహమనే పాత్రను పొందిన శుభాశుభ ఫలాన్ని మానవులందరూ సమానంగానే అనుభవిస్తున్నారు. వివిధ కర్మల వల్ల కలిగిన ఫలం అనుభవించకుండా క్షీణించదు.

సుగతుడు రాజగృహంలో కలందక నివాసారామంలో విహరిస్తున్న కాలమది. బింబిసారుడనే రాజు, సర్వరత్నాలకు సముద్రం వలె ఆకరమైనవాడు ఆ పట్టణం ఏలేవాడు. ఆ సమయంలోనే రౌరుకమనే పట్టణంలో ఉద్రాయణుడనే రాజు ఉండేవాడు. ఆయన యశశ్చంద్రునికి మహోదధి. ఆయనకు చంద్రానన అయిన చంద్రప్రభ అనే ఆమె దేవేరి. అతనికి మరొక భార్యయందు శిఖండి అనే కుమారుడు కలిగాడు. అతడు విక్రమకర్కశుడై యౌవరాజ్యం నిర్వహించేవాడు. ఆ రాజుకు హిరకుడు భిరకుడు అని యిద్దరు మంత్రులుండేవారు. వారికి నీతిశాస్త్రంలో శుక్రబృహస్పతులు కూడ దీటు రారు. దేవకాంతిగల ఆ రాజులిద్దరికీ లేఖల ద్వారా ప్రీతి ఏర్పడింది. దూరంగావున్నా సూర్యపద్మాకరాల ప్రేమ కొనసాగుతుందికదా! పరస్పరం అపూర్వ రత్నసమూహాలు పలుమారు పంపుకొనడం వల్ల వారి సఖ్యం సంపూర్ణమైంది. దూరంగా వున్నా ఉత్తముల ప్రీతి కీర్తివలె అక్షయం. దగ్గర చేరినా ఖలుని ప్రీతి గడ్డిమంటవలె అస్థిరమైంది,

ఇలా ఉండగా ఉద్రాయణుడు ఒకమారు దివ్య రత్నఖచితమైన బంగారు కవచాన్ని బింబిసారునికి పంపాడు. అది విషశస్త్రాగ్ని భయాన్ని కూడ నివారిస్తుంది. బింబిసారుడు మిత్రుడు పంపిన ఆ కవచం చూచి, మంత్రులతో "నా మిత్రుడు తన సౌజన్యం వలె ఉన్న ఈ కవచం పంపాడు. ఇది సర్వరక్షాక్షమమైంది; గాఢప్రేమ నివేదికమూను. ఇలాటి దానికి ప్రతిగా పంపతగిన వస్తువు కనిపించడం లేదు. ఉపకారమైనా అపకారమైనా తగినట్టుకాక అల్పప్రతిక్రియ జరుపడం శల్యం వంటిది. ఇంతకంటే గొప్పది పంపదగిందేదో ఆలోచించండి మీరంతా" అని ఆదేశించి, తను కూడ ఆలోచించసాగినాడు.

ధీమంతుడు, సర్వవిద్యాపారగుడు అయిన వర్షాకారుడనే బ్రాహ్మణ మహామాత్యుడు చాలసేపు ఆలోచించి ఇలా మనవి చేశాడు: "దీనికంటే బహుగుణమైన ఉపాయనం ఒక్కటే వుంది. దానిని పంపడానికి యత్నిద్దాము. నగర సమీపంలో బుద్ధభగవానుడు విహరిస్తున్నాడు. ఆయన దేవతలకు కూడ ఆదరపాత్రుడు. ఆయన ప్రతిమగల పటం పంపుదాము. అశేషలోకకల్యాణ కలికాకల్పపాదపుడైన సుగతుడు మహాపుణ్యవంతులకు చిత్రపటంలోను, స్వప్నంలోను, సంకల్పంలోను దర్శనమిస్తాడు." మహామాత్యుని మాట విని మహీపతి అంగీకరించి, భగవానుని సన్నిధానానికి వెళ్ళి, ఈ విషయం విన్నవించాడు. భగవానుడు అనుగ్రహించగా, శ్రేష్ఠులైన చిత్రకారులను పిలిపించి, భగవత్ప్రతిమను ఉల్లేఖించాలని ఆనతిచ్చాడు. ఆ చిత్రకరులు జినుని చూస్తూ అతని రూపానికి వశీభూతులై, కొలతలు తీసుకోలేకపోయారు. తర్వాత నిర్మలమైన వస్త్రంలో సంక్రమించిన భగవానుని బంగారుఛాయను రంగులతో పూర్తిచేశారు. పిదప



బింబిసారుడు ఆ చిత్రపటాన్ని, మూర్తీభవించిన జగన్నేత్రపుణ్యాలలా వున్నదాన్ని, ఉద్రాయణునికి పంపాడు. బింబిసారుడు స్వయంగా చిత్రపటం ముందు వ్రాసిన దానిని ఉద్రాయణుడు స్వయంగా చదివాడు. దాని వక్కాణమిది: ధర్మబంధువు కుశలకలితమూర్తి అయిన బింబిసారుడు సుగతచరణపద్మవిన్యాసంతో పుణ్యప్రాంతమై స్వర్గపురం వలె విశిష్టమైన మగధదేశం నుంచి క్షితితలతిలకుడైన నీతో ఇలా అంటున్నాడు. "భవమహామోహామయానికి భేషజము, హితము, రాగద్వేష విషహరము,అయిన చంద్రసుభగమైన భగవానుని బింబాన్ని నీకు పంపాను. తృష్ణాపచ్ఛమనమై, ప్రసన్న మధురమైన ఈ పుణ్యరసాయనాన్ని కుత్తుకబంటిగా ఉత్కంఠంతో పానం చేయి. ఈ ప్రతిబింబం సన్మార్గంలో పెడుతుంది. గుణగుణాలను గ్రహించడంలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తుంది. దుష్టవ్యాపారాన్ని నివారిస్తుంది. స్థిరసుఖప్రాప్తికి ప్రేరేపిస్తుంది. నిర్వ్యాజమైన ఉపకారం సర్వాత్మనా నిరంతరం కలుగజేస్తుంది. కల్యాణం కోరే మిత్రులు ఉత్తములకు ఇంతకన్నా ఏమి చేయగలరు?"

మిత్రప్రేమామృతోచితమైన లేఖార్థం ఆస్వాదించి ఉద్రాయణుడు ఏనుగుపై తెస్తున్న ఆ చిత్రపటానికి అమాత్యపురోహితులతో సహా ఎదురేగి, తీసుకొనివచ్చి, హేమసింహాసనంపై దానిని పరిచాడు. లావణ్యపుణ్యనిలయమైన ఆ సౌగతచిత్రం చూచి "నమోనమః ప్రబుద్ధాయ" అని రాజు వందనం చేశాడు. బుద్ధుడనే మాట వినగానే దేవతలు పూలవాన కురిపించగా, రాజు పులకాంకితుడై ఆశ్చర్యపడ్డాడు. భగవానుని చరితామృతం విని పయోదనాదం విన్న నీలకంఠంలాగ ఉత్కంఠితుడయ్యాడు. ఆ చిత్రపటం కింద సానులోమపర్యాయమూ, ద్వాదశాంగమూ, ప్రతీత్యసముత్పాదకమూ అయిన ఉపదేశమూ చూచి, మోహం వదలాడు. ఈ విధంగా స్రోతఃప్రాప్తిఫలంతో సత్యదర్శనమైన తర్వాత మిత్రుడైన బింబిసారునికి భిక్షువులతో ప్రతిసందేశం పంపాడు. పిదప బింబిసారుడు భగవానుని అర్థించి, కాత్యాయనుడనే భిక్షువును, శైల అనే భిక్షుణిని ఉద్రాయణుని వద్దకు పంపాడు. కాత్యాయనుడు ఉద్రాయణునితో పూజలందుకొని, ధర్మోపదేశం చేశాడు. ఆయనకు ధర్మసందేశనం చేస్తున్నప్పుడు ఉన్న పెద్ద గుంపు కూడ స్రోతఃప్రాప్తి, సకృదనాగామి ఫలాలను, అర్హత్వాన్ని పొందింది. ఆ రాజు పట్టణంలోని ప్రసిద్ధులైన తిష్యపుష్యులనే గృహపతులు రాజు ఎదుటనే శాంతి సాధన కోసం ప్రవ్రజ్య స్వీకరించి, పరినిర్వాణం పొందారు. వారి జ్ఞాతులు, వారి దేహాంతంలో వారి పేర స్తూపాలు నెలకొల్పారు. వాటిని చైత్యవందకులు నేటికీ పూజిస్తున్నారు. శైలా భిక్షుణి, చంద్రప్రభాదేవికీ అంతఃపురవాసులకూ ధర్మోపదేశం చేసింది.

ఒకమారు భూపాలునితో నిమిత్తజ్ఞులు చంద్రప్రభాదేవి ఆయుస్సు ఇక ఏడునాళ్ళేనని తెలిపారు. సంసారగతిని తెలిసినవాడు గనుక రాజు ఆమె ప్రవ్రజ్య స్వీకరించి శుభలోకం పొందడానికి అనుమతించాడు. రాజు అనుజ్ఞ మేరకు శైలాభిక్షుణి ధర్మవినయం ఉపదేశించగా, చంద్రప్రభాదేవి ప్రవ్రజిత అయి, ఏడవరోజున దేహత్యాగం చేసింది. వెంటనే ఆమె చతుర్మహారాజిక దేవతలలో దేవకన్యగా అవతరించి, జినుని దర్శనానికి వెళ్లింది. అక్కడ శాక్యమునిని దర్శించి ఆయన పాదలపై మోకరిల్లి దివ్యపుష్పాలు సమర్పించింది. ఆమెకు తథాగతుడు ధర్మోపపాదనం చేయగా, ఆమె సత్యదర్శనం చేసి. చంద్రమూర్తివలె వెలుగుతూ ఆకాశమార్గాన తనభర్త రాజధానికి వెళ్ళి, నిద్రిస్తున్న భర్తను లేపి, బోధిప్రకాశనం చేసి వెళ్లిపోయింది.

ఆమె వెళ్లిన పిదప రాజు ఉదయం ప్రవ్రజ్యాభిముఖుడై శిఖండికి పట్టం కట్టి తన యిద్దరు మహామాత్యులకు అప్పగించి, మిత్రుడైన బింబిసారుని నగరానికి నిరాడంబరంగా వెళ్లాడు. బింబిసారుడు ఛత్రచామరాది రాజచిహ్నాలేవీ లేక వస్తున్న ఆతనికి ప్రీతితో నృపోపచారాలతో ఎదురేగి పిలుచుకొనివచ్చి, ఆసనంలో కూర్చోబెట్టి ఆశ్చర్యంతో ఇలా అన్నాడు: "మిత్రమా, ఇష్టసందర్శనం వల్ల సంతోషించాను. సంపద్విహీనుడవయావని దుఃఖపడుతున్నాను. అనంత సామంతమౌళి విశ్రాంతశాసనుడవై పాకశాసనసమానుడవైన నీవు ఇలా ఎందుకయావు? ఒకే మాట మీద నిలబడి, గుప్తంగా మంత్రాంగం ఉంచుకొనే ధీమంతుడవైన నీ రాజ్యాన్ని ఇతరులు హరించడం పొసగదు." మిత్రుడు ఇలా ప్రశ్నించగా, ఉద్రాయణుడు ఇలా సమాధానమిచ్చాడు: "రాజన్, అందరి వెంటబడే వృద్ధురాలైన సంపద నాకు ప్రియం కాదు. విషయాస్వాదవిముఖతతో, తృష్ణా రహితతతో నేనే పిప్పినిలాగ భోగభాజనమైన ఐశ్వర్యాన్ని వదలి వేశాను. కల్యాణమిత్రుడవైన నీవు నా హితం కోసం పంపిన సుగత ప్రతిమా పటమే నాకు వైరాగ్య గురువు. ఇప్పుడు నీ ప్రసాదం వల్ల భగవానుని సన్నిధికి వెళ్లి అనాగారికుణ్ణై ప్రవ్రజ్యను స్వీకరించదలచాను." ఆ మాట విని బింబిసారుడు సరేనని ఆలోచించి, ఆయనకు కలిగిన వివేకానికి ఆదరం ఉట్టిపడగా, ఇలా అన్నాడు: "ఓ రాజా, నీవు ధన్యుడివి. ఉత్తములకు ఆదరపాత్రుడివి. నీ బుద్ధి సంసారవిముఖం ఎలా అయింది? నీవు భోగసుభగుడివయినా సంతోషవిభవంతో వెలుగొందుతున్నావు. శుద్ధసత్త్వుల లక్షణం మనస్సు వైరాగ్యాభరణం కావడమే. ఇంతకూ, మహామోహాంకుర విధ్వంసకమూ, జన్మాంతరోపార్జితమూ అయిన వైరాగ్యం మనస్సులో మొలకెత్తితే, రజోగుణభూయిష్ఠమైన సామ్రాజ్య మహౌజస్సుతో ప్రయోజనమేమిటి? దుస్సాధనాలైన సాధనాలు నిరుపయోగం. క్షణకాలభోజ్యాలైన భోగాలెందుకు? మనస్సును కలతపెట్టి, సత్త్వగుణాన్ని దుఃఖపెట్టే సుఖాలెందుకు? ప్రాణ మనః ప్రియమైన భూమిని అవలీలగా వదిలిపెట్టించగలిగి, త్రైలోక్యాభిమతమైన కామసుఖం పట్ల విముఖత కలిగించి, సమ్మోహవ్యసనాతురమైన ఈ జగత్తుపై అనుకంప పుట్టించే సంసార ప్రతికూలమైన శమం మతిమంతులకు పుణ్యం కొద్దీ కలుగుతుంది" అని బింబిసారుడు అతనిని ప్రశంసించి, అతనిని వేణువనాశ్రమానికి పిలుచుకొని వెళ్లి భగవానునికి ప్రమాణ పూర్వకంగా, అతని సమాచారం నివేదించాడు.

ఉద్రాయణుడు చిరకాలంగా ధ్యానిస్తున్న సుగతాకారం ప్రత్యక్షంగా చూచి, హర్షించి కృతకృత్యుణ్ణయానని తృప్తిపడ్డాడు. అతడు ప్రణమించడానికి శిరస్సు వంచగా, భగవానుని కృపాదృష్టితోపాటే, అతని శరీరంపై ప్రవ్రజ్య పడింది. తర్వాత అతడు భిక్షుభావం పొంది, చేతితో భిక్షాపాత్ర గ్రహించి, చీవరధారియై నగరంలో పిండపాతానికి(భిక్షకు) రాగా, ప్రజలందరూ ఆశ్చర్యపడ్డారు.

ఉద్రాయణుని కుమారుడైన శిఖండి ప్రసన్నమనస్సుతో ధర్మంతో రాజ్యం పాలిస్తూ కొంతకాలానికి మనస్సు కలుషమై అధర్మం చేయడం ప్రారంభించాడు. కాంచనమనే మెరుపులతో విలాసం చూపే లక్ష్మీ మేఘమాలవలె ఎవరి మానసాన్ని(మనస్సును, మానససరోవరాన్ని) కలుషం చేయదు? హిరుకభిరుకులనే అతని మహామాత్యులు కోపగించుకుని అధర్మనిరతుడై హితబోధ వినకవున్న అతనిని వదలి వెళ్లిపోయారు. వారి స్థానంలో దండముద్గరులనే వారిని రాజు నియమించాడు. వారు రాజ చిత్తానువృత్తి కుశలురు. ఒకమారు వారు రాజుతో అన్నారు: "దేవా, ధూర్తులైన మంత్రులు ప్రజారంజనమనే సాకుతో రాజు దుర్జనుడంటూ తమ పేరుకోసం ధర్మన్ని, సుఖాన్ని, ధనాన్ని, కీర్తిని, జీవితాన్ని కూడ లెక్కపెట్టరు. ప్రజలు



నువ్వులవంటివారు. కొట్టక, వెచ్చబెట్టక, ఆడించి పీడించక రాజసంబంధి అర్థక్రియలను చేయరు." ఈలాటి ఇచ్చకాల మంత్రులకు రాజు రాజ్యపాలనం అప్పగించాడు. ఆ దుర్మార్గులు లోభం వల్ల నిశ్శరణులైన ప్రజలను చంపడం ప్రారంభించారు. దురాచారుడు, దుర్మతి అయిన రాజు నిర్విచారంగా వుంటే, మహామాత్యుడు సత్యపథం అతిక్రమిస్తే ఇక ప్రజలు జీవించడమెలా?

ఉద్రాయణుడు ఒకమారు తన దేశం నుంచి వచ్చిన ఒక వర్తకుణ్ణి తన దేశరాష్ట్రాల సంగతి కనుక్కున్నాడు! "దేవ! నీ కుమారుడు కుశలంతోనే వున్నాడు. కాని, మంచిమంత్రులు లేక, కుమంత్రుల చేతిలో చిక్కాడు. ప్రభువు శాసనంతో ప్రజలకు మహాతాపం ఏర్పడింది. అందువల్ల ఈ పాడు దేశంలో ఎందుకు పుట్టామురా అని, పౌరులు రాత్రింబగలు దుఃఖిస్తున్నారు. సూర్యుడే చీకట్లు కలిగి చంద్రుడే అగ్నిని వర్షిస్తే, అమృతంనుంచే కాలకూటం పుడితే, రక్షకుడైన రాజే ప్రజల జీవితం హరిస్తే ఇక మహోపద్రవం వ్యాపింపజేసే ఆ మొరను వినేవారెవరు?" అని ఆ బేహారి మనవి చేశాడు. ఇష్టంలేని రాజు పెట్టే కష్టాలతో బాధపడిన ఆ వ్యాపారి మాటలు విని, కరుణానిధి అయిన ఉద్రాయణుడు ఇలా అన్నాడు: "నీవు ఇక్కడి నుంచి వెళ్ళి నా మాటగా ప్రజలను సమాధానపెట్టు. నేను వచ్చి శిఖండిని ధర్మమార్గంలో పెడుతాను." రాజుమాటలు విని, వ్యాపారి తిరిగి వెళ్లిన తర్వాత, ప్రజలకు రాజుమాటలతో ఊరట కలిగించాడు.

ఉద్రాయణుడు తిరిగి తన దేశానికి వస్తాడనే ప్రచారం వ్యాపించగా, దండముద్గరామాత్యులిద్దరూ భయపడి రాజుతో ఇలా మనవి చేసారు: "దేవా, సన్యాసం పుచ్చుకున్న వృద్ధభూపతి మరల రాజ్యలోభంతో దేశానికి వస్తున్నాడనే ప్రవాదం వ్యాపించింది. పెద్దలందరూ దీన్ని ఈసడించుకుంటున్నారు. వృద్ధరాజు తీవ్రవ్రతక్లిష్టుడయాడు కాబోలు! సంభోగభిముఖాదరుడై ప్రవ్రజ్యతోపాటు సిగ్గును కూడ వదలి మరల వస్తున్నాడు. అపక్వవైరాగ్య బుద్ధులైనవారు దేనిని వదలుతారో, మరల దానిపైన తీవ్రవాంఛ కలుగుతుంది. రోగులకు అపథ్యంపైన అభిరుచి కలిగినట్టు ప్రాణులకు లోకవిరుద్ధమైన విషయాలపైన విశేషంగా స్పృహ ఏర్పడుతుంది. కనుక క్షీణచంద్రుడిలా వున్న ఆ వృద్ధుడు ప్రతాపనిధి అయిన నిన్ను వెళ్లగొట్టి రాజ్యం అనుభవించగోరుతున్నాడు. చీవరాలంటే విసుగుపుట్టిన అతనికి శ్రేష్ఠవస్త్రాలు కట్టాలనే ఆశ పుట్టింది. ముండిత మస్తకునికి రత్నఖచిత మకుటంపై మనస్సు పోయింది. రత్నహర్మ్యలలో నవనవభోగవిభవ విలాసం వదలి, వనవాసాయాసం ఎవరు అనుభవిస్తారు? మెత్తని పరుపులలో పడుకొనేవారు జింకలపిండుగిట్టల తాకిడితో ముండ్లు పైకిలేచిన అరణ్య స్థలాలలో ఎలా పడుకుంటారు? చంద్రశీతలమైన మధువును తాగిన వారు వనగజమదంతో వేడెక్కిన చేదునీళ్లు ఎలా తాగుతారు? ఆసన్నప్రవేశ విషమపరిస్థితిలో అలాటిది జరుగకుండా చూడడం న్యాయశాస్త్రజ్ఞుల మతం. కనుక వృద్ధక్షితిపతిని ఇక్కడికి రాకముందే చంపివేయాలి. మిడత దీపంపై పడి, దానిని ఆర్పివేస్తుంది. మొదటే కాల్చివేస్తే తిరిగిరాదు."

వారి దుర్బోధకు భూపతి ఆకులుడయాడు. ఖలులనే మేఘాలతో ఎవరి మానసం కలుషం కాలేదు? శిఖండి రంపంలాగ క్రూరుడై వారితో ఇలా అన్నాడు. "ఈ కష్టం, మీకూ, నాకూ సమానమే. నయోపాయమెరిగిన మీరే విచారించి కార్యసాధనకు ఏది హితమో అది చేయండి." రాజు మాటలతో ప్రోత్సాహితులై మంత్రులు ఉద్రాయణుని దారి కాచి చంపడానికి హంతకులను పంపారు.

ఉద్రాయణుడు పుత్రుని ప్రజాపాలనలో నియమించ దలచినవాడు గనుక భగవానునితో "రౌరుకనగరానికి వెళ్ళుతాన"ని మనవి చేశాడు. సర్వజ్ఞుడు "స్వకృతం అనుభవించు" అని అనుజ్ఞ యిచ్చాడు. ఉద్రాయణుడు కర్మపాశం బలంగా ఈడ్వగా రౌరుక నగరానికి వెళ్లాడు. రూపుగొన్న నిష్కాపట్యంవలె వెళ్ళుతున్న అతనిని దుష్టామాత్య ప్రేరితులైన హంతకులు దారిలో చంపివేశారు. అతని చీవరపాత్రాదులు తీసుకొని వెళ్లి ఘాతకులు రాజకార్యం నిర్వహించామని మంత్రులకు తెలియజేయగా, వారు సంతోషించి, రక్తసిక్తమైన అతని చీవరాన్ని రాజుకు చూపారు. రాజు దానిని చూచి మూర్ఛపోయి తేరుకుని, తనతండ్రి మరణానికన్నా తను ఘోరమైన నరకగహ్వారంలో పడిపోయాను గదా అని చాల దుఃఖించాడు. "ఖలజనుల సాంగత్యం వల్ల, ఐశ్వర్యలోభంచేత, పాపపాతకం చూడక ఇలాటిది తెచ్చుకున్నాను. ఉన్నతి కోరేవారిని నిరాలంబమైన ఘోరనరక సంకటంలో పడవేసే తక్షణపాతకం ఖలసాంగత్యం. దుష్టులైన మంత్రుల మాటలతో నేనీ మహాపాపం చేశాను. పతితుణ్ణయిన నన్ను పావకుడు కూడా కాల్చి పవిత్రుణ్ణి చేయడు. పితృవధ, అర్హతునివధ సమానంగా చేసి, ఒకే పాత్రలో దహనసహితమైన విషం తాగిన నాకు ఇక నిష్కృతి ఏమిటి? వృద్ధుడు, నిశ్శంకంగా నావద్దకు వస్తున్న శమప్రవ్రజ్యాశ్రితుడు అయిన తండ్రిపై లోభంతో నిశితశస్త్రం ప్రయోగించాను. మనస్సులో తలుచుకుంటేనే కంపం కలిగించేవి, వినరానివి, చూడగా నే నిశ్చేతనులకు కూడ శోకం పుట్టించేవి, తీవ్రమైన సంతాపాగ్ని వలన క్రౌర్యం వంటిది కూడా మెత్తబడేవీ అయిన పూజ్యస్థానాలలోను నిర్దయులు కత్తికన్నా కరుకైన పనులు సాగిస్తారు" అని దుఃఖసంతాపంతో ప్రలపిస్తూ కోపంతో ఆ దుష్టమంత్రులను తన సమ్ముఖానికి వదలవద్దని కట్టడి చేశాడు. పిదప గుణమెరిగి, తండ్రి మంత్రులైన హిరుక భిరుకులను సమాధానపరచి పిలుచుకొనివచ్చి రాజ్యకార్యంలో నియమించాడు.

రాజు చింతాకృశుడై పాలిపోగా, దుష్టామాత్యులు అతని తల్లి తరలిక వద్దకు వెళ్లి, "దేవీ, నీ తనయుడు స్వభావసరళుడు. రాజ్యరక్ష సంగతి ఎరుగడు. స్వజనాన్ని నిర్మూలించి అయినా రాజ్యం కాపాడుకోవాలి. ఈయన తండ్రి సన్యసం పుచ్చుకున్నా రాజ్యం అపహరించడానికి వచ్చాడు. మేమిద్దరం అతనిని అణచివేశాము. దీంట్లో తప్పేముంది? మేము అనుసరించిన పద్ధతి నీచతంత్రోపపన్నమూ, అశుభమూ అయితే, రాజ్యాన్ని అభిలషించే భిక్షువుది సరైన క్రమమా? భూమీపతి పితృవధక్రోధంతో మా యిద్దరిని పదవినుంచి తొలగించాడు. తాను ఇంకా దొంగ ఏడుపులు ఏడుస్తున్నాడు. మేమేమో మంచి పని చేశాము; ప్రభువు చిక్కిపోతున్నాడు. అన్నిట్లోను భృత్యులదే అపరాధం. కడచినదానికి రాజెందుకు శోకిస్తున్నాడు? జరిగిందేదో జరిగిపోయింది. నీవు చింతాకృశుడైన పుత్రుణ్ణి ఉపేక్షిస్తున్నావు" అని అన్నారు. రాజమాత వారి మాటలు ఆదరించి, "అంతరహితమైన ఈ కర్మ మీ యిద్దరికీ నరకపాతకం. మీ దుర్బోధ వల్ల, పూర్వజన్మకృతం వల్ల రాజుకు కూడా కలిగింది. నేను పితృవధ దుఃఖాన్ని పోగొడుతాను. అర్హద్వధదుఃఖాన్ని మీరు పోగొట్టండి" అని వారితో చెప్పి, దుఃఖాక్రాంతుడై క్షీణించిన ఉడుపతివలె వున్న రాజు వద్దకు వెళ్ళి "పుత్ర! ఈ రాజ్యం ధర్మాధర్మమయమైంది; ఛలభరితమైంది. కనుక పాపశంకతో ఎందుకు దుఃఖంతో కృశించిపోతావు? నీవు అంతగా పితృభక్తుడివై పితృవధతో పరితప్తుడవయితే, ఈ దుఃఖ సంకటంలో సిగ్గు విడిచి చెబుతున్నాను విను. నీవు మరొకరికి జనించావు. అతడు నీకు ధర్మం ప్రకారం తండ్రి కాడు. స్వేచ్ఛాహార సుఖంగల స్త్రీలు సిగ్గు వదలి పని చేస్తారు" అని తెలిపింది. రాజు అప్రియమైనప్పటికీ ఆ మాట విని పితృవధ వల్ల కలిగిన ఉగ్రదుఃఖతాపాన్ని వదలి పెట్టాడు. ఈ



త్రిభువనంలో స్త్రీలకు అసాధ్యమైంది ఏదీ లేదు. ఉదయ పర్వతంతో అస్తాచలాన్ని కలుపుతారు. క్షణంలో భూమిలోని భూపాలురకంతా కలహవినోదం కల్పిస్తారు. నిప్పునుంచి నీటిని, నీటినుంచి నిప్పును పుట్టిస్తారు.

రాజు తండ్రిని చంపిన దుఃఖం పోయినా, అర్హద్వధ ములికిలాగ మనసులో పీడిస్తుండగా, దాని నిష్కృతి చెప్పమని ధర్మజ్ఞులను కోరాడు. అప్పుడు ఆ దుష్టసచివులు తిష్య పుష్య చైత్యాలలో పిల్లికూనలను పెట్టి, వాటికి మాంసం తినడం నేర్పి, ద్వారపాలకులు వారిస్తున్నా ధార్ష్ట్యంతో రాజసభను ప్రవేశించి ఇలా విన్నవించారు: "దేవ, నీవు వృథాగా మనస్సును కష్టపెట్టుకుంటున్నావు. ఈలోకంలో నిన్ను మెప్పించే అర్హంతులెవరూ, లోకకల్యాణకారకులైనట్టివారు లేరు. ఆకాశంలో రాజహంసల్లా అలాటివారు ఉండేపక్షంలో, మహా ప్రభావశాలురు గదా, వారిని ఇతరులు ఎలా చంపడం సంభవిస్తుంది? కనుక అర్హంతులన్నవారు లేరు. అలాంటప్పుడు వారిని వధించిన పాతకం మాత్రం ఎలా సంభవిస్తుంది? గ్రామమే లేనప్పుడు సీమావి వాదమేమిటి? అర్హత్పదం పొందిన తిష్య పుష్యులే తాము నిర్మించిన చైత్యాలలోనే పిల్లులుగా పుట్టారు. ప్రత్యక్షంగా కనిపిస్తూంటే ఎవరికి సందేహం కలుగుతుంది? మీకు నమ్మకం లేకపోతే, చూడండి." ఈ విధంగా మోసపు మాటలతో అతని మనస్సును దోలాందోలితం చేసి, అతన్ని చైత్యాలు చూడడానికి పిలుచుకొని వెళ్ళారు.

ఈ అపూర్వకౌతుకం చూడడానికి జనం ఆ చైత్యాల ముందు మూగారు. ధూర్తమంత్రులు అది వరకే అమిషాభ్యసంతో పిల్లులకు నేర్పి ఉండడం వల వారు పిలువగానే అవి వచ్చి, "మీరు తిష్య పుష్యులనే అర్హంతులే అయితే, ఈ చైత్యాలు రెండిటికీ ప్రదక్షిణం చేయండి" అని అనగా, ఈ మాటలు వాటికి మాంసమిచ్చేటప్పటి మాటలే గనుక, ఆ అభ్యాసంతో రెండు చైత్యాలకూ ప్రదక్షిణం చేశాయి. అది చూచి రాజు నమ్మిక కలిగి వెళ్లిపోయాడు. దుర్జనమాయ విజయం పొందింది. ధూర్తులు పిడికిలిలో వాయువును, రాతిలో కమలాన్ని, ఆకాశంలో చిత్రాలను, జిహ్వాగ్రంలో ప్రచురసృష్టిసంహారలీలలను, పశుబుద్ధులకు, శిశుబుద్ధులకు క్షణంసేపు విశ్వాసం కలిగించే ఇంద్రజాలాలను-ఎన్నైనా చూపుతారు. ఈ విధంగా రాజుకు అర్హంతులంటే విశ్వాసం పోవడం వల్ల, సౌగతదర్శనాలలోను ఆదరం తగ్గడం వల్ల ఆర్యకాత్యాయనునికి జరిగే పూజపురస్కారాలను కూడ ఆపివేశాడు. రాజధానిలోను ఉండరాదని వుత్తర్వు చేయడం వల్ల కాత్యాయనుడు నగరం వెలుపలే శిష్యులతో నివసించాడు. శైలాభిక్షుణి మాత్రం వినేయజనుల ఆదరణ బలంతో అక్కడే వుంది.

ఒకమారు శిఖండి మహారాజు వెళ్లుతుండగా కాత్యాయనుడు ఎదురుపడ్డాడు. రాజు అతనిని అవమానపరుస్తాడేమోనని, జనం మూగుతారేమోనని పాతమంత్రులు అతనిని పక్కకు పంపివేశారు. వెళ్లుతున్న కాత్యాయనుని చూచి, దుష్టామాత్యులు దీర్ఘవైరంతో వున్నవారు గనుక లేనిపోనివి కల్పించి ఇలా అన్నారు: "దేవ, అమంగళనిధి, సొట్టతలకాయవాడు అయిన ఈ బోడిగుండువాడు కనిపించాడు. ఏమి మూడుతుందో చెప్పలేము. పాపిష్ఠుడైన రాజు ముఖం చూడనని ఇతడు అంటుంటాడు. అందువల్లనే, ఇక్కడి నుంచి దూరంగా వెళ్ళి క్షణంసేపు నిలబడ్డాడు." ఈ మాటలు విని రాజు దుర్జయమైన కోపంతో, అనుచరులను చూచి, "అదిగో! దూరంగా నిలబడ్డాడే, ఆ బోడివానిపై మట్టి చల్లండి!" అని ఆజ్ఞాపించాడు. వారట్లే చేశారు. కాత్యాయనుడు కదలకుండా అక్కడే నిలబడ్డాడేగాని, తనదివ్యకుటిలో ప్రవేశించలేదు.

కోపంతో బుసలుకొట్టే పాములను పులులను శాంతితో మెత్తబరచవచ్చును గాని, రాజచేటకులను మాత్రం మెత్తబరచడం సాధ్యం కాదు.

రాజు వెళ్ళిపోయిన తర్వాత మట్టిలో కూరుకుపోయిన అతనివద్దకు హిరుక భిరుకులు వచ్చి దుఃఖంతో ఇలా అన్నారు: "ఆర్యా, క్రూరుడైన రాజు మిమ్మల్ని దుర్గతిపాలు చేశాడు. ఈ పరిస్థితిలో మిమ్మల్ని చూచే కండ్లు కాల్పనా? మోహాంధుడూ, పాతకీ అయిన రాజు దుర్జనుల మాటలకు మోసపోయి అఖాతంలో పడ్డాడు. ఈ స్థితిని చూచే మేము కూడ పాపిష్ఠులమే. ఉదారబుద్ధిగల మీరు ఈ భూరిపాపార్తమయిన దేశాన్ని వదలిపెట్టండి. దుస్సహమైన ఖలసహవాసం త్యజించడం ఎవరికి సమ్మతం కాదు? ఉత్తములకు దుష్టజనులను వర్జించడం కన్నా ప్రపంచంలో ఉత్తమమైన సుఖం మరొకటి లేదు. వర్జించడం వల్ల శమగుణం శమించదు; క్షమాగుణం క్షయం పొందదు. బుద్ధి పరుషరోషదోషదుష్టం కాదు. మనస్సులో ములుకులవంటి అవమానాలు నాటవు. ఐశ్వర్యమూ గుణవంతులను(గుణాలు కలవారిని, తాడు తీసుకొని వచ్చినవారిని) పడవేసి ప్రయాసం కలిగించేది. ఇక గాంభీర్యమా(గంభీరగుణం, లోతు) చీకటిగుయ్యారం ప్రవేశించేవారికి (దగ్గరికి వచ్చేవారికి, దిగేవారికి) ప్రాణహరమైనది. ఉపాదేయత అందామా(గ్రహించడం, నీటిని తీసుకొనడం) సమీపంలో దుష్టసర్పాలు (దుష్టులనే సర్పాలు దుష్టమైన సర్పాలు) ఉండడం వల్ల నశించిపోయింది. కనుకనే బావిలాగ ఖలుడు కూడ అన్నివిధాలా దోషాలతో కూడినవాడే. దోషయుక్తం కానిది వానిలో ఏదీ లేదు."

మంత్రుల మాటలకు మహాకాత్యాయనుడు ఇలా సమాధానం చెప్పాడు: "ఈ అవమానం వల్ల నాకేమీ కోపం లేదు. కర్మగతి బలీయమైంది. కాని, నా దుఃఖమంతా దుష్టసాంగత్యం వల్ల ఈ రాజుకు మహోపద్రవం మూడనున్నది గదా అనే. ఇక కొంతకాలానికి ఏడునాళ్లపాటు ఘోరమైన, విచిత్రమైన వర్షాలు కురుస్తాయి. మొదటినాడు భయంకరమైన వాయువు వీస్తుంది. రెండవనాడు పుష్పవృష్టి, మూడవనాడు వస్త్రవృష్టి, నాల్గవనాడు వెండివాన, ఐదవనాడు బంగారువాన, ఆరవనాడు రత్నాలవాన కురుస్తాయి. ఏడవనాడు దుమ్మువాన కురుస్తుంది. దానితో ఈ రాజు బంధుమిత్రరాష్ట్ర సహితంగా నశిస్తాడు. కనుక మీరు రత్నవృష్టినాడు రత్నాలు గ్రహించి మరొకచోటికి వెళ్లిపోండి." ఆ మాటలకు వారిద్దరూ అంగీకరించారు. హిరకుడు తన కుమారుడు శ్యామకుడనేవాడిని మహాకాత్యానునికి ఉస్థాపకుడు చేశాడు. భిరుకుడు తన కుమార్తె శ్యామావతిని శైలాభిక్షుణికి అప్పగించి "ఆర్యే! ఈ నా కన్యను ఘోషిలుడనే గృహపతికి అప్పగించు. నీవు ప్రతిపత్తిగలదానివి" అని కోరాడు. ఆమె ఆ కన్యతోపాటు ఘోషిలుని ఆలయానికి వెళ్లింది. మంత్రులిద్దరూ తమతమ ఇండ్లకు బయలుదేరారు.

తర్వాత కొంతకాలానికి మహాకాత్యాయన భిక్షువు చెప్పినట్లే జరిగింది. జ్ఞానదీపంగల ప్రజ్ఞ విషయాలను యథాతత్త్వంగా గ్రహిస్తాయిగదా. ఆరవనాడు రత్నం వర్షం కురియగానే, అమాత్యులిద్దరూ నావనిండా రత్నాలు నింపుకొని ఎవరికీ తెలియకుండా వెళ్లిపోయారు. వారు దక్షిణదిక్కుకు వెళ్లి హేరుకం, భీరుకం అనే రెండు నగరాలు కట్టారు. ఏడవనాడు పెద్దగా పడిన దుమ్మువానతో శిఖండి బంధుమిత్రరాష్ట్ర సహితంగా నశించాడు. దండి, ముద్గరులనే మంత్రులూ నశించారు. తర్వాత, మహాకాత్యాయనుడు ఆకాశమార్గంలో హిరుకుని కుమారునితో పాటు బయలుదేరాడు. ఆ రౌరుక పురదేవత కూడా ప్రీతితో కాత్యాయనుని వెంటే వెళ్లింది; కాత్యాయనుని ఆజ్ఞతో ఖరవనీ కర్వటంలో(ఖరవని అనే రెండువందల



గ్రామాల మధ్య నగరం) నివాసం ఏర్పరచుకొంది. భిక్షువు పుణ్యానుభావంతోను, మంత్రి కుమారుని భాగ్యంతోను, పురదేవత అధిష్ఠించడం వల్లను ఆ కర్వటపురం సిరిగలదయింది. దానిలో పురదేవత కాత్యాయనునికి చైత్యం నిర్మించింది. సురవతిలో ఉన్న ఈ చైత్యాన్ని నేటికీ చైత్యవందకులు పూజిస్తున్నారు.

కాత్యాయనుడు ఒకమారు తన ఉపస్థాపకుడైన శ్యామకుడు తన చీవరం కొసను పట్టుకొని వ్రేలాడుతుండగా, లంబకమనే దేశానికి గగనమార్గాన వెళ్లాడు. "లంబతే లంబతే కోఽయం" (ఎవరిది వ్రేలాడేది) అని జనమంతా అనడం వల్ల ఆ ప్రజలకు, దేశానికీ లంబకమనే పేరు వచ్చింది. ఆ దేశం రాజు, అపుత్రకుడు, అకస్మాత్తుగా మరణించాడు. అప్పుడు లక్షణజ్ఞులు శ్యామకుణ్ని కాత్యాయనుని ఆజ్ఞతో రాజును చేశారు. పిదప కాత్యాయనుడు భోక్కానకమనే దేశానికి వెళ్లి తన తల్లికి ధర్మదేశనం చేశాడు. ఆమె సత్యం దర్శించి పుత్రుని హారం తీసుకొని, దానిపేర చైత్యం నిర్మించింది. అది ఇప్పటికీ యష్టిచైత్యమని పూజించబడుతున్నది. పిదప కాత్యాయనుడు ఉత్కంఠతో శ్రావస్తికి వెళ్లి జినభగవానుని చూచి, ఆనందంతో పాదవందనం చేశాడు. తర్వాత, ఉద్రాయణుని కుమారుని కథను తెలిపాడు. భిక్షువులు ప్రశ్నించగా, సర్వజ్ఞుడు ఇలా తెలిపాడు.

"పూర్వం ఒక లుబ్ధకుడు కర్వటసమీపంలోని అడవిలో జింకలను పట్టడం కోసం వల పన్నాడు. వాడు వల పన్ని వెళ్లగా, ప్రత్యేకబుద్ధుడొకడు ఆ ప్రాంతంలో వచ్చి విశ్రమించాడు. అతని పుణ్యానుభావం వల్ల జింకలు వలలో పడలేదు. శుద్ధాత్ములైనవారి ఎదుట ప్రాణులు అకుశలం పొందవుగదా! తర్వాత లుబ్ధకుడు వచ్చి, వలలో జింకలు పడకపోవడం చూచి, కోపంతో ప్రత్యేకబుద్ధుణ్ని క్రోధాంధుడై విషం పూసిన బాణం వేసి చంపాడు. కాని మండుతున్న నిప్పువలె ఉన్న అతని తేజస్సు చూచి, కాళ్లమీద పడ్డాడు. అకార్యం చేశాను గదా అనే సంతాపంతో బాణాలు, వలలు వదలి తనను తాను నిందించుకున్నాడు. పిదప పరినిర్వాణం పొందిన ఆ ప్రత్యేకబుద్ధుని అస్థులు ప్రతిష్ఠించి, ఛత్రధ్వజాదులతో స్తూపం నిర్మించాడు. ఆ పుణ్యంతో ఉద్రాయణ నరపతిగా జన్మించాడు. ప్రత్యేకబుద్ధుని చంపిన పాపానికి హత్యచేయబడ్డాడు.

"ఆ కర్వట పట్టణంలోనే ధనధాన్యసమృద్ధుడైన నందుడనే గృహపతికి మదలేఖ అనే కన్య ఉండేది. ఆమె ఒకమారు ఇల్లు ఊడ్చి ఆ దుమ్మును పొరపాటుతో వీధిలో వస్తున్న ప్రత్యేకబుద్ధునిపై పోసింది. ఆ స్తనభరాలస అయిన మదలేఖ ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న పెండ్లివారు ఆనాడే వచ్చారు. "ప్రత్యేకబుద్ధునిపై ధూళి వేశాను. అందువల్ల పెండ్లివారు వచ్చారు. తొందరలో పెండ్లి అవుతుంది" అని ఆమె తన అన్నతోను, అందరితోనూ చెప్పింది. ఆ ప్రవాదంతో కన్యలందరూ వరులకోసం ప్రత్యేకబుద్ధుని తలపై దుమ్ము పోయడం ప్రారంభించారు. ఏదో యాదృచ్ఛికంగా గుణాకారాలను బట్టి కలిగిన విశ్వాసంతో మోహితులైన ప్రజలు ఆలోచన చేయకనే విరుద్ధమైన విషయాలను ఆచరణలో పెడుతారు. ఆ పాతకాచారాన్ని బుద్ధుడు, బుధుడు అనే ఇద్దరు గృహపతులు పోగొట్టారు. ఆ కన్యే శిఖండి అనే రాజుగా పుట్టి పాపకర్మలు చేసింది. ప్రవాదం వ్యాపింప చేసిన ఆమె అన్న కాత్యాయన భిక్షువుగా పుట్టాడు. రూఢమైన దుష్టాచారాన్ని తొలగించడం వల్ల ఆ ఇద్దరు గృహపతులూ హిరుక భిరుకులుగా పుట్టి పురప్రమాదం నుంచి తప్పించబడ్డారు."

భగవానుడు చెప్పిన మాటలు విని భిక్షువులు శుభాశుభ కర్మల చిత్రమైన ఫలపరిణతిని గ్రహించి, ఖలునివంటి శత్రువు, పర్యాలోచనవంటి గురువు, సుకృతంవంటి బంధువు లేరని నిశ్చయించుకొన్నారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ఉద్రాయణావదానమనే నలభయ్యవ పల్లవం

# 41. పండితావదానం

దరిద్రుడైనవాడు ధర్మధవళమైన శ్రద్ధాసమృద్ధితో చేసిన పరిశుద్ధమైన స్వల్పదానం కూడా భూపాలురు విశాల దాన విభవంతో సంపాదించిన పుణ్యంకన్నా హెచ్చు పుణ్యాన్ని, సత్ఫలితాన్ని కలిగిస్తుంది. అది సంసారబాధల విజృంభితాన్ని తొలగిస్తుంది. చిత్తానికీ విత్తానికీ సముచితమైనది ఇదే కదా!

జినుడు జేతవనంలో విహరిస్తున్న కాలంలో శ్రావస్తిలో ధీరుడనే మహాధనవంతుడైన గృహపతి ఉండేవాడు. అతనికి సుకృతపండితుడు, అఖండిత యశఃపుణ్యదానాలంకార మండితుడు అయిన పండితుడనే కుమారుడు వుండేవాడు. అతడు బాల్యంలోనే శారిపుత్రుడు మొదలయిన భిక్షువులను రాజార్హమైన భోజనంతో సత్కరించేవాడు. ఒకప్పుడు దుర్భిక్షం వచ్చి ప్రజలు చాల బాధపడగా, యాచకుడు దాత ఒక్కటే కాగా, యాచకులకు భోజనం పెట్టేవారే లేకపోయారు. భిక్షువులకు కూడా ఘోరమైన సంకటపరిస్థితి ఏర్పడింది. అప్పుడ సుగతుడు పిలవనంపగా పండితుడు జేతవనానికి కాంచనమాలాలంకృతుడై గుర్రమెక్కి బయలుదేరాడు. అతని గుణాల ఎడ ఈర్ష్య వహించిన కొందరు విటులు వెళ్లుతున్న అతనిని అడ్డగించి, "గృహపతీ! అర్థిసమూహాల అభ్యర్థనలకు కల్పవృక్షం వంటివాడవని నీ కీర్తి దిగంతాలకు వ్యాపించింది. ఐదువందలమంది నీమీది ఆశతో బయలుదేరి వచ్చాము. మాకు ఆభరణాలు వస్త్రాలు చాల ఇష్టం. సాధ్యమైతే ఇప్పుడే మాకు ఇవ్వు" అని బ్రతిమాలారు. ఆ సదాచారుడు గుర్రం దిగి వారిని ఆదరించి క్షణంసేపు "భగవానుని దర్శించకనే ఇంటికి తిరిగివెళ్లి వీరికి సత్కారం చేయడమనేది అమృతపానం చేయబోతూ ఆపుకున్నట్లు. ఇది నాకు సాధ్యం కాదు. అర్థులకు కోరింది ఇవ్వక సిగ్గులేకుండా వెళ్లిపోయానా, దానవ్రతఖండనమౌతుంది. ఏమి చేయను?" అని ఆలోచిస్తుండగా, భూమిని చీల్చుకొని నాగరాజైన శేషుడే సాక్షాత్కరించి అర్థులు కోరిన దానిని ఇచ్చాడు. నాగరాజు ఇచ్చిన వస్త్రాభరణాలను పండితుడు విటులకు అందజేసి మనస్సు కలతదేరగా వెళ్ళిపోయాడు. ఆ విటులు ఆ ఆశ్చర్యం చూచి పుణ్యమైన సుగతభావనే సర్వార్థసంపజ్జనని అని భావించి, మనస్సు కలుషదూరం కాగా, అతనితోపాటే, భగవంతుని దర్శించడానికి వెళ్లారు. భగవానుని దర్శించి పండితుడు లలాటాన్ని అతని పాదపద్మరజస్సుతో ధన్యం చేశాడు. చంద్రకిరణాలలాగ ధవళమైన ముత్యాలదండను శాస్త చరణాలపై పెట్టి విటులు కూడ నమస్కరించారు. వారి విషయం పండితుడు భగవానునికి నివేదించాడు. జ్ఞాన వజ్రధారి అయిన భగవానుడు వారి సత్కాయ శైలాన్ని భేదించి, వారికి స్రోతాపత్తిఫలం కలిగించాడు. వారు సత్యదర్శనం చేసుకొని నమస్కరించి వెళ్లిపోగా, పండితుణ్ని చూచి భగవానుడు ఇలా హెచ్చరించాడు:

"వత్స! నీ సుకృత సంపదల వల్ల నీకు పరిపూర్ణైశ్వర్యం కలిగింది. దుర్భిక్షంలో కూడా భిక్షువులకు భోజనవసతులు కల్పించు. నాతోనేమో పదమూడు వందల యాభైమంది భిక్షువులున్నారు. కృచ్ఛ్రార్తులైన ఇతర భిక్షువులను కూడ నగరంలో వెదికించి భోజనసౌకర్యం ఏర్పాటు చేయాలి." ఆ మాటలు విని



పండితుడు ప్రమదాకులుడై భక్తితో సంఘానికి యావజ్జీవం భోజనానికి ఆహ్వానం అందజేసి తిరిగి వెళ్లాడు.

ఇంటికి వచ్చిన తర్వాత రాజార్హమైనవి, భిక్షువులకు ఉచితమైనవీ అయిన భోజ్యపదార్థాలతో బుద్ధుని, సంఘంలోని ఇతర భిక్షువులను సత్కరించాడు. అతడు దానంతో దరిద్రులను, అదరిద్రులను, యాచ్యులను, యాచకులను, అనుకంప్యులను, ఇతరులను చూచి అనుకంపించదగినట్లు చేశాడు. ఇతర కృపణులను కూడ వెదికి దారిద్ర్య తిమిరాలను పోగొట్టే రత్నాలు దానం చేశాడు. ఆ రత్నాలు వారి వద్దకు వెళ్లే వేళకు బొగ్గులయాయి. పురుషులు భాగ్యాలు, రత్నాలు, మణులు ఒక్కటే- ప్రస్థజాతులు. వారంతా అతనివద్దకు వచ్చి స్వప్నంలో ధనం చూచి కోల్పోయిన వారిలా వగస్తూ, "రత్నాలనే పేరుతో నీవు మాకు బొగ్గులకుప్పలిచ్చావు. గొప్పగా ధనం లభించిన తర్వాత ఉన్నతి పొందిన నీబోటివాడు ధనం క్షీణించగానే, పిచ్చెక్కి మరణిస్తాడు" అని దూషించారు. వారి నిందలు విని పండితుడు, "పుణ్యహీనులకు రత్నాలు రాళ్లవుతాయి. మీరు మోహాంధులై పూర్వం సుకృతం చేయలేదు. కనుకనే నేనిచ్చిన రత్నాలు బొగ్గులయాయి. పుణ్యం క్షీణిస్తే, మనం ఎంతో ప్రయత్నంతో దాచినా, రత్నాలు దగ్గర వుండవు. భాగ్యం కలిగితే వాటంతట అవే వస్తాయి. విత్తార్జనం పతితశోకకారణమే. నిజమైన విత్తమేమిటంటే, సుకృత ప్రవృత్తమైన విత్తమే. కనుక మీరు భిక్షుసంఘానికి భోజనం పెట్టండి. మీకు భోగసంభారమంతా నేను అందజేస్తాను" అని హితవు చెప్పాడు. వారు పండితుడిచ్చిన విత్తభోగసామగ్రితో బుద్ధుడు మొదలైనవారున్న సంఘాన్ని దినమొక్కరుగా సత్కరించారు. వారు అలా సంఘాన్ని సత్కరించి, "మాకు ఇకనెప్పుడూ దారిద్ర్యం రాకూడదు" అని ప్రణిధానం చేశారు. తర్వాత పండితుని మాటపై ఆ బొగ్గుల రాశినే మరల చూచారు. అది రత్నరాశిగా వెలిగింది.

అప్పుడే పండితుని భవనంలో అతని సుకృతప్రభావం వల్ల నూరు నిధులు మూతలు లేకుండా పుట్టుకొని వచ్చాయి. క్షితిరక్షణ నిమిత్తం దానిలో ఆరవ వంతును పండితుడు ప్రసేనజిత్తుకు అర్పించాడు. అది కూడా బొగ్గయిపోయింది. పండితుడు మాత్రమే తన సుకృతాల వల్ల ఈ నిధులను అనుభవించగలవాడని అశరీరవాణి రాజుకు వినిపించింది. పండితుని మాటతో మరలా అవి నిధులు కావడం చూచి ప్రసేనజిత్తు దానిని మరల అతని యింటికే పంపివేశాడు. ఆ నిధులన్నిటినీ అతడు దానం చేసి దరిద్రుల గృహాలను నిలబెట్టాడు.

క్రమంగా అతనికి నిస్సారమైన సంసారంలో స్పృహ పోయింది. ఇదంతా అనిత్యమనే జ్ఞానం కలిగింది. వెంటనే తండ్రివద్దకు వెళ్లి "తండ్రీ, తపోవనానికి వెళ్లడానికి నాకు అనుమతి ఇవ్వు. ఈ సంపదలు నాకు జన్మశతం నుంచి ఎంగిలిపడ్డవై అసహ్యం కలిగిస్తున్నాయి. సర్వభూతాల ఆయుర్దాయమనే పాత్ర చిన్నది. త్రైలోక్య, సంపత్సంప్రాప్తి భోగిద్దామంటే కుదరదు. ఈ కాయం చలికాలంలో చలి తగులకుండా మెచ్చని మృదువైన వస్త్రాలతో కప్పినా, తాపమైతే, చల్లని శ్రీఖండ చర్చలు చేసినా, విషసర్పశస్త్రవహ్నులభయం పోగొట్టుకొనడానికి ఎంత ప్రయత్నించినా, ఇంకా అపాయాలు ఎన్ని నివారించినా, క్షయం తప్పదు. భోగాలంటే విరక్తి పుట్టింది. కనుక ప్రియమైన ప్రవ్రజ్యను స్వీకరించి, వనంలో విహరిస్తూ, చింతాతప్తమైన మనస్సుకు శాంతి కలిగిస్తాను" అని మనవి చేశాడు. తండ్రి అనుమతించగా, విషయ స్నేహబంధనం త్రెంచివేసి, శారిపుత్రుని ఆశ్రమానికి వెళ్లాడు. అక్కడ ప్రవ్రజ్య స్వీకరించి, భిక్షాపాత్ర ధరించి, చీవరాలు కట్టుకొని వ్రతధారియై అతనికి అనుచరుడై వుండిపోయాడు.

ఒకమారు అతడు ఆశ్రమ సమీపంలోని పొలంలో కర్షకులు నిర్మించిన పంటకాలువ నీరు ఒక మడి నుంచి మరొక మడికి నిర్దిష్టమార్గంలో పారడం చూచి ఆశ్చర్యపడి, "అచేతనాలు కూడా విహితమార్గంలో నడుస్తున్నాయి. దేహులకు మాత్రం కర్మసంసిద్ధి కనిపించదు" అని ముందుకు వెళ్లుతూ, ఒక కమ్మరి బాణాలను కొలిమిలో వేసి కాచుతుండడం చూచి "నిశ్చేతనమైన ఈ బాణాలు కూడ తాపం వల్ల గుణవత్తరాలు అవుతున్నాయి. ఈ మానవులు సంసార సంతప్తులయినా వంకరగానే వుంటున్నారే?" అని చింతిస్తూ ముందుకు వెళ్లాడు. అక్కడ ఒక వడ్రంగి ఆకులు బిగించి చక్రాలు తయారు చేస్తున్నాడు. "ఆహా! నిశ్చేతనమైన కర్రలు కూడ ఘటనాయోగంతో క్షణంలో కర్మణ్యాలు (పని చేసేవి) అవుతున్నాయే. శరీరధారుల మనస్సులు అలా కావడం లేదే" అని అనుకుంటూ, ఆశ్రమానికి తిరిగి వచ్చి, ధర్మ వినయంలో ఆదరం అతిశయించగా, వత్సలుడైన తండ్రిని పుత్రుడు అభ్యర్థించినట్టు ఆచార్యుణ్ని "మీ అనుమతి అయితే నాకు ఇష్టమైన వ్రతాన్ని ఆలోచిస్తాను" అని అభ్యర్థించాడు. ఆచార్యుడు అనుమతించి, భుక్త కృత్యానికి(భోజనానికి) వెళ్లగా, విహారాగారం ప్రవేశించాడు.

ఆ విహారాగారంలో దేహాన్ని యష్టిగా పొడిగించి, స్మృతిని ప్రతిముఖిని చేసి, పర్యంకాసననిశ్చలుడై నిజధర్మం ధ్యానించాడు. అతడు సమాధి సన్నద్ధుడు కాగా, వసుంధర ధారాధరాలతోపాటు, అఖిలాంబోధిదుకూలం ఊగిసలాడగా కంపించింది. అతడు ధ్యాననిరతుడయాడని తెలిసి ఇంద్రుడు, ధ్యానం నిర్విఘ్నంగా కొనసాగడానికి దిక్కులలో సూర్యచంద్రులను, దిక్పాలకులను కావలి పెట్టాడు. కుశల మూలముల పరిణామం వల్ల అతనికి సిద్ధి త్వరలో సంప్రాప్తమైందని తెలిసి సర్వజ్ఞుడైన సుగతుడు క్షణకాలం "ఇతనికి అర్హత్పదం త్వరలో సిద్ధిస్తుంది. అంతలోగా శారిపుత్రుడు ఆగారం తలుపులు తీస్తే విఘ్నం కలుగవచ్చు. కనుక అతడు వెళ్లి తలుపులు తెరవకుండా కాలహరణం చేయడం కోసం నేను వెళ్లి శారిపుత్రుణ్ని లేనిపోని ప్రశ్నలు వేసి ఆపుతాను" అని ఆలోచించి, ఆ వైపు వచ్చి శారిపుత్రునితో ఏవో కథలు చెబుతూ కాలక్షేపం చేశాడు. దేవతల ప్రభావం వల్ల ఆకాశంలోని పక్షులు కూడ కదలకుండా ప్రకృతి ప్రశాంతంగా వుండగా, పండితుడు గాలి లేని స్థలంలో పెట్టిన దీపంలా నిశ్చలంగా వెలిగాడు. మొదట స్రోతప్రాప్తిఫలాన్ని అనంతరం అర్హత్ఫలాన్ని పొందాడు. ఈ సంగతి తెలిసిన సుగతుడు మాటలు చాలించి వెళ్లిపోగా, శారిపుత్రుడు భవబంధనాలు తొలగించుకొని, యుగశతప్రాప్యమైన సిద్ధిని పొందిన శిష్యుణ్ని ప్రశంసించాడు. పండితుడు అర్హత్పదని పొందినట్లు లోకమంతా వ్యాపించింది. భిక్షువులు అతని భాగ్యవిశేషానికి గల కారణాలు ప్రశ్నించగా, భగవానుడు ఇలా చెప్పసాగాడు:

పూర్వం వారాణసిలో తథాగతుడైన కాశ్యపుడు ఇరవైవేలమంది భిక్షువులతో సహా పురవాసులు శ్రద్ధతో, శుచితో, తనకు ఇష్టం వచ్చిన భోగ్యవస్తువులతో సత్కరించగా కొంతకాలం వున్నాడు. ప్రతి ఇంటా వారికి ఇలా పూజ జరుగుతుండగా, దుర్గతుడనే దరిద్రుడు నిట్టూర్పులు విడుస్తూ, ఇలా చింత చేశాడు: "అయ్యో! నేనెంత మందభాగ్యుణ్ని. ఒకవైపు దారిద్ర్యం; మరొకవైపు ఏమిపనీ చేయలేని మూఢుణ్ని. ఒక్క భిక్షువుకూ్కడా భోజనం పెట్టలేకపోతున్నా. అర్థరహితులైన పురుషులు అర్థరహితమైన శబ్దాలవలె ఏ వ్యవహారాలకు (ప్రయోగాలకు- కార్యనిర్వహణకు) పనికి రారు. వాక్యప్రమాణపదసంధులలో (వాక్యాల ప్రామాణ్యానికి, పదసంధులకు-ప్రమాణవాక్యాలు పలికించడానికిగాని, పదవులకుగాని, సంధులకుగాని) అర్హులుగారు. నష్టక్రియులు(నిరర్థకమైన పదాలకు క్రియలుండవు-అకర్మణ్యులు), కారక తర్కహీనులు



(నిరర్థకమైన మాటలకు కారకం వుండదు, కార్యకారణభావం వుండదు), అర్థహీనులు ఏపనీ చేయించలేరు. ఆలోచన, తర్కం అసలే వుండదు. కనుక ప్రజలు వారిని వదలివేస్తారు" అని చింతాక్రాంతుడైవున్న దుర్గతుణ్ని సుకృతప్రేరకుడైన ఒక సత్పురుషుడు చూచి, "నీకు ధనం లేకపోయినా, జన్మాంతరంలో శుభాలు పొందడానికి ఎట్లయినా, ఒక్క భిక్షువునైనా భోజనానికి ఆహ్వానించలేక పోయావా?" అని హితవు చెప్పాడు. ఆ మాట విని వాడు మొదటే బాణం గుచ్చుకున్నవాడు మరొకమారు బాణం దెబ్బతిన్నట్టు చాల బాధపడి, ఆకలితో నకనకలాడుతూ, శ్రేష్ఠి ఇంటికి వెళ్లి, కట్టెలు కొట్టి మూల్యం సంపాదించాడు. అతని భార్య ఆ శ్రేష్ఠి ఇంట్లోనే బియ్యం విసరి, దానివల్ల వచ్చిన భృతిని కూడ భక్తితో, భర్తకు అప్పగించింది. భిక్షుభోజనసిద్ధికోసం పూనుకొన్న ఆ శుద్ధసత్త్వునికి ఇంద్రుడు తోడ్పడ్డాడు. దివ్యరత్నరసామోదమైన భోజ్యవస్తువులను ఇంద్రుడు ప్రీతితో ప్రచ్ఛన్నరూపంలో సిద్ధపరిచినా, ఆ దుర్గతునికి భిక్షులెవ్వరూ దొరకలేదు. భిక్షువుల మాహాత్మ్యానికి ముగ్ధులైన పురవాసులు రహస్యంగా భిక్షువులందరినీ భోజనానికి పిలవడం వల్ల ఎవరూ దొరకనందున దుర్గతుడు నిరాశతో ఆత్మహత్య చేసుకొనడానికి ప్రయత్నించాడు. అప్పుడు దయతో భగవానుడైన కాశ్యపుడే వచ్చి శుద్ధసిద్ధిని తెలుసుకొని భోజ్యపరిగ్రహం చేశాడు. "నీకు భోజనం ఏర్పాటు చేస్తాను" అని రాజు ప్రార్థించినా, దుర్గతుడు అంగీకరించలేదు. పిదప "గుణాలు, ద్రవిణం కొల్లలుగా వుండి, దరిద్రులను సంతోషపెట్టేవాణ్ని కావాలి" అని కాశ్యపుని అర్చించి, ప్రణిధానం చేశాడు. కాశ్యపుడు స్వాశ్రమానికి వెళ్లిపోయిన పిదప, ఇంద్రుడు దేవలోకానికి వెళ్లిన పిదప, దుర్గతుని గృహం దివ్యరత్నభరితమైంది. ఇంద్రుని శాసనం వల్ల విశ్వకర్మ రత్నస్తంభ విభూషితమైన భవనాన్ని నిర్మించాడు. దుర్గతుడు ఈ విమలైశ్వర్యం పొందిన తర్వాత, కాశ్యపుణ్ని సర్వభిక్షువులతో సహా ఏడుదినాలపాటు విభవ భోగాలతో పూజించాడు. దుర్గతుని యిల్లు మొదట్లో , ఆకలితో నకనకలాడే భార్యతో, యాచకుడన్నవాడు తొంగిచూడకుండా, పిల్లల ఏడ్పులతో, మురికినీటి గుంటలలో, మూలలులో ఈగలు ముసిరి గోలపెడుతుండగా, పొయ్యి నుంచి పిల్లికూనలు లేవకుండా రెండవ రౌరవనరకంగా వుండేది. అలాటిది రాజులు కూడా చూచి లొట్టలు వేసే ఐశ్వర్యంతో కలకలలాడుతుంటే ఎవరికి ఆశ్చర్యం కలుగదు! ఆ సుధాశుద్ధమైన దాని ప్రభావంలోనే దుర్గతుడు జన్మాంతరంలో పండితుడుగా పుట్టి, అర్హత్వం పొందాడు. ఈ విధంగా సర్వవేత్త అయిన సుగతుడు గుణాదరంతో పండితుని పూర్వజన్మ వృత్తాంతం తెలుపగా, భిక్షుసంఘం విని కుశలార్హమైన విశుద్ధదానపుణ్యాన్ని ప్రశంసించింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అనదాన కల్పలతలో పండితావదానమనే నలభై ఒకటవ పల్లవం

# 42. కనకవర్ణావదానం

సత్త్వగుణ ప్రభావం వల్ల చీకటిలోను సూర్యకాంతులు వెలుగుతూ కనిపిస్తాయి. ధర్మం వల్ల రత్న రాసులు ఆకాశం నుంచి కురుస్తాయి. ధైర్యం వల్ల సర్వవిపత్తులు అణగారిపోతాయి. దానం వల్ల దిక్కులు భోగసుభగములు అవుతాయి.

భగవానుడైన సుగతుడు జేతకాననంలో కుశలురైన ప్రసన్నులకు ధర్మదేశనం చేస్తూ ఒక పూర్వజన్మగాథను ఇలా తెలిపాడు.

పూర్వ కల్పంలో అయుతకాలం ఆయుఃప్రమాణం గల వత్సరాష్ట్రంలో కనకవర్ణాఖ్యుడనే రాజు ఉండేవాడు. అతడు చాల ఐశ్వర్యవంతుడు. అతనికి అమరావతిని పోలిన కనకపురమనేది రాజధాని. అది సర్వలోకేశ్వరునికి కూడా వసతిగా సుందరంగా ఉండేది. రాజు ప్రజాకార్య తత్పరుడు. అతడు ప్రజాకార్యాన్ని ముత్యాల దండలాగ హృదయాన ధరించాడు. ముక్తాహారం శుభ్రమైంది, ప్రజాకార్యం యశశ్శుభ్రమైంది. ముక్తాహారం చారువృత్తగుణోచితం (గుండ్రనిది, దారంతో గుచ్చినది); ప్రజాకార్యం చారువృత్తగుణోచితం (సుందరమైన చరిత్రలో గుణసహితమైంది). నాయకార్హం(నాయకమణి గలది హారం, నాయకార్హ మైంది ప్రజాకార్యం).

ఇలా వుండగా, ప్రజల కర్మవిపాకంతో సర్వప్రాణులను భయపెడుతూ, అనావృష్టి సంభవించింది. దానితో ప్రజలందరికీ ధైర్యం కూలిపోయింది; సర్వప్రజలకు సంతాపం ఏర్పడింది. అది చూచి నరపతి మనస్సు చాల కష్టపడింది. ప్రజల కష్టాలు తొలగించడానికి అతడు ఎన్ని ఉపాయాలు చేసినా, అన్నీ వ్యర్థమయాయి. అప్పుడతడు ఎదుట దీనంగా నిలబడ్డ మంత్రులతో ఇలా అన్నాడు! "ఈ అనావృష్టికి ప్రతీకారం ఏమీ చేయలేకుండా వున్నాము. నేనెంతో ప్రయత్న పూర్వకంగా చేస్తున్న సుపరిపాలనను ఇది నిష్ఫలం చేస్తున్నది. రాజుల పాపం వల్లనే దిక్కులలో వర్షాలు లేకపోవడం, మేఘాలు తెల్లగా తేలిపోవడం, ప్రజలు బాష్పాకులిత లోచనులు కావడం సంభవిస్తుంది. ప్రజలు భయోపద్రవాలు పోగొట్టి రక్షించని రాజు కిరీటం పెట్టుకోవడం నటులు నాటకంలో కిరీటం పెట్టుకొన్నట్లే. రాజు ప్రజలకు హితుడుగా వున్నప్పుడు కృతయుగం, రాజు ప్రజలకు అహితుడుగా వున్నప్పుడు కలియుగం. రాజుల పాపాల వల్ల ప్రజలు దుర్భిక్షాలతో క్షీణించి, శత్రువులు పైన వచ్చి పడినట్లున్న క్షయాది రోగాలలో చిక్కుకుని, ప్పు ధుతరక్లేశాలతో విహ్వలులై దుర్మార్గులు పీడించగా హాహాకారాలు చేస్తూ, కాపాడే దిక్కు లేక నశిస్తారు. కనుక ఉన్న ధనాగారమంతా వెచ్చించి అయినా, ప్రజలను రక్షించాలి. రాజులకు ప్రజలను రక్షించే పుణ్యమే రత్నమయమైన నిధి." ఈ విధంగా రాజు మంత్రులతో ఆలోచించి, ధన ధాన్యాగారాలను, తన సర్వస్వాన్ని ప్రజల ఉపయోగానికి వినియోగించాడు.



ఆ దుర్భిక్షానికి ఉన్న ధాన్యమంతా కొంతకాలంలో వ్యయమై ఒక్కమనిషికి మాత్రమే మిగిలింది. ఆ సమయంలో రవిసంకాశుడైన ఒక ప్రత్యేకబుద్ధుడు గగనమార్గంలో వచ్చి, భోజనం అడిగాడు. తన ప్రాణధారణమే సందేహాస్పదంగా ఉన్నప్పటికీ రాజు ప్రసన్న బుద్ధితో ఆ మిగిలిన ఆహారాన్ని ప్రత్యేకబుద్ధునికి సమర్పించాడు. ప్రత్యేకబుద్ధుడు ఆ ఆతిథ్యంతో తన ప్రాణం కాపాడుకొని, రాజు సత్త్వగుణశీలాన్ని ప్రశంసిస్తూ గగనమార్గంలో వెళ్లిపోయాడు.

వెంటనే గగన మహాగజం వెంట ముసిరే నల్లని అళిమాలికవలె, పశ్చిమదిగ్వనిత కపోల కాలాగరు మంజరివలె నీటితో తొణికిసలాడే మేఘావళి పశ్చిమదిక్కున తెరలుకట్టింది. తర్వాత గగనాంతమంతా సరసమైన తుమ్మెదలపిండులవలె మేఘసమూహాలతో, ఉత్ఫుల్లనీలోత్పలవనం వలె కనులపండువైంది. పిదప ఏడునాళ్లపాటు అఖిలభోజన పదార్థవృష్టి, ధాన్యాదివృష్టి, రత్నాదివృష్టి కురిశాయి. రాజులకు మకుటాయమానుడైన కనకవర్ణభూపతి, తన సుకృత సంపదలతో ప్రజల ప్రాణరక్ష చేశాడు. సజ్జనుల ప్రభావం పరార్థాలను ప్రసాదిస్తుంది.

ఆ కనకవర్ణ మహారాజును నేనేనని చెప్పి భగవానుడు ధీమంతులైన భిక్షువులకు ధర్మోపదేశం చేశాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కనకవర్ణావదానమనే నలభైరెండవ పల్లవం

# 43. హిరణ్యపాణ్యవదానం

సర్వోపకార ప్రణయి అయిన ప్రభావం, సర్వోపజీవ్యమైన మహద్విభూతి పుణ్యాంకురానికి అర్హమైన ప్రథమపుష్పాలు. ఇవి విశాల ఫలహేతువులు.

జినుడు జేతవనారామంలో విహరిస్తున్నప్పుడు శ్రావస్తిలో దేవసేనుడనే ధనవంతుడైన గృహపతి ఉండేవాడు. సత్పుత్రవాని అయిన అతనికి హిరణ్యపాణి అనే కుమారుడు ఉండేవాడు. అతని రెండుచేతులూ హిరణ్యమయమైనవి కావడం వల్ల ఆ పేరు పడింది. అతని రెండు చేతుల్లో ప్రతి ఉదయం రెండు లక్షల వెండినాణేలు పుట్టేవి. దానితో అతడు యాచకులకు కల్పపాదపమయ్యాడు. ఆ కుమారునికి కుశలమూల భూరి పరిపాకం వల్ల, వ్యక్తమైన వివేకం వల్ల కాలక్రమాన జినదేవునిపై భక్తి కలిగింది.

అతడు ఒకమారు జేతవనానికి వెళ్లి భగవానుని దర్శించి ఆనందంతో పాదవందనం చేశాడు. భగవానుడు అతనిపై సంసారతాప ప్రశమనమూ, కుశలదూతిక అయిన అమృతశీతల దృష్టి పరపినాడు. శాస్త్రదర్శనంతోనే అతడు సమ్మోహతిమిరాలు పటాపంచలు కాగా, సూర్యకిరణాలతో వికసించిన కమలం లాగ వికసించాడు. భగవానుడు అతనికి సద్ధర్మోపదేశం చేశాడు. దానితో అతనికి అవినాశకాంతిగల ధర్మ దృష్టి ఉదయించింది. ప్రాక్పుణ్య పరిపాకంతో వైరాగ్య వాసనలు గుబాళించగా, విమలప్రజ్ఞాయుతుడై సర్వజ్ఞునితో అతడు ఇలా మనవి చేశాడు: "శరణాప్తులకు శరణ్యమైన భగవన్! ఈ అశేష క్లేశాలు నశింపజేసేది, భవహారిణి అయిన ప్రవ్రజ్యను అనుగ్రహించండి. ప్రాణుల ఆయుస్సే చంచలం; అందులోను యౌవనం మరీ చంచలం. సంపదలా విద్యుద్విలాస చపలాలు." ఇలా అతడు మనవి చేస్తుండగానే సుగతానుగ్రహం వల్ల అతని శరీరంపై నిజంగానే ప్రవ్రజ్య అవతరించింది. రక్తవర్ణచీవరాలతో వ్యక్తమైన విరక్తితో అతడు భిక్షాపాత్ర గ్రహించి, మరొకమారు సంసారపాత్రను పరిత్యజించాడు.

భిక్షువులు అతని అద్భుతమైన సిద్ధిని ప్రత్యక్షంగా చూచి, భగవానుణ్ని అతని పూర్వవృత్తం అడిగారు. ఆయన ఇలా తెలిపాడు.

"పూర్వం వారాణసిలో కృకి అనే రాజు ఉండేవాడు. కాశ్యపతథాగతుడు పరినిర్వాణం చెందగా, ఆయన శరీరానికి కృకి సంస్కార సత్కారం చేసి, రత్నమయమైన స్తూపం నిర్మించాడు. అది స్వర్గలోకాన్ని అందుకునేటంతటి గంభీరంగాను, అతని పుణ్యంవలె ఉన్నతంగాను ఉండేది. ఆ పుణ్యంతో ఇప్పుడు గొప్పవారు కూడ ఆశపడేట్లు బంగారు చేతులతో పుట్టాడు. విమల మనస్సు గలవాడు శ్రద్ధతో చేసిన సత్కార్య ఫలితం వల్ల, విభవం త్యాగోదారమై అన్ని గుణాలను కలిగిస్తుంది; చంద్రసహోదరమైన శుభకీర్తిని వ్యాపింప జేస్తుంది. పరిణామంలో పుణ్యాన్ని ప్రసవిస్తుంది."

పుణ్యానుభావం గల హిరణ్యపాణి ప్రభావాన్ని జినుడు చెప్పగా విని భిక్షుసంఘం హర్షాదరవిస్మయాలు పొందింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో హిరణ్యపాణ్యవదానమనే నలభైమూడవ పల్లవం

# 44. అజాతశత్రుపితృద్రోహావదానం

దుర్జనులనే దుస్సహ విషధరుల విషతిమిరంలో పడినవారికి ఆలంబనం భవభయ హరణమైన జినస్మరణమే.

భగవానుడు రాజగృహంలో గృధ్రకూటపర్వతంలో విహరిస్తున్న సమయమది. సుతప్రియుడైన బింబిసార మహారాజును అతని కుమారుడైన అజాతశత్రువు క్రూరుడై నిప్పువంటి క్రూరకర్ముడైన దేవదత్తుడనే మిత్రుని దుర్బోధపై ఘోరాంధకార బంధురమైన కారాగారంలో పడవేసి, ఎవరినీ పోనివ్వరాదని కూడా కట్టడి చేశాడు. రాజ్ఞి రహస్యంగా భోజనం పంపితే కూడా, తండ్రి ఆకలితో మాడి చావాలనే సంకల్పంతో నిషేధించాడు. బింబిసారమహారాజు చిక్కిపోయి, స్నానాదులులేక మురికిపట్టి, స్నేహసంస్కారంలేక ఒడలు పేలిపోయి, ఆకలితో, కృష్ణపక్షంలో ఆకాశంలో కారుమబ్బులు కప్పిన చంద్రునివలె ఉన్నాడు. తరచు మృదుహృదయులను విపత్తు గాఢప్రణయంతో ప్రౌఢురాలై ఆలింగనం చేసుకుంటుంది.

బింబిసారుడు ఆ కారాగారంలోనే, దుఃఖంతో సుగతుడున్నదిక్కుమొగమై తలవంచి, అంజలి ఘటించి, క్షామస్వరంతో ఇలా ప్రార్థించాడు: "భగవన్! నీవు మహార్హుడవు. మహోర్జితుడవు. దీనోద్ధరణ సన్నద్ధమైన సమ్యక్సంబోధి చిత్తుడవు. నీకు నమస్కారం. నీవు ఘోరసంసార మకరాకారానికి వంతెనవు. జనతాజన్మక్లేశప్రశమ కారణుడవు. నీకు నమస్కారం. నిత్యప్రబుద్ధునికి, సర్వసత్త్వైకబంధువుకు, విశుద్ధకాంతికి, కరుణామృత సింధువుకు, బుద్ధునికి నమస్కారం." ఈ విధంగా మహారాజు భక్తిసుధను చిలకరించి, పుణ్యపుష్పప్రసవాలతో సుగతుని కర్ణావతంసోచితమైన స్తుతిమంజరిని కూర్చాడు. సర్వజ్ఞుడు అతని కాయక్లేశకరమైన దశను గ్రహించి కారాగారద్వారం సందులనుంచి వచ్చే కాంతులతో అతనికి ప్రత్యక్షమై మనస్సుకు ఆప్యాయనం కలిగించాడు. అజాతశత్రువు ఆ సంగతి గ్రహించి అనుమానంతో కారాగారంలో చిన్న రంధ్రాలన్నీ మూసివేయవలసిందని ఉత్తర్వు చేశాడు. పిదప బంధనాగారాధికారులు అజాతశత్రువు ఆదేశంతో రాజును కట్టివేసి కాళ్లు నరికివేశారు. రాజు ఆ తీవ్రబాధను భరించలేక, "నమో బుద్ధాయ! నమో బుద్ధాయ!" అని ఆర్తనాదం చేశాడు.

భగవానుడు రాజుకప్పుడు ప్రత్యక్షమై, ఇంద్రుడు వేసిన ఆసనంపై కూర్చొని, కరుణతో ఇలా అన్నాడు. "రాజన్! క్రూరకర్మల గతి ఇలాటిదే. శుభాశుభ సముద్భూతమైన కర్మఫలం అనుభవించకుండా తీరదు. రాగద్వేష విషాకులం, నానావ్యసన దుస్సహం, నిస్సారం అయిన ఈ సంసారంలో దుఃఖాలు ఇలాటివే. సంక్లేశాకులమూ, విపదావళీ విసంకటమూ అయిన కాలంలో ధైర్యమే రక్ష. వైరాగ్యమే కలతలు తొలిగించేది. సుకృతవంతుల నేత్రాలు సంసారఘోరగహనాంతరంలో పుట్టిన దుఃఖానిలాలు వీవగా వ్యాపించిన పొగలు తగిలినా, బాష్పాంబు బిందువులతో నిండవు. ఈ దుఃఖంలో ధైర్యం వహించు. భోగాశ వదలు. ఈ సంసార వ్యాపారాలన్నీ విరసాంతములు. ఇప్పుడే, నీ దేహాంతంలో నీకు కుశలస్థితి ఆసన్నమైంది" అని సమాశ్వాసించి, తన ఆశ్రమానికి వెళ్లిపోయాడు.

బింబిసారుడు అప్పుడే దేహం త్యజించి, ఆ క్షణంలోనే స్వర్గంలో జనవర్షభుడనే పేరుతో వైశ్రవణుని కుమారుడుగా అవతరించాడు. తండ్రి మరణవార్త అజాతశత్రువు తెలుసుకొని, అతనికి అంత్యక్రియలు జరిపి, తన దుష్కృత్యానికి పశ్చాత్తాపపడ్డాడు. తీవ్రతాప సంతప్తమైన అతని మనస్సు పశ్చాత్తాపాగ్నిలో పడి ప్రాయశ్చిత్తం పొందినట్లయింది. "అయ్యో! మోహాంధకారంలో పడి, ఐశ్వర్య మద లోభంతో దుష్కార్యమనే పాపగర్తంలో బోర్లపడ్డాను. శ్రుతంకాని, ప్రజ్ఞగాని లేక దుష్టుల మంత్రాలోచన ప్రకారం నడచుకొనేవారి శరీరాన్ని చింత నిద్ర లేకుండా బాధపెడుతుంది. పతితుణ్ణి, పాపపంకంలో చిక్కుకున్నవాణ్ణి, తప్పు చేసినవాణ్ణి; నిరాధారుణ్ణి, ఇక నాకు జినసంస్మరణమే రక్ష" అని దీర్ఘంగా అతడు ఆలోచించి, సుగతుని సన్నిధికి వెళ్లి, తనను తాను నిందించుకుంటూ, సంకోచపడుతూ, సిగ్గు పడుతూ, తన పాపం భగవానునికి ఎక్కడ అంటుకుంటుదో అని దూరం నుంచే నమస్కారం చేశాడు. దుష్కృతాన్ని విదలించి వేస్తున్నాడా అన్నట్టు వణుకుతో, కన్నీళ్ల జాలువారగా, సర్వజ్ఞునితో ఇలా విన్నవించాడు. "భగవన్! నేను పాపం చేసినవాణ్ణి. నరకాగ్నిలో పడనున్నాను. కాలిపోతున్నాను. కనుక, కరుణాసింధువైన నిన్నే శరణు పొందాను. కొసల్లో ఎరుపై కమలకాంతిగల మీ పుణ్యదృష్టి నన్ను పాపహర అయిన గంగవలె స్పృశించనీ!"

ఈ విధంగా అజాతశత్రువు దీనాలాపాలు విని, తథాగతుడు అతని పాపరజస్సు పోగొట్టే పుణ్యసరస్వతితో (వాక్కుతో) ఇలా అన్నాడు: "రాజన్! నీ దుష్టకర్మతో నీవు ప్రేరితుడవై ఆలోచన మాని పితృవధమనే పాపసంకటంలో పడ్డావు. నీ తండ్రి దుఃఖం అనుభవించవలసి వుంది. నీవు పాపం పొందవలసివుంది. నీకు, ఆయనకు భవితవ్యత సమానమే. నియతి మనుష్యులకు తమ కంఠం నుంచే పుట్టి, తమ లలాటపై శిలాశాసనాల లాగ నిశ్చల. నీవు ఖలుల ప్రోత్సాహంతో కలుషం చేసి, సమీపించిన శ్రేయోమ్ము తాన్ని చేజేతులా పోగొట్టుకున్నావు. ఇప్పటికైనా పాపం పోగొట్టుకొని, సంపద పొందదలిస్తే పాపాన్ని శమింపజేసే పుణ్యంలో బుద్ధి వుంచు. అమృతమైన కుశల ప్రకారం దీపం వంటిది. అది సువృత్తమైన (బాగా పేనిన) వత్తితో సుఖం కలిగించి ప్రకాశింపజేసినట్టు అవ్వృతప్రకారం సువృత్తమైన(సద్వర్తనగల) సత్ప్రమాగమంతో కీర్తిని ప్రకాశింపజేస్తుంది. మానవుల పాపాలు పశ్చాత్తాపాగ్ని పాకంతోను, సాధుసంగమంతోను, సంకీర్తనం తోను, దానంతోను నశిస్తాయి. సత్సంగమం సుకృతభవనంలో అపూర్వదీపం. పాపం కడిగి పవిత్రం చేస్తుంది. గుణాన్ని తగ్గించదు. (దీపం గుణాన్ని - వృత్తిని - తగ్గిస్తుంది.) స్నేహాన్ని తగ్గించదు. పొగ రాజదు. (దీపం నూనెను తగ్గిస్తుంది, పొగ కలిగిస్తుంది) దోషావసానంలో మరింత ప్రకాశిస్తుంది. (దీపం దోషావసానంలో - రాత్రి గడిచిన తర్వాత - వెలవెల బారుతుంది) గాలికి కదలదు. ఖల సంగమం గుణవంతులకు విపత్తులు కలిగిస్తూ, ప్రజల కనులు గప్పి, అసమానమైన విషమ ఆయాసాలు కురిపిస్తూ, వెలుతురు తొలగించి, మహామోహంతో గాఢాంధకారం కలిగించే రాత్రిసమయం వంటిది. రాజా! నీవు క్రమంగా పాపం క్షీణించి, వివేకాలోకంతో ప్రత్యేకబుద్ధుడివవుతావు." ఇలా జినుడు అతనికి దయతో ఆశ్వాసనం కలిగించాడు. పతితుల పట్ల మహాత్ములు అత్యధికమైన కరుణ చూపుతారుగదా! పిదప అజాతశత్రువు సుగతునికి ప్రణామం చేసి, మహా పాపభారం చులకన అయినట్లు భావించి నగరానికి వెళ్లిపోయాడు.

అతడు వెళ్లిపోయిన తర్వాత, భిక్షువులు ప్రశ్నించగా, అజాతశత్రువు పూర్వగాథను సుగతుడు ఇలా తెలిపాడు.



పూర్వం వారాణసిలో నలుగురు శ్రేష్ఠితనయులు వుండేవారు. వారు విశృంఖలులై నిరాయాసంగా విలాసాలలో మునిగి వుండేవారు. వారొకమారు సుఖంతో ఒళ్లు పొగరెక్కి, పరస్పరం ఏవో వివాదాలు మాట్లాడుతూ దారిని వస్తున్న ఒక ప్రత్యేకబుద్ధుని చూచారు. అతనిని చూడగానే వారికి ద్వేషం కలిగింది. అతని శమ సంయమాలను నిందిస్తూ, వెక్కిరించారు. వారిలో జ్యేష్ఠుడు సుందరుడనేవాడు నవ్వుతూ, "ఈ బలిసిన భిక్షువును బాగా మద్యం తాగించి చంపివేయాలని నా ఆశ" అన్నాడు. రెండవవాడు కుందరుడనేవాడు "ఈ భిక్షువును నీటిలో పడేసి చంపుదామని వుంది" అన్నాడు. మూడవవాడు సందరకుడనేవాడు "ఈ భిక్షువును ఆ వీధిలోకి వేగంగా తోస్తే సరి" అన్నాడు. నాల్గవవాడు కందరకుడనే క్రూరమతి "ఈ భిక్షువు కాళ్ళను మంగలి కత్తితో చర్మం ఒలిస్తే సరి" అన్నాడు. ఇలా వారు కలుషమైన మనోరథంతో, జన్మాంతరంలో అలాటి ఫలమే పొందారు. లోభాంధుడు ధనాన్నే చూస్తాడు. క్రోధాంధుడు శత్రువును చూస్తాడు. కామాంధుడు కామినినే చూస్తాడు. దర్పాంధుడు దేనినీ చూడడు. ధనవికారంతో, మదించి యుక్తాయుక్తవివేకం సన్నగిల్లిన అనియతాత్ములకు ఇతరులను కష్టపెట్టడం వల్ల ఆనందం కలుగుతుంది. దర్పాంధులైన నరపశువులు అకారణంగా ఎగిరెగిరి పడుతారు. అకారణంగానే స్నేహం చూపుతారు. అకారణంగా దుఃఖిస్తారు. మోహాహతులై హితాహిత నిర్విచారులు కావడమనేది సహజం. జ్యేష్ఠుడు ఆ పాపంతోనే, మరొక జన్మలో శారిర్యానుడనే పేరుతో శాక్యుడై పుట్టి మద్యం విపరీతంగా సేవించి మరణించాడు. రెండవవాడు మహాన్ అనే **శాక్యుడుగా పుట్టి** నీటిలో పడి మృతి చెందాడు. మూడవవాడు తన పుత్రునితో మరణించిన ప్రసేనజిన్మహారా**జు. బింబిసారు**డుగా నాల్గవవాడు పుత్రునితో కారాగారంలో బంధించబడ్డాడు. చేసిన కర్మ సమృద్ధిగా అనుభవించాలి. మోహావృతులైన దుష్టులు నవ్వుతూ చేసే దుర్మార్గమైన పరిహాసఫలం కన్నీళ్లతో, మహాశోకంతో అనుభవిస్తారు.

విషం వంటి దుష్టకర్మవిపాకమైన బింబిసారుని పూర్వజన్మవృత్తాంతాన్ని సుగతుడు చెప్పగా విని భిక్షువులు సకల దుఃఖాలకు కారణం దూషితమైన చిత్తమేనని భావించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో అజాతశత్రుపితృద్రోహావదానమనే నలభైనాల్గవ పల్లవం

# 45. కృతజ్ఞావదానం

పద్మం దుష్టునిలాగ అంధకారం కళ్ళు గప్పినా, లక్ష్మీవిహారం లేని ప్రాంతంలో పడవేసినా, కష్టదశను గట్టెక్కినట్టుగా రాత్రిని గడిపి, మరల గుణాఢ్యమై తన కాంతిసంపదను పొందుతుంది.

సుగతుడు శ్రావస్తిలో జేతవనారామంలో విహరిస్తుండగా దేవదత్తుడు విద్వేష వ్యాధిపీడితుడై ఇలా ఆలోచించాడు. "నా భ్రాత నావంటివాడే. నాలాగే శాక్యవంశంలో పుట్టాడు. పుణ్యప్రభావంతో త్రిజగత్పూజ్యత్వం పొందాడు. అతని జీవితం అంతం చేయడానికి ప్రయత్నిస్తాను. సూర్యుడు అస్తమించనిదే మరొక వెలుగు వెలుగదుగదా! మానోన్నతమైన మనస్సు విజ్ఞానంతోగాని, అనుభవంతోగాని, విద్యతోగాని, తపస్సుతోగాని, సిరితోగాని, పరుల ప్రకర్షం సహించదు. గోళ్ళలో విషం వుంచుకుని, దగ్గరవుండి పాదాలు పిసుకుతూ, ఆ విషం దేహంలో ప్రాకేట్టు చేస్తాను." ఈ విధంగా విద్వేషవివశమైన ఖలబుద్ధితో ఆలోచించి తిష్యుడు మొదలయిన జ్ఞాతులతో ఇలా అన్నాడు. "నేను క్రూరుణ్ణి. సుగతునికి అపచారం చేశాను. కనుక యిప్పుడు ఆ సరళహృదయుని పాదాలపై పడి, ఘోరపాతకం పోవడానికి అనుగ్రహించమని కోరుతాను." పిదప వారంతా అనుమతించిగా, సుగతుణ్ణి దర్శించడానకి జేతవనం వెళ్ళాడు.

అక్కడికి వెళ్ళి, భగవానుని దర్శించగానే, "అయ్యో! మంటలు, చచ్చాను, మండిపోతున్నాను." అని గంతులు వేస్తూ కేకలు వేయసాగాడు. సుగతుణ్ణి హింసిద్దామనే సంకల్పపాపమే అతనిని పిడుగులాగ కొట్టగా, క్షణంలో సశరీరంగా ఆ నరకాగ్నిలో పడ్డాడు. భగవానుడు ఘోరనరకంలో పడిన అతనిని చూచి, భిక్షువులకు అతని సంకల్పం తెలుపగా వారాశ్చర్యపడ్డారు. భగవానుడు ఇలా అన్నాడు. "వీడు పాపదోషంలో క్లేశసంకటంలో పడ్డాడు. మలినమైన మనస్సు పూర్తిగా అంధకారం కలిగిస్తుంది" అని అంటూ పూర్వచరిత్ర ఇలా తెలిపాడు.

అతిఘోష అనే నగరంలో రతిసోముడనే రాజు వుండేవాడు. అతనికి కృతజ్ఞుడు, అకృతజ్ఞుడు అని ఇద్దరు కుమార్లు వుండేవారు. కృతజ్ఞుడు కృపాశాలి. కల్పవృక్షంవలె అర్థులకు తన రత్నాభరణ సముదాయాన్ని కూడా పిలిచి ఇచ్చేవాడు. "తండ్రి ఆస్తి ఉమ్మడిసొమ్ము" అని అంటూ అకృతజ్ఞుడు వాటిని అర్థులనుంచి లాక్కునేవాడు. ఇలా వుండగా మతిఘోషుడనే రాజు శ్లాఘ్యుడైన కృతజ్ఞునికి జనకల్యాణిక అనే తన కుమార్తెను వాగ్దత్తం చేశాడు. కృతజ్ఞుడు తాను స్వయంగా సంపాదించిందే అర్థులకు ఇద్దామనే సంకల్పంతో సముద్రాలపై వెళ్ళి రత్న రాసులు తేవడానికి ఓడ ఎక్కాడు. అకృతజ్ఞుడు కూడా అసూయతో అతని వెంటే వెళ్ళాడు. ఇతర వణిక్కులతోను నిండిన ఆ ఓడ గాలి అనుకూలంగా వున్నందున వారు కోరిన ద్వీపం చేరింది. వణిక్కులందరూ రత్నాలు నింపుకొన్న మీదట ఓడ స్వదేశానికి మరలింది.



కృతజ్ఞుడు యావత్పృథివీమూల్యం అనదగిన ఐదువందల రత్నాలను తన పంచలో మూటగట్టి బిగించి ముడివేసుకున్నాడు. కాని దురదృష్టవశాత్తు ఓడ, రత్నాలబరువు ఎక్కువై పెద్ద ఝంఝూవాతం వీనగా, దుష్టకర్మలతో ఐశ్వర్యం విరిగినట్టు విరిగింది. కృతజ్ఞుడు ఎట్లో ఓడ చెక్క పట్టుకొని, ప్రాణాలు దక్కించుకొని, దూరాన అకృతజ్ఞుడు మునిగిపోతుంటే చూచి దయతో తన వీపుపై ఎక్కించుకుని గట్టు చేరాడు. కాని, ఆ దుర్మార్గుని కంట కృతజ్ఞుని రత్నాలమూట పడింది. వాడు రత్నలోభంతోను, ద్వేషంతోను, భ్రాతృద్రోహం ఆలోచించాడు. కృతజ్ఞుడు అలసిపోయి పడుకొనివుండగా, కత్తితో కండ్లు పీకివేసి, రత్నాలమూట తీసుకొని వేగంగా వెళ్ళిపోయాడు.

రాహువు దివాకరుణ్ణి కప్పి అంధుణ్ణి చేసినట్లు ఆ దుష్టునిచేత కండ్లు కోల్పోయి గ్రుడ్డివాడయిన కృతజ్ఞుడు లోకోపకారం చేయలేననే దుఃఖంతో ఇలా ఆలోచించాడు. "ఇప్పుడు అర్థులకు ఇవ్వదలచిన ధనమూ, నా మనోరథమూ కూడ వ్యర్థమయాయి. వ్యర్థుణ్ణయిన నా గ్రుడ్డిజీవితం వల్ల ప్రయోజనమేమి? మనోరథసిద్ధి పొందక ప్రాణాలు పోకపోతే, కష్టాలు ఇబ్బంది పెడుతాయి. ధనం క్షీణించగా, జనులు ద్వేషవిహ్వాలులవుతారు" అని ఆలోచించి నెమ్మదిగా వెళ్ళుతూ వ్యాపారస్థులసంఘం దాటించగా తనకు కూతురును వాగ్దత్తం చేసిన మతిఘోష నరపతి పట్టణసమీపం చేరాడు.

ఆ నగరంలో ఒక గొల్లవాని యింటిలో కొంతకాలం వుండగా, ఉద్యాన విహారానికి వచ్చిన రాజకన్య అతనిని చూచింది. గ్రుడ్డివాడైనా స్పష్టమైన రాజలక్షణాలతో ఒప్పుతున్న అతనిపై పూర్వజన్మ ప్రేమబంధంతో ఆమెకు అభిలాష కలిగింది. పిదప తండ్రి శాసనంతో స్వయంవరం ఏర్పాటయినప్పుడు ఆమె మాన్యులైన రాజులందరి మధ్య కళ్ళులేని కబోది కృతజ్ఞుణ్ణి వరించింది. "రాజులందరినీ వదలి, పాపిష్ఠురాలై, గ్రుడ్డివాణ్ణి వరించేవు" అని తండ్రి కోపంతో తిట్టినా, ఆమె దుఃఖపడలేదు. అతనిని ఉద్యానంలోనే వుంచి, కష్టపడి భోజనం పంపి ఆదరం హెచ్చుగా ప్రణయంతో ప్రవర్తించేది.

ఒకమారు రాజకుమారి ఆలస్యంగా వచ్చింది. రాజకుమారుడు ఆకలితో బాధపడుతూ, ముఖం వాడిపోగా ఇలా అన్నాడు. "నీవు బాగా ఆలోచించక కేవలం చాపలంతో, విపులలోచనులైన భూపాలురను వదలి, గ్రుడ్డివాణ్ణయిన నన్ను వరించావు. తర్వాత పశ్చాత్తాపపడి నామీద ఆదరం పాతగిల్లింది కాబోలు! ఇప్పుడు ప్రేమతాండవం చూపదలచావు. గ్రుడ్డివాణ్ణి చూడలేక సురూపాలు చూడదలచి, నా ఆహారకాలం దాటినా, ఆలస్యంగా వచ్చావు." ఈ విధంగా రాజకుమారుడు పరుషంగా మాట్లాడగా, ఆమె తీవలాగ కంపిస్తూ, మధుకరఝుంకారంలాగ మధురంగా ఇలా అన్నది. "నాథా! నామీద ఊరికే కోపంతో నన్ను శంకించవద్దు. ప్రీతిపేశలమైన మనస్సు వాగ్బాణాఘాతం సహించదు. శుద్ధమానస అయిన నేను నిన్నే దేవతగా భావించే పక్షంలో, ఆ సత్యంతో నీ ఒక కన్ను చూపుతో విలసిల్లనీ!" సత్త్వశాలిని అయిన ఆమె ఈ విధంగా అనగానే, ఆతనికి ఒక కన్ను వచ్చింది; ఉత్ఫుల్లకమలం వలె విమలంగా వికసించింది. ఆమె సత్యప్రభావానికి మహాశ్చర్యపడి రాజకుమారుడు సత్యప్రమాణంపై ఉత్సాహంతో, "నా భ్రాత అకృతజ్ఞుడు నా రెండు కండ్లూ పీకి వేసినా, అతనిపై నాకు వైరంగాని, జుగుప్సగాని, అవమానభావం కలుగకపోవడమే నిజమైతే, నా రెండవకన్ను గూడ స్వచ్ఛం కానీ!" అని ప్రమాణం చేశాడు. వెంటనే రెడవకన్ను కూడ స్పష్టంగా మొలిచి కనబడసాగింది.

తర్వాత జనకల్యాణి తన తండ్రికి తన భర్త వృత్తాంతం వివరించింది. అపుడు మామగారు సంతోషపడి అతనిని ఆదరించాడు. అనంతరం లక్ష్మివలె వున్న కాంతతోపాటు రత్నగజవాజి సమూహంతో తనతండ్రి నగరానికి వెళ్ళి తండ్రిపాదాలకు మోకరిల్లి, యౌవరాజ్య పట్టాభిషిక్తుడై జనానురాగం పొందాడు. అకృతజ్ఞుడు సిగ్గులేక, శాఠ్యంతో వానిని చంపే ఆలోచనతో కాళ్ళపై పడడానికి వచ్చి, పిచ్చి ఎత్తినవానివలె "కాలిపోయాను, కాలిపోయాను" అంటూ నరకంలో పడ్డాడు. వాడే దేవదత్తుడు, కృతజ్ఞుణ్ని నేనే. జన్మాంతరానుబంధంతో వీనికి ద్వేషం పోకుండా వుంది.

ప్రచురాపకారకము, సంతాపకారి, జన్మాంతర పాప నిబద్ధమూ అయిన దేవదత్తుని చరితం సుగతుని నుంచి భిక్షుసంఘం విని, వ్యాకులత చెందింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కృతజ్ఞావదానమనే నలభైఐదవ పల్లవం

# 46. శాలిస్తంబావదానం

దానైకాగ్ర మనస్కులైన సత్త్వగుణశాలురకు ఉత్సాహవాన గుణభోగ సంపత్పవిత్రమూ, పురాకృతపుణ్య సంచయమయమూ అయిన కుశలమనే కల్పవృక్షం తగిన సమయంలో నిరంతరమూ ఫలిస్తుంది.

భగవానుడైన సుగతుడు శ్రావస్తిలో కోసలేంద్రుని ఉద్యానరాజంలో భిక్షుగణాలతో విహరిస్తూ, ఆదిమధ్యాంతకుశల కారణమూ, భవబాధలను పరాభవించే సాధనమూ అయిన సద్ధర్మం ఉపదేశిస్తూ ఉండగా, సాగరవాసి అయిన నాగరాజు పుత్రులు నలుగురు బలుడు, అతిబలుడు, శ్వాసుడు, మహాశ్వాసుడు అనేవారు అభిరతి అనే సోదరి ప్రోత్సాహంతో, త్రైలోక్యానికి కుశలకరమైన సుగతుని సద్ధర్మపరమామృతం వినడానికి మానుష రూపంతో వచ్చి, సుగతుని చరణసన్నిధిలో నతమస్తకులై పరిషత్తులో కూర్చున్నారు. మహామేధావి ఐన క్రకుచ్ఛంద మహర్షి, కణకుడనే కాశ్యపుడు పూర్వజన్మంలో అనుగ్రహించిన పుణ్యపరిపాకంతో నాగరాజకుమారులు సద్ధర్మ శ్రీసుఖాసక్తులై వచ్చారు. అప్పుడు కోసలేంద్రుడైన ప్రసేనజిత్తు కూడ లక్ష్మిమందస్మితం వంటి ఛత్రచామరాలను వద్దని, సద్ధర్మం వినడానికి వచ్చాడు. శాస్తపాదప్రణామం కోసం పరిషత్తులోకి ప్రవేశిస్తున్న అతనికి నరపతి అనే గౌరవంతో అంతా వంగి దారి యిచ్చారు. ఇతరులందరూ వర్ణాశ్రమ గురువైన నరపతికి గౌరవమివ్వగా, నాగరాజసుతులు దారి ఇవ్వలేదు; గౌరవం కూడ చూపలేదు. అవమానంతో రాజుకు కోపం వచ్చింది; కాని జినుని ఎడగల వినయంతో ఏమీ అనలేక లోలోపలే రాజుకుంది. వెంటనే అతడు తన పరిజనానికి తను వెళ్లగానే వారిని బంధించవలసిందని సైగ చేసి, నిర్వికారుడుగా కూర్చున్నాడు. సర్వజ్ఞుడైన భగవానుడు అతని నిశ్చయం గ్రహించి, ధర్మోపదేశానంతరం మందహాసంతో ఇలా అన్నాడు. "విద్వేషరజఃపూర్ణమై మలినమైన మనోదర్పణంలో ధర్మోపదేశం ప్రతిబింబించదు. సమతను అలవరచుకోక కోపమోహాహతులైనవారికి ఉపదేశం కొంచమైనా కుశలాంశం ప్రసాదించదు. దోషభూయిష్ఠమై, శుద్ధిహీనమైన శరీరంలో మందు పనిచేస్తుందా?" ఈ విధంగా యుక్తి యుక్తమైన హితం విన్నప్పటికీ ప్రసేనజిత్తు నాగకుమారులపై కోపం వదలలేదు.

రాజు భగవానునికి ప్రణమిల్లి నగరుకు బయలుదేరాడు. నాగకుమారులు రాజు సైనికులు వెళ్ళుతున్న దారిని ఆకాశంలో బయలు దేరారు. వారు తమ భవనం చేరి ఆలోచించుకొని, భూమి సంక్షోభాన్ని కలుగజేయదలచి ఘోరనిర్ఘాతమేఘాలతో లోకాన్ని ఆవరించేట్టు చేసి తిరిగివచ్చారు. వాని ఉద్యమాన్ని సర్వజ్ఞుడు గ్రహించి, క్షితిపతిని రక్షించగల మౌద్గల్యాయనుణ్ని పంపాడు. అంతట నాగగణాలు రాజుపై వదలిన వజ్రవృష్టి మౌద్గల్యాయనుని ప్రభావంతో పుష్పవృష్టిగా పరిణమించింది. వారు వదలిన శస్త్రాస్త్రవృష్టి దట్టంగా, దుస్సహంగా రాజుపై పడింది. అదీ మౌద్గల్యాయనుని సంకల్పంతో రాజార్హమైన భోజన పదార్థంగా మారింది. దానితో భోగిరాజకుమారులు భగ్నోత్సాహంతో మరలిపోగా, రాజు భయం తొలగి సుగతునికి నమస్కరించాడు. సుగతుని శాసనం వల్ల మౌద్గల్యాయనునికి సముచిత భోగసత్కారం

చేశాడు. మౌద్గల్యాయనుడు స్వర్గోచితమైన ప్రసేనజిత్తు విభవం చూచి కుతూహలంతో సర్వజ్ఞునికి అంజలి చేసి, "భగవన్, ఏపుణ్యంతో ప్రసేనజిత్తు సర్వభోగవిరాజితమైన ప్రాజ్యరాజ్యం సంపాదించాడు? ఇతని వరిమొక్క చెరకుగడలాగ ఉంటున్నది. దివ్యపానాన్న సంపత్తి ఏ కర్మఫలం?" అని ప్రశ్నించగా, భగవానుడు ఇలా అన్నాడు.

"పూర్వం ఈ కోసలదేశంలో ఖండుడనే గుడకర్షకుడు(బెల్లం తయారు చేసేవాడు) ఒక ప్రత్యేకబుద్ధునికి చెరకుపాలతో భోజనం సమర్పించాడు. ఆ ఇక్షురసాన్నం తిని ప్రత్యేకబుద్ధుడు వాతరోగార్తుడై తన పుణ్యవశాత్తు స్వస్థుడయ్యాడు. ప్రసేనజిన్మహారాజే ఆ గుడకర్శకుడు. ఆ పుణ్యప్రభావంతో భోగశాలి అయాడు. కృతజ్ఞులకు ఉపకారమూ, క్రూరమనస్కులకు నికారమూ? సాధువులకు సుకృతమూ, కొంచెమైనా కాలక్రమాన గొప్పవవుతాయి. మహాపతి పూర్వపుణ్యం, సుకృతోత్కర్షమైనది భగవానుడు తెలుపగా, భిక్షువులు ఆశ్చర్యంతో నిశ్చలులయారు.

తర్వాత ప్రసేనజిత్తు భక్తితో భగవానుని భిక్షకు ఆహ్వానించి, సురార్హమైన భోగసంపదను సమర్పించాడు. కాంచనాసనంలో కూర్చోబెట్టి వరోపచారాలతో అర్చించి, ఇలా విన్నవించాడు. "భగవన్, మీ ఎడల భక్తివల్ల సమృద్ధమైన సుకృత సంపదగల నాకు కుశలమూలచయం ఎడతెగకుండా బంధనమే అవుతుందా?" పూర్ణపుణ్యుడననే అభిమానంతో రాజు సవినయంగా ఇలా ప్రశ్నించగా, సుగతుడు స్మితప్రభలు సృజిస్తూ ఇలా అన్నాడు. "రాజా! ఈ సంసారమార్గం అనాదినిధనోద్భవం. కష్టాలు క్షీణించక సులభంగా దాటగలిగినదా? ఈ సంసారం చిరపరిచితమైన చక్రనేమిక్రమావర్తాలతో అంటూసొంటూ లేక సహజంగానే గహనమైంది. సులభంగా దాటగలిగినది కాదు. యోగాభ్యాసం లేక కర్మక్షయం కలుగదు. స్ఫుటఫల సంపదగల ధర్మం కూడ కర్మక్షయంతోనే ముడివడి వున్నది. భూరిదానంతో అన్ని విధాల అంతర్ముఖుణ్ణయిన నాకు కూడ అనేక జన్మలకు కారణమైన ధర్మసంసారం వుండేది" అని చెప్పి పూర్వగాథ ఇలా తెలిపాడు.

"పూర్వం వారాణసిలో ధనికుడనే మహాధనవంతుడుండేవాడు. అతడు అర్థులకు తాపం పోగొట్టే పండ్లు నిండిన ఛాయావృక్షంవంటివాడు. ఒకమారు దుర్భిక్షం ఏర్పడి లోకమంతా విషమక్లేశ విహ్వాలం కాగా, ఐదువందలమంది ప్రత్యేకబుద్ధులు అతనిని భోజనం అర్థించారు. ఆ అనల్ప సంపత్తిగల కోష్ఠాగారి దుర్భిక్షం తీరేవరకు వారికి వరభోగార్హమైన భోజనం ఏర్పాటు చేశాడు. ఈ ఐదువందలమందీ భోజనం చేస్తుండగా, మరి రెండు వేలమంది ప్రతేకబుద్ధులు వచ్చారు. వారు వచ్చిన పుణ్యవిశేషంతో దుర్భిక్షంలో దానం చేయడమనే పుణ్యంతోను అతనికి రత్నకోశం అక్షయమైంది. తర్వాత అతడు శాస్త ఉపదేశంతోను, ప్రణిధానంతోను, సనాతనమైన సుఖకరమైన, పుణ్యభోగ్యమైన సమ్యక్సంబోధిని పొందాడు. సంసారుల కర్మఫల ప్రవృత్తి పుణ్యపాపవేష్టితమైంది. ఇది సితాసితమైన బంధనరజ్జువు. . అది క్షయించడమే మోక్షపథమంటారు."

ఈ విధంగా జినుడు చెప్పిన మోక్షవిషయాన్ని రాజు మోహం వదలి విని, క్లేశక్షమమైనది శమమేనని తలచి, పుణ్యాభిమానం వదలిపెట్టాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శాలిస్తంబావదానమనే నలభై ఆరవ పల్లవం

# 47. సర్వార్థసిద్ధావదానం

స్వార్థప్రవృత్తిలో స్పృహ వదలి నిరంతరం పరోపకార పరతంత్రులైన వారికి సిద్ధి, వ్యసనాలచే లాగబడకుండా, కష్టాలకు భయపడకుండా, విఘ్నాల పీడ లేకుండా ప్రాప్తిస్తుంది.

జేతవనంలో భగవానుడు భిక్షువులకు ధర్మోపదేశం చేస్తూ, ప్రసంగవశాత్తు ఇలా పూర్వవృత్తాంత మొకటి తెలిపాడు.

పూర్వం అఖిలభూపాలమౌలిలాలితశాసనుడైన సిద్ధార్థుడనే సార్వభౌముడుండేవాడు. ఆ సుకృతవంతునికి జలధి నివాసి అయిన సాగరుడనే నాగరాజు పుత్రుడు సర్వార్థసిద్ధుడు కుమారుడుగా జన్మించాడు. అతడు సత్త్వోజ్జ్వలుడైన భాద్రకల్పికుడనే బోధిసత్త్వుడు; కనుక పుట్టగానే క్షితితలాన్ని తన మాహాత్మ్యంలో సమృద్ధంగా చేశాడు. ధర్మంవలె పెరుగుతున్న అతని కీర్తి సమస్త భువనాలను వ్యాపించి, విబుధులతో ప్రశంసలు పొందింది.

అతడొకమారు రథమెక్కి ఉద్యానవనానికి వెళ్లుతుండగా, ఒక వృద్ధుడు కనిపించాడు. అతడు ఆ దారిలో కనిపించాలని దేవతలు ముందుగానే ఏర్పాటు చేశారు. రాజకుమారుడు జరాజీర్ణుడైన ఆ వృద్ధుని చూచి, వైరాగ్యవాసనలు విరజిమ్మగా, ఈ శరీరం సంసారంవలె నిస్సారమైనదని గ్రహించాడు. ఉద్యానయాత్రనుంచి తిరిగివచ్చి, దారిద్ర్యంతో కాంతిహీనులైన దరిద్రులను దారిలో చూచాడు. సుఖరహితులైనవారిని చూచి కరుణావిష్టుడై "అహో! ప్రపంచంలో దరిద్రులు దుఃఖాన్ని సహిస్తూ అనుభవిస్తున్నారు. రత్నపూర్ణ అయిన ఈ పృథివిలో పరపిండోపజీవులైన వీరు నిర్విణ్ణులై ఆ దాన ప్రభవమైన దుఃఖాన్ని తెలుపుతున్నట్లున్నారు. దీనులైన వీరు మరొకరిని యాచించడమనేదే కలుషకర్మలకు తిరుగులేని చిహ్నం. అయ్యో! వీరి దుష్కర్మ! అడుగడుగునా పరాభవం పొందుతున్నా, యాచనలో విసుగెత్తినా, యాచించి కూడా ఆకలితోనే అలమటిస్తున్నారు" అని దీర్ఘంగా ఆలోచించి, విశ్వక్లేశాలను పోగొట్టి, ప్రపంచాన్ని దారిద్ర్య రహితంగా చేయాలని సంకల్పించి, రత్నాలు సంపాదించడం కోసం తండ్రి ఎంతో వారించాడు. కాని అతడు ఆగలేదు. ప్రవహణమెక్కి సముద్రయాత్రకు తరలినాడు. అతని వెంట మరికొందరు వర్తకులూ ఉన్నారు. రాజకుమారుడు వారిని చూచి రత్నద్వీపం చేరారు. "మీకు ఇష్టం వచ్చినన్ని మణులు సంగ్రహించుకోండి. ఈ సామాన్య రత్నాలవల్ల నాకేమీ ప్రయోజనం లేదు. మా కోశాగారంలో ఇంతకన్నా ఉజ్జ్వలమైన రత్నాలు ఎన్నో ఉన్నాయి. కాని చింతామణిని సంపాదించాలని నాప్రయత్నమంతా. దానితో భూవలయం నుంచి దారిద్ర్యాన్ని తరిమివేయాలని అనుకొంటున్నాను. మహోధధిలో సాగరుడనే రాజు వున్నాడని, ఆతని భవనంలో ఇష్టార్థాలిచ్చే మణి వున్నదని విన్నాను. విషమమార్గం దాటి దాన్ని సంపాదించడానికి వెళ్లుతాను. ధైర్యంగా సహాయంగా గల పరిశ్రమశీలురకు దుర్గమమైంది లేదు. నేను లేనుగదా అని మీకు కొంచెమైనా దుఃఖం వద్దు. ఎందుకంటే, ఈ నా ప్రయత్నం

పరార్థమే గనుక" అని వారినుంచి సెలవు తీసుకొని మహాధైర్యంతో, స్థిరనిశ్చయంతో బయలుదేరాడు.

ఇలా అతడు చీలమండలవరకూ నీళ్లున్న జంగమ మార్గంలో వారంపాటు, మోకాలిబంటినీటిలో వారంపాటు, పరుషమైన మార్గంలో మరొక వారంపాటు, మరి నల్లువారాలు పుష్కరిణీ జలాలలోను వెళ్లి చూపులతో విషం కక్కే ఘోరసర్పాలను చూచాడు. మైత్రీయుతమైన మనస్సుతో వాటిని విషరహితంగా చేసి, క్రూరమైన కోపంగల యక్షులున్న యక్షద్వీపం చేరాడు. వాటిని కూడా మైత్రీయుతమైన మనస్సుతో క్రోధరహితులనుగా చేశాడు. వారు అతని సత్త్వగుణానికి విస్మితులై విపులోత్సాహంతో, "కుమార! నీవు సమృద్ధమైన సత్త్వగుణంతోను, ఈ పరాక్రమంతోను నాగరాజ భవనం చేరి, కాలక్రమాన సమ్యక్సంబుద్ధుడివి, సర్వజ్ఞుడివి అవుతావు. మేము నీ అనుయాయులమై నీకు శ్రావకులమవుతాము" అని అన్నారు. వారు ప్రసన్నులై చెప్పిన మాటలు విని రాజకుమారుడు రాక్షసశ్రేష్ఠులు ఆవరించిన రాక్షసద్వీపం చేరాడు. అది ప్రవేశించడానికి అశక్యమైంది. అక్కడ కూడా తన మైత్రీమాహాత్మ్యంతో వారి క్రౌర్యవికారం పోగొట్టి, వారిని ప్రసన్నులను చేసుకొన్నాడు. వారు అతనిని సత్కరించి భుజాలు పట్టుకొని క్షణంలో నాగేంద్రుని భవనంలో దింపారు.

మహావైభవ విలసితమైన ఆ భవనంలో అతడు దివ్యోత్సాహ సుఖాలతో ఉండగా, దీర్ఘదుఃఖార్తి సూచకమైన రోదనధ్వని వినబడింది. దానిని విని సహజంగానే దయార్ద్రుడైన రాజకుమారుడు ముందున్న నాగకన్యకను "ఏమిటీ ఏడుపు?" అని ప్రశ్నించాడు. ఆ నాగకన్య శోకసంతప్తమైన నిట్టూర్పులతో బింబాధరదళకాంతులను వాడింపజేస్తూ, "ఆర్య! మా నాగరాజు జ్యేష్ఠపుత్రుడు, సర్వార్థసిద్ధుడనేవాడు మరణించాడు. అతడు కమలలోచనుడు, గుణవంతుడూను. అప్పటినుంచీ ఈ భవనంలో ఆనందం మాయమైంది. సుఖోత్సవాలన్నీ పోయాయి. ఈ పెద్ద ఏడుపుతో ఇక్కడ వుండలేపోతున్నాము" అని నివేదించింది. రాజకుమారుడు ఆమె మాట విని స్వదేశదర్శనం వల్ల కలిగిన అంతరంగంలోని పూర్వపరిచయంతో నాగరాజు వద్దకు వెళ్ళాడు. వస్తున్న అతనిని చూచి నాగరాజు భార్యతో పాటు అతణ్ణి గుర్తించి ఆనంద విహ్వలుడై "పుత్ర! ఇటు, ఇటు" అని ఆలింగనం చేసుకొన్నాడు.

పిదప రాజకుమారుడు తన మానవజన్మ గాథను, తాను వచ్చిన పనిని నాగరాజుకు తెలియజేశాడు. దానిని విని నాగరాజు సంతోషంతో, "కుమార! ఇదిగో చింతామణి నా శిరోభూషణం. నీ సంకల్పం వ్యర్థం కానివ్వదలచుకోలేదు. తీసుకో. కాని, జగత్కార్యం పూర్తి చేసిన పిదప తిరిగి నాకే యివ్వాలి" అని చెప్పి, తన శిరస్సు నుంచి ఆ రత్నం తీసి అప్పగించాడు. రాజకుమారుడు సూర్యునివలె వెలుగుతున్న ఆ చింతామణిని స్వీకరించి నాగేంద్రునికి నమస్కరించి తన ఓడవద్దకు తిరిగి వెళ్ళాడు.

కాని సముద్రదేవత అది సహించలేదు. అతని వద్దకు వచ్చి, చింతామణి సంపాదన కథను విని, "చింతామణి ఎలాటిది? చూడనివ్వు" అంటూ తీసుకొని సముద్రంలో పడవేసింది. కుమారుడు **ఎంతో** కష్టంతో సంపాదించిన చింతామణి సముద్రంలో పడిపోవడం చూచి, దృఢప్రయత్నం విఫలమైందనే **ఉద్వేగం** కలిగినా నిశ్చలుడై సముద్ర దేవతతో ఇలా అన్నాడు: "ఆహా! నీవు గుణాలకు తగిన రూపం గలదానివి. ప్రణయంతో తియ్యగా మాట్లాడుతూ, విద్వేషంతో కలుషమైన పనిచేసినా సిగ్గుపడకుండా వున్నావు. పరుల ఉత్కర్ష చూచి, కోపం, దుఃఖం, కష్టం పొందేవారికి ఈ చల్లని దిక్కులు మంటలు చుట్టుకున్నట్లు మండుతాయి. పరోత్సాహం ప్రియమైన సత్త్వగుణ సముద్రుని కీర్తి కర్పూరధవళమై త్రిలోకానికి



తిలకాయమానమౌతుంది. కనుక, దేవీ! నాకు నా రత్నం తెచ్చియివ్వు. ఈలాటి పాతకం చెయ్యవద్దు. సాధువుల పనులు అపవాదలతను అధిరోహించవు. లోభంతోనో, పొరపాటుతోనో, ద్వేషంతోనో రత్నం యివ్వకపోతే, నీకు ఆశ్రయమైన ఈ జలధిని వట్టిపోయేట్లు చేస్తాను." ఈ విధంగా అతడు పెక్కుసార్లు చెప్పినా సముద్రదేవత రత్నం ఇవ్వలేదు. అప్పుడు అతడు తన ప్రభావంతో సముద్రాన్ని శోషింప జేయడానికి పూనుకొన్నాడు. అతడు ధ్యానించగానే శక్రుని ఆజ్ఞతో విశ్వకర్మ అగస్త్యముఖుకాకారం వంటి పత్రాన్ని నిర్మించి పంపాడు. దానితో రాజకుమారుడు సముద్రజలాన్ని ఆకాశానికి వెదజల్లి శోషింపజేయసాగాడు. ఆ అద్భుతకారి ఈ విధంగా సముద్రాన్ని భూభాగ శేషం చేయగా, దేవతలందరూ సముద్రదేవతని నిందించారు. అప్పుడు భయపడిపోయి ఆమె చింతామణిని తెచ్చి రాజకుమారునికి సమర్పించింది. నిజానికి రత్నాలకాంతివలె నిర్వ్యాజమూ, సహసోదితమూ అయినది మహాత్ముల, మంత్రాల, తపస్సుల ప్రభావం. అది ఎవరు గ్రహిస్తారు? రత్నాకరం విస్తారమై అపారవారి వ్యాపారహేలా విలాసాల బలంతో, కల్లోలావళితో ఆకాశాన్నే అందుకుంటూ ఆశ్చర్యం కలిగిస్తుంది కదా! అలాటిదానిపై సత్పురుషులు బుద్బుదాలు తేలియాడుతాయంటే, వారి అప్రమేయ గంభీర మహిమాప్రభావంకదూ!

పిదప రాజకుమారుడు చింతామణిని గట్టిగా కొంగున కట్టుకుని, తన వెంట వచ్చిన సార్థవాహులను కలుసుకొని, పూర్ణమనోరథుడై తన నగరానికి చేరాడు. కుమారుడు కృతకృత్యుడై వచ్చినందుకు తండ్రి చాల సంతోషించి, మన్నన చేశాడు. తర్వాత రాజకుమారుడు ధ్వజాగ్రంలో చింతామణిని బంధించి, ప్రజలతో ఇలా అన్నాడు: "ఈ నా ప్రయత్నమంతా పరార్థం కోసమే అయితే, నా స్వార్థం కొంచెం కూడా లేకపోవడం నిజమైతే ఈ సత్యంతో ఈ లోకమంతా దారిద్ర్యరహితం కానీ." ఆ మాటలతో, ఆ రత్న కాంతులు దిక్కులకు వ్యాపించి వెలుగగా, ప్రజల దారిద్ర్యాంధకారం పటాపంచలైంది. అశాపాశవంతులు, ధనవంతుల యిండ్ల ముంగిళ్లను బలవంతంగా బిచ్చానికి ప్రవేశించేవారు, వారి వాకిళ్లలో దెబ్బలు తినేవారు, వాకిళ్లలో ప్రవేశించి భయపడి అటూయిటూ తిరిగేవారు, ద్వారంలోనే తిష్టవేసేవారు, దీర్ఘమైన నిట్టూర్పులు విడుస్తూ దుఃఖపడేవారు, దారిద్ర్యబాధ భరాయించలేక దేహత్యాగం చేయదలచినవారు, దీనులు, ఇతర దరిద్రులు ఆ చింతామణి కాంతులవలె శబలమైన లక్ష్మీకటాక్షంతో విలసిల్లినారు. లోకమంతా దైన్యమనేది తొలగిపోగా, అతని ఆజ్ఞతో చింతామణి మరల నాగరాజుకు చేరగా, దానరసికులైన వారి మనస్సు అర్థిక సమూహాలు లేవనే వ్యాకులత చెందింది.

సర్వార్థసిద్ధుడనే ఆ క్షితిపాల పుత్రుణ్ణి ముందుజన్మలో నేనే. జినుడు చెప్పిన ఈ ఇతివృత్తం విని భిక్షువులు తన్మయత్వం పొందారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సర్వార్థసిద్ధావదానమనే నలభైయేడవ పల్లవం

# 48. హస్తకావదానం

మత్తేభకుంభం వంటి ఉన్నత కుచాలతో మనోహరమైనవారు, మత్తేభాలనే ఉన్నతకుచాభిరామలు, కర్పూర హారంశు విలాసం వంటి హాసంతో అందమైనవారు, కర్పూరహారాంశు విలాసాలతో హసించేవీ, ప్రీతిని కలిగించేవారూ, ప్రీతిని కలిగించేవీ అయిన, ప్రౌఢయువతులు, ప్రౌఢసంపదలు పుణ్యవంతులకు లభిస్తారు ; లభిస్తాయి.

తథాగతుడు శ్రావస్తిలో వనచారిగా వున్నప్పుడు సుప్రబుద్ధుడనే గృహపతి వుండేవాడు. అతనికి హస్తకుడనే ప్రియపుత్రుడు, సాకారమైన పూర్వార్జిత పుణ్యసంచయం వంటివాడు కలిగాడు. అతడు పుట్టిన నాడే ప్రపంచంలోని ఆశ్చర్యమంతా ముద్ద చేశారా అన్నట్టుగా బంగారురంగుతో ఒక ఏనుగు పుట్టింది. ఆ గజేంద్రం, కుమారుడు తండ్రి మనోరథంతో పాటు, ప్రజల అత్యాశ్చర్యకౌతుకాలతో పాటు ఏకకాలంలోనే వృద్ధి పొందారు. ఆ కుమారుడు చంద్రునివలె సకాలానికి కళానిలయుడై సర్వలోక లోచనానంద బాంధవుడుగా వెలిగాడు. క్రమంగా యౌవనం అతనిని అలంకరించింది. ఆ యౌవనం నిండైన దీర్ఘభుజస్తంభాలతో ఒప్పే మనోభవారంభ భవనంగా అలరారింది.

ఆ కుమారుడు ఒకనాడు ఉద్యానవనం చూడడానికి వచ్చిన ప్రసేనజిన్మహారాజు కుమార్తె చీవరకన్యను చూచాడు. ఆమెకు సహజంగానే దేహంలో జన్మసిద్ధంగా చీవరం ఏర్పడినందున ఆమెకు చీవరకన్య అని పేరుపడింది. లావణ్యలలితానన, ఆయతలోచన, అక్లిష్టరూప, అపర్యుషిత కాంతిమతి అయిన ఆమెను చూచి, ఒకేమారు ఆశ్చర్యకామవశుడయాడు. మనసులో ఇలా అనుకున్నాడు:- "ఆహా! ఏమి ఈ అత్యద్భుత శరీరం! దానిలో నిష్కళంక విశదుడైన చంద్రుడు ముఖమనే సాకుతో వున్నాడు. అధరం బంధూకపుష్ప బంధువై మధురస్వభావం కలిగి, సరసమైన పగడాలకు, పల్లవాలకు ద్రోహం చేస్తూ, బింబఫలం విభ్రమాన్ని బలవంతాన వ్యర్థం చేస్తున్నది. ఈ తన్విది ఎంతటి లావణ్యం? అప్రతిమానమైనది గదా అది? ముఖమా చంద్రుని మదాన్ని సహించదు. కాంతి అమృతకాంతిని కష్టపెడుతుంది. చూపులు వికసించిన కలువవనం కాంతిని నిందిస్తున్నాయి. మన్మథసంగమోచిత దేహ అయిన ఈమె లీలావిలాసాలు రతికి సవతి భయం కలిగించి, రతివిలాసాలను శోషింపజేస్తున్నవని భావిస్తున్నాను. ఆమె గుండ్రటి పయోధరాలు దోషమయమైన ముఖంపై కనుబొమలసాకుతో భ్రమర రేఖ ముసరడం చూడగా, మునుల మనస్సే ముడుచుకొని పోతుందనుకొంటాను."

ఈ విధంగా ఆలోచిస్తూ నిలబడ్డ ఆ మన్మథాకారుణ్ని చూచి రాజకన్యకూడ ఆశ్చర్య **నిశ్చల** అయింది. మన్మథుడు ఆశ్చర్యం కలిగిస్తూ, ఆమెకు సిగ్గనే గుడ్డను తొలగించగా, గగుర్పొడిచిన **దేహం** స్పష్టంగా కనిపించింది. నూతనాభిలాష అక్కడే ఆపగా, సిగ్గు అడ్డుపడి మరలించగా, ఆమె **మనస్సును** అక్కడే పెట్టి శూన్యవలె నెమ్మదిగా వెళ్ళిపోయింది. రాజధానికి వచ్చిన పిదప లజ్జావిస్మయకామా**లతో** మీలితవలె, నిలీనవలె, ప్రోషితవలె వుండిపోయింది.



హస్తకుడు కూడ స్వభవనంలో మదనోద్వేగంతో ఆ ఇందుముఖినే సంకల్పాలతో పదేపదే చిత్రించుకున్నాడు. ఆమె చక్రవర్తి తనయ కనుక దుర్లభ అని తలచి, స్మరవిద్యా మానస సర్వస్వంగా ధ్యానించాడు. "జన్మాంతరంలో తపస్సు చేసినవాడే సుకృతవృక్షలతవంటి ఆమెను పొంది ధన్యుడవుతాడు. రమ్యమైన దానపుణ్యాలతో ఆమె దర్శనలాభం పొందుతాడు. ఆ పుణ్యాలు ఎవరివో, ఆ సంగమఫలం ఎవరికో నాకు తెలియదు. ఆమె ముఖతుషార కిరణ స్మరణోత్సవంచేత, దుర్లభ అనే విరహతాపం చేత, నాకు కలిగేది దేహధారణమో, విమోహమో, జీవించడమో, జీవితం వైదొలగడమో తెలియకుండా వున్నాను. ఆమె ముఖాబ్జానికి ఓడిపోయినందుననే చంద్రుడు నానాటికీ క్షీణిస్తున్నాడు. ఆమె కనుబొమలు విలాసానికి సిగ్గుపడి మన్మథుని ధనుస్సు వంగిపోయింది. చిగురుటాకు మృదుకాంతిగల ఆమె ఎర్రటి పెదవికి ఓడిపోయే కాబోలు బింబఫలం వనభూమిని పొందింది." ఈ విధంగా ఆలోచించి ఆలోచించి, అసూయతోనన్నట్టు నిద్రకూడ దరిచేరకపోగా, ఆ పూర్ణేందువదనా ధ్యాననిశ్చల సమాధిమగ్నుడయి రాత్రి గడిపాడు.

మరునాడు రాజకన్యను చూచిన వృత్తాంతం తండ్రికి తెలియజేశాడు. అది విని తండ్రి చింతాకులితుడై పుత్రునితో ఇలా అన్నాడు. "పుత్ర! మనం ఈ రాజు పౌరులం. ఆ చక్రవర్తి నీకు తన కుమార్తెను ఎలా ఇస్తాడు? మానధనులైన మనీషులు అశక్యమైన పనులకు పూనుకోరు; దుర్లభమైన దాన్ని ఆశించరు; అసంభావ్యమైన మాట పలుకరు. భృంగం సమీపంలో అందుబాటులో వున్న చూతచంపకవల్లులను నిరాదరించి, పారిజాతలతను కలలుగంటూ శుష్కిస్తుంది. నీకూ, ఆమెకూ సంబంధం ప్రాగ్జన్మవిహితమైతే, ప్రయత్నం లేకనే, చింత చేయకనే, ప్రయత్న భారంతో అలసిపోకనే, అన్నీ సమకూరుస్తుంది." తండ్రిమాట విని అలాగేనని అన్నప్పటికీ అతడు రాజకన్యాహృతమైన మనస్సును మళ్ళించలేకపోయాడు.

అతడు రాజును దర్శించదలచి కొత్తగా దర్శించేటప్పుడు ప్రీతియోగ్యమైన ఉపాయనం సమర్పించదలచి, హేమకుంజరం (బంగారు ఏనుగు) వద్దకు వెళ్ళి రెండుదంతాలూ ఇవ్వమన్నాడు. పుణ్యబంధంగల ఆ ఏనుగు రెండుదంతాలు ఇచ్చింది. వాటిని తీసుకొని ప్రసేనజిన్మహారాజు దర్శనానికి బయలుదేరాడు. ఆ రాజు రత్నరుచిరమైన భవనం ప్రవేశించి, అతనిని దర్శించి నమస్కరించి, రెండు బంగారు దంతాలూ సమర్పించాడు. రాజు అదివరకే అతని గుణాలు విన్నవాడు గనుక అనుగ్రహంతో అనుగ్రహించి ఎన్నో బహుమతులివ్వగా, వాటిని అతడు గ్రహించలేదు. రాజు అతనిని చాల గౌరవించాడు. నిజమే. ఔచిత్యచారుశీలంతో, దేనినీ ఆశించని వారిని ఎవరు ప్రీతితో చూడరు? అతడు ఎప్పుడు రాజును దర్శించినా ఎప్పటికప్పుడు కొత్తగా పుట్టే హేమగజదంతాలు సమర్పించేవాడు. అతడు చేస్తున్న సేవకు ప్రీతుడై రాజు మనఃప్రసాదానికి దూతివంటి వదనకాంతితో అతనితో ఇలా అన్నాడు. "నీవు ఇంతింత బంగారపు దంతాలు తెచ్చి చేస్తున్న సేవ నాకు బరువైపోతున్నది. సహించలేకపోతున్నాను. రాజులు పౌరవర్గాన్ని భరించాలి గాని, వారినుంచి ఇంతింతలేసి కానుకలు గ్రహించరాదు. తాము సంపాదించే దానిలో కొంత వేరు చేసిన ప్రజలు తెచ్చే బంగారంపై నా కేమిటి ప్రీతి? అనర్ఘగుణాలుగల నీ రూపమే నాకు ఇష్టం. సత్కరించదగిన పురుషరత్నాలపై లోభం వుండడం మంచిది. రాజుల కోశాగారాలలో హేమరత్నశిలలకు కొరతా? నీకు ఇష్టమైంది ఏమిటో చెప్పు; ఇస్తాను. నాకోశం నిశ్శేషంగా నీ కిచ్చినా నాకు సంతాపం కలుగదు. రాజుల చూపు పడగానే సంపదలు కలుగకపోతే అలాటి వ్యర్థమైన పార్థివసేవ కేవలం అనర్థమే. రాజు

మాటలకు గృహపతి కుమారుడు అంజలి ఘటించి, ఇలా మనవి చేశాడు. "భూపాల! నీవుకాక ఇచ్చేవాడు మరెవడు? విబుధులకు అడుగకనే రత్నాలు ఇస్తున్న నీవు సముద్రుని కీర్తి కట్టించావు. మహాప్రయత్నంతోను గొప్ప ఆశను పూరించకపోవడమనేది అల్పులు ఐశ్వర్యమున్నా చేస్తారు. అలా పూరించకపోవడం దారిద్ర్యంగా గొప్పవారు భావిస్తారు. నీ భుజరక్షితులై ధర్మమార్గంలో జీవిస్తున్న ప్రజలకు ధనం అన్వేషించి వలసిన దారిద్ర్యమేమీ లేదు. మేము ధనం కోరేవారం కాము. సేవాధికారం కోరేవారం కాము. ధనబుద్ధులకు ధనం ధనం అనే చింతేగాని, మానవంతులకు మానమే ధనం. పరమేశ్వరుని సేవించి ముకుళించిపోయి, స్థానంనుంచి కదిలి, కృపణపణ్యవీధికి దిగిన పూవులను సాధుజనుడు తాకనైనా తాకడు. దైన్యంతో ఆత్మ అవసన్నమైనా, అర్థిత్వం కన్నా మరణం మేలు. అర్థి అనేవాడు సర్వజనుల అవమానాలకు స్థానం. సత్కారయోగ్యమైన శవం. కడవ గుణంతో (పగ్గంతో-గుణంతో) బావిలోకి దిగుతుంది. కాని మోహతమస్సు ప్రవేశించి వివశమైన నీటిని యాచిస్తూ వ్రేలాడుతుంది. ధనసంపదలు సామాన్యమైనవి. బుద్ధిమంతులు వాటిని క్రయకృష్యాదులతో సంపాదించవచ్చు. సంతోషం లేకపోతే నిధానావృతమైన భూమి ఎందుకు? ఇక అతిశయమైన మనస్సంతోషం కలిగించే హేమరత్నాదులుండనే వున్నాయి. ప్రియసంగమం కోసం (ఇష్టప్రాప్తి కోసం) సేవ అనే పేరుతో ఒంటిని అమ్ముకోడం ఎవరికి ఇష్టం?" ఇలా అపారబుద్ధితో అతడు భాషించగా, రాజు ఆదరంతో "మరొకటి కోరుకో!" అని బలవంతపెట్టాడు. ఔచిత్యంతో చతురంగా మాట్లాడేవాడు కర్కశుడై ఏమీ కోరనివాడై వున్నా జనులకు ఇష్టమే. ప్రియంగా మాట్లాడేవాడైనా-ఇచ్చకాలు మాట్లాడేవాడయినా- కృపణుడై ఏదైనా కోరేవాడైతే వాని మాటలు చెవిపోటు పుట్టిస్తాయి. అతని ఔదార్యంతో పరితుష్టుడై రాజు మరల మరల అడుగగా, అంతగా నాపైన సంతృప్తి వుంటే, నీ కుమార్తెను అనుగ్రహించు" అన్నాడు. ఆ మాట వినగానే రాజు సందేహాందోళిత హృదయుడై "రేపు ఉదయం ఏ సంగతీ చెబుతాను" అని క్షణంసేపు నేలను చూచాడు.

రాజు తర్వాత గృహపతి కుమారుణ్ణి పంపివేసి, ప్రధానామాత్యుణ్ణి పిలిపించి, ఇలా అన్నాడు. "నేను ప్రసాద రభసంతో కొంచెం వాక్చాపలానికి గురి అయ్యాను. చక్రవర్తి కులోత్పన్న అయిన కన్య, పుణ్యపణోచితమైంది. ఎంతో పుణ్యంతోగాని లభించదు. అలాటిదాన్ని ఒకసామాన్యపౌరునికి గుణాలున్నంత మాత్రాన ఎలా ఇవ్వడం? మొదట యిస్తానని మాట యిచ్చిన తర్వాత పరితాపపడి, ఇంతటి సారధనుణ్ణయి అర్థిని నిష్ఫలంగా ఎలా పంపగలను? రేపు ఉదయం అతడు వస్తే ఎలా ముఖం చూపగలను? ఈ దుర్లభమైన వాంఛతో నాకెంతో ఇష్టమైనవాడు అనిష్టుడయ్యాడు. నిజమే. గుణసహితుడైనా "ఇవ్వు! అని అడగనంతవరకే ఎవరికైనా ఇష్టుడుగా వుంటాడు." దోలాందోలితహృదయుడై రాజు ఈ విధంగా మాట్లాడగా మహామాత్యుడు ఆలోచించి, సమయోచితంగా ఇలా అన్నాడు. "ప్రభువుల బుద్ధులు పరిణామాన్ని ఆలోచించవు. కొత్తకొత్తవాటిని ఆదరిస్తాయి. స్వభావంగా రభసంగా-దూకుడుగా- వుంటాయి. వాడు అశక్యవస్తువును కోరి లోభంతో రాజసేవాప్రసక్తుడై గుణవంతమైన బంగారు ఏనుగును చంపుకున్నాడు. కార్యార్థియై వాడు తిరిగి రేపు వచ్చినప్పుడు "నీవు హేమహస్తిని ఎక్కివస్తే నా కుమార్తెను పొందగలవు" అని చెప్పు, వాడు చేతులారా తన ఏనుగును కోసి, దాని దంతాలు మనకిచ్చాడు. ఇక ఎక్కడిది కనకగజం? కనుక అది లేనందున సిగ్గుతో మరి రాలేడు". ఈ విధంగా ప్రధానామాత్యుడు చెప్పిన యుక్తితో రాజు మరుసటినాడు వచ్చిన గృహపతి కుమారునికి ఆ మాటలే చెప్పాడు.



కుమారుడు ఇంటికి తిరిగివెళ్ళిన వివాహోచిత మంగళాలతో పరిజనం వెంటరాగా, బంగారు ఏనుగు నెక్కి రాచనగరుకు వచ్చాడు. వస్తున్న అతనిని రాజు చూచి, అత్యాశ్చర్యకరమైన ఐశ్వర్యం చూచి అతడు పుణ్యవంతులలో పుణ్యవంతుడని అనుకున్నాడు. పిదప తను కూడ కౌతుకంతో ఆ స్వర్ణమతంగజాన్ని ఇంద్రుడు సుమేరుపర్వతం అధిరోహించినట్లు అధిరోహించాడు. రాజు ఎక్కినప్పుడు ఆ ఏనుగు ముందుకు కదలలేదు. గృహపతికుమారుడు ఎక్కి కూర్చోగానే, ముందుకు సాగింది. ఆ ప్రభావంతో రాజు విస్మితుడై అతడు దేవాంశుడేగాని, మరొకడు కాడని నిశ్చయించి, ధన్యుణ్ణయానని సంతృప్తితో స్మరలక్ష్మివంటి తన కన్యను ఇచ్చి పెండ్లి చేశాడు. రాజు కన్యారత్నంతో ఆ పురుషోత్తముణ్ణి అర్చించి, హర్షోత్సవంతో సుధా సముద్రంవలె ప్రకాశించాడు.

పిదప గృహపతికుమారుడు భార్యతో స్వగృహానికి వెళ్ళగా, మన్మథుడు విల్లు ఎక్కుపెట్టిన శ్రమ ఫలించింది. భోగార్హమైన నవ వయస్సులో, నవకాంతా సమాగమంలో అతనికి ఎల్లప్పుడూ నవనవోత్సవమే అయింది.

ఇలా ఉండగా ఒకానొకప్పుడు ప్రసేనజిత్తు తన అల్లుని పుణ్యప్రభావం చూచి ఇలా ఆలోచించాడు. "ఆహా! ఈ కుమారుడి ప్రభావం దివ్యమైందిగా కనిపిస్తుంది. సామాన్య పుణ్యాల పరిపాకం కాదిది. లక్ష్మికి నివాసమైన కులం, చంద్రుని మదమణచే రూపలహరి, సుఖానుభవయోగ్యమైన వయస్సు, భూషణప్రాయాలైన గుణాలు, పుణ్యోద్యానంలో పూచిన పూలవంటి యశస్సు- ఇవన్నీ ఏకుశలపరిణామ విభవమో?" ఈ విధంగా ఆలోచించి, కుతూహలంతో సర్వజ్ఞుడైన సుగతుని దర్శించి తెలుసుకుందామని నిశ్చయించి, అల్లుడు, కుమార్తె, మంత్రులు వెంటరాగా భగవానుని సన్నిధికి వెళ్లాడు. జేతవనం కనిపించగానే నరపతి వాహనం నుంచి దిగి, నడిచి వెళ్ళి భగవానుని దర్శించాడు. అతనికి పాదవందనం చేసి, కుమార్తెను, జామాతను పేరు చెప్పి పరిచయం చేశాడు. అందరూ ప్రణామాలు చేసి, నతమస్తకులై కూర్చోగా, రాజు కృతాంజలి అయి సర్వజ్ఞుణ్ణి ఇలా ప్రశ్నించాడు. "శ్రీమంతులలో శ్రేష్ఠుడైన, గుణగణోపేతుడైన ఈ కుమారుడు హేమగజమెక్కి వచ్చాడు. ఏ పూర్వజన్మ సుకర్మ దీనికి కారణం? నా కుమార్తె అయిన ఈ చీవరకన్య ఏ పుణ్యప్రభావం వల్ల ఇతనికి భార్య అయింది?"

ఈ విధంగా ప్రశ్నించగా, సర్వవేత్త అయిన సుగతుడు "భూపతీ! మానవులకు ఐశ్వర్యాలు పూర్వజన్మ పుణ్యంతో కలుగుతాయి. ప్రపంచంలో ఉదారంగాను, ఉచితంగాను, ప్రకాశించేదిగాను, అద్భుతంగాను, స్పృహణీయంగాను ఉండేదంతా పుణ్యసముద్భవమే. పూర్వం విపశ్యి అనే సుగతుడు ప్రజలపై కృపతో బంధుమంతుడనే రాజు పట్టణంలో విహరించాడు. అప్పుడొకచోట ఒక బాలుడు ఒక బాలిక కర్ర ఏనుగుతో ఆడుకుంటూ, ఆ దారిని వస్తున్న విపశ్యిని చూచారు. అతడు కాచిన బంగారురంగు దేహకాంతితో, కరుణాస్నిగ్ధమైన ఫుల్లపద్మదళాకారలోచనాలతో వెలిగిపోతున్నాడు. వారిద్దరూ భక్తిరసంతో ముఖాలు రంజిల్లగా, ఆట ఏనుగును అతనికి సమర్పించి చేతులు కట్టుకుని నిలబడ్డారు. భగవానుడు వారి మనోరథం గ్రహించి ఆ కర్ర ఏనుగు కాళ్ళను దయతో తాకాడు. వారిని సమ్యక్చిత్తప్రసాద దృష్టితో చూచాడు. ఆ బాలబాలికలిద్దరూ "ఇద్దరం పెళ్లాడాలి" అని పరస్పరం ప్రణిధానం చేశారు. "కులప్రభావ విభవాలతో నాకు ఉచితమైన జన్మ కలుగునీ! నాకు బంగురు ఏనుగు వాహనం కాని" అని వాంఛ కలిగింది. భగవానుని శరీరంపైని సుందర చీవరాలను చూచి ఆ బాలిక "నాకు పుట్టుకతోనే శరీరంపై

చీవరాలు కలగాలి" అని భావించుకొంది. ఆ ప్రణిధానంతోనే ఆ బాలుడిప్పుడు హస్తక కుమారుడుగా జన్మించాడు. ఈ చీవరకన్య కూడా దేహంతోనే సహజంగా పుట్టిన చీవరం కలదిగా జన్మించింది."

సుగతుడు చెప్పిన ఈ వృత్తాంతం ఆశ్చర్యంతో విని రాజు ముకుటతటంతో ఆయన పాదాలు తాకి నగరానికి వెళ్ళిపోయాడు. రాజు వెళ్ళి పోయిన పిదప కుమారుడు పరిశుద్ధ మనస్సుతో భగవానుడు ప్రవచించే ధర్మాన్ని విన్నాడు. తర్వాత ఆ దంపతులు వైరాగ్యం కలిగి సంసారవాసనలు క్షీణించగా, ప్రవ్రజ్యతో క్లేశాలు పోగొట్టుకొని శుద్ధమైన బోధిని పొందారు.

కుశలభాజనులైన మానవులను వితతసుకృత పుణ్యయోగం వల్ల ధర్మార్థకామసంపద సిద్ధిస్తుంది. వారు అభిమతమైన తత్ఫలం అనుభవించి, అంతంలో ఘనరహితమైన గగనకాంతిగల శాంతిని పొందుతారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో హస్తకావదానమనే నలభైనిమిదవ పల్లవం

# 50. దశకర్మప్లుత్యవదానం

లీలగా వెల్లివిరిసే తమ ప్రభావంతో అద్భుత పరంపరలు సృష్టించేవారూ, సత్త్వోత్సాహాలకు పుట్టినిల్లయినవారూ, తమ సహజ విమల విజ్ఞానంతో ప్రకాశించే మనస్సు కలవారూ అయినా, సముద్రాలు కుటిలమైన వేలను దాటనట్టే, కుటిలమూ, కర్మావళీ సంయుక్తమూ అయిన విధాతృనృపతి వ్రాసిన వ్రాతల మీరలేరు. చిత్రం కదూ!

శ్రావస్తీ నగరంలో ఇతరుల ప్రేరణం వల్ల తమ దుశ్చరితాలతో బుద్ధభగవానుని కీర్తికి కళంకం ఆపాదించడానికి పూనుకున్న తీర్థకుల స్త్రీలు నిట్టనిలువునా నరకంలో పడిపోయారు.

పిదప కొంతకాలానికి బుద్ధుడు అనవతప్తమనే సరోవరంలో విశ్రమించాడు. ఆ సరోవరం పుణ్యనదుల విమల జలాలతో నిండినది; రత్న సోపానాలతో ప్రకాశించేది. ఆ సరోవరంలోని బంగారు తామరల పుప్పొడితో కనులు మబ్బుకప్పి తుమ్మెదలు ఝుంకారాలు చేసేవి.

ఆ సరోవరంలో భగవానుడొకనాడు రత్నపద్మాసీనుడై భిక్షుసంఘ పరివృతుడై, సర్వజ్ఞుడు గనుక కర్మతంత్రం అవిలంఘ్యమన్న విషయం ఉపన్యసిస్తూ, తన కర్మప్లుతి వైచిత్ర్యం వివరింపదొడగినాడు. ఆ సమయంలో భక్తవత్సలుడైన ఆయన శారిపుత్రుడు అక్కడ లేకపోవడం చూచి అతనిని పిలుచుకొని రమ్మని మౌద్గల్యాయనుని ఆజ్ఞాపించాడు.

అప్పుడు శారిపుత్రుడు గృధ్రకూటాచలాశ్రమంలో సూదిలో దారం కూర్చి బొంత కుడుతున్నాడు. మౌద్గల్యాయనుడు ఐదువేళ్లతోను కుట్టగలడు గనుక ఆలస్యమౌతుందని శారిపుత్రుని బొంతను తనే త్వరగా కుట్టివేసి, "శారిపుత్ర! త్వరగా రా. భగవానుడు అనవతప్త సరోవరంలో భిక్షువులకు కర్మోపదేశం చేస్తున్నారు. నీ పనే చూచుకొంటూ ఆలస్యం చేశావంటే నా ప్రభావంతో నిన్ను ఉన్నదున్నట్టు తీసుకొని వెళ్ళుతాను. నా బలం చూసుకో" అన్నాడు. శారిపుత్రుడు ఆ మాట విని, నేనున్న కొండను తీసుకువెళ్లు. అప్పుడు నీ బలమేమిటో నాకు తెలుస్తుంది" అని తన శరీరాన్ని గృధ్రకూటాచల శిఖరానికి గట్టిగా కట్టివేసుకున్నాడు. మౌద్గల్యాయనుడు సరేనంటూ ఆ పర్వత శిఖరాన్ని పట్టుకొని లాగాడు; పర్వతం పర్వతమే వణికింది. పర్వతం ఎక్కడ కూలిపోతుందో అని భయపడి శారిపుత్రుడు తన ప్రభావంతో దానిని మేరుపర్వతానికి కట్టివేశాడు. మౌద్గల్యాయనుడు దానిని కూడా పట్టి లాగాడు. శారిపుత్రుడు ఆ మేరువును బుద్ధ భగవానుడు ఆసీనుడైన బంగారు తామరపూవు రత్నాలతూడుకు కట్టివేశాడు. అప్పుడది ఇతరులు కదిలించడానికి సాధ్యం కాకపోయింది. ప్రభావప్రదర్శనంలో శారిపుత్రునికి ఓడిపోయిన మౌద్గల్యాయనుడు భగవాను సన్నిధి చేరాడు. అంతకుముందే శారిపుత్రుడూ వచ్చి చేరాడు. వీరిద్దరి మాహాత్మ్య స్పర్ధలో క్షోభించిపోయిన నందోపనందకులనే నాగసర్పాలు భయంతో

పాతాళం నుంచి వెడలివచ్చి భగవానునికి నమస్కరించాయి. విజయి అయిన శారిపుత్రుని ప్రభావానికి కారణ మేమిటని భిక్షువులడుగగా, జ్ఞానలోచనుడైన భగవానుడు ఇలా చెప్పాడు:

"పూర్వం వారాణసిలో శంఖలిఖితులనే ఋషులుండేవారు. వారికి వర్షం కురుస్తుందని, కురవదని వివాదం జరిగి సంఘర్షణ ఏర్పడింది. ఒకమారు శంఖుని పాదాలు లిఖితుని జటాజూటానికి తగిలాయి. అతడు మహాక్రోధంతో "సూర్యదయం కాగానే నీ తల పగలనీ!" అని శంఖునికి శాపమిచ్చాడు. శంఖుడన్నాడు గదా "నా మాట నిజమయితే సూర్యోదయమే కాదు" అని. శంఖుని శాపం వల్ల జగత్తు అంధకార బంధురమయింది. తర్వాత లిఖితుడు మట్టితో శంఖుని శిరస్సు చేసి వంద వ్రయ్యలు చేశాడు. అప్పుడు సూర్యోదయమైంది. ఆ శంఖుడే మౌద్గల్యాయనుడుగాను, వానిని జయించిన లిఖితుడు శారిపుత్రుడుగాను జన్మాంతరంలో పుట్టారు."

సర్వజ్ఞుడు వారిరువురి ప్రాక్తన వృత్తాంతం తెలుపగా, అక్కడ చేరిన భిక్షువులు కర్మతంత్ర వైచిత్ర్యాన్ని గురించి మరల ప్రశ్నించారు ఈ విధంగా: "భగవన్! కర్మలనుంచి మోసులెత్తిన ఈ అద్భుతమేమిటి? జ్ఞానమయులైన మీ శరీరాన్ని అది స్పృశిస్తున్నదే? రాయి ఎడువుకొని మీ కాలి బొటనవ్రేలు పుండు కావడమేమిటి? తుమ్మముల్లు తొక్కి మీ పాదం రక్తం చిందడమేమిటి? భిక్షను పొందక శూన్యపాత్రంతో ఎందుకు తిరిగి రావలసివచ్చింది? ఆ సుందరి అయిన సన్యాసిని మీ పైన అపవాదం వేయడమేమిటి? వంచా అనే వేశ్య ఎందుకు నేరం మోపింది? మీరెందుకు కొర్రలు, యవలు భుజించవలసివచ్చింది? ఆరు సంవత్సరాలు మీరు దుష్కర కర్మ ఎందుకు చేయవలసివచ్చింది? మీ దేహానికి ప్రస్కందివ్యాధి ఎందుకు తగిలింది? శాక్యకులక్షయం కలుగగా మీకు తలనొప్పి ఎందుకు పుట్టింది? మీ దివ్య తనువుకు వాయుశూలవల్ల అలసట ఎందుకు కలిగింది?"

ఈ విధంగా వారు ప్రశ్నించగా, భగవానుడు మందహాసంతో ఈ విధంగా అన్నాడు. "కర్మతంతువు అనవచ్ఛిన్నమైంది. దాని వైచిత్ర్యం వినండి. కర్మబంధాలు సంసిద్ధులుగా ఉన్న ఉత్తమ భృత్యులవలె మనం వెళ్లుతూవుంటే వెంట వస్తాయి. నిలబడితే ముందు వచ్చి నిలబడుతాయి. గహనమైన అరణ్యాలలో చొరబడుతాయి. దిక్కులలో సంచరిస్తాయి. సముద్రాన్ని దాటుతాయి. పర్వతేంద్రాలను ఎక్కుతాయి. ఇంద్రలోకాన్ని ఆక్రమించుకొని ముందుకు సాగుతాయి. లోకవిషయంకాని పాతాళాన్ని ప్రవేశిస్తాయి. కాలతరంగాలకువలె వీటికి జనులను వెన్నాడడంలో అడ్డము ఆక ఏమీ లేదు. కర్మలత అతి దీర్ఘమైనది. పాత పండ్లతో ఎప్పుడూ నిత్య నూతనంగా కనిపిస్తూ, ఆశ్చర్యం కొలుపుతూ మనను వెన్నాడుతూ నిశ్చలంగా మనతోనే ఉంటుంది. లాగితే చుట్టుకుంటుంది. కుశల కర్మలతో దానిని విడదీసి చీల్చి, కత్తిరించి, ముక్కలుముక్కలు చేసి రాచినా నశించదు. సుందరుడైన చంద్రుడు దేహంలో కళంకమనే దోషం ధరించడమూ, క్రూరాకారమైన కృష్ణసర్పం మిరిమిట్లు గొలిపే మణిని ధరించడమూ ప్రాణుల చిత్రచరిత్రాన్ని నానారూపాలతో ప్రపంచానికి తెలియజేసే కర్మసూత్రం వల్లనే. ఈ కర్మసూత్రం చిత్రవిచిత్రమైన పరిణామం గలది." పిదప సర్వజ్ఞుడు కర్మసంతానం ప్రపంచిస్తూ పూర్వ చరితం చెప్పసాగినాడు.

పూర్వం కర్వటమనే నగరంలో ఖర్వటుడనే గృహపతి ఉండేవాడు. అతనికి అప్రమేయంగా ధనం ఉండేది. భార్యలు, పిల్లలూ పలువురు ఉండేవారు. అతనికి సవతి తమ్ముడొకడుండేవాడు. వాని పేరు ముగ్ధుడు. వాడింకా పసివాడు కావడం వల్ల ఖర్వటుడు అతనిని వాత్సల్యంతో కాపాడేవాడు.



ఆ గృహపతి భార్యలలో కాలిక అనే ఆమె అతనికి చాల ప్రియమైనది. ఆమె చాల కుటిలబుద్ధి గలది. ఒకనాడు అతనితో గృహవ్యవహారాలు మాట్లడుతున్న సందర్భంలో ఇలా అన్నది. "ఆర్యపుత్రా, మీరు చాల సరళస్వభావం కలవారు. కనుకనే పొరపాటు చేస్తున్నారు. సహోదరుడుకాని తమ్ముణ్ణి వ్యామోహంతో ఇంట్లో పెట్టుకొని విషవృక్షంవలె పెంచుతున్నారు. అతడేమో ఒంటరి. వ్యయం లేనివాడు. మీరు బహుపుత్రవంతులు. వ్యయభారం హెచ్చుగా గలవారు. కనుక, అతడు అవిభక్తమైన మీ ఆస్తినుంచి అర్థభాగాన్ని చట్టం ప్రకారమే పుచ్చుకొంటాడు. ఘోరవ్యాధికి వధమే ప్రధానౌషధమన్నట్లు వీనికి కూడా వధించడమే మందు. బంధునాశం కన్నా ధననాశం మానవులకు దుస్సహమైనది. గంభీరమైన ఆయవ్యయాలున్న పెద్ద సంసారులకు ఆపదలు రావడం ఏనుగు పడిపోవడం వంటిది."

ఖర్వటుడు ఆమె క్రూరమైన మాటలకు మనస్సు విచలితమైపోగా, ప్రేమపాశానికి వశుడై ఆమెతో ప్రణయంతో ఇలా అన్నాడు. "ప్రియే! నీవు చెప్పినది హితవే. కాని, వధించడం మహాపాతకం. బాహిరమైన ధనం కోసం ఎవరు సహజమైన అంగాన్ని నరుక్కుంటాడు? ధనసంపాదన సమర్థులైనవారికి ధనం కోసం పాపచింత చేయడం తగదు. క్షణంలో డబ్బులు కూడతాయి. ఎంత కాపాడినా క్షణంలో నశించిపోతాయి. కర్మతరంగాల సంరంభ సంక్షోభంతో సంపదలు కొండవాగులవలె గలగలలాడుతూ పోతాయి. ఎవరు వారించగలరు? కనుక, భ్రాతృద్రోహానికి నా మనస్సు ఒప్పడం లేదు. విత్తనాశమైతే, మరొక బ్రతుకుతెరువుంది. వృత్తనాశమైతే గతి ఏమిటి?"

ఆ గృహపతి ఈ విధంగా అన్నప్పటికీ కాలిక పెక్కుయుక్తులు. **నిదర్శనాలు** చూపి నెమ్మదిగా తన భర్త మనస్సును పాతకాభిముఖంగా చేసింది. ఎంతో స్నేహంతో శిరోరుహాలను పెంచినట్లు పెంచిన సోదరులను క్రూరులైన స్త్రీలు క్షురధారలవలె వెంటనే ఛేదించివేస్తారు. వక్రమైన యువతి, వక్రమైన మతి మోహావిష్టులను క్రూరమైన పనులలో ప్రవర్తింపజేయంలో పట్టుదల చూపుతుంది. పాపిష్ఠమై పతితులను చేస్తుంది. సిరికి లొంగిపోయినవారికి వినతి (వినయం), స్త్రీలకు లొంగిపోయినవారికి మతి ఎక్కడిది? ఇరువురూ బంధుమిత్రులకు దూరమౌతారు. స్వసుఖంతో మనుష్యులను మొద్దు బారజేసుకొంటారు. పిదప ఆ గృహపతి పూలు కోసుకొని వద్దామనే సాకుతో తన సవతితమ్ముని విజనమైన వనానికి పిలుచుకొని వెళ్లి అతని కూయిని ఎవ్వరూ వినకుండా బండరాతితో కొట్టి చంపివేశాడు.

ఆ గృహపతిని నేనే. పూర్వజన్మలలో ఆ పాపం అనుభవించాను; ఇంకా అనుభవిస్తూనే ఉన్నాను. దాని శేషమే బొటనవ్రేలికి రాయి తగిలి పుండు కావడం.

పూర్వం అర్థదత్తాఖ్యుడనే వ్యాపారి ఉండేవాడు. అతడు రత్న ద్వీపానికి ఓడలో వెళ్లి ఓడనిండా సరుకులు వేసుకొని, గాలివాటు అనుకూలంగా ఉండడం వల్ల రత్నద్వీపం నుంచి స్వదేశానికి బయలు దేరాడు. రెండవ వ్యాపారి తన సరకులన్నీ పోగొట్టుకొని, నష్టపడి అర్థదత్తుని ఆశ్రయించి అతని ఓడ ఎక్కాడు. కాని అతనికి మనసులో ద్వేషం, అసూయ రగులుతున్నాయి. కనుక ప్రచ్ఛన్నంగా ఓడకు చిల్లువేయడం ప్రారంభించాడు. అర్థదత్తుడది చూచి పెక్కుసార్లు అతనిని నివారించాడు. అయినా, ద్వేషాంధుడైన ఆ బేహారి తన పాప ప్రయత్నం మానుకోలేదు. అది చూచి అర్థదత్తుడు కోపంతో ఆ మాత్సర్య మోహితుణ్ణి గట్టిగా కొట్టాడు. అతడు ప్రాణాలు కోల్పోయాడు.

ఆ అర్థదత్తుణ్ణి నేనే. ఇతర జన్మలలో ఆ బెహారి హత్యాపాపం అనుభవించాను. అది ఇంకా శేషించింది. ఆ శేషమే కాలికి తుమ్మముల్లు గుచ్చుకొని దెబ్బతగలడం.

పూర్వం ఉపారిష్టుడనే ప్రత్యేకబుద్ధుడు, దయార్ద్ర బుద్ధి ఉండేవాడు. ఆయన ఒకనాడు భిక్షాపాత్ర చేతబట్టుకొని, భిక్షకోసం కామనగరానికి వచ్చాడు. త్వరలోనే అతని భిక్షాపాత్ర నిండిపోయింది. అది చూచి చపలకుడనే యువకుడొకడు ద్వేషకలుషితబుద్ధితో ఆ సంపూర్ణ భిక్షాపాత్రను చేతితో కొట్టి కింద పడవేశాడు.

ఆ చపలుణ్ణి నేనే. ఆ ప్రత్యేకబుద్ధుని నోటిదగ్గరి తిండిని పడగొట్టిన పాపఫలాన్ని పెక్కు జన్మలలో అనుభవించినా, ఇంకా మిగిలి ఉండడం వల్ల శూన్యమైన భిక్షాపాత్ర కలవాణ్ణి అయాను.

పూర్వం వశిష్ఠుడనేవాడు ఉండేవాడు. వాడు చిత్తప్రసాదం కలవాడు. అందువల్ల అర్హత్వం పొందాడు. అతనికి ప్రజలే ప్రశమారామంలో విహారం నిర్మించారు. అతడక్కడ నివసించేవాడు. అతని తమ్ముడు భారద్వాజుడనే సన్యాసి ప్రజలలో కలిగిన ఈ సంస్కారానికి ద్వేషాగ్నితప్తుడైనాడు. అల్పుడు గుణవంతులకు కలిగే సమ్మానంచూచి, తన గుణాలను అభివృద్ధి చేసుకొనడానికి మారు ఆ సమ్మానాన్ని ధ్వంసం చేయడానికి పూనుకుంటాడు. వశిష్ఠుడు తనకు భక్తజనం అర్పించిన విలువైన వస్త్రయుగళాన్ని సరళ హృదయంతో, ప్రీతితో భారద్వాజునికిచ్చాడు. అది తీసుకొన్నప్పటికీ గుణద్వేషి అయిన భారద్వాజుడు అన్నను ద్వేషించడం మానలేదు. దుర్జనుడు ఉపకారాలతో గాని, ప్రీతితోగాని సౌజన్యం పొందలేడు.

ఒకనాడు భారద్వాజుడు విహార పరిచారికను రహస్యంగా పిలిచి, అన్న యిచ్చిన వస్త్రయుగళం ఆమెకిచ్చి సత్కరించి, ఇలా అన్నాడు: "ఓ సుందరీ! ఈ వస్త్రయుగళం ధరించు. ఎవరైనా ఇది ఎక్కడిది అని ప్రశ్నిస్తే వశిష్ఠులవారిచ్చారు అని చెబుతూ ఉండు" అని. ఆ పరిచారిక ఆ వస్త్రయుగళం స్వీకరించి భారద్వాజుడు ఆదేశించినట్లే చేసింది. దానివల్ల జనానికి వశిష్ఠునిపై నమ్మకం పోయి, శీలాన్ని అనుమానించడం ప్రారంభమైంది. శీలం చెడిందనే అపవాదం వ్యాపించడం వల్ల ప్రజలు అతనిని పూజించడం మానుకున్నారు. దానినతడు సంహించక విహారం వదలి దూరప్రాంతాలకు వెళ్ళిపోయాడు. గొప్పవారు ప్రజలను తమపై గౌరవభావం చెడిందంటే భయపడుతారుగదా!

ఆ భారద్వాజుణ్ణి నేనే. ఆర్యుడైన వశిష్ఠునిపై నీలాపనిందలు వేయడం వల్ల కలిగిన పాపం అన్యజన్మలలో అనుభవించి, తచ్ఛేషం వల్ల నిరాధారంగానే సుందరి నన్ను అపవాదం పాలు చేసింది.

పూర్వం వారాణసిలో పంచాభిధానుడైన ముని ఉండేవాడు. అతడు మహాధీశాలి. నేనప్పుడు ఒక బ్రాహ్మణకుటుంబంలో పుట్టాను. ఆ మునికీర్తి సహించక నేను పెక్కు అపవాదాలతో కీర్తిని నాశనం చేశాను.

పూర్వం వారాణసిలో కుసుమధన్వుని కీర్తిపతాకవలె సుందరి అయిన 'భద్ర' అనే ఒక వేశ్య ఉండేది. ఒకమారు ఆ వేశ్యను కుటిలమతి అయిన మృణాళుడనే విటుడు చూచి, రాత్రి భోగించడానికి వస్తానని చెప్పి వస్త్రభూషణాదులు పంపాడు.

తరలరాగ అయిన సంధ్యతో సంగమించడానికో అన్నట్టు దివాకరుడు గగనాంగణంలో వ్రేలాడుతుండగా, భద్ర తన భవనానికి వెళ్ళి లావణ్యాభరణురాలైనప్పటికీ మరల అలంకరించుకొంది.



కాళ్ళకు లత్తుక; మెడలో ముత్యాలదండ; అద్దం ముందు ముఖం - ఆమె కార్యార్థిని గనుక తన అలంకరణ ప్రక్రియచేతనే వేశ్యా చరితం యథార్థం చేసింది- ఒకరికి కాళ్ళు; మరొకరికి కంఠం; ఇంకొకరికి ముఖం అప్పజెప్పిందన్నమాట. కంఠంలో ఒకటి; ముఖంలో ఒకటి; హృదయంలో మరొకటి. పురుషులను ప్రలోభింప జేయడమనే తన కర్తవ్యమే మూర్తీభవించినట్లున్న, విచిత్రమైన ఆభరణాలను ధరించింది. శరీరానికి గంధం అలదుకొంది. ధూపంతో తన శరీరాన్ని వాసితం చేసింది. అప్పుడామె చీకట్లు పైకి కమ్ముతున్న సంధ్యవలె కనిపించింది. ఆమె విలాసంగా ఫాలతలంలో పెట్టుకొన్న చేర్చుక్క మూర్తీభవించిన మన్మథుని కీర్తి అయి ప్రథమ చంద్ర రేఖవలె అందాలు చిందింది.

ఇలా ఆమె సిద్ధంగా ఉండగా, మకరిక అనే దాసి తొందరగా వచ్చి, "దేవీ! వాకిట్లో ఒక నవయువకుడు వేచి ఉన్నాడు. మీతో కలుసుకొనడానికి ఉబలాటపడుతున్నాడు. ఐదువందల కార్షాపణాలు (కార్షపణం= ఒక వెండినాణెం) విసిరివేసి, ఇటువచ్చి, అటుపోతాడు. నిధే స్వయంగా నీ యింటికి వచ్చింది. హెచ్చుగా డబ్బిచ్చేవాడు, కార్యంతర వ్యగ్రతవల్ల ఎక్కువ కాలం ఉండనివాడు, ప్రచ్ఛన్నకాముడు, ఓర్పుకలవాడు అయిన సరసుడు ఎక్కడ దొరుకుతాడు?" అన్నది. ఆ మాటలు భద్ర విని, క్షణంసేపు దాక్షిణ్యలోభాల మధ్య ఊగిసలాడి నవ్వుతూ అన్నది: "నేను వీధి వనితలాగ ఒకరినుంచి డబ్బు తీసుకొని, మరొకరు పిలువగానే వెంటనే చేతులెత్తుకొని ఎలా వెళ్లను? వేశ్యలు కల్లుదుకాణంలాగ అందరికీ అందుబాటులోనివారైనా, ముందు ఎవరు కోరుతాడో వాడే వారికి (వేశ్యలకు) స్వామి. ఈ రాత్రికి మాత్రమే మృణాళుడు నన్ను విలుచుకొన్నాడు. ఎక్కువ మాటలెందుకు? అతన్ని ఉదయం రమ్మను. మనమెప్పుడూ నవనవోత్సాహంతోనే ఉంటాము గదా!" నవనవాస్వాదాసక్త అయిన ఆ క్షుద్రురాలైన దాసి కల్లు తాగినది వలె కోపించి భద్రతో ఇలా అన్నది: "ఇప్పుడు వచ్చిన వాడిని వదలుకొంటే, తిరిగి ఉదయం రాడు, వేశ్యలకున్నూ, వ్యాపారులకున్నూ ఎక్కువ బేరం భాగ్యం వల్ల కలుగుతుంది. వచ్చినవాణ్ణి వదలుకోవడమూ? వేశ్యలు పూవులు కోసినట్టు ఇటు ఒకణ్ణి, అటు ఒకణ్ణి, రాత్రీ పగలూ సరసులను ఏరుకుంటూ ఉండాలి. వేశ్య ధర్మానికి, కామానికీ సంతోషించదు; ధనానికే సంతోషిస్తుంది; ప్రసన్నురాలవుతుంది. యాచకునివలె, విద్యవలె వేశ్య ఎల్లప్పుడూ బహు ప్రణయిని. పలువురి సంగమంతో వేశ్య అశుచి కాదు; దాని వ్రతం పాడు కాదు. మీదుమిక్కిలి అందరికీ అభ్యర్థనీయురాలవుతుంది. వెళ్లేవాళ్లు, వచ్చేవాళ్లు, వాకిట్లో కాచుకొని వుండేవాళ్లూ- వీరితో వేశ్య రాజుల సభలాగ శోభిస్తుంది. వ్యాపారస్తుని శూన్యమైన త్రాసు బిళ్లవలె రిక్తులైనవారు ఇంట్లో ఉండడంకన్నా దుర్భాగ్యం పణ్యకామినికి మరొకటి ఏముంది? సరసులెవరూ రానందున ఒంటరిగా పడుకొన్న దురదృష్టవంతురాలైన వేశ్య ఉదయం కాగానే, రాత్రంతా కాముకులు తన యింటి తలుపులు తట్టి విరగ్గొట్టారని అబద్ధాలు చెప్పికొంటుంది. ఏదో పెద్దబేరం వస్తుందనే ఎదురు తెన్నులు చూస్తూ, చేతిలోని బేరం వదలుకొనే వేశ్యలు పూల దుకాణంలోని పూలలాగ వెంటనే వాడిపోతారు. ఇతడు - ఈ నవయువకుడు ఏదో కుతూహలంతో కొంచెంసేపు నీతో గడుపుదామని వచ్చాడు. కార్యాంతరం ఉన్నవాడు; ఎక్కువ ధనమిచ్చేవాడు. ఇలా వచ్చి అలా వెళ్లిపోతాడు. నీకేమి ఇబ్బంది? డబ్బు తీసుకో."

దాసి హితవాక్కులను భద్ర కాదనలేకపోయి, లోబడింది. వేశ్యలకు లోభం సహజస్వభావం; జనరంజనమే ఔచిత్యం. తర్వాత భద్ర "నే నింకా సరిగా అలంకరించుకోలేదు. కనుక క్షమించవలసింది.

క్షణం అక్కడే ఆగవలసింది" అని మృణాళునికి దాసితో వార్త పంపింది. పిదప బహువిత్తదాయి, కామి అయిన సుందరకుడనే ఆ నవయువకునితో క్షణం సేపు క్రీడించింది. ఆ క్షణంలోనే అతడు ఆమెను ఏనుగు పద్మినిని అనుభవించి కలచివేసినట్టు కలచివేశాడు. ఆమె అతని దంతచ్ఛేదాలతో నలిగిన పెదవి గలదై, నిర్దయాలింగనాలతో వసివాడిన దేహం కలదై నలిపి వేసిన పూలదండలాగ అయింది. అతడు వెళ్ళిన తర్వాత, మరల కొత్తగా అలంకరించుకొని, మృణాళునికి ఒక చెలికత్తెతో కబురు పంపించింది- త్వరలో రావలసిందని. ఆ చెలికత్తె భద్రపై ఇదివరకే కోపంతో ఉంది. ఇదే సమయమని ఆమెపై మృణాళునికి కొండేలు చెప్పి, సుందరకుని వృత్తాంతం తెలియజేసింది. దానికి మృణాళుడు కోపోద్దీపితుడై, కోపం మనస్సులోనే అణచుకొని, భద్రను తన యింటికే రమ్మని వర్తమానం పంపాడు.

భద్ర పుష్ప సౌరభాలతో ఆకర్షించబడే భృంగిలాగ మృణాళుని సందేశం విని అతని ఉద్యానవనానికి వెళ్ళింది. వచ్చిన ఆమెను చూచి, రాగద్వేషవిషోత్కటమైన సంసారమే రూపుగొన్నట్టున్న మృణాళుడు చిత్తవికారం పొందాడు. "ఈ చపలురాలు నాకోసం కల్పించుకొన్న అలంకారాన్ని లోభంతో మరొకరి ఉపభోగానికి పాల్పడజేసింది. దీని రొమ్ముమీద వంకర నఖక్షతరేఖలు దీని కుటిల చరిత్రను ప్రకటిస్తున్నాయి. విటుల ఉచ్ఛిష్టంతో దీని అధరపల్లవకాంతి తరిగింది. ముఖం వాడిపోయింది. భుజంగిలాగ ఇది నాకు సర్వాంగవిషమే ఇస్తున్నది" అని క్షణమాత్రం ఆలోచించి, కోపంతో వెర్రెత్తి పోయాడు. పొగలాగ కనుబొమముడి ముఖాన్ని కప్పి భయంకరం చేసాడు. దానిని చూచి భద్ర భయంతో కొయ్యబారిపోయింది. "బహు సంగతయైన వేశ్య మొదట మరొకరినుంచి విత్తం స్వీకరిస్తుందా? నాకోసం వేసుకొన్న ఈ వేషమంతా స్వేదకణావశేషంగా చేశావు" అని గద్దించాడు. భద్ర ఏమీ సమాధానం చెప్పక గడగడలాడింది. "ఈ బాల అబల, అవధ్య, ప్రసన్నుడవు కమ్ము. రక్షింపుము" అని ఆమె కదలుతున్న మొలనూలి చిరుగంటల సవ్వడి అతన్ని వేడుకుంటున్నట్టు అనిపించింది. వంగిన లతలు కూడా తమ పల్లవహస్తాలతో, తుమ్మెదల ఝుంకారంతో అతనిని దయ చూపుమని వేడుకుంటున్నట్టు అనిపించింది. అయినా ఘోరాకృతి అయిన వ్యాఘ్రం నిర్దయగా భయంతో కుంచించుకొనిపోయిన కురంగిని చంపేటట్టు ఆ క్రూరుడు భయకాతరాక్షి అయిన భద్రను హత్య చేసి, రక్తాక్తమైన ఖడ్గంతో సహా అక్కడినుంచి త్వరగా వెళ్ళిపోయాడు. క్రోధంతో కనులు గప్పినవారికి, నిష్కరుణమైన చేష్టలు గలవారికి అకృత్యమన్నది ఏముంది?

ఇంతలో దాసి "ఈ పాపిష్ఠివాడు, మృణాళుడు నిర్జన ప్రదేశానికి భద్రను పిలుపించుకొని చంపివేశాడో!" అని గోల పెట్టసాగింది. ఆ గోలకు జనం మూగసాగింది. అది చూచి మృణాళుడు సురుచి అనే ప్రత్యేకబుద్ధుడు నివసించే అడివిలోకి పరుగెత్తాడు. జనం తరుముతూ వెంటబడింది. మృణాళుడు రత్తం అంటిన తన చేతి కత్తిని సురుచి ముందు పడేసి జనంలో కలిసిపోయాడు. జనం ఎదురుగ్గా సాక్ష్యం కనిపిస్తూ ఉండడం వల్ల ఏ పాపము ఎరుగనివాడైన ప్రత్యేబుద్ధుని వెంటనే పట్టుకొని, రాజు ఎదుట పెట్టారు. రాజు అతనిని వధించ వలసిందని ఆజ్ఞాపించాడు. అతనిని రాజభటులు వధ్యభూమికి తీసుకొని వెళుతుండగా, మృణాళునికి పశ్చాత్తాపం కలిగి, తనే ఆ పాపం చేసినట్టు రాజభటుల ముందు ఒప్పుకున్నాడు. ఆ మాటలకు రాజు సంగతి సందర్భాలు విచారించి, ప్రత్యేకబుద్ధుని కాళ్లపైన పడి క్షమాపణ కోరాడు. మృణాళుడు తన దుష్కృత్యానికి తగిన దుస్సహ శిక్షను అనుభవించాడు.



ఆ మృణాళుణ్ని నేనే, వేశ్యను చంపిన ఘోర పాపాన్ని పెక్కులక్షల జన్మలలోను, నరకాలలోను అనుభవించాను. ఇంకా మిగిలి ఉండడం వల్ల తైర్థికులు పంపిన స్త్రీ వలన అపవాదు పొందాను.

బంధుమతి అనే పట్టణంలో పూర్వం విపశ్వి అయిన జినుడు భిక్షుగణంతో వసించేవాడు. ఆయనను పౌరులు సకల భోగాలతో ఆదరించి భిక్ష యిచ్చేవారు. ఆ పట్టణంలోనే మఠరుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు విపశ్వికి జరిగే సత్కారాలు చూచి సహించక శిఖలు లేని ఈ బోధిభిక్షువులు భోగయోగ్యులు కారు. బోడి వెధవల మొగానికి దివ్యాహారమా? పాత కొర్రలు, యవలు దంచి పెట్టండి! అని ప్రజలలో ప్రచారం చేశాడు.

ఆ మఠరుడనే బ్రాహ్మణుణ్ని నేనే. బహు జన్మలు ఆ పాపం అనుభవించి ఆ శేషం వల్ల ఇప్పుడూ కొర్రలు, యవలు తినవలసి వచ్చింది.

పూర్వం నేను ఉత్తరుడనే వాడుగా జన్మించినప్పుడు పుద్గలభావం పొందిన ఒక అర్హతుని నిందించడం వల్ల కలిగిన పాపానికి ఈ జన్మలో ఆరు సంవత్సరాలు దుష్కరకర్మ చేయవలసి వచ్చింది.

పూర్వం కర్వటమనే పట్టణంలో ధనవంతుడనే గృహపతి ఉండేవాడు. అతని కుమారుని పేరు శ్రీమంతుడు. అతనికి ఒకమారు వ్యాధి కలిగింది. తిక్తముఖుడనే వైద్యుడు ధనాశతో అతనికి చికిత్స చేసి స్వాస్థ్యం కలిగించాడు. కాని అతని తండ్రి ఆ వైద్యునికి చిల్లిగవ్వయినా ఇవ్వలేదు. మరి కొన్నిసార్లు కూడా కుమారునికి అస్వాస్థ్యం కలిగింది. అప్పుడు కూడా తిక్తముఖుడు బాగు చేశాడు. కాని, తండ్రి అన్ని మార్లూ ఒక్క పణమైనా యివ్వలేదు. తిక్తముఖునికి కోపంతో ఒళ్లు మండింది. ఆశాదాహం హెచ్చింది. బుసలు కొడుతూ "రోగి చేయి జారిపోయాడు. సరళ హృదయుడైన నన్ను ఈ ధూర్తుడు మోసం చేశాడు గదా! ఇప్పుడేమి చేయను? రోగి అనే నిధి చేయి దాటిపోయింది. చేదు మందులు ఇచ్చేవాడైనా వైద్యుడు రోగికి వ్యాధి నయం కాకముందు ఇష్టమే. చికిత్స పొందిన తర్వాత వైద్యుని స్మరణ కూడా కంటగింపే; ముఖం చిట్లింపే. అభీష్టసిద్ధి పొందిన తర్వాత ధనవంతుడు, ఏరు దాటిన పిదప నావికుడు, వ్యాధి పూర్తిగా పోయిన తర్వాత వైద్యుడు ఎవరికి కావాలి? వ్యాధిగ్రస్తులు మొదట వైద్యుణ్ని కాళ్లావేళ్లా పడి, ఒట్లు పెట్టుకొని పూజిస్తారు. వ్యాధి కుదిరిన తర్వాత వైద్యుని పేరు చెబితే 'ఫూ' అని ఉమ్మి వేస్తారు. వేటకాని వలనుంచి తప్పించుకొన్న జింక, రాజు నుంచి తప్పించుకొన్న దొంగ, వైద్యునినుంచి చికిత్స పొంది బాగైపోయిన రోగి పుణ్యవశాత్తు మరల కండ్లపడతారు' అని చింతిస్తూ క్షీణించి పోయేవాడు.

ఇలా ఉండగా శ్రీమంతునికి మరల వైద్యుని కోపావేశం వంటిదో అన్నట్టు వ్యాధి వచ్చింది. వైద్యుడు కడుపులో కోపం పెట్టుకొన్న వాడు గనుక విరుద్ధౌషధాలు కలిపి పేగులు తెగిపోయే మందు ఇచ్చాడు. అపథ్యమైన మందు తాగడం వ ల్ల రోగి పేవులు అవిశాయి. లోభాంధులు, పాతకగర్తంలో పడేవారు ఏలాటి అకార్యం చేయరు?

ఆ వైద్యుణ్ని నేనే. వేయి జన్మలలో ఆ పాపం అనుభవించి, ఇప్పటికినీ కర్మశేషంతో ప్రస్కంది వ్యాధితో బాధపడుతున్నాను.

పూర్వం సెంబడివాళ్లు రెండు పెద్ద చేపలను పట్టుకొన్నారు. వాటిని కోస్తూ వుంటే ఒక చెంబడి పిల్లవాడు చాల సంతోషపడ్డాడు. ఆ పిల్లవాణ్ని నేనే. ఆ పాపం పెక్కు జన్మలలో అనుభవించి, ఈ

జన్మలోను కొంత శేషించగా, శాక్యుల వినాశనంతో క్షణం సేపు తలపోటుతో బాధపడ్డాను.

పూర్వం నేనొక మల్లుడుగా పుట్టి బలాధికుడైన ప్రతి మల్లుణ్ని ద్వంద్వ యుద్ధంలో పడగొట్టి, అతని వీపులు రెండు ముక్కలుగా విరిచాను. ఆ పాతకం బహు జన్మలలో అనుభవించి, తచ్ఛేషంగా ఇప్పుడు వీపులో వాతశూలతో క్షణం సేపు బాధపడ్డాను.

ఈ విధంగా సంబుద్ధిజ్ఞానంకల నాయొక్క శరీరం నిర్దోషమైనప్పటికీ, కర్మపంకావశేష చిహ్నాలైన కష్టపు తుంపరలు పడ్డాయి. జనన మరణాల పరంపరతో నిబద్ధమై మాలవలె ఉన్న ఈ కర్మసరణి విచిత్రమైనది; ప్రణయిని వంటిది. సుఖదుఃఖాలలో అనుభవించి వదలిపెట్టినా, వాసనామాత్రంగా ఆసక్తురాలైయే ఉంటుంది.

ఈ విధంగా భగవానుడు చెప్పిన దానిని భిక్షువులందరూ విని, కర్మవృత్తం అనతిక్రమణీయమని భావించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో దశకర్మప్లుత్యవదానమనే యాభైయవ పల్లవం

# 51. రుక్మవత్యవదానం

ఆర్తులను రక్షించాలనే బుద్ధి కలిగిన దయాప్రణయులకూ ప్రాణోత్క్రమణ సమయంలోను దేహం పులకాంకితమౌతుంది. తీక్ష్ణతర శస్త్రాల దెబ్బలు లోలాక్షుల కర్ణోత్పలాల దెబ్బలుగా అనిపిస్తాయి. అట్టి వారి ఉదారచరితం బాల్యోచితమైన మాటలతో ఎలా చెప్పడం?

పూర్వం భగవానుడైన బుద్ధుడు గుహ్యకాదులను వినీతులను చేసి, ఆ దేశం నుంచి అంతర్హితుడై మరొక తపోవనానికి వెళ్లాడు. అక్కడ శచీపతి అతని సేవకు వచ్చాడు. ఒకమారు భగవానుని ముఖంలో స్మితచంద్రోదయం కావడం చూచి కారణమేమిటని కుతూహలంతోను, చనువుతోను అడిగాడు. "ఈ వనంలో పూర్వం జరిగిన ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది. అందువల్ల నవ్వు వచ్చింది. అకారణమేమీ కాదు" అని భగవానుడు సమాధానం చెప్పి, ఆ పూర్వ వృత్తాంతం చెప్పడం ప్రారంభించాడు.

ఉత్పలావతి అనే నగరంలో దానశీలదయలకు పేరుపొందిన రుక్మవతి అనే పౌర ముఖ్యురాలు ఉండేది. ఆమె ఒకమారు ఒక నవప్రసూతను చూచింది. ఆమె చాల దరిద్రురాలు; ఆకలితో అలమటిస్తూ తన కన్న కొడుకునే రాక్షసివలె తినడానికి పూనుకుంది. అది చూచి రుక్మవతి మనసు కరిగి క్షణకాలం ఆలోచించింది. "అయ్యో! స్వశరీరమందుండే స్నేహం వల్ల పాప కార్యాలలో మతి ప్రవర్తిస్తుంది. నేను ఈమె కోసం భోజన పదార్థాలు తీసుకొనిరావడానికి ఇంటికి వెళ్లానా, ఈమె క్షుత్పరక్షామ అయి తన పుత్రుణ్ని చంపి తినివేస్తుంది. ఇది తప్పదు. శిశువును తీసుకొని వెళ్లిపోయానా, మనస్సు వికలమై ఆకలి క్షీణించి వెంటనే మరణిస్తుంది." ఈ విధంగా ఆలోచించి, ఎటూ తోచక జగత్తును తరింపజేయడానికో అన్నట్టు ప్రణిధానం చేసి, నిశ్చల బుద్ధితో నిర్ణయానికి వచ్చి, తాను తెచ్చిన కత్తితో తన స్తనద్వయాన్ని కోసి యిచ్చి, ఆ బాలింతరాలి ప్రాణం కాపాడింది.

ఆమె సాహస కృత్యానికి త్రైలోక్యం అబ్బుర పడింది. ఆమె కీర్తి వ్యాపించింది. అప్పుడు శక్రుడు వచ్చి, "అమ్మా! నీవు పాలిండ్లు కోసి దానమిస్తున్నప్పుడు మనోవికారానికేమైనా గురి అయ్యావా?" అని ప్రశ్నించాడు. సత్యవాది అయిన ఆమె ఇలా అన్నది: "స్తనార్పణలో నాకు కించిత్తు కూడా మనోవికారం కలుగక పోవడమే నిజమైతే నా స్త్రీత్వమే తొలగిపోవును గాక!" ఈ మాటలను ఆమె అనగానే, స్త్రీ రూపం పోయి, సర్వలక్షణ సంపన్నమైన పురుష రూపం కలిగింది.

ఆ సమయంలో ఆ ఉత్పలావతీ నగరాధిపతి ఉత్పలాక్షుడు వ్యాధి వల్ల ఆయుస్సు పూర్తి అయినవాడై మరణించాడు. లక్షణజ్ఞులు, బుద్ధిమంతుడు అయిన వృద్ధమంత్రులు వెదుకుకొంటూ వచ్చి సద్యస్సంప్రాప్త పురుషత్వం గల రుక్మవంతుణ్ని అభిషేకించారు. రుక్మవంతుడు దినదినాభివృద్ధి నందుతున్న సంపద గలవాడై, ధర్మమే ధనంగా గలవాడై చిరకాలం రాజ్యం చేసి, తనువు త్యజించాడు. దేహి స్థాయిగా వుండేవాడు కాడు గదా!

మరుసటి జన్మలో రుక్మవంతుడు ఆ నగరంలోనే సత్త్వవరుడనే శ్రేష్ఠి కుమారుడుగా జన్మించాడు. నిష్కపటుడై, బహు జన్మాభ్యస్తమైన దానంలో ఆదరం కలవాడై, సర్వభూతాల దుఃఖాలను తొలగించడంలోనే మనస్సు కలవాడై ఉండేవాడు.

అతడొకసారి పక్షుల పాటును గురించి ఆలోచించసాగాడు. అవి కడుపుకోసం పడే కష్టాలు అతన్ని వికలుణ్ని చేశాయి. శ్మశానికి వెళ్లి వెల్లికిలా పడుకొని, తన దేహాన్ని కత్తితో కోసి, మాంసం తినే పక్షులకు వేయడం ప్రారంభించాడు. ఒక పక్షి పైకి ఎగురుతూ అతని కుడి కంటిని ముక్కుతో పొడిచి పొడిచి వదలి పెట్టసాగింది. అతడు ధైర్యంతో సర్వాంగాలను కదలకుండా ఉంచుకొని "ఓ పక్షీ, నిశ్శంకంగా కంటిని తిను. నే నేమీ అడ్డు రాను. ఈ కాయం నిస్సార విరసము, సాపాయము, క్షణంలో క్షయించేదీని. పరోపకార లేశంతో సంసారంలో సారత్వం పొందుతున్నది. కష్టాలను కురిపిస్తూ, అడుగడుగునా నిందల పాలవుతూ, ఎగఊపిరి దిగఊపిరి పోసుకుంటూ, అపాయాలకు పుట్టినిల్లయి, మురికి ఉన్న ఈ మిథ్యాశరీరంపై మానవులకు స్నేహమేమిటి? అయితే ఈ శరీరంలో వాంఛనీయమైనదేమిటంటే, పుణ్యవశాత్తు ఎప్పుడైనా, ఎవరికైనా, ఏ కొంచెమైనా కష్టసమయంలో సహాయానికి పూనుకోవడం అనేది ఒక్కటే" అని అన్నాడు. ఈ మాటలు విని ఆకలిగొన్న పక్షులన్నీ అతన్ని తినివేసి క్షణంలో ఎముకలు మాత్రమే మిగిలేట్టు చేశాయి.

మరుసటి జన్మలో అతడు ఒక మహాశాలకులం బ్రాహ్మణునికి పుత్రుడై పుట్టాడు. సత్యవ్రతుడనే పేరుతో, పేరుకు తగినట్టు జనప్రీతి సంపాదించాడు. అఖిల విద్యలూ నేర్చాడు. అతని మనసు కరుణాసక్తమై, శాంతిని కోరేది కనుక వివాహ విముఖమైంది. ఉత్తమకులంలో జన్మించడం, గుణాలు వరించడం, మతి వివేకవతి కావడం, సర్వభూతదయ, మైత్రి, పుణ్యవంతుల లక్షణం. కనుక అతడు వైరాగ్యసక్తుడై యౌవనంలోనే తపోవనానికి వెళ్లాడు; మహర్షుల వల్ల వ్రతం స్వీకరించి, ఆశ్రమంలో విశ్రమించాడు. కొంత కాలానికి అతనికి విమలజ్ఞానం కలిగింది.

ఒకమారు అతడు వనంలో తిరుగుతూ, ఈనబోతున్న ఒక ఆడపులిని చూచాడు. "ఈ ఆడపులి ఇక వారంలో ఈనుతుంది. అప్పుడు ఆకలిగొన్న దీనికి తన కూనను తినాలనే తీవ్రమైన వాంఛ కలుగుతుంది" అని తలపోసి, ఈ దుఃఖాన్ని తపోవనంలోని మునులకు తెలియజేసి, కరుణతో దానికి ప్రతీకారం చేయడానికి నిశ్చయించాడు. ఇంతలో వారం గడిచింది. గర్భభరాలస అయిన వ్యాఘ్రి, పెక్కునాళ్లు తిండిలేక మాడి ఉండడం వల్ల అలసిపోయి, కష్టమ్మీద పిల్లలను ఈనింది. తన రక్త వాసనతో నాలుక సాచుతూ ఉన్న ఆ ఈనిన పులిని చూచి సత్యవ్రతుడు ఇలా అనుకున్నాడు: "ఈ దురదృష్టమైన ఆడపులి ఆకలి బాధతో తన కూనలను తినడానికే ఉబలాటపడుతున్నది. తన స్వార్థంతో పుత్ర స్నేహాన్ని కూడా మరచింది. ప్రతివారికీ తన దుఃఖమంటే సంతాపం, పెరవారి దుఃఖమంటే సంతోషం. పరుల దుఃఖంతో తను బాధపడేవాడు అరుదుగా ఉంటాడు. నా దేహం అర్పించి పిల్లలతోపాటు ఈ పులిని రక్షిస్తాను. ప్రాణాలను పోగొట్టగలిగిన వీటి దుఃఖాన్ని చూడలేకపోతున్నాను. ఇతరుల ప్రాణాలను రక్షించడంలో తృణంవలె తమ దేహాలను ఒడ్డినవారి యశోదేహాలు స్థిరంగా ఉంటాయి. ఈ యశోదేహం పృథుపుణ్యమయం. ఈ జీవితమనే జలకణం ఎప్పుడూ అపాయానికి గురి అయినది; దానికి అల్లలలాడే తామరాకు మీద కదలాడే జలబిందువుకు చెలి వంటిది." ఈ విధంగా ఆలోచించి ఆ కరుణానిధి ఒక



వెదురు ముక్కతో తన గొంతు పొడుచుకొని రక్తం కారే గాయం చేసుకొని, ఆ ఆడపులి ముందు పడ్డాడు. కరుణా కోమలము, ఆపన్న త్రాణసరసమూ అయిన మహాత్ముల మనస్సు పర సంతాపం సహించేనా?

నెత్తురు తాగటానికి ఉవ్విళ్లూరుతున్న ఆ పులి కదలక మెదలకపడి ఉన్న ఆ విశాలవక్షుని మీదపడి, అతని అపూర్వ చరితానికి హర్షస్మితం చేస్తున్నట్టున్న తెల్లటి గోళ్లతో చీరివేసింది. సత్త్వగుణానికి పుట్టినిల్లయిన ఆతని శరీరం ఆ వ్యాఘ్రి చండ వేగంతో పడిన పాటును నిశ్చలంగా- మైత్రి తప్పిదాన్ని; ఓర్పు, దుష్కృత్యాన్ని; ప్రజ్ఞ, చింతను; ధైర్యం, దుస్సహ దుఃఖాన్ని; తపస్సు, క్లేశాన్ని సహించినట్టు సహించింది. వ్యాఘ్రి నఖావళి చెలగాటలో క్షీణించిపోతున్న ఆ క్షతగాత్రుని వక్షస్థ్సలి క్షణకాలం తుహినాంశుని శుద్ధసత్త్వం వెల్లివిరిసే కిరణాంకురాలలో నిండిన దానిలా కనిపించింది. తన మాంసం తిని, తన రక్తం తాగి మదించిన ఆ వ్యాఘ్రిని చూచి సంతోషిస్తున్న ఆతని ప్రాణవృత్తి దీర్ఘ ప్రవాసపు గడువుకు కలతపడిన ప్రియురాలివలె కంఠాన్ని పట్టుకొంది. ఆ వ్యాఘ్రి చాల సంతృప్తిపడి, సిగ్గుపడినదానివలె తల వంచుకొని అతని చుట్టూ ప్రదక్షిణంగా తిరుగుతూ, వివాహ పరాఙ్ముఖుడైన అతనికి పాణిగ్రహణం చేసిన నవవధువువలె సంతోషం కలిగించింది. భవ్యాత్ముల సత్త్వమైత్రీపవిత్రమూ, వికారరహితమూ అయి వుంటుంది. వారి కీర్తి, సౌజన్య పుణ్యనది. వారి స్వభావం భూతహితమైనది మనస్సు దీనుల ఎడ కరుణో ఆభరణంగా గలది. వ్యాఘ్రి నఖాగ్రాలతోచీరివేయబడిన అతని సాటిలేని సత్త్వగుణాన్ని చతురంబురాశి వేలావిలాసరసన అయిన వసుధ వెంటనే ప్రాణాలు పోతున్నవా అన్నట్టు భయంతో చాలాసేపు కంపించింది.

ఆ కరుణానిరతుడైన సత్యవ్రతుణ్ని నేనే. స్వవిషయం స్మరించి ఇప్పుడు నవ్వుకున్నాను.

జిన భగవానుడు చెప్పిన పూర్వచరితం విని శక్రుడు ఆశ్చర్యపడ్డాడు; ఆందోళన మాని స్తిమితాసనుడయ్యాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో రుక్మవత్యవదానమనే యాభైఒకటవ పల్లవం

# 52. అదీనపుణ్యావదానం

వనంలో ఉన్నప్పటికీ, వల్కలాలు ధరించినప్పటికీ, చందన వృక్షంలాగ అర్థులను కృతార్థులను చేసే చారుచరిత్రుని ఉత్తమ కార్యం ఎవరికి రుచించదు?

బుద్ధభగవానుడు మరొకమారు మరొక తపోవనంలో విహరిస్తూ నవ్వాడు. శక్రుడు మరల ఆ నవ్వుకు కారణం అడిగాడు. "ఈ ప్రదేశంలో జరిగిన పూర్వవృత్తమొకటి జ్ఞాపకం వచ్చి నవ్వాను" అని భగవానుడు సమాధానమిచ్చి పూర్వవృత్తం ఇలా తెలిపాడు.

పూర్వం సురపురంతో సమానమైన మధూదకమనే నగరం ఉండేది. ఆ నగరాన్ని అదీనపుణ్యుడనే భూపతి ఏలేవాడు. అతడు భూమికి ఆభరణం వంటివాడు. అతడు కరుణ, ముదిత, ఉపేక్ష, మైత్రి అనే నాలుగు గుణసంపదలయందు ఆసక్తుడై ఉన్నందున అసూయపడినదివలె అతని సిరి అర్థిజనుల ఇండ్లలోనే ఉండిపోయేది.

జగద్వ్యాప్తమైన అతని చరిత్ర విని బ్రహ్మదత్తుడు విజయేచ్ఛతో తన బలాలతో తరలివచ్చి, గజయూథంతో దిగంతాలను అంధకార బంధురంగా చేస్తూ, మధూదక నగరాన్ని ముట్టడించాడు. తమ రాజు సహజ సత్త్వగుణుడు, అనుకంపా హృదయుడు గనుక, శత్రుక్షయం కోరడు అని తలచి మంత్రులు అతని ఆనతి లేకే యుద్ధానికి బయలుదేరారు. యుద్ధం జరుగుతూ గజ వాజి రథ క్షయం కాగా, కారుణ్యా కులితుడైన అదీనపుణ్యుడు ఇలా తలపోశాడు; "ఈ క్షత్రధర్మం మహా విషమమైంది. అధర్మాల పుట్ట. దీనిలో ప్రాణివధ క్రౌర్యమే ధర్మమనబడుతుంది. కలుషమైన, రక్తసిక్తమైన ఈ క్షత్రియ ధర్మం పాడుగాను! ఇంత ప్రయత్నించినా హింస చేసే జీవితమందామా అశాశ్వతం! భోగమందామా వ్యసనాల మధ్య ఎప్పుడూ ప్రమాదభరితమే, నశించేదే; ధైర్యం పోగొట్టి పశ్చాత్తాపంతో; నిట్టూర్పులతో బాధ పెట్టేదే. కనుక క్లేశపరిణామం కలిగించే ఈ భోగం కోసం సుఖలేశప్రాప్తికోసం పరప్రాణహింసా ప్రయత్నం ఎందుకు? కనుక హింసాపాప నికేతనమూ, అధర్మ బహుళమూ అయిన రాజ్యం త్యజించి, తపోవనానికి వెళ్ళుతాను. అజ్ఞానమూఢులైన రాజులు హత్యలు, బంధనాలు ఎన్నో జరిపి తరగని పాపంతో సంపాదించిన సంపదను కాలం కబళించివేస్తుంది. ఈ సంసారంలో మోహావేశంతో హతబుద్ధులై ఎన్నో స్థిరమైన ఆశలతో విషయసుఖజాలం అన్వేషిస్తున్న మానవులకు అచింత్యుడు, బలవంతుడు అయిన ఈ కాలపురుషుడు విలాస వైభవాలను ఇస్తూ, మరల అకాలంలోనే సంగ్రహించుకుంటూ ఉంటాడు. ఇది కల్పాంతం వరకు సాగుతున్న కాలవిలాసం." హింసాపాప పరాఙ్ముఖుడైన ఆ నరపతి ఈ విధంగా తలపోసి ఒక రాత్రి దండవల్కలధారియై నగరు వీడి తపోవనానికి వెళ్ళాడు.

మంత్రులు ఈ సంగతిని జనానికి తెలియకుండా చేసి, యుద్ధం కొనసాగిస్తూ, తీవ్రబాణాలు కురిపిస్తూ గర్జిస్తున్న శత్రువులతో ఇలా అన్నారు; "మత్తమాతంగమా, వృథాగా గర్జనలు చేయవద్దు. నీ



తీవ్రగర్జారవాలు విని క్షమ తొలగి సింహం రంగంలోకి ప్రవేశిస్తుంది." వారు ఈ విధంగా వీరాలాపాలు పలుకుతూ, ధీరులై తమ స్వామికి అవమానం కలుగరాదనే ప్రయత్నంతో యుద్ధం చేశారు.

ఇది ఇలా ఉండగా, కోసలదేశంలో కపిలుడనే బ్రాహ్మణునికి హిరణ్యవర్మ అనే రాజు అపరాధం విధించాడు. ఆ బ్రాహ్మణుడు తన ధనమంతా చెల్లించినా ఆ అపరాధం పూర్తికాలేదు. కనుక రాజు అతని సుతులను, బంధువులను కారాగారంలో పెట్టించాడు. అతడు బంధు బంధన దుఃఖంతో వలలో చిక్కుకున్న జింకలాగ కదలక మెదలక పడి ఈ విధంగా ప్రతీకారం ఆలోచించాడు. "అయ్యో! ఏమి చేయును? నా తల్లి, తండ్రి, చెల్లెలు, సోదరుడు, కూతురు, కొడుకు అందరూ కారాగారంలో బంధింపబడినారు. డబ్బు లేనిదే వారికి విడుదల కలుగదు. రాజు ధర్మాన్ని ద్వేషిస్తూ, లోభపరవశుడైతే, ఎప్పుడూ క్లేశాలు అడుసులాగ ఉన్న ఆ దేశం వదలిపెట్టి వెళ్ళడం మంచిది. కాని, దేశం ఎంత కష్టంగా ఉన్నా ఎలా వదలివెళ్ళడం? బంధువులనే బంధాలు ఎప్పుడూ మనిషిని బంధించే ఉంటాయి గదా? కనుక ఈ క్లేశమయ దేశంలోనూ ద్రవిణోపార్జనం తప్ప మరొక గతి లేదు. ధనంతో తరింపరాని దుఃఖమంటూ లోకంలో లేదుగదా! సంపదలు వేశ్యలలాగ వికారాలు కలిగించేవి. కుటిలమైనవి. వెంటబడినకొద్దీ పరుగెత్తుతాయి; పిలవకనే స్వయంగా వస్తాయి. ఇక సేవతో ధనసంపాదన చేద్దామా అంటే, సేవ జీర్ణలతవలె విరసమైంది; బహుదూరం శుష్కమైంది. ఒకప్పుడు ఎంతో ఫలిస్తుంది. ఒకప్పుడు ఫలించదు. యాచనతో సంపాదిద్దామా అంటే, యాచన లజ్జారజో దూషితమైనది; సజ్జన వర్జితమైనది; అవమాన సహస్రంతో ఎంగిలిపడిపోతుంది. కనుక ఫలించినా, ఫలించనట్టే. యాచకుడు ఎవరివద్దకైనా వెళ్ళితే మొదట సత్కరిస్తారు. తర్వాత ధనం అడుగబోతే మానమ్లాని కలుగుతుంది. కనుక ఈ రెండు విషయాలు మనస్సులో విమర్శించుకొన్నప్పుడు యాచకునికి క్షణకాలం ఆశ మోసలువారుతుంది. మరుక్షణంలో ముడుచుకొంటుంది. లోభస్వభావంగల ఈ లోకంలో, గుణాలను ఎవరు ధనంతో గుర్తిస్తారు? కనుక నేను సర్వోపాయ విహీనుణ్ణి. అన్యథా గతే లేదు. మరుభూమిలో నీడను వెదికే పాంథునివలె, నేను ఎక్కడికి వెళ్ళను? ఏమి చేయను? నిరాలంబమైన నా మనోరథం విశ్రాంతి పొందకుండా వుంది. ఈ సంకులమైన జనకాననంలో ఎల్లప్పుడూ అడిగినవారికి అన్ని ఫలాలు ఇచ్చినా కంపించినదీ, వంపును వదలనిదీ అయిన సాధువృక్షం ఆపదలో లభించదుగదా! అదీనపుణ్యుడనే రాజు సర్వార్థులకు కల్ప వృక్షంవంటివాడని, సత్త్వగుణ దుగ్ధాబ్ధి అని, ఆపన్నార్తిహరుడని వింటున్నాను. అతనిని ఆశ్రయిస్తాను."

ఈ విధంగా కపిలుడు ఆలోచించి, ఆశాబంధం తెలిపిన మార్గాన సంతోషంతో ఆ రాజును దర్శించ బయలుదేరాడు. అతడు కాలినడకన వస్తూ, వస్తూ, అలసిపోయి మధూదకనగరం పొలిమేరలోని తపోవనంలో విశ్రమించాడు. అక్కడే అతనికి వల్కలధారి అయిన అదీనపుణ్యమహారాజు కనిపించాడు. ఆకలితో దప్పితో అవస్థపడుతున్న అతనిని చూచి కరుణాసింధువైన ఆ రాజు అంతదూరం నుంచి వచ్చిన కారణమేమని ప్రశ్నించాడు. కపిలుడు దుఃఖార్తుడై వేడి నిట్టూర్పులు విడుస్తూ, తన బంధువులందరు చెరలో ఉన్న గాథను వినిపించి, "బంధువులను చెరనుంచి విడిపించుకొనడానికి ధనం కావాలి. ఆ ధనాన్ని అర్థిసురద్రుమమైన అదీనపుణ్యమహారాజును యాచిద్దామని వచ్చాను. కరుణాపూర్ణమానసుడైన ఆ లోకనాథుడు నేను దర్శించిన వెంటనే నా సంకల్పం పూరిస్తాడు. మహాపురుషుడు ఇచ్చే ఫలం క్లేశతాపంతో వాడనిది; అవమానదూషితం కానిది; ఎంత కాలమున్నా చెడనిది. ఆ వసుధాసుధాంశువు ప్రజల

తీవ్రదారిద్ర్య తిమిరాన్ని పోగొట్టేవాడు. కీర్తి కాంతి విభవంతో ఆశలు పూరించేవాడు. తన విమల మనస్సంతోషంతో బంధువువంటివాడు. నా తాపాన్ని పోగొడుతాడు" అని అన్నాడు.

కపిలుని మాటలు విని రాజు చాల కష్టపడి, అర్థి కామనను పూరించ లేననే సంతాపంతో తపిస్తూ ఇలా ఆలోచించాడు. "అయ్యో? నేనిప్పుడు రాజ్యం వదలిపెట్టాను. అకాలంలో ఈ బ్రాహ్మణుడు ఆకలిగొన్నవాడు దారిలోని శుష్కవృక్షాన్ని ఆశ్రయించినట్టు నన్ను తలచుకొన్నాడు. దూరం నుంచి సమ్మోహం కలిగిస్తూ అలసిసొలసి దగ్గరికి వచ్చిన తర్వాత నిరాశాసంతాపం కలిగించే ఎండమావుల వంటి నే నెందుకు? ఛీ? మూర్ఛపోయినవాని ముఖంపై బండరాయి కొట్టినట్టు అర్థుల మార్గాయాసం ఆశాభంగంతో గురుతరమౌతుంది. ఆ రాజును నేనే. రాజ్యం వదలి అడివిబట్టాను అని వినగానే ఈ బ్రాహ్మణుడు ప్రాణాలు వదలుకుంటాడు. ఆశ కన్య లాంటిది. పుట్టగానే అపార చింత కలిగిస్తుంది. పెరిగి పెద్దకాగానే నిద్రలేకుండా చేస్తుంది. మరికొంత ముదిరితే శోకం కలిగిస్తుంది. నశిస్తే, వెంటనే దేహాన్నే కాల్చివేస్తుంది. ఇతడు రాజధానికి వెళ్ళి నేను కనిపించకపోతే, భగ్నమనోరథుడై సంతాపంతో ఏమి చేస్తాడు? పాపం! జనులకు కష్టకాలంలో కాపాడేవాడుగా మనస్సులో స్ఫురించేవాడే శ్లాఘ్యుడు. యాచకుడు లేదనిపించుకొని, ముఖం నల్లగా జేసుకొని, వేడినిట్టూర్పులతో ఆశలన్నీ కూలిపోగా వంగి తల వంచుకొని వెళ్ళకుండా చేసేవాడే కుశలి! అలాటివాడే ప్రాణాలతో ఉన్నట్టివాడు. ఛీ! లవణ సముద్రం జన్మ ఎందుకు? అగస్త్యుని ఉదరకుహరంలో పడి అక్కడ ధగధగలాడే జఠరాగ్ని ప్రతాపానికి ఉడుకెత్తిపోయిన అనుభవం ఉంది కదా! అలాగే వ్యథల పాలయి తీవ్రమైన దప్పితో తన వద్దకు వచ్చిన వారి తాపాగ్ని పోగొట్టలేకపోతున్నది; వారి నిట్టూర్పులతో దహించిపోతున్నది. ఎందుకు దాని జన్మ?"

రాజు ఈ విధంగా ఆలోచించి, ఫలజలాలతో కపిలునికి ఆతిథ్యమిచ్చి, అప్రియవాక్కులు చెప్పవలసి వస్తుందని భయపడుతున్నవాడువలె కొంచెం జంకి ఇలా అన్నాడు. "బ్రహ్మన్! ఆ అదీనపుణ్యుడనే రాజును నేనే. శత్రువులను వధించడమనే హింస చేయలేక రాజ్యం వదలి ఈ విజనంలో ఉన్నాను. మహీపాలురు బొమముడిపాటువలె క్షణభంగురము, నవరక్త సిక్తమూ, హింసాఫలమూ అయిన భోగాన్ని రాక్షసులవలె అనుభవిస్తున్నారు. నేనిప్పుడు పదవిలో లేను. అకాలంలో నీవు నా దగ్గరికి వచ్చావు. నాతో కాదగినపని ఏదివున్నా, నిస్సంకోచంగా చెప్పు."

రాజు మాటలు విని కపిలుడు పిడుగు పడినట్టు, బంధువులను ఇక విడిపించుకోలేమనే నైరాశ్యంతో భూమి మీదపడి మూర్ఛపోయాడు. రాజుకు కన్నీళ్ళు తిరిగాయి. అతనిని మూర్ఛతేర్చి, ప్రియవచనాలతో సమాధానపరిచి, మరల ఇలా అనుకున్నాడు: "నేను ఎంతటి మందపుణ్యుణ్ని. మరుభూమి మార్గంలోని బాటసారుల ఆశలాగ యాచకుల అశాలతాంకురాలు నన్ను చూచి మోడువారిపోతున్నాయి. అర్థాన్ని కోరేవాడు తను అస్థానంలో అడుగుతున్నాడనే ఆలోచన లేకనే అడుగదలచుకొని, తన వాంఛ సఫలమైనట్లే భావించి, ఆశాతూలికతో సుఖాన్ని సహస్రశాఖంగా చిత్రించుకొని, తుమ్మ చెట్టునుంచి మామిడి పండును కోరగా విఫలమైనట్టు తన వాంఛితం వ్యర్థం కాగా, తను ఇంతగా పెద్దగా చేసిన ప్రయత్నమంతా విఫలంకాగా. మూర్ఛపోతాడు. ఇతనికి యాచించినదానిలో కొద్దిపాటి ఇస్తే ప్రయోజన మేమిటి, ఆకలిగొన్నవాడు బిచ్చం అడుక్కున్నా కడుపునిండనట్టు, రాజును చూచి, రాజుతో మాట్లాడిన పిదప గూడ అదే వెదురుతడికల పూరింట్లో ఉంటే ప్రయోజన మేమిటి? పాయిలో పడుకున్న పిల్లి తోకను ఇంటి



ఆడవారు దయతో నిమిరితే ప్రయోజనమేమిటి? మరీ వాడు కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరుగడమే అయితే ప్రయోజనమేమిటి?"

ధరాధీశుడు ఈ విధంగా ఆలోచించి, దయాదిగ్ధమైన బుద్ధితో అతని వాంచితసిద్ధికి పూనుకున్నవాడై అతనిని మేల్కొలిపి ఇలా అన్నాడు. "ఓయీ! లే, లే. నీ ఈప్సితార్థసిద్ధికోసం త్వరత్వరగా ఫలించే పరమోపాయం నాకు తట్టింది. నాతలను నరికి బ్రహ్మదత్తరాజుకు అప్పగించు. అతడు ప్రీతుడై నీకు కావలసినంత విత్తం ఇస్తాడు."

అర్థి చందన తరువైన ఆ రాజుమాటలు ఆ బ్రాహ్మణునికి సూదికాల్చి చెవిలో పెట్టినట్టు తగిలాయి. "మహారాజా! నీవు త్రిలోకాల సారం వంటివాడివి. జగత్పుణ్యంతో అవతరించినవాడివి. ఎలాటి పాపిష్ఠుడు నీ కంఠంపై కత్తి విసురుతాడు? ఎంత లోభలుబ్ధమతి అయినా నీకు అహితం ఆలోచిస్తాడా? సహకార వృక్షంపై ఎవరైనా నిప్పులు చల్లుతారా?" అని వాపోయాడు. రాజు ఆ మాటలు విని "చంపి తల తీసుకొనకపోతే పోయావు. ప్రాణాలతో పట్టి కట్టి తీసుకొని వెళ్ళు" అని పెక్కుసార్లు కపిలుణ్ని బతిమాలుకున్నాడు. కపిలుడు రాజు అభ్యర్థనను కాదనలేక అతనిని కట్టి పట్టుకొని బ్రహ్మదత్తుని వద్దకు తీసుకొని వెళ్ళాడు. బ్రహ్మదత్తుడు చాల సంతోషించి బ్రాహ్మణుడు కోరిన దానికంటె హెచ్చుగానే ధనమిచ్చాడు.

పిదప బ్రహ్మదత్తుడు అదీనపుణ్యుని చరితాన్ని, సత్త్వగుణంతో ఆశ్చర్యకరమైనదాన్ని ఆ బ్రాహ్మణుని వల్ల విని వైరవికారదుస్సహతరమైన క్రౌర్యమనే విషం వదలిపెట్టి అతనిని తన శిరస్సువలె ఉన్నతమైన సింహాసనంపై కూర్చోబెట్టి, తన ఉష్ణీషమాలను అతని చరణాంబుజంలో దోగాడేటట్టు చేసి నతాంజలి అయాడు. బ్రహ్మదత్తుడు వినయప్రపత్తితో స్వనగరానికి వెళ్ళగా, అదీనపుణ్యుడు శత్రుహీనమైన రాజ్యాన్ని పొంది తన కీర్తితో తెల్లనైన సముద్రఫేనమాలాదుకూలాలు ధరించిన పృథివిని ధర్మంతో పాలించాడు. భువనసారుడైన ఆ అదీనపుణ్యుడనే రాజును నేనే. అప్పటి సమాచారం ఇప్పుడు నాకు జ్ఞాపకం వచ్చింది. ఈ ప్రాంతం ముందుముందు బహుసంఘస్థానాలతో ఆరామాలతో అభిరామమై, భవముక్తి హేతువై శోభిస్తుంది.

బుద్ధభగవానుని సత్త్వోజ్జ్వలమైన చరితం విని, పూర్వావదాన కథలతో విస్మయం కలిగి సంతోషించిన నాకపతికి శరీరం రోమాంచపత్రరచనారుచిరమైంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో అదీనపుణ్యావదానమనే యాభై రెండవ పల్లవం

# 53. సుభాషితగవేష్యవదానం

కంఠంలో ఉత్తమసూక్తి, శిరస్సుకు నతి, చెవులకు శ్రుతం, ముఖంలో నిత్యమూ అనామయమైన సత్యం విద్వాంసులకు ప్రియమైన భూషణాలు. తక్కినవారు రత్నాలు కూర్చిన నగలతోను, ముత్యాలహారాలతోను విశిష్టంగా కనిపించే వేషరచనావేశంతో సంతోషపడుతారు.

మరొకమారు భగవానుడు నవ్వగా ఇంద్రుడు కారణం తెలుసుకోవాలని ప్రశ్నించాడు. దానికి సర్వజ్ఞుడిలా సమాధానం చెప్పాడు.

పూర్వం వారాణసిలో సుభాషితగవేషి అనే రాజుండేవాడు. అతని జాత్యుజ్జలమైన కీర్తి సిరికి మూలంగా ప్రకాశించింది. అతడు వివేకవంతుల సువృత్తమూ, గుణసంయుతమూ, హృదయరంజకమూ అయిన సూక్తిని ఆభరణముగా కోరినట్టు మౌక్తికాన్ని కోరేవాడు కాడు. అతని ధనాగారలక్ష్మి యాచకులకు ఎంతగా అప్పగించినా నిశ్చలంగా ఉండేది. అతని కీర్తి ఎంతగా గుణనిబద్ధ అయినా(తాడుతో కట్టివేసినా) దూరదూరాలకు వ్యాపించింది. ఆ రాజహంస సరసులైన కవివరులతో ఉంటూ, విద్వత్ప్రభ అనే కమలిని భోగసౌభాగ్యం పొందాడు. సదుపదేశమిచ్చే అతని గుణయుక్తమైన సూక్తులు గుణయుక్తమైన (వత్తితో కూడిన) దీపశిఖలవలె ప్రజల మోహతిమిరాన్ని దూరం చేశాయి.

అతడు ఒకమారు సభాసీనుడై సుభాషిత ప్రస్తావంలో సుమతి అనే తన ప్రధానామాత్యునితో ఇలా అన్నాడు. "సాధుశబ్దాలతో ఒప్పేవారు, గుణాలంకారశాలురు, సుభాషితులు అయిన మీతో ఈ సభ భారతివలె శోభిస్తున్నది. కొత్త సుభాషితాలు, పాకరసవంతమైనవి కొత్త పూలలాగ ఏమైనా ఏరారా? సూక్తులు, ప్రతిభలు, పూలగుత్తులు, యువతుల నవయౌవనం వలె కొత్తవైతేనే మనోహరాలు. దగ్గర సరసమైన పుష్పసమూహం విస్తారంగా ఉన్నా నిరంతరాస్వాదంతో నిరాదరం ఏర్పడడం వల్ల పరిచితమైనవాటిని పరిహరించే మధుపం దూరదూరాలలో కొత్తకొత్త పుష్పరసాన్ని అన్వేషిస్తూ తిరుగుతుంది. ఈ సదస్సులో పరామర్శించబడే ప్రతిసూక్తిరత్నమూ పరీక్షలో నెగ్గి సర్వత్రా విలువ పొందుతుంది. పాండిత్యంతో నష్టబుద్ధులైనవారి జీవితం వ్యర్థం. ఆ పాండిత్యం కవిత్వం వినా ఉల్లాసం కలిగించదు; చిలుకపలుకుల్లాగ నిరర్థకం. ఇక కవిత్వమూ చారుతరమైనప్పటికీ సహృదయులు లేకపోతే తత్త్వవివేచన శూన్యమై నిర్జనప్రదేశంలో వున్న బావిలోని దీపంలాగ అవుతుంది. కనుక ఈ సమయంలో నూతన సూక్తి ఏదైనా చెప్పండి. కోకిల కూజితానికి చైత్రమాసం వలె సూక్తికి సహృదయ సమాగమమే పరువమైన కాలం. తత్త్వమెరిగినవారు క్షణకాలం మనసుపెట్టారంటే, వాక్కుల చమత్కారం జాజుల పరిమళాన్ని జయిస్తూ గుప్పుమంటుంది. అయితే ఈ ఉత్తమ సామగ్రి ఉదగ్రమైనా, మనోవికాసం కలిగించేదయినా, పఠించడానికి ఆత్మీయునివలె అవకాశం లభించనప్పుడు విఫలమౌతుంది."

ధీమంతుల హృదయాలు స్పృశించే నరనాథుని మాటలు విని మహామాత్యుడు ఇలా సమాధానం చెప్పాడు. "రాజన్! విబుధాధీశుడవైన నీ నూతనశ్లోకమే (కీర్తి) భువనత్రయంలోను గానం చేయబడుతున్నది. ఇతర సూక్తులెందుకు? వదాన్యశ్రేష్ఠుడయిన నీవు విద్యావినోదివై ఆదరం చూపుతుండగా, ఈ మహీతలమంతా విద్యాధరమైంది. కళాకమలినీనాథుడవు, గుణవంతులకు మిత్రుడవు అయిన నీవు ఉదయించగా జనులందరు వెలుగులో సన్మార్గాన సంచరిస్తున్నారు. సహృదయుడైన రాజు క్షణకాలం ఆదరలేశం చూపినా, లోకంలో ఆయా కళలు, ఆయా విలాసవిశేషాలు, ఆయా గుణాలు, ఆయా వ్యక్తులు, ఆయా చరితాలు ప్రీతిపాత్రమౌతాయి. భూపాలుడు విద్వాంసుడైతే, ప్రజలు విద్యావిలాసోత్సావాతిశయం అందుకుంటారు. నరపతి శూరుడైతే, ప్రజలు సంగరరంగ సంగమరుచితో వీరవ్రతం స్వీకరిస్తారు. రాజు మూఢుడైతే, ప్రజలు మూఢులవుతారు. రాజు చంచలుడైతే, ప్రజలు చలస్వభావులవుతారు. క్రూరుడైతే, నృశంస స్వభావులవుతారు. రాజు ఏ పని చేస్తాడో ప్రజలూ ఆ పనే చేస్తారు. సాధుపుష్పాలకు వసంతం వంటి విద్వాంసుడైన రాజు ప్రజలకు పుణ్యం వల్ల లభిస్తాడు. సద్వర్తనగల ప్రజలు, మతిమంతుడైన మంత్రి, సత్యాభిలాషి, మనీషి అయిన మహీపతి- ఇవి మూడు శుభోదయ కాలపు ప్రత్యక్ష సులక్షణాలు. మతిమంతుల బుద్ధి కావ్యార్థతత్త్వంలో అడుగడుగునా నృత్యం చేయడం, ఐశ్వర్యంలోను ఉత్తముల సూక్తులు కర్ణాభరణాలు కావడం, సారస్వతం ఈ విధంగా తన మహిమను వ్యాపింపజేయడం, నిధిముద్రలు తరగనివిగా ఉండడం - ఇవన్నీ రాజు విద్యలను స్వయంవరంలో వివాహమాడడం వల్లనే. రాజమాన్యుడు ఉండగా, ఉత్తముల గుణాలు ప్రకాశిస్తుండగా, సూక్తివైచిత్ర్య లుబ్ధులైనవారు అడవుల్లోను లుబ్ధకులవలె (బోయలవలె) సూక్తులను వెదుకుతారు. ఈ దగ్గరికొండలలో క్రూరకుడనే బోయ ఉన్నాడు. వాని నుంచి కొత్తకొత్త సూక్తిరత్నాలు పొందవచ్చు. వాడు మదించిన సింహాలు తమ గోళ్ళతో ఏనుగు గండస్థలాలు చీల్చి రాల్చిన ముక్తాఫలాలను కవి సమూహాలకిచ్చి సుభాషితాలు సేకరిస్తాడు."

రాజు ముఖ్యమంత్రి మాటలు విని కొలువు చాలించి, సభ్యులకు సెలవిచ్చి, అంతఃపురానికి వెళ్ళాడు. తర్వాత సామాన్య జనానురూపమైన వేషం ధరించి, పరస్పర కిరణాలతోనే కట్టబడినదనే భ్రాంతి కలిగిస్తూ, విస్ఫారమైన తారానికరంవలె అభిరామమైన ముక్తాహార మొకటి గ్రహించి సుభాషితార్థియై నీడే తోడుగా అడవికి వెళ్లాడు. పిల్లగాలులకు పూలు కింద విరజిమ్మి పడి ఉన్నా. అది చూస్తే వంగిన పుష్ప వృక్షాలు అతనికి స్వాగతమిచ్చినట్టు అనిపించింది. అతడు ఎంతో శ్రమతో వెదుక్కుంటూ పోయి, కొండ అడివారంలో ఆ బోయను కలుకొన్నాడు. ఆ బోయ ఎడమచేత్తో అతని మనస్సు లాగే క్రూరమైన ధనస్సు ధరించాడు. అది పిడిఏనుగుల సుఖానికి విరుద్ధమైనది; ఆడలేళ్ళకు వైధవ్యం కలిగించేది; చక్రంలాగ తిరుగులేనిది. కుడిచేత్తో బాణం పట్టుకున్నాడు. చేయి వనమృగాలను నిత్యం చంపడంలో సమర్థమైంది. ఆ బాణం సమస్తహస్తివర్గానికి అపవర్గం కలిగించేది. అతడు నెమలి రెక్కల ఉత్తరీయం ధరించాడు. దానిలోని నెమలియాకల కొసలు పిల్లగాలికి అందంగా కదులుతున్నాయి. అది చూస్తే, ఆడనెమళ్లు తమకు పతిభిక్ష పెట్టమని తమ భయసంత్రస్తనేత్రాలతో అతనిని యాచించినట్టు ఉంది.

రాజు ఆ వ్యాధుణ్ని పూజ్యుణ్ని పూజించినట్టు వినయవచనాలతో మర్యాద చేసి, గురువుకు నమస్కరించినట్టు నమస్కరించి, ఎర్రటి పెదిమల కాంతితో దంతకాంతి మారి పల్లవించగా ఇలా

అన్నాడు:- "సుభాషితాలను ఎల్లప్పుడూ సంగ్రహించే నీ ప్రయత్నం నేను విన్నాను. బాగు. నాకు దారి తెలియడానికి ఒక నూతన సూక్తిరత్నం, ఉజ్జ్వలమైంది ఇవ్వు. దానికి ప్రతిఫలంగా ఈ ముక్తాహారం స్వీకరించు. ఇది తన లావణ్యంతో చంద్రుని దర్పాన్ని అణచివేసేది. తిమిరసందోహానికి ప్రహారం వంటిది. లక్ష్మి విలాసస్మితంవంటిది." ఈ విధంగా రాజు అన్ని దిక్కులకు కాంతులు విరజిమ్మే హారాన్ని బోయకు చూపాడు.

తనకు స్వప్న మనోరథాలలోను పొందలేని ఆ హారాన్ని క్రూరకుడు చూచి నెమ్మదిగా ఆలోచించాడు. "ఈ బుద్ధిలేనివాడు ఇవ్వదగని ఈ హారాన్ని ఇచ్చిన మీదట పశ్చాత్తాపం పొందుతాడనడంలో సందేహం లేదు. ఇతడు పరలోకానికి వెళ్ళగా, హారం నాకు స్వంతం ఎలాగు అవుతుంది" ఇలా ఆలోచించి రాజుతో అన్నాడు: "ఓ సాధూ, ఒక్క నిబంధనపై నేను సూక్తి నీకు చెబుతాను. నా సూక్తి గ్రహించిన మీదట నీవు ఈ కొండకొననుంచి కిందికి పడిపోవాలి."

లుబ్ధకుని క్రౌర్యానికి తగిన ఈ మాటలను విని రాజు మనసులో ఇలా అనుకున్నాడు. "ఆహా! సంస్కారంగల ఇతనికి కూడా ఈ నిషిద్ధ కార్యాచరణంలో పట్టుదల! కుటిలబుద్ధులు దూరంనుంచి తమపై గుణాలు ఆరోపింపజేసుకొని ప్రసిద్ధులవుతారు. ప్రత్యక్షంగా చూస్తే దుష్కృతాలు జరుపుతారు. వారిని గురించిన ప్రవాదం ఒక విధం, చరితం మరొక విధం. ఇతనికి ఈ క్షుద్రత ఏమిటి? వనంలో వాస మేమిటి? జీవహింస ఏమిటి? గుణాభియోగమేమిటి? (నారితో సంబంధమేమిటి?) సూక్తచర్య ఏమిటి? నిష్కరుణ ఏమిటి? అయ్యో! ఇతని చరితం విమోహహతం కదా! లుబ్ధుడు, లుబ్ధకుడు- వీరిరువురి చరిత్రాలు సమానమే. ఏమని చెప్పను? ఎదుట అంటీఅంటనట్లు తియ్యగా పాడుతారు. వన్యవ్రతాలతో (వనవాసస్థితితో వ్యాధుడు, వనవాసంవంటి వ్రతంతో లోభి) ఇద్దరూ శాంతులయినట్లు కనిపిస్తారు. గుణసంగ్రహంతో (నారిని పట్టడంతో వ్యాధుడు, గుణాలను సంగ్రహించడంతో లుబ్ధుడు) ఇద్దరూ ప్రాణం తీసేవారే. దుర్జనుడు విద్యలు నేర్చినా, తీక్ష్ణస్వభావాన్ని వదలుకోడు. నాగసర్పాలు పడగల రత్నాలకాంతులతో వెలగిపోతున్నా, క్రోధమనే అంధకారంనుంచి తొలగిపోవు. క్రూరునికి ఎంత శాస్త్రోపదేశంతో సంస్కారం కలిగించినా, తన క్రౌర్యం వదలడు. కర్పూర ప్రవాహంలో ముంచినా వెల్లుల్లి తన వాసనను వదలుతుందా?"

రాజు ఈ విధంగా చాలసేపు ఆలోచించి, నవసూక్తులను వినే ఇచ్ఛగలవాడు కావడం వల్ల "ఏదీ! ఆ సూక్తిని వినిపించు. తర్వాత కొండకొననుంచి దేహం త్యజిస్తాను." అని వ్యాధునితో అన్నాడు. వ్యాధుడు సత్యధనుడైన ఆ రాజు మాట విని కాంతులకు విహారభూమి అయిన హారం తీసుకొని, "ఇదుగో విను!" అంట్లూ సూక్తిని చెప్పసాగినాడు. "పాపం, స్వసుఖానికి శాపం వంటిది. కుశలం కోరేవాడు తీవ్రతాపంగల ఆ పాపాన్ని తాకరాదు. కుశలానికి ఆకరమూ, శీలంతో ఉన్నతమూ అయిన పుణ్యపద్మాన్ని ఆశ్రయించాలి. ఈ మనస్సు చపలమైన విషయసుఖాలను ఆస్వాదించడానికే ప్రలోభపడుతుంది. కనుక ఆశలు విడనాడి మనస్సును ఇష్టమైన అనంత సంతోషంతో సంతృప్తిపడేట్లు చేసుకోవాలి. ఇది సుగతుని శాసనం; ప్రశమరాజ్యానికి సింహాసనం; మానవులకు వ్యసననివారణం; సర్వసామాన్యమైన కుశలమార్గం; కామవికారాలను పోగొట్టేది; భవవికారాలను దూరం చేసేది; మనస్సనే అద్దాన్ని శుద్ధంగా ఉంచేది. సుకృత సంచయాన్ని ఆర్జించేదీని."



తత్త్వాన్వేషకుడైన రాజు మృగమారకుడైన ఆ వ్యాధునినుంచి ఈ సుభాషితాన్ని స్వీకరించి నిర్మలమూ ఆత్మసంశోధనమూ అయిన ఆ సూక్తార్థం మనసులో పదిలపరచుకొని సమున్నతమైన అద్రిశిఖరం ఆరోహించి దేహాన్ని విసర్జించాడు. పుణ్యమనస్కులకు సత్యమే మిక్కిలి ఇష్టమైనది కాని, ఈ చంచలమైన దేహం కాదు. జగత్సంతారణంకోసం ప్రణిధానం చేసి అతడు గిరిశిఖరం నుంచి పడీపడంగానే, ఆ పర్వతంలో వసించే విజయుడనే యక్షుడు అతన్ని రక్షించాడు. రాజు సుఖంగా కొండ కిందికి చేరుకున్నాడు. ఆయన అద్భుత సత్త్వానికి భయపడినదా అన్నట్లు లోకత్రయం కపించింది. ఆకాశం నుంచి కుసుమ వర్షం కురిసింది. దేవతలందరూ అతని చరిత్రను కీర్తించారు. పిదప రాజు నెమ్మదిగా తన రాజధానిని చేరుకున్నాడు. తర్వాత లోకహితకామి అయిన ఆ రాజు ఉపదేశభరితమైన ఆ సుభాషితంతో తన ప్రజలనందరిని భవదుఃఖాన్ని అభిభవించగలిగి ధర్మ నిత్యమైన సత్కర్మలో నిష్ఠగలవానిగా చేశాడు.

ఇలా ఉండగా, హారం గ్రహించిన ఆ వ్యాధుడు దానిని అమ్ముకొనడం కోసం నగరానికి వచ్చి దుస్సాహసం చేయడం వల్ల బెరుకు బెరుకుగా అంగడివీధిలో తిరుగుతుండగా, నగరరక్షకులు దొంగ అని అనుమానంతో పట్టుకొని రాజసభలో హాజరు జేశారు. చేత్తో ఉజ్జ్వలమైన ముక్తాహారం పట్టుకొన్న అతనిని దూరంనుంచే రాజు చూచి, ప్రాణత్యాగం షరతుగా పెట్టిన వ్యాధుడని గుర్తించి, 'వీడు నాకు ఆచార్యుడు; శమగుణం ప్రసాదించిన సూక్తాన్ని ఉపదేశం చేసినవాడు. కనుక పూజార్హుడు' అని నమస్కరించి, సత్కరించి విడిచి పెట్టాడు.

ఆ విధంగా సత్యవ్రతుడు, సత్యవంతుడు అయి, కాలక్రమంగా సమ్యగ్బోధి అనే నిధానంతో మహిమావంతుడైన సుభాషితగవేషి నరపతిని నేనే.

భగవానుడు చెప్పిన స్వవృత్తాంతాన్ని సురపతి విని హర్షవిపులలోచనుడై పద్మాకరశోభను పొందాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సుభాషితగవేష్యవదానమనే యాభైమూడవ పల్లవం

# 54. సత్త్వౌషధావదానం

సాధువులు శంఖం వంటివారు. శంఖం చంద్రునివలె తెల్లనిది; సాధుశబ్దానికి వసతి అయి, మంగళాలకు నిధి అయి, జీవితం పోయినా పరోపకారంలో అలసట అనేదే లేకుండా లోకానికి కుశలం కలిగిస్తుంది. సాధువులు తమ కీర్తి చంద్రికలతో శశాంక సుందరులు. సాధుశబ్దానికి(మంచివారనే పేరుకు) వసతి అయి, జీవితాలు పోయినా, లోకానికి క్షేమం కలిగిస్తారు. శంఖం శ్లాఘ్యం; సాధువులు శ్లాఘ్యులే.

భగవానుడు పుష్పిల అనే రాక్షసిని అణచివేసిన పిదప సింహాల భయమేమీ లేక స్వేచ్ఛగా జింకలు విహరించే హరిణవనంలో విహరిస్తుండగా, ఒకమారు ఆయన ముఖంపై మందహాసం మెరిసింది. ఆయన సేవకోసం వెంటనే ఉన్న ఇంద్రుడు హాసకారణమేమని ప్రశ్నించాడు. భగవానుడు ఇలా అన్నాడు.

పూర్వం విజితస్వర్గోత్సవమైన మహేంద్రవతి అనే పట్టణం ఉండేది. అక్కడి ప్రజలు డెబ్బది రెండువేల సంవత్సరాల దీర్ఘాయుస్సుతో ఉండేవారు. ఆ పట్టణాన్ని మహేంద్రసేనుడనే రాజు పాలించేవాడు. ఆ మహారాజు తనకీర్తి కర్పూరవర్తికలతో దిక్కుల తిమిరరోగాన్ని పటాపంచలు చేస్తూ, రిపుదర్పజ్వరాన్ని హరిస్తూ, దుర్దశ పొందినవారి కృచ్ఛ్రరోగాన్ని (కష్టాలను) పోగొడుతూ, తృష్ణను దూరం చేస్తూ ప్రజలను సద్వైద్యునివలె పాలించి స్వస్థులను చేసేవాడు. ఆ రాజుకు రూపుదాల్చిన పుణ్యపుంజం వంటివాడు, సర్వప్రాణిహిత కాంక్షి అయిన సత్త్వౌషధుడనే కుమారుడున్నాడు. అతడు భాద్రకల్పికుడనే బోధిసత్త్వుడు. సత్త్వగుణ విభూషితుడు; కరుణ, ముదిత, ఉపేక్ష, మైత్రి అనే గుణాలు అతనిని వరించాయి. పట్టణాలనుంచి, గ్రామాల నుంచి, అరణ్యాలనుంచి, దిక్కుదిక్కులనుంచి ఎల్లప్పుడూ రోగులు వస్తూ అతని స్పర్శతో రోగవిముక్తులై స్వాస్థ్యం పొందేవారు. జనసమూహమనే ఈ అరణ్యంలో సజ్జనుడనేవాడు చందనవృక్షం వంటివాడు. చందనవృక్షం అమూలాగ్రమూ పరులకే ఉపయోగపడినట్లు, సుజనుడు తన దేహంతో అపారమైన పరోపకారం చేస్తాడు. దుష్టసహవాసంతో సంతప్తులైన వారికి సాధుసమాగమం ఎంత సుఖం కలిగిస్తుందో అదేవిధంగా, అతడు దీర్ఘవ్యాధి పీడితులకు తన సహవాసంతో వెంటనే సుఖం కలిగించేవాడు. శరీరరోగాలను స్పర్శచేత, మనోరోగాన్ని ధనం చేత పోగొట్టడం వల్ల అతని పరిసర దిక్కులలో ఆర్తులనేవారు గాని, అర్థిలనేవారు గాని ఏ దిక్కునా లేకపోయారు.

కాని కాలం ఒకే తీరున ఉండేదేనా? కాలవిలాసం సకలాశ్చర్యాలను దిగమింగివేసేదికదా! ప్రజల పుణ్యం క్షీణించడం వల్ల ఆ రాజకుమారుడు కాలధర్మం చెందాడు. గుణగంధాన్ని గుప్పుమని దిక్కులకు వెదజల్లే ఉత్తముల ఉనికి క్షణికం. కన్నులకు చలవనిచ్చే చంద్రుడు ప్రీతిపాత్రమైన వారిని అకాలంలో మననుంచి వేరు చేసివేయగలది. దీని చెయిదం ములుకులవలె ఎవరి మనస్సుకు నాటుకోదు? ఎంతో సుకుమారమైనది. విపుల పుణ్యంతో పొందినది, సర్వరోగ సంజీవని, అయత్నంగా లభించిన



సుఖమైనట్టిది- అన్నీ కాలబలగ్రస్తమై నశిస్తాయి. ఇదంతా చూస్తున్నా, మూఢులకు ఒకమారయినా వివేకలవమైనా కలుగదు.

రాజకుమారుడు యశశ్శేషుడు కాగా, ప్రజలు అతని విరహదుఃఖం మరచి, రోగభయంతో మొదట స్వదుఃఖాన్నే చూచుకోవడం ఆరంభించారు. దేహలక్షణాలు ఎరిగిన మంత్రులు రాజకుమారుని శరీరాన్ని లోకహితంకోసం ఒక వనప్రాంతంలో భద్రపరిచారు. పుణ్యసదృశమైన ఆ శరీరం పుష్కరిణులతో రమ్యమూ, ఫుల్లలతావృక్ష సంకులమూ అయిన ఆ వనప్రాంతంలో చెక్కుచెదరక అలాగే ఉండినది. అది తెలిసి దిగంతాలనుంచి ఆశతో వచ్చిన సకలరోగులు ఆ శరీరాన్ని తాకిన మాత్రానే వెంటనే స్వస్థులయేవారు. అతని శరీరాన్ని తాకిన గాలి అక్కడి సరోవరాలలోని కమలాలను, నురగను, నీటిని తాకేది. ఆ నీటిలో స్నానం చేసి మానవులు వెంటనే సకల ఆమయాలు పోయి, అపాయరహితులై అమృతం తాగినవారిలా ప్రకాశించేవారు.

ఆ సత్త్వౌషధకుమారుణ్ని నేనే. అతని పేరు స్మరించడం వల్లనే వ్యాధులన్నీ నశించిపోతాయి. నా యీ కథను, స్మరణమాత్రంతోనే అమృతంవంటి దానిని తలిచేవారికి ఆధి వ్యాధిమయమైన దుఃఖమంతా శమిస్తుంది. కొంతకాలానికి ఈ దేశంలో అశోకుడనే రాజు జన్మిస్తాడు. అతడు లోకహితం కోసం చైత్యం నిర్మిస్తాడు.

ఈ విధంగా సుగతుడు చెప్పినదానిని శ్రద్ధగా విన్న అమరరాజు ముఖం సంతోషసంభ్రమంతో విరాజిల్లింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సత్త్వౌషధావదానమనే యాభైనాల్గవ పల్లవం

# 55. సర్వందదావదానం

చింతామణి మనం కోరుకున్న వస్తువును ఇస్తుంది. కల్పద్రుమం తను కల్పించుకొన్నదాన్నే సృష్టించి ఇస్తుంది. దేహప్రదానానికి స్వయంగా ఉద్యమించిన త్యాగిని వర్ణించడానికి పదాలేవీ?

శాస్త అయిన సుగతుడు ఘాటుడు, ఉపఘాటకుడు అనే మదమత్తులైన యక్షులను అణచివేసిన పిదప కేశినీవనం నుంచి మరొక వనానికి వెళ్ళి విశ్రమించాడు. అక్కడ ఒకనాడు ఉపదేశగోష్ఠిలో అతని ముఖంపై చిరునవ్వు చిందింది. దానికి కారణమేమని ఇంద్రుడు ప్రశ్నించగా, శాస్త ఇలా చెప్పసాగాడు.

పూర్వం సర్వ సంపదలకు ఆవాసభూమి అయిన సర్వావతి అనే నగరం ఉండేది. ఆకాశాన్నంటే మణి మందిరాల కాంతితో అది నవ్వుతున్నట్టు ఉండేది. దానిని నిర్మల తేజస్కుడైన సర్వందదుడనే రాజు పాలించేవాడు. అతని కీర్తి త్రిభువనాలకు వెన్నలగా రేయింబవలు వెలిగింది.

ఆ భూమిశతక్రతువు ఒకనాడు ప్రజల సుఖదుఃఖాల మనవులు చిత్తగించడం కోసం రాజప్రాసాదాంగణ భూమిని చేరాడు. అక్కడి సామంతుల కిరీటరత్నాలతో అతని మూర్తి ప్రతిఫలించింది. అది చూడగా, అసంఖ్య రూపాలతో అతడు పృథివీకార్యం ముదలకించేటట్టు కనిపించింది. అతని ముందు నతులైన అర్థులు అతని చంద్రకాంతమయమైన పాదపీఠంలో ప్రతిబింబించడం చూడగా దాని చల్లదనం వల్ల వారు చింతాతాపాలనే వదలినట్టు కనిపించింది. ఇంతలో ఎక్కడినుంచో కాలిన రెక్కలుగల ఒక పావురం దిక్కులేనిదై అతని ఒడిలో వచ్చి వాలింది. భయంతో కళ్ళు తేలవేస్తూ, కుంచించుకుపోతున్న ఆ పావురాన్ని చూచి పృథివీపతికి జాలి కలిగింది. “నీకిక్కడ భయమేమిటి?” అని అతడు కమలాదేవి చేతిలోని సముత్ఫుల్ల లీలాకమల దళకాంతిని విరజిమ్మే చూపు దానిపై పరపాడు.

ఆ సమయంలో రాజు సత్త్వనిష్ఠను పరీక్షిద్దామనే జిజ్ఞాసతో పాకశాసనుడు మాయతో లుబ్ధకవేషంతో వచ్చి రాజుతో ఇలా అన్నాడు. “దేవా, బహుకాలానికి నాకు ఆహారమైన ఈ పక్షిని పొందగలిగాను. ఇది మాకు సహజమైన వృత్తి; ఎవరూ అడ్డుపెట్టనిది. అయాచితమైనదీని. ఓ జగతీపతే, ఇది నాకు సహజసిద్ధమైన భోజనం. దీనిని వదలితే నేను బతకలేను. ప్రాణాలు తిండిపైనే గదా ఆధారపడుతాయి. చేతికందిన ఈ ఆహారం చేయిజారిపోయి నేను ఆకలితో ప్రాణాలు వదలుకుంటే, నా భార్య నిరాశతో సంతానంతో సహా మరణిస్తుంది. ఓ ధర్మాత్మా! ఒకరిని రక్షించడానికి పలువురికి ప్రాణహాని కలిగించేది ధర్మమైతే, అధర్మమనేది ఎలాటిది? పావురంపై ప్రీతితో నాపై ద్వేషం చేసుకొవద్దు. నీబోటివారు ఏదో కారణం వల్ల కలిగిన రాగద్వేషాలతో ప్రవర్తించరు. అది ఎలాటిదో, నేను అలాటివాన్నే. నీకు మేమిద్దరం ఒక్కటే. సత్పురుషులు సర్వభూతాల ఎడ సమానులు. ఒక చోటనే కృప చూపరు.”



లుబ్ధకుడు ఈ విధంగా అనగా, నరపతి మణిమయ కంకణాలు కదలి సవ్వడి చేస్తున్న చేతితో ఆ పావురాన్ని కప్పి, “భయపడకు, భయపడకు” అని అన్నాడు. తర్వాత సర్వజీవ సంతాప నివారణ దక్షుడైన అతడు స్నిగ్ధజీమూత ఘోష గంభీరమైన వాక్కుతో ఇలా అన్నాడు: “ఓ లుబ్ధకుడా! క్షణికమైన తృప్తికోసం ప్రాణిహింస చేయవద్దు. దేహధారులందరికి ప్రాణాలపై తీపి అనేది సమానమైన వ్యధావికారాలు కలిగించేదే. పరప్రాణాపహారంతో అలవరచుకొన్న వృత్తి శ్రేయస్సును నివారించి, పాప సంతాపం కలిగిస్తున్నది. ఈ కపోతాన్ని వదలి నాకోసం సిద్ధపరచిన ఆహారమంతా నిరాఘాటంగా, స్వేచ్ఛగా తీసుకో.” ఈ మాటలు విని శ్రేష్ఠమైన ఉపభోగాలు నచ్చని ఆ లుబ్ధకుడు ముఖం వాడిపోయి, నిట్టూరుస్తూ, “రాజా! మేము అరణ్యవాసులం. రాజభోగానికి అర్హులం కాము. రసజ్ఞులం అంతకన్నాకాము. గడ్డిగాదం తినే మృగాలు మోదకాలతో తృప్తి పడతాయా? ఒంటె ఎడారిలో తనకు పరిచితమైన ఆకులు లేని ముండ్ల తీగను చెట్టు చేమగల అరణ్యంలో కానక దుఃఖంతో, ఆకలితో నకనకలాడుతునునే ఉండిపోతుంది. కాకి రుచిగల మామిడి చివురును విషమనుకుని మింగదు. స్వభావభేదాన్ని బట్టి ఎవరికి ఏది నచ్చుతుందో అదే సుఖకరంగా ఉంటుంది. ఇప్పుడు రాజార్హమైన భోగం అనుభవించి రేపు ఏమిటి అనుభవిస్తాను? మరుసటి దినం దుర్లభం కానిది ఈనాడు తింటేనే సుఖం. సరసాహారం భుజించేవాడు విరసాహారం భుజించడు. బహు పరిజనుల మధ్యన ఉండేవాడు ఒంటిగా ఉండలేడు. రథంలోనే తిరిగేవాడు కానినడకన వెళ్ళడానికి కష్టపడతాడు. ధనం పోగొట్టుకొన్నవాడు కష్టాలను ఎదుర్కొనడానికే భయపడతాడు. దేవా! నీ దృష్టి పడినవారికి రాజార్హమైన భోజనం ఎన్నటికీ దుర్లభం కాదు. కాని, నా జన్మకు అపూర్వమైనది నాకు ప్రియం కాదు. వేటలో చిక్కిన మాంసమే మాకు జీవిక. కనుక నాకు ఈ పావురం రెండితలుగా నీదేహమాంసం ఇప్పించు” అని కోరాడు.

రాజు ఈ మాటలు విని వెంటనే చింత ఉడిగి, ప్రహర్షోత్ఫుల్లనయనాంభోరుహుడై ఇలా అన్నాడు: “ఈ పావురం ప్రాణం, నీ ప్రాణం ఎలా రక్షించాలా అని సంశయపడుతున్న నాకు బుద్ధిమంతుడవైన నీవు ఈ స్పష్టమైన ఉపదేశం చేశావు. ఉభయప్రాణ సందేహంతో డోలాందోళితమైన నా మనస్సును మిత్రునివలె నీవే చిక్కబట్టేటట్టు చేశావు. నీ చూపులతో కట్టివేసిన ఈ పక్షిని వదలిపెట్టు. ప్రస్తుతం నా మాంసంతో ప్రాణధారణ చేయి.”

సత్యప్రతిజ్ఞుడైన రాజు పక్షియెడ కరుణతో ఈవిధంగా పలుకగా అమాత్యులు విషదిగ్ధ బాణాలు తాకినట్టుగా మూర్ఛితులయారు. దాన సమయంలో నాకు సచివులు హితాహితాలేమీ చెప్పరాదన్నంత ప్రతిజ్ఞగా అతనికి శరీరత్యాగనిశ్చయం కలిగింది. “నాదేహం కోసి మాంసం త్రాసులో పెట్టేవానికి ధనం ఇవ్వండి” అని రాజు మంత్రులను ఆదేశించాడు. పిదప రాజు తన దేహం కోసి మాంసం తీయడానికి జనం ముందుకు రావాలని, స్వర్ణవర్షం కురిపిస్తానని ప్రకటించాడు. దుష్కర్మలు చేస్తూ కుటిలమైన బుద్ధిగలవారు కూడ ఆ మాటలు వినలేక చెవులు మూసుకొని వెళ్ళిపోయారు.

కాని కపిలపింగలుడనేవాడు ఒకడు మాత్రం చురకత్తి చేతపుచ్చుకొని, క్రూరమైన ఆ పనికి సిద్ధమయ్యాడు. సరళచ్ఛేద దక్షులు, సహజ వక్రులు అయిన దురాత్ములు రంపాలవంటివారు క్రౌర్యంలో. వారికి అకృత్యమనేది ఏమిటి? దుర్మార్గుడు తన చర్యలతో అందరికీ ఆశ్చర్యం కలిగిస్తూంటాడు!

ఎలాగంటే, శస్త్రాలతో పగులగొట్టలేనిదాన్ని వినోదపు మాటలతోనే పగులగొడుతాడు. చెప్పడానికి శక్యం కానిదాన్ని కూడా వెంటనే చేస్తాడు. చేయరాని పనిని కూడా మనసుతో వెంటనే ఆలోచిస్తాడు. కపిలపింగలుడు త్రాసులో ఒక తట్టలో పావురాన్ని ఎక్కించి, రాజు కుడితొడను కోసి తీసిన మాంసాన్ని మరొక తట్టలో పెట్టాడు. తొడ కోయడం వల్ల పడిన మొదటి రక్తబిందువులతో భూమి విహ్వలురాలయిన దానివలె దిరదిర తిరిగింది. త్రాసులో పారావతం ఉన్న భాగం కిందికి పోయింది; రాజు మాంసమున్న భాగం మీదికి లేచింది. అది చూచి రాజు "మరొక తొడ కోసి మాంసం ఇవ్వు" అని కపిలపింగలుని ఆదేశించాడు. ఆయన ఆదేశం ప్రకారం మరొక తొడ కోసినా, రెండు భుజాలు కోసి మాంసం తక్కెడలో పెట్టినా, పావురంతో సమానం కాలేదు . రాజు మనస్సుకు త్రైలోక్య సంశయమే కలిగింది, స్నాయువులే మిగిలిన ఆ రాజు వెంటనే తనే ఆ త్రాసులో కూర్చున్నాడు. అప్పుడు అతని విరహంతో ఉద్విగ్నురాలైనట్లు కీర్తికాంత దిగంతాలకు పరిగెత్తింది. అప్పుడు ఆ రాజు మొక్కవోని ధైర్యానికి త్రిలోకాలు ఆశ్చర్యపడ్డాయి. దేవతాస్త్రీలు తమ ధమ్మిల్లాలలోని పూలదండలు చేతులలో నింపుకుని అతని అద్భుత చరితాన్ని పూజించాలనే బుద్ధి పుట్టింది.

అప్పుడు క్రూరకర్ముడైన ఆ లుబ్ధకుడు నిర్వకారంగా త్రాసులో కూర్చున్న రాజును చూచి, "ఈ దేహదానం వల్ల నీ అభీప్సితమేమో నాకు తెలియడం లేదు. దేహధారులకు సకల లాభాలకు ముఖ్యమైనది దేహమేకదా! నిజంగాచెప్పు. దేహత్యాగం చేసేటప్పుడు నీమనస్సు విరగలేదా" అని అడిగాడు. ఆ మాటలు విని రాజు మందహాసంతో ఇలా అన్నాడు: "ఈ లోకంలో నాకు పొందదగిందేమీ లేదు. సర్వజగత్తు హితం కోసం అనుత్తర సమ్యక్సంబోధి కలగాలనేదే నా అభీప్సితం. నా మనస్సు వికలం కాలేదన్నమాటే నిజమైతే, నా శరీరం పరిక్షతమై యథాస్థితిని పొందనీ!"

ఈ మాటలు రాజు అన్నాడో లేదో సత్యశీలుడైన అతని దేహం వ్రణాలు మాని, పూర్ణచంద్ర కాంతితో ప్రకాశించింది. ఆ మీదట పావురం వెళ్ళిపోయింది. లుబ్ధకుడూ వెళ్లిపోయాడు. తెల్లవారింది. భూపాలుడు రెండింతల కీర్తి విభవాలతో ప్రకాశించాడు. సర్వందదుడైన క్షితిపతిని నేనే. నా దేహం కోసిన కపిలపింగలుడు దేవదత్తుడు. ఆ సంగతి జ్ఞాపకం వచ్చి నాకు నవ్వు వచ్చింది.

సుగతుడు చెప్పిన పూర్వవృత్తాంతం విని దేవరాజు చాల సంతోషించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సర్వందదావదానమనే యాభైఅయిదవ పల్లవం

# 56. గోపాలనాగదమనావదానం

సత్పురుషులు చంద్రునిలాగ అమృతరస శీతలులు. వారిని చూడగానే ద్వేషవిషోష్ణం చల్లారిపోతుంది. అలాటివారు ఎవరికి వంద్యులు కారు?

ధారాముఖుడనే యక్షుని స్థానం నుంచి సుగతుడు అంతర్హితుడై క్షణంలో హింగుమర్దనమనే నగరం చేరాడు. అక్కడ బ్రహ్మదత్తుడనే రాజు పూజించగా, అతని సభలో ఉపదేశం చేసి, అందరిని ధన్యులను చేశాడు.

అప్పుడు ఆ నగరవాసులు వచ్చి, సర్వప్రాణులకు సకలాపదలను పోగొట్టే భగవానునితో ఇలా మొరపెట్టుకున్నారు. "భగవన్, ఈ నగరం పొలిమేరలో పాషాణ పర్వతమనే ఒక రాతిగుట్ట ఉంది. అక్కడ క్రూరమైన విషసర్పమొకటి ఉంది. దాని పేరు గోపాలకుడు. అది పశువులకు, ప్రజలకు, పంటలకు పెద్ద పిడుగు లాంటిది. ఉన్న వస్తువులను నాశం చేస్తుంది. ఎవరు దానిని సృష్టించారో తెలియదు. అదాంతులను దమనం చేసి, అశాంతులను శమింపజేసే మీకృపే మాకీ ఆపదలో శరణ్యం."

పౌరులు ఈవిధంగా మొరపెట్టుకొని పోయిన పిదప, కరుణానిధి అయిన భగవానుడు సభామధ్యంనుంచి అంతర్ధానం చెంది పాషాణ పర్వతానికి వెళ్ళాడు. ఆ పర్వతపు విశాల తటం మీద ఒక కొలనులో భయంకరమైన ఆ నాగుబాము నివాసం ఏర్పరచుకొంది. ఆ కొలను నీరు ఆ నాగసర్పం విషశ్వాసాలతో నల్లనయినట్లు నల్లగా ఉంది. ఒరనుంచి తీసిన కత్తులలాగ కనిపించే అలలు ఇంకా భయంకరంగా కదలాడుతున్నాయి. ఆ కొలనుగట్టున భగవానుడు పర్యంకబంధంలో ఆసీనుడయ్యాడు; సుధాబంధువైన తన ప్రసన్నదృష్టితో విషాన్నే విషరహితంగా చేశాడు. బంగారు చాయగల ఆయన దేహం ఆ కొలను నల్లనినీట ప్రతిబింబించింది. అది చూడగా సూర్యుడు మరకతచ్ఛాయ గల గగనాన్ని ప్రవేశిస్తున్నట్లు అనిపించింది. అతని దేహప్రతిబింబ ప్రకాశానికి నాగరాజుభవనంలోని చీకటి, భయంతో పరుగెత్తుతున్న పాములగుంపులాగ పటాపంచలైంది. నాగరాజు అతనిని చూచి కోపంతో కండ్లు ఎర్రబడగా కొలనునుంచి తక్షణం పైకి లేచి పడగలు విప్పి, ఆకాశమంతా ఆక్రమించి, ప్రపంచాన్నే మాయా మేఘపరీవృతంగా చేశాడు. అతని క్రోధాగ్ని ధూమసమూహాలనే మేఘాలతో, అతని నాలుకలనే మెరుపులతో దిక్కులు భయంతో కంపించిపోయినట్లయింది. ప్రళయారంభమనే భ్రాంతి కలిగించే ఆ మత్త మాయా మేఘాల గర్జితాలతో కొండలు హృదయాలవంటి గుహలు పగిలాయి. వెంటనే చెట్లను విరిచి పడేస్తూ, కొండచరియలను కూల్చి వేస్తూ, పెద్దగుండ్లను, బండ్లను దొర్లిస్తూ, జీవరాశి ధైర్యాన్నే ధ్వంసం చేస్తూ వర్షం కురిసింది. భగవానుడు ఆ వైపు ఒక్కమారు దృష్టి సారించాడు. ఆ దుష్ట భుజగోత్సృష్టమైన వృష్టి పిల్లగాలికి రాలే కుసుమవర్షం వలె మారిపోయింది. పూల నవ్వులతో తెల్లనై తుమ్మెదల ఝంకారంతో మ్రోగిపోయే వనాలు

ఏర్పడ్డాయి. ఆ వనాలను చూచి వనదేవతలు తమ మెడలోని ముత్యాల దండలకంటే తెల్లని నవ్వులతో క్రూరడైన ఫణీంద్రునితో ఇలా అన్నారు. "ఓ కాలమేఘ! వికారం వదలిపెట్టు. ఇతడు మేరునగధీరుడు. నీబోటివారు ప్రళయకాల ఝుంఝూవాయువులతో నలిగి విరిగి ఈ మేరుపర్వతపు సానువులలోని విలాస కందరాలను ఆశ్రయిస్తారు."

వనదేవతల మాటలకు నాగరాజు మదముడిగి, తన మాయా వికారాలను వదలి బద్ధాంజలియై శాస్త అయిన సుగతుని శరణు వేడాడు. కరుణానిధి అయిన భగవానుడు శరణు పొందిన నాగరాజుకు పంచ శిక్షాపదాలు ఇచ్చి, కుశల పూర్వకమైన అనుగ్రహం ప్రసాదించాడు. నాగరాజు అతని చరణద్వంద్వంపై తల ఆనించి, ప్రణయంతో కోరడం వల్ల సర్పరాజు భవనంలోనే తన సన్నిధానమూ అనుగ్రహించాడు. అప్పుడే భగవానుడు ప్రసంగవశాత్తు శాంతిని ఆకాంక్షించిన ఆ పర్వత వాసి అయిన వజ్రపాణి అనే యక్షుణ్ణి కూడ అనుగ్రహించాడు. ఈ విధంగా పెద్ద లోకోపతాపాన్ని తొలగించి, దేవతల స్తుతులు, పూజలు అందుకొని, పూర్వబుద్ధుల పాదాంబుజ స్పర్శతో పవిత్రమైన ఆ కొండప్రాంతాలలో తిరగి, వనాలలో విహరించాడు.

అప్పుడొకమారు ఆయన మందహాసం చేశాడు. సందర్శనం కోసం వచ్చిన సురరాజు నవ్వుకు కారణమేమని ప్రశ్నించగా ఆయన ఇలా అన్నాడు. "పుణ్య సలిలాలుగల సెలయేర్లు, పరస్పరవైరం లేని ప్రాణులు గల ఈ తపోవనాలు శాంతికి ఆవాసాలు. ధర్మావాసమైన మునులు మనస్సులను కూడా పవిత్రం చేసే ఈ వనాలలో నేను పూర్వం కూడా విహారం చేశాను. కనుక ముని ఈ వనాలలోనే సుగతుడయ్యాడు. శమవిమలబుద్ధి అయిన కాశ్యపముని కూడ ఇక్కడే సమ్యక్సంబుద్ధుడయాడు. ఆడసింహం పొదుగును జింకపిల్ల కుడిచే ఈ పవిత్రవనంలో అఖిలలోక పీడాహరులైన భిక్షుక్కులూ నివాసం చేశారు."

ఇలా చెబుతుండగా, పుణ్యపరిపాకం వల్ల వచ్చిన ఒక లుబ్దకునికి చూపులతోనే శమాన్ని ఉపదేశించాడు. భాగ్యశాలి అయిన ఆ లుబ్ధకుడు భగవానుని అనుగ్రహం వల్ల కుశల లుబ్ధమానసుడై భగవానుడు అనుగ్రహించిన కేశనఖాలు స్వీకరించి తల్లాంఛనమైన మృగాధిపమనే చైత్యం నిర్మించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో గోపాల నాగదమనమనే యాభైఆరవ పల్లవం

# 57. స్తూపావదానం

దిక్కాంతా కర్ణావతంస సదృశమైన కీర్తిగల మహాత్ములు విరాజిల్లుతున్నారు. వారి కీర్తి జగత్తులో
స్తూపరూపాలతో ప్రకాశిస్తున్నది.

భగవానుడు ఒకమారు శక్రునికి ప్రాణదానం చేశాడు. వాని అనురోధంతో పూర్వబుద్ధులు
నిర్మించిన స్తూపాలలో తన స్తూపమొకటి నిర్మింపజేసాడు. దేవతలందరూ దాని నిర్మాణానికి
పూనుకున్నారు. శతసూర్యుల కాంతితో వెలిగిపోతూ రత్నమయమైన ఆ స్తూపం వల్ల జగత్తులోని
మహామోహ సదృశమైన అంధకారం ఎక్కడికో పటాపంచలైపోయింది. ఆ స్తూపంలో జినుడు కిన్నర
గంధర్వ నర నాగ సురులకు ధర్మోపదేశం చేసి వెళ్ళిపోయాడు. దేవతలు పాషాణ పర్వతం పైన నాలుగు
స్తూపాలు నిర్మించగా, భగవానుడు ఐదవ స్తూపాన్ని ఐదు స్తూపాలతో నిర్మించాడు. పిదప వాలోక్షమనే
దేశానికి వెళ్ళి అక్కడ కుబేరునివంటి సుప్రబుద్ధుడనే శ్రేష్ఠితో పూజలందుకున్నాడు. అతనికి ధర్మ వినయం
ఉపదేశించాడు. దానితో సుప్రబుద్ధుడు మోహనిద్ర తొలగగా సపరివారుడుగా ప్రబుద్ధత్వం పొందాడు.
అతడు భగవానుని శాసనం వల్ల తన పుణ్యం వలె ఉన్నతమూ, రత్నదీప్తమైన బాలోక్షీయమనే స్తూపం
కట్టించాడు.

తర్వాత తథాగతుడు డంబరమనే గ్రామం చేరి డంబరుడనే యక్షుని అణిచి వేసి, అతనికి
శిక్షాపదాలు అనుగ్రహించాడు. అక్కడినుంచి చండాలమనే గ్రామానికి వెళ్ళి మల్లిక అనే చండాలికి
వినయోపదేశం చేశాడు. ఆమె ఏడుగురు పుత్రులూ బౌద్ధదీక్ష స్వీకరించారు. కర్మశేషం వల్ల వారికి
మాతంగకులజన్మ కలిగింది. జినదర్శనం వల్ల వారు గతదోషులై పద్మాకరంవలె శోభించారు. సత్పురుషులు
దీనజన అవలంబన పరులు. కనుక దూషితులు, జుగుప్సితులు, పాపిష్ఠులు, విపుల వ్యసనాతురులు అయిన
వారిపై ఎలాటి వికల్పాలూ లేక హెచ్చుగా దయ చూపుతారు.

అనంతరం సుగతుడు సపరివారంగా పాటలమనే గ్రామం చేరి, పోతలుడనే గృహపతి చరిత్రను
ధర్మ్యంగా తీర్చి దిద్దారు. ఆ గృహపతి సుగతానుగ్రహంతో శిక్షాపదంతో పరిశుద్ధుడై సుగతుని
కేశనఖాంకితమైన రత్నస్తూపం నిర్మించాడు. అక్కడికి తన సందర్శనం కోసం వచ్చిన ఇంద్రునితో
భగవానుడు "ఈ దేశంలో మిళిందుడనే రాజు స్తూపం నిర్మిస్తాడు" అని అన్నాడు.

ఈ విధంగా భగవానుని దయార్ద్రవిలోకనం వల్ల ప్రతిష్ఠలంలోను ప్రజలు శోకమోహభయాలు ఉడిగి
శాంతచిత్తులయారు. మేదిని కొత్తగా నిర్మించిన స్తూపాలనే ఒడిలో గలగలలాడే మణికింకిణీకుల
కలకలంతో క్రీడాలోల అయింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో స్తూపావదానమనే యాభై ఏడవ పల్లవం

# 58. పుణ్యబలావదానం

సకల కుశలోత్పత్తికి వసుధవంటి సిద్ధమైన సుధను అంతరంగంలో ఉంచుకుని, ఆపన్నుల వ్యసనాలను శమింపజేసే ప్రసన్నమైన ఆలోకనరసాలతో ప్రజలకు ఆరోగ్యం కలిగించే భవరోగ పరిభవదక్షులైన భిషక్కులు వంద్యులు; అనింద్యులు.

బుద్ధభగవానుడు ఒకమారు పుష్కలావతీ నగరంలో విశ్రమించాడు. అప్పుడు ఆయన ముఖంపై మందహాసం తొంగలించింది. దేవేంద్రుడది చూచి వినయ వినమిత మస్తకుడై "దేవా! మీ చిరునవ్వుకు కారణమేమి?" అని ప్రశ్నించాడు. దానికి బుద్ధదేవుడు ఇలా సమాధానమిచ్చాడు.

పూర్వం పుణ్యబలుడనే పృథివీపతి ఉండేవాడు. అతని ఏలుబడిలో ఎనభైవేల నగరాలు ఉండేవి. అతని రాజధాని పుణ్యవతి. స్ఫటిక శిలలో నిర్మించిన రమ్యాగారాలతో ఆ నగరం వెన్నెలవలె వెలుగొందేది.

ఆ మహారాజు ఒకనాడు తన నగరంలోని నూతనోద్యానం చూడదలచి రథమెక్కి బయలుదేరాడు. దారిలో పథ్యం పాపం లేకుండా, చూచేవారూ, ఉపచరించేవారూ లేకుండా పడి ఉన్న ఒక రోగిని చూచాడు. దీర్ఘరోగంతో పరితపిస్తూ మ్లానవదనుడైన ఆ రోగిని చూచి ఆ రాజు మనసు కరుణతో ద్రవించి బాధాకులమైంది. సత్పురుషులు సూర్యకాంత మణులవంటివారు; ఇతరుల తాపం అద్దంలోలాగ తమలో సంక్రమించగా, తాము కూడ సంతాపం చెందుతారు.

తర్వాత ఆ రాజు తన ఏలుబడిలో ఉన్న అన్ని నగరాలలోని సమస్త నగరద్వారాలలోను, వీధులలోను రోగులకు వైద్యశాలలు నెలకొల్పాడు. వాటిలో రోగులకు పథ్యపానాలకు, ఔషధసేవనకు, పడుకొనడానికి అన్ని ఏర్పాట్లూ చేశాడు. వారికి పరిచర్య చేయడానికి కుశలురైనవారిని నియమించాడు. వ్యాధి చికిత్సకు ప్రథమాంగం, మంచి పరిచారకుడు. పరిచారకుడు కరుణార్ద్రుడు., సమర్థుడు, ఓర్పు గలవాడు, వైద్యుడు చెప్పినట్లు వినేవాడు, స్నేహంతో ఎలాటి విచికిత్సాలేక సేవచేసేవాడు అయివుండాలి. ఇలాటి పరిచారకుడు దొరకడం కష్టం. రాజు పరిచారకులను పిలిపించి ఇలా సెలవిచ్చాడు: "రాత్రింబగళ్ళు రోగులకు పరిచర్య చేయండి. రోగులకోసం రాజార్హమైన శాలలు నిర్మించాను. వాటిలో మంచి పడకలు మొదలయిన సౌకర్యాలు కలిగించాను. నిర్మల జలాలు, రత్న సోపానాలుగల పద్మాకరాలు తవ్వించాను. వైద్యశాలలో సమర్థులైన వైద్యులను నియమించాను. భైషజ్యసంపత్తి కూడ గొప్పది. ఇక ఇప్పుడు ఆ రోగుల స్వాస్థ్యం మీ చేతుల్లో ఉందనుకుంటున్నాను. పరిచారకులు వైద్యునివలె రోగులకు చల్లని ఉపచారాలతో సంతాపం పోగొడుతారు. వెచ్చని ఉపచారాలతో చలవను దూరం చేస్తారు. చల్లని నీటితో దప్పిని తీరుస్తారు. మితహితాహారోపచారాలతో బడలిక పోగొడుతారు. "నీకేమీ జబ్బు లేదు; ఇప్పుడు స్వస్థుడయ్యావు" అనే ప్రియవాక్కులతో అధైర్యం తొలగిస్తారు. ఆటపాటలతో నిరుత్సాహం నివారిస్తారు. కనుక మీరు



రోగయోగంతో నవిసిపోతున్న తప్తులకు పలుమారు "వైద్యుడు దోషరహితుడు. సుగతుడు (మంచి నడవడి కలవాడు). గొప్ప ప్రసాదం అనుగ్రహించేవాడు. ఔషధం ధర్మోపదేశం, శ్రేష్ఠం. కనుక సంసారదీర్ఘజ్వర శోషితులైనవారికి శాంతి రసాయనమైన ఆ పరమౌషధం సేవించదగినది" అనే మాటలను పలుమారు జ్ఞాపకపరుస్తూ వుండాలి." ప్రజలకు ఆరోగ్యధనం, ఉద్యోగులకు ధనం కురిపిస్తున్న ఆ రాజు ఆదేశం విని పరిచారకులు రోగులు స్వాస్థ్యం కోసం తమ విధులను సక్రమంగా నిర్వర్తించేవారు.

కొంత కాలానికి దేశమంతా కుశలమన్న వార్త బయలుదేరింది. ఆ వార్త విని ఆ మహారాజు వ్యాధిముక్తులై కుశలులైన వారిని స్వయంగా చూచి పరామర్శించడానికి బయలుదేరాడు. రెండవ దేవేంద్రునివంటి ఆ పుణ్యమూర్తియాత్రకు ఇంద్రుడు ఆరు దంతాల తెల్ల ఏనుగులు కట్టిన రథం సిద్ధపరిచాడు. చల్లని పిల్ల వాయువులకు అల్లల్లాడే హేమరత్న సరోరుహాలతో, భృంగాంగనల గీతాలతో కనులపండువయ్యే దివ్య సరోవరాలు దారిలో వెలయింపజేశాడు. ఆ హేమరత్న సరోరుహాలలో నృత్యకలాకుశలలైన దేవవనితలు నిలబడి రాజు దూరం నుంచి వస్తుండగానే నృత్యగీతాలు ప్రారంభించి సేవ చేయసాగారు.

పుణ్యబలుడు ఆ విధంగా వైభవంతో వెళ్ళుతుండగా, సత్త్వగుణ సుధాసింధువైన అతని సత్త్వగుణాన్ని పరీక్షించడానికి ఇంద్రుడు గుడ్డివాని రూపంతో వచ్చి, అతనితో ఇలా అన్నాడు. "రాజా, నేను నయనహీనుణ్ణి. పుట్టినది మొదలు చూపులేనివాణ్ణి. సర్వసత్త్వ పరిత్రాణ సన్నద్ధుడవైన నిన్ను శరణు పొందాను. ఈ రోగులందరూ నీ ప్రభావం వల్ల స్వాస్థ్యం పొంది మిసమిసలాడే దేహకాంతితో నీ కీర్తిని చెప్పుకుంటూ తిరుగుతున్నారు. దుఃఖితులకు, దీనులకు, అంధులకు బాంధవుడైన నీవు నన్ను రక్షించగలవాడివి. ఈయగలిగితే, కుడి కన్ను ఇవ్వు."

ఆ మాటలు విని పుణ్యబలుని వదనం ప్రసన్నతతో దివ్యంగా వెలిగిపోయింది. ధైర్యనిధి అయిన అతడు లోకాన్ని తరింపజేయడానికీ, ప్రజలకు సమ్యక్సంబోధి సిద్ధించడం కోసమూ ప్రణిధానం ఆచరించి, తనచేతి శస్త్రంతో కుడికన్ను పెకలించి, ఆ అంధునికి ఇచ్చాడు. ఈ అద్భుత దానానికి ఆశ్చర్యపడి దేవతలు పుష్పవర్షం కురిపించారు; పర్వతాలు కంపించాయి; అచల చలించింది; సముద్రాలు ఉల్లోలకల్లోలాలయ్యాయి. ఒక కంటితోనే ఆ అంధునికి చూపు రావడం చూచి రాజు అత్యంత దానరసప్రీతితో రెండవ కంటిని కూడ పెకలించి యివ్వడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు సురపతి నిజరూపంతో ప్రత్యక్షమై రక్తం కారుతున్న రాజుకుడి కంటిని బాగుచేసి, అతని అద్భుత సత్త్వగుణబలాన్ని ప్రశంసించాడు.

దానమిచ్చే సమయంలోనే తన అవయవాల మీద ఎప్పుడూ ఎంత మాత్రమూ మమకారం లేని ఆ ఊర్జిత సత్త్వగుణాంబోనిధికి ధనమనే దుమ్ము మీద ఆత్మీయత ఉంటుందా? ఆ పుణ్యబలుణ్ని నేనే. దానరసంతో సమ్యక్సంబోధిని పొందినవాణ్ణయాను. అప్పటి ఆశ్చర్యచరితం స్మరణకు రాగా, దానిమీదే మనస్సుపోయి నవ్వు వచ్చింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పుణ్యబలావదానమనే యాభై యెనిమిదవ పల్లవం

# 59. కుణాలావదానం

ఎవ్వని సిరి సువ్యక్తమైన కీర్తితిలకంతో, గుణాలనే రత్నభూషలతో, వాడని దానకుసుమాలతో, సత్యమనే చందనచర్చతో, శుచిశీలమనే దుకూలంతో అందాలు చిందుతుందో, అట్టివాడొక్కడే సుకృతోచిత చక్రవర్తి.

మహీయువతికి తిలకంవంటి పాటలిపుత్రమనే నగరంలో యశోనిధి, సూర్యకులావతంసము అయిన అశోకుడనే రాజు ఉండేవాడు. అతడు మొదట కామిగాను, తీక్ష్ణుడుగాను ఉన్నా వివేకంతో వయసు పండగా పండగా ధర్మప్రదాతగా ప్రసిద్ధి పొందాడు. అతడు కుశలాంకురాలతో ప్రసన్నమైన పుణ్యాలనే ఉపవనస్థలులకు శోభ కాగా, లోకం అశోకత్వం పొందింది. అంతఃపుర స్త్రీలందరికీ తలమానికమైన పద్మావతి అనే ఆయన దేవేరి త్యాగాన్ని అనుసరించే సంపద సాధువాదం(సత్కీర్తిని) వలె సత్త్వగుణానికే ఉత్సవం వంటి పుత్రుణ్ని ప్రసవించి అశోకునికి ఆనందం కలిగించింది. కనకంవలె పరిశుద్ధుడు, పద్మపత్ర విశాలనేత్రుడు అయిన కుణాలుడనే ఆ రాజకుమారుడు హిమాలయంలో వసించే కుణాలమనే హంసలాగ దర్శనీయుడయాడు. విద్యావధువులకు విమలాదర్శంగాను, సకల కళాలతలకు వసంతోత్సవంగాను, కీర్తి కుముదినులకు చంద్రోదయంగాను ఉన్న ఆ రాజకుమారుడు సర్వలోకాలకు అభిమతుడయాడు. చంద్రుని ఒడిలోని జింకలాగ ఉన్న అతని నేత్రాలు తామర పూవులులాగ విలాసంతో ఒప్పేవి. కనుబొమలు తామరపూవులలోని తేటులవలె కనిపించేవి. అలాటి నేత్రాలను ఎంత చూచినా రాజుకు తృప్తి కలిగేది కాదు. అనేక గుణాలంకృతుడైన అతనికి సమస్త దిగ్ద్వీప ధరాధినాథులు కాముని ముత్తెపు తీగలలాగ వున్న తమతమ కన్యలను ఇచ్చి ధన్యులమనుకొన్నారు. మన్మథుడే మరుసటి జన్మలో జనానురాగంతో భవ్యమూర్తిగా జన్మించినట్టున్న ఆ కుణాలునికి రతిలాంటి కాంచనమాల అనే చంద్రానన చాల ప్రియురాలు.

ఆ రాజకుమారుడు ఒకమారు తండ్రి సన్నిధిలో ఉండగా, సంఘ స్థవిరుడు చూచాడు. షడభిజ్ఞ చర్యుడైన ఆ మనీషికి ముందు ముందు కుణాలుని కన్నులు పోగలవని జ్ఞాననేత్రంతో తెలిసింది. కనుక కరుణాళువైన ఆ యోగి ఆగామిదుఃఖ నివారణ నిమిత్తం, కుణాల కుమారుణ్ని ఏకాంత స్థలానికి పిలుచుకొని వెళ్ళి ఇలా అన్నాడు. "కుమారా! పైపై మెరుగులకే మోసపోయే నీ మనస్సు విభవాభిభూతమయినట్టు నాకు తోస్తున్నది. కామానికి వయస్సు సహాయకంగా ఉన్నది. చంద్రుని గర్వాన్ని ధ్వంసం చేసే దేహం ఉండనేఉంది. చక్షువు సహజంగానే చపలమైంది. కనుక దీనిపై ఆస్థ లేకపోవడమే సుఖహేతువు. ఈ కంటి ఆకర్షణకు లోబడినవారు తమ దారి తప్పి స్పృహ అనే గుంతలో పడిపోతున్నారు. నీలోత్పలపత్రసదృశమైన విశాలనేత్రమనేది రాగోరగచ్ఛిన్నమైన సముద్రం వంటిది. అక్కడినుంచే ఇంద్రియాలన్నీ స్రవిస్తాయి. లావణ్యమనే మధువు తాగినా శీలప్రభావం వల్ల ఎవరి నేత్రాలు విశేషతృష్ణతో



తిరగవో వారు ధన్యులు; వారు అసమానమైన సత్త్వగుణంగల ధీరులు." ఈ విధంగా సంఘస్థవిరుడు ప్రశమగుణప్రధానంగా చెప్పిన మాటలను రాజకుమారుడు అలాగే అని మనసులో పెట్టుకొని నమస్కరించి తన నగరుకు వెళ్ళాడు.

ఇలా ఉండగా, వసంతకాలం అరుదెంచింది. ఎక్కడ చూచినా భృంగాలు ఝుంకారం చేస్తున్నాయి. మోదుగ చెట్లు సిందూరం అలందుకొన్నట్లుగా పూచాయి. కమ్మని వాసనలకు ఏనుగులు మదించిపోయాయి. మానవతుల బిగుమానం సడల నారంభించింది. వియోగినులకు తాపవిప్లవాలైన ఉద్యానవల్లీ నవపల్లవాలు నూతన రాగోద్గమంతో దుస్సహంగా వృద్ధిపొందాయి. మందానిలానికి చంపకపుష్పాలు కదలుతుండడం చూడగా, ప్రణయుల మధ్య మైత్రిని కల్పిస్తున్న వసంతుని గుండెలవియజేసే విజయ ప్రథమాభియోగాన్ని మన్మథుడు చంపక పుష్పలేఖల ద్వారా ప్రకటిస్తున్నట్లుంది. తక్కిన పూవులు అన్నిటిలాగే వికసించాయి. కాని, మధువనే బంధువు ఆదరాతిశయం ఎక్కువగా సహకారానికే ఉపకరించినట్టుంది. ఎందుకంటే, దాని చుట్టూ, భృంగాలు మూగి దాని యశస్సును ఝుంకారాలతో గానం చేస్తున్నాయి గనుక.

వసంతోత్సవవిభ్రమం ఇంతగా ఉన్నా రాజకుమారుడైన కుణాలుడు సంఘస్థవిరుని ఉపదేశం స్మరిస్తూ ఏకాంత ప్రదేశంలో ఉండగా అశోకుని భార్యలలో ఒక్కతె తిష్యరక్ష చూచింది. కుణాలునికి సవతి తల్లి అయిన ఆమె, క్షీణించిన చంద్రకాంతితో, విశాలనేత్రాలతో, బలసిన భుజస్కంధాలతో, ఆజానుబాహువులతో ఒప్పారే అతన్ని సమీపించి స్నేహరసార్ద్రచిత్తయై ఇలా అన్నది. "కుమార! నీ లోచనశ్రీ ఈ లోకంలో ఎవరి ధైర్యాన్ని పోగొట్టదు? పుష్పాలలో నూతనావతారం, సంసారంలో సారభూతం. అందులోను నేటి ఈ వేషం బహుపేశలంగా ఉన్నది." అని అంటూ ఆమె లజ్జ దిగనాడి, వెంటనే భుజాలు రెండూ ఎత్తి అతన్ని దృఢంగా ఆలింగనం చేసుకొంది. అప్పుడు ఆమె ఆభరణాలన్నీ కదలాడి ధ్వనించాయి. అది చూడగా కుమారుడు అసక్తుడు, అతని జోలికి వెళ్ళవద్దు అని నివారించినట్టు కనిపించింది. 'అన్య అయినప్పటికీ ఈమె నా తల్లే. ఎప్పుడూ వాత్సల్యం ప్రకటిస్తుంది' అని కుణాలుడు భావించి జంకుకొంకులు లేక ఆమె పాదాలకడ తన తలవోపి ప్రణామం చేశాడు. ఘనమైన మోహసమయంలో మదోద్ధతలై మకరాంకుని దెబ్బలకు క్షోభించిపోయిన అంగనలు ఘనమోహకాలంలో (మేఘాలు ముసురుకున్న కాలంలో) మదోద్ధతలై, మకరాంక వాతాలతో (మకరాది జంతువుల కదలికతో) క్షోభించిన నదులవంటివారు. వారికి పైనుంచి కిందికి పడడం సహజం. పాపంలో ఆమె పడిపోతే తనకెక్కడ కళంకం వస్తుందో అనే భయంతో శుచి అయిన ఆమె శీలం ఆమెనుంచి తొలగిపోయింది. మదనాభిభూత అయిన ఆమె అప్పుడతనితో ఇలా అన్నది. "కుమార! నీవు నాకు చాలా ఇష్టమైనవాడివి. నేను మీతల్లికి సవతినేగాని నీకు తల్లిని కాను. నీ నాతో సమానమైన వయస్సు గలవాడివి. ఆలింగసంగయోగ్యమైన ఈ నా తనువు సౌభాగ్యభోగం పొందేట్టు చేయి. స్వయంగా స్త్రీలు నిన్ను కోరివచ్చే నిర్లజ్జత నాకు ఇష్టమే. ఏ చేయను మరి? ప్రసన్నుడివికా. నీ అంగసంగం నా హృదయంలో ఎంతోకాలంగా నాటుకొని ఉంది. హారాలతో అందమైన స్త్రీల చనుకట్టు, మొలనూలుతో ముచ్చట గొలిపే పిరుదుకట్టు పురుషుని నఖక్షతాలు లేనిదే ఉన్నిద్రమైన శోభను పొందవు. స్త్రీల మనస్సులు కొత్తదనాన్ని చవి చూడాలని ఉవ్విళ్ళూరడం, కన్నులు లావణ్యమంటే లోభపడడం సహజం." తిష్యరక్ష ఈవిధంగా, అంటుండగా

మదనుడు ఉపదేశించాడా అన్నట్లుగా ఆమె దేహం కంపించింది. శ్వాసంతో పెదవుల అదిరాయి. చెమటబిందువులతో నొసటి తిలకం చెదిరిపోయింది.

ఆమె మాటలు అతనికి చెవుల్లో కాచిన దబ్బనం పెట్టినట్టు వినిపించాయి. తలవంచుకొని ఆ మాటలు విన్నాడు. అది ఎలా వుందంటే, కనులకు అంటిన పాపాన్ని వదలించుకొంటున్నట్లుగా ఉంది. అతడు విషాదలజ్జలు ముసురుకొనగా, శశాంకసదృశమైనప్పటికీ పాపం ఉబికి వస్తున్న ఆమె ముఖాన్ని వెంటనే చూడలేకపోయాడు. ఆ మహాపాపవాక్కులు వినలేక కదలాడే కుండలాలనుంచి ధగధగకాంతి నిప్పులాగ వ్యాపించింది. అది చెవులచుట్టూ అలముకుంది. అది చూడగా ఆ పాపపు మాటలు వినలేక రెండు చెవులూ నిప్పులో పడ్డట్టు అనిపించింది. అతడు వెంటనే చెవులు మూసుకొని దంతకాంతి వెల్లివిరియగా ఇలా అన్నాడు. (దంతకాంతి తిష్యరక్షిత ఆలింగన దోషం కడిగివేయడానికి వచ్చిన గంగలాగ అనిపించింది.) "అమ్మా, నీవు ఈవిధంగా అనడం యుక్తం కాదు. సద్ధర్మమార్గంలో నడువు. మాటలను అదుపులో ఉంచుకో. నీవు ఎక్కడ వదలి వెడతావో అని అల్లలలాడిపోయే శీలాన్ని సమాధానపెట్టుకో. గర్వం, అప్రమత్తత, పరవిత్తవాంఛ, పాపానుబంధి అయిన విషయాభిలాష - ఇవి అపాయద్వారాలు. జీవికి పతనావస్థలో నిరర్గళంగా ఏర్పడుతాయి. దానపరాఙ్ముఖులకు ధనం ఉండీ ప్రయోజనం లేదు. ద్వేషవశీకృత బుద్ధులకు చదువువల్ల లాభమేమిటి? సద్గుణ వర్జితులకు రూపం వల్ల ఏమి ప్రయోజనం? శీలభ్రష్టులకు కులం ఎంత మంచిదయితే ఏమి? అమ్మా! చంచలతను వదలు. అక్షయచంద్ర బింబంలాగ రుచిరమైన యశస్సును కాపాడుకో. నీ సద్వంశం ఒక్కమారు చూచుకో. పాపబుద్ధిని వదలు. పరలోకంలో పాపభూములు ఘోరనరకవహ్నికి కాలుతూ వికటంగా వికలంగా ప్రలపించే ప్రేతాలతో, క్లేశాకులాలై ఉంటాయి."

రాజకుమారుని ఈ మాటలు విన్నప్పటికీ ఆమెను తీవ్రంగా ఆవేశించిన మోహగ్రహం వదలలేదు. మోహాంధకూపంలాగ ఉన్న మనిషి మనసులో ధర్మోపదేశమనే సూర్యకిరణాలు ప్రవేశిస్తాయా? రాజుకు పట్టువడి బాగా దెబ్బలు తిని ఎగవూర్పూ దిగవూర్పులతో పేరు కూడా సరిగా చెప్పక అసంగతంగా ఏదో వాగే దొంగవలె తిష్యరక్షిత తనను నానా క్షోభపెట్టే మన్మథపార్థివునికి పట్టుబడి తాపం తట్టుకోలేక పెద్ద నిట్టూర్పులు వదలుతూ ఆసంగతంగా ఇష్టం వచ్చినట్టు ఇలా ప్రలపించింది. "నీవు చేసే ఉపదేశమంతా స్వాస్థ్యంతో ఉన్నవారికి. స్మరార్దిత అయిన నాకు నీ ఉపదేశమేమీ వినిపించడం లేదు. ప్రబలమై, విశాలజ్వాలా మాలాకలితమైన ఈ స్మరాగ్ని వట్టి మాటలతో శాంతించదు. రాగాతురులకు సెలయేర్లు పారే శీతలప్రదేశం కూడా మండిపోయే మరుస్థలంగా కనిపిస్తుంది. సూర్యుడు ఉదయించినా దిగంతరాలు ఘోరాంధకార బంధురాలుగా కనిపిస్తాయి. దయాళువైన నీకు పరితప్తురాలైన అబలను కాపాడడం ధర్మం కాకపోతే, సాధువులు గౌరవించే అలాటి ధర్మమే లేకపోతే, ఇక అధర్మమనేది ఏమిటి? ప్రశాంతచిత్తులు, స్వస్థబుద్ధులు అయిన వారికి నీవు చెప్పినది స్థిరమైన ధర్మం, సుఖం కలిగించేదీని. వారికి అది ప్రమాణం కూడా. సంతాపులు, వ్యసనాతురులు అయిన వారికి నిషిద్ధకార్యాలను గురించి చింత ఏమిటి? మొదట పాపం చేసినదాన్ని నేనే. కనుక నన్ను రక్షించడం నీ ధర్మం. చంద్రునివంటి చల్లని స్పర్శతో నాలో ఎడతెగకుండా కలిగిన సంతాపరోగాన్ని పోగొట్టు. చంద్రుడు సంతాపం పోగొట్టడం, సూర్యుడు చీకటులను తొలగదోయడం, అగ్ని శీతబాధను రాత్రీపగలూ నివారించడం పాపమా? సమస్తశాస్త్రాలు



చదువుకొన్నవాడివి. నిజం చెప్పు. దుఃఖార్తులను రక్షించడంలో సమానమైన సత్కర్మధర్మం మరొకటి ఎక్కడన్నా కద్దా? మనగుట్టు బట్టబయలవుతుందనే భయమేమీ లేదు. ఈ ప్రదేశం నిర్జనంగాను, రహస్యంగాను వుంది. ప్రౌఢాంగనలు స్వయంగా ఇష్టపడి ప్రణయంతో లొంగిపోవడం పురుషుల భాగ్యమనుకో. రతితోషితలైన నితంబినుల నలిగిన పెదవి, వాడిన చెక్కులు, వీగిన ముంగురులు, చెమటకు తడిసిన చందనచర్చగల వదనారవిందము ధన్యులే చూస్తారు. స్త్రీలకోసం కొందరు కరవాలమనే నాలుక భయంకరంగా ఆడే రణకాలుని నోట్లో ప్రవేశిస్తున్నారు. మరికొందరు కోపంతో ఘూర్ణిల్లే నక్రాది జలజంతు సమాకులమైన జలనిధిలో దూకుతారు. అర్థపురుషార్థం కోసం మానవుల తీవ్రమైన, చిరక్లేశకరమైన ప్రయత్నం జరుపుతారు. ఈ అర్థపరిగ్రహం ధర్మం కోసమే. ధర్మానికి ప్రథమఫలం కామ పురుషార్థమంటారు."

ఈ విధంగా విధవిధాలుగా ఆకులపాటుతో మాట్లడుతున్న తిష్యరక్షను చూచి కుణాలకుమారుడు ఇలా అన్నాడు. "తల్లీ! త్రివర్గానికి సమూలమైన ఫలం ధర్మం. అదే కుశలానికి నాభివంటిది. నిర్జనంలో రహస్యంగా ఉంటే పాపం పొందడా? అంతర్హితులై దేవతలు మన పనులన్నిటినీ చూస్తూనే ఉంటారు. వారే మన రహస్య వ్యాపారాలకు సాక్షులు. జాయవలె వెంటనంటిన నీడ మన సంగతినంతా తెలుసుకొంటుంది. రహస్యంగా చేసిన కర్మ కూడా తప్పక ఫలిస్తుంది. కర్మలకు ఫలం లేకపోవడమనేది లేదు. విజనమైన, అంధకారబంధురమైన ప్రాంతంలో విషం తాగితే **ప్రాణాలు పోవా**? స్త్రీలు సహజంగానే పాపనిమిత్తభూతలు. అందులోను పరదారసంగం మహాఘోరం. **నీకు ఈ మితిమీ**రిన మోహం వద్దు. తనకు ప్రియమైన భార్యను కూడా పోట్లాటకు పూనుకొనేట్టయితే పురుషులు తుదివరకు తాకరు!" ఈ విధంగా కుణాలకుమారునితో తిరస్కృత కావడం వల్ల తన అభ్యర్థన భంగపాటు పొందినదనే బాధతో తిష్యరక్ష చాల తపించిపోయింది; వెంటనే అతని ఎడ వెగటు పుట్టి "ఉండు. నీనేత్రదర్పం తప్పక పోగొడుతాను" అని శపథం చేస్తూ తన భవనానికి వెళ్ళింది.

తర్వాత కొంతకాలానికి అశోకుడు కుంజరకర్ముడనే రాజు రాజధాని అయిన తక్షశిలానగరాన్ని జయించడానికి కుణాలకుమారుణ్ణి పంపాడు. కుణాలుడు సేనారజఃపుంజంతో అర్కమండలాన్నే కప్పి వేస్తు జైత్రయాత్రకు బయలుదేరాడు. కుణాలుడు చీకట్లు ముసురుకొనివచ్చాయా అన్నట్టు గజయూథంతో దిక్కులను కప్పివేస్తూ, భటకుంజరుల సంక్షుబ్ధ సముద్రఘోషవంటి నినాదాలతో లోకాన్ని రెండు ముక్కలు చేస్తున్నట్లుగా తక్షశిలను ముట్టడించాడు. తక్షశిలానాథుడు భయపడి కుమారుని కాళ్ళపై పడి ప్రసన్నుని చేసి, గజహయరత్నాలు కానుకలిచ్చి పూజించి స్వయంగా రాజధానికి పిలుచుకొనివచ్చాడు. రాజపుత్రుడు, తక్షశిలాధిపతి ఆదరంతో ప్రియమైన ఉపచారాలు చేస్తుండగా వర్షాకాలమంతా అక్కడే గడిపాడు.

ఇంతలో పాటలీపుత్రంలో అశోకునికి తన పుత్రుని ముఖారవిందం చూడాలనే కుతూహలం కలిగింది. ఆ చింతతోనో అన్నట్టు అతనికి ఉదరవ్యాధి పుట్టింది. అంతఃపుర వైద్యులు నానావిధాలైన ఔషధాలు శ్రద్ధగా వాడినా ఈ రోగం అసాధ్యమైనదనే సందేహంతో ఎంతో చింత, ముఖాలతో కనిపిస్తుండగా అతని ప్రక్కనే నిలబడి ఉన్నారు. ఉద్వేగభీతితోనా అన్నట్టు కాంచీకలాపం గలగలలాడగా, చిత్రంలో గీచినట్టుగా రెప్పులు కూడా అల్లార్చకుండా స్త్రీగణం ఒకవైపు చూస్తూ నిలబడింది. సమీపంలో

మరికొందరు కాంతలు మెల్లమెల్లగా చామరాలు వీస్తున్నారు. అవి తెల్లగా విస్తరించి ఉండడం చూస్తే రాజు వ్యాధిగ్రస్తుడైనందుకు నిట్టూరుస్తూ తెల్లబారిపోయినట్టు కనిపించాయి. రాజు దృష్టి చన్నీళ్ళు తాగుదామని చన్నీటి బంగారు గిండీపై పడింది. కషాయం తాగమని అందిస్తే అతన్ని కసిరికొట్టాడు. నిద్రపోగూడదని వైద్యులంటే కోపపడ్డాడు. పథ్యం చేయాలని చెబితే చింత పడ్డాడు. నింద్యమైన వ్యాధి కలిగినందుకు దేహంపైనే అతనికి ద్వేషం కలిగింది. పట్టపురాణి అతని తలను తన స్తనమండలానికి ఆనించి శ్రమ లేకుండా పట్టుకుంది. ఆ పరిస్థితిలో రాజు క్షామస్వరంతో ఇలా అన్నాడు: "వైద్యులతో ప్రయోజనమేమిటి? వారి విద్య దండుగ. వారు చేసే చికిత్సంతా కేవలం వ్యథ కలిగించేదే. చెప్పే పథ్యమంతా నిరుపయోగం. పాపకర్మనిపీడితులకు చికిత్స ధర్మోపదేశమే. ఈ నా కాయం అపాయదశను పొందింది; చిక్కిశల్యమైంది. భోగాలు అనుభవించదగనివిగా అయ్యాయి. అంధునికి లావణ్యవతి అయిన కాంతవలె భోగరహిత అయిన సంపద ఘోరమైన శాపం వంటిది. నాకు జఠరాగ్ని మందగించినా శోకానలం ప్రదీప్తమై దహించి వేస్తున్నది. తృష్ణ హెచ్చినా జాడ్యం తొలగలేదు. ప్రాణాలు పోయినా సుఖంగా ఉండేవి- ఈ దీర్ఘ రోగం కంటే. లోపలనే కుమిలిపోతున్న ప్రచ్ఛన్న పాపం, కలహానుబంధి అయిన నీచుని అవమానం, బాగా జితించిపోయి జుగుప్స కలిగించే వ్యాధి దీప్తమైన అగ్నితాపంతో శాంతిస్తాయి. ఆరోగ్యంగా ఉండేవారికి దారిద్ర్యం, ధనవంతులకు సదా రోగం అనేవి పూర్వజన్మ కుకర్మల విచిత్ర విపర్యయ ఆయాస విలాసమే సుమా! ఆలోచించగల బుద్ధిలేనివారి జన్మ నిరర్థకం. పాండిత్యంతో ఉజ్జ్వలం కాని బుద్ధి దండుగ. ఛీ! లక్ష్మీకటాక్షంతో దీనత్వం తొలగని పాండిత్యమెందుకు? ఆరోగ్యభాగ్యం లేనప్పుడు లక్ష్మీవిభ్రమజృంభితం ఎందుకు? తక్షశిలకు పంపబడిన జనప్రియుడైన కుమారుణ్ణి వెంటనే పిలిపించండి. ఆ ఉత్తమ చరిత్రునికి, పరిశుద్ధునికి నా రాజ్యం ఇప్పుడే సంక్రమించడం చూస్తాను. నేనే ప్రేమతో వానికి కిరీటం పెట్టి శ్వేతచ్ఛత్రం పడుతాను. అలాటి కుమారుణ్ణి నేనే మరల తారుణ్యం పొందినట్టు ప్రజలు పుణ్యఫలంతో చూతురుగాక!"

ఇలా అంటున్న రాజు మాటలు విని రాజపత్ని తిష్యరక్ష భయ శోక దైన్య మాత్సర్య మోహాలు ఒకేమారు ముంచుకొనిరాగా రాజుతో ఇలా అన్నది: "మహారాజా! నేను నిన్ను నిరామయుణ్ణి చేస్తాను. నా యుక్తివిశేషం చూడు. తమ చికిత్సకోసం ధనం వ్యర్థం చేయించి, జనక్షయం కలిగించే వైద్యులు వెళ్ళిపోనీ. విద్యలేని వైద్యులు పరస్పరం వివాదాలతో, తమ విద్యాగర్వవాదాలతో, ఆ గర్వవాదాల వల్ల పుట్టిన అపవాదాలతో, బుద్ధిహీనుల అనువాదాలతో దినాలను, రోగిని క్షయింప జేస్తారు. సొంత కుమారునికి కూడ రాజ్యం అప్పగించరాదు. స్పృహ అంతటిని పరులకు వశంగా చేస్తుంది. సంపదను వదలిపెట్టామా, క్షణంలో విపత్సహస్ర జ్వలనానుతాపం కలిగిస్తుంది. కొడుకులకు పట్టం కట్టిన రాజుల గౌరవం వెంటనే ఆరిపోతుంది. ప్రజలు ఎదురు తిరిగి వారి శాసనాలను లక్ష్యపెట్టక గడ్డిపోచవలె చూస్తారు."

తిష్యరక్ష ఈవిధంగా రాజుకు ధైర్యం కలిగించి నగరునుంచి బయలుదేరి నగరమంతటా వెదికి రాజుకు వచ్చిన వ్యాధివంటి వ్యాధితో బాధపడుతున్న ఒక గొల్లవానిని నగరుకు పిలుచుకొని వచ్చింది. పిదప ఆ క్రూరబుద్ధి క్రూరురాలైన ఒక దాసితో ఆ గొల్లవాణ్ణి చంపించి, వాని నాభికోశాన్ని చీల్చి, వాని పేగులలో ఉన్న వికృతమైన క్రిమిని చూచింది. ఆ పురుగు పైకి కిందికి తిరుగుతూ, మలం వదలుతూ ఉండగా చూచి, దానిని చంపడానికి పిప్పళ్ళు, ఇంగువ, వాయువిడంగాలు కలిపిన ముద్దను వేసింది. ఈ ముద్దతోగాని, విషయుక్తమైన క్షారాలతోగాని, అది చావలేదు. కాని, నీరుల్లిని పొట్టు ఒలిచి తాకించేవేళకు వెంటనే చచ్చింది.



ఈ ఉపాయం తెలుసుకొని ఆమె చాల సంతోషించి రాజు సన్నిధికి వెళ్ళింది. నీరుల్లిని రహస్యంగా అతనికి ఇచ్చి క్షణంలో అతనిని స్వస్థశరీరుణ్ణి చేసింది. విషం బలం తగ్గి పనిచేయనిచోట, శస్త్రాలు కుంఠితమైనచోట, అగ్ని ఉత్సాహంలేక మందగించినచోట యువతుల ప్రేమ భగ్నం కాకుండా పని చేస్తుంది. రాజు, తన ప్రాణాలు దక్కాయనే సంతోషంతో ఆమెకు కృతజ్ఞతతో, ప్రేమానుబంధంతో, తప్పనిసరిగా ఆమె కోరిన ఏడు రోజులపాటు రాజ్యపాలనమనే వరాన్ని ఇచ్చాడు.

తిష్యరక్ష వరంతో రాజ్యం పొంది రాజకార్యాన్ని స్వయంగానే జరుపుకొనడానికి ఉద్యుక్తురాలై తక్షశిలాధిపతికి రాజముద్రాంచితమైన లేఖను, అనర్ఘరత్నాల కానుకతోపాటు పంపింది. నృపశాసన చిహ్నంతో వచ్చిన ఆ లేఖను తక్షశిలాధినాథుడు గౌరవించి వినయావనమ్రుడై చక్కని అక్షరాలతో స్పష్టంగా అర్థమిస్తున్నదానిని తానే ఈ విధంగా చదివాడు:

"స్వస్తి. అసమ సమర సాహస సమాసాదిత సమస్త సింధుసీమాసముచ్ఛలదవిరల విమలయశః కలాప కలిత ధవళదుకూల వసుధావధూదత్త భోగసౌభాగ్య గర్వఖర్వీకృత విపులరిపుప్రతాపుడును, అరాతి రమణీ విలాసాలకు శాపము వంటివాడును, ప్రణతి ప్రతిబింబి తానంత సామంత వక్త్రశతపత్రైక పాత్రీకృత విమలమణి పాదపీఠుడును, సుహృత్కులకమల వికాసవాసరేశ్వరుడును, స్ఫీతశౌర్యమౌర్య మహావంశవన పంచాననుడును అయిన శ్రీమదశోకదేవుడు పాటలిపుత్రం నుంచి తక్షశిలాధిపతి అయిన శ్రీకుంజరకర్ణుని సంబోధిస్తున్నాడు. ఎట్లంటే-

నిరపత్రపుడు, కుచరితమైత్రీ పరిస్రస్త చారిత్రుడు, అపవిత్రుడు, **శాస్త్రవిద్వేషి**, పితృకలత్రాభిలాష విషపాత్రీకృత నేత్రశతపత్రుడు, పాపానురూప యౌవనోత్సాహసాహసుడు అయిన పుత్రముఖ శత్రువు కుణాలుడు అతని నీలాలవంటి కండ్లు పీకించి జననీజన భుజంగుడని ప్రకటించి తక్షశిలనుంచి వెళ్ళగొట్టండి. ఇది మా అభ్యర్థనా ప్రణయం."

భయంకరమైన లేఖార్థాలు చదివి తక్షశిలాధీశుడు ఒకవైపు కృప అడ్డుకొనగా, మరొకవైపు కుమారునిపై ప్రీతి ముప్పిరిగొనగా, అశోక చక్రవర్తి భయం మరొకవైపు ముంచుకొనిరాగా, డోలాయమానమానసుడయి బాష్పాకులితనేత్రుడై భూమిని చూస్తూ నిలబడిపోయాడు. తండ్రికి కుణాలకుమారుడు సంశయంతో బాధపడుతూ తనే ఆ లేఖను పుచ్చుకొని చూచాడు. తండ్రి మిథ్యాపవాదం వల్ల తనపైన తీవ్రమైన కోపం వచ్చినందుననే దుస్సహమైన ఈ ఆజ్ఞను పంపాడని నిశ్చయించుకొన్నాడు. అలాటి సహించరాని వ్యసనంలోను నిశ్చల ధైర్యంతో ఇలా ఆలోచించాడు. "తండ్రి ఇచ్చను ఉల్లంఘించకూడదు. ఈ నరపాలుణ్ణి నా జనకుని కోపం నుంచి రక్షించాలి. మిథ్యాపరాధం వల్ల కోపించిన తండ్రిని నేను పరిశుద్ధుణ్ణి అనే మాటలతో ప్రసన్నుణ్ణి చేయలేము. నా కళ్ళను పీకివేసుకొని తండ్రి కోపాగ్ని తాపాన్ని శమింపజేస్తాను; అతనికి సంతోషం కూడ కలిగిస్తాను. ఈ తక్షశిలాధిపతికి కూడా నాతండ్రి శాసనాన్ని ఉల్లంఘించాడనే వ్యసనం కలుగకుండుగాక! వినశ్వరమై, స్వేదక్లిన్నమైన ఈ శరీరం చక్షువనేది వికార రూపమైన జలబిందువు వంటిది. గడ్డి వెలుగులాంటి క్షణమాత్ర ప్రకాశమైన ఈ కంటిపైన గొప్పదనే ఆస్థ ఎందుకు? లోకంలో జనం సుందరమైన రూపాన్ని చూడాలనే లోభంతో ఈ కళ్ళను ఎంతో కాపాడుకుంటుంది. ఆ సుందరరూపమనేది తరళేంద్రజాల స్వప్నావళికి మిత్రం, గోడలేని చిత్రం."

నరేంద్రపుత్రుడు ఈ విధంగా చాలసేపు ఆలోచించి తక్షశిలాధినాథుడు ఇష్టపడక విముఖతతో ఉన్నా, ప్రజలు కన్నీళ్ళతో వద్దంటున్నా వినక కండ్లను పెరికివేయించుకున్నాడు. విత్తలోభంతో ఒక క్రూరుడు అతని కళ్ళను పీకివేశాడు. మదించి ఎవరు అడ్డుపెట్టినా ఆగని మాతంగం కమలాలు పీకివేయగా శోభచెడి పాడుగా కనిపించే పద్మాకరంలాగ అతని ముఖం కాంతిహీనమైంది. తక్షశిలా నగర విజయంతో అతనివెంట వచ్చిన అతని ప్రియురాలు కాంచనమాలిక అతడు కళ్ళులేని కబోది కావడం చూచి మూర్ఛితురాలై కిందుపడిపోయింది. కొంతసేపటికి ఆమె తెలివి వచ్చి, నేత్ర లావణ్య విలాస లోభంతో పెద్దగా అంగలార్చ సాగింది. అప్పుడు కుణాలుడు అన్నీ అనిత్యమనే చింతనం వల్ల సత్యాన్ని గ్రహించి స్రోతాపత్తి ఫలం పొందినవాడు గనుక ఆమెతో ఇలా అన్నాడు. "ఓ ముగ్ధురాలా, ధైర్యం వహించు. వైక్లబ్యం పొంది మోహదైన్యాలతో భయవిహ్వలురాలు కావద్దు. ప్రతిజీవి స్వకర్మఫలాలను అవశ్యం అనుభవించక తప్పదు. నేనిప్పుడు గుడ్డివాణ్ని. ఏకాంత స్థలానికి వెళ్ళి పోతాను. నీవు కష్టం సహించలేవు. బంధువుల ఇంటికి వెళ్ళు. ఈ భవ(సంసార) స్వభావమే ప్రియోపభోగ వియోగ సారమైంది. కనుక దుఃఖపడనక్కరలేదు."

ఇలా అంటున్న భర్తను చూచి కాంచనమాల వియోగభయంతో ఒడలు కంపించగా, కాటుక కంటినీరు చనుగట్టుపై పడగా తన చిత్తం దుఃఖానికి అమ్ముడు పోయిందా అన్నట్టు పరితపిస్తూ అన్నది: "ఆర్యపుత్ర, నేను నిన్ను వదలి వెళ్ళను. మరొక రూపంలో ఉన్న ఆభరణం వంటి పతిని ఆపత్తులో శీలం లాగ వదలిపెట్టడం అంగనలకు కుల్యాణమైన వ్రతం కాదు. ధనవంతుల ప్రీతికోసం వేశ్యలు కూడ సతీవ్రతం ప్రదర్శిస్తారు ఎంతో శ్రమపడి. విపద్గతుడైన అర్థిదాతలకు ఎక్కువగా ఇష్టుడైనట్టు విపద్గతుడైన భర్త సతులకు చాల ఇష్టుడు. పదభ్రష్టులయిన పురుషులకు పత్ని గుడ్డితనంలో ఊతకర్ర వంటింది. విషమమైన విపత్తాప కష్టాలలో ఛాయ వంటింది. జాయాసదృశమైన సహాయం మరొకటి లేదు" అని అంటూ అతని కాళ్ళమైపడి వేడుకుంది. ఎంతో ప్రయత్నం మీదట కుణాలకుమారుడు అంగీకరించి, పాతకట్టుగుడ్డలతో ఆమెతోను, ధైర్యంతోను మెల్లగా తక్షశిల వదలి వెళ్ళిపోయాడు.

కుణాలకుమారుడు వీణాప్రవీణుడు. కనుక వీణ వాయిస్తూ పాటలు పాడుతూ దారిలో పొట్టపోసుకున్నాడు. కళాసదృశమైన ధనం మరొకటి లేదు. అది మానవులకు విపత్తులో పుణ్యమైనది; ఐశ్వర్యసమయంలో విలాసకరమైనది. మత్తాలిమాలాక్వణిత సదృశమైన శ్రవణామృతమైన వీణాస్వరంతో ఆ రాజభిక్షువు ప్రతివారి యిండ్లకు భార్య వెంటరాగా వెళ్ళి, పాడి ఆనందింపజేసేవాడు. పెద్దల కోపాతిరేకమనే రాహువు మింగివేసిన ప్రభావమనే సూర్యులు గలవారికి మిథ్యాపవాద బాధలనే కృష్ణపక్షం పాలయిన చరిత్ర అనే చంద్రుడు గలవారికి, గుణవంతులను దూషించడం వల్ల గుణాలనే రత్నాలు పడిపోవడం వల్ల ప్రభాహీనులైన వారికి బహుతరదుష్కర్మలనే ఝంఝూమారుతం దెబ్బకు ఆరిపోయిన నేత్రదీపాలు గలవారికి, సంసారమనే దుర్దినంలో ఒకమారైనా లక్ష్మీకటాక్షపాతం లేనివారికి పూర్వపుణ్యాలవల్ల ధర్మసంస్మరణమనే కొత్త వెలుగు కలుగుతుంది.

వివేకచక్షువైన కుణాలకుమారుడు ఈ విధంగా తన కళావిలాసంతో పాటలు పాడుతూ బిచ్చమెత్తుకుంటూ తన భార్యనే ఊతగర్రగా పట్టుకొని తండ్రి రాజధాని అయిన పాటలీపుత్రనగరం చేరాడు. దీర్ఘదుఃఖంతో చాలదూరపు నడకతో శరీరం చిక్కి చలికి, ఎండకు, వానకు ముఖం మాడి రంగు వీడి, భార్యతో సహా పట్టణంలో ప్రవేశించిన అతనిని చూచి నగరవాసులు శాపక్షతుడైన మన్మథుడే సుమా



అతడు అని విచారపడ్డారు. అతడు నెమ్మదిగా రాజోద్యాన సమీపానికి వచ్చి, విశ్రమించదలచుకోగా గుడ్డివానిని, బిచ్చగానిని చూడడం అమంగళమని అతనిని ఉద్యానపాలకులు పరుషప్రలాపాలతో 'రావద్దు రావద్దు' అని కసిరారు. అక్కడ ఆశ్రయం దొరక్క మరొకచోట ఆశ్రయం కోరుతూ అతడు అశోక మహారాజు హస్తిశాలలో ప్రవేశించాడు. హస్తిశాల పరిపాలకుడు వీణావినోదకౌతుకి గనుక అతనికి అక్కడ ఉండడానికి అవకాశం ఇచ్చాడు. గజశాలలోని పట్టపు ఏనుగు ఆ గుడ్డివానిని చూచి, గుర్తుపట్టి ముఖం తిప్పి అతనికి స్వాగతమిస్తున్నదా అన్నట్టు గంభీరంగా ఘీంకరించింది. అది మేఘనాదమనుకుని నగరులోని పెంపుడు నెమళ్ళు నాట్యం చేయసాగాయి. పట్టపు ఏనుగు అంతగా ఘీంకరించినా, ఎలాటి ఒడిదుడుకూ లేక నిశ్చలంగా ఉన్న ఆ గుడ్డివాణ్ని చూచి, హస్తిపకులు (మావటీండ్రు) "ఆహా! సత్త్వోదధి అయిన ఈ గుడ్డివాడు కదలకుండా మెదలకుండా ఉన్నాడు. ఎవరీ సుక్షత్రియుడు?" అని తమలో తాము అనుకున్నారు. పట్టపుఏనుగుకు ఎదుట భర్తకాళ్ళు పిసుకుతూవున్న కాంచనమాల కూడ పెద్ద నిట్టూర్పు విడిచి, కంటనీరు పెట్టుకొని, గతవైభవం స్మరణకు రాగా ఇలా అన్నది. "ఏనుగు ఘీంకారం మేఘగర్జనమనే ఆశతో నీముందు నృత్యం చేస్తున్న ఈ నెమళ్ళలో ఈ నెమలి కుమారస్వామి వాహనమైన మయూరకులంలో పుట్టినది. ఇది గణాధిపతి గర్జించినా నిర్వికారంగా ఉంటుంది."

అంతలో సాయంకాలమైంది. సరాగ అయిన సంధ్య, చపలాభిపత్య దోషోన్ముఖి అయిన సంధ్య ద్వేషం గలదివలె ప్రజలకు లోచన జీవభూతుడైన సూర్యుణ్ణి హరించి ఘోరమైన గుడ్డితనాన్ని (చీకటిని) కలిగించింది. కళావిహీనమైన పద్మాలనే ముఖాన్ని ముడుచుకొన్న పద్మాకరాన్ని చూచి భ్రమరావళి శోకాభిభూతమై భవితవ్యత స్వభావం ఇలాటిదే సుమా అని పాడినట్టు ఝుంకారం వినిపించింది. విశ్వాన్ని ప్రకాశింపజేసే ఏకైక మణిదీపం వంటి సూర్యుడు అస్తమించగా, సహస్రలక్ష దీపాలు పట్టపగటి కాంతిలో లవమాత్రం కూడా కలిగించలేకపోయాయి. గొప్పవారి తేజస్సు సర్వాతిరిక్తంకదా! మణిహేమహర్మ్యాలతో ఆ చీకటిలో వెలిగిపోతున్న ఆ రాజధాని కష్టసమయంలోను భక్తితో భర్తకు ఉపకరించే శీలవతి అయిన భార్యవలె ప్రకాశించింది. చీకట్లు క్రమంగా అధికారం సంపాదించి, లోకాన్నంతా నిరాలోకంగా చేసి, చంద్రుడు ఉదయిస్తాడేమోనన్న భయంతోనో అన్నట్టు అక్కడక్కడ దాక్కొన్నాయి. నల్లటి కళంకమనే అక్షరసమూహంతో పద్మాకర శ్రీ పరిహారరేఖగా కనిపిస్తున్న కుముద్వతీమిత్రుడు చంద్రుడు ఉదయించాడు. లేత తామరతూళ్ళ వంటి కిరణ సమూహంతో తెల్లగా ఒప్పారే సుధాంశువు పాలవంటి తెల్లని కాంతివసనంతో జగత్తును కీర్తితో కప్పినట్టుగా కప్పాడు. చంద్రుడు ఆకాశంలో సీసపు ముద్దవలె వ్రేలాడుతున్నాడు.

ఇంతలో రాత్రి కొంత గడిచింది. చంద్రుడు ఆకాశంలో సీసపు ముద్దవలె వ్రేలాడుతున్నాడు. మావటివాళ్ళు మత్తు వదలటం వల్ల మేల్కొని నిద్రిస్తున్న కుమారుణ్ని చూచి, "ఓ గాంధర్వికుడా, వీణను కాంతలాగ ఒళ్ళో పెట్టుకొని గోళ్ళతో మీటుతూ పాట ఎందుకు పాడవు?" అని కేకలు వేయడం ప్రారంభించారు. మధుపానమత్తులైన వారి నిర్బంధం వల కుమారుడు శ్రమ, నిద్ర తనని బాధిస్తున్నా విధి లేక విమల వీణను చేత్తో పట్టుకుని, నీచవాక్కులకు మనస్సు కుమిలి, ఈ విధంగా క్షణమాత్రం ఆలోచించాడు. "రక్తం వాసన చూసి నిర్దయగా మూగిన పులిగుంపు మధ్యనన్నా బ్రతుకవచ్చునుగాని, నిష్ప్రయోజకులు, కటువైన మాటలతో ఆక్షేపించేవారు, అయ్యో చిత్తం చిత్తం అంటూ చేతులు ముందుకు చాచుకొని ఉండేవారు. అయిన రాజచేటుల మధ్య జీవించలేము. నీచసేవతో సమానమైంది లోకంలో

మరొకటి లేదు. మానం పోగొడుతుంది. సిగ్గు పుట్టిస్తుంది. శ్రేయస్సులను ధ్వంసం చేస్తుంది. తాపం కలిగిస్తుంది. ఈ విధంగా అసహ్యమైన నిర్వేద విపత్తును పుట్టిస్తుంది." ఇలా అతడు పలుమారు ఆలోచించి, నీచుల మాటలకు లోలోపలనే కుమిలిపోతూ, నిట్టూర్చి, కాలం వెళ్ళబుచ్చడంకోసం వీణ మీటుతూ నెమ్మదిగా పాడసాగినాడు.

"ఈ సంసారం దుర్మార్గునిలాగ మానవాళితో చెర్లాటలు ఆడుతుంది. మానాన్ని మథింపజేస్తుంది. ఐశ్వర్యం పోగొట్టి నవ్వులపాలు చేస్తుంది. మర్యాదను దాటి, సచ్చరితులను పాడు చేస్తుంది. లేనిపోని అపవాదాలు పుట్టిస్తుంది. మర్మాన్ని తాకే దుఃఖంతో కష్టంతో ములుకులు కొడుతుంది. వీచే గాలికి ఊగిసలాడే తీగల ఆకుల కొసలలాగ చంచలమైన ఈ సంసారమనే సుడిగుండం మానవులకు స్థిరతర మహామోహం కలిగిస్తున్నది. అందులోను సంపదలు మెరుపుల్లాగ మరీ చంచలాలు. సంపదలు తొలగి క్లేశక్లాంతుడై ఆపదలనే పెద్దగుంటలో కళ్ళులేక కాళ్ళుపోయి పడ్డప్పటికీ, సకలవిపత్తులకూ రక్షారత్నమూ ప్రకాశసుధామయమూ అయిన పరిశుద్ధశీలం కొంచెమైన చెక్కుచెదరకపోతే భయమే లేదు. చేతిలోని కర్రతో నేను నీరేదో, భూమేదో, రాయేదో, రప్పేదో తెలుసుకొంటున్నాను. స్పర్శంతో, గంధంతో, బుద్ధితో అంతా గ్రహిస్తున్నాను. దుర్గమ మార్గమని వినే లోపల ప్రవేశిస్తున్నాను. కాని, మోహంతో కనులు గప్పినవారు మాత్రం తన విశ్వాసంలో విలీనమైన ఘోరనరకక్లేశం తెలుసుకోలేకపోతున్నారే అని ఈ గుడ్డివానికి నవ్వులాటగా ఉంది."

ఇలా ఆత్మవృత్తాంత ప్రవృత్తమైన గీతాన్ని కుణాల కుమారుడు పాడుతుండగా నగరులో నిద్రిస్తున్న అశోకమహారాజు రాత్రి ముగియనుండగా అకస్మాత్తుగా మేల్కొని ఇలా అనుకున్నాడు: "ఎప్పుడూ దుస్స్వప్నాలే కలుగుతున్నాయి. ఎన్నో అనుమానాలతో మనస్సు ఆకులమైంది. తక్షశిలలో వసించే కుమారుడింకా ఉత్తరమైనా పంపలేదెందుకు? ఎప్పుడూ ఏదీ మరువనివాడే! ఆసన్న సుఖోన్ముఖుడై నన్ను మరచిపోయాడేమో? ఇంతకూ చిరప్రవాసంతో స్నేహానుబంధాలు శిథిలమౌతాయి. మూర్ఛనలు పోతున్న వీణ మీద గమకానుసారిగా మధురస్వరాలతో శ్రవణపేయంగా కుమారుని గీతతుల్యమైన గీతాన్నే గంధర్వలోకం నుంచి వచ్చిన గీతంలాగ వింటున్నాను. ఈ మృదుగీతం అతనిదే. అతడెందుకు రహస్యంగా ఉన్నాడో? ఏమిటిది? ఏమీ తెలియడం లేదు" అని క్షణమాత్రం ఆలోచించి ఆ పాట పాడుతున్న వానిని పిలుచుకొని రండని సేవకులకు ఆదేశమిచ్చాడు.

కళ్ళులేక కళాహీనమైన ముఖంతో భార్యతో సహ వస్తున్న అతనిని దూరం నుంచే చూచి మహీపతి గుర్తుపట్టి మూర్ఛాక్రాంతుడై పడిపోయాడు. పిదప పరిజనము మంచుముక్కలతో చల్లనైన నీటితో ఉపచరించగా, తెలివి తెచ్చుకొని, దగ్గరికి వచ్చిన కుమారుణ్ని ఒడిలో కూర్చోపెట్టుకొని చాలసేపు దుఃఖించాడు. "హా! కన్నుల పండువైన కుమారా! ఈ ప్రపంచంలో నీకీ దుఃఖదశ ఎలా వచ్చింది? సురసుందరులకూ్కడా విలోభనమైన నీ విలోచనాంభోజయుగం ఎక్కడ? నీవు గాంభీర్యభూమివి. గుణరత్నకోశంవి. సరస్వతీ వల్లభుడివి. సత్త్వగుణరాశివి. మంచు కొట్టిన కమలవనం నుంచి అందమంతా పోయినట్లు నీనుంచి విలాసభూమి అయిన సిరి ఎక్కడికి వెళ్ళింది? నా గుండె ఎందుకు పగలదో తెలీకుండా ఉంది. ఈ గుండెకు వజ్రంలాగ కఠినంగా ఉండమని ఎవరు ఉపదేశమిచ్చారో! నీ విభవానుగుణమైన పరిజనమంతా ఏమైంది? కష్టాల్లో సజ్జనునికి ధైర్యవృత్తివలె కులానురూప, నిశ్చల అయిన ఈ నీపత్ని మాత్రమే పరివారశేషమా?"



ఇలా దుఃఖవేగంతో తడబడుతున్న మాటలతో ప్రలపిస్తున్న తండ్రిని చూచి, కుమారుడు ఒడినుంచి దిగి నమస్కరించి ఇలా అన్నాడు: "పృథ్వీపురుహూత! శోకం వదలిపెట్టు. ధీరులు శోకానికి లొంగిపోరు. నతులకు ఉన్నతులకు క్షయం తప్పదు. ఇది భవితవ్యత స్వభావం. ప్రజలకు ఆశ్చర్యకరమైన సుఖాలు కలిగించే ఐశ్వర్యమూ, లావణ్యలక్ష్మీ తిలకమైన దేహమూ, కృతాంతుని నర్మకర్మోర్ముల‌కు క్షణంలో కొట్టుకొని పోతాయి. అభావానుభవంగల ఈ భవసాగరంలో సత్యస్వభావంగల భావసమూహమే ఉంటే, మునులు భోగాలు వదలి విజన ప్రదేశాలలో నివసించేవారు కాదనడం నిశ్చయం." ఇలా మాట్లాడుతున్న కుమారుణ్ని శోకమయుడైన రాజు విపత్కారణం కుచ్చి కుచ్చి అడిగాడు. కుమారుడు నెమ్మదిగా, రాజశాసనం వల్ల జరిగిన తన నేత్రవినాశవృత్తాంతం నివేదించాడు.

సచ్చరిత్రహీనులు కూడా జరుపని ఆ తీవ్ర నృశంస కార్యాన్ని విని ధరామూలమైన రాజు మొదలు నరికిన మహావృక్షంవలె నేలమీద పడిపోయాడు. తెలివి వచ్చిన తర్వాత ఇది తిష్యరక్ష చేసిన కుటిల కార్యమే అని ఆలోచించి, ధర్మం ఎడ ఆదరంతోనో అన్నట్లు ఆమెను బంధించాలని ఉత్తర్వు చేశాడు; స్త్రీవధ పాతకానికి కూడా ఉద్యమించాడు. కాని కుణాలకుమారుడు మహాపకారకమైన ఆ క్రౌర్యప్రకారానికి ప్రతీకారం చేయదలచిన తండ్రిని తనకు తన కర్మ పరిపాకంతో దుస్సహమైన దుఃఖం ప్రాప్తించిందని నచ్చజెప్పి వారించాడు. రాజు శోకంతో, కోపంతో మండిపోతూ, "అనార్యురాలు, క్రూరకర్మాసక్తురాలు అయిన దీనిని అభిమానంతో రక్షించడానికి పూనుకుంటావా? ద్వేషకార్యంలోను, స్నేహకార్యంలోను మనస్సు సమానమనేవాడు మనిషేనా? అపకారం జరిగినప్పుడు రోషం ఇంతైనా లేనివానికి ఉపకారం జరిగితే అనుగ్రహం ఎలా కలుగుతుంది?" అని పెద్దగా బుసలుకొడుతూ ప్రలపించాడు. అది చూచి కుమారుడు "తండ్రీ, నాకు ఈ విషయంలో కొంచెం కూడా దుఃఖం లేదు. తీవ్రమైన అపకారం జరిగినా కోపతాపం లేదు. జనని విషయంలో నా మనస్సు నిర్వికారంగాను, ప్రసన్నంగాను ఉంటే, ఏ సత్యనిష్ఠత నేనే నాచేతులతో పెరికివేసుకొన్నానో ఆ నేత్రాలు మునుపటిలాగ ఆ సత్యనిష్ఠతోనే మరల వెంటనే రానీ?" అని అన్నాడు.

కుణాలకుమారుడు ఈ విధంగా అనగానే, లోకంలో అతని సత్యవ్రతానికి ప్రత్యయకారిగా, లక్ష్మికి కూడా విలోభకరమైన నేత్ర సరోజయుగ్మం వెంటనే పుట్టింది. నయనద్వయంతో విరాజమానుడై ప్రజలకు శుభోత్సాహాలు కలిగిస్తున్న కుణాలుణ్ని రాజు యువరాజుగా చేయదలచగా కుణాలుడు విముఖత తెలిపాడు. అతని కుమారుణ్ని, తండ్రితో తుల్యుణ్ని యౌవరాజ్యం అభిషేకించాడు. పిదప ఘోరాపచారం చేసిన పత్నికి తగిన ప్రతీకారం చేసి, తక్షశిలాధిపతి క్షమాపణ కోరగా, అతనిపై గల దుస్సహకోపాన్ని వదలిపెట్టాడు.

భిక్షుగణం ఈ విధంగా జరగడానికి కారణమేమిటని ప్రశ్నించగా, సంఘస్థవిరుడు ఇలా అన్నాడు. "కుణాలుడు ఒక పూర్వజన్మలో కాశీనగరంలో లుబ్ధకుడై పుట్టాడు; హిమాలయ తటాలలో నివసించేవాడు. ఐదువందల జింకలను ఒకమారు పట్టుకొని, కళ్ళు పీకి తన ఉపయోగానుసారంగా చంపాడు. మరొక జన్మలో ముగ్ధుడనే పేరుతో ఒక శ్రేష్ఠికుమారుడుగా పుట్టాడు. పిల్లతనంలో అజ్ఞానం వల్ల చైత్యంలోని జినప్రతిమ కళ్ళను కత్తితో చెక్కివేశాడు. తర్వాత బుద్ధి తెలిసి పరితపించి ఆ ప్రతిమకు నూతనేంద్రనీలాలతో కళ్ళు చేయించాడు. మరొక జన్మలో జీర్ణచైత్యాన్ని ఉద్ధరించి పూజాపురస్కారాలు

జరిపించాడు. అడవుల్లో జింకల కళ్ళు పొడిచివేయడం వల్ల, బాల్యంలో చైత్య ప్రతిమ కళ్లు గీకివేయడం వల్ల ఇతనికి కళ్లుపోయాయి. జన్మాంతరంలోను, ఇప్పుడూ రాజపుత్రుడుగా పుట్టాడు. జన్మాంతరంలో జినప్రతిమకు రత్న నేత్రాలు చేయించడం వల్ల నశించిన చూపును మరల పొందగలిగాడు. శిథిల చైత్యోద్ధారం వల్ల ప్రాసాదికుడు, కాంతిమయుడు అయ్యాడు. స్రోతాపత్తి ఫలంతో కలిగిన విమలాలోకం వల్ల వైరాగ్యంతో ఉజ్జ్వలమైన సత్యదర్శనం కలవాడై అధికారం సంపాదించి, పుణ్యవశాత్తు క్రమంగా సంబుద్ధిని పొందుతాడు." సంఘస్థవిరుడు చెప్పిన మాటలు విని భిక్షుగణం ఆశ్చర్యపడింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కుణాలావదానమనే యాభై తొమ్మిదవ పల్లవం

# 60. నాగకుమారావదానం

ఈ లోకంలో ప్రాణుల శరీరాన్ని కష్టరాశి బాధపెడుతుంది. పరలోకంలోనేమో క్రూరమైన నరకవహ్ని కాలుస్తుంది. సుగతుని శరణు పొందడం చేత కలిగిన పుణ్యంతో శిక్షాపదాలు పొందినవారికి దుఃఖదాహం ఎప్పుడూ ఉండదు.

ధనుడనే ఒక నాగరాజు సముద్రంలో వసించేవాడు. అతడు చాల పరివారం కలవాడు. అతని ఫణారత్నాలకాంతివల్ల ఆ ప్రాంతమంతా ఎప్పుడూ పట్టపగలుగా కనిపించేది. ఆ నాగరాజు భవనంపై కాలిన ఇసుక అహర్నిశం పడుతూ ఉండేది. దానివల్ల పన్నగాల శరీరాలకు తీవ్రవ్యధాతాపాలు కలిగేవి. ధనునికి సుధనుడనే కుమారుడు ఉండేవాడు. అతడు సహజంగా సుకుమారుడు. వేడి ఇసక తుపానుతో బాధపడుతూ ఒకమారు తండ్రిని "నాయనా, ఈ వేడి ఇసక ఎందుకు మనలను బాధిస్తున్నది? ఏ మంత్రప్రయోగం వల్ల, ఏ మూలికా ప్రయోగం వల్ల ఇది ఉపశమిస్తుంది? ఈ సముద్రంలో మనకంటే గొప్పవారు, మనకంటే తక్కువయినవారు ఉన్నారు. ఈ వాలుకవల్ల బాధపడేవాళ్ళం మనమొక్కరమేనా?" అని ప్రశ్నించాడు.

కొడుకు మాటలకు ధనుడు ఇలా అన్నాడు: "నాయనా, ఇతర సర్పాలు ధర్మం తెలిసినవి. మనం అలా కాదు. ధర్మోపదేశశుద్ధులు, శాంతులు, సత్యవాదులు అయినవారికి శారీరక, మానసిక తాపాలు కలుగవు. బుద్ధ, ధర్మ, సంఘాలనే పుణ్యరత్నత్రయం శరణు పొందినవారిని సంతాపం స్పృశించదు. క్లేశప్రశమనాలైన శిక్షాపదాలు స్వీకరించినవారు అమృతసిక్తులయినట్టివారు. వారికి పాపతాపభయమెక్కడ? శ్రావస్తీ నగరంలోని జేతవనంలో భగవానుడు జినుడు ఉన్నాడు. ఆ శాక్యముని లోకంలోని సర్వక్లేశప్రశమబాంధవుడు. కరుణాకౌముదీ జనకుడైన అతడు సత్త్వగుణ ధవళాలైన ఉపదేశాంశు పుంజాలతో జగత్త్రయంలోను అమృతం వర్షిస్తున్నాడు. శిక్షాపదాలను స్వీకరించిన్నీ, దుర్వినీతులై వాటిని రక్షించుకోలేనివారు నరకంలో తీవ్రతాపాలకులోనై శాశ్వతంగా పడిఉంటారు."

తండ్రి చెప్పిన ఈ మాటలను, తల్లి పలికిన చల్లని పలుకులను విని సుధనుడు దివ్యపుష్పాలు తీసుకొని పుణ్యభూమి అయిన జేతవనానికి వెళ్లాడు. అక్కడ ఆ ఆశ్రమంలో ధర్మశ్రవణఆసక్తమై సంతోషసుఖాలు పొంగులు వారుతున్న భిక్షుపరిషత్తును చూచాడు. ఆ పరిషత్తు మధ్యన సుందరవదనుడు, దీర్ఘలోచనుడు, పూర్ణేందుపద్మవనాలకు మైత్రీ సుఖం కలిగిస్తున్నట్టు ఉన్నవాడు అయిన జినభగవానుని దర్శించాడు. ఉపదేశం చేస్తున్న ఆయన ఎర్రటి అధరంతో రాగిజనుల రాగోద్రేకాన్ని అణచివేసి భయపెడుతున్నట్టున్నాడు. నిరాభరణ కర్ణయుగంతో నిరావరణ శూన్యతను ప్రదర్శిస్తున్నాడా అన్నట్టున్నాడు. ఆయన బాహువుల ధర్మద్విపం తొండాలులాగ, కనకమయమై ప్రభావభవన స్తంభాలులా ఉన్నాయి. అప్పుడే వికసించిన రాజీవాలతో కల్పించబడినదా అన్నట్టున్న చరణచ్ఛాయను కాషాయవస్త్రాలతో

భూమికి రక్తావరణంగా కల్పిస్తున్నట్టు, దేహకాంతి సమూహంతో, నయనామృత వర్షంతో సజ్జనులకు సంసార మరుభూమి తాపాన్ని పోగొట్టుతున్నట్టు ఉన్నాడు.

అలాటి భగవానుని దర్శనమాత్రంతోనే నాగనందనునికి సంతాపం తొలగిపోయింది. మహాత్ముల దర్శనం సర్వదుఃఖదోషశమనంగదా! పిదప నాగకుమారుడు తాను తెచ్చిన దివ్యపుష్పాలు అతనిపై చల్లి నమస్కరించాడు. భగవానుని పాదపద్మస్పర్శతోనే వెంటనే అతని శరీరం తాపం వదలి చల్లనైంది. ఆ కృతార్థజీవి భగవానుని నుంచి శిక్షాపదాలు పొంది అంజలి ఘటించి, తమ భవనంలోనే యావజ్జీవం అధివసించాలని విన్నపం చేశాడు. అనుగ్రాహ్యులైన అందరివద్ద యావజ్జీవం ఒక్కడే ఉండడం ఉచితం కాదని భగవానుడు అతనికి సమాధానమిచ్చాడు.

తర్వాత ప్రణయిజన ప్రీతికోసం నాగకుమారుని సంకల్పం పూరించడంకోసం అతని ఆవాసానికి బయలుదేరాడు. భిక్షుసంఘాలు వెంటరాగా, నెమ్మదిగా వస్తున్న సుగతునికి నాగకుమారుడు అడుగడుగున తనప్రభావంతో స్వర్గశోభ కల్పించాడు. హేమరత్న కాంతులతో మిరుమిట్లు గొలుపుతూ దివ్యోద్యానాలతో, మనోహరాలై, ఉపచారం చేయడంలో వ్యగ్రులైన దాసదాసీ గణాలతో, కర్పూర చందన హారాది భూషణాలతో శోభించే విహారాలను అడుగడుగునా కల్పించాడు. తర్వాత అతడు కలందక నివాపమనే వేణువనం చేరి, భగవానుణ్ణి సర్వభోగ సంభారాలతోను అర్చించాడు. అక్కడ సుగతుడు మూడు నెలలపాటు భిక్షుసంఘాలతోసహ అతిథి పూజార్చనలు పొంది హారరత్నకాంతులతో శోభిస్తూ "ఈ ఫణిరాజు కల్పశతం జీవించి సర్వభోగ సుఖాలు అనుభవించి మరుజన్మలో ప్రణిధానంతో అద్భుతమైన బోధిని పొందుతాడు" అని ఆశీర్వదించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో నాగకుమారావదానమనే అరువయ్యవ పల్లవం

# 61. కర్షకావదానం

మూఢుని చేతిలో పడిన నిధి దక్కకుండా పోతుంది. విశుద్ధమైన బుద్ధిగలవాని యింటికి సిరి తనంతట తానే వస్తుంది. మానవులకు విభూషణమణి మనఃప్రసాదమే. అది దారిద్ర్య తిమిరాన్ని దూరం చేస్తుంది. పూర్వం శ్రావస్తిలో స్వస్తికుడనే నిర్ధనుడైన బ్రాహ్మణుడు ఉండేవాడు. వాడు గత్యంతరం లేక కష్టంతో ఫలితమిచ్చే కృషిని జీవిక చేసుకున్నాడు. వాడు వ్యవసాయానికి పూనుకుని ఎండకూ, గాలికీ, చలికీ బాధపడుతూ నాగలి గుద్దలి మోసుకుని ఇంటికీ, పొలానికి తిరిగేవాడు. వాడు ఒకవారు శ్రావకులతోపాటు దారిన వస్తున్న జినదేవుణ్ణి భార్యతోపాటు దర్శించి, ప్రసన్న హృదయుడయ్యాడు. అతని భార్య కూడ ప్రసన్నురాలైంది. అప్పుడతడు భార్యతో అన్నాడు గదా: "మనం దానపుణ్యం చేయనందుననే ఈ ఘోరమైన దారిద్ర్య దుఃఖం సంప్రాప్తించింది. దగ్గరకు వచ్చిన భగవానుని మనం భిక్షతో సత్కరించలేకపోయాము. మరి మనకు పుణ్యపణంతో ప్రాప్తించే ధనసంపత్తి ఎలా వస్తుంది? అవమానితుడు ప్రపంచంలో బ్రతుకుతాడు. కీర్తి నశించినవాడు మరణిస్తాడు. నిర్ధనుడైన వాని పరిస్థితి అటు చావు కాదు: బ్రతుకూ కాదు. ధనమే జాతి, ధనమే విద్య, ధనమే ధర్మం, ధనమే యశస్సు. ధనం లేని వారి గుణాలెందుకు? అవి యాంచా నిర్జీవాలు. దరిద్రుని సద్గుణాలు ఏమి పనికి వస్తాయి? అవి ఇతరులకే ఉపకరణాలవుతాయి. మణికాంచన భూషలు మోసేవానికి భారం తప్ప మరేమీ ప్రయోజనముంటుంది? దరిద్రుడు దానం చేయనందువల్ల మరల దారిద్ర్యంలో కూరుకునిపోతాడు: ధనాశాపరవశుడై పాపాత్ముడౌతాడు; దరిద్రుడు ఊపిరి వదలుతున్నా మరణించాడనడంలో మతభేదం లేదు. దరిద్రునికి పది దిక్కులూ స్వజనవిహీనమైనవే. కనుక దరిద్రవత్సలుడైన సుగతుని పూజిద్దాము. బుద్ధులను అరాధించని మూర్ఖులకు కుశలమెక్కడిది? ఈ పద్మపత్రాక్షుడు, అపన్నబాంధవుడు ఎక్కడెక్కడ దృష్టి ప్రసరింపజేస్తాడో అక్కడక్కడ సిరులు నెలకొంటాయి" అని భర్త మాటలు విని భార్య చాలా శ్రద్ధతో ఇంట శుచిగా రుచిగా భగవానుని కోసం భోజ్య వస్తువులను సిద్ధపరచింది. సర్వజ్ఞుడైన భగవానుడు వారి ఈప్సితాన్ని గ్రహించి వారు ప్రేమతో అభ్యర్థించగా పూజను గ్రహించాడు. జినపూజానంతరం బ్రాహ్మణుడు "దారిద్ర్యదుఃఖం వికటంగా వున్న నాకు సంపద కలుగనీ" అని ప్రణిధానం చేశాడు.

పిదప అతడు యథాప్రకారం వ్యవసాయం కోసం తన పొలానికి వెళ్ళాడు. అక్కడ వరి మొలకలు, యవాంకురాలు అన్నీ బంగారువి అయి వుండడం చూచి ఆశ్చర్యపడ్డాడు. వెంటనే అతని దారిద్ర్యం వదిలింది. పుణ్యవశాత్తు అతనికి అబ్బిన బంగారును చూచి ప్రసేనజిన్మహారాజు విస్మితుడై రాజభాగం వదలిపెట్టాడు. గొప్పగా లభించిన ఆ బంగారంతో వాడు ఐశ్వర్యవంతుడై బుద్ధప్రముఖుణ్ణి, సంఘాన్ని సర్వ భోగాలతోను పూజించాడు. శాస్త్ర ధర్మోపదేశంతో స్రోతః ప్రాప్తి ఫలోదయం పొంది సత్యం

దర్శించి కాలక్రమాన సన్యసించాడు. అనంతరం అతడు సర్వక్లేశాలు త్యజించి అర్హత్వం పొందాడు

"అర్హత్వం అంత త్వరగా సిద్ధించడానికి కారణమేమి?" అని భిక్షువులు ప్రశ్నించగా భగవానుడు ఇలా సమాధానమిచ్చాడు. "ఈ విప్రుడు పూర్వజన్మలో మహాత్ముడైన కాశ్యపుని శాసనంతో బ్రహ్మచర్యం అనుష్ఠించాడు. ఈ జన్మలోను ఆ కాశ్యపుని ఆదేశంతోనే ఇంద్రోపేంద్ర సురార్చితమైన ఈ మహాసిద్ధి నా నుంచి ఇతనికి లభించింది."

"బుద్ధుడు చెప్పిన ఆ సుకృతం విని భిక్షువులందరూ ఆశ్చర్యపడి, కుశలమార్గంపై ఆదరంతో హర్షపూర్ణులై అతని గుణగణం తమ అంతరంగాలలో చేరిపోయినట్లు అతని సుచరితం ప్రశంసించారు."

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కర్షకావధానమనే అర్వై ఒకటవ పల్లవం

# 62. యశోదావదానం

గొర్రెలతో నిండిన ఈ జనకాననంలో ధనం, యౌవనం, సుఖోచితమైన చారు రూపం ఉన్నప్పటికీ వివేకంతో శాంతి ధవళమైన వైరాగ్యాన్ని పొందగల పురుషుడొక్కడే చమత్కారం తెలిసినవాడు.

పూర్వం బుద్ధదేవుడు న్యగ్రోధారామంలో విహరిస్తుండగా, వారాణసిలో సుప్రబుద్ధుడనే గృహపతి ఉండేవాడు. త్యాగాలు, భోగాలు ఎంతచేసినా అతని ధనం తరిగేది కాదు. అతడు కుబేరునికే తన కోశలీనమైన ఐశ్వర్యాన్ని అప్పగించేటంత ధనవంతుడు. సర్వసుఖ సంపదలున్నా పుత్రులు లేనందున, పుత్రచింతతో అతడు చాల పరితపించేవాడు. సంపదలున్నంత మాత్రాన మనఃక్లేశాలుండవా?

పుత్రశోకాగ్ని సంతప్తుడైన ఆ బంధువత్సలునితో బంధువులు అతని చింత తమకూ సంక్రమించడం వల్ల చింతాక్రాంత మానసులై ఇలా అన్నారు: "గృహపతీ, క్లీబోచితమైన చింతపడడం నీకు తగదు. మహాసత్త్వులైన ధీరులకు లోకంలో దుర్లభమైందేదీ లేదు. ఈ దేశంలోని ఒక మర్రిచెట్టును ప్రజలందరూ పూజిస్తున్నారు. దీనికి చాల ప్రసిద్ధీ ఉన్నది. నీవు ఆ న్యగ్రోధతరుపూజ చేయి. సర్వమూ పొందుతావు. దీనిని అర్థించడం వల్ల అపుత్రులు కొందరు పుత్రవంతులయారు. నిర్ధనులు కొందరు ధనవంతులయారు. రోగులు కొందరు రోగవిముక్తులయారు. ఈ న్యగ్రోధవృక్షం పేరు సత్యయాచనచైత్యమని. సముచితంగా ప్రార్థించావంటే పుత్రఫలం నీ కిస్తుంది."

ఇలా అంటున్న బంధువర్గాన్ని చూచి, గృహపతి మందహాసంతో ఇలా అన్నాడు: "మీరందరూ మోహం వల్లనో, నాయందు స్నేహం వల్లనో మూర్ఖులయిపోయారు. స్వపూర్వకర్మ పరతంత్రమై నియతి గిరి గీచిన ఈలోకంలో ఎవడు ఎవనికి స్థితి కల్పిస్తాడు? ఎవడు ఎవరిని పోషిస్తాడు? ఎవడు ఎవరిని చంపుతాడు? ఎవరిది అపహరిస్తాడు? తన కర్మకొద్దీ పొందిన దానినే అవివేకి ఎవరో ఇచ్చినట్టుగా భావించి సంతోషిస్తాడు- కుక్క ఎండిపోయిన చర్మం నములుతూ తన చొంగనే నాకుతూ సంతోషపడినట్లు. ఈ వృక్షం పుత్రులను ప్రసాదించగలదనేది మూర్ఖులనేమాట. కాలం కలిసిరాకపోతే ఇది తాను ఒక్క ఆకు కూడా రాల్చదు. ఆ వృక్షాధిష్ఠానదేవుడు ఉండి పూజాలుబ్ధుడై ఇలా చేస్తున్నాడంటే, తనే తనకోసం పూర్ణోపహార పూజను ఎందుకు కల్పించుకోడు? ప్రాప్తవ్యమైన దానిని ఘుణాక్షరన్యాయంగా, కాకతాళీయంగా పొంది ఆ వృక్షదత్తమని ప్రజలు అనుకుంటారు. ప్రాప్తం ఉంటే పూర్వకర్మల పరిణామంలో తనంతటనే ప్రాప్తిస్తుంది. అలభ్యమైనది నానా ప్రయత్నాలు, పూజాపురస్కారాలు చేసినా లభించదు. ఏది ఎవనికి స్వయంగా దక్కిందో వాడు దానితో భోగశాలి అవుతాడు. వీడు దీనిని చేశాడని ముగ్ధబుద్ధులు వృథాగా అనుకుంటారు."

అతడు ఈ విధంగా అంటున్నప్పటికీ, బంధువులందరూ స్నేహంతో బలవంతపెట్టగా, మూఢుడై ఒంటరిగా ఆ వటవృక్ష సన్నిధికి వెళ్ళాడు. అక్కడ ఒక గొడ్డలిని తీసుకొని, "పూజకోసం సిద్ధంగాను వచ్చాను; మూలచ్ఛేదం చేయడం కోసమూ సిద్ధంగా వచ్చాను. పుత్రులను ప్రసాదించావా ఇతరులెవ్వరూ

చేయని పూజ చేస్తాను. పుత్రులను ఇవ్వకపోయావా నిన్ను నరికి కాల్చి బూడిద చేసి నూరి ఏటిలో కలుపుతాను" అని వటవృక్షంతో అన్నాడు. ఆ మాటలు విని ఆ వృక్షవాసిని అయిన దేవత భయోద్విగ్నయై కంపిస్తూ ఇలా తనలో తలపోసింది: "నేను నా యిచ్ఛగా ఎవ్వరికీ పుత్రులనుగాని, విత్తంగాని ఇచ్చినదాన్ని కాను. వారి కర్మానుసారంగా పొందినదాన్ని నేను యిచ్చినట్లు భావిస్తున్నారు. ఇప్పుడేమో అపూర్వమైన సంగతి ఏర్పడింది. పుత్రార్థి అయిన వీడు కర్మవశాత్తు పుత్రులు కలుగకపోతే దేవతనే నరకడానికి వచ్చాడు. ఫలార్థులు పూజింపదగిన దానిని పూజిస్తారనేది సాధారణంగా జరిగే విషయం. స్వకర్మబద్ధమైన ఫలాలు లభించకపోతే దేవుడెక్కడ? ఇవ్వడమెక్కడ? ఇప్పించడమెక్కడ? మానవుని వ్యాధి నివారణకు జరిగిన చికిత్స కర్మవశాత్తు ఫలించకపోతే, గణకులను, వైద్యులను, మంత్రులను ఎవరయినా నిలదీసి అడుగుతారా? ఈ అకార్యకారికి వృక్షాన్ని నరికి వేయాలనడంలో వికల్పవేమీ లేదు. అన్యాయాభినివేశంగల పొరపాటు చేసేవారికి అకార్యమనేదేదీ లేదు. ఈ వృక్షం తెగిపోతే మరొకచోట ఉండలేను, సుఖపడలేను, మునులు కూడా సహవాసం వల్ల కలిగిన ప్రీతిని వదలుకోలేరు."

ఈ విధంగా ఆ దేవత తలపోసి వెంటనే ఇంద్రుని మందిరానికి వెళ్ళి విషయమంతా నివేదించి ఎదుట నిలబడి భయంతో ఇలా విన్నవించింది: "ఆ వృక్షంలో నేను సదా నివసిస్తూ ప్రజల పూజలు అందుకుంటున్నప్పటికీ పలువురు ఉపవసిస్తూ పెక్కు వరాలు అడగడం వల్ల విసిగిపోయాను. కొందరు తమ పూర్వజన్మ సుకృతం వల్ల ఫలాలు పొందుతున్నారు. కొందరు తలవంచుకొని వెళ్ళిపోతున్నారు. కొందరు హతబుద్ధులు ఖలవ్రతాలు చేస్తూ అక్కడే నశించిపోతున్నారు. ప్రజలు గతానుకతికంగా ప్రసిద్ధిని నమ్ముతారు. సకల కష్టపరిహారం కోసమూ మూర్ఖత్వంతో నాదగ్గరికే పరిగెత్తి వస్తున్నారు. ఈ చంచలబుద్ధులైన మూర్ఖులతో విసిగిపోయినప్పటికీ ఆ వృక్షాన్ని, దాని గుణగణాలమీది ఆశతో వదలలేకున్నా. సువాసన మీద ఆశతో తుమ్మెద కమలంలో దూరి అక్కడే చిక్కుకుపోవడానికి ఇష్టపడుతుంది. తామరతూళ్ళను తినదలచుకొన్న హంస బురదను అడ్డని అనుకోదు. ఒకవైపు పొగ కమ్మి బాధపరుస్తున్నా శీతార్తుడు నిప్పును వదలడు. ఎవనికి ఏది ఉపయోగమో వాడు దానిలోని లోపాలను సహిస్తాడు. కనుక వృక్షవియోగం వల్ల బాధపడుతున్న నన్ను రక్షించు. ప్రాణులకు స్థానత్యాగం శరీరత్యాగం వంటిది." వృక్షాదిష్ఠానదేవత చనువుతో ఈవిధంగా అభ్యర్థిచడం వల్ల ఇంద్రుడు గృహపతికి పుత్రలాభం కర్మాయత్తంగా కలుగగలదని సంకల్పించాడు.

ఈలోగా స్వర్గంలో సుమతి అనే దేవపుత్రునికి చ్యుతికాలం వచ్చినట్లు ఇంద్రుడు తెలుసుకొన్నాడు. పతన సూచనగా సుమతి ధరించిన పూలమాల ఖలుడు నమస్కరించగా నలగిన కీర్తివలె వాడింది. దైన్యం కలుగగానే యాచన బయలుదేరినట్లు సుమతి ముఖంపై చీకటి సైదోడువంటి ఛాయ పడింది. పుణ్యం క్షీణించగా కొత్తగా అపాయం పుట్టుకొనివచ్చేట్లు ఒంటిమీద చెమట పట్టింది. ద్వేషదుష్టమైన బుద్ధివలె అరుచి ఏర్పడింది. అప్పుడు ఇంద్రుడు సుమతిని చూచి, "సుమతీ, నీవు భూలోకంలో విస్తారైశ్వర్యుడు, గుణవంతుడు అయిన సుప్రబుద్ధునికి పుత్రుడుగా పుట్టు" అని ఆజ్ఞాపించాడు. ఇంద్రుని ఆజ్ఞ విని సుమతి వినయంతో "ప్రభూ, కాలక్రమాన నేను శాస్త, అనుత్తరోదార ధర్మచక్ర ప్రవర్తన శక్తుడు అయిన శాక్యముని ఎదుట ప్రవ్రజ్యాదీక్ష స్వీకరించడానికి నీవు సమ్మతించి జ్ఞాపకపరిస్తే సుప్రబుద్ధుని పుత్రుడుగా జన్మించడానికి భూలోకానికి వెళ్ళుతాను" అని మనవి చేశాడు. ఇంద్రుడు సరేనన్నాడు. సుమతి ఇంద్రుని ఆనతి మేరకు సుప్రబుద్ధుని పత్నికుక్షిలో ప్రవేశించాడు.



ఆ మీదట వటవృక్షాధిష్ఠాన దేవత భూలోకానికి తిరిగి వచ్చి, సుప్రబుద్ధునితో "ఓ సాధో! నీకు ప్రవ్రజ్యభిరతుడైన కుమారుడు కలుగుతాడు" అని అన్నది. సుప్రబుద్ధుడు ఆ మాట విని సంతోషపడి పుత్రుడు పెరిగి పెద్దవాడయిన తర్వాత సన్న్యాసం స్వీకరించవద్దని చెబుతానులే అని అనుకుంటూ ఇంటికి వెళ్ళాడు.

పిదప కొంతకాలానికి అతని భార్య లలిత సర్వాంగ గుణోపేతుడు, స్వర్ణశరీరుడు అయిన పుత్రుని ప్రసవించింది. సుకృత సంపన్నుడైన అతడు పుట్టగానే అతనికి రత్నమయచ్ఛత్రం, ఆశ్చర్యమే మూర్తీభవించినట్లున్న ఉత్తంసం పుట్టాయి. తండ్రి కీర్తిని అభివృద్ధి పరచడం వల్ల అతనికి యశోదుడనే పేరు వచ్చింది. అతడు సకల విద్యలకు, కళలకు, సంపదలకు సమాగమస్థానంగా అభివృద్ధి చెందాడు. దేవత చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చి, తండ్రి, తన కుమారుడు సన్న్యాసం స్వీకరిస్తాడనే అనుమానంతో అతనికి ఇంటను, పట్టణంలోను, పురద్వారాలలోను, గోపురాలలోను కాపలా పెట్టాడు. కాని, ఇంద్రుడు మొదట చేసుకొన్న నియమం ప్రకారం అతనికి ప్రవ్రజ్యా స్వీకరణ సంగతి జ్ఞాపకపరిచాడు. దానితో శమజలాభిషిక్తుడైన ఆ యశోద కుమారుని మనసు ప్రవ్రజ్యాభిముఖమైంది.

అతడొకనాడు రథారూఢుడై తన ఉద్యానంలో వెళ్ళుతూ, భగవానుడైన జినుడు వస్తుండడం యథాలాపంగా చూచాడు. హృదయానికి హాయి కలిగిస్తున్న, ప్రశమామృతాన్ని వర్షిస్తున్న అతన్ని చూచి అతడు వెంటనే రథంనుంచి దిగాడు. దిగి ప్రదక్షిణ చేసి, తత్పాద పద్మయుగానికి నమస్కరించాడు. భగవానుడు ప్రసారార్ద్రదృష్టితో యశోదుణ్ని చూచాడు. పిదప యశోదుడు భగవానునినుంచి అనుజ్ఞ పొంది, భగవానునినే ధ్యానిస్తూ, తన ఉద్యానానికి వెళ్ళాడు. భగవానుడు మందహాసం చేస్తూ, అశ్వజినుడనే భిక్షువును చూచి, "ఈ కుమారుడు ఈ రాత్రి నా వద్దకు వచ్చి ప్రవ్రజ్య స్వీకరిస్తాడు" అని, భిక్షువులతో సహ స్వస్థానానికి వెళ్ళాడు.

ఇంద్రుడిక్కడ యశోదుణ్ని ప్రబోధించడం కోసం అతని ఉద్యానంలో ఒక స్త్రీ శవం కల్పించి పెట్టాడు. ఆ శవం చీముపట్టి కుళ్ళి పురుగులతో లుకలుకలాడుతూ ఉంది. యశోదుడు అలాటి శవం చూచి, ఉద్వేగంతో తనలో ఇలా అనుకున్నాడు: "తారుణ్య రూప లావణ్యాకాంతులన్నీ వికారమైనవే. చంచలాలైన లోచనాలతో, పైకి పొంగుతున్న కుచయుగంతో, నవయౌవన లావణ్యంతో వెన్నెలల నెలవయిన ఈ స్త్రీ దేహం చీము, మూలుగ కారడంతో తడిసి, పురుగులతో లుకలుకలాడుతూ కుళ్ళి కాలేయం, పేగులు, ప్లీహం మొదలయినవన్నీ పనిచేయక ఉబ్బిపోయి చిందరవందరై ఎంత దుస్సహంగా ఉంది? ఒకప్పుడు ఈ వనిత రాగవిమోహనంలో కన్ను చెదరి హతబుద్ధులైన పురుషులు, సర్వాంగ సంగోత్సవంలో అలసి స్తనమండలంపై ఒరిగి ఎంతో సంతృప్తి చెందారు. అలాటిదాని ఈ శరీరం నేడీస్థితికి రాగా, నక్క కూడ పీక్కుతిందామనే వాంఛ లేక, ముఖం తిప్పుకుని క్లేద విషాదాలతో బుద్ధి కుంగిపోయి, దూరంగా పారిపోతున్నది." ఈ విధంగా ఆలోచిస్తూ గాఢ వైరాగ్య వాసన కలుగగా, ఉద్యానంలో ప్రవేశించడానికే ఇష్టపడక నిజభవనానికి వెళ్ళాడు.

ఇంతలో దినమంతా పరిశ్రమ చేయడం వల్ల అలసి ఖిన్నుడైన దివాకరుడు విరసమైన లోకవృత్తాంతం చూచి విసుగుపడ్డాడా అన్నట్లు ప్రశమోన్ముఖుడయ్యాడు. సంధ్యారాగం అంబరమంతా (ఆకాశమంతా) అలముకుంది. సూర్యుడు ఆశలు (దిక్కులు) అన్నీ వదలి ప్రశమం (అస్తమయం) పొందుతుండడం

చూడగా, ఆశలన్నీ వదలి, ప్రశమం (పరమ శాంతి) పొంది సంధ్యారక్తాంబరధారియై సన్న్యాసం స్వీకరించినట్టు కనిపించింది. భువనానికి నేత్రం వంటి సూర్యుడు లోకోత్తరపదం (ఉత్తమపదాన్ని, అంతిమమయిన అస్తమయాన్ని) పొందగా, దినం కూడా లోకం వదలి అతనిని అనుసరించింది. చీకట్లు అలముకొనసాగాయి. దీపాలు వెలిగాయి. అది చూడగా, అప్పుడే వ్యాపిస్తున్న చీకట్లతో లోకులు బాధపడకుండా ప్రదీప మండలాలోకం దయతో ఆదుకొన్నట్లుంది.

అప్పుడు శాస్త అయిన బుద్ధదేవుడు యశోదునిపై దయతో అతన్ని కలుసుకోడానికి పురసమీపంలోని వారానది ఆవలిగట్టు చేరాడు. యశోదుడు సంసారంలోని సారహీనత దినాపాయం (చీకటి) వంటిదేనని భావిస్తూ శయ్యాభవనం ప్రవేశించాడు. అక్కడ తన దాసీజనం వేణువీణామృదంగాది వినోదాలతో మదనిర్భరమై, అలసి నిద్దురపోతుండడం చూచాడు. ఈ సుఖం క్షణికమన్నట్టు కొందరు వీణపైనే ముఖం పెట్టుకొని, కొందరు మృదంగాలపైనే చేతులు వేసి దుఃఖధ్యానం చేస్తున్నట్టు నిద్రపోతుండడం చూచాడు. గుడ్డలన్నీ జారి, చెదరి, చచ్చినవారివలె నిశ్చలంగా పడివున్న పరిచారికలను చూచి అతనికి ఎక్కువగా వైరాగ్యం జనించింది. ఇలా అనుకున్నాడు: "ఆహా! పర్యవసానంలో విరసమైన వనిత అనే విషయ సుఖంలో అజ్ఞానులకున్న తీవ్రాదరం? కారుమబ్బులలో మెరుపుల్లాగ, అసత్సుఖమనే కారుమబ్బులలో వీరి విలాసాలు, మందహాసాలు క్షణమాత్రం మెరిసేవి. అవీ నిద్రలో చచ్చినట్టు పడివున్నప్పుడు ఏవీ? ఒకతేమో బోళ్ళపడకుంది. దానిపైన మరొకతె మెలికలు తిరిగిపడింది. మరొకతె నోరు తెరచుకొని వెల్లికిలా పడుకుంది. మరొకతె జుట్టు ముడి వీడి భుజాలపై కాకులులాగ మూగింది. నిద్రపోతున్న ఈ స్త్రీలతో నా భవనం శ్మశానంగా కనిపిస్తున్నది. నేనిప్పుడే పట్టణం నుంచి బయలుదేరి అజ్ఞానమోహం తొలగించుకొనడానికి భగవానుని దర్శనం చేసుకుంటాను." ఈ విధంగా ఆలోచించి, అతడు అమూల్యమైన రత్నపాదుకలు తీసుకొని, ఇంద్రుని ప్రభావం వల్ల నగర రక్షకులకు కనిపించకుండా వెళ్లిపోయాడు. సంసార మరుభూమి సంక్రాంతమైన తాపాన్ని పోగొట్టుకొనడానికో అన్నట్టు వారానదీతీరం చేరుకున్నాడు.

భూతభావనుడైన భగవానుడు యశోదుడు వస్తుండం చూచి, అతన్ని నదిని దాటించడం కోసం ఉబలాటపడ్డాడు. బంగారు కాంతులీనే కుడిచేయిన పైకెత్తి, దేహప్రభలతో దిక్కుల చీకట్లను పటాపంచలు చేస్తూ, "రా. రా. ఇక్కడికి చేరుకో. ఇది నిరపాయమైంది. అనామయమైంది" అని దూరం నుంచే మేఘగంభీరధ్వనితో పిలిచాడు. భగవానుని మాటలు విని యశోదుడు అమృతవర్షం కురిసినట్టు వెంటనే తాపమంతా ఉడిగి, ప్రశాంతదేహుడు, ప్రశాంతమనస్కుడు అయ్యాడు. పిదప అమూల్యమైన రత్నపాదుకలను నదీతీరంలోనే వదలిపెట్టి ఏటిలో దిగి ఈదుకుంటూ ఆవతలిగట్టు చేరాడు. చేరి, తాపాలకు చందనవృక్షం వంటివాడు, ప్రసాదార్హుడు అయిన భగవంతుని సమీపించి అతని చరణాలపై శిరస్సు మోపి, నమస్కరించాడు. భగవానుడు అతనికి అసమోత్కర్షశాలి అయిన ధర్మోపదేశం చేశాడు. దానితో అతడు విగతరాగుడయ్యాడు. పిదప భగవానుని నియామకంతో అతడు బ్రహ్మచర్యవ్రతంలో ఉంటూ పూర్ణకాముడయ్యాడు.

ఇక్కడ నగరంలో సుప్రబుద్ధుడు మేల్కొని కుమారుని గృహనిష్క్రమణవార్త విని, వియోగాగ్నిసంతప్తుడై వెదకడానికి బయలుదేరాడు. స్నేహం, మోహం, పుత్రవాత్సల్యం ముప్పిరిగొనగా



శోకార్తుడై వెదుకుతూ వెదుకుతూ, వారానదీ తీరంలో రత్నపాదుకలు చూచాడు. అవి తన కుమారునివని గుర్తించి ఏరు దాటి భగవానుని దర్శించాడు. అతని ప్రభావం వల్ల పుత్రుడు కండ్లకు కనిపించలేదు. పిదప భగవానునికి నమస్కరించాడు. భగవానుడు ధర్మసంబంధమైన కథలతో అతని మోహాన్ని కాంతి చీకటిని పోగొట్టినట్టు పోగొట్టాడు. భగవానుని ఉపదేశంతో మోహం తొలగిపోగా, విమలకాంతితో ధగధగలాడుతున్న పుత్రుడు కనిపించాడు. అనంతరం చనువుతో శాస్త అయిన బుద్ధునికి తన ఇంట అధివాసనమును (భిక్షను) ఏర్పాటు చేశాడు. భగవానుడు అతని యింట పూజను స్వీకరించి, అతనిని, అతని భార్యను పరిశుద్ధ శిక్షాపదాలతో ఉజ్జ్వలులను చేశాడు.

యశోదుడు భగవానుని శాసనంతో బ్రహ్మచర్య దీక్షితుడు అయినట్టు వార్త, కీర్తి దిక్కులకు వ్యాపించాయి. ఆ వార్త విని అతని మిత్రులు, శ్రీమంతులు అయిన నలుగురు - విమలుడు, సుబాహుడు, పూర్ణకుడు, గోపతి అనే వారు గౌతముని వద్దకు వచ్చారు. శుద్ధశాసనుడైన భగవానుడు తమ కుశల పరిపాకంతో తన సన్నిధికి చేరిన ఆ నలుగురికి ధర్మవినయం శాసించాడు. యశోదుడూ, ఆ నలుగురు, మరి ఐదుగురు భిక్షువులు, మొత్తం పదిమంది భగవంతుని అంతికంలో అర్హత్పదం పొందారు. యశోదుని వృత్తాంతం విని అతని మిత్రులు మరి యాభైమంది శాస్త సన్నిధికి వెళ్ళి తమ మిత్రునిలాగే దీక్ష స్వీకరించారు. వారి సంగతి విని ఆదరంతో మరి ఐదువందలమంది భగవానుని నుంచి తత్తుల్యమైన ధర్మవినయం స్వీకరించారు.

ఒకమారు సర్వభిక్షువులు కుతూహలంతో యశోదుని పుణ్యానికి కారణమేమిటని ప్రశ్నించగా, సర్వజ్ఞుడిలా అన్నాడు.

"పూర్వం శిఖి అనే ప్రత్యేకసంబుద్ధుడు వారాణసీ నగరంలో భిక్ష స్వీకరించి, వారానదీ తీరంలో క్షణకాలం కూర్చున్నాడు. ఆ దారిని వెళ్లుతున్న బ్రహ్మదత్త భూపతి వెంట ఉన్న సుప్రభుడనే అనుచరుడు విశ్రమించిన ఆ ప్రత్యేకబుద్ధుని చూచాడు. అప్పుడు ఎండ తీవ్రంగా కాస్తున్నది. ఆ తాపానికి ప్రత్యేకబుద్ధునికి చెమటలు కారుతున్నాయి. అప్పుడు సుప్రభుడు అతనికి గొడుగు పట్టాడు. తరువాత అతని వద్ద బ్రహ్మచర్యదీక్ష పొంది చిత్త నైర్మల్యంతో కుశల ప్రణిధానవంతుడయాడు. ప్రత్యేకసంబుద్ధుడు ప్రసన్నుడై "అవతరించబోయే శాక్యముని సన్నిధానంలో బోధిని పొందుతావు" అని అన్నాడు. తర్వాత సుప్రభుడు కొంతకాలానికి కాలధర్మం చెంది, దేవలోకంలో సుమతి అనే దేవపుత్రుడుగా అవతరించాడు. ఆ పుణ్యవంతుడే శ్రేయస్సుకు నిధి అయిన యశోదుడు. అతడు తన మిత్రులందరికీ కూడా కుశలసేతువయ్యాడు. కృకి అనేరాజు శాస్త అయిన కాశ్యపుడు నిర్వాణం చెందగా ఉదారబుద్ధితో రత్నస్తూపం నిర్మించాడు. ఆ రాజు మూడవ కుమారుడు యశస్వి అనేవాడు ఆ స్తూపంలో రత్నచ్ఛత్రం పెట్టించాడు. ఆ జన్మలోని పూర్వపుణ్యంతో యశోదుడు ఈ జన్మలో రత్నదీప్తమైన ఛత్రంతో జన్మించాడు. ఇలా పూర్వజన్మకృతసుకృతోదయం పాదుగా పెరిగి పెద్దయిన ఈ సాధువు మహాధర్మద్రుమం శశిధవళయశస్సనే పుష్పాలు పూచి, ఫలించింది."

ఈ సంగతిని భిక్షుసంఘం విని ఆశ్చర్యపడింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో యశోదావదానమనే అర్థై రెండవ పల్లవం

# 63. మహాకాశ్యపావదానం

స్మరసుఖమనేది ఇంద్రుడు, వాయువు, వరుణుడు మొదలయిన దేవతలకు, మునివరులకు మనోవికారం కలిగించేది. అలాటి స్మరసుఖాన్ని గడ్డిపోచగా పరిగణించేవారిని చూస్తే, ఎవరికి ఆశ్చర్యం కలుగదు!

మగధదేశంలోని మహాస్థలమనే గ్రామంలో మహాశాలకులోద్భవుడైన న్యగ్రోధకల్పుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. గర్భిణి అయిన అతని భార్య సురూప గృహోద్యానంలో విహరిస్తూ, ఒక రావిచెట్టు కింద సూర్యునివలె వెలిగిపోయే కుమారుణ్ణి ప్రసవించింది. బంగారు కాంతితో ప్రకాశించే ఆ కుమారుడు పుట్టగానే, ఆ రావిచెట్టునుంచి యశస్సువలె ధవళమైన దివ్యవస్త్రం పుట్టింది. ఆ బాలునికి పిప్పలాయనుడనే పేరు పెట్టారు. అతడు విద్యాకళాబుద్ధులతో సంపదతో పాటు వృద్ధిపొందాడు. అతడు వివేకంతో మనస్సు వికసించడం వల్ల విషయద్వేషి అయాడు. కనుక తండ్రి ఎంత ప్రార్థించినా, వివాహవిముఖుడయాడు. వంశచ్ఛేదమవుతుందని తండ్రి మరల మరల ప్రార్థించాడు. దానికి అతడు తండ్రితో ఇలా అన్నాడు: "తండ్రీ నేను కామాన్ని కోరేవాణ్ణి కాను. బ్రహ్మచర్యంలోనే నాకు బుద్ధి. శమస్వాతంత్ర్యం మానుకొని భవబంధంలో ఎవడు ఇరుక్కోవాలని ఇష్టపడుతాడు? వివాహంలో హోమధూమంతో మొదట కారే కన్నీరు నిరంతరం కారడం ప్రారంభిస్తాయి; చేతులు కలపడం వల్ల వ్యసనమార్గంతో ముడిపడుతుంది. సంసారాజ్ఞను దాటగూడదని మాల్యబంధనం జరుగుతుంది. కనుక మోహోద్రేకం మనస్సును కప్పినవారికే వివాహం సంతోషకరమౌతుంది. వివాహ సమయంలో నృత్యమనే గాలికి కదిలే లలనా లతా విలాసాలను, వీణావంశరవాలను ఉత్సాహంతో విననివారికి 'హా! పుత్ర!' అని బాష్పగద్గదమై, అభియోగ భూయిష్ఠమైన వధూప్రలాపవాక్యాలు వినే అవకాశం ఉండదు" అన్నాడు. తల్లి, తండ్రి, అతనిని మరింత నిర్బంధపెట్టగా, అతడు కుశలురైన శిల్పులతో కాంతిసిక్తమైన కౌతుకకందలివలె వున్న ఒక హేమమయ వనితావిగ్రహం నిర్మింపజేసి, "ఈ హేమ కన్యతో సమాన లావణ్యవర్ణంగల కన్యక లభిస్తే నేను నీమాట కాదనక దారసంగ్రహం (వివాహం) చేస్తాను" అని తండ్రితో అన్నాడు. కొడుకు మాటలు విని, దానితో సమానమైన బ్రాహ్మణకన్యక స్వర్గంలోను లభించదని తండ్రి నిరాశుడై తలవంచుకొన్నాడు.

ఈ సంగతి విని అతని మిత్రుడైన చతురకుడనే బ్రాహ్మణుడు ఆనందం ఉడిగి శోకాక్రాంతుడైన అతనితో ఇలా అన్నాడు: "ప్రయత్నమాత్రసాధ్యమైన ఈ విషయంలో నీకు విచారం వద్దు. స్వర్ణకాంతిగల కన్యను అన్వేషించడానికి ఇదుగో, నేను వెళ్ళుతున్నాను." చతురకుడు మిత్రునికి ఈ విధంగా ధైర్యం చెప్పి, బంగారు బొమ్మను తీసుకొని, పుష్పమాల్యాంశుక భూషణయుతమైన దేవతా లాంఛనమైన ఒక ఛత్రం పుచ్చుకొని, "ఇది కన్యలకు పూజ్యం" అంటూ దిక్కు దిక్కునా వెదికాడు. ఆ ఛత్రపూజకోసం వచ్చిన ప్రతి కన్నియనూ పరిశీలించాడు. కాని బంగారు బొమ్మవంటి కన్య ఎక్కడా కనిపించలేదు. చతురకుడు అట్లే తిరుగుతూ వైశాలీనగరానికి వచ్చాడు. అక్కడ కపిలుడనే బ్రాహ్మణుని కుమార్తె భద్ర అనేది కనక



ప్రతిమకంటే కాంతిగలది కనిపించింది. ఆమె వైరాగ్య వివేకంతో వివాహ విముఖి అయింది. చతురకుడు తన కులగోత్రాదులు న్యగ్రోధకల్పుని కులగోత్రాలు తెలిపి, కన్యను పిప్పలాయనునికి ఇవ్వవలసిందిగా కోరాడు. కన్యాజనకుడు అతనితో "కాశ్యపుని వంశంలో పుట్టిన న్యగ్రోధకల్పుని కులం ఉత్తమమైంది. కులంవారిలో విఖ్యాతమైంది. అయితే, కన్యను ధనం అన్వేషించి ఇస్తారు. దరిద్రంతో బాధపడే కన్య తండ్రి మనస్సును దహిస్తుంది. ఎప్పుడూ కలహించే భార్య, నిర్ధనునికి యిచ్చిన కన్య, వ్యసనాలకు లోనయిన పుత్రుడు- ఇవి హృదయానికి కాల్చిన సూదులవంటివి. సముద్రుడు పురుషోత్తముడని చెప్పగా తనకన్య అయిన లక్ష్మిని యిచ్చి, అతడు వామనుడై బలివద్దకు బిచ్చానికి వెళ్లాడని తెలిసి, బడబానలమనే శోకంతో నిట్టూరుస్తూ, ఇంకా తాపం వదలలేదు. కనుక ధనం వెదుక్కొని, వరుని సంపద కూడా తెలుసుకొని, మంచి కులానికి కన్యను ఇస్తాము. సద్గుణాలు ధనాధీనాలు కదా!" అన్నాడు. కన్యతండ్రి చెప్పిన మాటలు విని చతురకుడు, పిప్పలాయుని తండ్రివద్దకు వెళ్ళాడు. సువర్ణ వర్ణ లావణ్య అయిన కన్య దొరికిందని న్యగ్రోధకల్పుడు విని, ఆనందనిర్భరుడయ్యాడు.

అభిలషిస్తున్నదనే సంగతిని విని పిప్పలాయనుడు ఆమె
కపిలుని కుమార్తె బ్రహ్మచర్యంతో ఉండాలని అతిథి సత్కారం చేసింది.
యింటికి యాచకవేషంతో వెళ్ళాడు. భద్ర అతనికి సముచితంగా పూర్ణ మనోరథుడై ఇలా
పిప్పలాయనుడు ఆమె బ్రహ్మచర్యార్థిని అని స్పష్టంగా తెలుసుకొన్న తర్వాత బ్రాహ్మణ్ణి. నా కోసమే
అన్నాడు; "కల్యాణి! బ్రహ్మచర్యం అవలంబించదలచిన పిప్పలాయనుడనే తండ్రి బలవంతపెడుతున్నాడు.
చతురకుడనే విప్రుడు నిన్ను అభ్యర్థించాడు. నేనేమో వివాహ విముఖుణ్ణి. ఆ మాటలు విని ఆ కన్య
నీవు కూడా నాలాటిదానివే. దైవవశాత్తు, ఇద్దరి సమాగమం జరిగింది." అతడు
సంతోషించి ఇలా అన్నది: "శమ సంయమాలవల్ల మన యిరువురు వివాహమూ అవిరుద్ధమైంది." తండ్రిమాటకు
ఆమెనుంచి ఇట్టి సముచితవాక్కు విని ప్రహర్షోత్సాహ పూరితుడై ఇంటికి తిరిగి వెళ్ళి
ఒప్పుకున్నాడు.

తర్వాత కపిలుడు అనంత ధనం సంపాదించి, తన తనయను శ్రేష్ఠమైన రత్నాలతో అలంకరించి ఆ మహావైభవోపేతమైన పరిణయోత్సవంలో, పిప్పలాయనునికి యిచ్చి వివాహం చేశాడు. మహదైశ్వర్యంగలవారి వారిద్దరి సమాగమం అలుప్తబ్రహ్మచర్యమై నిర్వికారంగా ఉంది. సంయమశీలురై వారున్నందువల్ల రూపయౌవన సంభారం ఉన్నప్పటికీ, తన ఆజ్ఞ సాగనందున మన్మథుని వైభవం వీగిపోయింది. వారిద్దరూ పడుకున్నప్పుడు నిద్రలోనూ ఒకరినొకరు తాకకుండా జాగర్త పడడం కోసం ఒకరితర్వాత ఒకరు నిద్రపోయేవారు.

ఇలా ఉండగా, ఒకనొకమారు ఇద్దరూ పడుకొని ఉండగా, భద్రవైపు మంచం పక్క కొసను కింద నల్లత్రాచు కనిపించింది. నిద్రపోతున్న భద్ర భుజలత ఆ త్రాచు పక్కనే వ్రేలాడడం చూచి, పిప్పలాయనుడు భయపడి, దయతో ఆ బాహువును చామరపు గుడ్డతో మెల్లిగా పట్టుకుని రక్షించాడు. అకస్మాత్తుగా తన భుజం కదలడం వల్ల ఆ హరిణలోచన అదరిపడి, స్తనమండలంపైని ముక్తాహారాలు కదలాడగా లేచి భర్తతో ఇలా అన్నది: "ఆర్యపుత్ర! ఏమిటి? సత్యవాది అయిన నీవు చేసిన ప్రతిజ్ఞ మరచిపోయావా? ఏమిటి? ఈ అకస్మాత్తుగా కలిగిన చిత్తవికరాం, సిగ్గుచేటయిన ఈ మనోవికారం ఎలా నీకు కలిగింది? పర్వతాలైనా ధృతి (ధరించడం), మర్యాదను వదలుతాయిగాని, సజ్జనులు

ధృతి(నిబ్బరం), మర్యాదను వదలరు." ఆ మాటలు విని పిప్పలాయనుడు నవ్వుతూ, "భద్రే! నాకు స్వప్నంలోను మనోవికారం లేదు. నల్లత్రాచు, భయంకరమైనది నీ శయ్య చివర కింద పారాడుతుండగా, భయపడి వ్రేలాడుతున్న నీ భుజంపైకి లాగి రక్షించాను" అని అన్నాడు. ఆ మాటలు విని ఆమె సందేహం వీడి, "ఆర్యపుత్ర! దైవవశాత్తు సత్యశీలుడైన నీ మనస్సు కామమలినం కాలేదు. రాగోరగం కంటే, ఈ కృష్ణోరగం భయంకరమైనది కాదు. ఉరగం ఒకరిని చంపితే కామం నూరుమందిని చంపుతుంది. కనుక ఈ వికారం నుంచి మనలను రక్షించుకోవాలి" అన్నది. పిప్పలాయనుడు ఆమె ఆశయాన్ని మిక్కిలి ప్రశంసించాడు.

కొంతకాలానికి న్యగ్రోధకల్పుడు, అతని భార్య కాలధర్మం చెందారు. దానితో గృహసంభార చింతాభారం పిప్పలాయనునిపై పడింది. ఒకమారు అతడు నువ్వులనూనెకోసం గానుగలో నువ్వులు ఆడించమని భార్యతో చెప్పగా, ఆమె పరిచారికలకు ఆదేశించింది. వారు నువ్వులు ఆడించి నూనెను నూనెవాడల్లో నింపుదామని చూడగా, వాడలనిండా పురుగులు పడి వుండడం చూచి, "అయ్యో! ఇదేమిటి? ఈ పాపమంతా మనకు చుట్టుకుంది. భద్ర మాటతో చేశాము గనుక ఆమెకే చుట్టుకుంటుందిలే" అని ఒకరితో ఒకరు మాట్లడుకుంటున్నారు. లోపలి ఇంట్లో వున్న భద్రకు ఆ మాటలు వినిపించి, వైరాగ్యం కలిగింది. అప్పుడామె భర్త పిప్పలాయనుడు కూడ ఇంట్లోకి వచ్చి, "భద్రే, గృహమాహాభారంతో చాల అలసిపోయాను. మడి దున్ని దున్ని బాధపడిన ఎడ్లను హింసిస్తూ ఆదలించలేను. ఈ సుఖ సంపదలు విరసమైనవి; నిస్సారమైనవి. అనుభవించినకొద్దీ కిక్కసకసవు వలె వ్యథను కలిగిస్తాయి. కష్టాలనే పాచి, పాపమనే బురద గల గృహస్థాశ్రమంలో గృహస్థులు బురదలో ముసలి యెద్దలాగ కూరుకొని పోతారు. కనుక మనం ఈ గృహ జంజాటం వదలి పెట్టడం ఉచితం" అని నచ్చజెప్పి, ఆమె అనుమతితో శాంతి సాధనకు నిశ్చయం చేసుకొన్నాడు.

తర్వాత అతడు అర్థులకు తన ఇల్లు వాకిలి, గొడ్లు గోద, ధనం వనం అంతా దానం చేసి, సర్వఆశాపాశబంధనాలు తెంచుకొని ఇంటినుంచి బయలుదేరాడు. కాశ్యపగోత్రుడు కావడం వల్ల అతనికి మహాకాశ్యపుడనే పేరు వచ్చింది. అతడు ఆ కాలంలో సమ్యక్సంబుద్ధుడైన కాశ్యపుణ్ణి, బహుపుత్రమనే చైత్యంలో దర్శించి, అతనినుంచి ధర్మ వినయం స్వీకరించి, శుద్ధమైన బోధిని పొందాడు. భద్ర కూడ వైరాగ్యమార్గంలో వినయదీక్ష పొంది, ప్రాక్పుణ్య పరిపాకంతో ఉజ్జ్వలమైన కుశలం పొందింది.

సురలకు పూజ్యుడైన మహాకాశ్యపుణ్ణి చూచి, భిక్షువులందరూ "ఆయన ఇంతటి పుణ్యవంతుడు కావడానికి కారణం ఏమిటి?" అని ప్రశ్నించగా సుగతుడిలా తెలిపాడు.

"ఒక జన్మలో ఇతడు కాశిలో గృహపతిగా వున్నాడు. అప్పుడొకమారు పంటలన్నీ పాడయి పిండపాతం(భిక్ష) దొరకని విషమ పరిస్థితి ఏర్పడింది. ఇతడు ధనమంతా క్షీణించినప్పటికీ తగరశిఖి అనే ప్రత్యేకబుద్ధునికి తనవంతు భోజనం పెట్టి ఆదరించాడు. మరుసటి జన్మలో ఇతడు కృకిమహారాజు కుమారుడుగా ఉండి, కృకి నిర్మించిన వరరత్నఖచిత చైత్యంలో మణికనక విచిత్రమైన ఆతపత్రాన్ని పుణ్యశీలుడై మహాకుశలం కోసం నిర్మించాడు. ఈ రెండు జన్మలలోను సంపాదించిన పుణ్యవృద్ధితో ఇప్పుడు మహాకాశ్యపుడయ్యాడు. బంగారు తాళ వృక్షం వలె ఉన్నతి పొంది, కుశల మూలఫలమైన అర్హత్పదం పొందాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మహాకాశ్యపావదానమనే అరవైమూడో పల్లవం

# 64. సుధనకిన్నర్యవదానం

మహాత్ములు అభినవకిసలయ కోమల మనస్కులైనప్పటికీ కులిశకఠిన ధైర్యం కలవారు. మణులవలె నిర్మలులైనప్పటికీ, రాగం అంటనివారు.

ఆనంద సుధారసేందువైన శాస్త తన దర్శనం మాత్రమే చాలునని తండ్రి అయిన శుద్ధోధనుడు
కోరడం వల్ల తన రాజధాని అయిన కపిలవస్తులో ప్రవేశించినప్పుడెల్ల నేత్రకాంతి కర్ణావతంసమనే భ్రాంతి
కలిగించే మృగాక్షి యశోధర హర్మ్యాగ్రతలం నుంచి తను కాంతితో దిక్కులకు ఆశ్చర్యం విరజిమ్ముతున్న
పతి అయిన గౌతముణ్ణి దర్శించి, అతని సంగమాలింగనాలు పొందలేక నిరాశతో, విషం తలకెక్కినట్టు
దిక్కులు తిరుగుతుండగా, ధృతి (ధైర్యం) నెచ్చెలివలె నివారిస్తున్నప్పటికీ హర్మ్యం నుంచి కిందపడి దేహం
వదలేది; ఆ పల్లవ పేశలాంగి దేహం వదలినప్పుడెల్లా దయార్ద్ర చక్షువైన భగవానుడు రక్షించేవాడు.

ఒకమారు భిక్షువులు "మీరు ఈ విధంగా ఆమెను చాలసార్లు రక్షించడానికి కారణమేమిటి?" అని
ప్రశ్నించారు. దంతద్యుతి చంద్రికలతో అధరోష్ఠపు రక్తిమను తొలగిస్తున్నవానివలె సుగతుడు ఇలా తెలిపాడు:

యశోధర ఆర్తురాలై నా విరహంతో నిత్యం ఇలాటి సాహసానికి పూనుకొనడమనేది స్మరవిభ్రమ
ప్రభావం వల్లనే సుమా! ధైర్యం పోగొట్టి, మోహం కలిగించడం స్మరవికార స్వభావం. నేను కూడ
జన్మాంతరంలో మారవిమోహితుడినై విరహంతో సంతాప నిమిత్త భూతమైన తీవ్ర వ్యసనం అనుభవించాను.

అమరపురిని జయించిన హస్తినాపురంలో గుణసంపదలకు నిధానమైన ధనదుడనే రాజు
ఉండేవాడు. అతడు భూమిని భుజంతో ఆలింగనం చేసుకొన్నాడు. సరస్వతిని కంఠంలో వేసుకొన్నాడు.
లక్ష్మిని అలంకరించాడు. ఒక్కకీర్తిని మాత్రమే వెళ్ళగొట్టాడు. అతని భార్య పేరు రామ. ఆమెకు
సుధనుడనే కుమారుడు కలిగాడు. అతనితో పాటే నిధిశతమూ పుట్టడం వల అతనికి సుధనుడనే పేరు
కలిగింది. నిర్మలకాంతి గలవాడు, కళావంతుడు అయిన అతడు పూర్ణచంద్రునివలె ప్రకాశించాడు.

అతని పరిసర రాజ్యంలో మాని, పృథు పరాక్రమ విఖ్యాతుడు అయిన మహేంద్రసేనుడనే రాజు
ఉండేవాడు. అతడు తీవ్ర దండనీతితో ప్రజల సర్వస్వం హరిస్తూ, అకాల కాలునివలె ప్రజలను పీడించాడు.
అతడు అధర్మ ప్రవృత్తుడైనందున పట్టణం సత్కార్యాలు లేక తీవ్రమైన తాపాలకు పుట్టినిల్లయింది.
అందువల్ల వానలు కురియలేదు. రాజు ప్రతికూలుడు కావడం వల్ల దుర్భిక్షవిప్లవం ఏర్పడింది. కష్టాలు
రావడం ప్రకృతి సహజం.

ఈ తీవ్ర కష్టాలకు బాధపడిన పట్టణవాసులు దుష్టభూపతి పాలనం వల్ల కలిగిన దుఃఖంతో
ఒక్కటయి ఇలా ఆలోచించారు: "దోషాకరుడు, జడుడు అయిన చంద్రుడు తన ప్రత్యగ్రకర (కిరణ)
పాతంతో కమలినిని ముకుళింపజేసినట్టు దోషాకరుడు, జడుడు, అయిన ఈ రాజు తన
ప్రత్యగ్రకర(కప్పం)పాతంతో జనతను దుఃఖపెడుతున్నాడు. దుర్వ్యసని అయిన వీడు ప్రతిదినం

అబద్ధాలాడే దుష్టామాత్యుల మాటలు విని, మనను పీడించి, విట చేటక గాయకులను పోషిస్తున్నాడు. ఈ చిక్కులను సహిద్దామా అంటే ఈ రాజు పాపశాపం వల కష్టతరమైన అనావృష్టి ఏర్పడింది. దీనివల్ల దుర్భిక్షం పుట్టి, ప్రజాసంక్షయం కలుగుతున్నది. సుతీక్ష్ణుడైన భూమిపాలుడు, తీవ్రమైన కటువాక్కులున్న మూర్ఖపరిజనము, కుటిల కౌటిల్య పటువులైన అమాత్యులు, విషమమైన ముఖరోగం ప్రకోపించినట్టుగా వున్న పదవులలోని కాయస్థులు - ఈలాటి భయంకర గణాన్ని ఎలా సహించడం? శ్రీమంతుడైన ధనుడనే క్షితిపతి రాష్ట్రవర్ధనుడని వింటున్నాము. అతని నగరానికి వెళ్ళుదాము. అతడు వాత్సల్యంతో పాలిస్తాడు. రాష్ట్రాన్ని తన సంతానం వలె చూచే రాజు రాజ్యంలోనే ప్రజలు తండ్రియింట ఉన్నట్టు హాయిగా బ్రదుకుతారు." ఈ విధంగా ప్రజలు ఆలోచించి నిశ్చయించుకొని, హస్తినాపురానికి బయలుదేరారు. అపాయంతో కూడిన కాయాన్నే వదలివేయాలన్నప్పుడు సాపాయమైన దేశాన్ని వదలాలనడం చెప్పాలా?

తన పురం నిర్జనమైపోవడం చూచి మహేంద్రసేనుడు తీవ్రమైన అనుతాపంతో తన మహామాత్యులందరినీ పిలిపించి కోపంతో ఇలా అన్నాడు: "ధనవంతుడైన ధనుని పట్టణానికి మన పౌరులు వలస పోయారని మన గూఢచారుల ద్వారా తెలిసింది. దుర్భిక్షం మన నగరంలో ఏర్పడినందువల్లే వారు వెళ్లిపోయారందామా, దేవవిప్లవాలు అన్నిచోట్ల అడపాదడపా కలుగుతూనే వుంటాయి. రాజు చెడ్డవాడనే కారణంతో, సుఖవాంఛతోనే వెళ్లారా అంటే, వెట్టిచాకిరి, శిక్ష, పన్ను ఎవరి ఏ రాజ్యంలో ప్రజలకు లేదు? పరిచితమైన దానిపై ద్వేషం, ఎప్పుడూ కొత్తకొత్తవి కోరడం జనం స్వభావం. దూరంగా వుండేది అందరికీ ప్రియంగా వుంటుంది. నాలో లేనిది, ప్రజలను భార్యలవలె ముగ్ధులను చేసేది గొప్ప గుణం ఆ రాజులో ఏముంది? కనుక అతని దర్పం అణచడానికి ఉపాయం ఆలోచించండి. అతని సమృద్ధి కారణాలకు విఘాతాలు కలిగించండి."

రాజు మాటలు విని మహామాత్యులు ఇలా అన్నారు: "మహారాజా, ధనమహారాజు ధనబలంతోను, జనబలంతోను ఉండడానికి కారణం చిత్రుడనే నాగరాజు. ఆ నాగరాజు మూర్తీభవించిన ఆ ధనమహారాజు పుణ్యం వంటివాడు. ఆతని రాజ్యంలో ఆ నాగరాజు ప్రభావం వల్ల అకాలంలోనే పైర్లు పండుతున్నాయి. రాజుల సర్వసంపదలు కృషిసంపత్తి మూలాలు. కనుక ఏ విద్యాబలంతోనైనా, ఆ నాగరాజును సంహరించే పక్షంలో అతని ప్రజలు కూడా నిన్నే ఆశ్రయిస్తారు. అందువల్ల మంచి మంత్ర బలం గల ఏ సాధకుణ్నయినా వెదికి నాగరాజును చంపివేయడానికి ప్రయత్నించండి." అమాత్యుల మాటలు విని అలాగేనని అన్నాడు. దుష్టులు, గుణాలను అలవర్చుకోలేక పరుల దోషాలను వెదకడానికి బయలుదేరుతారు.

పిదప మంత్రులు నాగరాజును బంధించడానికి సమర్థులైనవారికి విశేషంగా ధన కనక రత్నాలు ఇస్తామని దండోరా వేయించారు. ఆ దండోరా విని ఒక మాంత్రికుడు వచ్చి, నాగరాజును బంధించడానికి బయలుదేరాడు. నాగరాజు నివాసం ఒక అడవి చివర పచ్చని చెట్ల నీడన నీలాకాశప్రకాశంతో మిలమిలలాడే సరోవరంలో వుంది. ఆ సరోవరం వలద్వకుమాలికాధారిణి, విలసత్తిలకధారిణి అయిన వనలక్ష్మి మండన మణిదర్పణం వలె వున్నది. మాంత్రికుడు ఆ నిర్మల జలం చూచి, ఆశామలిన మానసుడై మంత్రానుధ్యానసంపన్నుడై మంత్రసిద్ధి కోసం దిగ్బంధం చేశాడు. ఉగ్రతేజుడైన ఆ మాంత్రికుడు దిగ్బంధం చేయగా, ఆ ప్రభావానికి నాగపతికి తలనొప్పి కలిగింది. పడగపైని మణులు ధగధగ మండసాగినాయి.



వెంటనే అదృశ్యుడుగా సరోవరం నుంచి పైకి లేచి, మంత్రసాధకుడు గట్టు పైన వుండడం చూచి, వణికిపోతూ బంధన భయంతో ఇలా ఆలోచించాడు: "ఎర్రటి కనుబొమలతో, ఎర్రటి గడ్డం మీసాలతో, మెరుపులలాంటి చూపులతో అకాలకాలునివలె వీడు నా కులాన్నే రూపుమాపడానికి వచ్చాడు. ఈ దురాత్ముడు ఇప్పుడు వనాన్ని దిగ్బంధం చేశాడు. నన్ను కూడా దిగ్బంధం చేసేలోపుగా ఏదైనా ఉపాయం ఆలోచించాలి. ఈ సరోవరతీరంలో వల్కలాయనుడనే మహర్షి నివసిస్తున్నాడు. అతడు కూడా నన్ను కాపాడలేడు. అతని ఆశ్రమంలో సదా పరిచర్యాపరుడైన పద్మకుడనే లుబ్ధకుడు(బోయ) నన్ను రక్షించగలడు." ఈ విధంగా ఆలోచించి నాగరాజు లుబ్ధకుని వద్దకు వెళ్లి తన వృత్తాంతం తెలిపి బంధనం నుంచి కాపాడాలని కోరాడు; సాధకుని చంపివేయాలని అభ్యర్థించాడు.

నాగరాజు ప్రార్థనను మన్నించి పద్మక లుబ్ధకుడు ధనుర్ధారియై సరోవరతీరానికి వచ్చి, మంత్రం జపిస్తూ ధీరుడై తంతు జరుపుతున్న సాధకుణ్ని చూచాడు. ఆ సమయంలో సాధకుడు ప్రకోపించి, హోమం చేసి, నాగరాజును బంధించడం కోసం మంత్రంతో ఆకర్షణ క్రియ జరిపాడు. ఫణిపతి మంత్రాకృష్టుడై పైకి వస్తుండగా సరోవరంలో బుడగలు పుట్టాయి. అది చూడగా, బుడగల శబ్దంతో సరోవరం దుఃఖంతో ఏడుస్తున్నట్టు అనిపించింది. భుజంగవధువులు భయంతో విహ్వలలై విషాదంతో నిశ్వసించగా, ఆ వేగానికి నీటిపైన నురగ తెట్లు కట్టింది. నీరు కదలిపోయి గట్లకు అలలు తీవ్రంగా తాకాయి. ఇది చూడగా, సరోవరజలం తరంగ హస్తాలతో కంపిస్తూ, దోసిలి పట్టి నాగరాజును రక్షించమని కోరినట్టు వుంది. గరుడ తేజస్కుడైన ఆ మాంత్రికుడు బంధనవిద్యాబలంతో నాగరాజును ఆకర్షించి చిన్న మూతిగల ఒక జలభాజనంలో వేసాడు. ఇంతలో వ్యాధుడక్కడికి వచ్చాడు. వ్యాధుణ్ని చూడగానే, మాంత్రికుడు భయంతో, సందేహంతో చూడసాగినాడు. వ్యాధుడు ఆ ఆశపోతును విషదిగ్ధమైన బాణంతో కొట్టాడు. ఆ దెబ్బకు మాంత్రికుడు నాగరాజును వదలిపెట్టాడు. పిదప వ్యాధుడు బాణం దెబ్బ తగిలిన అతని సమీపానికి వచ్చి, కరాళకరవాలంతో ముక్కలు ముక్కలుగా నరికి దిక్కులకు వేసాడు. ఇతరులకు ఉపయోగపడే ఆ బంధకీ విద్య సిద్ధించినప్పటికీ ఆ బుద్ధిహీనునికి వినాశానికే అయింది. ఇతరులను బాధించడం కోసం మూఢులు ప్రయోగించిన విద్యా విభవ శక్తులు వెంటనే వారి ప్రాణాలతోపాటే నశిస్తాయి.

ఫణిరాజు చాల సంతోషించి, కృతజ్ఞతతో స్నేహలుబ్ధుడై ఆ లుబ్ధకుణ్ని తన నివాసానికి పిలుచుకొని వెళ్ళాడు. అక్కడ లుబ్ధకుడు రత్నతలోద్యానాలలోను, విమానాలలోను, మణిభవనాలలోను నాగరాజుతో సత్కారాలు పొందుతూ, కొంతకాలం ఉన్నాడు. ఇలా ఉండగా, ఒకవారు ఆ లుబ్ధకుడు మెరుపుతీగలాంటి అమోఘమనే ఒక పాశం చూచి, దాని ప్రభావం నాగులు చెప్పగా విని ఆశ్చర్యపడి, దానిని ఎంతో ఆశతో యాచించాడు. యుద్ధాలలో సురలను కూడా బంధించదగినది, అజయ్యమయినది, తన జీవితానికన్నా అధికమైనదీ అయిన ఆ పాశాన్ని ఫణీశ్వరుడు అతనికి ప్రీతితో ఇచ్చాడు. దానిని తీసుకొని, లుబ్ధకుడు నాగరాజు వద్ద సెలవు పుచ్చుకొని, అపార సంపదతో నాగభవనం నుంచి పైకి వచ్చి స్వస్థానం చేరుకున్నాడు. నాగప్రదత్తమైన సంపదను చిరకాలం అనుభవించి, ఉత్పలకుడనే తన పుత్రునికి అమోఘపాశం అప్పగించి మరణించాడు. ఆ లుబ్ధక కుమారుడు తండ్రి పద్ధతినే నడుచుకుంటూ కులక్రమంగా వచ్చిన ముని పరిచర్య చేస్తూ ఉండేవాడు.

ఒకానొకమారు ఆ లుబ్ధక కుమారుడు విశ్రాంతి తీసుకుంటున్న ముని ఎదుట వినయంతో నిలబడివుండగా, కర్ణరసాయనమైన కాకలీగీతం విన్నాడు. ఆ గీతం విని వనంలోని జింకలన్నీ కదలక మెదలక నిలిచిపోయి, చిత్రంలో గీచినట్టు కనిపించాయి. అప్పుడు ఉత్పలకుడు ఆశ్చర్యంతో మునిని చూచి వినయంగా "మహర్షీ! కమలాలలో బంధింపబడిన మధుపాల ధ్వనితో సమానంగానూ, కోకిలాలాపలలితంగాను వినిపించే ఈ స్వరం ఎక్కడిదీ?" అని ప్రశ్నించాడు. దానికి ముని "ఈ మధురాలాపం కిన్నర కన్యకల గీతాలది. ద్రుముడనే కిన్నరపతి కన్య మనోహర ఐదువందలమంది చెలికత్తెలతో పాటు నాగభవనంలో విహరిస్తున్నది" అని అన్నాడు. అది విని ఉత్పలకుడు మరల కుతుకంతో "మానవుడు కిన్నరకన్యకను పొందడం సాధ్యమా?" అని మునిని ప్రశ్నించాడు. "అమోఘమనే పాశం చేతిలో వున్నవాడు కిన్నరకామినిని లాక్కొని రాగలడు" అని ముని సమాధానమిచ్చాడు. ఈ మాటలు విని ఉత్పలకుడు ఉత్సాహంతో మునికి నమస్కరించి, అమోఘపాశం తీసుకొని నాగరాజు భవన సమీపం చేరాడు.

అక్కడ కేళీవిలాసంతో గాలికి కదిలే బంగారు తీగవలె కనిపించే కిన్నరీగణం చూచాడు. ఆ కిన్నరీగణం మధ్యన స్నానం చేసి లేచిన కిన్నరపతి కన్యను మనోహరను చూచాడు. ఆమె త్రినేత్రుని మూడవ కంటి మంటను చల్లార్చడానికి మన్మథుడు పంపిన జలదేవతలాగ ఉంది. అనంగవిభ్రమారంభ తరంగితమైన యౌవనంలో మునిగిపోతున్న శైశవానికి అవలంబనం ఇస్తున్నదా అన్నట్టు ఇంకా శైశవం వీడని యౌవన ప్రాదుర్భావంలో ఉంది. ఆమె మేఖల బిగించిన తెల్లటి దివ్యాంబరాలు జలకేలిలో పడిన నురగల తరగలలాగ ముచ్చట గొలుపుతున్నాయి. మెడలోని లావణ్యప్రవాహంవంటి పెద్ద తారహారంతో (ముత్యాలదండతో, నక్షత్ర మాలికతో) శశిధవళమైన నిశాకాంతిని హరిస్తున్నట్టు అందంగా వుంది. కర్ణాభరణకాంతి, కర్ణోత్పలాల కాంతి కపోలాలపై పడి ఇంకా తడి ఆరని మకరికాపత్రాలు రచించినట్టు చక్కదనమిచ్చినది. చెలికత్తె లలాటంపై తీర్చిన కస్తూరీతిలకంతో శశాంకునికి కలంకకలనా లోపాన్ని పోగొట్టుతున్నట్టు అనిపించింది. ఆమెను చూచి విస్మయావేశపాశాలు మనస్సును ఈడ్వగా, లుబ్ధకుడు వెంటనే అమోఘపాశాన్ని విసరడానికి సన్నద్ధుడయాడు. పాశహస్తుడైన అతన్ని చూచి భయకాతరలై కిన్నర స్త్రీలు ఆకాశానికి ఎగిరారు. లుబ్ధకుడు చేతికి అందుబాటులోనే వుండడం వల్ల భయంతో దిక్కులు చూస్తున్న మనోహరపై అమోఘపాశాన్ని విసిరి, జింకను పట్టినట్టు పట్టాడు. మనోహర, పాశపు ఉచ్చులో పడి వివశురాలై లుబ్ధకుడు లాగుతుండగా ఏమిటిది అని తెలీకుండా క్షణకాలం మూర్ఛపోయింది. గుంపునుంచి తప్పిపోయిన ఆడఏనుగులాగ ఆమె స్వపరిజనాన్ని చూచే ఆశతో దిక్కులు చూస్తూ, లుబ్ధకుణ్ణి చూచి సంభ్రమంతో ఇలా అన్నది:

"దృఢంగా నన్ను బంధించావు. బంధనం నుంచి వదలిపెట్టు; నన్ను చంపకు, రక్షించు. శోకసమయాల్లో క్రూరులు కూడ దయగలవారవుతారు. లోభం వల్ల తగని స్థానానికి దివ్యకన్యను అప్పగిస్తే, ప్రదీపించిన మంత్రవిద్య సాధకుణ్ణి కాల్చివేసినట్టు వెంటనే నాశం చేస్తుంది. కనుక, ఓ ధీమంతుడా, నన్ను అర్హునికి అప్పగించావంటే, నీకు తప్పక గొప్ప ధర్మం, ధనం కలుగుతాయి. ఈ పాశం బిగుసుకొని బాధ కలిగిస్తున్నది. కనుక బంధనం తొలగించు. నీకు ఇష్టం వచ్చిన చోటికి నేనే వస్తాను. కట్లు వదలగానే ఆకాశానికి ఎగిరిపోను. ఈ చూడారత్నంవల్లనే నేను ఆకాశంలో ఎగురగలుగుతాను. ఈ చూడారత్నం తీసుకో."



కన్నీళ్లు కారుస్తూ ఆమె ఈ విధంగా ప్రార్థించగా, లుబ్ధకుడు మనసు కరిగి ఆమె చూడామణిని తీసుకొని, పాశం వదలి ఇలా అన్నాడు: "ఓ కల్యాణి, ఊరటపడు, దుఃఖపడవద్దు. నేను స్వేచ్ఛగా నిన్ను అనర్హునికెవరికీ ఇవ్వను. గుణరత్నమహోదధి, కీర్త్యమృత తరంగాలతో దిక్కులు నింపేవాడు, విద్యాబంధనాదర్శమూ, కలాకేళిభూషణమూ, నిజవంశ విశేషమూ అయిన సుధనుడనే సువృత్తుడు (సచ్చరిత్రుడు) ఉన్నాడు. ఈ భూమికే విలాసాలంకారమై, లక్ష్మి సుఖోత్సవం వలె త్యాగోపభోగ సుభగుడైన అతడు నీకు తగినవాడు. ఆ ఉర్వరాశర్వరీపతి సుర కిన్నర గంధర్వ విద్యాధర సుందరుల గర్వాన్ని అణచేవాడు" అని లుబ్ధకుడు బంధువర్గం ఎడబాటుతో కురంగివలె దీనంగా విలపిస్తున్న మనోహరను సమాశ్వాసపరిచాడు.

ఇది ఇలా ఉండగా, మృగయాకేళికౌతుకంతో సుధనుడు ధనుర్ధారియై వింధ్యారణ్యాలకు వెళ్ళుతూ, ఆ ప్రాంతానికి వచ్చాడు. అతని రథనేమి ధ్వనులతో మేఘధ్వని అని భ్రాంతిపడి నాట్యం చేస్తున్న నెమళ్ల గుంపులు, క్షణకాలం కదలుతున్న వనలక్ష్మి నల్లపట్టు పుట్టం వలె శోభించాయి. అతని చెంపలపై కట్టిన చెమటబొట్లు, కర్ణకుండలాల సుందర ముక్తాఫలాల వలె కనిపించాయి. అతడు తన దంతకాంతితో రథాశ్వాల గిట్టలతో రేగిన ధూళిని తోసివేస్తున్నట్టు సారథితో ఇలా అన్నాడు: "వాయువేగంతో మనోరథంలాగా పరుగిడుతున్న ఈ రథం చాలదూరం ముందుకు వచ్చింది. మన సైన్యం వెనకబడిపోయింది. మందమారుతానికి అసియాడే చిగురుటాకులుగల రావిచెట్లతో, ఈ భూములు పచ్చని పచ్చికతో మనస్సును హరిస్తున్నవి. ఈ భూములకు జింకలు ఆభరణాలుగా వున్నాయి. బలప్రవాలోష్ఠాలతో, స్తబక స్తనాలతో వున్న ఈ లతలు గాలికి కదలి ఉత్కంఠతో ఆవులిస్తున్నట్టుంది. మరకతశ్యామమైన పచ్చికఅంగీ తొడిగిన వనరాజులు పుప్పొడి పూసుకొని వింత అందాలు కురుస్తున్నాయి. భయంతో పరుగెత్తుతూ, మెడతిప్పి చూస్తున్న ఈ జింకలు తరళ నేత్రాలతో నీలోత్పలవనాలు సృష్టిస్తున్నట్టున్నాయి. ఏనుగు గున్నలు చంద్రకిరణాంకురాలవంటి సన్నని దంతాలతో గిరిగ్రామాధిపతుల పత్నుల కుచసదృశాలైన కుంభస్థలాలతో ముచ్చట గొలుపుతూ, రథనేమిధ్వని వింటూ రథం చూస్తున్నాయి. ఈ వింధ్యానీలాలు చూచావా? నర్మదానదీ పరిసరాలలో ఏపుగా పెరిగి విరియబూచిన లతాసమూహం తేనె తాగి మత్తెక్కినవా అన్నట్టు రొద చేస్తూ, శబర కాంతులు నితంబబింబాలపై చెక్కుకున్న నెమలి పురులు కదలిస్తూ నర్మక్రీడలకు పూనుకుంటున్నాయి." ఇలా అంటూ సుధనుడు వన శోభను తిలకిస్తూ, నిర్జన ప్రదేశం కావడం వల్ల చాలదూరం వ్యాపించిన కిన్నరి కరుణస్వరం విన్నాడు. విన్నవెంటనే కృపాపూరితుడై కుతూహలంతో ఆ స్వరం విన్నవైపు వెళ్లి కిన్నరిని చూచాడు. ఆమె కన్నీళ్లతో తనని రక్షించవలసిందని లుబ్ధకుణ్ణి బతిమాలుతూంది. వనచరుల భయంతో ఉద్విగ్నురాలైన వనదేవతవలె, లుబ్ధకుడు ఎత్తుకుపోయిన తన ఒడిలోని జింకను వెదుక్కుంటూ వచ్చి, వనమంతా తిరిగి అలసిపోయిన హరిణలాంఛనుని కాంతి లక్ష్మివలె వున్న ఆమెను చూచి, ఆమె ఆశ్చర్యకరమైన రూపాతిశయంతో నివ్వెరపడి వెంటనే అభిలాషమనే గుడ్డపై గీచిన చిత్రంవత్తుగా వుండిపోయాడు. కొంతసేపటికి తేరుకుని "ఆహా! రమ్యవస్తువులను నిర్మించడంలో అభ్యాసం పొందుతున్న బ్రహ్మరేఖాపరిణతి ఈమె ముఖ నిర్మాణంలో కనిపిస్తున్నది. పాతాళలోకంలోను ఇలాటి సౌందర్యం దుర్లభమంటే, మర్త్యలోకంలో సంగతి చెప్పవలసిందేమిటి? ఈ లావణ్యముద్ర స్వర్గంలోను కొత్తగా ఉదయించిందనుకుంటాను. ఈ తన్వంగికి

తారుణ్యం ఉదయించి, శైశవాన్ని పూర్తిగా మాపివేసింది కనుక, మన్మథ శృంగారం ఒలికించే నూతనభంగి ఈమె సకలాంగాలలోను నెచ్చెలి వలె విలసిల్లుతున్నది. మన్మథదేవుడు సంభ్రమ పరాక్రమాలుగాని, పెద్ద ఎత్తులు, ముట్టడులుగాని అవసరం లేకనే ఈమె మాటున జగత్సామ్రాజ్యం జయిస్తున్నాడు" అని తలపోస్తూ, లోలోపల విస్మయం, అభిలాషగల చూపుతో ఆమెను తాగివేసేట్లు చూడసాగాడు.

అలా వున్న రాజును లుబ్ధకుడు సమీపించి, "దేవ, కిన్నర కులానికి కల్పద్రుమం వంటి ద్రుముడనే కిన్నరరాజు పుత్రిక ఈమె. నే నీమెను అమోఘమనే పాశంతో కట్టి తెచ్చాను. ఈ దివ్యకన్యను నీ కోసమే తెచ్చాను. స్వీకరించు. గుణోదారుడవైన నీవే భూమికిలాగే ఈమెకు కూడా భర్త కాదగినవాడివి. ఈమె స్వేచ్ఛగా ఆకాశంలోకి ఎగిరిపోడానికి శక్తినిచ్చే చూడామణి ఇదిగో. నేను దీనిని తీసుకొన్నాను. ఇది లేకుండా ఈమె ఆకాశమార్గన వెళ్ళజాలదు. ఈ మణిని భద్రంగా కాపాడుకో. దీనిని ఈమెకు తిరిగి ఇచ్చావంటే ఈమె నీకు దక్కదు" అని చెప్పి ఆ కిన్నర కన్యారత్నాన్ని, రత్నాన్ని సుధనునికి అప్పగించాడు. సుధనమహీచంద్రుని అండను చేరిన ఆ కిన్నరి సుధాసిక్తాంగివలె స్వదేశవిరహానలం వదలిపెట్టింది. లుబ్ధకుడు వదలిన బాలహరిణివలె బెదరు చూపులతో వున్న ఆ కిన్నరిని మన్మథుడు అనురాగపు వలలో బిగించాడు. రాజు కిన్నరిని రథంపై ఎక్కించుకుని లుబ్ధకుణ్ని రత్నాలతో నింపి, సంతోషంగా హస్తినాపురికి బయలుదేరాడు.

అతడు హస్తినాపురి చేరి తన వృత్తాంతమంతా తండ్రి అయిన ధనునికి నివేదించాడు. అతడు సంతోషం పొంగులువారగా వారిరువురికి వివాహోత్సవం జరిపించాడు. రూపుగొన్న చంద్రకాంతివలె వెలుగుతూ, తన సుకృతంతో భోగ్య అయిన ఆ కిన్నరకన్యను సుధనుడు అంతఃపురానికి పిలచుకువెళ్లాడు. అతడు అధర మధువును కోరి మధుపంలాగ ఆమెను తాకగా, ఆమె నతముఖాంభోజ అయిన కమలిని లాగ కంపించింది. ఆమె మౌనంతోనే తన ఉత్కంఠను తెలుపుతూ, కంపిస్తున్నా నిశ్చల అవుతూ, సిగ్గు చూపుతున్నా కాంతిని వెల్లివిరియజేస్తూ, అతనికి ప్రీతి కలిగించింది. అతడు నెమ్మదిగా ఆమె పెదవిని చుంబిస్తూ, పంటితో నొక్కి, కనులు మూసుకున్న ఆమె మౌనముద్రను పోగొట్టాడు. పోకముడిని విప్పడంలోను, దానిని వారించడంలోను దంపతుల పాణిపద్మాలకు కలిగిన వివాదమా అన్నట్లు ఆ పాణిపద్మాల కంకణాలు గల్లుగల్లుమన్నాయి. వారిరువురి సంభోగపాదపం రాగంతో పల్లవించి, విలాసస్మితంతో పుష్పించి, కాంతాకుచఫలాలతో పండి భోగ్యమైంది.

ఇలా వుండగా కపిలుడు, పుష్కరుడు అనే ఇద్దరు దాక్షిణాత్య బ్రాహ్మణులు వృత్తికోసం ధనమహారాజు సభకు వచ్చారు. విద్యాతిశయ శ్లాఘ్యులైన వారిద్దరూ, రాజపౌరోహిత్యం సంపాదించారు. కపిలుడు ధనమహారాజు పురోహితుడయ్యాడు. పుష్కరుడు రాజపుత్రుడైన సుధనుని వద్ద పురోహితుడయ్యాడు. వారిద్దరూ పరస్పరం అసూయతో వాదప్రతివాదాలు చేసుకొనేవారు. ఇద్దరి లక్ష్యమూ రాజానుగ్రహం సంపాదనే కావడం వల్ల క్రమంగా ద్వేషం పుట్టింది. ఏనుగులాగ వారిద్దరూ ఘీంకరించుకొంటూంటే విద్య వారి ముఖంలో మదలేఖవలె మాలిన్యం పొందింది. గుణసఖి, లోకప్రకాశోన్ముఖి అయిన విద్య అనే దీపశిఖ వస్తువివేకంగల వారికి ముందుగా విషమమైన ద్వేషాంధకారం కలిగించే పక్షంలో, అలాటివారు మోహ హతబుద్ధులై యుక్తాయుక్త విచార రహితులై సౌజన్యదూరులై చందనం, చంద్రకాంతం, కమల మధువులనుంచి పుట్టిన నిప్పుతో కాలిపోయినట్టేనన్నమాట.



ఈ విధంగా అడుగడుగున పుష్కరుడు శ్రుతి స్మృతి వివాదాలలో తన్ను ఎదుర్కొని తొక్కిపట్టడం వల్ల కపిలుడు కోపతాపం పట్టలేక ఇలా అనుకున్నాడు: "నేను మందపరిశ్రముణ్ని. పుష్కరుడు దృఢాభ్యాసం కలవాడు, చురుకైనవాడు, తీవ్రమదోద్ధతుడూను. కనుక నన్ను సభలలో ఎప్పుడూ సిగ్గుపడేటట్లు చేస్తున్నాడు. నీచమనస్కులకు ప్రతిజ్ఞ వంచనకు, పాండిత్యం అహంకారానికి, ధనం ధర్మనిషేధానికి ఉపయోగపడుతాయి. పొగరు పట్టిన వీడు రాజపుత్రుని ఆశ్రయం చూచుకొని, నన్ను అవమానపరుస్తున్నాడు. కనుక ధనమూలమైన అతని ఆశ్రయాన్నే కొడతాను. రాజుపుత్రుని సంహరణకు ఏదైనా యుక్తి, ప్రయత్నం జరపాలి. మానహానిని ఎలా సంహించగలను?" కపిలునికి ఇలా పుశ్కరునిపై కోపంతో, ద్వేషంతో భయంకరమైన పాప సంకల్పం కలిగింది. మత్సరగ్రస్తులు చేయని పాపమంటూ ప్రపంచంలో లేదు. మదించి, మనస్సు చెదరి, కళ్లలో తీవ్రమైన ద్వేషవిషాంజనం అలదుకొన్నవాడు సద్ధర్మం ఎలా చూస్తాడు? రాగమనేది పాపం. అంతకన్నా పాపం దర్పం. అంతకంటే గొప్పపాపం క్రోధం. లోభం వంటి పాపం మరొకటి లేదు. వ్యసనిలో కనిపించే ఈ పాపవర్గమంతా చేరినా విద్వేషం వల్ల కలిగే పాపాంశం సామ్యాన్ని కూడా తాకదు.

ఒకప్పుడు మేఘుడనే క్రూరుడైన సామంతుడు ధనమహారాజుకు ఎదురుతిరిగి, అతడు పంపిన సైన్యాన్నంతా చంపుతూ, అపకారం చేయదొడగినాడు. అతని రాజధాని ఒక వ్యాపార నగరం. రాజు ఈ సంగతి విని కోపంతో వానికి దండోపాయం విధించాలనే నిశ్చయంతో అమాత్యుల అనుమతి పొంది, శత్రువును బలంతో అణచివేయడానికి వెంటనే కుమారుడైన సుధనునితో ఇలా అన్నాడు: "కుమార! ఈ సామ్రాజ్యం శత్రురహితం అగుగాక! యుద్ధముఖంలో బయలుదేరు. నీకు క్రమాగతమైన రాజసమూహాలను ప్రభావాభరణమైన నీ భుజం జగద్విజయ గజానికి కట్టుకంబం అగుగాక! నీ ప్రతాపానికి దిక్కులు నిర్విఘ్నమైన ఆక్రమించుకొనడంలో మహాసంభరం చూపుతున్న మేఘుడు మదిస్తే ఏమి ప్రయోజనం? ఎవణ్ణి అవరణాలు కాగలవు. ఎక్కడో వున్న దుర్బలులైన సామంతులను చంపినా వధించబడాలి. సింహం తనకు వధించడం వల్ల సర్వసిద్ధాలూ పొందుతాయో అలాటి గర్విష్ఠుడే ఏముంది? మిరుమిట్లు గొలిపే దైవవిహితమైన భోజ్యపదార్థమైన ఏనుగుల గుంపును చంపడంలో పరాక్రమం పౌరుషమనిపించుకొంటుంది." గోర్లున్న మరొక పంచాననాన్ని చంపితే కదా దాని శౌర్యం రణోత్సవాభిలాషుడై నప్పటికీ కిన్నర

తండ్రి ఈ విధంగా అజ్ఞాపించగా, సుధనుడు నిర్ణయించుకోలేక ఉండిపోయాడు. పిదప గత్యంతరం లేక. తన తల్లి విరహోద్విగ్నుడై క్షణం సేపు ఎటూ కూతురు నీకోడలు, చాల అభిమానవతి, నేను వద్దకు వెళ్ళి "మాతా! ఇంద్రతుల్యుడైన కిన్నరేంద్రుని చూపే వాత్సల్యబుద్ధితో ఈమెను యుద్ధానికి వెళ్లినప్పుడు విరహశోకార్త అయి వుంటుంది. కనుక నామీద ఈమెకు అంబరగమనం కలుగుతుంది. ఇది మరొకరికి రక్షించాలి. ఇది ఈమె చూడామణి. దీనివల్ల కాంతమైన కాంతాశిఖామణిని పెట్టి, ఇవ్వవద్దు. ఇస్తే ప్రాణసంశయమే కలుగుతుంది" అని ఆమె చేతిలో అతని అశ్వదళాలు ఎగురగొట్టిన సైన్యాలు దిగంతాలను కప్పగా, యుద్ధానికి బయలుదేరాడు. కారణమయింది.
ధూళిపుంజమనే మేఘావళి రాజహంసల సంత్రాసాయాసాలకు విరహబాధతో ఉడికిపోతూ పద్మపత్రశయనం

భర్త దూరంగా వెళ్లిపోగానే కిన్నర మనోహర భూమిపై గీతలు పెడుతున్నప్పుడు ఆశ్రయించింది. ఆమె దినాలు లెక్కపెట్టడానికి ఉత్కంఠంతో

చిక్కిశల్యమైన ఆమె చేతినుంచి కంకణాలు పడిపోయాయి. అప్పుడు రోదిస్తున్న ఆమె కంటినుంచి చేతిమీద పడుతున్న బాష్పధారే ఆమెకు ముత్యాలగాజులయింది. ఆమెకు పుష్పశరునిపై ద్వేషం, సుఖంలో విముఖత కలిగాయి. దేహం రూక్షమైపోయింది. సదా పతిధ్యానపరాయణత్వం అతని మంత్రజపం అయాయి. ఆమె అన్నీ రోసి భూమిపై పడుకున్నప్పటికీ, ఆ తాపం చల్లారలేదు. నిజానికి నిశ్చల లీన రాగమనస్కులకు తీవ్రమైన వ్రతాలతో ముక్తి కలుగదు. హరిచందనం అలదుకొని స్ఫటిక పర్యంకంపై ఆమె పడుకొంది. అప్పుడు జ్యోత్స్నామధ్యగత అయిన చంద్రలేఖవలె కనిపించింది.

ఇలా వుండగా, ఒకనాడు ధనభూపాలునికి దుస్స్వప్నం వచ్చింది. అతడు భయంతో తన పురోహితుడైన కపిలుణ్ని పిలిచి, "మహామతీ, నేను శత్రువులకు పట్టుబడినట్టు, కడుపు చీల్చి పేగులు లాగి వాటితో నన్ను కట్టివేసినట్టు స్వప్నం వచ్చింది. దీని పరిణామ ఫలమేమిటి? శుభోదర్కమైన సముచిత ప్రతిక్రియను కూడా ఆలోచించి చెప్పు" అని అడిగాడు. రాజు ఈ విధంగా అడుగగా, పురోహితుడు క్షణమాత్రం భక్తిదంభం ప్రకటిస్తూ, కళ్లు మూసుకొని, తన ఇష్టార్థం ఇలా ఆలోచించాడు: "చాలా కాలంగా ఆలోచిస్తున్న ఉపాయం దైవాత్తు నేడు ప్రాప్తమైంది. పుష్కరుని ఆశ్రయం ధ్వంసం చేయడానికి, రాజపుత్ర వినాశానికి ఇదే సమయం. రాజపుత్రునికి ప్రియురాలు మనోహర పెద్దప్రాణం. ఆమె లేకపోతే అతడు దుఃఖితుడై బ్రతకడనడం నిజం" అని లోపల తన సంగతి ఆలోచించి, పైకి బూటకపు ఖేదవిషాదాలు ప్రకటిస్తూ, వసుధాధీశునితో ఇలా అన్నాడు: "దేవ! హృదయాన్ని కంపింపజేసే దుస్స్వప్నమే చూచారు. దుస్సహమైన దాని ఫలాన్ని స్పష్టంగా ఎలా చెప్పగలను? ప్రభుభక్తివ్రతులు, దోషాలలో మనసు లేనివారు అయిన హితైషులు కర్ణకటువైన సంగతులు చెప్పడంలోను నిషేధం లేదు. రాజ్యభ్రంశంగాని, శరీరనాశంగాని దీని దుష్ఫలం. కనుక నిశ్శంకంగా శ్రేయస్సు కోసం ప్రతీకారం చేయాలి. యజ్ఞక్షేత్రంలో పశురక్తంతో నిండిన పుష్కరిణిలో స్నానం చేసి, విప్రులుతో మంత్రపూతుడవై, వారికి రత్న సువర్ణదానం చేసి, కిన్నరి మేదస్సుతో (కొవ్వుతో) హోమం చేస్తే కుశలం పొందుతావు. కిన్నరి నీకు దుర్లభురాలు కాదు. నీ అంతఃపురంలో నీ కోడలు వుండనే వుంది."

పురోహితుని మాటలు విని, రాజు క్రూరపాతకానికి భయపడి, నృశంస చరిత్రుడైన అతనితో బెదురుతూ ఇలా అన్నాడు: "నా జీవిత రక్షణకోసం స్త్రీ వధ ఎలా చేయగలను? కిన్నరీ విరహంతో నా పుత్రుడు మరణించడం తప్పదు."

భూమిపతి తన మాటను తోసివేయగా, పురోహితుడు పాపాభినివేశంతో మరల ఇలా అన్నాడు: "మహారాజా, నీవు ధీమంతుడవైనా ప్రపంచస్థితిని తెలుసుకోలేకున్నావు. త్రివర్గ సాధనమైన రాజ్యం కాని, జీవితం కాని వదలుకోకూడదు. మానవుడు బ్రతికి వుంటే స్వజన మిత్ర కళత్ర పుత్రులు తక్కిన పదార్థాలవలె నశించినా, మరల ఉద్భవిస్తారు. మానవుడు జీవితం చాలించి, ముక్కు మూసుకున్నాడా తత్కాలంలో దగ్గర వున్నది కూడ లేనట్టే అవుతుంది. జీవతం కోసం నిజదేశాన్ని, ప్రియపుత్రులను వదలుకుంటున్నారు. ఈ జీవలోకంలో జీవితంకంటే ప్రియమైంది మరొకటి లేదు." ఈ విధంగా పురోహితుడైన కపిలుడు నానా నిదర్శనాలతో జీవితలోభం అవసరమని నచ్చచెప్పగా రాజు మోసపోయి పాపం చేయడం యుక్తమనుకున్నాడు.



తర్వాత యజ్ఞకర్మ మహారంభంతో ప్రారంభమైంది. పశువుల శోణితంతో ఒక సరోవరం నిండింది. రాజు రహస్యంగా తన పత్నికి విషయం తెలియజేసాడు. ఆమె మొదలే పుత్రప్రవాసశోకార్త. రాజు మాటలు విని పాపభీతియై ఈ విధంగా ఆలోచించింది: "అయ్యో! ఈ రాజు ఎంత మూర్ఖుడు! మోహాంధుడైన పురోహితుని ప్రేరణతో కోడలి వధ అనే మహాపాతకం చేస్తున్నాడు. మన మరణం అవధి ఇదివరకే నిర్ణీతమైంది. దానిని ఎన్ని యత్నాలు చేసినా పరిహరించలేము. అయినా మూఢులు పరప్రాణాలు హరించి తమ జీవితం కొనసాగాలని చూస్తారు. జీవితలోభంతో రాజు నిష్కపటియైన కోడలిని ఆడజింకను వలె చంపితే, పుత్రునికి నేనేమి చెప్పను? 'అమ్మా! నా మనోహరను వాత్సల్యంతో నీవు కాపాడాలి'- అని సుధనుడు కోడలిని నాకు అప్పగించి వెళ్లాడు. కనుక ఆమెకు నా వద్దనున్న చూడామణిని అప్పగించి వేస్తాను. దానితో ఆమె కామగమనంతో వెళ్లిపోనీ. ఆమె బదికి వుంటే మరల ఎప్పటికైనా భర్తను కలుసుకొంటుంది.

రాణి ఈ విధంగా ఆలోచించి, కన్నీళ్లతో కోడలి వద్దకు వెళ్లి రాజు చరితం వివరించి, కంపిస్తూ ఇలా అన్నది: "వత్సా, చూడామణిని పెట్టుకుని గగనమార్గంలో త్వరగా వెళ్లు. ఈ రాజు పాపం తలపెట్టాడు. సదాచారం గుర్తించడం లేదు. నీవు యజ్ఞభూమికి వెళ్లి, అక్కడినుంచి గగనమార్గంలో వెళ్లిపో. లేకపోతే, రాజు నిన్ను నేనెక్కడో దాచినట్టు అనుమానిస్తాడు." ఆ మాటలు విని భర్తృప్రవాసార్త, అతని సమాగమం కోసం దేహం రక్షించుకుంటూన్న మనోహర అత్తగారిచ్చిన శిఖామణిని తలలో పెట్టుకొని, రాజు వెంట యజ్ఞవాటికకు వెళ్లి, అక్కడినుంచి ఆకాశానికి ఎగిరి "రాజా, నీ ప్రియపుత్రుని భార్యను నీ కోసమని చంపడం సముచితం కాదు. నీకు స్వస్తి. ఇదిగో నేను వెళ్లుతున్నాను. నా వియోగం వల్ల ధైర్యం వీడిన కుమారుణ్ని అక్కడ కాపాడుకో" అని మరింత వేగంతో మెరిసే మెరుపులాగ వెళ్లిపోయింది.

ఆమె వెళ్లగానే యజ్ఞానికి విఘ్నమైందని శంకించగా, పురోహితుడుడైన కపిలుడు "దేవా! సంశయం వద్దు. నేను మంత్రాలతో క్రూరుడనే బ్రహ్మరాక్షసుణ్ని ఆకర్షించాను. వాడు ఆ కిన్నరిని చంపివేశాడు. క్రతువు నిర్విఘ్నమైంది" అని అబద్ధమాడాడు. ఆ మాటలు నిజమని రాజు నమ్మాడు. కుటిలులు అమాయకులను జంత్రపు బొమ్మలలాగ ఆడించడం సహజం.

కిన్నరి మనోహర తండ్రి భవనానికి వెళ్లి తన వృత్తాంతం తండ్రికి తెలియజేసింది. మానవసంగముపు వాసన పోవడానికి ప్రతిదినం ఆమె ఐదువందల బంగారు బిందెలతో స్నాన చేయాలని తండ్రి ఆదేశించాడు. ఆమె ఆ తండ్రి ఆనతి పాలించడం వల్ల మర్త్యామోదం క్రమంగా తగ్గింది కాని, సుధన స్నేహ సంబంధమైన రాగం మాత్రం తగ్గలేదు. దివ్యోద్యానాలలో విహరించినప్పటికీ ఆమెకు సంతృప్తి కలుగలేదు. ఒకచోట బద్ధరాగులకు మరొకచోట మనసు పోదు. కాంత విరహక్లాంత అయిన ఆమె ఒకమారు ఆకాశంలో వెళ్లుతూ, నాగభవన సమీప వనప్రాంతానికి వెళ్ళింది. అక్కడ ఆశ్రమస్థలిలో ఉన్న వల్కలాయన మహర్షిని దర్శించి ప్రణామం చేసి ముఖం వంచి ఇలా విన్నవించింది: "భగవన్! నన్ను అమోఘపాశంతో పట్టుకోమని లుబ్ధకునికి చెప్పినవాడివి నీవే. ఇది యుక్తమేనా?" ఆమె మాటలకు మహర్షి సిగ్గుపడి, మొగం దించుకొని, "ఓ ముగ్ధా! ఇది నీ భవితవ్యత. అమోఘపాశం అతనివద్ద వుందని తెలియక నేను అలా అన్నాను. నా నుంచి ఆ లుబ్ధకధూర్తుడు నీ సంగతి గ్రహించి నిన్ను పట్టుకున్నాడు. క్రూరహృదయులైన దుష్టాత్ముల కౌటిల్యం గ్రహించలేము. మేమేమో సద్భావంతో సరళమైనవారం. సత్యవార్తలే చెప్పేవారం" అని అన్నాడు.

అప్పుడు ఆ కిన్నరి చనువుతో ఇలా విన్నవించింది: "భగవన్, బాలికా సహజమైన నా చాపల్యం క్షమించు. నేనిప్పుడు నీతో అనే మాటలు సదాచార వ్యతిక్రమమే. కాని, ఇది లలనా సహజం. అది అందమూను. నీబోటి పెద్దలకు కూడ నా మాటలు వినిపించే చాపల్యానికి లోబడుతున్నానంటే, వియోగాగ్ని తాపజ్వాలలను సహించలేకపోవడమే. దయాళులు సంతప్తుల దుఃఖాలను తొలగించే సన్నాహంలో తరచు అనుచిత విషయాలలోను పని కల్పించుకొంటారు. లుబ్ధకుని పాశంనుంచి విడివడిన నేను రాజపుత్రుని మనోహర స్నేహపాశంతో కట్టుబడిపోయాను. సుధనుడనే ఆ సుభగుడు నా వియోగానలసమాకులచిత్తుడై ఈ దారిని నీ వద్దకు వస్తే కరుణతో నా మాటగా ఈ సంగతి చెప్పు. ఏమంటే: "నేను నీ విరహాయాసంతో సుఖం లేక తండ్రియింట ఉన్నాను. ఉత్కంఠంతోగాని, అనుకంపతోగాని, సహజమైన కృతజ్ఞతతోగాని, దాక్షిణ్యభావంతోగాని, వెంటనే కిన్నర పురానికి రావాలి. కిన్నరపురి మార్గం క్లేశశతంతో కూడినది; దుర్గమమైనది; అల్పవీర్యబలౌజస్కులైన మానవులకు అగమ్యమైనదీని. ఈ తపోవనంలో సుధా అనే మహౌషధి వెలుగుతూ వుంటుంది. దానిని నీవే హవిస్సుతో పక్వం చేసి, త్రాగాలి. దాని ప్రభావం వల కష్టాలు గట్టెక్కి సత్త్వబల సహాయంతో కైలాస హాసంవలె శుభ్రమైన మార్గంతో నా కిన్నరపురికి చేరుతావు" - అని. భగవన్, ఈ గురుతు ఉంగరం కూడా ఆయనకు అందజేయి." ఈ విధంగా ఆమె విషమమార్గం, ఆశ్చర్యకరమైన యుక్తులతో విఘ్నప్రతిక్రియోపాయాలను తెలిపి, అంగుళీయకం మహర్షికి అందజేసి, ఆశాబంధ ధృతప్రాణ అయి వెళ్ళిపోయింది. కిన్నరపురి సుదూర మార్గాన్ని దాటివెళ్లే ఆ అద్భుత విషయాన్ని మహర్షి విని, ఉంగరం తీసుకొని ఆ విషయమే ఆలోచిస్తూ వుండిపోయాడు.

ఇక్కడ రాజకుమారుడైన సుధనుడు ఎదురుతిరిగిన సామంతుడైన మేఘుణ్ణి గెలిచి, అతని కోశాన్ని కొల్లగొట్టి తీసుకొని, దయితా దర్శనోత్సుకుడై, పరాజిత సామంతరాజుల ఛత్రసమూహంతో ఆకాశాన్ని ఫేనపుంజంతో నవ్వుతున్న సముద్రంలాగ చేస్తూ హస్తినాపురికి తిరిగి వచ్చాడు. అంతఃపురంలో ప్రవేశించి తండ్రికి నమస్కరించాడు. తండ్రి కోడలి హననవృత్తాంతం చెప్పలేక వణికిపోతున్నాడు. పరిజనమంతా తలవాల్చి శోకశల్యంతో సంతోషం తరిగివుంది. జనకుని అంతఃపురం ఈ విధంగా ఉండడం చూచి ఏదో అప్రియమైన విషయం జరిగిందని రాజకుమారునికి శంక కలిగింది. అప్పుడు "విరహార్త అయిన నా ప్రియ మనోహర జీవించి వుందా?" అని ఎలుగెత్తి అడిగాడు. ఎవ్వరూ అప్రియవార్తను చెప్పకపోగా అతని తల్లి "పుత్ర! నీ ప్రియురాలు బతికేవుంది. కాని, జీవిత సంశయం ఏర్పడగా చూడామణిని తీసుకొని వెళ్లిపోయింది" అని సమాధానమిచ్చింది. ఆ మాటలు వినగానే సుధనుడు కింద పడిపోయి భూమిని కన్నీటి ముత్యాలతో కప్పివేశాడు. పిదప మంచుముక్కలతో చల్లనైన హరిచందన జలాలతో తెలివిరాగా, అశ్రుగద్గద కంఠంతో ఇలా విలపించాడు. "ఆకాశం లేకనే ఉదయించే ఆ శశాంకలక్ష్మి ఏదీ? సముద్రమథనం లేకనే ప్రవహించిన అమృతవాహిని ఏది? నేను తండ్రి శాసనంతో దూరం వెళ్లుతూ, బాష్పనిరుద్ధలోచన అయిన ఆ మృగాక్షికి ధైర్యం చెప్పలేదు. కనుకనే మన్మథుని ఉసురు నాకు కొట్టింది. ఓ చక్కని కనుబొమలదానా! మాట్లాడు. ఎక్కడికి వెళ్లావు? ఇలాటి పొరపాట్లు జరుగుతాయని తెలయని మూఢుణ్ణి. హరిణాక్షిని రక్షించుకోలేక పోయాను. నీ సమాగమ సౌభాగ్యంతో దేవపరిషత్తులలోను శ్లాఘ్యుడైన నాకు, ఈ మర్త్యలోకానికి, నీవు లేకపోతే, ఇక గతి ఏమిటి? వెలుగేమిటి?"



రాజుకుమారుడు ఈ విధంగా విలపిస్తూ, కాంతా సంభోగ సాక్షులైన ఉద్యానాలలో ఆమెను వెదకడానికి బయలుదేరాడు. అతడు పరిజనుల కంటబడక తప్పించుకొని, రాత్రిళ్లు ఎవరికీ తెలియక, అడవులలోని ఎగుళ్లలో దిగుళ్లలో తిరిగాడు. తీవ్రరాగ పిశాచావిష్టుడై మైమరచి, చేతనాచేతనాలను పిచ్చివాడివలె ప్రశ్నించాడు. ఓ శుకశాబకమా! నా ప్రియురాలు, ప్రాణసఖి అయిన మనోహరి ఎక్కడుందో చెప్పు? ఆమె అధరం వంటి ఎర్రని దొండపండు భోగం నీకు సదా కలుగనీ! కమలాదేవి లీలావతంసకాంతిగల ఓ హంసమా! చెప్పు. సుగంధాలు వెలార్చే పద్మవదన, కాంతికల్లోలిని అయిన ఆమె ఎక్కడో చెప్పు. ముక్తాహారకలాపం దొర్లే ఆమె పాలిండ్లు హంసలలాగ, రోమరాజి(నూగారు) పాచితీగలాగ కనిపిస్తాయి." అని తీవ్రవ్యసనంతో ప్రలపిస్తూ, ఎగుడు దిగుళ్లులేని ప్రాంతంలోను తొట్రుకొని పడుతూ లేస్తున్న అతన్ని చూచి దయతో దారి చూపడానికా అన్నట్లు చంద్రుడు ఉదయించాడు. మన్మథబాంధవుడు, శ్యామాపతి అయిన చంద్రుణ్ణి రాజకుమారుడు చూచి, ఇందుముఖి అయిన తన ప్రియురాలే నవ్వుతూ, ఆకాశంలో విమానశిఖరం నుంచి ముఖం చూపుతున్నదని భ్రాంతిపడ్డాడు. "ఓయి చంద్రుడా! చెలికాడా! నీకు కాంతిలో చెలికత్తె, నీ ఒడిలోని జింకపిల్ల కనులవంటి కనులుగలది కనిపించిందా? నీకు, ఆమె ముఖానికి ఉపమానం కావడమనే సంబంధంతో జగత్తులో ప్రసిద్ధి లభించిందే! ఏమిటి? ఏమీ పలుకకనే వున్నావు? నా ప్రియురాలు ఎక్కడికి వెళ్లిందని బ్రతిమాలుతున్నానుగదా! అయినా మాట్లడవే? నిజమే. నీవు పరార్థ సంపాదన శీతలుడివి. కొన్ని కళలే కలవాడివి. ఎవరి మాట మాత్రం విన్నావు?" అని ప్రలపించాడు. అంతలో మయూరాన్ని చూచి ఇలా అన్నాడు: "ఓ మయూరమా! స్నిగ్ధతటిత్ప్రకాశ, ఘనస్తని అయిన నా ప్రియరాలు కనిపించిందా? విచిత్రమాలికలు గల ఆమె కబరీకలాపం నీ విచిత్ర మాలికలుగల పురికి చెలికదా! భుజంగమా! వరచూడామణి గల భుజంగిని (ఆడపామును, రసికురాలిని) ఎక్కడైనా చూచావా? ఆమె విడచిన విషజ్వాలలు ఈ దుస్సహమైన విరహంలో నన్ను దహిస్తున్నాయి. ఓ సారంగమా! మన్మథపార్థివుని సారంగిని చూచావా? ఆమె కటాక్షోత్పలసంవిభాగాలతో ఈ అరణ్యంలో హరిణాలు మెరుగుగళ్లతో ఉన్నాయనుకుంటాను. ఓ వనస్పతీ! పల్లవపేశలోష్ఠి, విభ్రమ జన్మభూమి, లీలావిలోల, లతలాగ స్తబకావనమ్ర ఈ అరణ్యంలో కనిపించిందా? ఈ వనగజం ఆ రాజరంభను (రంభను, అరటిని) పరిరంభలోభంతో లాక్కుపోయి వుంటుంది. లేక, కారుమబ్బువలె వున్న ఈ వనగజమే చంద్రలేఖవంటి ఆమెను దాచుకొని వుంటుంది."

ఇలా అతడు వెర్రివాడివలె ప్రలపిస్తూ, కాననకుంజాలలో తిరుగుతుండడం చూచి రాత్రి, దుఃఖపడినదా అన్నట్లు వివర్ణేందువదన అయింది. అతడు క్రమంగా నాగభవన సమీపంలోని తపోవనానికి చేరి వల్కలాయన మహర్షిని దర్శించి, "మునివర! ఇక్కడ విరహ దుఃఖనిశ్వాసాలతో చెలరేగుతున్న మదనాగ్ని ధూమంతో, నల్లబడిన ఏక వేణిని ధరించి, శశాంకుని ఉద్దామసౌందర్యదర్పాన్ని అణచివేసిన హరిణాక్షి అయిన కిన్నరి కనిపించిందా?" అని ప్రశ్నించాడు. కాంతావియోగంతో ఉన్మాదావస్థ పొందిన రాజకుమారుని మాటలు విని గుర్తుపట్టి వల్కలాయనుడు సమాధానపరిచి ఇలా అన్నాడు: "రాజకుమార! సమాశ్వసించు. విశ్రమించు. సంతాపం వదలిపెట్టు. నీ మానసచంద్రిక అయిన ఆ కళ్యాణిని నేను చూచాను. గుంపు నుండి చెదరిపోయిన ఆడఏనుగు వలె, జీవితంలో నిరపేక్షురాలైన ఉచ్చుల్లో చిక్కుకున్న హరిణివలె నీ ఆశతో ప్రాణాలు నిలుపుకొంటున్నది. నీ వియోగంతో ఆకుల అయిన ఆమె వదనకమలం ఎప్పుడూ ఆమె

పాణితలాన్నే ఆశ్రయించి వుంది. ఆమె దేహలత ఏదో ప్రలాపన చేస్తూ తాపక్లాంతయై చిగురుటాకుల పడకలో పడి వుంది. నీ సమాగమాశ ఒక్కటే ఆమె మతికి ధృతి. ఆమె మనస్సు మరెక్కడా శాంతి పొందడం లేదు. 'కిన్నరపతి అయిన నా జనకుడు ద్రుముని భవనానికి నీవు వెంటనే రావలసింది' అని నీకు సందేశం అందజేయమన్నది. వీర్య సత్త్వ బలోపాయ ధైర్యోత్సాహాలుగల వారికి గూడ అగమ్యమైన కిన్నరపురంలో ప్రవేశించడానికి దారి కూడా చెప్పింది. ఇదుగో, స్నిగ్ధకాంతులతో దిక్కులను పచ్చగా మార్చివేస్తూన్న ఈ రత్నాంగులీయకం నీకోసం ఇచ్చింది." ఇలా ఆనంద సుధాసిక్తమైన మాటలతో అతనికి ధైర్యం కలిగించి, ఉంగరం ఇచ్చి, కిన్నరనగరానికి దారి కూడా తెలిపాడు.

రాజకుమారుడు ముని చెప్పిన ఉపాయములతో, మార్గంతో ధనదుడు వసించే ఉత్తర దిక్కుకు ధీరుడై ప్రయాణం కట్టాడు. కిన్నరి తెలిపిన సుధామాలికను సంపాదించి దానిని నేతిలో వండి, సేవించి వీర్య బల మాహాత్మ్యాలు పొంది సాయుధుడై తరలినాడు. అతనికి మాహాత్మ్యం వల్ల మార్గంలో సకలోపకరణాలు తమంత తామే సమకూరాయి. సత్త్వసహాయులకు సకల సంపదలు స్వాధీనమవుతాయి. అలా వెళ్ళుతూ అతడు విద్యాధర వధూవిలాస హసిత కాంతితో తెల్లనైన హిమవత్పర్వతం దాటి కుకూ పర్వతం చేరాడు. అక్కడ వాయువేగుడనే వానరనాథుని ఫలోపహారాలతో ప్రసన్నుని చేసి, అతనిని అధిరోహించి కుకూలాద్రిని దాటాడు. తర్వాత తన వారికి విఘ్నసంఘం వలె అడ్డు వచ్చిన ఘోరమైన అజగరాన్ని బాణంతో చంపి, అజపథమనే పర్వతం దాటి, కామరూపాద్రి వద్ద వీణానినాదంతో కామరూపిణి అనే రాక్షసిని లోబరచుకుని, ఆ పర్వతం దాటాడు. పిదప భయంకరమైన వజ్రకమనే పర్వతం చేరాడు. అక్కడ మాంసం కోసం కాచుకుని వున్న గృధ్రరూప రాక్షసిని చూచి, ఒక మృగాన్ని చంపి, చర్మం వలచి, అ పచ్చి చర్మం కప్పుకుని ఒకచోట నిశ్చలంగా నిలబడ్డాడు. గృధ్రరూప అయిన ఆ భయంకర నిశాచరి మాంసలోభంతో అతనిని ఎత్తుకునిపోయి, శిఖరాగ్రంలో పెట్టింది. అతడు వెంటనే మృగచర్మం వదలి ఆ రాక్షసిని చంపి, చంద్ర చెట్లు దట్టంగా వుండే ఖాదిర పర్వతం చేరాడు. అ పర్వతంలోని ఒక గుహను ప్రవేశించి, చలి, ఎండ, చీకటి, సర్పం, రాక్షసులు మొదలయిన వాటి భయాన్ని పోగొట్టే ఒక ఓషధిని సంపాదించాడు. అక్కడి నుంచి యంత్ర పర్వతాలు చేరాడు. ఆ యంత్ర పర్వతాలు రెండూ మనుష్యులు వాటి మధ్యకు వచ్చినప్పుడు కలుసుకుని అదిమి చంపి వేస్తాయి. వాటి యంత్రకీలాన్ని సుధనుడు బాణాగ్రంతో ఖండించి కదలకుండా చేశాడు. పిదప యంత్రద్వారం పగులగొట్టి, యంత్రచక్రం విరిచివేసి, దుస్సహంగా ఢీకొనే ఇనుప యంత్ర మేషాలను, మకర రాక్షసులను చంపి, ఘోరాంధకార గంభీరమైన గుహకూపం దాటి, అక్కడ నది నొకదానిని దాటి, దాని తీరంలోని రాక్షసులను వధించి ముందుకు వెళ్ళాడు. అక్కడ పాములతో నిండిన నీళ్ళుగల పతంగ అనే నదిని దాటాడు. తర్వాత రోధిని, హాసిని అనే నదులు దాటాడు. రోధినీనదీ తీరంలో కిన్నర చేటికలు ఎప్పుడూ ఏడుస్తూ విఘ్నాలు కలిగిస్తాయి. హాసినీ నదీతీరంలో ఎప్పుడూ నవ్వుతూ విఘ్నాలు కల్పిస్తారు. ఇలాగే వ్యసనాలు కల్పించే మరొక దానిని కూడా దాటి, వేత్ర అనే నదిని చేరి అవతలి గట్టును చేరగల వేముతీగను పట్టుకుని, ఆవలిగట్టు ఎక్కి ధగధగలాడే స్ఫటిక మందిరాలున్న కిన్నరపురం చూచాడు. నెమ్మదిగా నగరంలో ప్రవేశించి, ఒక బంగారు తామర కొలను తీరంలో ఒక చెట్టెక్కి రత్నలతల మరుగున దాగుకున్నాడు. తామర పూల పుప్పొడితో గుమగుమలాడే కనక జలకలశాలను తీసుకుని వెళుతున్న కిన్నరాంగనలను చూశాడు. వారిలో ఒక కిన్నరాంగన



నిండిన బంగారు కడవను ఎత్తుకోలేక శ్రమపడుతుండగా సుధనుడు ఆమె వద్దకు వెళ్ళి కడవపై చేయివేసి ఎత్తి సహాయం చేసి ఆమెతో "అమ్మా, ఎవరికోసం ఈ జలం తీసుకుని వెళ్ళుతున్నారు? ఇంత శ్రమను మీరు భక్తితో లెక్కచేయకుండా వున్నారే?" అని నెమ్మదిగా ప్రశ్నించాడు. అతడీవిధంగా ప్రశ్నించగా, ఆమె అతనిని చూచి క్షణంసేపు అతని మధురాతిమధుర సౌందర్యంపై పక్షపాతంతోనా అన్నట్టు "మనుష్య వాసన పోగొట్టుకొనడం కోసం తండ్రి అయిన కిన్నరరాజు ఆనతితో మనోహర, నిత్యం ఈ సురభి జలాలతో స్నానమాడుతుంది." అని చనువుతో చెప్పింది. ఆమె మాటలు విని అమృతాభిషిక్తుడువలె వెంటనే ఆమె బంగారుకుండలో మనోహర ఇచ్చిన అభిజ్ఞానాంగుళీయం పడవేశాడు. ఆ అంగుళీయకం స్నానం చేస్తున్న మనోహర కుచకుంభయుగంపై పడగా, సూర్యుని కాంతివంటి దాని రత్నమయూఖరాజి, నఖక్షత విలాససామ్యాన్ని పొందింది. తన అనురాగం మూర్తికట్టినదా అన్నట్టు, అనంగ కథలకు అంతరంగమైనట్టు వున్న ఆ రత్నాంగుళీయకం చూచి, తన ప్రియుడు వచ్చాడని గ్రహించి, యథాలాపంగా గాలి పీల్చుకున్నట్టు "ఇది నీకు ఎక్కడిది?" అని కిన్నర చేటికను ప్రశ్నించింది. "దేవీ! పుష్కరిణీతీరంలో ప్రత్యక్ష మన్మథుడులా ఎవరో యువకుడున్నాడు. ఈ ఉంగరాన్ని ఆ యువకుడు ఈ బంగారు కడవలో వేశాడు. దాని కాంతికి కడవలోని నీరంతా కుంకుమ కాంతితో అందమైంది" అని దాసి జవాబు చెప్పింది. మనోహర ఆ ప్రియవచనాలు విని, ఆ దాసితోనే తన ప్రియుడు వచ్చినట్టు నిశ్చయించుకొని, ఆమెతోనే తన భవనానికి పిలిపించుకొంది. ఆ దాసి అతనిని ఉద్యాన మందిరంలో రహస్యంగా బస చేయించగా, చంద్రుణ్ణి కుముద్వతిలాగ మనోహర చూచింది. వారి పరస్పరాలోకన విలాసంతోను, వియోగ సంతాపం తెలుపుకొనడంతోను, సంతోషానుభవంతోను అనంగుడు సర్వాంగశోభ పొందాడు. ఆ దంపతులిరువురూ, విరహ సమయంలో చింతతో దేనిని మననం చేసుకొన్నారో, ప్రౌఢప్రమద మిత్రుడైన మన్మథుడు దేనిని ఉపదేశించాడో, ఔత్సుక్యం గడ్డకట్టిన ప్రేమకు ఏదేది సహజమైందో ప్రణయసుభగమైన ఆయా కార్యకలాపమంతా నిర్వర్తించారు.

కొంతకాలం గడిచిన తర్వాత మనోహర ప్రచ్ఛన్నంగా జరుగుతున్న తన వృత్తాంతానికి సిగ్గుపడి, తన తండ్రికి తన సంగతి తెలిపి, ప్రియుడైన రాజపుత్రుని చూపింది. కిన్నరరాజు కోపంతో పెదవులు వణకగా, తన కూతురు భర్త దర్శనపథాన్నే పరిహరించి కూతురితో ఇలా అన్నాడు. "ప్రమాదవశాత్తు నీ అనురాగం అనుచితుడైన మానవునిపై పడింది. నిన్ను ప్రతి దినం ఐదువందల బంగారు కుండలతో స్నానం చేయిస్తున్నా ఆ రాగాన్ని (ఎరుపును) వదలకున్నావు; దుశ్చరిత్రురాలా! దేవతలకు స్పృహణీయమైన నీ యౌవన ప్రాదుర్భావలావణ్యం మానవునిపై స్నేహంతో శోచనీయమైంది. ఉదగ్ర గోత్రంలో (ఉన్నత వంశంలో) పుట్టి ఘనయౌవన నిర్భర అయినా నీవు ఉదగ్రగోత్ర (ఉన్నత పర్వత) ప్రభవయై, ఘన యౌవన (ఉదకంతో) నిర్భర అయిన నిమ్నగవలె క్షోభవిభ్రష్టవై పూర్తిగా అధోలోకానికి పోయావు. ఖలుని విద్యవలె నీవు విద్వాంసులకు ఉద్వేగం కలిగిస్తూ, కులానికి సిగ్గుచేటుగా ప్రవర్తిస్తూ, మలినురాలవై ఎవరికీ నచ్చనిదానివయావు. రూపం మాత్రం చూచి నీవు మర్త్యునికి వశ్యురాలయిపోతే, బంగారు బొమ్మతోనే ఎందుకు సంతోషించవు? అది ఇంకా అందంగా వుంటుంది కదా! చారుతరాకృతి అయినప్పటికీ ప్రభావ గుణహీనుడైన వాని సౌందర్యం చిత్రంలోని మనిషి సౌందర్యం వలె కేవలం గోడకు అందం. ఓ పాపిష్ఠురాలా! నీ పతి వధింపదగినవాడు. హీనసంబంధ లజ్జతో, నిన్ను పెళ్లాడుతావుని వచ్చిన

దేవలోకవాసులకు ముఖం చూపలేకపోతున్నాను. ఉత్సాహసహితం, ఉన్నతిశాలి అయిన దేహానికి ముదిమిలాగ సంకోచకారిణి."

ఈ విధంగా తండ్రి తనను నిందించగా, మనోహర ముఖం వంచి, పాలిండ్లపై పడే తన కన్నీటి బిందువులతో దారం లేకనే ముత్యాలహారం సొబగును కూర్చుతూ ఇలా అన్నది. "తండ్రీ, కోపంతో నీవు ఈ విధంగా అనుచితమైన మాటలు అనడం భావ్యం కాదు. నరులు కూడా కిన్నరులకన్నా ప్రభావవంతులు ఎందరు లేరు? గరుడునికి కూడ దుర్లంఘ్యమైన దుర్గమప్రాంతాలను దాటి ఈ ప్రభావభూమికి వచ్చినవాడు మనుష్యమాత్రుడెట్లవుతాడు? దేహధారుల మూర్తి గుణసంవాదిని. చంద్రుని కాంతి ఆనందసంవాదం చేయదా? తండ్రీ! జాతితో పనేమిటి? గుణాలు స్వభావానుగుణంగా ఉంటాయి. అమృత నిష్యంది అయిన చంద్రుడు కాలకూటానికి సోదరుడుకదా! కొందరి గుణాలు ప్రచ్ఛన్నంగా వుంటాయి. కొందరు ప్రచ్ఛన్నదోషులుగా వుంటారు. మణుల మదింపు పరీక్షించకనే చేస్తామా?"

కూతురి మాటలు విని కిన్నరపతి సరేనని, అల్లుణ్ణి పిలిచి, గుణజిజ్ఞాసతో ఇలా అన్నాడు: "నీ దేహకాంతితోనేమో ఇక్కడి కిన్నర యువకులు ఓడిపోయారు. కాని, నీ ప్రభావం, మాహాత్మ్యం చూపితేనే దేవలోకవాసులతో సంబంధం చేసుకోడానికి అర్హుడవవుతావు. ఎత్తైన ఆ శరవణం (రెల్లువనం) ఉన్నదే; దానిని వెంటనే పెకలించివేయాలి. తక్షణమే ఆఢకమాత్రం నువ్వులు చల్లి వాటిని మళ్లీ ఒక్కటి కూడా తక్కువ కాకుండా ఏరి నాకు అప్పగించాలి. ధనుర్విద్యలో ధృఢలక్ష్యాది కౌశలం చూపించు. అప్పుడు కీర్తిపతాక అయిన ఈ మనోహర నీకు దక్కుతుంది." ఈ విధంగా కిన్నరరాజు కపటంతో అశక్యమైన కర్మను చేయవలసిందని చెప్పగా, రాజకుమారుడు మనోహరపై అనురాగంతో అదంతా చేయడానికి పూనుకున్నాడు.

శరవణపాటనమనే వ్యర్థప్రయత్న క్లేశానికి పూనుకున్న రాజకుమారుణ్ణి సహస్రాక్షుడు చూచి పక్షపాతంతో ఇలా అనుకున్నాడు. "ఈ పార్థివాత్మజుడు భాద్రకల్పికుడనే బోధిసత్త్వుడు. కిన్నరేంద్రుడు ఇతనిని నిష్ఫలమైన కష్టకర్మలో నియమించాడు. ఈ ప్రతిజ్ఞానిర్వహణ ప్రయాసలో నేనతనికి సహాయం చేయాలి." ఇలా అనుకుని వెంటనే పనికి పూనుకున్నాడు.

శతక్రతువు ఆజ్ఞతో యక్షులు వరాహరూపం ధరించి, శరవణాన్ని పెకలించి, చదును చేశారు. పిదప ఆఢకమాత్రం తిలలు దున్నారు. తర్వాత ఇంద్రుని ప్రభావంతో చీమలు పుట్టుకొనివచ్చి, ఆ నూవుగింజలన్నిటినీ ఏరి కూర్చాయి. రాజకుమారుడు ఈ అద్భుతం చేసి, కిన్నరేంద్రునికి తెలియజేశాడు. అతడు విస్తుపోయాడు. పిదప రాజకుమారుడు ఏడు బంగారు స్తంభాలను, ఆడపందులు చుట్టుముట్టిన ఏడు తాళవృక్షాలను తన నిశితబాణంతో ఛేదించి తన బలపరాక్రమాలు చాటుకొన్నాడు. ఈ విధంగా అతడు శస్త్రాస్త్రవిక్రమాన్ని, కళాశిల్ప శక్తిని చూపగా, అతని మకుటంపై దేవలోకం నుంచి పుష్పవర్షాలు కురిశాయి.

కిన్నరపతి అతని ప్రభావానికి వెరగుపడినా, అతనిని వంచించడానికి మరికొన్ని వుపాయాలు ఆలోచించాడు. విపరీతబుద్ధులయిన వారు గొప్ప ఆశ్చర్యం జరిగినా మౌనం అవలంబిస్తారు. ఉత్తములను పొగడితే నవ్వుతారు. ఎవరికన్నా కీర్తి వచ్చిందంటే ముఖం నల్లబరుచుకొని, వివాదానికి పూనుకుంటారు.



నూరారు గుణాలున్నాసరే సంతోషించరు. మీదుమిక్కిలి ఇతరులను పరిభవించాలనే క్షోభతో మొండికెత్తుతారు. కిన్నరపతి రాజకుమారుణ్ణి చూచి, "నీవు అపూర్వ ప్రభవమే చూపావు. ఇప్పుడు నీ ప్రజ్ఞాప్రకర్షం ప్రదర్శించు. అభిన్నవర్ణరూపలు, తుల్యాభరణ వసనలు గల పలువురు కిన్నరీ యువతుల మధ్యన నీ ప్రియురాలిని కూర్చోబెడుతాము. నీవు గుర్తు పట్టి స్వీకరించు" అని చెప్పి ఐదువందలమంది కిన్నరీజనాన్ని, ఒకే విధమైన దేహచ్ఛాయ, సౌందర్యం, వయస్సు, అలంకారం కలవారిని ముందు నిలబెట్టాడు. రాజకుమారుడు ఆ కిన్నరీగణం మధ్యన వున్న తన ప్రియురాలిని తీగల గమిలో మరుగైన చూతలతను భృంగంవలె కనిపెట్టాడు. తర్వాత కిన్నరేశ్వరుడు 'ఇతడు దివ్యుడే' అని నిశ్చయించి, సంతోషించి, దివ్యరత్నాలతోపాటు మనోహరను అతనికి ఇచ్చి వివాహం చేశాడు. రాజకుమారుడు శ్వశురగృహంలో శ్లాఘ్యోపభోగవిభవాలతో గడుపుతూ, కొంతకాలానికి భార్యతోపాటు అతని వద్ద సెలవు పుచ్చుకొని నిజనగరానికి వెళ్ళాడు.

ధనమహారాజు పశ్చాత్తాపపడి తన పుత్రుని రాకకు సంతోషించి, చంద్రుని ధిక్కరించే సితాతపత్ర భూషితమైన సింహాసనంలో ప్రజల పరితాపం పోగొట్టే ఆ కుమారుణ్ణి అభిషేకించి, ప్రశమవృక్షపు సంతోష శీతల వివేక సుఖాభిరామమైన ఛాయను ఆశ్రయించాడు. సుధనుడు అభిషిక్తుడు కాగానే, ఆ పృథు ప్రతాపుని నవప్రభావానికి, ప్రభుభావానికి భయపడినవా అన్నట్టు, సప్తరత్నాలు సేవకోసమో అన్నట్టు సిద్ధించాయి.

ఆ బోధిసత్త్వుడైన సుధనుణ్ణి నేనే. యశోధరే ఆ మనోహర. ఆమె వియోగవ్యసనానల దుఃఖం కామానుబంధంతో ఇంతగా నాకు కలిగింది. అందువల్ల కమలవదనాల **నేత్రాంచలవాసి** అయిన కాముడు శమమనే హరిణిని కట్టివేసే కిరాతుడు. పుప్పొడి అనే హాలాహలంతో, ఉగ్రమైన తియ్యని వ్యసన బాణాలతో లోకాన్ని బాధిస్తాడు. అలాటివాడిని సత్పురుషులు వర్జించాలి.

ఈ విధంగా జినుడు తన కథను చెప్పగా భిక్షువులు విని, భవమహావృక్షానికి తల్లివేరు మన్మథుడేనని నిశ్చయించుకొన్నారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సుధనకిన్నర్యవదానమనే అరవై నాల్గవ పల్లవం

# 65. ఏకశృంగావదానం

పూర్వజన్మ సంబంధమైన వాసనామూలశేషం వల్ల శంకాతంకాలు లేని ప్రాణి మనస్సులోను కమలంలాగ రాగం పుట్టుకువస్తుంది. ఈ రాగం సంభోగలీలా పరిమళపటలంతో సర్వేంద్రియాలూ ఆకర్షించగా వచ్చిన సహృదయ భృంగాలకు ఒక్కచోటనే ఎక్కువగా బంధం, అనుబంధం కలిగిస్తుంది.

పూర్వం ఒకమారు బుద్ధుడు శాక్యపురంలో న్యగ్రోధారామంలో విశ్రమించివుండగా, భిక్షువులు మరల ఈ విధంగా ప్రశ్నించారు. "దేవా! శాంతి ప్రవర్తిల్లి, సంసారవికారాలు తొలగి సన్యసించిన నీవు రాజాంతఃపురంలో ప్రవేశిస్తున్నప్పుడు యశోధర చూచి, మోహపడుతున్నట్టు ఉంటుంది. నీ దర్శనం కోసం విభూషణాలంకృతయై, లజ్జాసాధ్వనాలతో కంపిస్తూ, నిలబడుతుంది. భోజనాగారంలో మోదక పాత్రను పట్టుకుని నీకు వడ్డించడానికి వచ్చి ఆశపెడుతూ కొసరుతుంది. బహుప్రకారమైన ఆమె వికారం ఇంతవరకు శాంతించలేదు. నీముఖచంద్రద్యుతిలేక, ఆమె కుముదివలె ముడుచుకొనిపోతుంది." భిక్షువులు ఈ విధంగా ప్రశ్నించగా, భగవానుడు మందహాసంతో అధరపల్లవానికి ముత్యాలు చెక్కిన పగడపుశోభను కలిగిస్తూ ఇలా అన్నాడు.

యశోధరకు ఈ వికారయుతమైన అభిలాష ఇప్పటిది కాదు. జన్మాంతరంలోను ఈమె స్మరవిభ్రమాలతో, మోదకాలతో ప్రలోభనం చేసింది. పూర్వం కాశీనగరంలో కాశ్యుడనే రాజు ఉండేవాడు. అతని కీర్తి చంద్రద్యుతివలె తెల్లనిది; అతడు శత్రువులనే మదగజాలకు అంకుశంగా వుంటూ, తీక్ష్ణస్వభావుడుగాక, సరళస్వభావుడుగా వుండేవాడు. అతడు సంతానం కోసం ఎన్నో వ్రతాలు, తపస్సు చేశాడు. వాటి ఫలితంగా నళిని అనే ఒక్క కన్యక ఉదయించింది. ప్రజాపాలన వ్యగ్రులైన రాజులకు సంతు చాల తక్కువ కావడం కనిపిస్తున్నది.

ఆమె అంతఃపురంలో పెరుగుతూ ఉండగా, అతని మనస్సులో చింత పెరగసాగింది. ఒకనాడు విద్వాంసులను, అమాత్యులను పిలిపించి ఇలా అన్నాడు. "ఈ రాజ్యాధిపత్యం అన్ని దిక్కులకూ వ్యాపించిన శాఖలు గలిగి, బాగా స్థిరమైన వేళ్ళతో, ఎంతో ఎత్తుగా పెరిగి సర్వజనులకు ఉపజీవ్యమైన వృక్షంవంటిది. కాని, తగిన పూలు పూచకపోతే పురుగు గొట్టిన చెట్టువంటిది. నాకు ఉన్న ఈ ఒక్క కన్య నళిని యుక్తవయస్కురాలవుతున్నది. కొంత ప్రయత్నించి తగిన వరునికి అప్పగిస్తే, నా అపత్యత, ఆమె ప్రణయమూ దూరమవుతాయి. కన్య వెలుగుతున్న దీపపువత్తివంటిది. దానిని ఎవరు చేతులతో పట్టుకోగలరు? ఇంతకూ కన్య కుదువబెట్టుకున్న వస్తువువంటిది. ఎప్పటికైనా ఇతరులకు అప్పగించవలసినదే. కులానికి చింత కలిగించేదే. రాజపుత్రికలను భృత్యులకు ఇవ్వరాదు. పౌరులకును ఇవ్వరాదు. దూరదేశాలకు ఇవ్వదగినవారే. అయితే నిత్యాచరితం తెలియక దూరంలో ఉండేవాడు మరణించినవాడితో సమానం. కనుక ఎవరైనా గుణవంతుడు తన దేశం వదలి నాదేశంలోనే వుండి పుత్రునివలె ఆధిపత్యం నిర్వహించేవానిని ప్రయత్నంతో అల్లుడుగా చేసుకోవాలి. జహ్ను కన్యాప్రవాహంతో పవిత్రమైన ఇసుక దిబ్బలు గల ప్రాంతంలోని సాహంజిని అనే తపోవనంలో కాశ్యపుడనే రాజర్షి వున్నాడని విన్నాను. ఆయన వీర్యం ఒకమారు దైవవశాత్తు ఒక రాతిమీద స్రవించగా, నీరు తాగడానికి వచ్చిన హరిణి ఆ వీర్యం కూడా తాగి గర్భవతి అయి బంగారు కాంతిగల కుమారుణ్ణి ప్రసవించింది. అరణ్యంలో జింకల పాలుతో పెరిగిన అతనిని తండ్రి పిలుచుకొనివచ్చి, సంస్కారాదులు జరిపాడు. అతనికి అంగులమాత్రం కొమ్ము వుండడం వల్ల ఏకశృంగుడనే పేరు వచ్చింది. అతడు యువకుడు. చతుర్ధ్యానపరాయణుడు, బ్రహ్మచారి, విమలస్వభావుడు. నిస్సంగుడుగా వసించడం వల్ల విషయసుఖమంటే ఏమిటో తెలియనివాడు. కఠోరుడుగాని చండకిరణునివలె ఉన్నాడు. అతడు నళినికి భర్త అయితే, ఈ వంశం నశించదు. తేజోనిధి అయిన అతనిని ఇక్కడికి తీసుకొనిరావడానికి అనపాయమైన ఉపాయం ఆలోచించండి." రాజు ఈ విధంగా పలుకగా, అమాత్యులందరూ చాలసేపు ఆలోచించి, "రాజా! రాజపుత్రికను ఆ మహర్షి ఆశ్రమసమీపంలోని వనంలో విహరించడానికి పంపండి" అన్నారు. మంత్రుల మాటలకు సమ్మతించి రాజు తన కుమార్తె నళినికి తన మనోరథం విశదీకరించాడు. ఆమె తండ్రి అనుమతితో మునికుమారుణ్ణి నగరానికి తీసుకొనిరావడానికి సమర్థురాలయినదానివలె అరణ్యానికి విహరించడానికి వెళ్ళింది. ఆ చారువిలోచన వనం చేరి, సవిలాసంగా, బాలానిలాలోలిత అయిన నడతీగవలె విహరించింది; పుష్పాపచయం కూడా చేయసాగింది. ఆమె పుష్పాపచయం చేస్తూ తిరుగుతుండగా, భృంగాలు లేచి ఝుంకారాలు చేయదొడగినవి; లేళ్ళు భయపడి పరుగెత్తసాగాయి. తన తపోవనం పక్కన వున్న వనంలో ఈ కల్లోలం జరుగుతుండడం చూచి ఏమిటిది అనే కుతుకంతో ఏకశృంగఋషికుమారుడు వచ్చాడు. మనుష్యులంటే ఏమిటో తెలియని ఆ ఏకశృంగుడు నతాంగి, యౌవనవిభ్రమం అలలుగా లేచినట్లున్న, ఫుల్లోత్పలాక్షి అయిన ఆ రాజకుమారిని విప్పారిన కళ్ళతో, రెప్పపాటు వేయక ఆశ్చర్యంతో చూచాడు. స్త్రీలంటే ఏమిటో తెలియక పోయినా ఆ మృగలోచనను చూడగానే అతనికి సంతోషం కలిగింది. ప్రాణికి మనస్సులో వాసనాభ్యాసవశంగా విలీనమైన విషయాభిలాష వదలదు. ఆ మృగీసుతుడు ఆమె వదనారవిందముపై సుస్నిగ్ధమైన చూపు సారించి, ఆమె ఏ విద్యాధరుడో, మునిపుత్రకుడో అనుకుని ప్రీతితో నమస్కరించాడు. ఆమె తలవంచి ప్రతిప్రణామం చేసింది. అప్పుడు పగడంవంటి ఆమె అధరపురాగం అమలస్వభావమైన ముక్తాహారంపై పడి, దానిని కూడా రాగరంజితం చేసింది. చెమట వల్ల ఆమె ముఖంలోని తిలకం తడిసి జారిపోతున్నది. ముంగురులు చెదరి పడుతున్నాయి; వీటితో ఆమె చాల అందంగా వుంది. నడుములోని కాంచీగుణం కలకలలాడింది. అది చూడగా, కాంచీగుణం స్మరోపచారాలతో ఆమెకు ఉపదేశమిస్తున్నదా, అన్నట్టుంది. ఆమెను ఋషి కుమారుడు ఇలా కుశల ప్రశ్న చేశాడు: "ఓ మునిపుత్రీ! నీకు స్వాగతం. మా తపోవనంవైపు నిశ్చలంగా చూస్తూ ప్రాంత భూములలో తిరగడం మానినట్టున్న మాతపోవనపు ఆవలివైపు జింకలకు కుశలమేనా? నీవు చేసిన దివ్యవ్రతానికి ఫలితంగా అమృతం వర్షించే నీ దోషరహితమైన రూపం చూచి జటావల్కలధారులయిన మునుల రూపం ఎండిన మానుల చందమని అనుకుంటున్నాను. తైలసంస్కారంతో సొరైన నీ ఈ జటాకలాపం పూలచే లతలచే అలంకృతమై నవమేఘసమూహం చూచి మత్తెక్కి విజృంభించే నెమలిపురిలాగ వుంది. బిల్వఫలద్వయంతో శోభించే నీ ఱొమ్ములమీద పడివున్న తెల్లటి స్ఫటికమాలిక లేడిపిల్లల కనుల వైచిత్రమైత్రిని కలిగిస్తూన్నది. హోమాగ్ని వల్ల అంటుకున్న

మిణుగురులున్న నవపల్లవమౌంజిని ధరించిన నీతనువు లేదీగవలె ఎవరికి కుతూహలం కలిగించదు? నీవు అడుగులు మోపడంతో వెల్లివిరిసిన కాంతులతో భూమిపై నడుస్తున్న తామరతీగవలెవున్న నీ ప్రసన్నమైన తపోవనం ఎక్కడ? చెప్పు."

ఈ విధంగా లలనలంటే ఏమి తెలియక మాట్లాడుతూ వున్న ఆ మునికుమారుడు మృగస్వభావుడని ఆమె గ్రహించి, సిగ్గు వదలి, సంకోచ మేమీ లేకుండా, ఆభరణాలన్నీ ఊడ్చివేసింది. అప్పుడు ఆనందరసార్ద్ర చిత్తుడైన అతనితో ఆమె మృదుమధురవాక్కులతో "ఈ తపోవనానికి సమీపంలోనే నా ఆశ్రమం వుంది. అక్కడ తియ్యని పండ్లు, పూలు కొల్లలు" అని అంటూ, కర్పూరపరాగంతో గుమగుమలాడుతూ, మాధుర్యచమత్క్రియలతో శ్లేషమవుతూ, కలకండ పలుకులతో నవ్వుతూ, సత్కవిసూక్తులవలె వున్న మోదకాలు చూపుతూ ఊరించింది. ఆమె చవులూరించే మోదకాలతోను, చిత్తోత్సవాలైన ప్రేమమయ విలాసాలతోను, కర్ణామృతాలైన ప్రణయోక్తులతోను మృగాన్ని వాగురలాగ కట్టివేసి లాక్కుంది. "నీ గొప్ప తపోవనం చూపించు" అని అంటూ ఆమె భుజాలు చాచి గాఢంగా కౌగిలించుకోగానే, కనులు మూసుకొని ఆనందం అనుభవిస్తున్న అతనిని చూచి ఆమె "రా, ఇలా రా!" అని పిలిచింది. అతడు తనవెంట బయలుదేరగానే, ఆమె కొన్ని అడుగులు ముందుకు వేసి, వెళ్ళడానికి సిద్ధంగా వున్న రథం ఎక్కి, ఎక్కమని చేయి చూపుతూ అన్నది. రథానికి కట్టిన తురంగాలను చూచి మునికుమారుడు కురంగాలనుకుని, "నేను మృగీసుతుణ్ణి. మృగాలు కట్టిన దీనిని కాళ్ళతో అంటను" అని ఆమెతో అన్నాడు. రాజకుమారి చేసేదేమీ లేక మనోజవమైన రథంతో తన నగరానికి వెళ్ళి, మునికుమారుని మనస్సులో వహిస్తు, అతని చరితాన్ని రాజుకు విన్నవించింది. రాజు బలాత్కారంగా మునికుమారుణ్ణి తీసుకొనిరావడం వల్ల కృశానుసదృశుడైన మహర్షివల్ల ఏమి ప్రమాదం వాటిల్లుతుందో అని భయపడి, మంత్రులను పిలిపించి మరొక ఉపాయం ఆలోచించాడు. మరల విలాసవల్లి అయిన నళినిని ఋషికుమారుణ్ణి తీసుకొనిరావడానికి నావలమీద ఆశ్రమం సిద్ధపరచి(నావాశ్రమం సిద్ధపరచి) మందాకినీకూలంలోని అతని తపోవనానికి పంపాడు.

ఇలా వుండగా ఋష్యాశ్రమంలో ఋషికుమారుడు నృపాత్మజాధ్యానంతో మౌనం వహిస్తూ, అన్ని కృత్యాలూ మానివేసి, నూతనాభిలాషలతో వుండగా, తండ్రి చూచి విస్మితుడై కొయ్యబారిపోయాడు. "ఏమిటి, నాయనా, ఈ పరిస్థితి?" అని ప్రశ్నించాడు. ఆ మాటలకు మునికుమారుడు పెద్దగా ఎడతెగకుండా నిట్టూరుస్తూ, నిట్టూర్పులతో సమీపంలోని ఆశ్రమ లతాకుసుమ మంజరులకు పల్లవ లాస్యలీలను ఉపదేశిస్తూ ఇలా అన్నాడు: "తండ్రీ! మన తపోవనంలో నేనిప్పుడే చంద్రబింబవదనుడు, తన నయనకాంతులతో హరిణాంగనల దర్పం హరించేవాడు అయిన ఒక మహర్షి పుత్రుణ్ణి చూచాను. అతని రొమ్ము, నడుము, చేతులు, మెడ ఇంద్రధనుస్సువంటి విచిత్ర సూత్రాలతో మెరిసిపోతున్నాయి. తండ్రీ! నాకెందుకు అలాటి సూత్రాలు లేవు? అతని మాటలు ఇంకా నా హృదయంలోనే వున్నట్టున్నవి. వాటిలో శతాంశం కూడా నేను మామిడితోటలో కోకిలలవిగాని, తుమ్మెదలవిగాని పలుకులు ఎప్పుడూ వినలేదు. అతని దేహం మందాకినీ మజ్జనం వల్ల అంటుకున్న నురగవంటి సన్నని నూతన వల్కలంతో ఒప్పారుతున్నది. ఈ వల్కలం నాకిపుడు నచ్చడం లేదు. అతడు నా ముఖంపై ముఖం పెట్టి భుజాలతో నా దేహాన్ని చాలసేపు గట్టిగా కౌగలించుకొని, జపంతో ప్రకాశించే అధరోష్ఠం గలవాడై, హర్షామృత



స్పర్శవిశేషదీక్ష నాకు ఇచ్చాడు. సుందర విలక్షణుడైన అతనిని వదలి నాకీవనంలో ఒక్క క్షణమైనా శాంతి వుండదు. అతని వ్రతశాసనం వల్ల మోహసఖి అయిన నిద్ర కూడా నా కనులను తాకడం లేదు. నాకండ్లు అతన్ని చూడాలని కోరుతున్నాయి. అతని మాటలు విననిదే నా చెవులుండవు. అతని చింతతో నాబుద్ధి తపిస్తున్నది. ఈ దేహం మంత్రం తెలుసుకొనడం లేదు."

మహర్షి కాంతాహృతమానసుడైన పుత్రుని సంతాపచింతాసూచకమైన మాటలు, తపోవిఘ్నకరమైనవి విని, పతనభీతితో చాలసేపు ఈ విధంగా ఆలోచించాడు: "అయ్యో! ఈ అమాయకుడైన, మృగశాబకుడైన తపస్విని మన్మథుడనే కిరాతకుడు సుందరాంగన అనే వలలో కటాక్షకూటం నుంచి పడవేసి బంధించాడు." మహర్షి ఈ విధంగా ఆలోచించి, కామభుజంగుడు వదలిన విషయాభిలాషమనే విషంతో మనోవికారం పొందిన తనయుని వికారం పోగొట్టడానికి ఈ విధంగా అన్నాడు: "కుమార! ఆ మహర్షి పుత్రుడు ఉత్తముడు కాడు. ఆమె ఆడది; మన్మథుడనే పాముపుట్ట. ఆ పాముకాటుకు మూఢులందరూ తీవ్రతరమైన అనురాగవిషవ్యథనే పొందుతున్నారు. కాటుక అనే కాలకూటంతో తీక్ష్ణమైన తరుణీకటాక్షంతో కొట్టబడిన ప్రజలు సదోషులై యోషిద్భుజపాశబద్ధులై దుఃఖిస్తారు. సమ్మోహ మలీమసమైన సంసారమనే మేఘంలో వంకరటింకరగా మిలమిల మెరిసే కాంతలనే తటిత్తులు క్షణంలో నశించి, వియోగం వల్ల మానవులకు మరింత అంధకారం కలిగిస్తున్నారు. ఉద్రేకం కలిగించేవారు, ఉన్మాదమూర్ఛా వికారాలు కలిగించే విషలతలవంటివారు, మోహపిశాచికలు అయిన స్త్రీలు తాకితే బాగుపడినవాడు ఎవడు? వనితాకటాక్షాలనే సంతాపకరాలయిన వాడి ములుకులు మనస్సులో గుచ్చుకోక, సంతోషంతో విలసిల్లే తపోవనంలో నివసించే ఉత్తములే స్వస్థులు. ఏ వికారాలూ లేక ఆరోగ్యంగా ఉంటారు." ఈ విధంగా తండ్రి ఎంతో ప్రయత్నంతో ఎన్నో వివేక వాక్యాలు చెప్పి బోధించినా, మన్మథవికారయుతమైన లావణ్య పానం చేసి కైపెక్కిన ఋషికుమారునికి మత్తు దిగలేదు.

మరుసటిదినం ప్రాతఃకాలం మహర్షి కాలకృత్యాలు తీర్చుకొని సమిత్ఫలాలు తీసుకొని రావడానికి వనానికి వెళ్ళగా, ముని కుమారుణ్ణి మభ్యపెట్టడానికి విలాసాలతో రాజకన్యక మరల తపోవనానికి వచ్చింది. ఆమె దాసీజనం వెంటరాగా, పూచిన లతలాగ నవ్వులు విరజిమ్ముతూ సాకారుడైన నూతనానంగునివలె వున్న ఏకశృంగుని వద్దకు వచ్చి నతమస్తకురాలైంది. తర్వాత "నా ఆశ్రమం కల్పవల్లీ ఫలాలతో సుందరంగా దేవతలు నివసించడానికి యోగ్యమైంది. చూడటానికి రా" అని అంటూ ఆమె అతనిని గంగాతీరానికి పిలుచుకొని వెళ్ళింది. అక్కడ అతడు నావలపై కృత్రిమంగా కట్టిన ఆశ్రమం చూచాడు. అది రత్నోజ్జ్వలమైన చిత్రవిచిత్రమైన ఆకులతో, బంగారు పుష్ప ఫలాలతో సుందరంగా వుంది. దానిని చూచి మునికుమారుడు నిజమైన ఆశ్రమమనే భ్రాంతితో, హర్షంతో పాటు ఎక్కాడు. సంసారంతో సమానమైన ఆ కపటాశ్రమంలో గంగానదీ ప్రవాహం వెంబడిన అతడు తత్త్వం తెలియకపోయినా, అనురక్త భావంతో ప్రీతని పొందినట్టుగా వారాణసిని పొందాడు. మహదైశ్వర్యయుతమైన ఆ రాజధానిని చూచి, మునీంద్రులు కథలలో చెప్పిన స్వర్గాంగణమే కనిపించినట్టు భావించాడు.

పిదప రాజు, ప్రమోదకలితుడై శాస్త్రోక్తంగా వివాహవిధి జరిపి, అగ్నికి ప్రదక్షిణం చేయడం వల్ల ముత్యాలహారాలు కదులుతూ ముచ్చటగా వున్న తన కుమార్తెను అతనికి యిచ్చి, పూర్ణమనోరథుడయ్యాడు.

ఋషికుమారుడు నరేంద్రకన్య చేతిని పట్టుకొని వైవాహిక హవ్యం వేలుస్తూ, ఆ వైవాహికాగ్నినే అగ్నిహోత్రుని శ్రేష్ఠరూపంగా భావించాడు. రాజు వివాహమహోత్సవోత్సాహ రసపూర్ణుడై చనవుతో అతనికి సకలోపచారాలు చేశాడు. అతడు కొంతకాలం అక్కడే తపస్సంయుతుడుగా వుండి, భార్యతోపాటు తన తపోవనానికి వెళ్ళాడు.

భార్యతోపాటు వనంలో సంచరిస్తున్న తన పుత్రుని, అతన్ని పెంచిన తల్లి జింక చూచి, సంతోషంతో ముని ప్రసాదం వల్ల కలిగిన మనుష్య వాక్కులతో "ఈలలన నీకు ఎక్కడిది?" అని ప్రశ్నించింది. అతడు దానికి నమస్కరించి, చనవుతో, "అమ్మా! వీడు నా మిత్రుడు, కాంతివిరాజమానుడు. ఎంతో కష్టంతో అగ్నిసాక్షికమైన స్నేహంతో ఈ సుందరరూపుణ్ణి పొందగలిగాను" అన్నాడు. ఇలా అతడనగా, వివాహాది విషయాలేవీ తెలియని అమాయకుడు వీడని తల్లి జింక తెలుసుకొని, ఆమెను పతివ్రతలైన తపస్వినుల తపోవనానికి నెమ్మదిగా పిలుచుకొని వెళ్ళింది. "ఈమె నీ సహధర్మచారిణి. నీకీమె పత్ని; నీవీమె పతివి" అని వివాహ సమాచారమంతా వారు తెలుపగా, మునికుమారుడు విని జాయను ప్రియగానే తెలుసుకొన్నాడు. పెంపుడు తండ్రి కాశ్యపుడు కూడ సంతోషంతో అతనికి వివాహధర్మం గురించి ఉపదేశించగా, అతనికి నమస్కరించి, అతని మాటపై భార్యతోపాటు శ్వశుర గృహానికి వెళ్లాడు.

తర్వాత వృద్ధుడైన రాజు అతనికి పట్టం గట్టి, సత్త్వోజ్జ్వలమైన శాంతిపదం పొందాడు. పిదప ఏకశృంగుడు సామంత కిరీటకోటి విశ్రాంతపాదుడై అశేషభూమిని పాలించాడు. అతడు ఐశ్వర్యమోహంతో బుద్ధి చెడకుండా, ధర్మస్వభావంతో వివేకి అయి, ప్రజలను పాలిస్తూ, బహుపుత్రపౌత్రుడై వృద్ధాప్యంలో సన్యాసం స్వీకరించి శాంతిపథగామి అయాడు.

ఏకశృంగ మునికుమారుణ్ణి నేనే. నళినే యశోధర. ఇప్పటికీ, ఈమె జన్మాంతర వాసనతో నన్ను మోదకాలతో ఆవర్జించుకొనడానికి ప్రయత్నిస్తున్నది.

జినుడు నిజ జన్మాంతరకథను ఈ విధంగా వర్ణించగా, భిక్షువులందరూ విని, ఆశ్చర్యపడ్డారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ఏకశృంగావదానమనే అరవై అయిదవ పల్లవం

# 66. కవికుమారావదానం

పూర్వజన్మసరణి మానవునికి ఈ లోకంలో సహధర్మచారిణి. దేహాన్ని నీడలాగ వెన్నంటి వుంటుంది. ఎన్ని వందలసార్లు దేహం మారినా పోదు. ఎంత త్వరగా పరుగెత్తినా తెగిపోదు. దీన్ని దాటి పోవడం సాధ్యం కాదు.

దేవదత్తుడు రాయి విసరడం వల్ల, దానివల్ల తన కాలి బొటనవ్రేలికి దెబ్బ తగిలి రక్తం చిందడం చూసి దానికి గల కారణాలను భిక్షువులు అడుగగా భగవానుడు ఇలా అన్నాడు.

దుర్వారమైన వైరాన్ని జ్ఞాపకం కలిగించే కర్మవిపాకంతో నా కాలివేలికి దెబ్బతగిలింది.

పూర్వం పాంచాలదేశంలోని కాంపిల్యనగరంలో సత్యరతుడనే రాజు వుండేవాడు. అతడు ధర్మకర్మలకు సంశ్రయమన్నట్లు న్యాయంగా ప్రవర్తించేవాడు. అతనికి సులక్షణలక్షిత అయిన లక్షణ అనే భార్య ప్రజారక్షకమైన యజ్ఞంలో దక్షిణలాగ వుండేది. ఆమె దుర్దైవం వల్ల సంతానం లేకపోగా, భర్తను బలవంతం చేసి, విదేహ రాజపుత్రి అయిన సుధర్మ అనే దాన్ని పెండ్లి చేసింది. పెండ్లి చేసిన తర్వాత ఆమెకు (లక్షణకు) కుమారుడు పుట్టాడు. అందువల్ల ఊరికే సవతిపోరు కలిగినే అని ఆమె పశ్చాత్తాపం చెందింది. అతనికి అలోలమంత్రుడనే పేరు పెట్టారు. అతడు తండ్రికి ఎంతో ఇష్టుడుగా విద్యావినయసంపన్నుడై కళాశాస్త్రపారగుడయ్యాడు. ఇంతలో సుధర్మ గర్భవతి కాగా, రాజు మరణించాడు. సర్వకార్యాలలోను ప్రాణులకు స్థిరమైన ఆశలు వుంటాయి. కాని తనువు మాత్రం స్థిరంగా వుండదు.

రాజు మరణించిన పిదప, అతని స్థానంలో లక్షణాసుతుడైన అలోలమంత్రుణ్ణి మంత్రులు అభిషేకించారు. అతడు సామంత రాజులనే ఏనుగులకు కొత్త అంకుశంగా రాజ్యం పాలించసాగినాడు. అతనికి గోవిషాణుడనే మహామాత్యుడు ఇష్టుడుగా వుండేవాడు. అతని నీతి ఆవు కొమ్మువలె వంకరైంది; ఇతరులకు తెలిసేది కాదు. సుధర్మ ప్రసవ సమయం సమీపించగా, నిమిత్తజ్ఞుడైన పురోహితుడు ఆమె ప్రసవం రాజుకు గండమని అన్నాడు. అప్పుడు అలోలమంత్రుడు మహామంత్రి అయిన గోవిషాణుని మాట విని ఆమె ప్రసవించిన వెంటనే శిశువును చంపివేయవలసిందని అంతఃపుర రక్షకులను నియమించాడు. అది తెలిసిన సుధర్మ బ్రహ్మవలె స్వేచ్ఛగా పనులు జరిపించే మహామాత్యుణ్ణే శరణు వేడింది. ప్రభు భార్య అని అతడు కనికరించగా, ఆమె తన కుమారుని గుర్తు ఏర్పాటు చేసుకొని, అతనిని సెంబడివారి ఇంట్లో వదలి, అక్కడ పుట్టిన ఒక కన్యను రాజుకు చూపింది. రాజు అదే నిజమని నమ్మి నిమిత్తజ్ఞుని మాటను నమ్మలేకపోయాడు.

ఆ కుమారుడు కవికుమారుడనే పేరుతో పెరిగి పెద్దవాడై బుద్ధిమంతుడై అక్కడ ఇక్కడ విద్యలను, శిల్పకళా విశేషాలను నేర్చాడు. పిల్లలతో ఆటలాడుతూ, నగరాలు నిర్మించడం మొదలయిన రాజోచితక్రీడలు చేసేవాడు.

ఒకనాడు ఆ నిమిత్తజ్ఞుడైన పురోహితుడు అక్కడికి వచ్చి మహాభుజుడైన కవికుమారుణ్ణి చూచి, రాజువద్దకు వచ్చి భక్తితో "దేవ! నేను బెస్తవారింట్లో ఒక కుమారుణ్ణి చూచాను. అతడే రాజప్రాణాపహర్త అని నేను మొదట చెప్పినవాడు" అని అన్నాడు. ఆ మాటలు విని రాజు మండిపడి, తన సవతితల్లిని తిట్టి, మహామాత్యుడైన గోవిషాణుడిని పిలిపించి ఇలా అన్నాడు: "ఆహా! నాకు ప్రాణసంశయం కలిగినప్పుడు కూడా రాజ్యాబ్ధి కర్ణధారుడనైన నీవు గర్వంతో నౌకనులాగ రాజ్యలక్ష్మిని వదిలావు. నేను నీ బుద్ధిని నమ్మి సుఖంగా నిద్రపోయాను. ఆ బుద్ధి ఇప్పుడు నాకు ప్రాణ సందేహం కలిగించేది అయింది. నా సవతితల్లి తను రహస్యంగా కుమారుణ్ణి కని, కైవర్తులవద్ద వదలి, నా వద్ద వుంటూ నా రోజులు లెక్క పెడుతున్నది. ఇప్పటికైనా ఆ కుమారుణ్ణి వధించడానికి తగు ప్రయత్నం చేయి. ఇప్పుడు ఉపేక్షిస్తే గోటితో పోయేదానికి గొడ్డలి కూడా ప్రయోజనపడకపోతుంది. స్వామిని, రాష్ట్రాన్ని, అర్థాన్ని, దుర్గమిత్రబలాలను అమాత్య ప్రకృతి రక్షిస్తాడు గనుక రాజ్యాంగమైన అన్ని ప్రకృతులలోను గొప్ప. రాజుకుగల వ్యసనాన్ని శమింపజేయాలనే ధ్యానం గలిగి ఎప్పుడూ హితాన్నే జపిస్తూ, భక్తివ్రతులై అభిమత ఫలప్రాప్తితో తక్షణం సిద్ధిని ప్రదర్శించే శుచిచరిత్రోదారులైన మంత్రులు రాజులకు పుణ్యంతో లభిస్తారు. కనుక వెంటనే పెద్ద ఎత్తుతో ఈ కుమారుణ్ణి చంపించు. కాలాతీతమైన ప్రయత్నం కేవలం పశ్చాత్తాపానికి కారణమౌతుంది." ఈ విధంగా రాజు ఆజ్ఞాపించగా, పూర్వం ఉపేక్షించడం వల్ల సిగ్గుపడిన మహామాత్యుడు గజవాజిరథపదాతి సైన్యంతో కైవర్త ప్రాంతానికి వెళ్ళాడు.

ఈలోగా, సుధర్మ కూడా పుత్రుణ్ణి రహస్యంగా పిలిపించి రాజు ఆలోచనను తెలియపరచి "ఎక్కడికైనా వెళ్ళిపో నాయనా" అని కోరింది. పిదప అతనికి చూడామణిని ఇచ్చి పంపగా, అతడు తొందరగా వెళ్ళుతుండగా దూరం నుంచి మహామాత్యుడు చూచాడు. "వాడే రాజపుత్రుడు. తప్పదు, రహస్యంగా పరిగెత్తిపోతున్నాడు" అనుకొని, అతని వధకు సేనానాయకులను పంపాడు. అతడు జింకవలె పరుగెత్తుతూ, తనవెంట వస్తున్న వారిని తప్పించుకొని, చంపకమనే నాగరాజు నివాసస్థానమైన ఒక సరోవరంలో ప్రవేశించి మునిగాడు. కనిపిస్తూ కనిపిస్తూ, మాయమైపోయిన అతనిని వెదికి పట్టుకొనడానికి మహామాత్యుడు పదకుడనే గూఢచారిని వదలి ముందుకు సాగిపోయాడు. చూడామణి ప్రభావంతో సరోవర జలంలో స్తంభన క్రియతో దాగిన రాజకుమారుణ్ణి చూచి నాగరాజు చంపకుడు అతనికి ఆశ్రయమిచ్చాడు.

పదక గూఢచారి ఆ పరిసర ప్రాంతంలో అన్వేషిస్తూ, రాజచిహ్నాలతో వున్న అడుగుల గుర్తులు చూచి, నాగభవనంలో అతడు మునిగి వుంటాడని మహామాత్యునికి తెలిపాడు. మహామాత్యుడు తన సైన్యంతో నాగరాజు భవనమైన సరోవరం చుట్టూ ముట్టడివేసి, రాజాజ్ఞను ఫణీశ్వరునికి విన్నవించాడు. "ఓభుజగాధీశ్వరా! నీవు రాజాజ్ఞను వినకపోతే, నీ సరోవరాన్ని మట్టితో పూడ్పించివేస్తాను. రాజు కోపగిస్తే సరోవరం పూడ్పించి మెట్టగాను, మెట్టను పల్లంగాను చేస్తాడు. నీవు భుజంగీభోగవిచ్ఛేదం (భుజగస్త్రీల సుఖవిచ్ఛేదాన్ని, భుజగ స్త్రీల పడగల విచ్ఛేదాన్ని) కోరకపోతే, రాజరాజుకు శత్రువయిన రాజపుత్రుణ్ణి వదలిపెట్టు." మహామాత్యుడు ఈ విధంగా బెదరించగా, ఫణిరాజు భయంతో రాత్రి కాగానే రాజుతనయుని వదలిపెట్టాడు. ప్రాణులను భయంతో శాసించవచ్చుగదా!

రాజపుత్రుడు సరోవరం నుంచి వెలుపలికి వచ్చి, ఒక రజకుని యింట్లో దాక్కున్నాడు. అది పదక గూఢచారి అడుగుల జాడతో గ్రహించి, ఆ మహామాత్యునికి తెలియజేశాడు. ఆ మహామాత్యుడు



ఆ రజకుని యింటికి రాజకుమారునికోసం రాగా, రజకుడు భయపడి, గుడ్డల మూటలో రాజకుమారుణ్ణి కట్టి సరోవరం మరొక గట్టున వదలిపెట్టాడు. అక్కడ కూడ గోవిషాణుడు పాద ముద్రలను గుర్తుపట్టి పెద్ద సైన్యంతో దారులన్నిటినీ అడ్డగించగా, రాజకుమారడు అక్కడి కుమ్మరివారిని శరణు పొందాడు. వారు అతనిని పూలమాలలతో కప్పి, మరణించాడని ఏడుస్తూ, మహామాత్యునికి తెలియకుండా నిర్జన ప్రదేశంలో వదలిపెట్టి వచ్చారు. అక్కడినుంచి రాజపుత్రుడు మహాజనంతో వెళ్ళుతుండగా మహామాత్యుడు ఇది గ్రహించి వెంబడించాడు. తన కర్మవలె తనను అనుసరిస్తూ, అన్వేషణ శ్రమంతో కోపోద్రిక్తుడైన మహామాత్యుని చూచి వేగంగా దారీడొంకా తెలియక పరుగెత్తుతూ, ఎండిన చెట్లు, తీగలూ వున్న ఒక లోయలో పడిపోయాడు. అతని చూడామణిమాత్రం పైన ఎండు కొమ్మలలో ఇరుక్కుంది. దానిని మహామాత్యుడు తీసుకొని రాజు దగ్గరికి వెళ్ళి దానిని అప్పగించాడు.

రాజకుమారుడు ఆ పాతాళ బిలంవంటి లోయలో పడగానే అంజనుడనే అక్కడి యక్షుడు అతనిని రక్షించాడు. కనుక అతడు భూమి మీద పడినా, పక్షిలాగ వాలాడేగాని, మరణించలేదు. తన కుమారుని మరణవార్త విని సుధర్మ ఆత్మహత్య చేసుకోవడానికి ప్రయత్నించగా, "నీ కుమారుడు జీవించివున్నాడు." అని చెప్పి ఒక దివ్యస్త్రీ ఆమెను రక్షించింది. రాజకుమారుడు ఘోర క్రూరమృగ సంచారము, ఏనుగు రక్తం తాగి మదించిన పులులు గలది ఆయిన అరణ్యంలో ప్రవేశించాడు. అక్కడ పింగళకుడనే వ్యాధుడు దారి చూపగా వెళ్ళుతూ, దారిలో తెగిన శరీరంగల ఒక మనిషిని చూచాడు. ఆ మనిషి రాజకుమారునితో "కుమార! ఇక్కడికి సమీపంలో భయంకర కృత్యాలు చేసే ఒక చండాలుడున్నాడు. వాడు ఈ దారిని వచ్చినవారినందరినీ చంపుతాడు. వాని పేరు సుదాసుడు. వాని చేష్టలు సహించరానివి. వాడికి శంఖముఖమనే ఒక కుక్క వుంది. అది బాటసారుల ఎముకలను నమిలి నమిలి దిక్కులకు చల్లుతుంది. ఇదిగో! ఇక్కడంతా వ్యాపించిన ఎముకలన్నీ ఆ కుక్క విసిరివేసినవే. దాని బారిన పడిన నాకు దేహం తెగి ఈ విధమైన మర్మ భేదకమైన వ్యథ కలిగింది. ఇక నా ప్రాణాలు మూహూర్త మాత్రం నిలుస్తాయి. శంఖముఖ శునకం గొంతు తెంపిన పాంథుల రక్తాన్ని మధ్యాహ్నం ఎండకు బడలిన చండాలుడు త్రాగుతాడు" అని అన్నాడు. ఈ మాటలు విని రాజపుత్రుడు "నిరాయుధుణ్ణి. ఏమి చేయగలను?" అని వ్యథిత హృదయంతో ధ్యానం చేశాడు.

ఇంతలోగా భయంకరమైన కోదండం ధరించిన చండాలుడు రానే వచ్చాడు. అతని చూపులు ఎర్రగా భయానకంగా వున్నాయి. వాటిని చూడగా, వరాహరక్తం కాలువలు కట్టిస్తున్నట్టు ఉన్నాయి. వాని పక్కనే రంపంవంటి పండ్లతో కుక్క కూడ కనిపించింది. దాని కాలి గోళ్ళనుంచి అప్పుడే ఎవరినో చీల్చగా అంటిన రక్తం భూమిపైన బొట్లు పెడుతున్నది. అది కురంగాలకు అంగభంగం, చమరీ మృగాలకు కంఠగ్రహం, నక్కలకు కులవ్యాధి, వరహాలకు క్షయజ్వరం, మాతంగ పక్షపాతి అయిన బ్రహ్మ నిర్మించిన కార్యదర్పంలాగ, సింహాలకు ఆయాసంలాగ వున్నది. పాంథుల వధువులకు వైధవ్యం కలిగించే ఆ కుక్క హుంకార ఘుర్ఘురారావాలకు ఖడ్గమృగాలు, ఆవులు పరుగెత్తేవి. చండాలుని సైగతో పరుగెత్తివస్తున్న ఆ కుక్కను చూచి రాజకుమారుడు భయంతో ఒక ఉసిరిక చెట్టును ఎక్కాడు. రాజకుమారుడు చెట్టు ఎక్కడం చూచి, ఆకర్ణాకృష్టసాయకుడైన చండాలుడు కుక్కను తీవ్రమైన మాటలతో ఉసిగొల్పాడు. పొడిచేటట్లు క్రూరమైన చూపులు బాణాలలాగ, కుక్క కోరలలాగ తీక్ష్ణమైన మాటలు అంటూ,

విసరుతున్న ఆ చండాలుణ్ణి చూచి రాజకుమారుడు ఇలా ఆలోచించాడు. "అయ్యో! రాజరాజుతో ఉత్సాహంతో యుద్ధంలో పోరదగిన నా దేహం నిరాయుధం కావడం వల్ల ఈ విధంగా నశించడం బ్రహ్మ వ్రాసిపెట్టాడు. అకారణ శత్రువైన ఈ దుర్జనుడు స్నేహంతోగాని, దానంతోగాని, మానంతోగాని, గుణంతోగాని నావాడు కాలేడు. వీనికోసం ముందు నరకం సిద్ధపరచబడిందని నరకంకాళ మలినాలైన ఈ వనభూములే అంటున్నాయి. నేను క్షత్రశిరోమణి అయిన రాజచంద్రుని వంశంలో పుట్టడమేమిటి? కుక్కతోనో, చండాల పుత్రునితోనో నిరాయుధుడుగా మరణించడమేమిటి? కనుక జన్మాంతం వరకు నిశ్చలంగా వుంటూ, పురుషార్థాలకు ప్రతికూలంగా వుండే పురాకృతకర్మకు నమస్కారం. దుర్మార్గులు లోపాలను చూడరు; గుణాలను చూడరు. కనుక అలాటి వారిమధ్య స్వకులచంద్రునివంటివాడు సర్వోన్నతితో జన్మించనే జన్మించరాదు. అలాటివానిలోని చిన్న లోపాన్ని గూడ దోషాలపుట్ట అయిన లోకం పెద్దదిగా చూపుతుంది. కనుక జన్మే అనవసరం." ఈ విధంగా ఆలోచిస్తున్న అతనికి శరీరక్షయంకంటే మానక్షయమే హెచ్చుగా తోచింది.

ఇలా ఉండగా, మాఠరుడనే విద్యాధరముని దివ్యదృష్టితో అతని తీవ్రక్లేశమయ దశను తెలుసుకుని, ఆకాశమార్గంలో విచ్చుకత్తితో ఆకాశానికి ఖడ్గానికీ ఒకేవిధమైన మైత్రిని కలిగిస్తున్నట్టు వచ్చి, క్రోధ క్రూరతర దృష్టితో చండాలసూనుని శిరస్సును, శంఖముఖ శునకం తలను నరికివేసి, రాజపుత్రుని రక్షించి, తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి, ఊరట కలిగించి, మాయావిద్యలను, మహాద్భుత శక్తులను ఉపదేశించాడు. తర్వాత కొంతకాలానికి రాజకుమారుడు శత్రుజిగీషతో మునివద్ద సెలవు తీసుకొని, కాంపిల్యనగరం చేరాడు.

అక్కడ రాజకుమారుడు తన మాయావిద్యతో రతిసుందరమైన నర్తకీరూపం కల్పించి, లలితమైన అభినయాలతో పౌరులను సంతోషపెట్టాడు. అతని నృత్తవాద్యకౌశలం రాజు చెవులవరకు వెళ్ళింది. రాజు నాట్యం చూడటానికి అమాత్యసహితుడై నాట్య మండపానికి వచ్చాడు. అక్కడ అమృతాహరణానికి వచ్చిన కైశికీలీలాలలితమైన మోహినీ రూపాన్ని చూశాడు. ఆ మోహిని నూతన సౌందర్యం రాజు చూచి, శృంగారరసాస్వాదనమత్తుడై ప్రధానమంత్రితో ఇలా అన్నాడు. "ఆహా! చిత్రాభినయశాలిని, సంపూర్ణ లావణ్య అయిన ఈ వరగాత్రి దేహం నా మనస్సును హరిస్తున్నది. ఈమె స్వర్గరంగవిలాసిని అయిన మేనక. నిజం. లేకపోతే నూతన నేపథ్యంతో ఇంత సుందరమైన ఆకృతి ఎలా వస్తుంది? ఈమె నాట్యం నా మనస్సును ఎంతో ఆకర్షింపజేస్తున్నది. భవ్యతరస్వభావరచనా వైచిత్రీక్రమంతో ఉన్న భావాలు ఆస్వాదించదగిన రసాన్ని అతి సంగతంగా నిష్పన్నం చేస్తున్నవి. నిష్పన్నమైన రసం ధ్రువాగీతులతో ఎంతో అలరింపజేస్తున్నది. దానికి తగినట్టు మురజ మూర్ఛనల ధ్వని రంజింపజేస్తున్నది. వాచకం చెబుతున్నపుడు ఈమె మాట వీణాస్వనాన్ని వెల్లివిరియజేస్తున్నది. మేఖల సత్త్వవ్యక్తి విభక్తికంపంతో తరలితమై తాళోన్ముఖంగా వుంది. ఆహార్యం అహార్యమైన రుచిరత్వం కలిగిస్తున్నది. సౌందర్య రేఖాసఖి అయిన భ్రూలత లాస్యవిలాసంతో శిష్యరికం చేస్తున్నట్టుంది." ఈ విధంగా ఆ నర్తకి ముఖపద్మంపై చూపులు పెట్టేసిన భూపతిలో ముఖస్వేదసిక్తమైన మదనపాదపం పుట్టుకొని వచ్చింది. అతడు సాయంకాలం రత్నాలతో నిండిన పారితోషికం ఆమెకిచ్చి, అంతఃపురంలో ప్రవేశించి, ఆమెనే ధ్యానిస్తూ గడిపాడు. అసత్యరూప అయిన ఆ కూటకామిని సంసారమాయలాగ ఆ మహీపతికి మోహం కలిగించింది.



మదనాతురుడైన ఆ రాజు ఆ కూటకామినిని తన భవనానికి పిలిపించుకున్నాడు. మరణాసన్నులు పరిణామ విరోధములైన విషయాలనే కోరుకుంటారు గదా! యశః పుష్పసముదాయం కలవారు, త్రివర్గఫలశాలులు అయిన నృపవృక్షాలకు ఇంద్రియ అనిగ్రహం పరశువు వంటిది. తన మదజలానికి భృంగాలు చుట్టుముట్టి ఝుంకారం చేస్తుండగా స్వేచ్ఛగా తిరుగుతున్న గజనాథుడు తనను కట్టివేయడానికి వచ్చిందని తెలియక పిడియేనుగు మోహంలో పడి గాఢానురాగ వివశం కావడం వల్ల కదా తనను పట్టడానికి తవ్విన గుంతలో పడుతుంది. దాని వ్యామోహంలో పడకపోతే ఎందుకు పడతుంది? ఈవిధంగానే రాజు మనసెరిగి ప్రవర్తించే చేటకులు ఆ మాయామోహినిని నాశనం కోసమే అంతఃపురానికి తీసుకొని వచ్చారు. ఏకాంతంలో గాఢాభిలాషతో ధైర్యం కోల్పోయిన ఆ రాజును కాలుడు కాంతారూపంలో గొంతు పట్టుకున్నాడు. కౌగలించుకున్నాడు. రాజు తనకు దీర్ఘనిద్ర సమీపిస్తున్నదని తెలియక పందిరి మంచమెక్కి ఆతురత పడుతండగా, రాజకుమారుడు కాంతారూపం వెంటనే వదలి ఇలా అన్నాడు. "రాజా! నీవు ఎలాటివాడివి? భోగలుబ్ధుడివై భాతృస్నేహాన్ని కూడ లెక్కచేయక భ్రాతతో సహభోగ్యమైన ఈ రాజ్యం ఒంటిగా ఎలా అనుభవిస్తున్నావు? నేను నిర్దోషిని. అలాంటి నన్ను విషమమైన క్లేశ జలధిలో పడవేశావు. నేను స్వరయోగం వల్ల ఆ క్లేషజలధిని దాటి నీకు ప్రతీకారం చేయడానికి ఈ యెత్తు వేశాను."

రాజకుమారుడు ఈ విధంగా అని రాజును బంధించివేసి, రాజ్యం ఆక్రమించుకొని, ఆశపడేవారిని డబ్బుతోను, ఇతర విధాలుగాను, ప్రజలను సమాధానపెట్టాడు. రాజును బంధించినా కవికుమారునికి కసి తీరలేదు; తన పరాభవం సంగతే ఆలోచిస్తూ, కోపంతో నిష్కరుణుడై ఉదయం కాగానే రాజును బండరాయి పడవేసి చంపించాడు. పిదప భాతృవధతో రక్తసిక్తమైనట్టున్న రాజ్యం అనుభవించి అంతంలో - ప్రాణనిష్క్రమణాంతంలో - నరకం పొందాడు.

ఆ కవికుమారుణ్ణి నేనే. వెయ్యేండ్లు ఆ కర్మపాతకం అనుభవించి, పాపం క్షీణించినవాడనైనప్పటికీ ఇప్పుడు కాలి బొటనవ్రేలికి రాయి తగిలించుకొన్నాను. ఈ కర్మ శేషమనేది మానవుడు నిరంతర జన్మావర్తంలో కొట్టుకుంటూ, స్థలజలతరుపాషాణగర్భంలో ఏరూపంలో ఉన్నా కల్పాంతాలవరకూ కూడా వదలదు. ఆయా రసపరికరాలతో పాటు ఆయా కాయపాత్రలలో అనుభవించవలసిందేను.

ఈ విధంగా భగవానుడు చెప్పిన అన్యజన్మచరితాన్ని సర్వ భిక్షువులు విని, కర్మ సంతతి అలంఘ్యమని భావించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కవికుమారావదానమనే అర్వై ఆరవ పల్లవం

# 67. సంఘరక్షితావదానం

సద్ధర్మాన్నే సంబోధిస్తూ, జ్ఞానోదగ్రమైన గురూపదేశ మహిమతో ప్రభావం పొంది, బహుతర క్లేశయుతమూ, ఉగ్రసంతాపకారీ అయిన ఈ సంసారమనే విస్తృతమరుమార్గాన్ని ఇంటిముంగిటి ఆటలలాగ లంఘించే పరిపూర్ణ పుణ్యనిధులైనవారు ధన్యులు.

పూర్వం శ్రావస్తిలో బుద్ధరక్షితుడనే గృహపతి ఉండేవాడు. ఆయన సంపదలు అర్థిసార్థానికి ఉపయోగపడినకొద్దీ గొప్పవయేవి. ప్రసన్న మనోవృత్తి అయిన అతనికి సారిపుత్రభిక్షువు కుశలమార్గోపదేశం చేశాడు. ఆ గృహపతికి సంఘరక్షితుడనే కుమారుడు ఉండేవాడు. అతడు సదాచార సంపన్నుడు, సర్వవిద్యా విచక్షణుడు, సంపూర్ణగుణ లక్షణుడు. ఒకమారు సారిపుత్రుడు ఇంటికి వచ్చినపుడు బుద్ధరక్షితుడు కుమారుడైన సంఘరక్షితుని చూచి "పుత్ర! నీవు నీ తల్లిగర్భంలో వున్నప్పుడే 'కుమారుడు పుడితే సారిపుత్రభిక్షువుకు ఉపస్థాపకుణ్ణి చేస్తాను' అని మొక్కుకున్నాను. ఇప్పుడు నీవు నా మాటలను నిజం చేయాలి. తండ్రిని ఋణవిముక్తుని చేసే పుత్రులు పుణ్యవశాత్తు పుడతారు" అని అన్నాడు. కుమారుడు ఆ మాటలకు చాల సంతోషించి సారిపుత్రుని వెంట వెళ్ళి, అతనికి పరిచర్యాపరుడుగా అయ్యాడు. సారిపుత్రుడు అతనికి ప్రవ్రజ్యాదీక్ష ఇచ్చి, సముదాచారం ప్రకారం విద్యాభ్యాసం చేయించి, ధర్మాగమ చతుష్టయమంతా ఉపదేశించాడు.

ఇలా ఉండగా ఒకమారు అతని మిత్రులు, కులస్థులు ఐన ఐదు వందలమంది వణిక్కులు సముద్రయానం చేయదలచి ఆతనిని కూడా వెంటరమ్మని అభ్యర్థించారు. వారి కుశలం కోరేవాడు గనుక, వారి మాట కాదనలేక సంఘరక్షితుడు భయం కలిగినప్పుడు ధైర్యం కలిగించే శాసనాన్ని గురువునుంచి గ్రహించి వారితోపాటు ఓడ యెక్కాడు. ఓడ దురదృష్టవశాత్తు సముద్రమధ్యంలో చిక్కుకొని, ఎటూ కదలకుండా నిలబడిపోయింది. అప్పుడు సముద్రగర్భం నుంచి "మీ ఓడ కదిలి ముందుకు సాగాలంటే వెంటనే సంఘరక్షితుణ్ణి సముద్రంలో తోసి వేయండి." అనే మాటలు వెలువడ్డాయి. ఆ మాటలు వణిక్కులు ఐదువందలమందీ విన్నారు. ఆ ప్రాణసందేహ సమయంలోను "మనకు మరణమైనా మంచిదేకాని, సాధుపుంగవుడైన మిత్రుని వధమాత్రం చేయవద్దు" అని అందరూ ఏకమతితో ఉన్నారు. కాని సంఘరక్షితుడు మాత్రం ఈ ప్రాణసంకట సమయంలో వారిని రక్షించగోరి తానే ఆ క్షుబ్ధాబ్ధిలో పడిపోయాడు. నీళ్ళలోనుంచి నాగలోకానికి వెళ్ళి, నాగులతో కలిసి ఉండి, పూర్వసంబుద్ధవృద్ధచైత్యానికి అభివందనం చేసి, చూచినా, ఊపిరి వదలినా, తాకినా, కరచినా, విషం కక్కే ఆ నాగుల మధ్యనే చింతతో కృశిస్తూ కాలం గడుపుతూ, వారికి చిరాభిమతమ్మైన ధర్మోపదేశం చేశాడు. కాని, అతనికి అక్కడ వుండడం సుతరామూ గిట్టలేదు. స్వదేశానికి వెళ్ళాలనే ఉద్వేగం ఎక్కువైంది. అప్పుడు ఆ నాగులే అతనిని పైకి తీసుకొని వచ్చి క్షణంలో ఆ వణిక్కుల ఓడలో చేర్చారు. ఆ వణిక్కులు కూడా



సంఘరక్షితుడు పరలోకం నుచి తిరిగి వచ్చినట్టుగా సంతోషించి, తమ ఓడను మళ్ళించుకొని మహోదధితీరం చేరారు. కాని తమతమ ఇండ్లు చేరుకుందామనే తొందరలో వున్న ఆ వణిక్కులు సముద్రతీరంలో ఇసుకతిప్పపై నిద్రపోతున్న సంఘరక్షితుణ్ణి మరచిపోయారు.

వణిక్కులందరూ వెళ్ళిపోయారు. చీకటి పడింది. తెల్లవారింది. సంఘరక్షితుడు మేల్కొన్నాడు. చుట్టూ చూచాడు. దిక్కులు విజనంగా ఉన్నాయి. మిత్రులు వదలిపెట్టి వెళ్ళినందుకు అతనికి చాలా విషాదం కలిగింది. "అయ్యో! సుహృద్బంధు సమాగమాలు గంధర్వనగర సదృశమైనవి; ఇట్టే కనిపించి అట్టే మాయమవుతుంటాయి. అయినా ప్రాణికి వియోగ సమయంలో ఆశలు కలిగించి మోహింపజేస్తాయి. పరప్రియ సమాగమాలు తరుణశ ఫరీపుచ్ఛం వలె చంచలమైనవి. అయినా, ఆస్థను, ఈ సంబంధం స్థిరమైనది సుమా అనే స్థితిని, బంధాన్ని కలిగిస్తాయి. జీవి స్వజనమేమీ లేకనే గర్భంలో వుంటాడు; అలాగే ఎవరూ వెంటరాకనే మరణిస్తాడు. వెంట వచ్చేవి ఒక్క శుభాశుభ కర్మలే' అని అనుకుంటూ, విషమ మార్గంలో ధైర్యంతో వెళ్ళుతూ, జనులచింతవలె అనంతమైన శాలారణ్యం ప్రవేశించాడు.

ఆ అరణ్యంలో మూర్తీభవించిన కుతూహలమా అన్నట్టు రత్నప్రాసాదం, మహావిహారం చూచాడు. ఆ విహారంలో పరచిన ఆసనాలపైన, పర్యంకాలపైన రుచిరమైన చీవరవస్త్రాలతో, చెక్కుచెదరని శమగుణంతో ఉన్న భిక్షుసంఘాన్ని చూచాడు. అక్కడి భిక్షువులు ఆతిథ్యం ఇవ్వగా స్వీకరించి, ఆసనంపై కూర్చుని, భోజనాదులు కూడ పొంది విశ్రాంతి తీసుకున్నాడు. ఇంతలో భిక్షువులకు భోజన సమయం అయింది. చూస్తుండగానే భిక్షువుల పాత్రలన్నీ లావుపాటి ముద్గరాలుగా మారిపోయాయి. విహారం అంతర్ధానమైపోయింది. వారు ఆ మహాముద్గరాలు పట్టుకొని, పరస్పరం తలలు పగులగొట్టుకొని, భూమిని రక్తసిక్తం చేశారు. ఇంతలో భోజనకాలం అయిపోయింది. యథాప్రకారం విహారం మొలచుకొని వచ్చింది. మరల మునపటిలాగే భిక్షువులందరూ, ప్రశమాన్వితులుగా ఉన్నారు.

ఈ ఆశ్చర్యకరమైన సంగతిని చూచి సంఘరక్షితుడు తన వెరగుపాటు దాచుకోలేక భోజనసమయంలో మీకీ కలహమేమిటి?" అని భిక్షువులను ప్రశ్నించాడు. వారు ఏమన్నారంటే "పూర్వజన్మలో మేము విహారంలో భోజన సమయంలో యుద్ధం చేశాము. ఆ కర్మ ఫలమే యిది. కొందరు భిక్షువులు వచ్చారు. భిక్షువులమైన మేము వారికి భోజనసమయంలో అజ్ఞానంతో విఘ్నం చేశాము" అని. అది విని సంఘరక్షితుడు భిక్షువులతో కిటకిటలాడే మరొక విహారం చూచాడు. అదీ భోజనసమయంలో కాలిపోయి, కొంతసేపటికి మరల పుట్టింది. అది చూచి అతడు మరల ఆ విహార దాహకారణమేమిటని ప్రశ్నించాడు. "పూర్వజన్మలో భిక్షువులమైన మేము భిక్షువులపై మత్సరంతో విహారం కాల్చివేశాము. కనుకనే ఇప్పుడీగతి" అని వారు సమాధానం చెప్పారు. అది విని సంఘరక్షితుడు అక్కడినుంచి బయలుదేరి మరొకచోట స్తంభకుశహాలాకారులు, చీపురుకట్ట, పగ్గం వంటివారు. మంచం, రోలువలె లావుగా ఉన్నవారు, రెండుగా చీలిన దారపు పోగులాగ వున్నవారు అయిన జీవులను చూచాడు. వారంతా నిద్రలో చైతన్యంలేక పడి వున్నారు. అతడు వారిని చూస్తూనే వెళ్ళుతూ ఒక పుణ్య తపోవనం చేరాడు. అక్కడ ఐదువందలమంది మునులు తీవ్రంగా తపస్సు చేస్తున్నారు. వారు అతనిని దూరంనుంచే చూచి, "ఇతనికి మనలో స్థానం యివ్వరాదు. మంచి మాట కూడ పలుకరాదు." అని తమలో తాము నిశ్చయం చేసుకొన్నారు. "శాక్యశిష్యుడు స్వభావతః మాటకారి. కనుక గౌరవించతగినవాడు కాడు" అనిన్నీ

వారు అనుకొని, మౌనంతో ఉండిపోయారు. అక్కడివారు ఆశ్రయం యివ్వనందున రాత్రి కాగానే ముకుళించిన పంకజంలో చిక్కుకుని తిరిగే భృంగంలాగ అతడు అటూ ఇటూ తిరిగాడు. కొంతసేపటికి ఒక్క ముని అతని బసకు ఒక శూన్య కుటీరాన్ని అప్పగించాడు. "నీవు రాత్రి మౌనంగా వుండాలి" అని షరతు కూడా పెట్టాడు.

ఆతిథ్యం లేక, పడుకుని రాత్రి గడుపుతున్న అతని వద్దకు ఆశ్రమ దేవత నెమ్మదిగా వచ్చి "ఓ సాధూ! లెమ్ము. సౌజన్యంతో నాకు ధర్మోపదేశం చేయి. నీవు సద్ధర్మవాదులలో అగ్రగణ్యుడవని నా నమ్మకం" అని ప్రార్థించింది. "తల్లీ! నేను మౌనంగా వుంటానని సమయం చేశాను. అందువల్లనే నాకు ఆశ్రయం దొరికింది. నీవు నన్ను వెళ్ళగొట్టించడానికే ఎవరో పంపగా వచ్చినట్లున్నావు. నేను మాటతప్పితే నాకు ఆశ్రయం ఇచ్చిన ముని నన్ను వెళ్ళగొడుతాడు" అని సన్న గొంతుతో చనువుతో అన్నాడు. కాని, ఆ దేవత చనువుతో పలుమారు కోరడం వల్ల బ్రాహ్మణానుమతమైన ధర్మం చెప్పడానికి ప్రారంభించాడు. "వ్రతాలేవీ తనువును శోధించే సాధనాలు కావు. విజనమైన తపోవనాలేవీ పావనమైనవి కావు. జటాజినపరిగ్రహా దుర్గ్రహులైన మానవుల స్పృహాపరిచితమైన మనస్సును ఇవన్నీ పరిశోధిస్తాయి. కోతులు వనాలలో ఉంటూ పండ్లే తింటాయి. అయినా ముక్తి పొందలేదే? చెట్లు వల్కలాలు, పలాశాలు, జటల సటలు ధరిస్తున్నాయి. అయినా ముక్తి పొందలేదు. తీర్థాలలో తిమింగలాలు నీటినే ప్రేమిస్తూ మునిగివుంటాయి. అయినా ముక్తిని పొందాయా? ప్రశమం లేని వారికే ఈ మిథ్యాతపఃపరికరమంతా. బూడిదతో తెల్లనైన ఏనుగులు గాని, గాలే మేసే పన్నగాలు గాని, వనవాసమే వ్యసనంగా ఉండే మృగాలు గాని, పండ్లే తినే చిలుకలుగాని, దిగంబరులుగా తిరిగే అటవికులుగాని విషయ స్పృహను వదలనిదే శాంతిని పొందారా?" అని అతడు ఉపదేశించాడు.

ఆ ఉపదేశం విని మునులు కూడ ఆశ్చర్యపడ్డారు. ఆదరంతో అతని చుట్టూ మూగారు. అది చూచి అతడు "ఈ పరిషత్తు సంసారంలోనే కొట్టుకొంటున్నది. వృథాగా వ్రతసంతాపసంతతక్లేశం అనుభవిస్తున్నది. మానవులకు అవిద్య, సంస్కారము, విజ్ఞానము, నామరూపం, షడాయతనం సంస్పర్శము, వేదన, తృష్ణ, ఉపాదానము, భవము, జాతి, జరా మరణ దుర్గతి - ఈ దుఃఖమయమైన స్కంధం పెరుగుతూనే వుంటుంది. వీటన్నిటినీ ప్రశాంతులైన మనీషులు క్రమంగా నిరోధించగా ఇవి లయమవుతాయి" అని మనస్సులో ఆలోచించి వారికి ఆ విధమైన సద్ధర్మమే ఉపదేశించి ఇంకా యిలా అన్నాడు. "మైత్రితో పవిత్రమైన మనస్సు కలవారు, సద్ధర్మవిశుద్ధమైన జీవితం కలవారు అయిన ఉన్నతులకు జన్మ ప్రశమోచితమూ, స్పృహణీయమూ, అశోచ్యమూ అవుతుంది. భూమిమీద, ఆకాశంలోను, నాగలోకంలోనూ ఉన్న ప్రాణులందరినీ నేను మిత్రులుగా, ప్రణయంతో కోరేదేమిటంటే- హృదయం మైత్రీపాత్రం చేయండి. ధర్మబుద్ధిని పొందండి. విషమమైన అంధకారంలో ధర్మం కంటే మరొక దీపం లేదు." ఈ విధంగా ఉపదేశించి, ఒక వృక్షమూలంలో పర్యంకబంధనంలో ఉపవిష్టుడై ఋజుప్రకాశమైన అర్హత్వాన్ని సాక్షాత్కరింపజేశాడు. ఆ మునులు అతనిని చూచి, "భదంత, మమ్మల్నందరినీ శాక్యముని వద్దకు తీసుకొని వెళ్ళు. నీవు ధర్మవినయం ఉపదేశించగా విని, ప్రవ్రజ్య స్వీకరించగోరుతున్నాము" అని ప్రార్థించారు.



ఈ విధంగా వారందరూ తన నారచీర అంచులు పట్టుకొని వ్రేలాడుతూ ప్రార్థించగా మహాబుద్ధిసంపన్నుడైన సంఘరక్షితుడు వారినందరినీ వెంటబెట్టుకొని, ఆకాశమార్గంలో శాస్త అయిన బుద్ధభగవానుని సన్నిధికి వచ్చి, ఆయన పాదనళినద్వయం శిరస్సుతో నమస్కరించి, ఆనందంతో విషయమంతా నివేదించాడు. భగవానుడు ప్రణయ ప్రీతితోను, అతని అభ్యర్థనతోను ఆ మునులకు మనఃప్రసాదకరమైన ఉపదేశం చేశాడు; వారున్నూ భగవానుని ప్రసాదంతో ప్రశమం పొంది, సర్వక్లేశహరమైన అర్హత్వస్థితిని సంపాదించారు.

వారు వెళ్ళిన తరువాత సంఘరక్షితుడు వినయంతో "భగవన్, స్తంభకుడ్యాదిస్వరూపులు, పుష్పఫలసదృశులు, రజ్జువు వంటివారు, తంతువులే మిగిలినవారు - ఇలా వివిధ స్వరూపాల ప్రాణులు నాకు దారిలో కనిపించారు. ఆ ప్రాణులకు ఆ స్థితి ఏ కర్మ ఫలం?" అని ప్రశ్నించాడు. సర్వజ్ఞుడు ఇలా సమాధానం చెప్పాడు. "పూర్వం వారంతా కాశ్యపుడనే శాస్తకు శ్రావకులు. సంఘమందిరం స్తంభాలను, గోడలను వారు ఉమ్మితోను, చీమిడితోను అపవిత్రం చేశారు. మరికొందరు సంఘవృక్షాల ఫలపుష్పాలను దొంగతనంగా అనుభవించారు. మరికొందరు భిక్షువుల భోజనపానాలకు ద్వేషంతో విఘ్నం కలిగించారు. వారు తత్కర్మవిపాకంతో ఆ ఆకారం పొందారు." ఈ మాటలు విని సంఘరక్షితుడు కర్మఫలానికి ఆశ్చర్యపడ్డాడు.

తర్వాత భిక్షువులు సంఘరక్షితుడు అర్హత్పదం పొందడం చూచి, "**అలా అర్హత్పదం** పొందడానికి పూర్వజన్మలో అతడు ఏ కర్మ చేశాడు?" అని ప్రశ్నించగా, భగవానుడు **ఇలా తెలిపాడు**. "ఇతడు పూర్వం కాశ్యపుడనే శాస్త శాసనంతో ప్రవ్రజ్య స్వీకరించి, విహారంలో సంఘానికి సేవ చేశాడు. ఇతనికి ఐదువందలమంది విహారమిత్రులుండేవారు. ఇతడు శరీరాంతంలో కుశలం కోసం ప్రణిధానం చేశాడు. ఆ ఫలం వల్ల ఈ జన్మలో అర్హత్పదం పొందాడు. అతని మిత్రబృందమే ఈ ముని శతపంచకం. ప్రాణుల జన్మవస్త్రం ఎర్రటి, తెల్లటి, నల్లటి, నానావర్ణాల కర్మసూత్రాలతో చిత్రాకారంగా ఉంటుంది. దానిని పెద్దదైన పాము కుబుసం విడిచినట్టు విడిచివేస్తే, కుశలి అయి, శీతమూ, ఉష్ణమూ కాని కైవల్యం పొందుతాడు."

ఇలా భగవానుడు ఆదరంతో చెప్పిన మాటలు విని భిక్షువులు సచ్చరితుడైన సంఘరక్షితుని చరితాన్ని అనన్య మానసులై ప్రశంసించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సంఘరక్షితావదానమనే అర్వై యేడవ పల్లవం

# 68. పద్మావత్యవదానం

ప్రాణులను పూర్వజన్మకృతమైన హితాహిత కర్మలు అంటిపెట్టుకొనే ఉంటాయి. భోగసమయాలలో గడిచిపోతూ, పూవుల వాసన నూవుల నూనెకు సోకినట్టు మరుజన్మకు కూడా పూర్వకర్మవాసన అంటి వుంటుంది.

బుద్ధుడనే సుధాంశువు ఆరు సంవత్సరాలపాటు తపస్సు చేసి దీప్తజ్ఞానంతో వజ్రసమాధి బంధంనుంచి ఉదయించగా, భిక్షుగణం ఇలా విన్నవించింది. "భగవన్! నీ వియోగ్నితో సంతప్త అయిన యశోధర ఆరు సంవత్సరాలపాటు గర్భం ధరించి, ఆరు సంవత్సరాల తర్వాత ప్రసవించింది. నీవంటివాడే రాహులుడనే కుమారుడు కలుగగా, "వీడెక్కడినుంచి వచ్చాడు?" అని శుద్ధోధన మహారాజు కోపంతో ప్రశ్నించాడు. వధ్యభూమికి తీసుకొనిపొండని తన సేవకులకు ఆజ్ఞాపించాడు. ఆ సతి నీ దివ్యప్రభావంతోనా అన్నట్టు రక్షింపబడింది. ఆమె నీవు వ్యాయమం చేసిన శిల పక్కన శిశువును పెట్టింది. ఆమె తను సత్యవంతురాలైతే ఆ శిల నీటిలో తేలుతుందన్నది. అది అట్లే నీటిలో తేలింది. అంతటి సాధ్వీవ్రత పవిత్రురాలైన ఆమెకు మామగారి కోపం వల్ల దుఃఖావమాన సంతాపం కలిగింది. అది ఏ కర్మవల్ల? భిక్షువుల ప్రశ్న విని భగవానుడు 'ఏ కర్మవల్ల యశోధరకు ధుఃఖం వచ్చిందో వినండి' అంటూ ఇలా అన్నాడు.

పూర్వం బ్రహ్మదత్తుడనే రాజు కాంపిల్యమనే పట్టణం ఏలేవాడు. అతడు భూతలా ఖండలుడు, కామినీ కుసుమాయుధుడు. ఖడ్గధారాధరమైన అతని భుజం వల్ల యుద్ధంలో పుట్టిన ప్రతాపాగ్ని శత్రువులకు చీకట్లు కలిగించింది.

అతడొకమారు ధనుర్ధారియై వేటాడే కౌతుకంతో అరణ్యానికి వెళ్ళి గుర్రం వేగంతో తీసుకొనిపోగా ఒంటరిగా ఒక ప్రాంతం చేరాడు. అలసట వల్ల అతని కపోలాలపై జారిన స్వేదబిందువులు కుండలాలలోని ముత్యాల ప్రతిబింబాలనే భ్రాంతి కలిగించాయి. దారిని తగిలే జింక పిల్లలు అతనిని తమ రమ్యనేత్రాలతో చూస్తూ నిశ్చలంగా నిలబడిపోయి, అతని హారాగ్రరత్న శకలాలలో ప్రతిబింబించాయి. అప్పుడతడు క్షణంసేపు నిజంగానే హరిణాంకుని సమానరూపం వహించాడు. అతనికి మరులుగొన్న ఆడ జింకల మీదుగాను, ఆడయేనుగుల మీదుగాని వీచి, వాటి ప్రియులకు ఆనందం కలిగించి, శబర స్త్రీల కేశపాశంలోని పూవులు తాకుతూ వచ్చిన సురభి మత్తవనాంతవాయువులు శ్రమను పోగొట్టి, శ్రమబిందువులను తుడిచివేశాయి. ఆ సమయంలో శాండిల్య మహామునికి మృగిలో పుట్టిన కన్య, లావణ్యామృతవాహిని, తరళలోచన నీటికోసం ఆశ్రమ నదీతీరానికి వచ్చింది. రాజు ఆమెను చూచాడు. ఆమె కమలనివాసప్రీతితో కమలాకరానికి వస్తున్న కమలాదేవిలాగ, చరణ విన్యాసంతో కమల సమూహాలను స్పృశిస్తూ అందరికీ అపూర్వమైన కౌతుకం కలిగిస్తూ వస్తుండడం రాజు నిర్నిమేష దృష్టితో చూచి క్షణంసేపు



అమరత్వం పొందాడు. "ఆహా! ఈ మునికన్యక లావణ్యం అపూర్వమైంది. స్నిగ్ధముగ్ధ విలోకనాలతో హరిణివలె నా హృదయాన్ని లాగివేస్తున్నది. కమలిని ఈమె పాదసంవాహనానికి దిగింది. పూర్ణచంద్రుడు కళంకమనే ముద్రతో ఈమె ముఖానికి దాసుడయాడు. ఈమె కనుబొమలు స్వయంగా విశ్వవిజయానికి పూనుకోగా, కాముని కార్ముకలత నిజంగానే నిర్గుణమైపోయింది. ఈమె వదనబింబం లలితమైన సితమయూఖజాలంతో హర్షపీయూషం వర్షిస్తున్నది. శ్రోత్రమూలం వరకు వున్న నేత్రాల మైత్రి నవకువలయ లీలాకాంతిని ప్రసరింపజేస్తున్నది" అని రాజు తలపోస్తూ, నెమ్మదిగా గుఱ్ఱం నుంచి దిగి కుతూహలంతో తనవైపే చూస్తున్న ఆ కన్యతో ఇలా అన్నాడు:

"వాడని సుకృతంతో విలసిల్లే దేవతలు కంఠంలో ధరించడానికి తగిన మణిమాలవలె ఈ నిర్జన ప్రదేశంలో ఓ కువలయేక్షణా! నీ వెవరివి? ఆనందసందోహస్యందిని, లలితమూ అయిన నీ తనుకాంతి ఎవరి మనసును కౌతుకంతో ఆకర్షింపజేయదు? ఓ కామముక్తాలతా, చెప్పు. శరచ్చంద్రావదాత అయిన నీవు జన్మించి ఏ వంశాన్ని అలంకరింపజేశావు?"

రాజు ఇలా ఆదరంతో ప్రశ్నించగా, ఆమె అతనిని మునికుమారుడని అనుకొని, కామవృత్త మేమిటో తెలియకపోయినా, అభిలాషతో ఇలా అన్నది: "నన్ను పద్మావతి అంటారు. నేను అడుగులు పెట్టిన చోటెల్లా పద్మమాలిక పుడుతుంది. నేను శాండిల్యమహర్షికి మృగీగర్భంలో పుట్టినదాన్ని. ఓ మునిపుత్రా, నీకు స్వాగతం. నీ దర్శనం నాకు ఎంతో హాయి కలిగిస్తున్నది. నీ వల్కలం మనోహరతరంగా ఎంత విచిత్రంగా వుంది! ఏమిటీవ్రతం? నీ జటాభరం ఐదు నెమలి పింఛాలతో **అలంకరించ**బడినట్టు కనిపిస్తూ దేవతలను పూజించిన పుష్పాలతో ఎంతో ముచ్చటగా వుంది. నీవు మెడలో వేసుకొన్న అక్షమాలిక ఎన్నో పేరులది. ఒక్కొక్క అక్షమణి ఉసిరిక కాయలంత పెద్దదిగా, మంచుగడ్డవలె తెల్లగా ఎంతో బాగుంది. నీ చేయి విచిత్రమైన కుశపవిత్రాలతో వంకరగా వున్న ఈ వేణుదండంపై లేతచిగురుటాకులు దండగుచ్చినట్టు కాంతులు వ్యాపింపజేస్తున్నది. ఇలాటి రమణీయమైన వ్రతం ధరించిన నీ ఆశ్రమం ఎక్కడ? చెప్పు. నా మనస్సనే మృగాజినం అక్కడ విశ్రాంతి తీసుకొంటుంది."

వసుధాధిపతి అమృతం నింపిన ఆ ముగ్ధ వాక్కులు విని పాథేయంగా తెచ్చిన మోదకం ఆమెకిచ్చి ఇలా అన్నాడు: "చక్కని కనుబొమలుగల ఓ సుందరీ, ఎటు చూచినా దర్భముండ్లతో, ఎండిన చెట్లతో, ఎండిన గడ్డితో అసహ్యంగా ఉన్న ఈ అడివి నీ సుకుమార శరీరానికి తగదు. ఇక్కడికి దగ్గరిలోనే సంభోగయోగ్య శ్రీకరమైన నా ఆశ్రమం వుంది. ఇలాటి ఫలపరంపరలు అక్కడ పండి రాలుతుంటాయి. అక్కడ నీవు నివసించి, మన్మథ తపస్సు చేయి. సంభోగ పరిచర్యలలో వీణ్ణి వినియోగించుకో. త్రియంబకుని మూడవ కంటి నిప్పులో శలభమైపోయిన మన్మథుణ్ణి తిరిగి బతికించడానికి వసుధాసుధాకర కోశానుకారి, లావణ్యావని పుణ్యమూ, అసమాన పుణ్యరాశి అయిన నీ మనోహర దేహాన్నే బ్రహ్మ సృష్టించాడనుకుంటాను. మరొక సాధనం లేదు."

ముగ్ధ అయిన పద్మావతి చతురుడైన ఆ భూమిపతి మాటలు విని, చంద్రబింబంవలె తెల్లగా ఉన్న మోదకం ఆస్వాదించి అతనితో ఇలా అన్నది: "ఓయీ! నీవ్రతానువ్రతనై నీ ఆశ్రమంలోనే నివసిస్తాను. ఒక్క క్షణం నిరీక్షించు. ఈలోగా తండ్రిగారి అనుమతి కోరి వస్తాను." ఈ విధంగా ఆమె గడువు పెట్టి నిజాశ్రమానికి వెళ్ళి, నూతనాభిలాషతో ఎగ ఊపిరి విడుస్తూ మునితో ఇలా అన్నది: "తండ్రీ, నేను నేడు

వనంలో ఒక మునికుమారుణ్ణి చూచాను. అతడు ధరించిన వల్కలం ప్రసన్నమైన సలిలచ్ఛాయలో, అంచులు చిత్రవిచిత్ర వర్ణాలలో ఉంది. అతని ఆశ్రమంలో పండిన పండు రుచి చూచాను. అది తక్కిన పండ్లకన్నిటికీ ఒక నియమం కల్పిస్తున్నట్లుంది. నీ అనుజ్ఞతో అతని మనోహరమైన తపోవనానికి వెళ్ళుతాను. అతని సౌజన్యం హత్తుకొనిపోయిన నా మనస్సుకు మరొకటేదీ నచ్చటం లేదు."

ఆమె మాటలు విని శాండిల్య మహర్షి ఇలాటి మాటలన్నీ స్మరసూచకమని గ్రహించి, ఇదంతా యౌవనోన్మాదమని కూడా శంకించి, ఆ బేలతో ఇలా అన్నాడు. "అమ్మాయీ! నీవు రత్న విభూషితుడైన భుజంగమాన్ని చూచావు. పుత్రీ! మునులు రెండు నాలుకలవారు, భోగులు (భోగం కలవారు, పడగ గలవారు) కారు. స్నేహంతో ఊరి, పెద్దలై విషయసుఖాలలాగ పైపైకి మధురంగా కనిపిస్తూ, పరిణామంలో దుఃఖం కలిగించే మోదకాలపై ప్రీతిని వృథాగా పెట్టుకోవద్దు. ముద్దరాలా, కామకలాపద్యశాలు, సరసాలు, ఆయాసంతో ఊరినవి అయిన ఆ మోదకాలు వద్దు, విషసదృశమైన వాటి రుచితోనే ప్రజలు మూర్ఛపోతున్నారు. నాతో రా. ఆ మునికుమారుడెవడో నాకు చూపు" అని అంటూ, ఆమెతో పాటు ముని నదీతీరానికి వెళ్ళాడు. అక్కడ బ్రహ్మదత్తమహీపతిని చూచాడు. రాజు కూడ మునిని చూచి సిగ్గుతో తలవంచుకొని, రెండుమార్లు ప్రణామం చేసి, అతనిని ప్రసన్నుని చేసుకొన్నాడు. పిదప మునీశ్వరుడు నిజోచితమైన విధితో ఇవ్వగా, హర్షపీయూషలహరి అయిన ఆమెను స్వీకరించాడు. "ఇతరుల మాట విని నీవు ఈమెను ఎప్పుడూ కోపపడరాదు. ఈమె ఏమీ ఎరుగనిది. జాగ్రత్తతో కాపాడుకోవాలి" అని రాజుకు గుచ్చిగుచ్చి చెప్పి, ముని తన ఆశ్రమానికి మరలిపోయాడు.

అంతట బ్రహ్మదత్తమహారాజు హర్షం అధిరోహించినట్లుగా అశ్వం అధిరోహించి, భార్యతోపాటు రాజధానికి వచ్చి గొప్ప ఉత్సవం చేశాడు పద్మావతిని సర్వాంతఃపురవర్గం తలపై పెట్టాడు. దానితో ఆమె భర్తకు కళాకౌశల కేళులలో శిష్యురాలయింది. అడుగులు పెట్టినప్పుడల్లా భూమిమీద కమలాలు పుట్టుకురావడం వల్ల నృపపరిజనమంతా ఆమె పేరు సార్థకమైందనే భావించింది. పుణ్యవంతులకు సుకృతంతో కలిగిన దివ్యోత్కర్షం ఆశ్చర్యకరమైన లక్షణాలతో బావుటా యెత్తినట్లు అందరికీ కానవస్తుంది. రాజు అంతఃపురంలోని తక్కిన సుందరులయెడ విముఖుడై ఆ ఘనస్తనినే అంటిపెట్టుకొని వుండడం వల్ల ఆమె అసమాన సౌభాగ్యశోభను పొందింది.

కొంతకాలానికి ఆమె గర్భవతి అయింది అంతఃపురవధూజనంలో చింతాశల్యం కూడా ఏర్పడింది. ఆమె ఆసన్నప్రసవ అయివుండగా అంతఃపురాంగనాజనం వచ్చి, కౌటిల్యక్రూరమాత్సర్యంతో "రాజ స్త్రీలు ప్రసవించే విధం నీకు తెలియదు; ఓ వెర్రిదానా! రాజమాతలు కళ్ళకు గుడ్డ కట్టుకొని ప్రసవిస్తారు" అని అన్నారు. దానికి ఆమె మోసపోయి, ప్రౌఢగర్భభరార్దిత గనుక "మీరు చెప్పింది సముచితమే. నాకు ఏది మంచిదో ఆ విధంగానే చేయండి" అని అన్నది. తర్వాత ఆ సవతులు నల్లటి గుడ్డతో ఆమెకండ్లు మూసి గట్టిగా కట్టి వేశారు. ఆమె కాచిన బంగారువంటి కాంతిగల కవలపిల్లలను కన్నది. ఆ ఇద్దరు బాలకులను సవతులు నిర్దయగా ఒక గుడ్డలో చుట్టి, ఒక పెట్టెలో పెట్టి ముద్రవేసి గంగలో వదలి, ఆమె ముఖానికి రక్తం పూసి, "కదలని మెదలని రెండు మాంసపు ముక్కలు పుట్టాయి. వాటిని నీటిలో పడేశాము" అన్నారు.

ఆమె ప్రసవవార్త విని రాజు విపులోత్సవ సన్నాహం చేసి, "ఏమి బిడ్డ? ఏమి బిడ్డ?" అని అంతఃపురికలను ప్రశ్నించాడు. వారు పద్మావతి సపత్నుల పక్షంవారే కనుక "దేవా, మీవంటి ఇద్దరు



కుమారులు పుట్టారు. కాని ఏమని చెప్పుము? పిశాచిలాగ మహారాణి తిని వేశారు" అని విన్నవించారు. రాజు ఈ మాటలు విని భయపడి, అంతఃపుర మందిరానికి వెళ్ళి రక్తాక్తవదన అయిన పద్మావతిని చూచి పరిజనం చెప్పింది నిజమేనని నమ్మాడు. చాల క్రుద్ధుడయాడు. "వెంటనే తీసుకొని వెళ్ళి వధించండి" అని ఆజ్ఞాపించాడు. రాజభటులు ఆమెను నగరం వెలుపలికి తీసుకొని వెళ్ళారు. కాని, మంత్రులకు ఇదేదో సవతులు చేసిన మోసమని అనుమానం కలిగింది. ఆమెను వారు రక్షించారు.

ఇంతలో శాండిల్యాశ్రమదేవత గగన మార్గాన వచ్చి, అంతర్హితయై జనుల ఎదుట రాజుతో ఇలా అన్నది. "రాజా! నిర్దోష, ఆపన్నురాలు అయిన పద్మావతిని విచారించకుండా వట్టి వదంతితో చంపడానికి వధ్యభూమికి పంపావు. దీనితో నీ కీర్తి నిర్మూలితమైందని భావిస్తున్నాను. వనమృగీసుత, ముగ్ధ అయిన పద్మావతిని ఆమె సవతులు తమ సుఖం కోసం మోసం చేశారనే సంగతిని తెలుసుకోలేకపోయావు. విభ్రమనే ఉగ్రపిశాచం పట్టినవారి మతి ఈ విధంగానే ఉన్మత్తంగానే ఉంటుంది. భోగాంధులయిన ప్రభువులు, స్వభావచపలలు, సంపదతో కన్నుగాననివారు, సత్యాన్ని తారుమారు చేసేవారూ అయిన యువతులు, పుణ్యవిరుద్ధకర్మలు చేస్తూ స్వచ్ఛందంగా అద్భుతాలు చెబుతూ ఆకాశంలో చిత్తరువులు గీచే ఖలులు కలిసి వుండేచోట్ల సరళస్వభావులు, సాధువులు ఎలా బ్రతకగలరు?"

అంతర్హితురాలైన దేవి అన్న మాటలను విని రాజు మరింత క్రుద్ధుడై అంతఃపురాంగనలను నిజం చెప్పవలసిందని బెదరించాడు. క్రోధాక్రాంతుడైన రాజు తీవ్రంగా శిక్షిస్తాడనే భయంతో వారు జరిగింది జరిగినట్లు నివేదించారు. సవతులు మోసం చేశారని, పద్మావతి నిర్దోషి అని తెలిసిన మీదట ఆమెను వధ్యభూమికి పంపినందుకు రాజు పశ్చాత్తాపాకులుడయాడు. మోహానికి మంత్రులవంటి రాగ క్రోధ కృపా లజ్జా శోకాలు సమానబలంతో ముంచుకొనిరాగా మూర్ఛపోయాడు. మూర్ఛ తెలిసి "హా! ప్రియే! నావోటి హీనపుణ్యునికి మరల నీతో సమాగమం ఎలా సంభవం?" అంటూ కుప్పగా నేలపై కూలిపోయాడు.

ఇది ఇలా వుండగా గంగా ప్రవాహంలో కొట్టుకొని వచ్చిన మంజూష జాలోపజీవులకు చిక్కింది. దానిని రాజు రాజముద్రతో వున్న ఆ మంజూషను చూచి వారు భయపడి రాజసభకు తీసుకొని వచ్చారు. దానిని రాజు ఆతురతతో వెంటనే పగులగొట్టి తీయగా ప్రత్యగ్రకనకోజ్జ్వలులైన ఇద్దరు బాలురు కనిపించారు. ఇద్దరూ ఒకేరూపంతో లక్షణోదారులైనవారు, సహస్రాంశువుకు అశ్వినులవలె ఉదయించారని జనం చెప్పుకోసాగింది. రాజు కన్నీళ్ళు జాలువారుస్తూ వారిద్దరినీ ఒళ్ళోకి తీసుకొని, ప్రియావిరహశోకార్తుడై అత్యధికమైన సంతాపం పొందాడు. రాజు శోకం చూచి దీర్ఘమతి అనే మహామాత్యుడు "దేవ, సపత్నీజనవంచిత అయిన నీ పత్ని జీవించే ఉన్నది." అని నివేదించగా రాజు వెంటనే పంచప్రాణాలు వచ్చినట్లు కుదుటపడి సంతోషించి "ఎక్కడ? చూపు" అంటూ మహామాత్యుని మందిరానికి వెళ్ళాడు. అక్కడ పద్మావతి దుర్గతితో, అవమానంతో సముద్విగ్న అయి కోపం వల్ల రాజు వచ్చాడే, మర్యాద చేయాలె అనే ధ్యాస కూడ లేక వుంది. ఆమెను చూచి రాజు "నీ కీ విషమక్లేశం ఎవరు తెచ్చిపెట్టారో వారి విచిత్రవధ చూడు. ప్రసన్నురాలివికా. సంతాపం వదలు. మౌనం వహించకు" అంటూ ఆమె పాదాలపై పడ్డాడు.

కన్నీటిధారలు ఉన్నత స్తనాలపై పడుతుండగా ఆమె రాజును లేవనెత్తి ఇలా అన్నది: "దేవా, నాకు తీవ్రాపకారం చేశారని వీరిపై కోపపడకు. నాకు అపకారం చేసిన సవతులపై నాకు కోపం ఏమీ లేదు. ఇది నిజం. వైరమనేది ఓర్పుతోనే శమిస్తుంది; ప్రతివైరంతో వృద్ధి పొందుతుంది. శత్రువు పరాభవమూ చేయలేడు.

మిత్రుడనేవాడు ఉపకారమూ చేయలేడు. దేహులకు దుఃఖాదికమంతా ప్రాక్తనకర్మ నిర్మితమే సుమా! అపకారం చేసినవారి యెడల కూడ ముందు వెనుకలు విచారించక బుద్ధిమంతుడు పరాభవ ప్రయత్నం చేయరాదు. క్రోధంతో పరక్రోధవిషం వృద్ధిపొందుతుంది. మండే నిప్పు మంటతో శమిస్తుందా? నా దుఃఖం నన్ను చాల సంతాపింపజేసింది. కనుక తిరిగి నా తండ్రి తపోవనానికి వెళ్ళుతాను. కాముకురాలను కావడం వల్ల ఆయన మాట మొదట వినలేకపోయాను. ఆయన నన్ను మొదట్లోనే ఎంతో వారించాడు. కాని యౌవనోన్మాద దోషంతో కామఫలం ఆశించే నేను వినలేదు. ఏమి చేయను?" అని ఈ విధంగా అంటూ, నిట్టూర్చి పాదాలతో నేలను రాచుతూ, నమ్రవదనంతో మౌనం అవలంబించి ఉండిపోయింది. రాజు ఆమెకు ప్రణామం చేసినా, ఆమె ప్రసన్నురాలు కాలేదు. ప్రేమలో లేనిపోని అపవాదు శల్యం వంటిదికదా"

పిదప ఆమె ధాతురక్తవసనాలు ధరించి తండ్రి ఆశ్రమానికి వెళ్ళిపోయింది. మానినుల కోపం భుజంగకుటిలం, దుస్సహమైందీని. ఆమె తండ్రి తపోవనం చేరగానే లేళ్ళు ప్రేమతో చుట్టూ మూగాయి. లతాసఖులు భృంగస్వనాలతో స్వాగతం చెబుతూ, ఆలింగనం చేసుకుంటున్నట్టు ఊగిసలాడాయి. కొంతకాలానికి శాండిల్యమహర్షి, పుణ్యనిధి, తపోవిశేషార్జితమైన లోకాన్ని చేరగా, శూన్యమైన ఆశ్రమాన్ని చూచి, ధైర్యం కోలుపోయి ఉన్మాదినివలె అయింది. స్వచ్ఛ ప్రభావుడైన జనకుని ఆజన్మవాత్సల్యాన్ని స్మరిస్తూ, మూడు లోకాలే శూన్యమైనట్లు భావిస్తూ, పాముకాటుకు బాధపడే దానిలాగ కొట్టుకొన్నది. ఎంతో ప్రియంగా ఉన్న తపోవనం ఇప్పుడు భయాసహ్యాలు పుట్టించసాగింది. నిజమే. కాలం గడచినకొద్దీ భావాలు నిశ్శేషనిపీతసారలైపోగా విరసాలవుతాయి. ఆ మనోహర ప్రదేశాలే, ఆ వసంతవాసరాలే ఇష్టమైన ఒక్కడూ లేకపోతే, అంతా విషాదాస్పదమౌతుంది.

తర్వాత ఆమె, ప్రవ్రజితానురూపమైన వేషం ధరించి, సుఖం వదలి, చంద్రలేఖే భూమికి దిగివచ్చిందా అన్నట్టుగా, దిక్కుదిక్కునా తిరుగుతూ, శాంతిని పొందినట్లు వారాణసిని పొందింది. అక్కడ కృకి అనే రాజు ఆమెపై ఆశపడి ఎంతో ప్రార్థించాడు. కాని, తపఃప్రదీప్తమైన అగ్నిశిఖవలె ఆమె అతనికి ఎప్పుడూ తాకరానిదిగానే ఉండి పోయింది. ఆమెను రాజపత్నులు ఎంతో ప్రయత్నంతో తనను త్రిదశాంగనవలె పూజిస్తూ ఉండగా, తన పూర్వచరిత్రను చింతిస్తూ పతివ్రతగా కాలం గడుపుతూ వచ్చింది.

బ్రహ్మదత్త మహారాజు చారుల వల్ల ఆమె వారాణసిలో వుండడం తెలసుకొని, వియోగ దుఃఖానలంతో దహ్యమానుడై బ్రాహ్మణవేషంతో అక్కడికి వచ్చాడు. వ్రతవేషంలో ఎంతో మనోహరంగాను, శీలయశస్సు పతాకగాను వుంటున్న ఆమెను ప్రసన్నురాలను చేసుకోవడానికి రాజు తన స్వరూపం తెలిపాడు. "నేను తీవ్రమైన అపరాధం చేశాను. మన్నించు" అని రాజు అంటుండగా, ఆమె పెద్దగా ఏడ్చింది. మనస్వినులకు అవమానమన్యువు సమాశ్వాసంతో కూడ మరల చెలరేగుతుంది. రాజు శరత్కాలం ఘనాశ్రుధారలను పరిహరించి చంద్రలేఖతో ఆశలను (దిక్కులను) ప్రకాశవంతం చేసినట్లే, ఆమె ఘనమైన అశ్రుధారలను పోగొట్టి, స్మరేందురేఖతో ఆశలను (కోరికలను) సఫలం చేసుకొని నిజరాజధానికి ఆమెను పిలుచుకొనివెళ్ళాడు. వియోగకాలంలో అడగిపోయిన పాదాంబుజన్యాసపద్మపాళి ప్రియసమాగమంతో గాఢరాగ అయిన సంభోగలక్ష్మిలాగ మరల ప్రాదుర్భవించింది. జన్మాంతరంలో ఆమె కన్యగా ఉన్నప్పుడు ప్రత్యేకబుద్ధునికి విలాసపద్మం సమర్పించి, లోభంతో మరల తీసుకొని, పద్మశోభను చూచి పశ్చాత్తాపపడి మరల సమర్పించింది. పద్మం సమర్పించడం వల్ల ఆమె అడుగుపెట్టిన చోటెల్లా పద్మాలు పూచాయి. తిరిగి



తీసుకోవడం వల్ల కొంతకాలం పూచడం ఆగాయి. మరల సమర్పించడం వల్ల ప్రియాసమాగమంతో పూచాయి. దత్తాపహారమనే మలీమసమైన తన కర్మపాకంతో పద్మావతి వధ్యభూమికి పంపబడింది. ఆమే ఈ జన్మలో యశోధరగా జన్మించింది.

కర్మఫలోదయపు విచిత్రగాథను జినుడు చెప్పగా భిక్షువులందరూ విని, ఆశ్చర్యం ముప్పిరిగొనగా చిత్తరువులో వ్రాసినవారిలాగ ఉండిపోయారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పద్మావత్యవదానమనే అర్థై యెనిమిదవ పల్లవం

# 69. ధర్మరాజికాప్రతిష్ఠావదానం

చైత్యాంకితయైన వసుమతే, విశేషోదారలక్షణాలుగల యెవ్వరి సుకృతాన్ని వేనోళ్ళ చాటుతున్నదో, అలాటి అశేషకుశలప్రణిధానాశ్రయులైనవారికి ఇహలోకం, పరలోకం కూడా శుద్ధమూ, సుఖస్థితికరమూ అవుతాయి.

పూర్వం పాటలీపుత్రమనే పురంలో అశోకుడనే రాజు వుండేవాడు. అతడు లోకాన్ని సమ్యక్పాలనలాలనలతో అశోకంగా చేశాడు. అతడు బోధిస్నానం చేసి, భిక్షుసంఘాన్ని పూజించి, మూడు చీవరాలు సమర్పించేవాడు. ప్రజలకు కాంచనవర్షం కురిపించేవాడు. అతడు అనర్ఘరత్నాలు, మౌక్తికాలతో చైత్యాలు నిర్మించి వసుంధరనే కప్పి వేశాడు. అతడు స్వయంగా నాగలోకానికి వెళ్లి నాగులు తీసుకొని వెళ్ళిన సుగతుని ధాతుసంచయాన్ని తీసుకొనివచ్చి, వాటిని స్థాపించి రత్నస్తూపావళి నిర్మించాడు. అతడు మహీతలంలో ధర్మరాజికాయుక్తమైన స్తూపాలు ఎనభైనాలుగువేలు నిర్మించాడు. ఒక్కక్షణంలో నిర్మించబడిన ఈ స్తూపాలలో పెద్దది ఆకాశాన్ని తాకి సూర్యుణ్ణి కప్పి, ఛాయాసంజ్ఞను కల్పించింది.

ఇలా నిత్యమూ ఎడతెరిపి లేకుండా విస్తారంగా సంఘభోజనాలు జరుగుతుండగా, ఒకనాడు జరాజీర్ణుడైన ఒక ప్రవ్రజితుడు వచ్చాడు అతనికి రాజు రాజార్హమైన భోజనం పంపాడు. ఆ భిక్షువు దానిని అమృతం లాగ భుజించి సంతోషించాడు. అప్పుడు అక్కడున్న ఒక భిక్షువు ఆ వృద్ధభిక్షువుతో అన్నాడు గదా: "రాజు స్వోచితమైన భోజనం నీకు పంపడం ఎందుకో ఎరుగుదువా? నీవు మిక్కిలి వృద్ధుడివి గనుక, నీనుంచి సద్ధర్మం వినదలచి నీకు గొప్ప సత్కారం చేసి గౌరవించాడు." ఆ భిక్షువు నవ్వుతూ ఈ మాటలు అనగానే, వృద్ధ భిక్షువు తన నిరక్షరాస్యతకు సిగ్గుపడి బాణం తాకినట్టు బాధపడి, వెంటనే ఇలా ఆలోచించాడు. "అంతంలో దుఃఖం కలిగించే ఈ రాజు భోజనం ఎందుకు తిన్నాను? తినడం సిగ్గుచేటు. నేనేమో నిరక్షరాస్యుణ్ణి. గాథలోని చతుర్భాగం కూడా ఎరుగును. ఏమి చేయను? పెద్దలమధ్య మహీపతి ప్రశ్నిస్తే ఏమి సమాధానం చెప్పను? మూగనైన నన్ను గేలిచేసే ఈ జనం ఏమని అంటుంది? లోపల చేరి తొలిచివేసే పురుగులతో కొమ్మలన్నీ పోయి, లోపల చేరిన కృశానుధూమంతో మలినమై గుంటలో పడిన మోడైనా ధన్యమే. పండితుల మధ్య వెలవెల బోయే ముఖం సిగ్గుతో కుంచించుకుపోయి మూకాంధసదృశుడుగా వుంటూ ప్రమాదం పాలయ్యే నావంటి మూర్ఖుడు మాత్రం వుండనే వుండవద్దు."

ఈ విధంగా చింతతో బాధపడుతూ, వేడి నిట్టూర్పులు వదలుతూ సుఖం కోల్పోయి వున్న ఆ వృద్ధ ప్రవ్రజితుని బుద్ధప్రసాదినీదేవి ప్రత్యక్షమై "రాజు నిన్ను ఏమైనా ప్రశ్నిస్తే, "విస్తీర్ణతరమైన ధర్మం సంక్షేపంగా విను- ఉపకారం చేయడానికి కించిన్మాత్రమైన ధనం వాంఛనీయమే. ప్రాణాధారం కోసం రుచి రహితమైన అన్నం కొద్దిగా అవసరమే. క్షణమాత్రకాలం నిద్ర అశక్తులకు ఉపయోగకరమైందే. తక్కిన విపులారంభ



భోగమంతా శరీరి వదలవలసిందే- అని చెప్పు" అని ఆజ్ఞాపించింది.

పిదప రాజు ధర్మోపదేశానికి ఆ వృద్ధుని వద్దకు వచ్చినప్పుడు బుద్ధప్రసాదినీదేవి ఆదేశించిన విధంగా స్పష్టతర స్వరంతో ఉపదేశించాడు. రాజు, హృదయ సంవాది అయిన అతని సుభాషితం విని "ఈ మనీషి చెప్పింది సత్యం. ఈ మహామతి నన్ను ఉద్దేశించే ఈ హితం చెప్పాడు. సత్పురుషుల వాక్కులు తత్త్వసంవాదాస్వాద్యములు, పుణ్యప్రాప్యములు. కోశాగారాలలో భద్రపరచుకున్న ధనమూ తృష్ణానలానికి ఇంధనం వంటిది. నా పనులా చతుస్సముద్రమేఖల అయిన విశ్వంభరను వ్యాపిస్తున్నవి. నా ఆహారమూ చిత్ర విచిత్రమైంది. నిద్ర కూడా నాకు ఎక్కువే. ఇదంతా మోహసుఖానికే. అంత్య సమయంలో ఏదీ ఎక్కడా కనుపించదు" అని ఆలోచించి అతనికి నమస్కరించి సుందరమూ, కాంచన చర్చితమూ అయిన చీవరాంశుకం సమర్పించాడు. ఆ వృద్ధుడు రాజపూజావిరాజితుడై వెళ్ళుతుండగా, దారిలో బుద్ధప్రసాదిని మరల కనిపించి అతనిని ధ్యానాధ్యయనాలు సాగించవలసిందని ప్రోత్సహించింది. ఆమె ఉపదేశం వల్ల నిఖిలక్లేశాలు దూరం కాగా, ధ్యానావధానియై అతడు అర్హత్వం పొందాడు.

మరికొంత కాలానికి అశోక చక్రవర్తి పెద్దగా సంఘభోజనం జరుపుతున్నప్పుడు దివ్యసౌరభ చీవరాలు ధరించిన ఒక నూతన భిక్షువు వచ్చాడు. ఆయన చీవరపు అపూర్వగంధానికి తుమ్మెదలు ఆయన చుట్టూ మూగాయి. "ఈ సౌరభం మీకు ఎలా కలిగింది?" అని రాజు అతనిని ప్రశ్నించాడు. "నేను సంవత్సరంపాటు దేవలోకంలో పారిజాతతరుమూలంలో వసించాను. ఆ పూవుల వాసనే ఇది" అని ఆ భిక్షువు సమాధానం చెప్పాడు. రాజు ఆ మాటలు విని, ఆ దివ్యసౌరభ ప్రభావంపై ఆదరం ఎక్కువ కాగా, రత్నత్రయార్చనాసక్తుడు, పుణ్యారామరతుడూ అయాడు.

ధర్మస్థితి ప్రణయిని అయిన వృత్తే వృత్తి. సత్యోపభోగసుభగమైన వాక్కే వాక్కు. పరార్థ చింతనగల బుద్ధే బుద్ధి. దానక్రియోపకరణమైన సంపదే సంపద.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ధర్మరాజికాప్రతిష్ఠావదానమనే అరవై తొమ్మిదవ పల్లవం

# 70. మాధ్యంతికావదానం

భక్తితో జినుని ఉపదేశసౌరభాన్ని వెదజల్లేవారి అభిమతం సుకృతంతో కూడి విరాజిల్లుతుంది. అలాటివారి కీర్తివిశేషంతో పృథ్వి, పుణ్య పుణ్యతర అవుతుంది.

మాధ్యంతికుడనే భిక్షువు ఆనందుని మాటతో కాశ్మీరమండలంలో బుద్ధశాసనం వ్యాపింపజేయడానికి వెళ్ళాడు. కాశ్మీరమండలం నాగాధిష్ఠితమని తెలుసుకొని, ఆ ధీరసత్త్వుడు సమాధిమగ్నుడై ప్రణిధానం చేశాడు. నాగులభూమి సంక్షోభంతో కంపించింది. నాగులు కోపోద్రిక్తులై సమాధిమగ్నుడైన అతనిపై శస్త్రాస్త్రవృష్టి, అగ్నివృష్టి కురిపించారు. అవన్నీ అయన ప్రభావంతో అతని శిరస్సుపై పద్మోత్పలావలి అయి పడింది. అప్పుడు నాగులు అతని ప్రభావోత్కర్షానికి విస్మితులై "నీ పర్యంకబంధమున్న మేర ప్రదేశం నీ వశం" అన్నారు. ఆ మాటమేరకు నవద్రోణముఖ విస్తీర్ణమైన ప్రాంతాన్ని- పర్యంకబంధతుల్యప్రదేశాన్ని ఇచ్చారు. మాధ్యంతికుడు అక్కడ నగర గ్రామాలు నిర్మించి, ఐదువందలమంది అర్హతులకు స్థితి ఏర్పాటు చేశాడు.

అక్కడ అతడు బుద్ధదేవుని ధర్మం ప్రతిష్ఠించి, భూమిని విహార రుచిరాభరణంగా చేసి, గంధమాదన పర్వత సానువులనుంచి తెచ్చిన నవకుంకుమకందబృందాలతో అలంకరించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మాధ్యంతికావదానమనే డెబ్బయ్యవ పల్లవం.

# 71. శాణవాస్యవదానం

విమలశీలదుకూలశోభతో అలరారుతూ, విషయవేషపరాఙ్ముఖులైన శాంతచిత్తులకు చీనాంశుకాలతో గర్వమూ లేదు; చిరిగిన పేలికలతో దైన్యవృత్తీ లేదు.

పూర్వం గుణవంతుడైన శాణవాసి అనే భిక్షువు గురుశాసనం వల్ల జినశాసనం వ్యాపింపజేయడానికి మధురానగరికి వెళ్ళాడు. దారిలో ఇద్దరు మల్లులు మాట్లాడుతూ ప్రసక్తానుప్రస్తంగా వచ్చిన ఈ ఆర్యను చెప్పుకోడం భిక్షువు విన్నాడు. ఆ ఆర్య ఇది:

*యే విమలశీలనిలయాః శ్రుతవిశ్రుతచక్షుషః క్షమావంతః*

*తానేవ శాణవాసీ కథయతి భిక్షుర్భువి శ్రమణాన్*

ఎవరైతే విమలశీలనిలయులు, విద్యతో విస్తృతమైన దృష్టిగలవారూ, క్షమావంతులూ అయివున్నారో, వారినే శాణవాసిభిక్షువు శ్రమణులు అని అంటాడు.

ఈ ఆర్యను శాణవాసి కూడ పఠించాడు. అప్పుడు మల్లులు అది విని "శాణవాసి భిక్షువు నీవే. సందేహం లేదు. ఓ సుమతీ, నీకు శాణవాసి అని ఎందుకు పేరు వ్యాపించింది? సద్ధర్మవాదులయిన మునులు నీ గాథలు చదువుతారు. ఎందుకు?" అని ప్రశ్నించారు. దానికి శాణవాసి ఇలా సమాధానం చెప్పాడు.

"నేను పూర్వజన్మలో వ్యాధిపీడితుడై వున్నప్పుడు ప్రత్యేకబుద్ధుడు నాకు మందులు మాకులు ఇచ్చి చికిత్స చేసి, స్వాస్థ్యం కలిగించాడు. ఆ ప్రత్యేకబుద్ధుడు చిరిగిన ఒక చిన్న జనపనార పట్ట(శాణం) కట్టుకున్నాడు. అది చూచి నేను ప్రేమతో రాజార్హమైన రుచిరాంబరం తెచ్చి సమర్పించాను. "మిత్రుడా, ఈలాటి రుచిరాంశుకాలు నాకు నచ్చవు. శాణవసనంతోనే ప్రశమశ్లాఘ్యమైన శోభ కలుగుతుంది" అని ఆయన అన్నాడు. ఆ మాటలు విని, నేను శాణవస్త్రోత్సుకుణ్ణయి, సత్సంగమంతో వైరాగ్యం పొంది మంచిగుడ్డలంటే విముఖుణ్ణయాను. కాలక్రమాన అతడు మరణించగా, తత్తుల్యభావం పొందడానికి నేను ప్రణిధానం చేశాను, ఆయనను అర్చించాను కూడ. అతనిని అర్చించడం వల్ల, ప్రణిధానం వల్ల శాణవస్త్రాలు ధరించినవాణ్ణయిపోయి శాణవాసిఅని పేరు పొందాను" అని వారికి చెప్పి, నెమ్మదిగా వెళ్ళుతూ మధురానగరం చేరి ఉరుమండమనే పర్వతాన్ని శ్రమతో ఎక్కి, పర్యంకబంధంతో ప్రణిధానానికి ఉపక్రమించగా, భూమి కంపించింది. తుములవర్ష్మలనే నాగులు విషం కక్కుతూ అతనికి విఘ్నం కలిగించడానికి వచ్చారు. అతడు వారిని అణచివేసి, మధురావాసులైన నటుడు, భటుడు అనే శ్రేష్ఠిపుత్రుల సహాయంతో విహారం నిర్మించాడు.

రత్నోజ్జ్వలము, స్ఫటిక కాంచన రమ్యహర్మ్యశోభితము, మంచాలు, పీఠాలు, శయనాలు, మొదలయినవాటితో అభిరామము, సుభగ భోగనిధి, పుణ్యస్థితి, సర్వసదృశమూ అయిన ఆ విహారం నటభట నిర్మితం కావడం వల్ల నటభట విహారమనే పేరు పొందింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శాణవాస్యవదానమనే డెబ్బయి ఒక్కటవ పల్లవం

# 72. ఉపగుప్తావదానం

కామరజపరిభూతదృష్టులయినవారికి ఏవి అయితే అభిలాష కలిగిస్తాయో, అవే, పుణ్యపరిమార్జనం చేత పరిశుద్ధులైనవారికి మనః ప్రశాంతిని, వైరాగ్యయోగాన్ని కలిగిస్తాయి.

పూర్వం మధురానగరంలో గుప్తుడనే గంధద్రవ్యవిక్రేతకు ఉపగుప్తుడనే కుమారుడు ఉండేవాడు. అతడు పుట్టకముందే శాణవాసి భిక్షువుకు ఉపస్థాపకుడుగా చేస్తానని తండ్రి మొక్కుకున్నందున, పుట్టిన తర్వాత బుద్ధి ఎరిగినప్పటినుంచి శాణవాసి ఎడ భక్తితో వుండేవాడు. అతడు యౌవనశాలి అయినప్పుడు మన్మథుడు అతనిని పెడదారి పెట్టడానికి ఎంతో పోరాడాడు. కాని, అతడు వైరాగ్యాభిముఖుడైనందున విఘ్నకారి అయిన తన గణాలన్నీ పరాజితం కాగా మన్మథుడు చింతనే పొందవలసివచ్చింది. తండ్రిమాట మీరలేక అతడు కొంతకాలం హరిచందనం కస్తూరి కర్పూరం అగరు మొదలగు గంధ ద్రవ్యాలు అమ్ముతూ వుండేవాడు.

ఆ మధురాపురిలోను వాసవదత్త అనే మహాసుందరి అయిన వేశ్య ఉండేది. ఆమె గంధద్రవ్యాలను కొనడంకోసం పంపిన దాసి చెప్పగా అతని రూపగుణాలు విని, సంజాతరాగసంవేగ అయి, అతని సంగమం కోరుతూ తన ఇష్టదూతితో తనభావం అతనికి తెలియజేసింది. దూతి వెళ్ళి, రహస్యంగా తన యజమానురాలి సందేశం వినిపించగా, అతడు మందహాసం చేసి "ఆమెను దర్శించడానికి నాకిది తరుణం కాదు." అని ప్రతిసందేశం పంపాడు. దూతి తిరిగిరాగానే వాసవదత్త ప్రణయంతో ఉద్విగ్నురాలైంది. వేశ్యల అనురాగానికిగాని, అననురాగానికిగాని నియతి వుందా?

ఇలా ఉండగా ఒకమారు యువకుడైన వణిక్పుత్రుడు ఆ వేశ్య ఇంట బస చేశాడు. ఉత్తరాపథం నుంచి శ్రీమంతుడైన ఒక సార్థపతి వచ్చాడు. ఆ సార్థపతి రాత్రి భోగం కోసం వస్త్రాలు బంగారు నాణేలు పంపాడు. అప్పుడు ధనలోభంతో ఆ గణిక తల్లితోపాటు ఇలా ఆలోచించింది: "ఇంట్లో వుండే వణిక్పుత్రుడు ధనం నాకోసం వ్యయం చేసుకొని వున్నవాడు. మరొకడేమో మహాధనవంతుడు, నన్ను కోరుతూ కానుకలు పంపాడు. ఏమిచేయాలో తెలియడం లేదు. ఒకసారి మనస్సు తెలిసి కోరిక ఈడేరినవాడు ఎక్కువ డబ్బు ఇవ్వలేడు. అలాటివాడు సద్దికూడువంటివాడు. అలాటి నిష్ఫలునితో ప్రయోజనం ఏమిటి? కొత్తవాడు కొత్తమోజుతో అడగకనే అంతా ధారపోస్తాడు. ప్రథమాదరం అప్రియమైనదాన్ని కూడ ప్రియంగానే కనపడేట్లు చేస్తుంది. శల్యంలాగ ఇంట్లో కూచున్న వాణ్ణి ఏమిచేద్దాం? వెంటవచ్చిన పూర్వజన్మ కర్మబంధంలాగ భోగించకుండా వీడు వదలడు. ధనవంతుడైనవాడిని వదలడమనేది మన వ్యాపారం కాదు. మనం ధర్మం కోసమూ, కామంకోసమూ కాదు, అర్థం కోసమే సృష్టించబడ్డాము."



వాసవదత్త ఈ విధంగా ఆలోచించి తల్లి సమ్మతిపై మంచి మద్యంలో విషం కలిపి వణిక్పుత్రునికి ఇచ్చి చంపివేసింది. అతని కళేబరాన్ని గడ్డివామిలో పడవేసి, నూతన సార్థవాహుణ్ణి పిలిపించుకొని, అపారధనం సంపాదించింది. వణిక్పుత్రుని బంధువులు వణిక్పుత్రుడు గణకా గృహంలోకి వెళ్ళడమే తప్ప తిరిగి రాకపోవడంతో సందేహం కలిగి, గణిక ఇంటిని వెదకి వణిక్పుత్రుని కళేబరం కనుకొన్నారు. అతని మరణానికి సంతాపపడి, రాజు దగ్గిర మొరపెట్టుకున్నారు. రాజు ఆ వేశ్యకు తీవ్రపాపార్హమైన ఉగ్రదండనం- మరణదండనం- విధించాడు. రాజభటులు ఆ వేశ్యను వివస్త్రను చేసి చేతులూ కాళ్ళూ నరికి, చెవులు, ముక్కు కోసి, వధ్యభూమికి తీసుకొనివెళ్ళి వదలిపెట్టారు. ఆమె జుట్టు ముడివీడి వెంట్రుకలు విరియబోసుకొని వున్నాయి. ఆమె వ్యథాక్రాంత అయి, తన రక్తంలోనే పొర్లాడుతూ, దాసి కాకులు గద్దలు పొడవకుండా తోలుతుండగా, విలపించింది.

ఉపగుప్తుడు ఆమె విషమస్థితిని విని ఆమెను చూడదగినకాలం ఇదేనని నిశ్చయించి వధ్యభూమికి వెళ్ళాడు. చంద్రకాంతిలో వస్తున్న ఉపగుప్తుణ్ణి చూచి దాసీది వాసవదత్తకు తెలియజేసింది. ఆ మాట విని అతనిపై ఇంకా అభిలాష వుండడం వల్ల సిగ్గుతో ముడుచుకొని పోయింది. ప్రాణులకు రాగమనేది వాసనాభ్యాసమార్గంలో లోపల ప్రవేశించిన పిదప ఏ అవస్థలోను వదలదు. దాసీది తన చీర చెరుగుతో తన జఘనాన్ని మరుగుచేయగా, వాసవదత్త కష్టం మీద స్తనమండలంపై మొండి చేతులుంచి, తలవంచుకొని ఉపగుప్తునితో ఇలా అన్నది:- "నేను ఎంతో ప్రయత్నంతో కోరినా నీవు రాలేదు. మందభాగ్యనైన నేను ఇప్పుడు నిన్ను చూచీ ప్రయోజనం ఏముంది? నేను మహాభాగ్య సౌభాగ్య విభ్రమంలో వున్నప్పుడు నిన్ను చూడడానికి ఇది సమయం కాదు" అని అన్నావు. ఇప్పుడు నేను ఛేదించబడిన అంగాలు కలిగినదాన్నై క్లేశసాగరంలో రక్తపంకిలనై పడ్డాను. ఓ కమలపత్రాక్ష! నన్ను చూడడానికి ఇదేనా సమయం?"

ఈ విధంగా అంటూ, భాష్పాంబువుతో జఘనాన్ని ఆవరించిన చీరె చెరగును తడుపుతున్న వాసవదత్తను చూచి ఉపగుప్తుడు అనుతాపంతో ఇలా అన్నాడు. "వాసవదత్తా, చంద్రసఖి అయిన శరీరకాంతి, సువర్ణకదళీ లావణ్యాన్ని హరించే దేహం, పద్మాన్ని ముకుళింపజేసే ముఖం, కువలయానికి క్లీబత్వం ఆపాదించే లోచనాలు- ఇవన్నీ నాకు ఇష్టమైనవీ కావు, మనోహరమైనవీ కావు. అయితే ఇప్పుడు విచారవిరసమైన దేహముల స్వభావాన్ని చూడడానికి ఇక్కడికి వచ్చాను. వస్త్రవిభూషణాలతో ఆచ్ఛన్నమైన వరసౌరభంతో గుమగుమలాడే నీ శరీరపు శోభ అలాటిది. స్వభావమేమో ఇలాటిది. వెంట్రుకలు ఎముకలూ నిండి, సతతమూ అనలతాపంతో ఉడికే అంగాలతో జుగుప్సానిధానమై, వ్యసనగణాలవాలమైన కాయమనే శ్మశానంలో రమించేవారు- ఛీ! ఛీ! కంపుగొడుతూ, వికృతచ్ఛిద్రాలతో నిండిన కాయంపై అయ్యో! మనుష్యులకు మోహంతో ప్రియభావన! కాయమనే ఈ మాయావిషయ సంశ్రయం సాపాయమైంది. సుగతోపాసనతో ఈ దుఃఖస్కంధం క్షీణిస్తుంది. మోహం ధకారదివాకరుడు, సర్వక్లేశావకాశచ్ఛేది, కల్యాణమిత్రుడు అయిన శాస్త శాసనశరణం పొందినవారు క్లిన్నకలంకపంకకలితమూ, అంత్రమాలాకులమూ, వికారమూ అయిన కాయమనే నరకంలో మరల మునుగరు."

ఉపగుప్తుని ఉపదేశం విని వేశ్య దుఃఖోద్వేగంతో విరక్త అయి, శాంతికోసం పుణ్యమైన రత్నత్రయాన్ని శరణు పొందింది. పిదప ఉపగుప్తుని ఉపదేశంతో స్రోతాపత్తి ఫలం పొందినదై ధర్మమార్గ ప్రణయిని అయి, సత్యాన్ని దర్శించి మరణించింది. తర్వాత ఆమె ప్రభావమయమైన దేవనికాయంలో

ప్రభవించగా, మధురావాసులు ఆమె దేహానికి ఉత్తరక్రియలు జరిపారు.

ఇలా ఉండగా ప్రసన్నవంతి అయిన శాణవాసి భిక్షువు ఉపగుప్తుని వద్దకు వచ్చి, అతడు ప్రవ్రజ్యాదీక్ష స్వీకరించడానికి అది తగిన సమయమని భావించాడు. ఉపగుప్తుడు అతనితో ప్రవ్రజ్య స్వీకరించి, ఉత్తమమైన అర్హత్పదం పొంది, పురవాసులకు సద్ధర్మోపదేశం చేయసాగినాడు. ఒకమారు పరిషత్తులో అతడు ధర్మామృతం పంచుతుండగా, మారుడు అతని మనస్సును ప్రలోభింపజేయడానికి పెక్కు విఘ్నాలు కలిగించాడు. బంగారుతోపాటు ముత్యాలవర్షం కురిపించాడు. చలచిత్తులైన శ్రోతలు భ్రమించిపోయారు. ఆహార్య సౌందర్యంతో లలితమైన నర్తకీరూపం ధరించి, గంధర్వాప్సరో గణాలతోపాటు నృత్యం చేశాడు. ఈ కాంతానృత్య విలాసహేలతో చలించినవారి మనస్సు కామమయమైంది.

ఈ విధంగా దుర్వినీతుడైన మారునికి, అతడు కలిగించే వికారాలకు అర్హమైన ప్రతిక్రియను వినయోద్యతుడైన ఉపగుప్తుడు ఆలోచించి, మారునితో ఇలా అన్నాడు: "ఓ మార! నీ కౌశలానికి సంతోషించాను. నీ నృత్యం, నీ గీతం దివ్యంగా ఉన్నాయి. ఏమని పొగడను?" ఇలా అంటూ మాలావ్యాజంతో మారుని తలపై చచ్చిన పామును, రెండు చెవుల మీద ఒక కుక్క, ఒక మనిషి శవాన్ని-మొత్తం మూడు శవాలను కట్టాడు. మారుడు ఆ శవత్రయాన్ని విడిపించుకోలేక ఇంద్రోపేంద్ర చతుర్ముఖాది దేవతలను శరణు పొందాడు. వారు కూడా వాటిని విడిపించలేకపోగా, బ్రహ్మ మాటమేరకు కందర్పుడు భగ్నదర్పుడై మరల ఉపగుప్తుణ్ణే శరణు పొందాడు; అతని పాదలపై పడి, గర్వం వదలి అత్యంత వినయంతో అతనిని ప్రసన్నుని చేసి కృతాంజలియై ఇలా మనవి చేశాడు: "అపకారం చేసిన నాకూ మీరు తగిన శాస్తి చేశారు. ఇక ప్రసన్నులుకండి. కోపం వదలండి. నేనిప్పుడు మిమ్మల్నే శరణు వేడాను. నేను ఎంత అపరాధం చేసినా మహాత్ముడైన సుగతుడు అవినీతుడైన కుమారుణ్ణి చూచినట్లుగా చూచి కాపాడినాడు. అతడు బోధిద్రుమమూలంలో వజ్రాసనంలో ఆసీనుడై తపస్సు చేసేటప్పుడు ఎన్నో విఘ్నాలు కలిగించాను. అతడు వాటినన్నిటినీ మన్నించాడు. నేను నానా ఆకారవికార చేష్టలు జరుపుతన్నప్పటికీ బోధిసమాధిభవనంలో పర్యంకబంధస్థితిలో ప్రాకారంలాగ చెక్కుచెదరకుండా ఉంటూ, క్షాంతితో కోపం కడిగివేసుకొని, ధ్యానపరాయణుడై వున్న ఆ శుద్ధాత్ముడైన బుద్ధభగవానుడు ఒక్కమారు కూడా కళ్ళు తెరచి నావైపు చూడలేదు. ఇప్పుడైతే మీరు కరుణ వదలి దుష్టునిగా లోకానికి నిరూపించారు. గొప్పవారి మనసు తప్పుచేసినవారి ఎడ కూడ మన్యుమలినంగా ఉండదు. ఈ కుణపబంధం వదలించండి. నేను మీ ఆజ్ఞలోనే వుంటాను."

ఈ విధంగా మదనుడు దీనంగా వేడగా, ఉపగుప్తుడు ప్రేమతో ఇలా అన్నాడు: "ఇకమీద నీవు ఈ విధంగా భిక్షువుల మనస్సును క్షోభపెట్టకపోతే నేనీ కుణపబంధం వదలిస్తాను.. నీవు నాకోసం మరొక పనిచేయాలి. అతీతుడైన సుగతుని ఆకారాన్ని చూపు. అందరినీ అనుకరించే నీశక్తిని నీ నృత్యంలో నేను చూచాను. భగవానుని స్వరూపం చూడాలని నాకు చాల ఉత్కంఠగా వుంది. నేను సుగతుని ధర్మకాయం చూచాను గాని నయనామృత నిర్భరమైన రూపకాయం నేను చూడలేదు." ఇలా కోరుతూ కుణపబంధం తొలగించాడు. ఆ పీడ వదలిన తర్వాత కుసుమాయుధుడు "సుగతుని రూపంతో సమానంగా అనుకరించడం శక్యం కాదు. అయినా నీ ఆజ్ఞాబద్ధుణ్ణై ఆ రూపం చూపడానికి ప్రయత్నిస్తాను. అని పలికి అవికార సుఖప్రదమూ, సముత్సృష్టకనకాలోకకాంతమూ అయిన సుగతాకారం ప్రదర్శించాడు.



దీర్ఘధ్యాన నిమీలితలోచనయుగళంతో, కదలని కనుబొమలతో, నాసావంశంపై కనకచ్ఛత్రోపమానమైన సుందరమైన సుడితో, ఆభరణ రహితమైన ఆయతమైన లలితకర్ణపాశంతో, వ్రేలాడుతున్న బాహుద్రుమాలతో ఒప్పారే బుద్ధరూపం చూచి నిశ్చేతనాలకు కూడా నిర్వృతి కలిగింది.

ఉపగుప్తుడు మనోహరమైన ఆ భగవానుని రూపం చూచి మేను గగుర్పొడిచి, కళ్ళలో ఆనందబాష్పాలు నిండగా, పాదవందనం చేశాడు. "అహహ! నాకు నమస్కారం చేయవద్దు! చేయవద్దు!" అని మన్మథుడు అడ్డుపడగా, ఉపగుప్తుడు "జినాకృతిలో వున్న నీవు నమస్కారార్హుడివే. కృత్రిమమైన బింబాలలోను వున్న భగవదాకృతి వందనీయమే. పండితులు ఆ బింబాలకు నమస్కరిస్తున్నారంటే మృత్కాష్ఠధాతులకు నమస్కరిస్తున్నారని కాదు" అని సమాధానం చెప్పాడు. ఉపగుప్తుని మాటలు విని మారుడు ప్రసన్నుడై సౌగతరూపం వదలి, స్వస్వరూపం ధరించాడు.

పిదప మారుడే వినయంతో, హితచింతతో సద్ధర్మం వినడానికి ప్రజలను ఆహ్వానించాడు. ఆ ఆహ్వానంతో పౌరులు ఉపగుప్తుని సన్నిధికి వచ్చి, అతని ఉపదేశవాక్యాలతో సత్యం దర్శించి నిర్వృతులైనారు. ఈవిధంగా పురవాసులలో పద్దెనిమిది లక్షలమంది అర్హత్వం పొందారు.

విపులతరమైన కుశల మూలంతో పుణ్యవంతులైనవారి ధర్మమార్గోపదేశం సకల లోకాలోకకల్యాణకారి, వ్యథిత తిమిరహారి అవుతుంది. అలాగే, వారి మహాబుద్ధి(మహాప్రభావం) ఇతరుల హితం కోసమూ అవుతుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ఉపగుప్తావదానమనే డెబ్బయిరెండవ పల్లవం

# 73. నాగదూతప్రేషణావదానం

అఖండమైన శాసనం, విస్తారమైన సంపద, శతతుషారాంశుధవళమైన యశస్సు, అత్యాశ్చర్యకరమైన ప్రభావమూ సుగతుని అర్చించడం వల్ల కలిగే ఫలాంశలేశాలు.

పూర్వం పాటలీపుత్రమనే పట్టణంలో అశోకుడనే రాజు వుండేవాడు. అతనిని అర్థించేవారిని లెక్కపెట్టడానికి సంఖ్యలే లేకపోయాయి. అతడు ఒకనాడు కొలువుదీరి ఉండగా, సర్వస్వం పోగొట్టుకొని శోకార్తులైన సముద్రవర్తకులు వచ్చి నిట్టూరుస్తూ, "దేవ, నీ సుదీర్ఘ బాహువుల నీడలో భువనం ప్రశాంతితో విశ్రమించింది. నీ రాజ్యంలో చింతాసంతాపితమానసులెవరూ కనిపించరు. సాగరవాసులైన నాగులు మా ఓడను పగులగొట్టి మా రత్నరాశిని అపహరించారు. అది భాగ్యదౌర్బల్యం. మేమేమో మరొకచోటికి వెళ్ళి పొట్టపోసుకుంటాము. కాని, మీరు ఆ నాగులను ఉపేక్షిస్తే సముద్రయాత్ర విచ్ఛిన్నమైపోయి, కోశాగారం వట్టిపోతుంది" అని విన్నవించారు. వారి మాటలు విని రాజుకు హృదయవ్యథ ఏర్పడింది. సముద్రంలో వసించే నాగులను ఏమీ చేయలేకపోతున్నామనే చింతతో కుమిలిపోయాడు.

ప్రతీకారం చేయలేని కోపంతో వ్యాకులమానసుడైన రాజును చూచి, సమీపంలో ఉన్న షడభిజ్ఞుడైన ఇంద్రుడనే భిక్షువు "ఓ పృథివీపతీ! రత్నచోరులైన నాగులకు నీ ప్రతాపాగ్ని సూచించే తామ్ర శాసనమొకటి పంపు" అని ఉపదేశించాడు. భిక్షువు మాటను మన్నించి రాజు తామ్రపట్టంపై లేఖ వ్రాసి సముద్రంలో వదిలాడు. ఆ తామ్రశాసనం సముద్రంలో పడీపడగానే, నాగులు దానిని తీరానికి విసిరివేశారు. ఆ అవమానానికి రాజు ముఖకమలం వాడి, కాంతి తరగిపోగా, చింతతో మతి మరుగైపోగా, ముక్కుమీద వేలు పెట్టుకొని, నిట్టూరుస్తూ ఉన్నచోటనే ఉండిపోయాడు. షండునికి అంగనవలె, నిద్ర అతనికి పరాఙ్ముఖి అయింది. లుబ్ధుని తృష్ణవలె రాత్రి అతనికి అతిదీర్ఘమై తరగనిదయినది.

ఇలా వ్యాకులుడై ఉన్న రాజును, పరార్థం కోసం పాటుపడుతున్న రాజును చూచి వ్యోమదేవత కరుణించి, సమీపానికి వచ్చి, "భూపాల, ఉపాయం ఉండగా చింతపడడం తగదు. అంజలి రంజితమైన శిరస్సుతో జినదేవుని ప్రణమించి తత్పరిణామంతో మహాపుణ్యవంతులైనవారు విశ్వవిజేతలు. సువర్ణ(మంచి వర్ణాలు, మంచిరంగులు) విచిత్రశోభలీనే వారి ఆజ్ఞామాలికను దేవతలు కూడ శిరసావహిస్తారు" అని అన్నది.

ఆ వ్యోమదేవత మాటలు విని నరపతి ఉదయమే లేచి స్నానాద్యనుష్ఠానాలు తీర్చి, శుచివ్రతుడై పరిశుద్ధమైన మనస్సుతో సిద్ధిని కాంక్షిస్తూ బుద్ధుని ధ్యానించి ఇలా స్తుతించాడు: "సత్త్వగుణపూరంతో మందహాసం చేసేవాడు, సరసకరుణాకౌముదీ పూరిత హృదయుడు, సకల తమస్సులను అణచివేసి కమనీయంగా కనిపించేవాడు, శుక్లపక్షపాతి, నిత్యానందుడు, పరమామృతస్వరూపి, నిర్వికారుడు, సకలలోకాలను ధవళకాంతులతో అభిషేకించేవాడు, తాపప్రశమనమిత్రుడు అయిన బుద్ధపూర్ణచంద్రునికి



నమస్కారం. ఎవరి మనస్సు ఎల్లప్పుడు విషయదోషపరాఙ్ముఖమో, ఎవరు పరమపారమితప్రజ్ఞకు ఆశ్రయులై చిత్తాన్ని వశపరచుకొన్నవారో ఆ పరిహితాభినివేశపరులు, సంకల్ప కల్పతరువులు నాకు పరమకుశలం ప్రసాదింతురుగాక!"

ఈ విధంగా అశోకభూపతి భక్తివిధానంతో, ప్రణిధానంతో అర్చించగా, సకల దిక్కులనుంచి, అరవైవేలమంది అర్హతులు ఆవిర్భవించారు. ఇంద్రభిక్షువు రాజు సువర్ణమూర్తి నొకదానిని, నాగరాజ సువర్ణమూర్తి నొకదానిని నిర్మించాడు. రాజు సువర్ణ విగ్రహం నెమ్మదిగా తన తలను వంచసాగింది. నాగేంద్రమూర్తి విస్మయం కలిగిస్తూ తల ఎత్తసాగింది. రాజు రత్నత్రయాన్ని అర్చించినకొద్దీ నాగరాజు విగ్రహం తల వంచసాగింది. రత్నత్రయార్చన తర్వాత రాజు మరల తామ్ర శాసనం సముద్రానికి పంపాడు. అప్పుడు నాగపుంగవులు తమ భుజాలపై వణికిక్కుల రత్న సంచయమంతా మోసుకొని వచ్చారు.

పిదప రాజు ఆ ధనాన్ని, రత్న సంచయాన్ని వర్తకులకు అందజేసి నాగులను వీడ్కొల్పి, జినశాసనంపై ఆదరాభినివేశం కలవాడై అర్హతులకు రాజోచితమైన ఉపచారాలతో పూజలు జరిపి, అనల్ప సంకల్పాలతో బుద్ధదేవుని సందర్శించాలని ఉబలాటపడ్డాడు. బుద్ధుడు పరినిర్వాణం చెంది దర్శనదూరుడు కావడం వల్ల, ఉపగుప్తుడనే అర్హతుడు, గుణగణాలలో బుద్ధునితో సమానుడు, ఉన్నాడని విన్నాడు. అతడు భక్తియుతులకు విధేయుడని రాజు తెలుసుకుని, ఉరుముండమనే ప్రాంతంలో నివసిస్తున్న అతనిని, దూతలను పంపి ఆదరంతో పిలిపించాడు. అతనికి సపర్యలు చేసి, దానివల్ల పర్యంత సద్ధర్మకుశలం పొంది, రత్నత్రయపరాయణుడయ్యాడు.

ఈ విధంగా రాజు జినస్మరణంతో అపూర్వ పుణ్య మహోదయ సంపత్తి పొంది, విషధరులయిన నాగుల శిరస్సులపై కూడా తన శాసనాన్ని కుసుమమాలవలె అలంకరించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో నాగదూతప్రేషణావదానమనే డెబ్బయిమూడవ పల్లవం

# 74. పృథివీప్రదానావదానం

పూర్ణాంగరుచిరము, పృథుమధ్య దేశము(పృథుమహారాజు మధ్య దేశమున గలది), అయిన గోవును (భూమిని) పూర్ణాంగరుచిరము, పృథుమధ్యదేశము (పెద్దదైన పొదుగు గలది) అయిన గోవును (ఆవును) వలె అనాయాసంగా, వత్ససహితంగా (దూడతోపాటు, తనకుమారునితోపాటు) దానమిచ్చే దానపరాయణుల పుణ్యం ప్రణామయోగ్యం ఎందుకు కాదు?

పూర్వము అశోకక్షితిపతి విస్తృతమైన దానాభ్యాసంతో అభ్యాగతులకు కల్పవక్షమయ్యాడు. అతడు తన గృహంలో ప్రతిదినమూ మూడులక్షలమంది భిక్షువులకు రాజోచితమైన భోజనాంబరాభరణాలతో భక్తితో పూజించాడు. అతడు భిక్షువులకు శతకోటి హేమనాణకములను దానం చేయడానికి నిశ్చయించాడు. నిజమే. కుశలశాలురకు సత్త్వగుణమే స్థిరతరమైన కోశం. ఆ మహావిభవవంతుడు ఇరవయ్యారు సంవత్సరాలలో సంఘానికి తొంభయ్యారు కోట్ల బంగారు నాణేలను సమర్పించాడు.

తర్వాత కాలక్రమంగా, ఆ నరపతి వ్యాధితుడై దుఃఖితుడయ్యాడు. సుకృతాలు స్థిరాలుగాని శరీరాలు స్థిరాలు కావుగదా! రాజు తన దేహం అవసానదశ పొందనున్నదని నిశ్చయించి, కుక్కుటారామంలోని భిక్షువులకు ధనమివ్వ నిశ్చయించాడు. దానపుణ్య ప్రవృత్తుడైన అతని శాసనాన్ని లోభాంధుడైన అతని పౌత్రుడు సంపది అనేవాడు కోశాధ్యక్షులకు చెప్పి వారింపజేశాడు. రాజు ఆ సంగతి గ్రహించి, మందుగా తనకిచ్చిన ఉసిరికలో సగం సర్వస్వమని భావించి దానమిచ్చాడు. పిదప ధీమంతుడైన రాధగుప్తుడనే మంత్రి సమ్మతితో తన పాలనలో ఉన్న భూమినంతా సంఘానికి దానం చేశాడు. గంగాంబు భారంతో రుచిర, చతురంబురాశివేలావిలాసవసన, మలయావతంస అయిన అఖిల వసుమతిని దానం చేసి ప్రమాణరహితమైన పుణ్యం, హితం కోసం సంపాదించాడు.

తొంభయారుకోట్ల బంగారు నాణేలు దానం చేసి అశోకనరపతి స్వర్గస్థుడు కాగా, అతని పౌత్రుడు మంత్రిమాటలను పాటించి, శేషించిన నాలుగు కోట్ల బంగారు నాణేలతో దానమిచ్చిన భూమిని మరల కొన్నాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పృథివీప్రదానావదానమనే డెబ్బయినాల్గవ పల్లవం

# 75. ప్రతీత్యసముత్పాదావదానం

ఈ సంసారతరువు రీతి విచిత్రమైంది. దీనికి మూలమేమో అవిద్య. ఈ విషయాన్ని తెలుసుకోగలవాడు, చెప్పగలవాడు, నాశం చేయగలవాడు సర్వజ్ఞుడైన బుద్ధభగవానుడు తప్ప మరొకడు కాడు.

పూర్వం జినదేవుడు శ్రావస్తిలో జేతవనారామంలో విహరిస్తూ, ఒకనాడు భిక్షుసంఘానికి ఈ విధంగా ప్రబోధం చేశాడు. అతడు అశేషదర్శి. "భిక్షువులారా, ప్రజ్ఞాప్రకాశంతో మనస్సును నిర్మలం చేసుకొని వినండి. మీ శ్రేయస్సుకోసం ప్రతీత్యసముత్పాదాన్ని యథాక్రమంగా మీకు చెబుతాను. దుఃఖాలనే బోదెలతో ఏరాళంగా పెరిగిన ఈ సంసార విషవృక్షానికి మూలబంధం కల్పించేది అవిద్యా వాసనే. ఆ వాసన వల్లనే కాయువాఙ్మానసాత్మకములైన సంస్కారాలు పుడుతాయి. ఈ సంస్కార సముద్భూతమే విజ్ఞానమన్నది. ఇది మనస్సనే షష్ఠేంద్రియాత్మకమైనది. ఆ విజ్ఞానం నుంచి సంజ్ఞాసందర్శనాత్మకమైన నామరూపాది కలుగుతుంది. ఇదే మనస్సనే షష్ఠేంద్రియస్థానజన్యమైనది. ఆరుస్థానాలలో పుట్టేది-షడాయతనమైనది. షడాయతన సంశ్లేషమే స్పర్శం. షట్ స్పర్శానుభవమే వేదన. ఈవిధంగా విషయ సంశ్లేష రాగం వల్ల తృష్ణ ఏర్పడుతుంది. కామాదులందు ఆ తృష్ణ ఏర్పడి ఉపాదానమౌతుంది. ఈ ఉపాదానం నుంచే కామరూపారూప్యమయమైన భవం ఏర్పడుతుంది. ఈ భవం నుంచి నానాయోనిపరావృత్తితో జాతి-జన్మ-పుడుతుంది. ఈ జాతినే జరామరణశోకాదులు ఆశ్రయించి ఉంటాయి. అవిద్యాదులను నిరోధించడం వల్ల, జాత్యాదులన్నీ అణగారిపోతాయి.

"ఈప్రతీత్యసముత్పాదం అవిద్యామూలమైనది, బహుగతి గలది. మీరు విజనంలో, వనంలో శమాదిగుణాలతో దీనిని పర్యాలోచించాలి. ఈ ప్రతీత్యసముత్పాదాన్ని బాగా తెలుసుకొన్నట్టయితే, కాలక్రమాన అది సన్నగిల్లుతుంది. సన్నగిలిన మీదట దానిని సుఖంగాను, సులభంగాను నివారింపవచ్చును."

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ప్రతీత్యసముత్పాదావదానమనే డెబ్బయి అయిదవ పల్లవం

# 76. విదురావదానం

కాముకులకు ఈర్ష్యతో మనస్సు తపించి క్రోధం ముప్పిరిగొంటుంది. క్రోధాంధులు మతి ధ్వంసమైపోగా, తీవ్రాంధకారంలో పడిపోతారు. ఆ అంధకారంలో క్రూరతరమైన అనేక ప్రకారాలైన నరకక్లేశంతో మూర్ఛితులై, కల్పాంతం వరకు కత్తుల పడకవంటి విషమభూమిలో క్షతగాత్రులై పొర్లాడుతూ క్షయిస్తారు.

పూర్వం జినభగవానుడు శ్రావస్తిలో విహరిస్తున్నప్పుడు ఒకనాడు అచిరవతీ నదీతీరానికి వెళ్ళినప్పుడు ఒక వికారరూపమైన జంతువును చూచాడు. దానిని జనం చుట్టూ మూగి చూస్తున్నారు. దాని మహాకాయమంతా వ్రణాలతో నిండింది. ఆ వ్రణాలలో పురుగులు లుకలుకలాడుతున్నాయి. నరకబాధ అనుభవిస్తున్నట్లు ఆ మహాకాయం కేకలు పెడుతున్నది. ఇంతలో బుద్ధదేవుణ్ని జనం చూచి, దారియిచ్చి కూర్చోడానికి నదీతీరంలో ఆసనం కల్పించింది. బుద్ధభగవానుడు ఆసీనుడై సర్వజ్ఞుడు గనుక కరుణ కలిగి సమాధితో పుట్టుగుడ్డి, మహిష సమానము అయిన ఆ వికృతాకారం పూర్వజన్మను తెలుసుకొని "విదురా!, నీవు చేసిన క్రూరచర్యల ఫలం అనుభవిస్తున్నావుగదా! దౌర్జన్య చర్యలను ప్రేరేపించిన నీ పూర్వబుద్ధి జ్ఞాపకం వుందా?" అని ప్రశ్నించాడు. ఆ మాటలకు ఆ వికారజంతువు జనమంతా ఆశ్చర్యపడగా, మనుష్యవాక్కుతో ఇలా అన్నది: "భగవన్! తీవ్రపాపానికి ఘోరఫలం అనుభవిస్తున్నాను." ఆ వికారజంతువు పూర్వజన్మ జ్ఞానంతో మాట్లడడం విని జనమంతా విస్మయంతో "ఏమిటిది?" అని భిక్షుసంఘాన్ని ప్రశ్నించింది. ఆ మీదట భిక్షుసంఘం ఆనందుణ్ణి ప్రశ్నించగా, ఆనందుడు జినదేవుని ఆ విదురుడు చేసిన పాపకార్యం ఏమిటో తెలుసుకొందామనే కుతుకంతో ప్రశ్నించగా, జినదేవుడు ఇలా అన్నాడు:-

"పూర్వం ఉజ్జయినిలో విదురుడనే రాజు వుండేవాడు. అతడు అశోకవృక్షంవలె లోలాక్షుల చరణాఘాతాలను కాంక్షించేవాడు. అతడు ఒకమారు మధుపబంధువైన మధుమాసంలో పిల్లగాలులలో అల్లలలాడే లతావృక్షాలుగల కాననంలో విహరించాడు. అతని అంతఃపురకాంతలు తమ అందెల మధురారవంతో పక్షులను విస్మయంతో ఎగిరిపోయేట్లు చేస్తూ, పూలు కోస్తూ తిరిగారు. అక్కడ ఒకచోట శాంతికి పుట్టినిల్లా అన్నట్లు ఉన్న ఒక ప్రత్యేకబుద్ధుడు పర్యంకబంధంతో ధ్యానస్తిమితనేత్రుడై ఉండడం, ఆయన చుట్టూ అర్హంతులు పరివేష్టించి ఉండడం చూచారు. ఆయనను చూచిన వెంటనే వారి మనస్సు ప్రసన్నమైంది. అతడు ధ్యానానంతరం అమృతం పంచిపెడుతున్నట్లు ధర్మోపదేశం చేయగా, వారంతా పాదాభివందనం చేసి, అతని చుట్టూ కూర్చుని వినసాగినారు.

ఇంతలో రాజు అక్కడికి వచ్చాడు. ఆ ప్రత్యేకబుద్ధుని ఎదుట తన అంతఃపుర కాంతలు కూర్చుని ఉండడం చూచి, మహాక్రోధంతో, శుద్ధశీలలైన ఆ కాంతలందరినీ చంపివేయండని భటులకు



ఉత్తరువు చేశాడు. ఆ పాపంతో బహుకాలం నరకంలో ఘోరాకృతితో పడి, వికృత జంతువులతో తినబడుతూ గడిపాడు. చూడండి. ఆపాదమస్తకం ఎన్ని పుండ్లు ఉన్నాయో! వాటిలో ఎన్ని క్రిములు లుకలుకలాడుతూ, జుగుప్స కలిగిస్తున్నాయో! కల్పాంతం వరకు నరకం అనుభవించి చండాల జన్మయెత్తి, వేటగాడై ప్రత్యేకబుద్ధుని చంపుతాడు. మరల నరకంలో పడి, దేహం కుళ్ళి బాధపడుతూ, సంఖ్యాతీతమైన కాలానికి మనుష్యజన్మ పొందుతాడు. దీర్ఘక్లేశానలంతో కాగి, ఉద్విగ్నుడై, పాపం క్షయించగా, అనుత్తరజ్ఞానంగల శాస్త్ర శాసనంతో ప్రవ్రజ్య స్వీకరిస్తాడు. అప్పుడు కాశిరాజు ఉద్యానంలో అతని కాంతలు పూజిస్తారు. కాశిరాజు ఈర్ష్యాకోపాలతో ఇతనిని చంపివేయండని ఉత్తరువు చేస్తాడు. అప్పటికి ఇతని తీవ్రదుఃఖాగ్ని అంతమవుతుంది.

శాస్త్ర ఈ విధంగా సెలవియ్యగా, అందరూ వైరాగ్య సంపన్నులయారు.

ఉద్వేగంతో, భవభయక్లేశచింతతో బాధపడుతున్న ఆ జనం అమృతప్రవాహం వంటి శాస్త్ర నిండుమాటలు కుశలపు జల్లులలాగ పడగా, ఆహ్లాదం పొందారు. వారి తాపం మటుమాయమైపోయింది. వారు ప్రశమ కుసుమారామం సేవించినట్లయింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో విదురావదానమనే డెబ్బయి ఆరవ పల్లవం

# 77. కైనేయావదానం

ఖలునికి ఉత్కర్షం కలిగితే, గుణాలకు మ్లాని కలుగుతుంది. మహాత్ములకు ఉత్కర్షం కలిగితే, అభ్యుదయం ఇనుమడిస్తుంది. పూర్వం సుగతదేవుడు మందాకినీతీరంలో ఆహమాయా వనోపాంతంలో సూతాగారంలో ధ్యానపరాయణుడై ఉండగా ఎద్దులను, కర్షకులను పిండి పిండి చేసిన పిడుగుపాటు ధ్వని కూడా ఆయనకు వినబడలేదు. ధ్యానానంతరం అతని ప్రవచనం వినడానికి ధృతరాష్ట్ర, విరూఢక, విరూపాక్ష, ధనాధిపులనే నలుగురు మహారాజిక దేవతలు వచ్చారు. వారు ఆయన ముందు రత్నాలు, కుసుమాలు చల్లి పాదాలకు నమస్కరించారు. వారు నలుగురులోను ధృతరాష్ట్ర విరూఢకులు ఆచార్యజాతివారు; తక్కిన యిద్దరూ క్రూరజాతివారు. వారికి సుగతుడు వారి భాషలోనే ఉపదేశం చేశాడు. వారు దానితో శాసన ధర్మాలలో విశారదులయారు. వారు శిక్షాపదం ఆశ్రయించి, రత్నత్రయపరాయణులై భగవానునికి నమస్కరించి విమానంలో దేవలోకానికి వెళ్ళారు. వారు వెళ్ళిపోగానే భిక్షువులందరూ ఆశ్చర్యంతో వారి పూర్వపుణ్య సంచయమేమిటని ప్రశ్నించగా, ఆ సర్వవేది యిలా తెలిపాడు.

"పూర్వం అల్పాశ్వాసుడు, మహాశ్వాసుడు అనే యిద్దుర నాగులు, వారికి ద్వేషులైన చూడి, మిటిస్వరుడు అనే యిద్దరు గరుడులు ఉండేవారు. నాగులిద్దరూ కాశ్యపుడనే ప్రత్యేకబుద్ధుని శాసనం పొంది, బలశాలులై గరుడులకు లొంగకుండా ఉండేవారు. గరుడులు కూడా ఆ నాగులపై ద్వేషాసూయాభిమానాలతో, వారిని ఎలాగైనా వంచాలనే దృష్టితో, ఆ కాశ్యపునినుంచి ఉపదేశం స్వీకరించి రత్నత్రయాన్ని శరణు పొందారు. వారే నాగాచార్యజాతివారైన ధృతరాష్ట్ర విరూఢకులు. క్రూరులైన ఆ గరుడులే విరూపాక్షధనాధిపులయారు."

జినదేవుడు ఈ విధంగా చెబుతుండగా ఆ వన సమీపవాసి అయిన కైనేయకుడనే ముని ఆ వచనామృతం విని, ఆయన ప్రభావానికి విస్మితుడై ఆయనను శరణు పొంది, అనాగామి ఫలాప్తితో సత్యాన్ని దర్శించి సంతృప్తుడయ్యాడు. అతని భాగినేయుడు(మేనల్లుడు) శైలుడనే వాడు కూడా వినయాన్ని ఆశ్రయించి, అనగామిఫలోదారమైన సత్యదర్శనం పొందాడు. వారిద్దరూ ధర్మశాసనంతో ప్రసన్నులై తమ అనుయాయులతో కూడ ప్రవ్రజ్యను స్వీకరించి; శ్లాఘ్యమైన అర్హత్వం పొందారు. మిగిలినవారికి సుగతుని అనుజ్ఞతో కఫిణుడు, శారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు ధర్మోపదేశం చేశారు.

కైనేయశైలులు మనఃప్రసాదసిద్ధిని చూచి ఆశ్యర్యపడిన భిక్షుగణం వారి పుణ్యం గురించి భగవానుని ప్రశ్నించగా, ఆయన ఇలా అన్నాడు: "పూర్వం వీరిరువురూ అంగుడు, అంగనుడు అనే గృహపతులు.



ధర్మనిరతులైన వీరిద్దరూ మిత్రులై వారాణసిలో ఉండేవారు. వీరు కాశ్యపునివద్ద బ్రహ్మచర్యదీక్ష పూర్తి చేసి, అంతిమప్రణిధాన పరిణామంతో ఇప్పుడు ప్రశాంతతను పొందారు."

ప్రణిధానం వల్ల మునివరులకు కలిగిన పుణ్యం తథాగతుడు చెప్పగా విని, ప్రశమన విషయంలో అవహితులై భిక్షువులు భవభుజంగ వినాశానికి పూనుకున్నారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కైనేయావదానమనే డెబ్బయి యేడవ పల్లవం

# 78. శక్రచ్యవనావదానం

మహాత్ములు శమప్రగల్భమూ, దయాప్రణయిని అయిన దృష్టితో త్రిదశేశ్వరునైనా చూడగలరు. వారి ప్రభావమహిమ మహోర్ణమైనది; కౌతుక శిఖరాలకు తీసుకొని వెళ్ళేదీని.

ఒకప్పుడు శక్రుడు సుఖాసీనుడై ఉండగా, త్రిదివచ్యుతిలక్షణాలు అతనిని ముసిరాయి. అతనికి సింహాసనంలో సంతోషం, అభిరతి కలుగలేదు. అతని శిరస్సు మీద సువర్ణమందారమాలిక పుణ్యానాశం వల్ల తరిగిపోయే తారుణ్యంగల సిరివలె మలినమైంది. యశస్సువలె ధవళమైన అతని నుదుట తిలకంపై దానిని లోపింపజేసే అపవాదాలవలె స్వేద బిందువులు పుట్టాయి. పతనం ఆసన్నమైన అతని మనస్సును చింత ఆక్రమించడం చూచి ఈసు కలిగినదా అన్నట్టు ధృతి(ధైర్యం) దూరంగా వెళ్ళిపోయింది.

ఈ విధంగా శోకాక్రాంతుడైన అతనిని చూచి శచీదేవి చకితురాలై ఇలా సమాశ్వాసించింది: "పతనం సమీపిస్తుండగా అవలంబనం ఏమిటో చూసుకోండి. జగత్పతి అయిన మీకే ఈ క్లేశాలు ముసురుతున్నాయంటే, ఇక లోకంలో విపత్తులను ఉల్లంఘించడం సాధ్యం కాదన్నది నిశ్చయం. ఆపదలు, దుష్టులు విముఖులు కావడం వల్ల గుణలోభంతో వెదికి వెదికి ఉత్తములే ఆశ్రయిస్తాయి. కనుక మీరు జంబూద్వీపానికి వెళ్ళి వ్యసనాలనుంచి రక్షించగల శ్రమణుని వెదకండి. శ్రమణులు విపులప్రభావోత్కర్ష కలవారని వింటున్నాము. కుశలగాములైనవారు వ్యసనపీడితులకు కుశలం కలిగిస్తారు."

ఈ విధంగా ప్రియురాలు హితవు చెప్పగా, మరుత్పతి అంగీకరించి, భూలోకానికి దిగివచ్చి, శ్రమణులను కలుసుకొని క్లేశసంక్షయం కోసం ప్రార్థించాడు. శక్రునంతటివాడు తమ ఎడ ప్రణయం- చనువు- చూపగా, ఉబ్బిపోయిన ఆ శ్రమణులు వ్యగ్రచిత్తంతో అంజలి ఘటించి తలవంచి ప్రణామాలు చేయసాగినారు. "నన్ను నమస్కరించేవారు. నన్నేమి రక్షిస్తారు?" అని మరుత్పతి భావించి భగ్నమనోరథుడై తన లోకానికి వెళ్ళిపోయాడు.

కొంతకాలానికి పతనం ఆసన్నమైంది. అప్పుడు పరమామృతం సాధించిన సుగతుడు జ్ఞాపకం వచ్చి, అతడే పరిత్రాత అని భావించాడు. ఆ సమయంలో తథాగతుడు ఇంద్రమాల గుహాంతరంలో ధ్యానమగ్నుడై తేజోధాతువు మూర్తీభవించినట్టు సమాధిలో వెలిగి పోతున్నాడు. ఇంద్రుడు అనుచరసహితుడై అతని దర్శనానికి బయలుదేరి గుహచేరి, పంచశిఖుడనే గంధర్వపుత్రుని సాదరంగా "కుమార, తథాగతుడు తేజోధాతుసమాపన్నుడయాడు. నీ కళాకౌశలంతో ఆయనను మేల్కొల్పుము. పెద్దల దగ్గరికి అకాలంలో వెళ్ళేవాడు, ముందు తెలుపకనే వెళ్ళేవాడు, ఆశయాన్ని తెలియక ప్రవర్తించేవాడు అవమానపాత్రమవుతాడు" అని అన్నాడు. సురరాజు మాటలను ధీమంతుడైన గంధర్వకుమారుడు గ్రహించి, తన వైదూర్యదండమండితమైన వీణను సారించి సుస్వరాలు పలికించి, స్వభావ మధురోదారమైన స్తుతిగీతాలతో జినదేవుని మేల్కొల్పి, ఇంద్రునికి దర్శనావకాశం కల్పించాడు.



పిదప ఇంద్రుడు దేవతలతో సహా ప్రవేశించి ప్రశమామృతం వర్షిస్తూ, హర్షం కలిగిస్తున్న సుగతుని దర్శించాడు. సతమస్తకుడై నమస్కరించి, శాస్తపాదనఖదర్పణాలను తన శిరస్సులోని మందార కుసుమమకరందంతో కడిగాడు. జినదేవుడు అతని యెడ ప్రసన్నుడై అనుగ్రహించాడు. దానితో ఇంద్రునికి సత్యం గోచరమై ధర్మచక్షువు కలిగింది. ఆ పుణ్యప్రభావంతో ఇంద్రునికి పతన లక్షణాలు శమించి, స్వపదవి మరలా లభించింది. అతడు యావజ్జీవమూ సుగతుని శరణు పొంది, "ఇక కాలాతీతమైంది. అనుజ్ఞ ఇవ్వండి" అని అతని వద్ద సెలవు తీసుకొని స్వర్గానికి వెళ్ళాడు. తర్వాత శక్రుడు తుంబురు సుత అయిన లలితను పంచశిఖునికిచ్చి పెండ్లి చేశాడు. ఉత్తములకు ఇతరులు చేసిన ఉపకారలేశం కూడ అప్పువలె చింత కలిగిస్తుంది.

శక్రుని కుశలావాప్తికి విస్మితమైన భిక్షుగణం ప్రశ్నించగా, సర్వజ్ఞుడు ఇలా అన్నాడు: "పూర్వం శోభావతి అనే పట్టణంలో శోభుడనే పృథివీపతి ఉండేవాడు. అతడు కకుత్సందుడనే శాస్తకు స్తూపం నిర్మించాడు. ఆ పూర్వపుణ్య ప్రణిధానయోగం వల్ల, ఆ రాజు త్రిదశేశ్వరపదవి పొందాడు." భగవానుడు ధర్మానుబద్ధమైన శక్రుని విభూతిని ఈవిధంగా చెప్పి ప్రశాంతిని కలిగించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శక్రచ్యవనావదానమనే డెబ్బయి యెనిమిదవ పల్లవం

# 79. మహేంద్రసేనావదానం

గృహరాక్షసులైన స్త్రీలతో మతిపోగొట్టుకొని, సుఖవాంఛ కోసమే ధనసంపాదన ప్రవృత్తమానసుడైన పురుషుని దేహాన్ని పరుషమైన కష్టాలు ఆక్రమిస్తాయి. శమసంపాదనం వినా అవి శమించవు.

పూర్వం శ్రావస్తీ నగరంలో జీవశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు సగం వయస్సు వరకు వేదాధ్యయనం చేస్తూ బ్రహ్మచర్య దీక్షతో ఉన్నాడు. ముదిమి తొంగిచూచి గడ్డం మీసాలు పండబారుతున్న సమయంలో స్నేహంతో బంధువులు ప్రార్థించగా, ధర్మమార్గానురోధం కోసం వివాహం చేసుకున్నాడు. తరలిక అని అతని భార్య పేరు. ఆ తరళేక్షణ తరుణి కనుక అతడు సంభోగలుబ్ధుడైనప్పటికీ, వృద్ధుడు కావడం వల్ల అతని ఎడ ప్రీతికలది కాలేదు. క్రమంగా ఆమెకు అతనిపై అరుచి పూర్తిగా కలిగింది. నిజమే. స్త్రీలు తమపై ప్రీతి లేనివారిపై సంసక్తలౌతారు; ప్రీతి కలవారిపై విరక్తలౌతారు.

ఒకనాడు ఆ తరుణి ఇలా ఆలోచించింది: "ముసలితనంతో నెరిసిన తలగల వీడు నాకు అనర్హుడు. నా ఈ యౌవనదర్పంలో నా దురదృష్టవశాత్తు ఈ మగడు పాలబడ్డాడు. వృద్ధునికి తరుణీభోగం శరీరక్షయ సూచకం. ఇక తరుణులను అంటకు అని ముసలితనం వృద్ధుని సిగ పట్టుకొని చెప్పుతున్నాదా అన్నట్టు తల నెరిసింది. ముసలివారు శరీరం వంగి వంకరటింకరగా మెల్లగా నడవడం చూస్తే, పోగొట్టుకుపోయిన యౌవనమణిని భూమిలో వెదుకుతున్నాడా అనిపిస్తుంది. వృద్ధుడు బుద్ధిమంతుడై తన పరలోక ప్రాప్తికోసం నన్ను పెండ్లాడినప్పుడు, నేను పరభోగ ప్రణయిని ఎందుకు కాకూడదు? కనుక అలాగే చేస్తాను. వీడు ఎప్పుడూ ఇంట్లో ఉండగా, రంకుమగల ప్రేమనిర్దయ సంభోగనిరర్గళసుఖం అనుభవించడం సాధ్యం కాదు."

ఈ విధంగా ఆలోచించి ఆ తరళేక్షణ నెమ్మదిగా పతివద్దకు వచ్చి, అభిజాత్యం చూపుతూ, వినయంతో సిగ్గుపడుతూ ఇలా అన్నది: "మీరు ఎప్పుడూ ఇంట్లోనే ఉంటూ, మరొక వ్యావృత్తి లేకుండా సుఖం కోరడం వల్ల చేజేతులా దారిద్ర్యం తెచ్చుకొన్నారు. అయ్యో! ఇది సహించరానిది. ఉద్యోగాన్ని ద్వేషిస్తూ, అలసత్వాన్నే యిష్టపడేవారు బహువ్యయ ప్రవాహార్హమైన వివాహం ఎందుకు చేసుకోవాలి? గృహపతి సోమరితనంతో ఇంటిమూల వదలకపోతే, ధనార్జనకోసం ఆ యింటి ముగ్ధాంగనలు వెలుపలికి బయలుదేరాలా? పురుషుడు ఉత్సాహంతో వెలుపలి వ్యవహారాలు చూచుకొంటే, స్త్రీ గృహకార్య సంసక్త అయితే, ఆ యింట సకల సంపదలు కురుస్తాయి. ఏమి పనిచేయనివారి యిండ్లు నగలు నాణేలు **లేక**, మంచిగుడ్డాగుడుసూ లేక, మురికిపట్టిన మూలల్లో మగువలు నక్కి ఉండగా, విరిగిపోయిన **మంచాలు**, బల్లలతో, పగిలిన కుండలతో, దాసదాసీగణంలేక, పలుకరించే దిక్కేలేక, పొద్దున లేస్తే పెరుగు చిలికే **సవ్వడి** అయినా లేక భగ్నభోగోత్సవాలై పాడుపడి ఉంటాయి."



ఈ విధంగా ఆ కులుకులాడి పలుకగా, అతడు ద్రవిణార్జనోత్సుకుడై బయలుదేరాడు. యోషిద్వశీకృతులు విషయగర్తంలో పడడం సహజమే. అతడు సాగరాంతమైన వసుంధరంతా తిరగి, ఉద్యోగించి, సంపూర్ణ ధనకనకవస్తువాహనాలతో కొంతకాలానికి తన పట్టణానికి తిరుగుముఖం పట్టాడు. ఇల్లు చేరుకుందామనే ఆతురతో పట్టణ సమీప వనంలో విడిసి ఆలోచనలో ఉండగా దొంగలు పడి సర్వస్వం దోచుకున్నారు. శరీరం మాత్రమే మిగిలింది. అతడు సుఖవాంఛతో ఎంతో సామర్థ్యంతో అనర్థాలను ఎదుర్కొని అర్థం సంపాదించినా, విధాత అన్యథా తలంచడం వల్ల అంతా యెండమావులయింది. అతడు దుఃఖంతో ఇలా అనుకున్నాడు: "ఆహా! నేనెంత శ్రమపడి ధన మార్జించాను! అదంతా నా అభాగ్యయోగం వల్ల స్వప్నదర్శనసమానమైంది. ధనం కోరుతున్న పత్నివద్దకు వట్టిచేతులతో వెళ్ళి, అవమానోగ్రవిషమయాలైన పరుషవచనాలు పడి బదుకలేను. కనుక ఇక్కడే ఉరి పోసుకొంటాను. దారిద్ర్యోపద్రవంతో క్రూరమై, స్త్రీ అనే ఘోర శస్త్రంతో భయంకరమైన ఇంటికి వెళ్ళి పాట్లు పడలేను." ఈ విధంగా ఆలోచించి, తీగలు తెంపుకొని గొంతుకు ఉరి పోసుకున్నాడు. తీవ్రక్లేశవిషణ్ణులయినవారికి బంధుసమాగమం మరణం వంటిది.

ఈలోగా, భూతభావనుడు, కృపాసింధువు అయిన సుగతభగవానుడు సర్వజ్ఞుడు కావడం వల్ల అతని దుఃఖం తెలుసుకొని, ఆ అరణ్యానికి వచ్చాడు. ఆయన దయతో ఊరడించగా, బ్రాహ్మణుడు ఉరి తీగలను పారేసి, ఆయన ఇచ్చిన నిధిని స్వీకరించి యిల్లు చేరాడు. అతని భార్య అంత ధనం లభించినా అనుకూలురాలు కాలేదు. పరపురుషానురక్తలైన స్త్రీలు ధనంతో సంతోషపడరు.

అంతటి భోగభాగ్యాలు కలిగినప్పటికీ ఆ విప్రుని మనస్సు కొంత కాలానికి ఉద్విగ్నమైంది; ఇలా ఆలోచించాడు: "ఈ సంసారంలో తత్త్వతః సుఖమేమీ లేదు. దారిద్ర్యతుల్యమైన దుఃఖం మరొకటేముంది? ధనార్జనమనేది అంతకన్నా దుఃఖతరం. సుఖలవలేశాలు చిలకరించే ధనోపభోగం అడుగడుగునా దుఃఖశతాలు పుట్టిస్తుంది." విప్రుడు ఈ విధంగా ఆలోచించి జేతారామానికి వెళ్ళి భవబంధోచ్ఛేదానికి శాస్తను శరణు పొందాడు. భవరోగవైద్యుడైన భగవానుడు అతని ఆశయానుశయధాతుగతులను తెలుసుకొని ధర్మౌషధం ప్రసాదించాడు. విప్రుడు దానితో సత్యం దర్శించి, ప్రవ్రజ్య స్వీకరించి, సర్వక్లేశనివారణార్థమైన అర్హత్వం పొందాడు. అతని అత్యద్భుతసిద్ధిని చూచి, ఆశ్చర్యం పొందిన భిక్షువులు ప్రశ్నించగా భగవానుడు అతని వృత్తాంతం ఇలా తెలిపాడు.

పూర్వం వారణాసిలో మహేంద్రుడనే రాజు వుండేవాడు. అతనికి సర్వభూతాలలోను దయ విలసిల్లేది. అతనిని కుమార్గ తాపితులైనవారు పరదేశాలనుంచి వచ్చి, సన్మార్గస్థమైన ఛాయావృక్షాన్ని ఆశ్రయించినట్లు ఆశ్రయించేవారు.

క్రోధమెరుగని అతడు ఒకమారు సామంతులు ఎదురుతిరిగి రాజధానిని ముట్టడించినా, సర్వనాశకరమని యుద్ధం మానుకున్నాడు. యుద్ధమంటే నిరుత్సాహపడే అతనిని చూచి మంత్రులందరూ ఆయనయెడ విరక్తి చెంది ధనలోభంతో శత్రువును ఆశ్రయించారు. ప్రాణివధమంటే ఉద్వేగపడే భూపతి రాజ్యం వదలుకొని ఎవరికంటా పడకుండా యుద్ధక్షేత్రం నుంచి క్షమాక్షేత్రమయిన అరణ్యానికి వెళ్ళాడు. దుర్జనులైన అతని అమాత్యులు లోభాంధులై ప్రభుభక్తిని, సత్త్వగుణాన్ని, లజ్జను వదలుకొని,

శత్రుసామంతులలో ఒకనిని రాజుగా పట్టం కట్టారు. కొత్త రాజు వద్ద కొత్తవారికి ప్రాపకం కలిగింది. స్వస్వామిద్రోహులైన మంత్రులకు దక్కింది అనౌచిత్యం మాత్రమే.

వారొకమారు రాజు కొలువుకు వెళ్ళబోగా, ద్వారపాలకులు అడ్డగించారు. వారు దానితో లజ్జ కలిగి దుఃఖం పొంది నిట్టూరుస్తూ ఇలా పాడారు. "అశ్రిత సులభుడు, సుకుమార హృదయుడు అయిన మహేంద్రసేనుని వదలి పాపిష్ఠులమైన మనం పరాయివాడి కొలువు కూటం వాకిట శాపతాపం, పడరానిపాట్లు పడుతున్నాము. ఓ మూర్ఖశంఖమా! లక్ష్మీజనకుడు, సురాసురశ్రేష్ఠులు కూడా ఆశించే వరరత్నాకరుడు, బహువిస్తారుడు అయిన పయోనిధిని శూన్యాశయంతో (శూన్యమైన మనస్సుతో, లోపల బోలుతనంతో) వదలుకున్నావు. నీ చూపు ఎప్పుడూ పైనే. (శంఖం ఎప్పుడు ఉన్ముఖం). ఇప్పుడేమో ఓ నీచుడా! దుష్టనరపతి భవనద్వారంలో వేలాడుతున్నావు. ఊరుకో. ఖలులకు ముఖం వంచి నమస్కారం చేస్తూ, ఎందుకు ఆక్రందిస్తావు? (రాజభవన ద్వారాలలో వ్రేలాడుతున్న శంఖాన్ని ఏ భటుడుబడితే ఆ భటుడు తీసుకొని వంచి, సమయసూచకంగా ఊదుతారు) ఇలా నవరాజ్యాతపం దుర్భరమై మంత్రులు శోకిస్తూ, మహేంద్రసేనుని దర్శిద్దామని అనుకున్నారు.

ఇది ఇలా ఉండగా, శమారామ వనవాసి అయిన మహేంద్రసేనుని వద్దకు కౌశికుడనే బ్రాహ్మణుడు కార్యార్థియై వెళ్ళాడు. రాజు అతనికి కందమూలఫలాలతో సత్కారం చేసి, వచ్చిన కారణమేమని అడిగాడు. "సర్వార్థిసార్థ సంకల్పాలకు కల్పవృక్ష మహాఫలం వంటి మహేంద్రసేనుని వద్దకు వెళ్ళుతున్నాను. దారిద్ర్యం తొలగించమని కోరుతున్నాను" అని ఆ కౌశికుడు సమాధానం చెప్పాడు. ఆ మాటలు విని రాజు ఆశతో తనవద్దకు వచ్చిన అర్థులు ఏమీ పొందలేక తిరిగి వెళ్ళుతున్నారనే తాపంతో వేడెక్కిన నిట్టూర్పులు నిగుడిస్తూ, దుఃఖంతో ఇలా అన్నాడు: "బ్రహ్మన్, మహేంద్రసేనుణ్ణి నేను. సంపదలకు నేనెందుకు? దండగ! నా నుంచి ఏమీ పొందని నీవు నాకే సంతాపం కలిగించడానికి వచ్చావు. నేనిప్పుడు ఎండిపోయిన మానువంటివాడిని; నిష్ఫలుణ్ణి. కనుక నావైపు అర్థులు చూచి ఆశాభంగంతో మొగం ముడుచుకొంటున్నారు."

రాజు మాటలు విని బ్రాహ్మణుడు భగ్నమనోరథుడై రాతిదెబ్బలు తిన్నవాడివలె మూర్ఛపోయాడు. తేరుకున్న తర్వాత ఇలా అన్నాడు: "నా అభాగ్యం వల్ల నీవు విభవరహితుడయ్యావు. నీ బోటి సులభుడైన దాత లోకంలో మరెక్కడ దొరుకుతాడు? అర్థులకు నిన్ను మించిన ఆశ్రయం మరొకటిలేదు. నీకు సంతోషం ఆభరణం. రాజ్యంకంటే అధికమైన శోభతో ఉన్నావు. దురదృష్టమంతా మాదే. నీ నుంచి ఏమీ పొందలేకపోతున్నాము. లక్ష్మి చంచలత వల్ల రత్నాకరుణ్ణి వదలినా, ఆ రత్నాకరునికేమీ హీనత కలుగలేదు. అప్పుడు అంతటివాణ్ణి వదలిన లక్ష్మి నీచులు, ఖలులు, లుబ్ధులు మొదలయినవాళ్ళ యిండ్లలో పడి, ఇంతవరకు సత్పురుషుణ్ణి చేరాననే సంతోషం పొందలేదు."

నైరాశ్యవిషాతురుడైన కౌశికుడు ఈ విధంగా అని, నరపతి వద్ద సెలువు పుచ్చుకొని, **భార్యజీవిక** పాడైపోతుందనే విషాదంతో ఉరిపోసుకొని చావడానికి సిద్ధమయాడు. కరుణాసింధువు, **అర్థిబంధువు** అయిన రాజు అతని కంఠం మీది ఉరితాడు తొలగించి, "విప్రుడా, ఒక్కపని చేయి. నన్ను **పట్టుకొని,** కట్టివేసి, నా శత్రురాజు నగరానికి తీసుకొని వెళ్ళు. నన్ను చంపదలచినవాడు గనుక, **అతడు నీవు**



కోరినదానికంటె హెచ్చు ధనమిస్తాడు" అని అన్నాడు. రాజు మాటలు విని విప్రుడు సిగ్గుపడుతూనే, ధనతృ ష్ణతో అతనిని కట్టి శత్రురాజు వద్దకు తీసుకొని వెళ్ళాడు. శత్రురాజు మహేంద్రసేనుని చూచి, అతని వృత్తాంతం విని ఆశ్చర్యంతో ప్రశంసించాడు. పిదప ఆ విప్రునికి ధనమిచ్చి, తన సింహాసనంలో రాజును నిలిపి, అతని చరణాలపై ముఖం మోపి, మన్నించమని విన్నవించి, అతనిని ప్రసన్నుని చేశాడు.

మహేంద్రసేన మహారాజును నేనే. ధనహీనుడై యాచనకు వెళ్ళిన కౌశికుడే జీవశర్మ అని జినదేవుడు పూర్వచరితం తెలిపాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మహేంద్రసేనావదానమనే డెబ్బయి తొమ్మిదవ పల్లవం

# 80. సుభద్రావదానం

పరోపకారంలో పట్టుదలగల సత్పురుషులు ఎంత చిక్కులు పెట్టినా ఉద్వేగం పొందరు. జుట్టుపట్టుకొని అవమానపరచినా, హితమే చెబుతారు. ఎన్ని కష్టాలయినా సహిస్తారు.

ఒకప్పుడు పురందరుడు తనకు ఇష్టుడయిన సుప్రియుడనే గంధర్వరాజు మందిరానికి స్నేహంతో వెళ్ళాడు. సుప్రియుడు చాల సంతోషపడి, ఎంతో గౌరవాదరాలతో అతనిని పూజించి, ఆసనమిచ్చి, కూర్చోబెట్టాడు. ప్రణయవత్సలుడైన పురందరుడు అతనితో "సుప్రియ, రా. భూలోకానికి వెళ్ళుదాము. భూలోకంలో శుద్ధోదనుడనే రాజుకు పుణ్యమహోదధి అయిన పృథివీపతి పుత్రుడుగా పుట్టాడు; శమామృతం పొందాడు. దానిని జగత్కుశలం కోసం పంచిపెడుతున్నాడు. మనకు కూడా పంచిపెడతాడు" అని అన్నాడు. "అయ్యో! నేను వీణలో గీతసారణను యోజన చేసినాను. ఎలా వెళ్ళగలను? తర్వాత గీతసారణ దుష్కరమవుతుంది" అని గంధర్వరాజు ఇంద్రునితో అన్నాడు. ఆ మాటలు విని ఇంద్రుడు మనస్సు కలతపడి తన లోకానికి తిరిగి వెళ్ళిపోయాడు విషయాసక్త చిత్తులకు కుశలమంటే ఇష్టం ఎక్కడ పుడుతుంది?

ఇది ఇలా వుండగా, మర్త్యలోకంలో కుశిపురంలో ఉదుంబరవనంలో ఒక సరస్సు తీరాన సుభద్రుడనే యతి ఉండేవాడు. ఉదుంబర వృక్షాలు (మేడి చెట్లు) మొగ్గలతో నిండి కనులపండువుగా ఉండడం ఒకనాడు చూచి, విస్మయంతో కండ్లు పెద్దవి కాగా, ఇలా ఆలోచించాడు: "జినుడు అవతరించినా, చక్రవర్తి పుట్టినా, ఈ ఉదంబర వనంలో మొగ్గలు పుడుతాయి. లేకపోతే లేదు. పుణ్యం వల్లనే ఈ అద్భుతం కలిగింది" సుభద్రుడు ఈ విధంగా ఆలోచించి ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయాడు.

అక్కడ స్వర్గంలో ఆ మర్త్యపతి మరొకమారు సుప్రియుని వద్దకు వెళ్ళాడు. సాధువులు పరుల కార్యాలలో తమ కార్యసాధనకన్నా హెచ్చుగా పనిచేస్తారు. "సుప్రియా, భూలోకానికి వెళ్ళుదాములా. క్షితితలచంద్రుడైన సుగతుడు సదుపదేశ కాంతులతో భూమిని ప్రకాశింపజేస్తున్నాడు" అని ఇంద్రుడు మరల పిలిచాడు. "దేవ, వీణలో గీతం సారిస్తున్నాను. ఇప్పుడు వదిలిపెడితే, మరల అది సాధ్యం కాదు." మరల సుప్రియుడు అదే సమాధానమిచ్చాడు. ఆ మాటలకు అమరపతి మ్లానమనోరథుడై తిరిగిపోయాడు.

ఇక్కడ భూలోకంలో ఉదుంబరకుసుమామోదం దిగంతాలకు వ్యాపించింది. సుభద్రుడు అది చూచి, "ఈ వనం వికసించింది, బహుశా శాస్త్రధర్మప్రవర్తనమన్నా జరిగి ఉంటుంది; చక్రవర్తి విజయమన్నా సంపాదించి ఉంటాడు. లేక, నా సత్పుణ్య ప్రభావం వల్లనన్నా ఈ వనమంతా పుష్పించి ఉంటుంది" అని ఆలోచిస్తూ, గర్వం పొందసాగాడు. అప్పుడు చంద్రుడనేవాడు వచ్చి, తన మాహాత్మ్యంతో అతనిని ఓడించి గర్వం పోగొట్టాడు.



ఇలా ఉండగా, జినభగవానుడు జగత్కార్యం పూర్తి చేసి, పశ్చిమశయనంలో ఉండి పరినిర్వాణం పొందుతూ, ఈ వినయ ధర్మంలో ప్రవేశించినవారెవరా అని ఆలోచిస్తూ "సుభద్రుడు, సుప్రియుడు మిగిలిపోయారు. సుభద్రుడేమో కష్టం లేకుండా వినయధర్మం పొందుతాడు. గంధర్వరాజేమో తారుణ్యవిభవాలతో మదించినవాడు. కష్టపడితేనేగాని, వినయధర్మం ఇతని తలకెక్కదు" అని ఆలోచించి, గంధర్వపురానికి వెళ్ళి, అత్యధిక వైభవకాంతులుగల మరొక గంధర్వరాజును సృష్టించాడు. వైదూర్యదండం వేయితీగలుగల వీణను కల్పించి, స్పర్ధతో సుప్రియుని గర్వం అణగేటట్టు చేశాడు.

కల్పితగంధర్వరాజు వేయితీగల వీణ వాయించాడు. సుప్రియునికి కోపం వచ్చి, తన వీణ వాయించాడు. తీగలు తెగిపోతున్నా వారిద్దరూ స్పర్ధతో సర్వస్వర మూర్ఛలను పలికిస్తూ, సమానులయారు. కల్పితగంధర్వరాజు తన వీణ తంతులన్నీ తెగిపోయినా, మూర్ఛనలు చూపాడు. సుప్రియుడు చూపలేకపోయాడు. అతని గర్వం అణగారిపోయింది. అప్పుడు జినభగవానుడు ప్రత్యక్షమై శుద్ధసద్ధర్మం ఉపదేశించాడు. జ్ఞానవజ్రంతో సత్కాయదృషి పర్వతాన్ని ఛేదించివేయగా, సుప్రియుడు స్రోతఃప్రాప్తిఫలం పొంది, ప్రశమమనుభవించాడు.

ఉదుంబరకుసుమసంచయం వృద్ధుని సంభోగం వలె క్రమంగా ఇక్కడ భూలోకంలో ఉదుంబరకుసుమసంచయం వృద్ధుని సంభోగం వలె క్రమంగా కుంగిపోసాగింది. పూవులు వాడిపోవడం చూచి, సుభద్రుడు దుఃఖంతో "నా పుణ్యాలు సన్నగిల్లి, పాపాలు పుట్టుకు వచ్చాయి" అనుకున్నాడు. ఈ విధంగా చింతతో సంతపిస్తుండగా, ఉదుంబరవనదేవత అతని వద్దకు వచ్చి, ఇలా అన్నది. "మునీశ్వరా, దుఃఖం అనవసరం. నీ పుణ్య ప్రభావం వల్ల ఈ ఉదుంబరవనం పూచలేదు. నీ పాపపరిపాకం వల్ల వాడిపోలేదు. దీనికి కారణం విను. సుగతుడు అవతరించడం వల్ల ఈ పూవులు పుట్టాయి. అతడు అనుత్తరజ్ఞానం పొందగా వికసించాయి. పరినిర్వాణం ఆసన్నం కాగా, వాడి రాలిపోతాయి. తథాగతుడు కుశిపురంలో పరినిర్వాణం పొందదలుస్తున్నాడు."

కాననలక్ష్మి మాటలు విని, సుభద్రుడు వేడిగా నిట్టూర్చి, ఆలోచనలో పడ్డాడు. "శాస్త ధర్మవినయోపదేశపాత్రుణ్ణి అవుతాననే ఆశాబంధం ఇంతకాలమూ నా హృదయంలో మెలగుతూ ఉండేది. శాస్త ధర్మప్రవచనం చేస్తుండగా, ఆయన వదనాంబుజం చూచి, క్లేశదూరులై సంపూర్ణ కుశలులైనవారు ధన్యులు. ఆయన పరినిర్వాణం పొందితే, శోకప్రశమనంలో ఇక మిత్రుడెవరు? తీవ్రతృష్ణార్తులకు బంధువెవరు? మండిపోతున్న ఈ భవమరుతటంలోని ప్రజలు జ్ఞానాతిశయాలోక ప్రసరరుచిరాలైన పుణ్యపీయూషధారలు తమ శ్రోత్రపాత్రలతో ఇక ఎవరి వదనచంద్రునినుంచి తాగి తనుస్తారు? సులభమైతే ఆయన చివరి దర్శనమయినా పొందుతాను." జినభగవానుడున్న కుశిపురానికి వెళ్ళుతాను.

ఈ విధంగా ఆలోచించి, ఉత్సాహంతో క్షణంలో అక్కడ అంతర్ధానం చెంది, మనోజవంతో మల్లరాజులకు ఆశ్రయమైన కుశిపురం చేరాడు. అక్కడ అర్కశాల అనే చోట కుసుమారామంలో పడుకుని ఉన్న జినదేవుని దర్శనం కోసం అర్కశాల ద్వారంలో ఉన్న ఆనందుణ్ణి అభ్యర్థించాడు. ఆనందుడు అతనితో నెమ్మదిగా లోగొంతుకతో వేళ్ళెత్తి అడ్డంగా ఊపుతూ, అతనికి అర్కశాలా ప్రవేశాశను పోగొడుతూ ఇలా అన్నాడు: "సుభద్రా ఇది ప్రశ్నలు అడిగి విసిగించే సమయం కాదు. తథాగతుడు అలసిపోయి, కాయశాంతికోసం విశ్రమిస్తున్నారు. పరుల వ్యథలు తెలియని వారు అవసరానవసరాలు ఆలోచించక, ఎప్పుడూ, ఏవిధంగానైనాసరే, స్వార్థం కోరుతారు. దేశకాలాలు తెలియక అడిగేవాడు

మనశ్శాంతిని కోల్పోయి, సిగ్గుతో వెళ్ళిపోతాడు. జినభగవానుడు తనువు చాలించనుండగా, నదులు ఆయనకు ఇబ్బంది కలుగకూడదని వేగం వదలి నమ్రతతో పారుతున్నాయి. వాయువులు పెద్దగా వీచడం మానుకున్నాయి. తరులతలు కూడ సంతాపంతో కదలడం మానుకున్నాయి.

ఆనందుడు ఈ విధంగా పలుమారు ఎంతగానో నివారించినప్పటికీ, సుభద్రుడు వినక, ఆశాభంగం కలుగగలదనే భయంతో ఇలా అన్నాడు: "నేను అవసరావసరాలు ఎరుగుదును. ప్రసన్నుడవై అర్థిసులభుడైన జినుణ్ణి చూపించు, ఇలా నిష్ఠురుడివి కాకు. నీడనిచ్చే పండ్లచెట్టును చూచి పథికులు వచ్చి, చల్లగా విశ్రమించిన మీదట సంతోషంతో గంతులు వేస్తూ ఆ చెట్టెక్కి పండ్లు కోసుకొంటారు. ఇలాగే దినదినమూ కొత్తకొత్తవారు వచ్చి పీడిస్తూనే ఉంటారు. ఈ తరురాజం అశ్రితవత్సలం గదా, సకలార్థులకు సులభాధారం కదా అని ఊరుకొనివుంటారా? కొమ్మలు విరచి, మోడుచేసి, పండ్లు కోస్తారు. ఈ కష్టాలు చెట్టుకు కలుగుతున్నవే అని ఏమైనా అనుకుంటారా?" అని ఇలా ఆనందుణ్ణి ఎంతబతిమాలినా, ప్రయోజనం లేనందున, అతడు ఆనంద రహితుడయ్యాడు.

సర్వజ్ఞుడైన భగవానుడు ఈ సంగతి గ్రహించి, సురలోకం నుంచి, మరల శయ్యను చేరి, సుభద్రని పంపుమని ఆనందునికి వినబడేటట్టు గట్టిగా అన్నాడు. సుభద్రుడు అనుమతి పొంది లోపల ప్రవేశించి, నిర్ధనుడు నిధిని పొందినట్టు సుగతుని దర్శించి, నమస్కరించి, కన్నీరు జాలువారగా, ఇలా విన్నవించాడు: "భగవన్, ఈ భువనం ఎంత దరిద్రగొట్టుది? నీవు వదలిపోయిన తర్వాత అంధకారబంధురమౌతుంది. ఏమిటి ఈ భువనానికి గతి? మోహనిద్రాముద్రితమైన ఈ జగత్పద్మాన్ని నీవుకాక మరొక సూర్యుడు జ్ఞానరీతులతో వికసింపజేసేవాడెవడు? నీవు అకారణంగానే సమస్త జగత్తులకు ఉపకారం చేసి సర్వసులభుడైనవాడివి, నాకు దుర్లభుడయిపోయావే?" ఇలా విన్నవించగా, భగవానుడు ప్రసన్నకాంతులు వెదజల్లుతూ, ముఖాంబుజం ఎత్తి నవ్వుతూ అన్నాడు: "వత్స, అనిత్యత అనేది నిత్యమని నీవు తెలుసుకోలేకపోతున్నావు. అన్ని సంస్కారాలూ క్షణికమైనవి అయినప్పుడు ఈ దేహాన్ని అంటిపెట్టుకోడంలో పట్టుదల ఎందుకు? సూర్యుని చక్రనేమి క్రమభ్రమణంతో పుట్టిన క్షపాశవలితాలైన దినాలు, మానవుల జీవితశకలాలు కాలమనే మహాచక్రం క్రిందపడి నుసినుసి అయి దూరంగా వెళ్ళిపోతాయి. అపారమైన ఈ సంసారం(ప్రపంచం) బెదరిన లేడి చూపులవలె చంచలమైంది. ఈ కనిపించే మహాపర్వతాలు విరిగిపడి మాయమౌతున్నాయి. జలధులు ఇంకిపోతున్నాయి. వెంటపుట్టిన పంచభూతాలతోపాటు ఈ భువన పరంపర జారిపడి నశించిపోతున్నది. బహుపరిచయంగల- ఎన్నో జన్మల పరిచయం గల- ఈ కాయసమూహం చిరస్థాయి కాదు."

భగవానుడు ఇలా సుభద్రునికి ప్రశమనం కోసం ప్రసాదానందిని అయిన సత్యధర్మకథను వ్యక్తంగా ఉపదేశించాడు. సుభద్రుడు తన త్రిదండకమండల సంభారాన్ని భారం దింపుకొనే బాటసారిలాగ వదలివేసి, శాస్త అయిన జినుని శాసనంతో ప్రవ్రజ్యను స్వీకరించాడు. సర్వక్లేశసంచయం క్షీణించగా, అతడు అర్హత్పదం పొంది, "అయ్యో! నాకు శిష్యత్వం ఉచితం కాదు. కట్టెదుట భగవానుని పరినిర్వాణం ఎలా చూడగలను? కనుక మొదట నా శరీరం త్యజించి, స్వస్థానం పొందుతాను" అని ఆలోచించి, పంచాధిష్ఠాన నిష్ఠతో పాము కుబుసం వదలినట్టు శరీరం వదలి, పరినిర్వాణం పొందాడు. అతనికి దేహసంస్కారం చేయవలసివచ్చినప్పుడు, "ఇతడు ఎవరి సంప్రదాయానికి చెందినవాడు? ఎవరు సంస్కారం చేయాలి?" అని భిక్షువులకు, తీర్థికులకు వివాదం ఏర్పడింది. తీర్థికులు ఉత్తరక్రియలసమయంలో అతని శిబికను- పాంచభౌతిక దేహం ఉంచిన పల్లకివంటి పాడెను- మోయలేకపోయారు. అపుడు భిక్షుగణం అతనికి ఉత్తర క్రియలు జరిపి స్తూపం నిర్మించి, ముందుగానే ఆతని పరినిర్వాణం జరుగడానికి కారణం ఏమిటని సుగతుని ప్రశ్నించారు. అయన ఇలా అన్నాడు:



ఇతడు పూర్వం వారాణసిలో వసించే విప్రుడు. పేరు అశోకుడు. కాశ్యపుడనే శాస్తకు ప్రాణమిత్రుడుగా వుండేవాడు. అతడు కాశ్యపుడు పరినిర్వాణం చెందుతుండగా, కాశ్యపుని అంటిపెట్టుకొన్న దేవత ఆదేశంతో అతనివద్దకు వెళ్ళి, ధర్మవినయం స్వీకరించి అర్హత్పదం పొందాడు. భక్తిశీలుడైన ఆ అశోకుడు తన గురువుకు ముందే దేహం వదలాడు. అది చూచి, దేవత "ఈ సుకృతి కాశ్యపుడు పరినిర్వాణం చెందకముందే దేహం త్యజించాడు. అలాగే నేను కూడ గురువుకు ముందుగానే, దేహం త్యజిస్తాను." అని ప్రణిధానం చేసి త్యజించింది. ఆ శ్రద్ధవల్ల ఆమె సుభద్రుడై పుట్టింది. పూర్వం కకుత్సందుడనే శాస్త పశ్చిమశయనంలో - పరినిర్వాణ సమయంలో - ఐదువందలమంది మునులు అర్హత్వం పొంది అతని ఎదుటే భక్తితో దేహత్యాగం చేయడం చూచింది. తర్వాత సుభద్రుని జన్మ యెత్తింది. పర్యంత సమయంలో(మరణ సమయంలో) దేహంలో కలిగే స్వాభావికమైన వ్యథ అతనికి కలుగకుండా నేను నిగ్రహించాను. కనుక అతడు వ్యథ లేకుండా మరణించాడు.

మరొక జన్మలో అతడు బ్రహ్మదత్తుడై జన్మించాడు. నేను అతని వాహనమైన అశ్వంగా పుట్టాను. ఒకమారు యుద్ధంలో అతడు శత్రువులకు భయపడి పారిపోయాడు. అప్పుడు నేను శత్రుశస్త్రాలతో పేగులు తెగినప్పటికీ లెక్కచేయక అతనిని దాటించి సురక్షిత ప్రాంతానికి చేర్చాను.

ఇంకొక జన్మలో నేను కన్యాకుబ్జవనంలో హరిణయూథనాయకుడుగా పుట్టాను. సుభద్రుడు నా యూథంలోనే ఒక జింక అయి అనుసరించేవాడు. అప్పుడు ఒకమారు కర్ణుడనే రాజు వేటకు వచ్చి, వనం చుట్టూ ముట్టడి వేశాడు. జింకలు భయపడి ఒక నది గట్టు చేరాయి. తప్పించుకొనిపోవడానికి వేరే దారి లేకపోయింది. నేను నిశ్చలంగా నదిలో దిగాను. భయపడిన మృగాలన్నీ నా వీపు మీద కాళ్ళు ఆనించి నదిని దాటాయి. వాటి గిట్టల తాకిడికి నేను నలిగిపోయి మరణాసన్నుడినయాను. అన్ని జింకలు దాటాయిగాని, సుబద్రహరిణమొక్కటి మిగిలిపోయింది. దాని భయం చూచి, నేను నా దుస్సహ బాధను సహించి, కరుణతో దానిని గట్టుచేర్చి, గట్టుమీద ఇసుకదిబ్బపై బడి మరణించాను. ఇప్పుడు కూడా ఆ విధంగానే వ్యథను సహించి, సుభద్రుణ్ణి దాటించాను.- ఇలా చెప్పి భగవానుడు మౌనం అవలంబించాడు.

పిదప భిక్షువులు సుప్రియుని కుశలావాప్తికి కూడా కారణం తెలుపవలసిందని కోరగా, ప్రణయవత్సలుడైన సర్వజ్ఞుడు నెమ్మదిగా యిలా అన్నాడు:

పూర్వం కాశ్యపుడనే శాస్తకు సుధి అనే ఉపాసకుడు ఉండేవాడు, కాశ్యపుని అనుగ్రహం వల్ల శిక్షాపదం పొంది ప్రసన్నచిత్తుడై ఉండేవాడు. ఒకనాడు సుధి గీతికుశలుడైన గాంధర్వికాగ్రేసరుణ్ణి చూచి గంధర్వాధిపతి అయితే బాగుండునని ప్రణిధానం చేశాడు. ఆ ప్రణిధానం వల్ల సుప్రియుడుగా పుట్టాడు. శిక్షాపదాలు స్వీకరించడం వల్ల ధర్మవినయ సంకలితుడయ్యాడు. సుభద్ర సుప్రియులను ఇద్దరినీ నేనే

ఎప్పుడూ కుశలవంతులుగా చేశాను. ఇతరుల అభిమతాలు పూర్తి చేయడంలో నిర్వ్యథతో పూర్తిచేయడం నా పని.

పూర్వం స్వర్గతుల్యమైన అజతోదయమనే పట్టణం ఉండేది. దానిని విజయంతుడనే ఇంద్రసముడైన రాజు ఏలేవాడు. అతడు పుణ్యప్రవృత్తితో రాజ్యమేలుతుండగా, ధర్మ మార్గానుయాయులైన పౌరులు మరణానంతరం స్వర్గం చేరేవారు. ఆ పౌరులతో సురభూములు నిండిపోయాయి. రాజు పుణ్యానుభావంతో మానవులతో స్వర్గం నిండిపోవడం చూచి, సురపతి అతని సత్త్వసంపదను పరీక్షించడానికి ఒక యుక్తి చేశాడు.

ఇంద్రుని మాయ వల్ల క్రూరులు బయలుదేరి, పృథివీపతిని చేరి, శరీరమాంసమూ, రక్తమూ దానమిమ్మని కోరారు. ఆ పృథివీపతి నిర్వికారచిత్తంతో తన శరీరం కోసి, వారికిచ్చాడు. ఎముకలు మాత్రమే మిగిలిపోయాయి. అప్పుడు, "ప్రాణులు తరించడం కోసం చేసిన ఈ శరీరదానపుణ్యంతో నాకు అనుత్తర సమ్యక్సంబోధి కలుగుగాక!" అని ప్రణిధానం చేశాడు. అప్పుడు ఇంద్రుడు అతనిని సమీపించి "రాజన్! నీవు నీ దేహమాంసం కోసి యిచ్చేటప్పుడు ఎంతో బాధ కలిగి ఉంటుంది. దానివల్ల నీకు మనోవికారం కలుగలేదా? నిజం చెప్పు" అని అడిగాడు. అర్థుల అభిమతాలు పూరించినందుకు హర్షంతో ఉత్ఫుల్లలోచనుడైన రాజు, ఆ మాటలు విని, "నాకు వ్యథ కలిగినప్పుడు మనోవికారమేమీ కలుగకపోవడమే నిజమైతే నా దేహ వ్రణాలన్నీ మాని, గాయాల మచ్చలు కూడా లేక ముందులాగే కాంతివంతం కానీ!" అన్నాడు. ఈ మాటలు అనీఅనగానే, అతని దేహం మేఘవినిర్ముక్తమైన చంద్రబింబంవలె స్వస్థత చెంది కాంతివంతమైంది. ఇతరుల కార్యలలో వ్యథపొందని ఆ విజయంత మహారాజును నేనే- అని భగవానుడు చెప్పి ధ్యాననిమీలితలోచనుడయాడు.

అమృతాంబుధి సురగణం కోసం, మంథాద్రితో తరచినా బాధను సహించింది. పరహితకార్యసన్నద్ధులైన విమలమానసులు తమ దేహానికి అపాయం కలిగినప్పటికీ వికారం పొందరు. అలాటివారికి వ్యథ కూడ సుఖకరమే.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సుభద్రావదానమనే ఎనభయ్యవ పల్లవం

# 81. హేతూత్తమావదానం

బాగా దున్నిన భూమిలో విత్తినది, కృతజ్ఞుని హితం కోసం చేసినది, గుణోన్నతునికి సమర్పించినది, అల్పతరమైనప్పటికీ శాఖాసహస్రాలతో వృద్ధి పొందుతుంది.

జేతవనారామంలో విహరిస్తున్న జినభగనానుడు ఒకనాడు తన కథాప్రబంధరీతులను వినడానికి వచ్చిన భిక్షువులతో ఇలా అన్నాడు: స్వభోగం కోసం ఆర్జించేదంతా వ్యర్థం. అదే అర్హతునికి అర్పిస్తే సఫలమవుతుంది. సమర్థతతో సత్పాత్ర ప్రతిపాదితమైన దక్షిణ సత్సంగతివలె అక్షయమై అసంఖ్యగుణాలు పొందుతుంది.

పూర్వం పాటలీపుత్రవాసులైన కొందరు వణిక్కులు చందనం సంపాదిద్దామనే ఆశతో పెద్ద ఓడ ఎక్కి చందనద్వీపం చేరారు. అక్కడ గోశీర్షమనే శ్రేష్ఠమైన చందనం సంగ్రహించి, సంతోషంతో వెనుదిరిగి, నడిసముద్రం చేరారు. అప్పుడు అకాలంలో ఝంఝామారుతం వీచి, తరగలు హెచ్చి, ఓడ కాలు ఊయలవలె విశృంఖలంగా ఊగిసలాడసాగింది. బెహారులు ప్రాణభయంతో దేవతలను స్తోత్రం చేయసాగారు. ఏమైనా ఫలం లేక ఓడ వారి మనోరథంతో పాటు రెండు ముక్కలుగా విరిగింది. సార్థనాయకుడైన(బెహారులపెద్ద అయిన) పుణ్యసేనుడు దయ కలిగి ప్రాణరక్షణోపాయం ఆలోచించాడు. "నా యింటి సమీపంలో ధర్మబోధి అనే ఉపాసకుడున్నాడు. అతడు కష్టసమయంలో హేతూత్తముడైన శాస్తనే స్తుతిస్తాడు. నేను అలాగే చేస్తాను" అని ఆలోచించి, మనసులో హేతూత్తముణ్ణే శరణు పొంది, గద్గద స్వరంతో, కన్నీటితో "మహానుభావుడు, సంబుద్ధుడు,కల్యాణ కల్పవృక్షమూ, సకలక్లేశశామకుడు అయిన హేతూత్తమార్హతునకు నమస్కారం" అని ప్రార్థించాడు. ఈ ప్రార్థన చేయగానే, అగ్నిదేవత ప్రత్యక్షమై సార్థవాహులను బ్రతికించి, సముద్రతీరానికి చేర్చింది. ఆ మహాప్రాణభయం నుంచి ముక్తులైన వణిజులు స్వదేశానికి వచ్చి, నిరంతరం హేతూత్తమ నమస్కారనిరతులయారు.

ఇలా ఉండగా, ఒకప్పుడు శాస్త అయిన హేతూత్తమునికి కర్మశేషంతో తీవ్రతాపంతో జ్వరం తగిలింది. భవమహాభయాన్ని శమింపజేసే భేషజం వంటి చూపుతోనే సర్వజగత్తులకు స్వస్థత చేకూర్చే వారు కూడ కర్మలత చుట్టుకోగా, దానితోనే కట్టుబడి ఉండక తప్పడం లేదు.

హేతూత్తముని జ్వరవార్త విని చంద్రావలోకుడనే రాజు వచ్చి, ఆయన తీవ్ర, సంతాపశాంతి కోసం గోశీర్షచందనం సంపాదించడానికి అంతటా వెదికి సార్థపతి అయిన పుణ్యసేనుని వద్దకు వచ్చి, నాలుగు లక్షల బంగారు నాణేలు సమర్పించి గోశీర్ష చందనం ఇమ్మన్నాడు. భూమిలో దుర్లభమైన గోశీర్ష చందనాన్ని సార్థపతి పణానికి ఇవ్వడానికి నిరాకరించి భక్తితో వచ్చి స్మరణ మాత్రంతోనే ఉపకారం చేసిన శాస్తదేహాన్ని చందన చర్చితం చేశాడు. హారతుషారశశిశైత్యాన్ని పరిహసిస్తూ. తన కీర్తివలె శుభ్రమైన చందనంతో హేతూత్తముడు జ్వరం తొలగి ఆరోగ్యవంతుడయాడు.

ఈ పుణ్యానుభావంతో పుణ్యసేనుడు చంద్రునివలె కాంతిగలవాడు, సర్వాంగాద్భుతసౌరభుడు అయినాడు. చందనద్వీపం నుంచి వచ్చేటప్పుడు సముద్రంలో పడిపోయిన ఇతర వ్యాపారుల చందనరత్నాదులు కూడ అతనికి తన ఇంటి దొడ్డిలోని బావిలో దొరికాయి. అదంతా తనదనే భావంతో అతడు భిక్షుసంఘాన్ని భోజ్యరత్నాంబరాలతో పూజించాడు.

దివ్యప్రభావాభరణ కలితమైన పుణ్యసేనుని సిరికి కారణమేమని హేతూత్తముని ఉపాసకుడు అతనిని ప్రశ్నించాడు. జ్ఞానలోచనుడైన హేతూత్తమదేవుడు చిరునవ్వు నవ్వుతూ, నన్ను చందనంతో అలదడం వల్ల పుణ్యసేనునికి ఈ సిరి అబ్బింది. సుకృతశీలుడైన అతడు చేసిన కర్మ అమృతత్వం పొందింది. దాని తుంపరలు మాత్రమే ఈ సిరి. ఇతడు ఈ కుశలమూలాల పరిపాకమైన పశ్చిమజన్మలో ప్రవ్రజ్యతో అనుత్తరమైన సమ్యక్సంబోధిని పొందుతాడు. చందన శ్రీ అని ప్రసిద్ధి పొంది, విశాలమైన పుణ్యచందన వృక్షమూలంలో తథాగతుడుగా విలసిల్లుతాడు అని తెలిపాడు.

శాక్యముని మాటలకు బిక్షువులందరూ ఆశ్చర్యం పొందారు. అర్హతులనే సుక్షేత్రంలో శ్రద్ధతో పడిన సుకృతవంతుల దానకణమనే అంకురం శాఖోపశాఖలతో వర్ధిల్లి, పుణ్యామోదమదప్రమోదానికి నెచ్చెలులు, త్రిదశాధిపత్యవిశద సంపదలు కలిగించేవి అయిన పూవులు పూచి, పరిణామంలో వైరాగ్యలక్ష్మి అనే ఫలాలను అందజేస్తుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో హేతూత్తమావదానమనే ఎనభై ఒక్కటవ పల్లవం

# 82. మారకపూర్వికావదానం

ప్రజలు పరలోకాంక్షతో పుత్రులకోసం అంగలార్చడం కేవలం మిథ్యాస్పృహ, వ్యర్థం. ఎవరు చేసిన పుణ్యఫలం వారు అనుభవిస్తారుగాని, మరొకరు చేసిన ఫలం అనుభవించరు. పుత్రుడు క్రూరుడై సాటిలేని దుర్మార్గం చేశాడంటే ఆ పాపంతో వంశమంతా ముఖం వంచుకొని, నశిస్తుంది.

పూర్వం శ్రావస్తిలో శ్రుతవర్మ అనే గృహపతికి, జయసేన అనే పత్నికి భవవర్మ అనే కుమారుడు పుట్టాడు. ఆ శిశువు దినదినాభివృద్ధి చెందుతుండగా, ఆ దంపతులిద్దరూ, తమ వంశం ఉత్కర్షం పొందుతుందనే విశేషమైన ఆశను పెట్టుకొన్నారు. కొంతకాలానికి శ్రుతవర్మ కాలధర్మం చెందాడు. తల్లి జయసేన స్నేహ మోహనపరవశురాలై కుమారుణ్ణి పెంచుతూండేది. కుమారుడైన భవవర్మ పెరిగి పెద్దవాడై, పొరుగింటి సమవయస్కుడైన మిత్రునితో కలిసి నిరంకుశమైన ఏనుగువలె లీలావిశృంఖలుడై తిరిగేవాడు.

ఒకనాడు యౌవనవిలాసి అయిన భవవర్మ రాజమార్గంలో వెళ్ళుతుండగా, సుందరి అనే ఒక సుభటుని భార్య, జాణి, హర్మ్యశిఖరం నుంచి చూచినది. అతడు కూడ దానిని సవిలాసంగా అభిలాషతో చూచాడు. అప్పుడు ఆ యువతి మన్మథునికి నెచ్చెలి వంటి పూలమాలను అతని మీదికి విసిరింది. విభ్రమవిలాసాలతో ఒప్పే సంభోగ సూచకమైన ఆ సంకేతాన్ని మిత్రుడైన పొరుగింటి యువకుడు గ్రహించి, అతనిపై ప్రేమగలవాడు కనుక అతనికి పరాభవం అవుతుందని శంకించి భయవిహ్వలుడై, అతని తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా! నీ కుమారునికి సుభటుని భార్య సైగ చేసింది. ఇతడు అవినీతుడై రాత్రి స్వేచ్ఛగా అక్కడికి వెళ్ళుతాడు. భోగవ్యగ్రమయిన మనుష్యమృగాలు సంసారమనే వ్యసనారణ్యంలో తిరుగుతూ, అఖిల సుఖాలనే సస్యాలకు ఆశపడి, వినాశం కలిగించే మన్మథుడనే వ్యాధుని ఉరులలో చిక్కుకొని, తుదకు విషయాలనే వాడికత్తులతో మరణిస్తాయి. ఈ చపల మనస్కుడిని నేను పగటిపూట కాపాడుతాను. రాత్రిళ్ళు నీవు కాపాడు" అని చెప్పి తన యిల్లు చేరాడు.

తల్లి అతని మాటలప్రకారం కొడుకును ఇంటిగదిలోపల పడుకోమని చెప్పి, తను వాకిట పక్క వేసుకొని రాత్రిళ్ళు కాపాడసాగింది. కుమారుడు శౌచానికి వెళ్ళాలని, మంచినీటికోసమని వెలుపలికి వెళ్ళదలచుకున్నా, ఆమె స్నేహమోహిత అయి, అతనిని వెలుపలికి వెళ్ళనివ్వలేదు. తల్లి ప్రవర్తనకు వాడు చాల కష్టపడి "అయ్యో, రమణీయ రామారత్నంతో కలుద్దామంటే, విఘ్నంగా ఈ తల్లిని ఎవరు సృష్టించారు? నా అదృష్టం వల్ల తండ్రి నా యౌవనంలోనే మరణించాడు. నా దురదృష్టం వల్ల ఈ శనిపీనుగ కాలవ్యాళి ఇంట్లోనే తిష్ఠవేసింది. ఇది మేల్కొని వున్నప్పుడే, దాటి వెళ్ళిపోతే, ఇది పోట్లాట పెట్టుకొని మాటలంటే, జనమంతా మేల్కొంటారు. రాత్రి గడచిపోతున్నది. కొంత దూరంలో ఉంది. ఏమిచేయను? ఆ

సుభగురాలు అదృష్టహీనుడైన నాకు ఎలా సులభురాలవుతుంది? ఆ సుందరి మేడ మీదినుంచి నన్ను ముఖాంబురుహం వంచి చూస్తున్నప్పుడు చెవిలోని కలువపూవు కాళ్ళమీద జారి పడింది. దానిని ఒక్క నీలపు చూపుతో చూచి శోభ కలిగించింది. చెవులలోని తాటంక కాంతులు కపోలాలపై పడి మకరికాపత్రాలవలె అందం చేకూర్చాయి. అలాటి సౌభాగ్యవతి భాగ్యవశంతో లభిస్తుంది" అని చింతించాడు. మరల మరల శౌచానికి వెళ్ళాలని తల్లిని బ్రతిమాలాడు. అప్పుడు కూడా తల్లి లక్ష్యపెట్టక 'అక్కడే శౌచం చేయి' అని ఆదేశించింది. దానిమీద వాడు కుపితుడై, కత్తితో తల్లి తల నరికి వేగంగా ప్రియురాలి యింటికి బయలుదేరాడు. కామోద్రేకంతో పాపం చేసే దుష్టులకు అకార్యమనేది యేమిటి?

భవవర్మ ఆయాసం లక్ష్యపెట్టక, సుందరి యిల్లు చేరి, రహస్య సంభోగసన్నద్ధురాలైన ఆ విదగ్ధను సమీపించి, ఆదరంతో తాను చేసిన మాతృవధ కృత్యం తెలిపాడు. ఏపని నింద్యమైందో దానినే మూర్ఖులు శ్లాఘిస్తారుగదా! అంత అనురాగవతి సుందరి అతని మాతృవధ క్రూరకర్మ విని కంపించిపోయి, అస్పృశ్యుణ్ణే చూచినట్లు అతని స్పర్శకు కూడా విముఖురాలయింది. మేడమీదకి వెళ్ళివస్తాననే సాకుతో అతని వద్దనుంచి వెళ్ళిపోయింది. అభిలాష కలవారు కూడ పాపాచరణవల్ల మనసు విరిగి పోతారు.

సుందరి ఆ విధంగా మనసు విరిగి, పాపపరాఙ్ముఖి అయి, మేడ ఎక్కి, "దొంగ! దొంగ" అని భయపడినదానివలె గట్టిగా అరిచింది. ఆమె అరుపులకు, పరిజనం పరిగెత్తి వచ్చారు; కుక్కలు మొరుగుతూ వెంటబడ్డాయి. భవవర్మ భయంతో యింటికి పరిగెత్తి వచ్చాడు. వచ్చి, "అయ్యో! దొంగలు నా తల్లిని చంపివేశారు." అని పెద్దగా ఏడుస్తూ, ఉదయం కాగానే తల్లికి శరీర సంస్కారం చేశాడు. కాని, ప్రచ్ఛన్న పాపసంతాపంతో అతని మనస్సు దహించుకుపోయింది. ఘోరనరకం తప్పదనుకుంటూ, దేశం తిరిగాడు. "తల్లి హత్యకు ప్రాయశ్చిత్తమేమిటి?" అని ఆ పాతకి ప్రతి బ్రాహ్మణునీ అడిగాడు. "మాతృవధ అనే క్రూరపాతకానికి నిష్కృతి లేదు" అని వారన్నారు.

కొంతకాలానికి అతడు జేతవనానికి వెళ్ళి భిక్షుగణం చెప్పిన సర్వపాపప్రణాశనమైన ధర్మోపదేశం విన్నాడు. పిదప ప్రవ్రజ్య స్వీకరించి, స్వాధ్యాయనిరతుడై, త్రిపిటకాధ్యయనపరుడై ధర్మబోధకుడయ్యాడు. ఇది ఇలా ఉండగా, ఒకమారు సర్వజ్ఞుడు అక్కడికి వచ్చి, "ఈ పాపిష్ఠునికి ప్రవ్రజ్య ఎందుకిచ్చారు? మాతృవధ క్రూరకిల్బిషం వల్ల ఇతనికి మరణానంతరం అగ్ని తరంగాలలో చిరనివాసం ఏర్పడుతుంది" అని అన్నాడు.

తథాగతుడు ఈ విధంగా తెలిపిన మీదట, ధర్మోపదేశకుడైన భవవర్మ కాలధర్మం చెందిన మీదట ఘోరనరకంలో పడ్డాడు. నరకలోకంలో తీవ్రవహ్ని శిఖలలో బహుకాలం ఉడుకుతూ, నరకవాసులకు కూడ దుఃఖం కలిగించాడు. ఒకనాడు నరకపాలకుడు గదతో అతనినీ కొట్టి పిండిపిండి చేశాడు. దానితో పాపాగ్నిలో దేహం పూర్తిగా కాలి నశించాడు. కాని, ప్రవ్రజ్యా ప్రభావంతో దివ్యాభరణభూషితుడై చతుర్మహారాజికులనే దేవతలలో పుట్టాడు.

తర్వాత విమల పుష్పమాలికలు శిరస్సున ధరించి, కేయూర హార మణిమయూఖాలతో అద్భుత కాంతులతో చంద్రునిలాగ వెలుగుతూ దేవతలకు కూడా వందనీయుడవుతూ, తన ప్రభావపుంజం వెన్నంటిరాగా, సుగతుని దర్శించి వందనం చేయడం కోసం భూలోకానికి వచ్చాడు. శాస్త్రపాదపదయుగ్మానికి



ఆదరంతో వందనం చేసి, ఆనందంతో తన సుందర ముఖారవిందం వికసించగా, సుగతుని ధర్మోపదేశకథలతోనే మనస్సు పవిత్రమై అశ్రుతమైన సత్యం దర్శించి, తరించాడు.

దీర్ఘోపభోగాలతో, వ్యసనాలలో కూరుకుపోయిన మానవునికి పాపప్రదోషతిమిరాలు అణగారినప్పుడు, పవిత్రమైన సుకృతప్రభాతవేళ విశాలమైన కుశలకాంతిని కలిగిస్తుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మారకపూర్వికావదానమనే ఎనభై రెండవ పల్లవం

# 83. రాహులకర్మప్లుత్యవదానం

ప్రాణులు గర్భంలో ఉన్నప్పుడు, తర్వాత గర్భంలో వ్యాపించినప్పుడు, శిశువులుగా ఉన్నప్పుడు, యువకులుగా పెరిగి క్రమంగా వృద్ధాప్యం పొందినప్పుడు ఏ సిత్థిలో ఉన్నా, సాటిలేని కాలమనే గజం తామరతూడులాగ పెరికివేసినప్పటికీ కర్మతంతువు తెగదు.

ఒకమారు శుద్ధోదనుడు భగవానుడైన సుగతుని భోజనానికి ఆహ్వానించాడు. సుగతుడు భిక్షువులతోపాటు వెళ్ళి భోజ్యప్రతిగ్రహం చేశాడు. భోజనానంతరం ఆసీనుడై, ప్రసన్నచిత్తుడై శుద్ధోధన పృథివీపతిని అనుగ్రహించి విశుద్ధమైన ధర్మోపదేశం చేశాడు. అక్కడ సుగతుని కుమారుడైన రాహులుడు మొదటిమారే చూచినా, తండ్రి అని తెలుసుకొని, మోదకాలు అర్పించి పూజించాడు. అప్పుడు అక్కడ చేరిన భిక్షుగణం ఈ బాలప్రణయం తిలకించి ఆశ్చర్యపడి కుతూహలంతో, భగవానునికి నమస్కరించి ఇలా అన్నారు: "ఈ శిశువు ఆరు సంవత్సరాలు తల్లి కడుపును క్షోభపెట్టి పుట్టాడు. నీకు అచ్చం ప్రతిబింబమే. దీనికి ఏ కర్మవిపాకం కారణం? యశోధరాదేవి గర్భభారం అధికమై ఆరేళ్ళపాటు అవమానం, చిరతర బాధ సహించడానికి ఏమిటి కారణం?" భిక్షువులు ఈ విధంగా చనువుతో ప్రశ్నించగా, సర్వజ్ఞుడైన భగవానుడు క్షణకాలం ధ్యానించి కారణం వినండని ఇలా అన్నాడు:

విదేహ దేశంలోని మిథిలలో పుష్పదేవుడనే భూపతికి సూర్యచంద్రులనే ఇద్దరు పుణ్యశీలులైన పుత్రులు ఉండేవారు. వారిద్దరికీ తపోవనమంటే స్పృహ యెక్కువ. కనుక తండ్రి మరణించగానే, నీవు రాజ్యం గ్రహించమంటే నీవు గ్రహించమని పరస్పరం బ్రతిమాలుకున్నారు. సూర్యుడు వైరాగ్యంతో రాజ్యం పూర్తిగా పరిత్యజించి, చంద్రునికి అప్పగించాడు. చంద్రుడు జేష్ఠభ్రాతశాసనం కాదనలేక ఏమీ మాట్లాడలేకపోయాడు. పిదప సూర్యుడు శమశ్లాఘ్యమైన తపోవనం చేరి, సంతోషరాజ్యసుఖితుడై బహుకాలం తపస్సు చేశాడు.

అతడు ఒకమారు వనంలో తిరుగుతూ, తీవ్రపిపాసతో తపిస్తూ, అక్కడ తపస్సు చేసుకొంటున్న ఒక ముని కమండలువులో పెట్టుకున్న జలాన్ని చెప్పకనే తాగివేశాడు. తాగిన పిదప అతనికి తెలివి వచ్చింది. చెప్పకుండా చేయకుండా జలం తాగడం వల్ల అదత్తాదానపాతకం కలిగిందే అని, వ్లానవదనుడై పశ్చాత్తాపంతో ఇలా ఆలోచించాడు: "శరీరులు కర్మపాశం లాగగా వివశులై తమ యిష్టానిష్టాలతో సంబంధం లేకనే, సుకృతంకాని, దుష్కృతంకాని పొందుతారు. శుభ్రమైన సుకృత చరితంలో దుష్కృతకణం పడగానే ముఖం వాడిపోయి, మానవుడు దుఃఖపడతాడు. క్షణసుఖదమైన ఈ భవదుఃఖసంచయంలో ఆశాపాశం లాగకుండా పడిపోనివారి పశ్చాత్తాపం శతశాఖలుగా లోలోపలే ప్రవేశించి వ్యాపించి ఎండిస్తుంది. కనుక నేను రాజు సమక్షానికి వెళ్ళి చేసిన పాపం తెలియజేస్తాను. రాజశాసనశుద్ధులైనవారికి ధర్మం పట్ల అప్పుసప్పు



ఏమీ ఉండదు. ధర్మప్రవృత్తులకు శాస్త్రం మార్గదర్శకం; రోగార్తులను గట్టెక్కించే వాడు చికిత్సకుడు; పాపకర్మ ప్రవృత్తులను ధర్మమార్గంలో నడిపించే నేత వర్ణాశ్రమగురువైన నరపతి."

అతడు సంతాపంతో ఈ విధంగా ఆలోచించి, వెంటనే తన సోదరుడైన రాజువద్దకు వెళ్ళి తాను చేసిన అదత్తాదానపాతకం తెలియజేశాడు. చంద్రమహారాజు జ్యేష్ఠభ్రాతను చూచి చాల ఆనందించి, పూజించి, "ఆజన్మశుద్ధభావులయినవారికి పాపం అంటదు. దైవాత్తు ఏదైనా అనుచితమైన చిన్న పని చేసినప్పటికీ, అంతంలో పశ్చాత్తాపం పొందితే సంశుద్ధి" అని మనవి చేశాడు. ఆ మాటలు విని సూర్యుడు "సద్ధర్మధవళాంశుకం వంటి ఈ దేహంలో కళంకలేశం కూడా సహించను. శిక్ష కోరుతున్నాను. కనుక ఆలోచించి శిక్ష విధించు. రాజదండం వల్ల పాపం నిప్పుతోలాగే కాలి, పవిత్రమౌతుంది" అని పలుమారు పట్టుదలతో కోరాడు. దానికి చంద్రమహారాజు "రేపు ఉదయం తగిన శిక్ష విధిస్తారు. ఈ నా ఉద్యానవనంలో వేచిఉండండి." అని చెప్పి పౌరకార్యార్థం వెళ్ళాడు.

సూర్యుడు ఈ విధంగా నియమనిశ్చలుడైన ఉద్యానవనంలో ఎదురు చూస్తుండగా, రాజు, ఆ సంగతి మరచిపోయి ఆరుదినాల తర్వాత వచ్చాడు. ఆహారం సేవించనందున బక్కచిక్కిపోయిన అన్నను చూచి, తన మరపును నిందించుకొంటూ, అతనిని ప్రసన్నుని చేసుకొన్నాడు. బ్రాహ్మణులతో సహా ఆలోచించి, అతని పాపం ఆరుదినాలు క్లేశమివ్వడం వల్ల పోయిందని నిర్ణయించాడు. అతడు అరణ్యానికి తిరిగి వెళ్ళిన పిదప తనకు సమ్మోహబుద్ధి కలిగినందుకు తపించాడు.

నేనే ఆ సూర్యరాజర్షిని. ఈ శిశువు చంద్రమహారాజు. మునికి ఆరు దినములు కష్టం కలిగించడం వల్ల, ఆరు సంవత్సరాలు గర్భవాసంలో కష్టపడి జన్మించాడు.

పూర్వం ఒకప్పుడు ఒక గొల్లని భార్య భద్ర అనేది తన కుమార్తె హరిణితో పాటు పెరుగు అమ్మడానికి బయలుదేరింది. కుమార్తె తన బరువైన దధిభాండం వృద్ధురాలికిచ్చి, ఆమె మోసుకొన్న చిన్న తేలికకుండను తీసుకుంది. ముసలితల్లి ఒకటిన్నర యోజనం పెద్దకుండను మోసుకొని రావడం వల్ల పట్టణసమీపం చేరేసరికి అలసిపోయింది. ఆ ఆభీరతరుణే యశోధర. ఆరు కోసులు తల్లితో బరువు మోయించడం వల్ల ఆరు సంవత్సరాలపాటు గర్భభారంతో క్లేశపడింది. ఈ దేహధారులకు ప్రాక్తనకర్మ వెంటసంటే వస్తుంది. అది దేవ మర్త్య పాతాళ లోకాల్లోగాని, శైశవంలోగాని, యౌవనంలోగాని, వృద్ధాప్యంలోగాని, మరణకాలంలోగాని, గర్భవాసంలోగాని నశించదు.

ఈ విధంగా తథాగతుడు రాహుల పూర్వకర్మకు సంబంధించిన చిత్రకథను చెప్పగా, భిక్షుసంఘమూ, శుద్ధోదనక్షితిపాలుడు విస్మయ పరీతులయ్యారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో రాహులకర్మప్లుత్యవదానమనే ఎనభైమూడవ పల్లవం

# 84. మధురస్వరావదానం

ఔచిత్యంతో దేవతల మనస్సులను కూడ ఆనందసాంద్రం చేసేవాడు, తన ఉత్తమ ప్రభావం చేత క్రూరుల స్వభావాన్ని కూడ తునాతునకలు చేసేవాడు, జగన్నాయకుల ప్రభావాలను కూడ జయించేవాడు అయిన వ్యక్తి తరచుగా పుడుతాడు. అతని పుణ్యం లెక్కపెట్టడానికి సంఖ్యలు కూడ చాలవు.

పూర్వం శ్రావస్తీ నగరంలో సుధీరుడనే గృహమేధికి సునేత్ర అనే భార్యకు ఒక కుమారుడు కలిగాడు. అతడు పుట్టగానే, అతని పూణ్యకర్మలకు చిహ్నమో అన్నట్లు దివ్యరత్న విభూషితమైన మంచం విరాజిల్లింది. దానిలో అతడు కూర్చున్నాడు. అతడు పుట్టినప్పుడు మేఘాలు మధురస్నిగ్ధనిర్ఘోషాలు చేస్తూ, పుష్పాలు రత్నాలతో సహా మధువును వర్షించాయి. కుబేరుని నిధానశతం కూడ అతనికి అబ్ధి పూర్ణుడైన ఆ కుమారుని జన్మసమయంలో మధువర్షం పడడం వల్ల అతని పేరు మధురస్వరుడు అని వాడుకయింది. అతడు పెరిగి పెద్దవాడై రత్నాలు వర్షిస్తూ, ప్రపంచాన్ని దారిద్ర్యరహితం చేయగా, తెల్లని కాకివలె యాచకుడొక్కడూ కానరాకపోయాడు.

అతని యింటికి ఒకమారు ప్రశాంతపథవర్తి అయిన ఆనందుడు వచ్చాడు. మధురస్వరుడు ఆ బిక్షువును చూచి, ఆశ్చర్యపడి తండ్రి వద్దకు వెళ్ళి, "నాయనా, ఈ వైమల్యశాలి అయిన భిక్షువు చేస్తున్న వ్రతమేమిటి? ఇతనిని దర్శించగానే నా మనస్సు ప్రసన్నమౌతున్నది" అని ప్రశ్నించాడు. పుత్రుని మాటలు విని సుధీరుడు "పుత్ర, సత్త్వగుణ ప్రకాశుడైన ఈ భిక్షువు శాంతివ్రతం పరిగ్రహించాడు. సమస్త జగత్తులకు సంసారఘోరార్ణవం తరింపజేయడంలో సరళమైన సేతువు, క్రోధవ్యాధికి చికిత్సకుడు, శమసుధాప్రవాహంతో తృష్ణను పోగొట్టేవాడు, దోషతిమిరాలను పటాపంచలు చేసే సూర్యుడు, ప్రబుద్ధకాంతి అయిన బుద్ధభగవానునికి ఇతడు శ్రావకుడు. శాంతిమనస్కులైనవారికి అగ్రణివంటివాడు; ఆనంద భిక్షువు."

బుద్ధభగవానుని పేరు వినగానే మధురస్వరుడు పూర్వజన్మ కుశలప్రాదుర్భావం వల్ల ఒడలు పులకించి, ఆనందంతో ఆనందునికి నమస్కరించి, చనువుతో భిక్షుసంఘాలతో సహ అతణ్ణి సర్వభోగాలతో పూజించాడు. తర్వాత భిక్షువులతోసహ ఆనందుడు మరలి వెళ్ళుతున్నప్పుడు కుతూహలంకొద్దీ అతని వెంటే జేతవనానికి వెళ్ళి, కాంతిరాశి అయిన తథాగతుని దర్శించాడు. ఫుల్లపద్మధవళనేత్రాలతో, దివ్యలక్షణాలతో, లావణ్యలలితాకారంతో, హేమతాళవృక్షం వలె ఉన్నతుడై అమృతంతో దేహాన్ని తడుపుతున్నట్లున్న భగవానుని చూచి హర్షనిర్భరుడై నమస్కరించి అతని పాదనఖకాంతిని మాలవలె తలపై ధరించాడు. పిదప భగవానుని తన యింటికి భోగపరిగ్రహానికి ఆహ్వానించాడు. ప్రణయివత్సలుడైన భగవానుడు అతనిని సంతోషపెట్టడం కోసం అతని యింటికి వెళ్ళి ఆతిథ్యం స్వీకరించి, జేతవనానికి మరలి వచ్చాడు.



భగవానుడు వెళ్ళిన పిదప మధురస్వరుడు అక్కడ చేరిన ప్రజలను రత్నరాసులతో నింపాడు. కొందరు పుణ్యరహితులకు ఆ రత్నరాసులు ఇంటికి తెచ్చినమీదట బొగ్గుల కుప్పలయాయి. ఆ విషయం విని మధురస్వరుడు దుఃఖపడి వారితో "అయ్యలారా, మీరు పూర్వజన్మలో సుకృతం చేయలేదు, దయతో దానం చేయక, సంఘభోజనం ఇవ్వక భగవానుని అర్చించక విభవాలు లభించవు. కనుక మీరు సుగతప్రముఖమైన సంఘాన్ని ఆరాధించండి. నేను సర్వోపభోగ సామగ్రిని సంపాదించిపెడతాను" అని మనవి చేసి, వారిని పంపాడు. వారు అతడు పంపిన సంభారాలతో పాపశాంతి కోసం భగవానుని సంఘంతోపాటు పూజించారు. దానితో వారి కల్మషం వెంటనే క్షీణించి, కల్యాణం పొంది, ఇండ్లకు వెళ్ళి చూడగా, ఇండ్లు రత్నరాసులతో నిండి ఉన్నాయి.

కొంతకాలానికి మధురస్వరుడు వైరాగ్యం అతిశయించి, భగవానుని సన్నిధికి వెళ్ళి ప్రశాంతికోసం ప్రవ్రజ్యను స్వీకరించాడు. పిదప శాస్త అయిన భగవానుని ఆజ్ఞప్రకారం శ్రావస్తిని వదలి, కర్వట ప్రాంతంలోని విహారానికి వెళ్ళాడు. అక్కడి ప్రజలకు శిక్షాపదాలు ఉపదేశించాడు. వారు క్లేశవిషశాంతికోసం రత్నత్రయం శరణు పొందారు.

ఇది ఇలా ఉండగా, ఆ విహార సమీపంలోని అరణ్యంలో వసించే దొంగలు దుర్గాదేవికి బలియోగ్యుడైన నరుణ్ణి వెదకడానికి అక్కడికి వచ్చారు. దుర్మార్గుడెవడో చూపిన గుర్తుతో విహారంలో ప్రవేశించి, ధ్వని విని వెలుపలికి వచ్చిన భిక్షుగణాన్ని పట్టుకొన్నారు. "దుర్గాదేవి ఉపహారానికి మాకు ఒక్క భిక్షువే చాలు" అని దొంగలు అంటున్న మాట విని భిక్షువులు "నన్ను పట్టుకొని వెళ్ళి, తక్కిన భిక్షువులను విడవండి" అని దొంగలను బ్రతిమాలారు. వృద్ధులందరూ ఈ విధంగా అన్న తర్వాత మధురస్వరుడు దొంగలతో "నేనే దుర్గాదేవి బలికి అర్హుణ్ణి. భిక్షుసంఘాన్నంతా వదలిపెట్టండి" అని అన్నాడు. ఆ సుందరాకారుణ్ణి చూచి, దొంగలు మంచిమాట అనుకొని, అతనిని పగ్గాలతో కట్టి లాక్కునిపోయారు. అతనికి వారు చంపనున్నప్పటికీ మనోవికారమేమీ కలుగలేదు.

వారు అతన్ని అరణ్యమధ్యంలోని ఒక దుర్గాలయానికి తీసుకొని వెళ్ళారు. ఆ ఆలయం భయంకరంగా ఉంది. బలి యిచ్చిన మహిష దేహశకలాలతో కల్పాంతమేఘాలు తమ కుమారులను బలియిచ్చినవా అన్నట్లు, పాదపీఠంపై పేరుకొన్న జింకల రక్తపుచారలతో భటులు దాసాని పూవులమాలలు సమర్పించారా అన్నట్లు ఉంది. దేవాలయ ఘంటల కొసలకు ఆత్మార్పణం చేసిన వీరుల శిరస్సులు వ్రేలాడుతున్నాయి. అది చూడగా మృత్యువు వికసిత కమలాలతో ద్వారార్చన చేసిందా అన్నట్లుంది. నరుల వేడి నెత్తురుతో ఎర్రనైన మెట్లు చూస్తే శబరకాంతల అడుగుల లత్తుక అంటుకున్నట్లు ఉంది. కిరాతకాంతలు పూజోపహారాలు తీసుకొని రానప్పుడు తమ ఒడిలోని శిశువులనే బలి యిస్తున్నారు. అలా బలియిచ్చిన పసిపిల్లల హృదయపద్మాలు ప్రాంగణవేదికలపై చిందర వందరగా పడి ఉన్నాయి.

ఎక్కడ చూచినా, తమను చంపివేస్తారనే భయంతో వణకిపోతున్న ప్రాణులున్న ఈ సంసారం చూచి మధురస్వరుడు ధ్యానం చేసి, అర్హత్వం సాక్షాత్కరింపజేసుకొని, సర్వక్లేశాలు క్షీణించడం వల్ల వీతరాగుడై, త్రిధాతు మననపరుడై ప్రియాప్రియ వస్తువులందు తుల్యభావం కలిగి ఈ విధంగా ఆలోచించాడు: "ఆహో! భవనాశనుడైన శాస్త ప్రభావం! .అతని అనుగ్రహం వల్ల నిబిడనిగళాలతో బంధించిన మోహం పటాపంచలైంది. తృష్ణ అనే విషయనదిని దాటాను. జన్మవృక్షాలు పడిపోయాయి. భౌతికమైన దృష్టిశైలాలు కూలిపోయాయి.

వ్యసనశమనమ్మైన స్థానం పొందాను. ఈ స్థానంలో శోకమనే లోచనాలు బాష్పాలు ధరించవు." ఇలా ఆలోచించి సత్త్వగుణ సముద్రుడైన మధురస్వరుడు పర్వతంవలె అచలుడుగా ఉండిపోయాడు.

పిదప చోరులు అతని మెడలో వధ్యమాల వేసి, క్రోధంతో ఆయుధాలు కదిలిస్తూ, బంగారు కాంతులీనే దేహం నుంచి బట్టలు లాగివేశారు. లాగినకొద్దీ గుడ్డలు రావడం మొదలైంది. ఈ విధంగా పెద్దవస్త్రరాశే ముందుపడింది. ఇంతలో దేవి ప్రభావం వల్ల ఐదువందల భూతాలు పుట్టి, ఆ ఐదువందలమంది దొంగలను అలాగే నిలబెట్టాయి. వారి చేతులలోని ఆయుధాలు కూడ కింద పడిపోయాయి. ఆకాశస్థలినుంచి రత్నరుచిరమ్మైన పుష్పవృష్టి కురిసింది. అతడు వ్యోమమార్గం పయనం చేయడానికి ఎగసిపోతున్నాడు. అది చూచి దొంగలు, అతని కాళ్ళు పట్టుకొని, ఆ ప్రభావంతో, అతనినే శరణు పొందారు. అతడు భూమిమీదికి దిగి, శాంతికోసం తన చరణాలపై మస్తకాలుంచిన ఆ దొంగలను చూచి, "దుష్కృతాలు వదలి ధర్మంలో మనసు ఉంచండి" అని బోధించాడు. వెంటనే వారు విగతకిల్బిషులై వైరాగ్యవంతులై ప్రవ్రజ్య స్వీకరించి సంసారపరంపరాశాంతికరమ్మైన అర్హత్పదం పొందారు.

పిదప మధురస్వరుడు ఆ ఐదువందలమంది దొంగలు, కర్వటవాసులైన ప్రజలు వెంటరాగా, శాస్తను దర్శించడానికి జేతవనం వచ్చారు. అక్కడ, దేవతలు సిద్ధపరచగా, దివ్యజనులు తీసుకొనివచ్చిన సుధారస సంకలితమ్మైన దివ్యాన్నాలతో భగవానుని పూజించాడు. భగవానుడు ప్రసన్నుడై శుద్ధప్రసాదగుణం కలిగించి, మోక్షమార్గానికి అగ్రదూతిక అయిన ధర్మోపదేశాన్ని వారి హితం కోసం అనుగ్రహించాడు.

మధురస్వరుని తండ్రి సుధీరుడు తన పుత్రుడు అమృతత్వ ప్రాప్తికి పాత్రుడయాడని తెలుసుకొని, తన సుకృతవశాత్తు లభించిన బంగారు తామరపూవును గ్రహించి, సుగతుని పూజించడానికి జేతవనం చేరాడు. వాడు ఆ తామరతో సుగతుని అర్చించి, అతని చరణయుగళంపై శిరస్సువోపి, అతని ప్రసాదమయదృష్టితో పరిమార్జితుడయ్యాడు. కుశలాలు సమీపించిన సుధీరుణ్ణి భగవానుడు చూచి, "నీవు బంగారు తామరతో నన్ను అర్చించావు గనుక, నీవు అడుగుపెట్టగానే బంగారు తామరలు పుడుతాయి. పద్మోత్తరుడు అనే పేరుతో విఖ్యాతి పొంది, సమ్యక్సంబుద్ధుడవై సకలసత్త్వసంతారణం చేసి, పరినిర్వాణం పొందుతావు" అని భవిష్యవాణి పలికాడు. సత్యదర్శి అయిన సర్వజ్ఞుని మాట విని, సుధీరుడు జగత్కల్యాణ కలనా మనోరథం మనసులో నింపుకొన్నాడు.

భవభేది అయిన శాస్తను ప్రణమించే పుణ్యసమయంలో తమ శిరస్సును భక్తితో అతనికి పాదోపధానం చేసిన సుకృతులకు స్వస్తి కలిగింది. ఆ స్వస్తితో తృప్తిపడినవారు ఇక తల్లుల ఒడిలో పడి, పాలుతాగే బోసినోటితో మూఢస్మితం చేయరు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మధురస్వరావదానమనే ఎనభైనాల్గవ పల్లవం

# 85. హితైష్యవదానం

నయనాల ద్వారా చేరి, హృదయంలో ప్రసరించి, విద్వేషమనే శూలను పుట్టించి, కుష్ఠరోగంవలె సర్వాంగాలు వ్యాపించే రాగరోగాన్ని పోగొట్టే భిషక్కులకు నమస్కారం.

ఒకనాడు తథాగతుడు ధ్యానానంతరం స్వచ్ఛమానసుడై ఉపదేశించి విశ్రమించిన పిదప భిక్షువులు కౌతుకంతో ఈ విధంగా ప్రశ్నించారు: "భగవన్, నీవు సర్వలోక శోకాపహారివి. భవరోగవైద్యుడవు. నీకు రోగులంటే ఎందుకు ఎక్కువ ఇష్టం?" "నిజమే, నాకు రోగులంటే చాల ఇష్టం. ఎందుకంటే కాయబాధకు సమానమ్మైనది మరొకబాధ మానవులకు లేదు. జన్మాంతరంలో కూడ దైన్యానికి పుట్టినిల్లులవంటి రోగులంటేనే నాకు పక్షపాతం ఉండేది" అంటూ భగవానుడు పూర్వకథను చెప్పసాగినాడు.

పూర్వం శిఖిఘోష అనే నగరంలో శిబి అనే రాజు ఉండేవాడు. అతడు ఇతరప్రాణుల చింతలనే చూస్తూ, అర్థులకు సద్బాంధవునివలె ఉండేవాడు. సర్వేసర్వత్ర ఉన్న రోగులందరికీ నేను చికిత్సచేయాలి అని ఎల్లప్పుడు ఆ సత్వసత్త్వనికి నిశ్చయం కలిగింది. ఆర్తవత్సలుడైన అతనిని ఒకవూరు చిరరోగనిపీడితుడైన ఒక పౌరుడు తనకు చికిత్స చేయవలసిందిగా కోరాడు. మహీపతి అతని స్వాస్థ్యం కోసం వైద్యులనందిరనీ ప్రశ్నించాడు. వారు చాలా సేపు ఆ రోగిని పరీక్షించి, రోగం ముదిరిందని గ్రహించి, "రాజన్, ఈ రోగం పెద్దదైంది. దీనికి మందు లేదు. దీనికి ఒక్కటే మందు ఉంది. పుట్టినది మొదలు పరమశాంతుడుగా ఉన్న ఉత్తముని రక్తంతో ఇది శమిస్తుంది" అని మనవి చేశారు. ఆ మాటలు విని నరపతి కరుణాకీర్ణమానసుడై వైద్యులు చెప్పిన చికిత్సను గురించి ఆలోచించాడు: "నేను పిల్లవాడినయినప్పుడు కూడ ఎప్పుడూ కోపమంటే యెరుగను. నేను గర్భంలో ఉన్నప్పుడూ నా తల్లి క్రోధవర్జితురాలుగా ఉండేది. కనుక నావంటి క్రోధరహితుడు ఈ లోకంలో మరొకరు లేరు. నా రక్తంతోనే ఈతని వ్యాధిని తగ్గిస్తాను." ఈవిధంగా ఆలోచించి అనుచరులు ఎంతవద్దన్నా వినక తన తలలోని రక్తాన్ని రోగికి దానం చేశాడు. ఆ రోగి రాజు రక్తంతో ఆరునెలల్లో స్వస్థుడై, తన సంకల్పం నెరవేరగా, సంతోషంతో రాజు వద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయాడు. రాజు రక్తదానం చేయడం వల్ల బక్కచిక్కి పోయాడు.

శిబి మహారాజుకు హితైషి అనే కుమారుడు ఉండేవాడు. అతనికి మితిమీరి వ్యాయామం చేయడం వల్ల పక్కలు ఎండుకుపోవడమనే క్షయరోగం కలిగింది. పుణ్యకర్మల విపరీత పరిణామమంటే యిదే. ఆరోగ్యవంతులకు తిండి ఉండదు; శ్రీమంతులకేమో రోగాలు. అప్పుడు వైద్యశ్రేష్ఠులు రాజకుమారుణ్ణి పరిశీలించి, వేయిపాకాలతో సిద్ధమయిన సర్వసారమనే ఘృతం మేలైన మందని అన్నారు. ఆ ఘృతం సకల ద్రవ్యాల సారంతోను, చకోరపక్షి స్నానం చేసిన జలాల క్వాథంతోను ఎంతో శ్రమతో పన్నెండు సంవత్సరాలలో ఆ సర్వసారఘృతం సిద్ధమైంది. దానిని హితైషికుమారుడు సేవించబోతుండగా, శోకార్తుడైన ఒక ప్రత్యేకబుద్ధుడు వచ్చి యాచించాడు. ఎందరు వద్దంటున్నా, సత్త్వగుణసాగరుడైన రాజకుమారుడు భక్తితో ఆ సర్వసారఘృతమంతా ఆ ప్రత్యేకబుద్ధునికి సమర్పించాడు. ప్రత్యేకబుద్ధుడు ఆ ఘృతంతో

శోకవిముక్తుడై, ప్రసన్నతతో ప్రణిధానం చేసి, సాధుసేవి అయిన ఆ కుమారుణ్ణి స్వస్థుడుగాను, అమృతప్రాయుడుగాను చేశాడు. హితైషి అనే ఆ రాజకుమారుణ్ణి నేనే, రోగుల కష్టాల్ని పోగొట్టడం స్వభావంగానే నాకు ఇష్టం.

ఆ గాథ విని భిక్షువులు “ఏ కర్మతో వారిద్దరికీ సమానమైన రోగం వచ్చింది? ఎలా పోయింది?” అని మరల ప్రశ్నించారు. సర్వజ్ఞుడు వారికి ఇలా చెప్పాడు:

పూర్వం వారాణసిలో బ్రహ్మదత్తుడనే మహారాజు ఉండేవాడు. అతనికి నందోపనందులనే యిద్దరు కుమారులుండేవారు. జ్యేష్ఠుడేమో కీర్తిని కోరేవాడు; కనిష్ఠుడు రాజ్యకాముడు. ఉపనందుడు ఒకమారు అథర్వయోగకుశలుడు, తన మిత్రుడు అయిన కుహనుడనే పురోహిత పుత్రునితో రహస్యంగా ఇలా అన్నాడు: “మిత్రమా! నా జ్యేష్ఠభ్రాత జనరంజన తత్పరుడు. జనంలో పలుకుబడి, కీర్తి ఉన్నందున సులభంగా రాజ్యం పొందుతాడు. నాకు రాజ్యంలో భాగమేమీ ఉండదు. జనమెవరూ నన్ను చూడరు. జనమెవరూ చూడక బ్రతకడం కంటే, విజనమైన అరణ్యంలో మరణించడం మేలు. నీ జ్యేష్ఠభ్రాతకేమో వంశానుగతమైన పౌరోహిత్యం లభిస్తుంది. కనుక మనమిద్దరం సమానకష్టంలో ఉన్నాము. అరణ్యానికి వెళ్ళడం మేలు.” శోకంతో ఈ విధంగా ప్రలపిస్తున్న రాజకుమారుని మాటలు విని, “నీకు హితం చేస్తాను. భయపడకు” అని కుహనుడు అన్నాడు. పిదప మందులు పెట్టి, జ్యేష్ఠకుమారునికి పక్షవాతం వచ్చేట్టు చేశాడు. రాజు బ్రహ్మదత్తుడు జ్యేష్ఠకుమారుడు రోగిష్ఠి కావడం చూచి కనిష్ఠుడికి రాజ్యమిచ్చాడు.

ఉపనందుడు రాజ్యపరిపాలన కావిస్తూ, ఒకమారు, పక్షపాతంతో కర్ర ఊపుకుంటూ వెళ్ళుతున్న తన అన్నను చూచి పశ్చాత్తాపం పొంది, గుప్తపాతకంతో తపిస్తూ, వేడి నిట్టూర్పులు విడుస్తూ తన మిత్రుడైన పురోహితునితో ఇలా అన్నాడు. “నేను ధర్మం తెలిసికొనక రాజ్యలోభంతో పితృసమానుడైన జ్యేష్ఠభ్రాతకు ఈ పాడుదశ కలిగించాను. అసమీక్షితకారులు క్షణభంగురమైన సుఖం కోసం పాపకర్మలు చేసి, నిరంతరక్షయకారులైన దుఃఖాలలో పడుతారు.” పురోహిత కుమారుడు కూడా ఆ మాటలకు పశ్చాత్తప్తుడై “రాజా! నేను కూడా ఈ విధంగానే పశ్చాత్తాపం పొందుతున్నాను” అని మరల విరుగుడు మందులతో నందుని స్వస్థదేహుని చేశాడు. అతడు ఆరోగ్యవంతుడైన పిదప ఉపనందుడు అతనికి రాజ్యం ఇచ్చివేశాడు.

కొంతకాలానికి ఆ ఉపనందుడు, పురోహితసుతుడు ఒక ప్రత్యేకబుద్ధునికి భవనం కట్టించి, కాలధర్మం చెందారు. మరుజన్మలో రాజుపుత్రుడు శిబిమహారాజు కుమారుడుగా పుట్టాడు. పురోహితకుమారుడు ప్రత్యేకబుద్ధుడయాడు. ఆ గూఢపాతకంతో ఇద్దరికీ సమానమైన రోగం కలిగింది. వ్యంగరోగాన్ని పోగొట్టడం వల్ల ఏకకాలంలోనే స్వాస్థ్యం పొందారు.

భిక్షువులు ఈ విధంగా ఆపన్నార్తిప్రాణబంధువైన జినుని పూర్వ జన్మానుబద్ధమైన నిరంతర సత్త్వకారుణ్య చరితం విని, హృష్టమానసులై ప్రశాంతిని పొందారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో హితైష్యవదానమనే ఎనభై అయిదవ పల్లవం

# 86. కపింజలావదానం

ధర్మశిక్షావేత్తలయినవారు గుణపూజ్యులయిన పెద్దవారిని స్థవిర క్రమానుసారంగా ప్రణామ వినయాదులతో గౌరవిస్తారు. దానివల్ల ఉన్నతిని పొందుతారు. దర్పోద్ధతమైన విశృంఖలబుద్ధితో, మోహం కనులు గప్పి, జ్యేష్ఠాతిక్రమణం చేసే అధఃపతితులకు ఇహలోకం, పరలోకం కూడ శోకభూయిష్ఠమవుతుంది.

జ్యేష్ఠులను పూజించవలెనని చెబుతున్న సందర్భంలో వృద్ధక్రమం ఎలా అనుసరించాలనే విధిని గురించి భిక్షువులు ప్రశ్నించగా, సర్వజ్ఞుడు మరల ఇలా అన్నాడు:

పూర్వం వారాణసిలో బ్రహ్మదత్తుడనే రాజు ఉండేవారు. అతని పుణ్యప్రభావంతో జగమంతా ధర్మారణ్యమయింది. అతని కాలంలో అతని పురోపవనంలో పూర్వపుణ్య లక్షణం వల్ల మనుష్యవాక్కులతో పలికే నాలుగు ప్రాణులు-కపింజలమనే పక్షి, ఒక కుందేలు, ఒక కోతి, ఒక ఏనుగు ఉండేవి. అవి పరస్పరం స్నేహానుబంధంతో ఉండేవి.

ఒకమారు అవి ఏవో ముచ్చటించుకొంటూ సుఖంగా ఉన్నప్పుడు, పరస్పరం ఇలా అనుకొన్నవి: “మనకు గౌరవం జరిగేట్టయితే ఎవరికి ముందు జరగాలి? ఎవరు మనలో పెద్దలు? పెద్దలు పెద్దతనాన్ని బట్టి సత్కారం ఏర్పాటు చేశారు. ఈ పద్ధతి కల్యాణం కలిగిస్తూ కుశలాన్ని పొందిస్తున్నది. మనలో ఎవరు జ్యేష్ఠుడో, వారు స్థవిరగౌరవం వల్ల పూజలందుకోవాలి.” ఇలా అనుకుంటూండగా, గజరాజం “అదుగో, అక్కడ కనిపిస్తున్నదే ఆ జీర్ణమహాశాఖమైన పురాణ వటవృక్షం, ఇప్పుడేమో నా దేహంతో సమానంగా ఉంది కాని, ఇది చివురుటాకులు తొడగడం నేను చూచాను” అన్నది. మర్కటమేమో “నేను అడవిలో తిరుగుతున్నప్పుడు, చిన్నగా నా దేహంలాగా ఉండడం చూచాను.” అన్నది. “ఇంకా రెమ్మలే వేయని రెండాకుల మొక్కగా ఉన్నప్పుడు సరిగ్గా బెత్తెడే వుండేది. దానిమీద పడిన మంచుబిందువులను నేను నాలుకతో నాకాను.” అని కుందేలు అన్నది. వారు ముగ్గురూ ఇలా అనగా కపింజలపక్షి “నా రెట్టలోని విత్తనం వల్లనే ఈ మహావటవృక్షం పుట్టింది” అన్నది. తర్వాత అవి నాలుగూ, జ్యేష్ఠక్రమం తెలుసుకొని స్నేహానువృత్తితో పరస్పరం ఎప్పుడూ గౌరవించుకొనేవి. అవి ప్రాణాపహరణం, చౌర్యం, అగమ్యాగమనం, అసత్యం, మద్యతుల్యమైన పుల్లని పండ్లు తినడం వంటి పనులు మాని, సుకృతంపైనే ఆసక్తి కలవై తమ ఆచారంతోను, పుణ్యప్రభావంతోను వనంలోని ప్రాణులందరినీ తమతో సమానమైన ప్రవర్తన కలవారిని చేశాయి.

ఆ ప్రాణుల ప్రభావం వల్ల భూమి, సర్వకాలం ఫలించే వృక్షాలతో, ఎల్లప్పుడూ పండే నిండు పంటలతో విరాజిల్లేది. మేఘాలు సకాలంలో వర్షించేవి. భూమిలో కలిగిన ఈ మహదాశ్చర్యకరమైన సుకృత లక్షణం చూచి, బ్రహ్మదత్త మహీపతి అదంతా తన పుణ్యం వల్లనే కలిగిందని భావించాడు. ఇలాటి

అపోహతో మిథ్యాసంతోషతుష్టుడైన అతనిని పంచాభిజ్ఞుడైన ఒక ముని "రాజా! నీ ప్రభావం వల్ల ఈ పుష్పఫలాలు ఉద్భవించడం లేదు. ఈ సమీపంలోని ఉపవనంలో కపి శశ ద్విప కపింజలాలు వసిస్తున్నాయి. అవి సద్ధర్మశీలంలో ఉండడం వల్ల కలిగిన గుణప్రభావమే యిది. అవి పంచవ్రతవిశుద్ధాలై, స్థవిరానుసారంగా గౌరవంతో ప్రవర్తిస్తూ, కపింజల పక్షి మాటను బట్టి అన్నీ సద్ధర్మనియమం అనుసరిస్తున్నాయి" అని తెలియజేశాడు. ముని మాటలు రాజు విని, ఆదరంతో పౌరాంతఃపురామాత్య సహితంగా పంచవ్రతాలు స్వీకరించాడు.

ఆ కపింజలుణ్ణి నేనే. శారిపుత్రుడు శశము. మర్కటమేమో మౌద్గల్యాయనుడు. ఆనందుడేమో గజరాజు. వారు జ్యేష్ఠక్రమానుసారం పూజించడం వల్ల విమలధర్మం తెలుసుకొన్నారు. కనుక, ప్రణామ పూజలయందు స్థవిరక్రమం చూడాలి.

శాస్త చెప్పిన జ్యేష్ఠార్చనమనే వినయోపదేశాన్ని భిక్షువులు తపోవిశేషంగా విని, పరిషత్తులోని వారిని వృద్ధానుక్రమంగా గౌరవంతో పూజించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కపింజలావదానమనే ఎనభై ఆరవ పల్లవం

# 87. పద్మకావదానం

వెంటనే వ్యాపించి మృత్యువు కలిగించే సర్పవిషంకాని, కాలకూటవికటాటోపంతో తన ప్రభావం స్థిరంగా ఉంచే మరొక విషంగాని, ఒక్కటిగా కూర్చిన దుస్సహమైన ఇతర విషాలుగాని, వాక్పారుష్యమనే విషపు తీక్ష్ణతతో లవలేశం కూడ పోలవు.

పూర్వం శ్రావస్తిలో మానసుడనే గృహపతికి పద్మగర్భంతో సమానమైన కాంతిగల గుణవంతుడైన కుమారుడు ఉండేవాడు. వాని పేరు పద్మకుడు. సుశీలుడైనవాని నియమం వలె, సాధువైనవానికి గుణాల ఎడ ఆదరం వలె, ధీమంతుని వివేకం వలె ఆ కుమారుడు గృహపతి యింట్లో పెరిగేవాడు. అతనికి రూపంతో కందర్పుణ్ణి కూడ పరిహసించే యౌవనం ప్రాదుర్భవించింది. అప్పుడు అతనికి భోగాలలో విరాగం కలిగింది; వైరాగ్యంపై మనస్సు అభిముఖమైంది. క్షమాచిత్తుడైన ఉపసేనుడనే భిక్షువు వద్ద అతడు ప్రశమశ్లాఘ్యమైన ప్రవ్రజ్యను స్వీకరించాడు. భిక్షాపాత్ర ధరించి, చీవరం కట్టుకొని ఉన్న పద్మకుడు ఈ సంసారంపై విరక్తి పుట్టి చంద్రుడే సన్యసించాడా అన్నట్టు ప్రకాశించాడు.

అతడు ఒకమారు జనం చెప్పుకొనడం విని ఏకాకిగా విహారారామ రుచిరమైన మధురానగరానికి వెళ్ళాడు. కొత్తవాడు కావడం వల్ల ఎవరి యిల్లనేది తెలియక, భిక్షకోసం శశిరేఖ అనే వేశ్య గృహప్రాంగణానికి వెళ్ళాడు. ఆ కువలయేక్షణ అతని రూపం చూచి ఆశ్చర్యపడి, అతనికి ఉచితాసనమిచ్చి ఆదరించి ఇలా అన్నది: "మహాభాగ! నవయౌవనశాలి అయిన ఈ నీ లలితమూర్తి ఎవరి కన్నులకు అమృత సంభోగదీక్షను ఇవ్వదు? ఈ వయసులో, ఈ రూపంలో కామవిరోధి అయిన ఎవడు నీకు వృద్ధోచితమైన వైరాగ్యం ఉపదేశించాడు? సంభోగపాత్రుడైన నీ చేయి లలనల పైటలు లాగి, కుచాలను స్పృశించదగింది. అలాటిదానికి భిక్షాపాత్రం ఉచితం కాదు. నేనేమో కుచభారనమ్రను; నీవు తారుణ్య తరంగితుడివి. మనిద్దరికీ ప్రీతి ఉచితం. ప్రస్తుతం ప్రవ్రజ్యావ్రతం కొంతసేపు ఓర్చుకొని ఉండనీ. ఏదో శాపం తలమీద పడినట్టు శమదమాభ్యాసంతో సంభోగావృతంపై ఇష్టం లేక, ఆయతలోచనల అధరదళాస్వాద ప్రమోదోత్సవం మానుకుని, కాంతలు వచ్చి మీదబడి కుచకుంకుమం అలదగా హృదయంలో రాగరసం పొడమక, ఈ జనారణ్యంలో క్లేశాలతో తడిసిన గడ్డినే మేస్తాను-అనే వాడిని ఏమంటాము? ఆ దాంతునికి నమస్కారం, ప్రీతిలుబ్ధ అయిన నా మాట వినకపోతే; నీ సుందర వదనాంబుజాన్ని బలవంతంగా పానం చేస్తాను."

ఈ మాటలు విని, భయపడినవాడివలె అతడు చెవులు మూసుకొని, ఇలా అన్నాడు: "తల్లీ! నా నియమం పాడు చేయడం తగదు. సుచరితాభరణుడైన వానికి శీలంకంటే విభూషణం వేరొకటి లేదు. ఆ శీలమనేది సుగతవ్రతంతో ఉత్కృష్టతను పొందింది. పవిత్రతతో సత్త్వగుణలక్ష్మికి తిలక సదృశమైంది." ఈ విధంగా అతడు సమాధానం చెప్పి, అపాయమనే శల్యాలనే విషమమైన పూజను వదలి భిక్ష తీసుకోకనే శూన్యపాత్రతో అక్కడినుంచి వెంటనే బయలుదేరాడు.

శశిలేఖ చాల ఖిన్నురాలయి, రాగార్త గనుక ఏవిధంగానైనా పద్మకుని సంగమం పొందాలనే నిశ్చయంతో వశ్యాకర్షణాది మంత్రతంత్ర నిపుణురాలయిన మంత్రబల అనే చండాలకాంతను పిలిపించి, ఆమె కోరిన దానమిచ్చి సంతోషపెట్టి, తనకు జరిగిన స్మరపరాభవం తెలిపి, ఎట్లైనా పద్మకుని సంగమం కావాలని బతిమాలింది.

మంత్రబల మంత్రప్రభావంతో వెంటనే పద్మకుని ఆకర్షించి తెచ్చింది. మంత్రబలానికి వివశుడైన పద్మకుడు వచ్చి, "ఏమి పని? ఏమి చేయాలి?" అని ఆ చండాలిని ప్రశ్నించాడు. "ఈ శశిరేఖ నీపై ఎంతో ప్రణయంతో ఉంది. నీ పుణ్యంతో నీకు దక్కింది. ఈమెను అనుభవించనన్నా అనుభవించు, లేక మండుతున్న ఈ నిప్పులోనన్నా దూకు" అని చండాలి ఆజ్ఞాపించింది. పద్మకుడు ఎదుట మండుతున్న నిప్పు చూచి, తన చీవరం వదలి సత్త్వగుణకాంతులే ధవళాంశుకంలాగ చుట్టుకొనగా, దూకడానికి సన్నద్ధుడై, "తల్లీ, ఈ మండుతున్న నిప్పులో దూకుతానుగాని, మంటలు లేని రాగాగ్నిలో పడను. మదనాగ్నిదగ్ధులైన మానవులను మంటలు జన్మశతాలయినా వదలవు" అన్నాడు. ఆ మాటలు విని చండాలి మనస్సు విరిగి, చేయరాని పనిచేశామనే ఉద్వేగంతో పశ్చాత్తప్తురాలయింది. ఆమెకు, వేశ్య శశిరేఖకు మనసు మారి, బుద్ధి వైరాగ్యశమశీతలమైంది. వారిద్దరూ అతనిని చనువుతో ప్రసన్నుని చేశారు. క్షాంతినిలయుడైన అతడు వారి జన్మ పరిశుద్ధం కావడానికి సద్ధర్మోపదేశం చేశాడు. వారు ఆ ఉపదేశంతో సర్వక్లేశాలు శమించి, అర్హత్వం పొందారు. పద్మకుడు కూడ అర్హత్వం పొంది తథాగతుని దర్శించడానికి శ్రావస్తికి బయలుదేరాడు. శ్రావస్తిలో జేతవనవాసి అయిన తథాగతుని దర్శించి నమస్కరించి, కృతకృత్యుడై భిక్షువుల యెదుట స్వవృత్తాంతం నివేదించాడు. అతని పూర్వపుణ్యప్రాదుర్భావానికి విస్మితులైన భిక్షువులు వేశ్యాపద్మక చండాల స్త్రీల పూర్వవృత్తాంతం సెలవియ్యమని కోరారు. భగవానుడు ఇలా అన్నాడు:

పూర్వం కాశ్యపుని శాసనంతో మిత్రుడనే గృహపతి ప్రవ్రజ్య స్వీకరించాడు. అతని భార్యలు నంద, సునంద అనే వారు కూడా భర్తతో పాటు ప్రవ్రజ్య స్వీకరించి, విహారంలోనే నివసించారు. వారిద్దరి వాక్పరుషం కావడం వల్ల, తమ పరుషవాక్కులతో విహారంలోని భిక్షుణీ గణానికి కష్టం కలిగించారు. స్వభావం వదలడం కష్టం కదా! ఒకతేమో చండాలీ అనీ, మరొకతేమో లంజముండా అని భిక్షుణిలను తిట్టి పాపం పొందారు. ఆ వాగ్దోషం వల్లనే ఒకతె చండాలిగాను. మరొకతె వేశ్యగాను పుట్టింది. ప్రవ్రజ్య ప్రభావం వల్ల మరల కుశలమార్గం పొందారు. ఆ మిత్రుడనే గృహపతే పద్మకుడు. దృఢవ్రతుడై, శుచిశీల విభూషణుడై అర్హత్పదం పొంది విరాజిల్లుతున్నాడు. మరొక పూర్వజన్మలో ఇతడు పుష్పసేనుడనే పుష్పలావికుడయ్యాడు. అప్పుడు అడిగినవారికి పూవులు లేవనకుండా ఇచ్చేవాడు. ఒకమారు పుష్పసేనుడు ఒక ప్రత్యేకబుద్ధుని ఆహ్వానించి, వస్త్రం ఆచ్ఛాదించి, కమలోత్పల కహ్లారకుసుమాలతో పూజించి, భోగం సమర్పించాడు. ఆ పుణ్యంతో ఇతడు పద్మగర్భసదృశ కాంతిగలవాడై, సుకృత సౌరభాలు విస్తరించగా, ఇప్పుడు నా ఉపదేశానికి అర్హుడయ్యాడు. మానవులకు శీలవిభూషితమైన రూపం, శుభ్రమైన యశస్సు, చంద్రధవళమైన కులం, వివేకపరిపాకనిర్మలమైన మనస్సు, సంసార విముఖమైన శమగుణం- ఇవన్నీ పుణ్యాతిశయానికి స్పష్టమైన లక్షణాలు. నింద్యమైన జాతి, మలినమైన మనస్సు పూర్వజన్మ దుష్కృత్యానికి చిహ్నాలు.

ఈ విధంగా సర్వజ్ఞుడు చెప్పిన కర్మపరిపాకపు అద్భుత కథలు విని భిక్షువులు సంతోష విస్మయ పులకితులయారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పద్మకావదానమనే ఎనభైయేడవ పల్లవం

# 88. చిత్రహస్తిశయ్యాతిపుత్రావదానం

సంసార సఖులైన స్త్రీలు తమ చూపుతోనే తీవ్రనియమాన్ని ధ్వంసం చేస్తారు. శమగుణాన్ని సహించరు. చేసే పనేమో పైకి మనోహరంగా, చల్లగా కనిపిస్తుంది; కాని అంతంలో కాలుస్తుంది. కార్యభయాన్ని, ప్రవర్తన బుద్ధిని వదలి విషమము, స్వప్నసదృశము అయిన విలాసాలు చూపుతారు.

పూర్వం బింబిసారుని రాజధాని అయిన రాజగృహంలో, హస్తిపాలకుని పుత్రుడైన చిత్రుడనే గజసైన్యాధిపతి ఉండేవాడు అతనికి చిన్నవయస్సులోనే వైరాగ్యం కలిగింది. కనుక, రాజతుల్యమైన విభవాన్ని, సకల వస్తు సంపూర్ణమైన యింటిని వదలి, యౌవనంలోనే ప్రవ్రజ్యను స్వీకరించాడు. అతని భార్య సురూప అనేది, ఇంట్లో సకలైశ్వర్యాలు ఉన్నా, భర్తృసమాగమం లేక చింతాకులితురాలయింది.

ఇలా ఉండగా కొంతకాలానికి చిత్రుడు దేశం తిరుగుతూ, పూర్వ పరిచయాదరంతో తన నగరానికి వచ్చి, తన యింటిలో ప్రవేశించాడు. అనుచరులతో వచ్చిన తన పతిని చూచి, సురూప చాల ప్రణయంతో స్వాగతమిచ్చి, పూజాతిథ్యాలు జరిపింది. మార్గాయాసం**తో అలసిన** అతనిని చూచి, ఇలా ఆలోచించింది: "ఆహా! ఏమిటి ఇతని లావణ్యం! యౌవనమే దానిని ధరిస్తున్నట్టుంది! భోగార్హమైన ఈ వయస్సులో ఇతడు గృహలక్ష్మిని వదలి, వృథాగా, అనాలోచితంగా ఎందుకు దేహాన్ని కష్టపెట్టుకుంటున్నాడు? ఇతడు తపస్వి అయినా పాతస్నేహమింకా పూర్తిగా పోయినట్టు కనిపించదు. ఇంటినంతా ఆశచూపులతో చూస్తున్నాడు. ఒక్కపని చేస్తాను. మొదట ఇతని ధైర్యాన్ని తెలుసుకొని, వైరాగ్యం చలమా, స్థిరమా అన్న సంగతి గ్రహిస్తాను. ఇంట్లో భోగాలు అనుభవించి తృప్తిపొందినవాడు కాననవాసం కోరుతాడు. ఏకాంతంలో ఉన్నవాడు సుఖాలు కోలుపోయి తన్ను తాను నిందించుకుంటాడు."

ఆమె ఈ విధంగా ఆలోచించి, అతని ధైర్యస్థైర్యాలు పరీక్షింపగోరి, అతడు భోజనం చేస్తున్న సమయంలో, మేడ మీదనుంచి, రాగి పాత్రను కిందికి వదలింది. అది శబ్దం చేస్తూ కిందపడగా, చిత్రుడు ఉలికిపడి, క్షణం సేపు దిక్కులు చూచి, సంభ్రమంతో "ఏమిటిది?" అని అడిగాడు. ఆ ప్రౌఢ నవ్వుతూ, "ఏదో రాగిపాత్ర కిందపడింది అంతే" అని సమాధానం చెప్పి, సంతోషంతో మరల ఇలా ఆలోచించింది: "ఈయనకు నిర్వికారపదస్థితి యింకా ప్రాప్తించలేదు. మనస్సు శిథిలమైందేగాని, నిగ్రహం కలది కాదు. పాత్రపడిన సవ్వడికే భయాకులుడైనవాడు విషయవికారంతో కనుక త్వరలో అవలీలగా ఆకర్షించవచ్చు. మేఘాలు గర్జించగానే, భయంతో ధైర్యం లోపించి హంసలన్నీ విమర్శలేక ఏమేమైనా చేయగలడు. పారిపోతాయి. కాని కమలాసనుని వాహనమైన రాజహంసలు మాత్రమే, పుష్కరాభ్రమేఘాలు గర్జించినా కదలక మెదలక ఉంటాయి." ఇలా నిశ్చయించి, తియ్యగా మాట్లాడుతూ, నెమ్మదిగా దగ్గరికి వచ్చి, కనుబొమలు విలాసంగా కదలిస్తూ ఇలా అన్నది: "మీరేమో నన్ను గడ్డిపోచవలె వదలి దూరంగా వెళ్ళిపోయారు. మన యింటినిండా సవతుల్లాగా ఆపదలు చుట్టుకొని నన్ను బాధిస్తున్నాయి. ఇంతటి

మహావిభవమున్నా భోగాలులేక, సుఖాలు లేక పడి ఉన్నాను. మీ ధర్మనవాంఛ ఒక్కటే నన్ను సఖిలాగ రక్షిస్తున్నది. నేను ఇలా మాట్లడడం అనుచితమే. కాని, దుఃఖంతో ఇలా అనవలసి వస్తున్నది. మౌనం కోరే నా జిహ్వ కూడ ఇప్పుడు సిగ్గుపడుతున్నది. 'ఈ యింటి యజమాని పత్ని శీలభంగం కలగడం చూచి ఉంటాడు. కనుకనే, అకాలంలో వైరాగ్యం పుట్టి ఉంటుంది. లేకపోతే మరొక కారణమేమిటి?' అని ఇతరుల గుణగ్లానినే లెక్క పెట్టుకొనడంలోనే నైపుణ్యం ఉన్న జనమంతా ముఖమెత్తి పరస్పరం చూచుకుంటూ అంటారు. నేనేమో వియోగంతో కాలిపోతున్నాను. జనమేమో నేను ఆరోగ్యంగా ఉన్నానని అనుకుంటుంది. కష్టం కలిగినా, నా రూపం వాడదు. నా తారుణ్యానికి ఏమి చేయను? ఇంట్లో ఈ పరిజనం నేనంటే లెక్క లేకుండా విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నది. యజమాని యింటలేని స్త్రీల ముందు కుక్క కూడా గొప్పలకు పోతుంది. నేను వదలినది తింటూ పెరిగిన ఈ దాసపుత్రుడు, నేను పని చెబుతున్నాననే కోపంతో నా వెంట్రుకలు పట్టుకొని లాగజూస్తున్నాడు."

ఇలా అంటూ ఇదివరకే ఏర్పాటు చేసిన దాసపరాభవచర్యను అతని మనస్సును కలత పెట్టడం కోసం ప్రత్యక్షంగా చూపింది. అతడు ఆమెను చాలసేపు కలగని రూపమని ఆశతోను, సుఖహీనురాలని వైక్లబ్యంతోను, అపవాదు పొందిందే అని ఈర్ష్యతోను, దాసజనం పీడిస్తున్నారే అని క్రౌర్యంతోను చూస్తూ, వ్రతనియమం సడలి, అన్ని సంసార దోషాలకూ ఒకేమారు వశుడయ్యాడు; భిక్షాపాత్రను, చీవరాన్ని వదలి, ఇంటిలోని భయంకర ఖడ్గం ధరించి, తన భార్యను అవమానించాడనే కోపంతో దాసపుత్రుని చంపబోయాడు. భార్య బ్రతిమాలి ఆ పాపపు పనిని నివారించింది. పిదప అతడు భోగానికి లోబడి, నానా ఆకారవికార కారణాలయిన కథాప్రసంగాలలోను, నృత్యాలలోను ఆనంద కోపతాపాలు పొందుతూ, లలనా సంభోగ సౌభాగ్యం అనుభవిస్తూ గడిపాడు. కామము నిగ్రహం పోగొడుతుంది. క్రోధం క్షణంలో క్షమను రూపుమాపుతుంది. మిథ్యావ్రతశుష్కమైన మనసు వైరాగ్యం పొందదు. బింబిసారుడు అతనికి హస్తిమహామాత్ర పదవిని కూడ ఇచ్చాడు. దానితో విభవం మరింత అభివృద్ధి చెంది, అత్యధికమైన ప్రభావం కలవాడయ్యాడు.

ఇది ఇలా ఉండగా, చిత్రునితో పాటు వచ్చిన భిక్షువులు భిక్ష స్వీకరించినమీదట రాజగృహం నుంచి వెళ్ళిపోయి, జినభగవానునికి హస్తిశయ్యాతిపుత్రుడైన చిత్రుని అనుచితవ్రతం విషాదంతో విన్నవించారు. సర్వజ్ఞుడైన భగవంతుడు నవ్వుతూ వారితో ఇలా అన్నాడు: "అతని కుశలమార్గం పరిపక్వం కాలేదు. అంతలోనే వ్రతం స్వీకరించాడు. వివేకం కలిగి పాపచింతలు పోయి, ఆశాలత నిశ్శేషంగా నశించినవారు పాతవిషయాస్వాదనాస్మృతికి వశులు కారు. అర్థవాంఛతో, గర్వంతో శిథిలమైన కుశలాదరం గలవారి అంతరంగంలో కామం పాతుకుంటుంది; మనస్సు డోలాయమానమౌతుంది. విషయస్పర్శాభిలాషమనేది జన్మలతో సంసక్తమైనది. విద్వాంసులు కూడ నియమాలు వదలిపెడతారు; దానితో మహాగాధంలో పడిపోతారు. భోగులు(భోగాసక్తులు, పాములు) రాగమనే మహా విషపరీతులై విషమాంధకార బంధురమైన భూమితో (చీకటి పుట్టలలో, అధఃపాతాళంలో) పడుతారు. కాముడు పుంఖానుపుంఖంగా తన బాణవర్షం కురిపించిన మీదట ఎవరిని కనికరిస్తాడు?"

భగవానుడు భిక్షువులకు ఈ విధంగా నచ్చజెప్పి, తన దేహకాంతులతోనే ముందున్న చీకటిని పటాపంచలు చేస్తూ, రాజగృహపురానికి బయలుదేరి చిత్రుని భవనానికి వెళ్ళి, అనుగ్రహ ప్రకాశంతో అతని



మనసును పరిశుద్ధం చేసి. తనకు ప్రణామ సత్కారాలు చేసిన అతనిని తన ఆశ్రమానికి పిలుచుకొని వచ్చాడు; అక్కడ నిర్వ్యాజ ప్రవ్రజ్యామనస్కుడైన అతనికి ఉత్తమ సిద్ధికోసం శుద్ధసద్ధర్మోపదేశం చేశాడు. చిత్రుడు సకలక్లేశసంక్షయమై అర్హత్పదం పొందగా, భగవానుడు భిక్షువుల అభ్యర్థనతో అతని పూర్వ వృత్తాంతం ఇలా తెలిపాడు:

చిత్రుడు జన్మాంతరంలో ప్రత్యేకబుద్ధుని భక్తితో పూజించి, అంత్యకాలంలో అతనికి గొప్ప చైత్యం కూడ నిర్మించాడు. ఆ పుణ్యప్రణిధానంతో ధన్యుడై నా ఉపదేశంతో ప్రవ్రజ్య స్వీకరించి అర్హత్పదం పొందాడు. మరల ఇతడు కామప్రవృత్తిలో చిక్కుకున్నందుకు కారణం వినండి. పూర్వజన్మలోను ఇతడు పత్నిచే ఆకర్షితుడయాడు.

పూర్వం వారాణసిలో బ్రహ్మదత్త మహీపాలునికి హరిదత్తుడనే పురోహితుడు ఉండేవాడు. అతడు పరిపూర్ణ గుణవంతుడు; సిరిగలవాడు. అతనికి హరిద్రాయణుడు, హరిశిఖుడు అనే ఇద్దరు కుమారులు ఉండేవారు; వారు విద్యావినయసంపన్నులు. క్రమంగా వివేకంతో వైరాగ్యం కలిగి, భవభోగపరాఙ్ముఖులై సన్యసించి, తపోవనానికి వెళ్ళి పంచాభిజ్ఞానం పొందారు. వారు తమ తపశ్శక్తితో ఆకాశచారులై విహరిస్తూ, రాజపూజ, జనపూజ పొందుతూ, తమ శ్లాఘనీయమైన ప్రశమగుణంతో మునులకు కూడ మాన్యులయారు.

ఒకమారు హరిశిఖుడు రాజభవనానికి ఒంటరిగా వచ్చాడు. రాజు దిగ్విజయానికి వెళ్ళుతూ, లావణ్యవతి అనే తన కన్యను పిలిచి "వత్సే, ఈ ముని నాకు పూజ్యుడు. సత్కారార్హుడు. నీవు ఇతనిని మహాగౌరవంతో పూజించు" అని ఆదేశించి వెళ్ళిపోయాడు. రాజపుత్రి హరిశిఖమునికి నిరంతరం ఉపచారం చేస్తూ ఉండేది. విరిచిన బంగారు శలాక కాంతివంటి దేహకాంతితో మెరిసిపోతూ, కమలవిశాలలోచనాలతో కమనీయుడైన అతనిని సదా చూస్తూ ఉన్న రాజపుత్రికి అతనిపై అభిలాష కలిగింది. మన్మథుడు సుందరవిషయాలను అంటిపెట్టుకొని ఉంటాడు; క్రమంగా ప్రత్యాసత్తితో హృదయంలో సంగమాశను నాటుతాడు. ఆమె ఒకనాడు స్మరసంభ్రమంతో నిట్టూరుస్తూ బాలానిలాకులిత అయిన తీగలాగ ఊగిసలాడుతూ, ఆకృతిలో అనంగునివలె ఉన్న ఆ మునికి వంగి, ఆనందంతో అలింగనం చేసుకొంది. ముని, ఆమె కుచప్రరోహముఖంలో అంటిన చందనంతో తన హృదయంపై మదనమహారాజు ఆజ్ఞాపత్రం ధరించినవాడువలె అకస్మాత్తుగా సంయమశృంఖలాలు తెంచుకొని, అభిమత నవలీలా విశృంఖలుడయాడు. వృషవ్యపాయం వల్ల (పాపచింత పోవడం వల్ల) మిథునక్రియకు(సంభోగానికి) కర్కటకగ్రహంతో(ఎండ్రకాయ పట్టుతో) పూనుకొని, రాజసింహుని (బ్రహ్మదత్తుని) భవనంలో ఉన్న ఆ ముని వృషవ్యపాయం వల్ల (వృషరాశి గడవడం వల్ల), మిథునక్రియకు(మిథునరాశిలో చారానికి), కర్కటకగ్రహంతో (కర్కటరాశి సంబంధంతో చారానికి) పూనుకొని, రాజసింహుని గృహంలో (సింహరాశిలో) ఉన్న సూర్యునివలె తాపం పొందడంకోసమే కన్యాగమనోత్సుకుడయాడు (కన్యారాశిగమనోత్సుకుడయాడు). అనగా, ముని పాపచింత మాని ఎండ్రకాయ పట్టుగా కన్యాగమనానికి పూనుకొని తాపం పొందాడు. సూర్యుడు వృషాదిరాసులు గడచి కన్యారాశిలో చేరేవేళకు ఎండతీవ్రత హెచ్చడం సహజమే.

భుజంగుల(పాముల, చపలచిత్తలైన వనితల) ఆలింగనం వల్ల పురుషుని దేహంలో చేరిన ప్రణయమయమైన విషమవిషం పలుమారు మూర్ఛామోహాలు కలిగిస్తూ శాశ్వతంగా ఉండిపోతుంది. మంత్రాలతో తొలగిపోదు. కాంతిమంతమైన మణులకు విరుగదు. ఏ యోగాలకూ లొంగదు. ఏ ధ్యానాలకూ అణగదు. ఓషధీరసాలతో శాంతించదు. అతడు మృగలోచన ప్రీతిమయమైన చౌర్యసంభోగరసంలో పడి కొట్టుకోసాగాడు. అవివేకం వల్ల పుట్టే మదన సన్నిపాతజ్వరం మనీషులకు కూడా ధైర్యం పోగొడుతుంది. సంగపరాఙ్ముఖమైన హృదయంలో రాగం, జపానికి ఆధారమైన అధరంపై చుంబనం, ధ్యానంతో ఉండవలసిన నేత్రాలతో ప్రణయనీ లావణ్యపానోత్సవం, భిక్షాపాత్ర పవిత్రితమైన పాణిలో ప్రియాకుచయుగం - ఈ విధంగా పుష్పాయుధారాధనలో ఆమె సంయమ దీక్షవలననా అన్నట్టు అతని సకల వ్రతమూ కొత్తదనం సంతరించుకొన్నది. అతనికి భూమిపతిసుత ఎప్పుడూ భుజపంజరవర్తిని కావడం చూచి, అసూయతో మండిపడినదా అన్నట్టు తపస్సిద్ధి వెంటనే, పరాఙ్ముఖి అయింది. ఈ సంగతి తెలిసినప్పటికీ, ఇంతటి అవినయం జరిగినప్పటికీ, అంతఃపురంలోని వారంతా భయంతో ఏమీ అనలేకపోయారు.

భూపతి కొంతకాలానికి విజయంతో మరలి వచ్చాడు. నగరంలో విజయోత్సవం అద్భుత వైభవంతో జరిగింది. రాజు నగరానికి వచ్చిన వెంటనే మొట్టమొదట హరిశిఖముని వద్దకు వచ్చి, భక్తితో సతమస్తకుడై, భూమిపాలార్హమైన సర్వభోగాలతో పూజించాడు. ముని ఆరగిస్తుండగా, రాజు ఎదుట వినయంగా నిలబడ్డాడు; లావణ్యవతి పరిచర్య చేయడం ప్రారంభించింది. బంగారు గిండి పట్టుకొని, ఎదుట నిలబడి ఉన్న లావణ్యవతిని చూచి రాజు ఉన్నాడనేదే మరిచి, ముని, "రా, ఆలింగనం చేసుకో" అని భుజాలు రెండూ చాచాడు. రాజు, ముని స్మరవికారం చూచి కోపోద్రేకంతో ఈ పాపానికి ప్రతిక్రియ చేయడానికి నిశ్చయించుకొన్నాడు. లావణ్యవతి కోపక్రూరమైన తండ్రిముఖం చూచి, "ముని గొంతుకలో భక్ష్యం ఇరుక్కుంది. అందువల్ల రమ్మన్నాడు" అని అంటూ మునికి నీటి గిండి అందించింది. పాపాలు కప్పిపెట్టడంలో విచిత్రమైన ప్రత్యుత్పన్నవాక్కు గలవారు స్త్రీలు. మాయతో తలలు మార్చడంలో బృహస్పతి బుద్ధిగలవారు. కుమార్తె మాటలకు రాజు వెంటనే, చిల్లగింజ పడిన జలాశయంవలె ప్రసన్నచిత్తుడయాడు.

ఇలా ఉండగా, వనంలో ఉన్న హరిశిఖుని జ్యేష్ఠభ్రాత హరిద్రాయణుడు దివ్యదృష్టిని, గగనమార్గంలో నడిచే ప్రభావాన్ని కోల్పోయాడు. దానికి అతడు ఆశ్చర్యపడి, దుఃఖంతో తన తమ్ముని దుష్కార్యమేదో అయి ఉంటుందని తెలుసుకొని, నగరానికి వచ్చి, తమ్ముని ఆశ్రమానికి పిలుచుకొనిపోయి, మరల పంచజ్ఞానవంతుని, చతుర్ధ్యానపరాయణుని చేశాడు. నరపతి ముని రాగోదధిలో పడడం, విషమమైన విషయక్లేశాల సుడిగుండంనుంచి మరల వెలువడడం, బహుతర తపోగ్నితో కామస్మరణ పాతకాన్ని కూడ కాల్చివేయడం తెలుసుకొని, లోగడ కలిగిన తీవ్రకోపం వదలి ప్రసన్నమానసుడయాడు.

ఆ హరిద్రాయణుడనే వాణ్ణి నేనే. అప్పుడలా జన్మించాను. చిత్రుడు హరిశిఖుడనే పేర పుట్టాడు. అతని భార్యే బ్రహ్మదత్తుని కుమార్తె లావణ్యవతి.

తథాగతుడు వ్యర్థంకాని తన ప్రథితకథను తెలుపగా, భిక్షుగణానికి సంసారాభిభవంలో బుద్ధి కలిగింది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో చిత్రహస్తిశయ్యాతి పుత్రావదానమనే ఎనభై ఎనిమిదవ పల్లవం

# 89. ధర్మరుచ్యవదానం

భయంకరమైన ఝంఝామారుతంతో ఉవ్వెత్తుగా, లేచిన తరంగాలతో దిగంతాలను కప్పి భీషణంగా ఘోషించే దుర్వారవారివికారమైన మకరాకరం కూడా సుగతుని స్మరించినంతనే సౌమ్యమౌతుంది.

జినదేవుడు శ్రావస్తిలో జేతవనారామంలో విహరిస్తూ, సర్వజగత్తులకు స్వస్తి కలుగజేయడానికి యెల్లప్పుడు ఉద్యమించి ఉన్న సమయమది. అప్పుడు ఒక వర్తకుల సంఘం విపులద్వీపయాత్రలు చేసి రత్నాలు సంపాదిద్దామనే ఉత్సాహంతో ఉద్యమించి, మహోదధితీరం చేరింది. సార్థవాహులందరూ నేను ముందంటే నేను ముందంటూ ఓడ ఎక్కారు. కర్ణాధారుడు ఓడ బరువెక్కిందని, మునిగి పోతుందేమోనని భయపడి వారిలో ఇలా అన్నాడు: "మీరేమో ఔత్సుక్యంతో ఒకరి వెంబడి ఒకరు ఓడలోకి ఎక్కి వస్తున్నారు. సముద్రం గృహాంగణం కాదు; తుంగతరంగశృంగాలు గలది. ఓడలో ఎంత బరువు అవసరమో అంతే బరువు ఉండేట్టు ప్రస్తుతం చూడండి. రత్నాలంటే ఎవరికి ఇష్టం ఉండదు? అయితే అంబుధి చాల అల్లోలకల్లోమైంది. ఒకచోట భయానకమైన ఊర్మిసంఘాలు; మరొకచోట ఖర మకరకుల వ్యాకులమైన వేగం; ఇంకొకచోట లోపల కనిపించక నిట్టనిలువున నిలబడి ఉండే పర్వతాలకు తగిలి చెలరేగే నీరు; వేరొకచోట కోపించిన కృతాంతుని నిట్టూర్పువంటి ఝంఝావాతంతో ఏర్పడే సుడిగుండాలు; అన్యత్ర అకస్మాత్తుగా, కారణం లేకుండానే నీటిని వట్టిపోయేట్టు చేసే నిబిడశిఖామండలుడైన ప్రచండ బాడబాగ్ని- ఇది సముద్రస్థితి." కర్ణధారుడు చెప్పిన అంబుధి స్వరూపం విని కొందరు మహాశయులు ఓడ దిగి వెళ్ళిపోయారు; కొందరు ఓడలోనే ఉండిపోయారు. పిదప ఓడ కదలి రత్నద్వీపం చేరింది. సార్థవాహులు రత్నాలు సంగ్రహించుకొని కృతార్థులయ్యారు. అనుకూల పవనాలు ఉన్న కాలంలో ఓడ నెమ్మదిగా తిరుగు ప్రయాణం ప్రారంభించింది. ఇలా వస్తూండగా వణిజులు తమ ఎదుట మందర పర్వతం లాగా పైకి లేచి, ఆకాశాన్నంతా ఆక్రమించుకొని, గుహలాగ ముఖం తెరుచుకొని ఉన్నదానిని చూచారు. సకల జలచరాలతోపాటు సకల సముద్రమూ పైనుంచి, పెద్ద గోయిలోకి పడుతున్నట్టుగా, ఆ గుహాముఖం వైపే మహావేగంతో పారిపోతున్నది. దానితోపాటే ఓడ ఆ కృతాంతవక్త్రకుహరాన్ని సమీపించగా, వర్తకులు మహాకల్లోలానికి విహ్వలులై, అకాండ వినాశారంభ భయకాతరులై, "ఏమిటి ఈ అభూత పూర్వమైన భూతం? ఎలా పుట్టుకొని వచ్చింది? దీని తల మీద ఇద్దరు సూర్యులు వెలుగుతున్నారు. ఈ భూతానికి అభిముఖంగా నీరు ప్రవహిస్తున్నదే, ఎందుకు? మన ఓడ కూడా వేగంతో ఊగిసలాడుతూ అటువైపే లాక్కుపోతున్నదే!" అని కర్ణధారుని ప్రశ్నించారు. "దీనిని తిమింగిలగిలమంటారు. ఇది జంతువులను అట్లే మింగివేసే మహామత్స్యం. సంసారంలో సమ్మోహంవలె సాగరంలో నివసిస్తుంది. కల్పాంత ఘోరమైన దీని రెండు కండ్లు అవే. కల్పాంతంలో ద్వాదశసూర్యులు ఉదయించడానికి ప్రారంభంలో పైకెక్కిన ఇద్దరు సూర్యులలాగ ఉన్నాయి. దీని ముఖద్వారంలో దశనావళి ధవళమేఘ పరివారితమైన మహాద్రిశృంగమాలవలె

ఉన్నది. దీనినోట్లో పడే ప్రవాహంతో మన ఓడ ఆకృష్టమై శరవేగంతో పోతున్నది. విషయాభిముఖమైన మనస్సును ఆపలేనట్లు, మన ఓడను ఆపలేము. కర్మనిర్మితమైన ఈ మరణానికి ప్రతిక్రియ లేదు. కనుక జన్మాంతర శుభప్రదమైన మీ ఇష్టదైవాన్ని స్మరించండి" అని కర్ణధారుడు వారితో అన్నాడు.

కర్ణధారుని మాట విని, వణిగ్జనులంతా భయంతో "నమో బుద్ధాయ! నమో బుద్ధాయ!" అంటూ ఆక్రందనం చేశారు. జేతవనంలో ఉన్న భూతభావనుడైన జినభగవానుడు ఆ భయార్తుల నాదాన్ని దివ్యశ్రోత్రంతో విన్నాడు. అజ్ఞానతమోనిర్మూలనమైన బుద్ధుడనే పేరు వినగానే, తిమింగిలగిలం ప్రాణులకు ఉపద్రవం కలిగించినందుకు శాంతి కోరుతూ, తెరిచిన నోటిని మెల్లిగా మూసుకొన్నది. అది నోరు మూసుకోగానే, తరంగాల వేగం ఎదురుకొట్టి కాలుని ముఖం నుంచి విముక్తమైన దానివలె ఓడ వెనుకకు వచ్చింది.

పిదప వారందరూ సముద్రమూ, తీవ్రతర భయసముద్రమూ దాటి కుశలులై, ప్రజలు మెప్పులు పొందే సిరులతో రత్నసంపూర్ణమైన శ్రావస్తీనగరం చేరారు. తర్వాత వారంతా జేతవనవిహారి, వ్యసనత్రాణకారి అయిన జినదేవుని సన్నిధికి వెళ్ళి భక్తి సంయుతులై నమస్కరించారు. ఆయన దర్శనంతోనే సంసారబంధనం ఛిన్నమయిపోగా, ఆయన ప్రసాదంతో ప్రవ్రజ్యను, అర్హత్వాన్ని పొందారు. "వీరు పూర్వజన్మలో కాశ్యపుడనే శాస్త శాసనానువర్తులు" అని భగవానుడు అన్నాడు.

సముద్రంలోని తిమింగిలగిలం ప్రాణులను సంహరించడం మానుకొని, తీక్ష్ణక్షుదాగ్ని దహించగా ప్రాణసంశయం పొందింది. తర్వాత కొంతకాలానికి మరణించింది. నీటిలో కుళ్ళి చెడ్డవాసన కొట్టగా, సహించక మహాబలులైన నాగులు దానిని సముద్ర తీరానికి తోసివేశారు. దాని ఎముకలు సముద్రపు నీటికి బాగా తెల్లబడి తుషారాద్రివలె కనబడసాగింది. మరుజన్మలో ఆ తిమింగిలగిలం శ్రావస్తిలో సుమతి అనే బ్రాహ్మణునికి పుత్రుడుగా పుట్టింది. అది కడుపులో ఉన్నప్పుడే, తల్లికి భరింపరాని ఆకలి వేసేది. పుట్టిన తర్వాత ఆ శిశువు నూరుమంది చనుబాలు తాగినా తృప్తి పొందేదికాదు. తర్వాత ఆ కుమారుడు పుష్టమైన భోజనాలతో పెరుగుతూ, ఆకలి తీరక, అసంతృప్తితో చాల ఉద్వేగపడి, భిక్షువులలో చేరి భిక్షకోసం ప్రవ్రజ్య స్వీకరించాడు. ఎన్నిసార్లు భిక్షకు వెళ్ళి అరగించినా తనిసేవాడు కాడు. అతనికి దీనివల్ల 'బహుభుక్' 'బహుభోజనుడు' అనే పేర్లు మాత్రం పడ్డాయి. శ్రద్ధగా పిలిచి పెట్టే పెద్దపెద్ద సంఘభోజనాలలోను అతనికి కడుపు నిండలేదు.

ఒకమారు, దానవ్రతుడనే శ్రీమంతుడైన గృహపతి భిక్షువులను భిక్షకు పిలవడానికి శ్రద్ధతో వచ్చాడు. భిక్షుసంఘమంతా మరొక చోటికి భోజనానికి వెళ్ళి వుండడం వల్ల, బహుభోజనుడు ఒక్కడే ఉండడం వల్ల అతనిని ఒక్కనినే ఆహ్వానించి భోజ్యపదార్థాలు నివేదించాడు. పెట్టిన ప్రభూతభోజనమంతటినీ క్షణంలో భుజించగా చూచి గృహపతి, సంఘంకోసం సిద్ధపరచిన భోజనమంతటినీ ముందు పెట్టాడు. అన్నశకటమంతా అతడొక్కడే తినివేయగా, గృహపతి ఆశ్చర్యపడి, భూతమేమోనని భయపడి, "ఆహా! నాకు కొద్దిగా తినే ఎలాటి సుకుమారుడు దొరికాడు? ఒక్కడే సంఘభోజనమంతా తిని వేశాడే వీడు యక్షుడు కాడు గదా! నన్ను కూడ తినివేస్తాడేమో! ఇతనికి దక్షిణ సమర్పించి, వెంటనే తప్పుకుంటాను" అని ఆలోచించి, అనుమానంతోనే దక్షిణ అందించి, వెంటబడుతాడేమోననే భయంతో తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు.



తిరిగి వెళ్ళినవాడు సరాసరి భగవానుని వద్దకు వచ్చి, "భగవన్! ఎవడు వీడు? యక్షుడా? రాక్షసుడా?" అని అడిగాడు. "వీడు యక్షుడూ కాడు, రాక్షసుడూ కాడు; ధర్మరుచి అనే భిక్షువు. అర్హత్వం పొందనున్నాడు." అని భగవానుడు తెలిపి, ఆ పిమ్మట ధర్మరుచిని ఆకాశమార్గంలో పిలుచుకొని వెళ్ళి, వికరాళమైన అతని కళేబరం చూపించాడు. ధర్మరుచి సంసారంవలె భీషణమైన ఆ కళేబరం చూచి, ఖేదంతో "భగవన్, ఏమిటిది?" అని ప్రశ్నించాడు. సర్వజ్ఞుడు తెల్లటి చిరునవ్వు విరజిమ్ముతూ, "ఇది నీ భయంకరమైన దేహం, ఎండిన స్థూలాస్థిపంజరం. ధర్మరుచీ! శాంతిపొందు. భవపరిగ్రహం వదలు. నీ స్థూలమైన పృష్ఠాస్థిశృంఖల" అని విశదపరిచాడు. సుగతుడు చూపిన తన కళేబరం చూచి ధర్మరుచి, భవభ్రమలో పడినందుకు చాల నిర్వేదం పొందాడు. "ఆహా! ఈ మోహమార్గంలో పాంథులైన నరులకు క్షణంలో కుళ్ళి నశించే దేహంలో అభిమాన వాసన ఏమిటి? ఈ కాయం ఎగుడుదిగుడైన ఎముకలతో, మిట్టపల్లాలయిన దంతశ్రేణితో వికారమైంది; పురుగులు పడి కుళ్ళేది; రంధ్రాలతో ఉన్న గొట్టం వంటిది. ఇక మాయాజాలాన్నే ప్రేమించే మానవుల స్నేహాలో అపాయంతో కూడినవే." తన కళేబరం చూడగానే వైరాగ్యం కలిగిన అతనిని జినుడు మరల ఆకాశమార్గంలో జేతవనానికి పిలుచుకొని వెళ్ళాడు. అక్కడ దయతో ధర్మోపదేశం చేశాడు. అతడు దానితో క్రమంగా స్రోతాపత్తి, సకృదాగామి, అనాగామి అయి చివరగా అర్హత్వం పొందాడు. అతడు సకల క్లేశవిముక్తుడై తథాగతునికి నమస్కరించి, పూర్వజన్మసముదాయ స్మృతి కలిగి తనలో తాను నవ్వుకున్నాడు.

ఈ విధంగా ఛిన్నబంధనుడైన అతనితో భిక్షువుల ఎదుట ఒకమారు భగవానుడు ప్రీతితో "ధర్మరుచీ, చిరతరక్లేశాధ్వ విపులమైన కాలంలో చిరసంచారసంచితమైన అపార నిరంతర క్లేశాలతో అలసిపోలేదూ? చెప్పు" అని ప్రశ్నించాడు. ధర్మరుచి ప్రాగ్జన్మస్మృతిదాత అయిన సర్వజ్ఞునితో "భగవన్, చిరతరక్లేశాధ్వ విపులమైన కాలంలో చిరసంచార సంచితమైన అపార నిరంతరక్లేశాలతో అలసిపోయాను. గర్భశయ్యామలంతో కంపెక్కిన నానాకార కాయకంథాసమూహభారం చిరకాలం మోసి తిరిగి తిరిగి అలసిపోమాను. ఇప్పుడు దుఃఖితులకు కరుణాబాంధవుడైన నిన్ను ఆశ్రయించి సర్వావరణరహితమైన విశ్రాంతిని పొందాను" అని విన్నవించాడు. భిక్షువులు ఆ మాటలు విని కౌతుకంతో పూర్వకథా ప్రసంగమేమిటని ప్రశ్నించగా, భగవానుడు ఇలా అన్నాడు:

పూర్వకల్పంలో, క్షేముడనే క్షితిపాలుడు క్షేమవతి అనే పట్టణంలో రాజ్యం చేస్తుండగా, క్షేమంకరుడనే సుగతుడు అవతరించి విరాజిల్లేవాడు. ఆయన కాలంలో ధర్మశీలుడనే గృహపతి ఉండేవాడు. అతడు సముద్ర యాత్రలతో అసంఖ్యాక రత్నాలు సంపాదించి కుబేరునివలె సంపన్నుడయాడు. అమితతేజుడైన క్షేమంకర సుగతుడు జగత్కార్యమంతా పూర్తి చేసుకొని, నిర్వాణధాతుసంలీనుడు కాగా, ధర్మశీలుడు వియోగాగ్నితో తపించి, ఆ సుగతునికి భక్తితో స్తూపం నిర్మించడానికి ఉద్యమించాడు. మణికాంచనాది సామగ్రిని సేకరించి స్తూపం నిర్మించనుండగా, జిన శాసన ద్వేషులయిన కొందరు విప్రులు అతనిని స్తూపం కట్టవద్దని వారించారు. ధర్మవిఘ్నం కలిగించే ఆ విప్రుల విషయం ధర్మశీలుడు రాజుకు విన్నవించి, ఎట్టి అడ్డూ కలుగకుండా ఉండడానికి సహస్రయోధి అనే సుభటుని సహాయం పొందాడు. సహస్రపయోధి విప్రులను రాజదండభయంతో వెళ్ళగొట్టగా, గృహపతి మణిమౌక్తిక ఖచితమైన బంగారు స్తూపాన్ని నిర్విఘ్నంగా నిర్మించి "సకల సత్త్వ సంతారణాసక్తమైన, సుధాసిక్తమైన అనుత్తరసమ్యక్సంబోధిని ఈ స్తూపనిర్మాణ కుశలంతో పొందుదును గాక!" అని ప్రణిధానం చేశాడు. సహస్రయోధి ఆ మాటలు విని, "నీకు శ్రావకుణ్ణి అవుదునుగాక!" అని ప్రణిధానం చేశాడు. ధర్మశీలుడు జ్ఞానలోచనంతో "నీవు బహు

పాపాలు చేసి, అతికష్టం మీద శ్రావకుడివి అవుతావు. ఎన్నో సంవత్సరాలు గడచిన తర్వాత అపారపాపం క్షీణించి, బుద్ధుడనే పేరు విని కుశలం పొందుతావు" అన్నాడు.

ధర్మశీలుడనే గృహపతిని నేనే. సహస్రయోధి చిరకాలానికి ధర్మరుచిగా జన్మించాడు.

ద్వితీయకల్పంలో ద్వీపుడనే పృథివీపతి ద్వీపవతి అనే నగరంలో రాజ్యం చేస్తుండగా, దీపంకరుడనే సుగతుడు అవతరించాడు. తపోవనాసక్తుడై ఆ దీపంకరుని రాజు భక్తితో దర్శించి, నగరప్రవేశం చేయవలసిందని అభ్యర్థించాడు. రాజుపై చనువుతో, వాత్సల్యంతో సుగతుడు పట్టణానికి రాగా, సకల సంభారాలు తమంతట అవే చేరాయి. ద్వీపమహారాజు చాల సంతోషపడి భగవానుని దర్శనానికి రమ్మని మిత్రుడైన కాశిరాజు వాసవునికి వార్త పంపాడు.

కాశీనగరిలో వాసవమహారాజు ద్వాదశవార్షికమైన యజ్ఞం విధివశాత్తుగా సమాప్తి చేసి, ఐదు దక్షిణలు కల్పించాడు. అప్పుడు యజ్ఞ దేవత రాజుతో "సుమతి, మతి అనే ఇద్దరు బ్రాహ్మణులు నీ వద్దకు వస్తారు. వారిలో మొదటివాడు దానార్హుడు" అని చెప్పింది. దేవత చెప్పినట్లే, అధ్యయనానంతరం గురువుకు దక్షిణ సమర్పించదలచిన సుమతి, మతి, వాసవమహారాజు యజ్ఞక్షేత్రానికి వచ్చారు. వాసవుడు వారి పేరు విని ఆదరంతో యజ్ఞాంతంలో సుమతికి ఐదు దక్షిణలు ఇచ్చాడు. రత్న చతుష్టయమయమైన శయ్యను, బంగారు దండకమండలాలను, సువర్ణరత్న పాత్రను, ఐదువందల హిరణ్యముద్రలను, అలంకృత అయిన తన కన్యను రాజు దానం చేయడానికి ఇష్టపడగా, తను బ్రహ్మచారినంటూ సుమతి స్వీకరించలేదు. బంగారు కాంతులు విరజిమ్మే అతనిని చూచి రాజకన్య సుందరీ నామధేయురాలు ఎంతో అభిలాషతో లజ్జ వదలి, స్వీకరించుమని యాచించింది. అతడు నిరాకరించగా, వైరాగ్యం వల్ల, బంధువులంటేనూ గిట్టక, ద్వీపవతీ నగరానికి వెళ్ళిపోయింది. అక్కడ తన భూషణ రత్నాలు విక్రయించి, పూవులు కొంటూ, నిరంతరం దేవతలను పూజించింది.

ఇక్కడ సుమతి, దక్షిణవల్ల వచ్చినదంతా గురువుకు సమర్పించి, గురుభార్య ఆదేశంపై హిరణ్యశేషం తను స్వీకరించాడు. ఆ రాత్రే అతనికి పది స్వప్నాలు కలిగాయి: సుధాసముద్రాన్ని తాగినట్లు, ఆకాశంలో సంచరించినట్లు, సూర్యచంద్రులను స్పృశించినట్లు, రాజులతో, మునులతో యజ్ఞాలు చేయించినట్లు, తెల్ల ఏనుగును, హంసను, సింహాన్ని, పర్వత శిఖరాలను ఆరోహించినట్లు- ఈ విధంగా పది స్వప్నాలు చూచాడు. మేల్కొన్న పిదప, ఆ స్వప్న ఫలాలు తెలుసుకొనడానికి పంచాభిజ్ఞుడైన పర్ణాదుడనే మహాముని తపోవనానికి వెళ్ళాడు. పర్ణాదముని అతనితో "ఈ స్వప్నాల ఫలం నాకు తెలియదు. ద్వీపవతిలో ఉండే సుగతునికి తెలుసు" అన్నాడు. స్వప్న వివరణ కుతూహలి అయిన సుమతి ఆ మాటలు విని వెంటనే, సోదరుడైన మతితోపాటు ద్వీపవతికి వెళ్ళాడు.

ఆ సమయంలో ద్వీపమహారాజు ద్వీపవతిలో జినపురప్రవేశంలో గొప్ప ఉత్సవం తలపెట్టి, నగరాన్ని రత్నాంబరాలతో అలంరించాడు. పూజకోసం ఎక్కడున్న పూవులూ తేవడానికి ఆజ్ఞాపించాడు. దానివల్ల విపణివీధులలో ఒక్క పూవు కూడా కనిపించలేదు. అప్పుడు దినమూ పూవులతో దేవతలను పూజిస్తున్న వాసవమహారాజు కన్య సుందరి పూజ విచ్ఛిన్నమై పోతుందనే దుఃఖంతో మాలాకారుణ్ణి ఏవిధంగానైనా పుష్పాలు తెచ్చిపెట్టమని కోరింది. అప్పుడు సుమతి పుణ్య ప్రభావం వల్ల తామరలు లేని ఒకానొక మడుగులోను బంగారు తామరలు పూచాయి. మాలాకరుడు వాటిని రాజభయంతో దాచి, ఆమెకు



ఇచ్చాడు. ఆమె వాటిని మంచినీటి కడవలో దాచి, త్వరగా వెళ్ళిపోయింది. జినపూజకోసం పూవులు కావాలని వెదుకుతున్న సుమతికి దారిలో ఫుల్లపద్మాల కడవతో ఉన్న సుందరి కనిపించింది. అతని పుణ్యప్రభావం వల్ల కడవలోపల దాచిన ఆ తామరలు జీవితంతో ఉన్నట్లుగా, తమ ముఖాలను వెలుపల పెట్టి తొంగి చూచాయి. అతడు ఆమెను బంగారు నాణేలకు ఆ కమలాలు అమ్మవలసిందని కోరాడు. ఆమె అతనిని గుర్తుపట్టి మందహాసం చేస్తూ, "అప్పుడేమో నన్ను వదలిపెట్టి వెళ్ళిపోయావు. ఇప్పుడేమో పూవులు కావాలంటూన్నావు. బ్రహ్మచారులకు కన్యలతో సంభాషించడం తగదు. ఈ పూవులు నీకు ఇస్తే వచ్చే జన్మలో నీకు భార్య కావాలనే ప్రణిధానంతో ఇస్తాను. లేకపోతే ఇవ్వను" అని అన్నది. 'ఏవమస్తు' అని అతడు అనగా, ఆమె ఐదుపూవుల గుత్తులను అతనికిచ్చి, పూజ కోసం తను రెండు పూవులు మాత్రం తీసుకొంది.

ద్వీపక్షితిపతి దీపంకర సుగతుని నగర ప్రవేశోత్సవం మహావైభవంగా ఏర్పాటు చేశాడు. సుర సిద్ధ ఋషి గంధర్వులు బరాబరులు చేయగా దీపంకర ముని నగరం ప్రవేశించాడు. ద్వీపక్షితిపతి, అతని ఆహ్వానంపై వచ్చిన వాసవనరనాథుడూ అతనికి ఎదురేగి భక్తితో స్వాగతం పలికారు. అతనికి ద్వీపమహారాజు రత్నాల పిడిగల మెరిసే ఛత్రం పట్టాడు; వాసవుడు చంద్రధవళమైన చామరం పట్టి విసిరాడు. దీపంకరుని పురప్రవేశంతో సకల సత్త్వాలు సుఖసంతోషాలతో పొంగాయి. ఆయనను దర్శించడానికి జనం మూగింది. ఆ నిబిడజన సంపాతంలో సుమతి జినసందర్శనోత్సుకతతో, ఆయన ప్రభావం వల్ల ఎలాగో దారి చేసుకొని, ఆయన వద్దకు వెళ్ళి, ఆయన పాదాలపై కమలాలు ఉంచి, అంజలి ఘటించి, భూమిపై జటాభారం జీరాడగా, పాదాభివందనం చేశాడు. సుమతి అర్పించిన పద్మాలు అతని సుకృతాలవలె వెంటనే వికసించి, ముందు మండలాకారంగా కాంతిని ప్రసరింపజేశాయి. సుందరి భక్తితో భగవానుని ఎదుట అర్పించిన రెండు ఫుల్లారవిందాలు ఆయనకు కర్ణావతంసాలయాయి. సుమతి నమస్కరిస్తున్నప్పుడు పాదాలపై వ్యాపించిన జటాభారం వెంటనే రాలిపోయి, మరొకటి ప్రాదుర్భవించింది. అతడు వెంటనే కృతకృత్యుడై ఆకాశగమనశక్తిని కూడ పొందగా, భగవానుడు అందరూ వింటుండగా, "సుమతే! నీవు అనుత్తర సమ్యక్సంబోధిని పొంది, శాక్యమునివనే తథాగతుడుగా ప్రసిద్ధి పొందుతావు" అని ఉద్ఘోషించాడు. దీపంకరుడు ఈ విధంగా చెప్పగా, ఆకాశం నుంచి పుష్పవర్షం కురిసింది. వీడిపోయిన జటాభారాన్ని స్తూపప్రతిష్ఠాపన కోసం మంత్రులు తీసుకొన్నారు.

తన అన్న సుమతి జటాభారం జినుని చరణాలనుంచి, భూమిపై జీరాడగా, తమ్ముడైన మతికి శ్రోత్రియత్వాభిమానంతో కోపం వచ్చింది. మోహంతో కలిగిన అతని మనోవికారాన్ని సుమతి నివారించి, అతనితోపాటే దీపంకరుని సన్నిధిలో ప్రవ్రజ్యను స్వీకరించాడు. పిదప కొంతకాలానికి సుమతి దేహాంతంలో తుషితదేవలోకం చేరాడు; మతి నరకం పొందాడు. ఆ సుమతే ఇప్పుడు నేనై జన్మించాను. మతివిక్లబం వల్ల మతి బహుకాలం కష్టపడి ఈ ధర్మరుచిగా అవతరించాడు. ఆ సుందరే యశోధర.

తృతీయకల్పంలో జంబూద్వీపంలో అనుత్తర జ్ఞాననిధి అయిన క్రకుచ్ఛందుడనే తథాగతుడు ఉన్నాడు. ఆయన కాలంలో ఉజ్జయినీ పట్టణంలో చందనదత్తుడనే మహాధనుడైన వర్తకుడు ఉండేవాడు. అతడు విస్తారంగా క్రయవిక్రయాలు సాగించేవాడు. అతనికి కామబల అనే భార్యకు మదనసుందరుడైన అశ్వదత్తుడనే పుత్రుడు కలిగాడు. అతనికి తన శరీరంవలె కుమారుడు చాల ప్రియమైనవాడు. అతడు

ధనార్జనాకాంక్షతో , గృహనిర్వహణ భారమంతా భార్యకు అప్పగించి సముద్రయాత్రకు బయలుదేరాడు. ధనవంతులకు ధనం సంపాదించినకొద్దీ, ఉప్పు తిన్నవానికి దప్పిక హెచ్చినట్లు హెచ్చుతుంది.

అతడు సముద్ర వ్యాపారానికి వెళ్ళగానే, యౌవనోన్మాద మోహిత అయిన అతని పత్ని కామబల కామధ్యానపరాయణురాలై గృహచింత వదలి, వ్యాపారమంతా కుమారుడైన అశ్వదత్తునికి అప్పగించి, మేడమీద ఎక్కి రాజమార్గంలో వచ్చిపోయేవారిని చూస్తూ గడుపసాగింది. ఇంటినిండా భృత్యపరిజనులు ఉండడం వల్ల స్వేచ్ఛ.ా ఉండడానికి అవకాశం లేక ముసలిదాది వద్దకు వచ్చి దీర్ఘంగా నిట్టూరుస్తూ ఇలా అన్నది: "బహు భోగ సహితమైన విభవం, చెప్పినట్లు వినే పరిజనం ఇంటినిండా ఉన్నా, అమ్మా, స్వైరసంచారావకాశం లేక సంతోషమే నాకు లేదు. నిజంగా చెబుతున్నాను. అధికారాలున్నా, సత్కారాలు కలిగినా, ఎన్ని అలంకారాలున్నా, ఎంత మృష్టాన్నాలు కలిగినా, పురుషసంభోగం లేక స్త్రీలకు సుఖమనేదే లేదు. అందువల్ల ఇల్లు వదిలి స్వేచ్ఛగా వెళ్ళిపోతాను. ఈ కుమారుడు అశ్వదత్తుడు నాకు చాల బాల్యంలో పుట్టాడు. కనుక అతడంటే నాకంతగా ప్రేమ లేదు. స్త్రీలు రతిశీలలు. కులమనే ఇరుగట్టుల మధ్య పడిన నదులలాగ బంధువుల నిర్బంధ బంధనాన్ని సహించరు." ఆ మాటలు విని వాత్సల్యపరవశ అయిన ముసలిదాది ఇలా అన్నది: "అమ్మాయీ, ఈ విపులైశ్వర్యం వదలి పోవడం ఉచితం కాదు. ఈ పెద్ద యింటిలో ఎవరి పనిలో వాళ్ళు ఉంటారు గనుక, రహస్యంగా ఏమైనా చేసుకొవచ్చు. అలా కాకుండా ఇల్లు వదలి స్వేచ్ఛగా తిరిగితే, క్షణంలో రాజమార్గాలలో వ్యాపిస్తుంది. నీవు వయసులో ఉన్నదానివి; నీ శీలాన్ని ఎలా కాపాడుకోగలుగుతావు? ఇంటిలోని నిధులను కాలితో తన్ని ఎలా వెళ్ళగలవు? ఇటువైపేమో కామవిషావేశం! అటువైపేమో క్షణంలో గర్తపాతం! ఈ ఉభయ సందేహంలో ఏమి చేయనున్నావో నీవు ఎరుగవు. ఉబలాటం, చాపల్యంగల పురుషులు ప్రాణాలన్నా పణంగా పెట్టి పరస్త్రీలను కోరుతారు. ఎంతవరకంటే బెట్టు అనే వస్త్రం గట్టిగా ఉన్నంతవరకే. మొలనూలికి అంటిన గుడ్డను లాగుతున్నప్పుడు ఊగిసలాడుతూ, "వద్దు! వద్దు! వెళ్ళుతాను. వదులు! వదులు! అని గునిసే స్త్రీ ఎవరికి ఇష్టురాలు కాదు? తన పని తీరిన తర్వాత వివస్త్ర అయిన స్త్రీని చూచి, పురుషుడు ఆమె భుజపంజరం నుంచి, పంజరం నుంచి పారిపోయే చిలుకవలె పారిపోతాడు. చీకటిలో జారపతితో చౌర్యరతిలో అరక్షణం సుఖించడం తర్వాత పరలోకంలో కారుచీకటిలో పడడమే. దారితప్పి సిగ్గుచే నిష్ఫలురాలై మొగం వంచి వెళ్ళుతున్న దానిని చూస్తే, తప్పుడు దారిని పోగొట్టుకున్న తన శీలమనే రత్నాన్ని వెదుక్కుంటున్నదా అన్నట్టు ఉంటుంది. దుశ్చరితాపవాదం విస్తరించిన వనిత అమందవిషాదాలకు మూలకందాలయిన కన్నీటి బిందువులతో- కామశ్రమంతో తెగిపోయి పడిన నిర్మల శీలమనే ముక్తాహారంలోని ముత్యాలవంటి కన్నీటి బిందువులతో - నేలను తడుపుతుంది. స్వైరిణి అయిన పద్మాననకు బాలుడు వెన్నెల నవ్వులు వెదజల్లినా, విపరీతంగా తలచుకొని ముఖం ముడుచుకొని, శరీరం కుంచించుకుపోతుంది. లోపల ఎవరేమి మాట్లాడుతున్నా తన సంగతేననే అనుమానంతో వెలుపలనుంచి వింటుంది. గడ్డిపోచ కదలినా మనస్సు శంకిస్తుంది. యౌవనవతులు రూపదర్పంతో భర్త గృహంనుంచి వెళ్ళిపోతారు. తరువాత, పుణ్యస్థానంలో పరీక్షకులు వారిని పరీక్షించి వదలివేస్తారు. కనుక నీవు ఇల్లు కదలకనే, ఇతరులకు తెలీకుండా పురుషసంగమం కలిగే ఉపాయం చెబుతాను. నీ కుమారుడు, అశ్వదత్తుడు నూనూగు మీసాల నూత్నయౌవనుడు. జనమెవరూ అనుమానించరు గనుక, సుఖంగా అతనిని నీవు అనుభవించవచ్చు. ఇలాటి సుందరుడు, సఖుడు,



కాంతిమంతుడు ఎక్కడ దొరుకుతాడు? ఈ పద్ధతి గనుక కుదిరితే, నిరపాయమైనది." దాది చెప్పిన మాటలు ఆ కామబలకు యుక్తమని తోచాయి. తీవ్రరాగాంధులు పాపగర్తాన్ని చూడరు.

పిదప దాది అశ్వదత్త కుమారునికి సంభోగసుఖం స్వేచ్ఛగా వర్ణించి, అతని మనస్సును విషయాభిముఖం చేసింది. అతనిని కామమోహితుని చేసి, మోసంతో "వత్స, నీకు తగిన ప్రోషిత భర్తృక అయిన స్త్రీ ఒకతె ఉన్నది. ఆమె చాల లజ్జావతి. దీపంలేని శూన్యగృహంలో మౌనంగా నీతో సంగమం కోరుతున్నది" అని ప్రోత్సహించింది. ఆ మాటలు విని అతడు అభిలాష హెచ్చగా, రహస్య మందిరానికి వెళ్ళి జననితో రతి చేసేవాడు. ఇలా నిరంతరం రహస్య భవనంలో ప్రచ్ఛన్నంగా రతిసుఖం అనుభవిస్తున్నప్పటికీ, ఆమెకు రాగాగ్ని ప్రజ్వలించిందేగాని, శమించలేదు. ఒకనాటి రాత్రి ఆమె "నిత్యం ఈ ముసుగులో మోసం సహించలేను. రూపవైభవానికి, రూపభోగానికి బహిరంగంగా అనుభవించడమే కదా జీవితం. పరస్పర వదనాంభోజదర్శనం లేకుండా చుంబనంలోను, సురతంలోను సుఖమేమిటి? కనుక కుమారునికి కప్పి పెట్టుకొనడమనే కష్టాన్ని ప్రయత్న పూర్వకంగా పోగొట్టి బహిరంగంగా సంభోగించడంలో ప్రగల్భతను నేర్పుతాను" అని ఆలోచించి, ఉదయం బట్టలు మార్చుకొనే సాకుతో తన శరీరం ప్రత్యక్షంగా చూపింది.

అశ్వదత్తుడు ఆ ప్రచ్ఛన్నాంగి తన తల్లి కావడం చూచి, పాతక విషావేశం శరీరం వ్యాపించగా వివశుడై మొదలు నరికిన మహావృక్షం వలె నేలమీద కూలినాడు. ఆమె శీతజలం ముఖంపై చిలకరించగా, నెమ్మదిగా తెలివి వచ్చి మహాపాతకగర్తంలో పడినవాడిలాగ దుఃఖంతో ఏడ్చాడు.

కామమోహిత అయిన కామబల భుజాలు చాచి అతనిని గట్టిగా కౌగలించుకొని, నరకపాతదూతికవంటి కనుబొమలు వంకరగా తిప్పుతూ, ఇలా అన్నది: "నీకు ఈ దుస్సహమైన విషాదం అనుచితం, అనవసరం. ఇది కేవలం మిథ్యావిషాదం. నీకు స్త్రీల అసత్యధర్మావేశం తెలీదా? నీవు ఎవరికీ దుఃఖం కలిగించలేదు. నీవు ఎవరి ధనమూ అపహరించలేదు. సుఖభోగాధారమైన ఈ విషయంలో నీకు పాపవాసన ఎందుకు? స్త్రీలు నదుల వంటివారు. తండ్రి స్వేచ్ఛగా స్నానం చేసిన నదిలో పుత్రుడు స్నానం చేయడా? తండ్రి వెళ్ళిన దారినే కొడుకూ వెళ్ళుతాడు. స్త్రీలు కూడా దారి వంటివారే; అందరూ పోదగినవారే. లలనను ఒక్కరే అనుభవించాలి, ఇద్దరు పొందరాదు- అనే నియమాన్ని ఎవరో అసూయాపరులు చేశారు. పరమార్థంతో ఆలోచిస్తే, రతికోసం అగమ్య అయినది ఎవతే లేదు. స్త్రీలు తండ్రికి, కొడుకుకు ఏకపాత్రవలె ఉపభోగార్హలు." ఈ విధంగా కామబల ఎంతో ప్రయత్నంతో నచ్చజెప్పి, సంభోగాభిముఖుణ్ణి చేయగా, వాడు రాగం కలిగి పశువులాగ ఎప్పుడూ తల్లినే అనుభవించసాగినాడు.

తర్వాత కొంతకాలానికి తండ్రి రత్నాదిసంపద సంపాదించి మహోదధినుంచి తిరిగి వచ్చాడు. తల్లి ప్రేరణతో అశ్వదత్తుడు రహస్యంగా తండ్రిని విషం పెట్టి చంపించాడు. పిదప కామబల రాగవాంఛ మితిమీరగా, అడ్డు లేకుండా సుఖించాలనే కోరికతో స్నేహమోహితుడైన అశ్వదత్తునితో ఒకనాడు చనవుతో రహస్యంగా ఇలా అన్నది: "నికరమైన రత్నకనకాదిధనం తీసుకొని దేశాంతరం వెళ్ళుదాము. అక్కడ నిరాటంకంగా, స్వేచ్ఛగా సుఖం అనుభవిద్దాము." ఎంతో కాలంగా తన మనసులో ఉన్న ఆ మాట విని, అశ్వదత్తుడు సమ్మతించి, సారద్రవిణం గ్రహించి ఆమెతోపాటు దేశాంతరం వెళ్ళాడు. ఆ ప్రచ్ఛన్న పాతకులు దేశాంతరంలో అడుగు పెట్టగానే, భార్యాభర్తలమని చెప్పుకుంటూ సంతోషపడ్డారు.

ఇలా ఉండగా, వారికి పరిచితుడైన భిక్షువొకడు వారి యింటికి వచ్చి, వారిని చూడడం వల్ల స్వదేశం జ్ఞాపకం వచ్చి, వారు ఆ గృహపతి యింటివారేననే స్మృతీ కలిగి, అశ్వదత్తునితో "మీ తల్లికి కుశలమేనా? వదలిపెట్టిన జన్మభూమిని ఎప్పుడైనా స్మరిస్తారా? మీ మనస్సు ఎప్పుడైనా సంతాప వ్యథను పొందదా?" అని ప్రశ్నించాడు. భిక్షువు మాట విని, అశ్వదత్తుడు రాతిదెబ్బ తగిలినట్టు ప్రత్యభిజ్ఞానంతో అదరిపడి సమాధానం చెప్పడానికి ఏవేవో యుక్తులు ఆలోచించాడు. తర్వాత తల్లితో ఆలోచించి, తమ రహస్యం దాగదనే భయంతో వ్యాకులచిత్తుడై, అతనిని భిక్షకు పిలిచి, ఇంట్లోనే కత్తితో నరికి చంపివేశాడు. అర్హత్వం పొందిన భిక్షువును వధిస్తున్నప్పుడు గూడ అతని మనస్సు కొంచెం కూడ చలించలేదు. నృశంసులు పాతకాలతో వజ్రంకన్నా కఠోరులవుతారు. ధర్మాద్రిశృంగం నుంచి జారి, అధోముఖంగా తీరాలు లేని తగ్గులలో పడి సుడిగుండాలలో కొట్టుకొనేవారికి పాతకాలు పరంపరలుగా సంక్రమిస్తాయి.

కామబల కొడుకుతో సుఖిస్తున్నప్పటికీ, ఆశ తీరక సంభోగపరాయణ అయి సుందరుడనే వణిక్పుత్రుణ్ణి చూచి మరులుగొన్నది. భోగాభ్యాసం పరిచితమైనకొద్దీ కామం వృద్ధిపొందుతుంది. ధనం అభివృద్ధి అయినకొద్దీ లోభం ప్రౌఢతరమౌతుంది. ఉప్పునీరు తాగిన కొద్దీ దప్పి తీవ్రతరమౌతుంది. జలాలు అగాధమైనకొద్దీ బడబానలం అతి విపులంగా జ్వలిస్తుంది. సుందరుడనే ఆ నూతన కామితో రహస్యంగా కేళి సలుపుతున్న తల్లిని అశ్వదత్తుడు ఒకమారు చూచి క్రోధంతో ఆమెను కత్తితో నరికివేశాడు. ఈ విధంగా వాడు మూడు అనంతమైన పాపభారాలతో క్రుంగిపోయాడు. దేవతా ప్రేరితులైన ప్రజలు అతనిని ఊరినుంచి వెళ్ళగొట్టారు. అతడు తీవ్ర పశ్చాత్తాపం పొంది, దుఃఖిస్తూ పెక్కు భిక్షుగణాలను ఆశ్రయించి, తన దుష్కర్మలను తెలిపి, ప్రవ్రజ్య ప్రసాదించవలసిందని యాచించాడు. ఆ పతితునికి ఒక్కరూ ప్రవ్రజ్య ప్రసాదించలేకపోయేసరికి, కోపంతో ఒకనాటి రాత్రి నిద్రపోతున్న భిక్షుగణాన్ని కాల్చివేశాడు. తుదకు బోధిసత్త్వాంశగల ఒక్క భిక్షువు దయతో అతనికి శిక్షాపదవివర్జితమైన ప్రవ్రజ్యాదీక్ష ఇచ్చాడు. శిక్షాపదాలు కూడా ఉపదేశించవలసిందని అతడు ఎంత బ్రతిమాలినా, భిక్షువు "నీవు శిక్షాపద పరిగ్రహానికి అర్హుడివి కావు. నమోబుద్ధాయ, బుద్ధాయ- అనే జినాభిధానం సర్వకాలమూ పలుకుతూ ఉండు. ఆ శబ్దం నీ చెవిలో పడి కల్పాంతంలో ముక్తిని పొందుతావు" అన్నాడు. తర్వాత అశ్వదత్తుడు దేహాంతంలో ఘోరమైన నరకం పొందాడు. ఆ నరకం ముందు ప్రబలోత్తాలమైన ప్రళయానలం కూడ చందన శీతలమే. ఆ అశ్వదత్తుడే ఈ ధర్మకీర్తి. కనుకనే నేను ఇతనిని చిరతరక్లేశాధ్వవిపులమైన కాలంలో చిరసంచార సంచితమైన అపారనిరంతర క్లేశాలతో అలసిపోలేదూ?" అని ప్రశ్నించాను.- ఇలా పూర్వగాథ తెలిపి భగవానుడు విరమించాడు.

అతిమలినమైన పొగ తరంగతరల అయిన తల్లి వాతాళినే (పెనుగాలినే) నిస్సంకోచంగా ఆలింగనం చేసుకుంటుంది. మరికొంత ప్రౌఢిమను పొంది (దట్టమయి) తేజోనిధి అయిన సూర్యుణ్ణే కనుమరుగు చేస్తుంది. సత్త్వగుణయుతమైన ప్రకాశస్థానాలను తీవ్రంగా కప్పుతుంది. అతి మలినమైన పొగ ఏమేమి దుష్కృతం చేయదు?

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ధర్మరుచ్యవదానమనే ఎనభైతొమ్మిదవ పల్లవం

# 90. ధనికావదానం

సత్త్వశాలురు పరిశుద్ధ మనస్సుతో అతి స్వల్పమైన దానం చేసినా, సంకల్పమాత్రంచేతనే అలంఘ్యమైన సంపదలు కలుగుతాయి.

జినభగవానుడు పూర్వం వైశాలీ నగరంలో మర్కట హ్రదసమీపంలో కూటాగార గుహలో వసించినప్పుడు వైశాలీ నగరంలో దనికుడనే గృహపతి ఉండేవాడు. వాడు పేరుకు తగినట్టుగా ధనవంతుడై సమగ్ర పుణ్య సంయోగంతో పురుషోత్తముడని ఖ్యాతిపొందాడు. ధర్మానికి సఖి అయిన అతని పత్ని పేరు శీలవతి. కుమారుని పేరు వదాన్యుడు. కోడలు సత్యవతి.

వైశాలిలోని ద్విజులందరూ ఒక కట్టుబాటు చేసుకొన్నారు: భగవానుని అందరూ కలిసి ఆహ్వానిస్తే, ఆహ్వానించవలసిందేకాని, ఒంటిగా ఆహ్వానించరాదు. ఒక్కడే ఇతరులకు తెలియకుండా ఆహ్వానిస్తే, ఇతరులకందరికీ ధర్మవిఘ్నకారుడైన అతనిని వెలి వేయాలి- అని. ఈ కట్టుబాటు తెలియక పుణ్యవంతుడైన ధనికుడు, దివ్యసంపద్యుక్తుడు వెళ్ళి జినదేవుని భిక్షకు ఆహ్వానించాడు. భగవానుడు సంఘంతోపాటు రావడానికి స్వయంగానే అంగీకరించగా, తన యింటికి వెళ్ళిపోయాడు. ఇంట్లో అతడు దివ్యవిభవం గలవాడు గనుక త్రిదివోచితమైన భోజ్యపదార్థాలతో, రత్నాసనాలతో భోజనభూమిని సిద్ధపరిచాడు.

ఈలోగా ద్విజులందరూ కలసి భోజనసంభారాలు సేకరించుకొని, భగవానుని సన్నిధికి వెళ్ళి భక్తితో ఆహ్వానించారు. "ధనికుడు నన్ను ఇదివరకే సంఘంతోపాటు ఆహ్వానించాడు" అని భగవానుడు అనుగ్రహవిశదమనస్కుడై అన్నాడు. వారు ఆ మాటలు విని తమ యిళ్ళకు వెళ్ళి జినార్చనదినమెప్పుడా అని ఎదురుచూస్తూ ఉన్నారు.

భగవానుడు భిక్షువులతోసహ ధనికుని భవనానికి వెళ్ళి, దివ్యాద్భుత మాహాత్మ్యంతో సంచితమైన దివ్యభోజనం స్వీకరించాడు. మరునాడు అతని పత్ని శీలవతి తన విపుల సంపదతో దివ్యోపభోగ సంభారాలు సంపాదించి పూజించింది. మూడవనాడు కుమారుడు వదాన్యుడు, నాల్గవనాడు కోడలు సత్యవతి ఆశ్చర్యకరమైన విభవాలతోనే సాధించదగిన భోగ్యవస్తువులతో ఆరాధించారు.

ఈ విధంగా నాలుగునాళ్ళూ గడవడం వల్ల వైశాలి ద్విజులు సుగతుని ఆరాధించడానికి అవకాశం దొరకనందున ధనికునిపై చాల కోపగించుకొని, అతనిని వెళ్ళగొట్టదలచారు. అప్పుడు సుగతుని శాసనంతో ధనికుడు "ద్విజుల సమయం(కట్టుబాటు) నాకు తెలియదు" అని చెప్పి వారినందరినీ సంతోషపెట్టాడు. పిదప ధనికుడు పత్నీపుత్రస్నుషా సహితుడుగా శాస్త అయిన సుగతుని ధర్మోపదేశంతో సత్యదర్శనం పొందాడు. అతని మహాసంపద్విస్తారానికి కారణమైన పూర్వవృత్తాంతం భిక్షువులడుగగా, సర్వజ్ఞుడిలా తెలిపాడు:

పూర్వం వారాణసిలో కమలుడనే మాలాకారుడుండేవాడు. అతడు దుర్భిక్షకాలంలో చాల చితికిపోయాడు. అతనికి పల్లవిక అనే భార్య, కువలయుడనే కుమారుడు ఉండేవారు. కోడలి పేరు పాటల. కరువు వల్ల అందరూ కూడా గుడ్డా లేక బాధపడేవారు.

ఒకమారు ఒకనాటి సాయంకాలం అతని గృహసమీపంలో సంతోషకాంతమైన కుసుమారామంలో ప్రత్యేకబుద్ధుడు విశ్రమించాడు. వారు నలుగురూ ఒకే గుడ్డ ఉన్నందున వంతులవారీగా దానిని కట్టుకొని, రాజుగారి యింటికి వెళ్ళి, పూవులు ఇచ్చి, తిరిగి వచ్చి, ప్రభామయుడైన ప్రత్యేకబుద్ధుని చూచారు. తేజోనిధి అయిన అతనిని ఉదయం పూజిద్దామనుకొని, ధనరహితులయినందున రెక్కలు తెగిన పక్షులవలె వ్యధపడ్డారు. "నలుగురికీ కలిసి ఒక వస్త్రం ఉంది. ఈ పూజ్యుని పవిత్రదేహాన్ని దీనితోనే కప్పుదాము. ఇప్పుడు దిసమొలతో రాజగృహానికి వెళ్ళనక్కరలేదు. ఏమౌతుంది?" అని వారు ప్రతిన పూని అతనిని పూజించారు. ఆ పుణ్య ప్రణిధానంతో మాలాకారుడు మరుజన్మలో దివ్యప్రభావం కలిగి, పత్నీపుత్రస్నుషా సమన్వితుడుగా, ధనికుడై పుట్టాడు.

సర్వజ్ఞుడు ఈ విధంగా చెప్పగా, భిక్షువులు దానఫలలక్ష్మి చిత్తవైమల్యమూలం అని గ్రహించారు. పిదప బ్రాహ్మణులందరూ కలిసి పవిత్రమైన భోజన వస్తువులు సిద్ధపరచి, భగవానుని ఆహ్వానించి, అర్పించి కుశలాలు పొంది విరాజిల్లినారు.

అశ్రద్ధతో అర్పించిన రత్నవనం కూడా తృణాగ్రమౌతుంది. శ్రద్ధతో ఇచ్చిన గడ్డిపోచ కూడ వెలలేనిదౌతుంది. కేవలం విత్తం మాత్రమే అనేక శోభలను, అనుభవాన్ని కూర్చదు. శుభసంభవాలకు చిత్తమే నిమిత్తం.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ధనికావతానమనే తొంభయ్యవ పల్లవం

# 91. శిబిసుభాషితావదానం

వెలుతురు లేని చోట్ల కూడ మంచి దీపంలాగ సుభాషితం సత్యమార్గాన్ని చూపుతుంది. ఈ విధంగా ఎల్లప్పుడూ వివేకచర్యలయందు ఉపకారం చేయడం వల్లనే, మహాత్ములకు కూడ సుభాషితం ప్రియంగానే ఉంటుంది.

వల్లరాజుల రాజధాని అయిన కుశిపురంలో ఉన్నప్పుడు భగవానుడు కుశలం కోరి భిక్షుగణాలకంతా అర్థోత్పదం కలుగజేశాడు. అప్పుడు భిక్షువులు పరస్పరం ధర్మవిషయాలు తియ్యగా చెప్పుకొంటూ ఉండగా, భగవానుడు ప్రీతితో వారి సుభాషితం విన్నాడు. భిక్షువులు అతని సుభాషిత వ్యసనం చూచి, "సర్వజ్ఞ! నీకు మా మాట ఎందుకు ప్రియం?" అని ప్రశ్నించాడు. "నాకు జన్మాంతరంలోను సుభాషితమంటే ఇష్టమే" అంటూ ఇలా అన్నాడు:

పూర్వం శివవతి అనే పట్టణంలో శిబి అనే నరేశ్వరుడుం**డేవాడు**. **అ**తడు సర్వభూతాలకు దయాబాంధవుడు. అతని పుణ్యశాసనంలో ఉన్నవారంతా దేహాంతంలో స్వర్గం నింపివేయడం ఇంద్రుడు చూచి, అతని సత్త్వగుణబలం పరీక్షించడానికి వచ్చాడు. రాజు రత్నప్రాసాద శిఖరంపై ఉండగా, ఘోరమైన రాక్షసరూపం ధరించి, అతని ఎదుటికి వచ్చి, "తరళతరంగా మెరిసే మెరుపులవంటి ఈ సంసారాలు అనిత్యమైనవి; నిరంతరం పుట్టుక, ప్రళయం అనే పరిణామం కలిగించే స్వభావం గలవి" అని సుభాషిత శ్లోకార్థం మాత్రం చెప్పి మౌనంగా నిలబడ్డాడు. రాజు అతనికి నమస్కరించి, అంజలి ఘటించి, "ఓ సాధో! తక్కిన సుభాషిత శ్లోకంలోని సగం కూడ చెప్పి మనస్సుకు సుఖం కలిగించు. నీకు శిష్యుణ్ణయి, బోధికి అంగభూతమైన నీ వాణిని వింటాను." అని విన్నవించాడు. అది విని రాక్షసుడు ఇలా అన్నాడు: "రాజా, నీబోటి నిరర్థకుడైన శిష్యునితో నాకేమిటి ప్రయోజనం? దప్పితో బాధపడుతున్నాను. ఆకలితో కడుపు అంటుకొనిపోయింది. ప్రయోజనంలేని గురుమర్యాద నాకు ఇష్టం కాదు. ఆకలిదప్పులతో వ్యాకులపడుతూ నేను వాగినదానికంతా మిగిలినది చెప్పడానికి నా తరం కాదు. కనుక నన్ను వ్యర్థంగా అడగవద్దు. తియ్యగా, రసంతో చిప్పిలుతూ చెవులలో పడే సుభాషితాలు ఆకలి దప్పులను పోగొట్టవు. ఆకలిదప్పులు తీరి తృప్తితో ఉన్నవారికి సుఖమిస్తాయి. మనుష్యులు నేర్చే చదువు, సంగీతం, కవిత, శ్రమతో సాధించే కౌతుక విద్య, భూతగ్రహవ్యాధి విషోన్మాదాదులు శమింపజేసే జ్ఞానం, భూభృత్సేవ అనే సముద్రాన్ని తరించడం, బంగారు చేయడం, - ఇదంతా తుట్టతుదకు భోజనం కోసమేకదా! అప్పుడే నరకిన ప్రాణి రక్తం, మాంసం నాకు చాల తృప్తిని కలిగిస్తాయి. నీవు అహింసానియమబద్ధుడివి గనుక నీ నుంచి అలాంటి కోరిక సాధ్యం కాదు. మరొకరిని యాచించడానికి వెళ్ళుతాను. నీవద్ద ఏమి చేయను? ఆటలు, మాటలు సమానమైన ఆహార విహారాలుగల వారికే పొసగుతాయి."

ఆ మాటలు విని రాజు ఆదరంతో "నాదేహం కోసి నీకు రక్తమాంసాలు సమర్పిస్తాను. నీవు ప్రతీత్యసముత్పాద సమర్థమైన సుభాషితం ఉత్తరార్థం చెప్పు. అది నిర్వాణ నగరానికి శ్రేష్ఠమైన మార్గంలాగ ఉన్నది" అని దీనంగా యాచించాడు. రాజు ఇలా అనగానే నిశాచరుడు "ఓ సుమతీ! సుభాషితం పూర్తిగా విను. నీవు మాట యిచ్చిన దానిని నాకు అర్పించు" అంటూ సుభాషితం ఉత్తరార్థం ఇలా చదివాడు: "ఆ సంసారాలలో పుట్టిన సుడిగుండాలలో పడి శ్రమ పొంది అలసిపోయిన ప్రాణులకు ఉపశమం వాటిని అడ్డగించి విశ్రాంతి కలిగిస్తుంది" అని.

ఆ సుభాషితం విని నరపతి సంతోషంతో ఉత్ఫుల్లలోచనుడై తన మాటప్రకారం దేహం కోసి రక్తంతోసహ మాంసం అతనికి ఇచ్చాడు. కోసి కోసి మాంసఖండాలు ఇస్తున్నప్పటికీ, రాజుకు మనోవికారం ఇంతైనా లేకపోవడం చూచి నిశాచరుడు ఆశ్చర్యపడ్డాడు. రాజు ఆ మాంసాశనునికి సకలాంగాలనుంచి మాంసం కోసి యిచ్చి, సర్వసత్త్వాలకు శుభం కలగాలని ప్రణిధానం చేశాడు.

అప్పుడు రాక్షసరూపంలో ఉన్న పురందరుడు చనువుతో "రాజా, నీకు మర్మవిచ్ఛేద సమయంలో కలిగిన వ్యథవల్ల విషాదం పుట్టిందా?" అని ప్రశ్నించాడు. "నేను వ్యథలోను నిర్వికారుడుగా ఉన్నాను. ఈ మాటే నిజమైతే నా దేహం వ్రణరహితమూ, ముందువలె ఆరోగ్యవంతమూ అగుగాక!" అని రాజు సత్యప్రమాణం చేశాడు. అతడు ఆ మాటలు అనీఅనగానే, అతని దేహం వ్రణరహితమై పూర్వ రూపం పొందింది. అప్పుడు గగనచారులు అతనిపై పుష్పవర్షం కురిపించారు. సురేశ్వరుడు రాక్షసరూపం వదలి అతని సత్త్వగుణబలం ప్రశంసించాడు. సత్యం దర్శించి ఇంద్రుడు వెళ్ళిపోయిన పిదప రాజు అతడు చెప్పిన సుధారసమధురమైన సుభాషితాన్ని మననం చేశాడు.

ఆ శిబినరపాలుణ్ణి నేనే. అప్పుడూ నాకు సుభాషితం ప్రాణపణంకంటె ప్రియమైంది.

తథాగతుడు చెప్పిన నిజ జన్మాంతర కథను విని భిక్షువులందరూ ఆశ్చర్యంతో ప్రశంసించారు.

దృష్టాదృష్ట సుఖమైన మార్గంలో సుభాషితకాంతి మహాదీపం వలె వెలుగుతుంది. సంవాదంలో సుభాషితామృతరసం గొప్ప ప్రీతిని కలిగిస్తుంది. సర్వజ్ఞుడు కూడ సుభాషితం వినడానికి ఇతరులను యాచిస్తాడు. కనుక సుభాషితంలాగ ఉత్తములకు ఇష్టమైంది మరొకటి లేదు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శిబిసుభాషితావదానమనే తొంభైఒక్కటవ పల్లవం

# 92. మైత్రకన్యకావదానం

మాత వసుధవలె త్రిదశతటినీపావన శరీర. సకల భూతాలకు ధరిత్రి. సమస్త రససార ప్రసవిని. తల్లి, వసుధను మించి శరీరాన్ని ప్రేమలాగ అభివృద్ధి పొందిస్తుంది. కనుక ఆ మహానుభావురాలు ఉత్తములకు గురువుల ఎదుట కూడ గురుతరస్థానంలో పూజనీయ.

జినదేవుడు శ్రావస్తిలో ధర్మం విస్తారంగా ఉపదేశిస్తూ, ఒకమారు భిక్షుసంఘానికి సంక్షిప్తంగా ఇలా అన్నాడు.:

తల్లిదండ్రులు పరబ్రహ్మ స్వరూపులు; జంగమమైన పుణ్యసంగమం వంటివారు. వారిని పూజించడమే ధర్మమైన కులాలు ధన్యమైనవి. మూడు లోకాలలోను సత్యంతో సమానమైన తపస్సు లేదు. అహింసతో సదృశమైన ధర్మం ఎక్కడా లేదు. తండ్రిని మించిన గొప్ప గురువు లేడు. మాతకంటె శ్రేష్ఠమైన మరొక దైవతం లేదు. గురువుల పాదకమలయుగాన్ని వెల్లివిరిసే భక్తితో సేవించనివారు ఎన్ని తీర్థాలలో మునిగినా జలరుచి(పాచి) వలె ఫలశూన్యులు. మాతకు, పితకు సాటి అయిన మూడవ గురువు లేడు. ఎన్ని సుఖాలు కలిగినా విముఖులు గాక, ఓర్పుతో, తీవ్రమైన వ్రతాది నియమాలవలె శోషింపచేయక అత్యల్పమైన ప్రణయంతో ఉపచరించినా, అనల్పమైన ఫలమిచ్చే మాతృ పితృరూప గురువులను సేవించాలి. సుకృతార్థాలను ఉపదేశించడం వల్ల గురువు ఎల్లప్పుడు ఎవరికి వంద్యుడు కాడు? గురువులకు గురువు, ప్రాణాలను ప్రసాదించినవాడు అయిన జనకుడు ఎలా పూజ్యుడు కాడు? తత్రాపి తల్లి సహించిన గర్భధారణ భారక్లేశంలో క్షణకాలానికైనా, ఎంత పుణ్యనిచయంతో నయినా ఋణనివృత్తి చేసుకోగలమా? అవివేకపాకంతో కుశలమార్గం నుంచి జారిపోయి తల్లిని కొంచెం అవమానించినవాడు ఎన్ని వ్రతాలు చేసి జటాకలాపధరుడయినా, ఆ జటలన్నీ అతని తలపై మండుతున్న అగ్ని జ్వాలాసమూహంలా ఉంటాయేగాని, శాంతి ఉండదు; పుణ్యం కలుగదు. నేను కూడ ఒక జన్మలో తల్లిని అవమానించి, అంతంలో హింస పొందే పాప శాపమయమైన తాపం పొందాను.

పూర్వం వారాణసిలో మైత్రడనే గృహపతి ఉండేవాడు. అతనికి వసుంధర అనే అత్యంత ప్రీతిపాత్రమైన పత్ని ఉండేది. ఆమెకు ఐదుగురు కుమారులు పుట్టి వెంటనే గిట్టిపోయారు. పశ్చిమ వయస్సులో ఒక్క మంచి కొడుకు పుట్టాడు. తండ్రి అతనికి కూడా ఆపద వస్తుందేమోనని భయపడి, కన్యక పేరు పెట్టాడు- అప్పటినుంచి మైత్రకన్యకుడు అనే పేరు పడింది. మైత్రుడు ఒకమారు సముద్ర వ్యాపారానికి వెళ్ళి మరణించాడు. అప్పటి నుంచి, తల్లి ఆ ఏకైక పుత్రుణ్ణి నిధిలాగ రక్షించుకుంది. కులక్రమంగా వచ్చిన ద్వీపవ్యాపారం మాన్పించి, దేశంలోనే స్వల్పవిక్రయంతో జీవిక గడపవలసిందని ఆమె పుత్రుని ఆదేశించింది. వాడు మొదటినాడు విక్రయం వల్ల వచ్చిన నాలుగు కార్షాపణాలను(నాణేలను), మరునాడు వచ్చిన రెట్టింపు నాణేలను, మూడవనాడు వచ్చిన వాటికి నాలుగురెట్లు హెచ్చు నాణేలను, ఇట్లే అష్టగుణంగా, బహుగుణంగా వస్తున్న లాభాలను తల్లికి అప్పగించేవాడు.

ఇలా ఉండగా, అతడు తన కులంవారు పరంపరగా ద్వీపవ్యాపారం చేసేవారని విన్నాడు. అప్పటినుంచి ఉత్సుకత హెచ్చి, తల్లి ఎంత నివారించినా వినక, సముద్రగమనారంభ సంభారాలు సేకరించుకుంటూ, తల్లి వాటిని చూచి భయపడి, శోకవిహ్వల అయి, కాళ్ళమీద పడ్డా లక్ష్యపెట్టక, కాళ్ళపైబడిన సిరిని లెక్కపెట్టని మూర్ఖునివలె కాలితో తోసివేసి బయలుదేరాడు. దుష్పుత్రుడు శైశవంలో తొక్కుడు పలుకులతో అమృతం కురిపిస్తాడు; కొంచెం పెరిగిన తర్వాత ఎన్నో కోరికలతో నచ్చచెప్పగా విని చాల ప్రీతి కలిగిస్తాడు. పెద్దవాడైన పిదప ఉత్కట యౌవనపు వేడితో వికటమైన అహంకారం కమ్ముకొనగా కాలకూటం వలె పరుషాలు పలుకుతూ వ్యథను, కష్టాన్ని కలిగిస్తాడు.

మైత్రకన్యకుడు విపులమైన జననీశోకం వంటి సాగరం చేరి, ఓడ యెక్కి రత్నార్జనోత్సుకుడై కదిలాడు. ఆ ఓడ వాని దురదృష్టవశాత్తు మకరాది జలజంతువులు వాడి రంపాలవంటి తమ గోళ్ళతో, తోకలతో కొట్టగా, సముద్రమధ్యంలో చితికిపోయింది. ఓడ భగ్నం కాగా ఆశాభంగం పొందిన ఆ అహంకారిని మూర్ఛ, తల్లి శాపంలాగ కమ్మింది. తర్వాత కొంతసేపటికి వాడు మూర్ఛదేరి ఓడ పలక ఒకటి దొరకగా పట్టుకొని తీరం చేరి అడవిని పడిపోయాడు. అట్లే ఒంటరిగా , ధైర్యం కోల్పోయి ఏమీ తోచక విజనారణ్యంలో వెళ్ళుతూ కొన్నినాళ్ళకు ఒక సుందర దివ్యనగరం చూచాడు. దాని పేరు రమణకం. అక్కడ నలుగురు అప్సరసలు - తమ ముఖ చంద్రకాంతులతో వెన్నెలవాకలు సృజిస్తున్నవారు - అతనికి ఆదరంతో ఆతిథ్యమిచ్చారు. ఒక హేమపుష్కరిణీ తీరంలో రమ్యమైన రత్నలతావనంలో మణిమందిరంలో మెత్తని శయ్యలపై సుఖించాడు. ఆపదలు సుఖాలతో ముగుస్తాయి. సంపదలేమో క్లేశం కలిగిస్తాయి. శరీరధారులకు ఇవి పర్యాయంగా (మార్చి మార్చి) కలుగుతుంటాయి. రతిభోగమానసుడైన అతనితో ఆ హరిణేక్షణలు చిరకాలం రమిస్తూ, తమ సౌభాగ్యాకి కృతార్థత పొందారు.

ఇలా సుఖంతో కాలం గుడుపుతూ ఉండగా, వారు ఒకమారు అతనితో "ఈ నగరంలోని దక్షిణపు దిక్కు దారిని పూర్తిగా వదలిపెట్టు, దానిలో నడవవద్దు" అని అన్నారు. ఆ మాటలకు అతనిలోని కుతూహలం పెరిగి, ఏమిటో వెళ్ళిచూద్దామనే ఆశ హెచ్చింది. నియమాలకు కట్టుబడక, స్వాధీనంకాని అభిలాషలు కలవానికి వద్దన్నకొద్దీ ఆదరం ఎక్కువ కావడం సహజం. అందువల్ల వాడు కుతూహలం బలవంతంగా ఈడ్వగా, దక్షిణ దిక్కుమార్గం పట్టి బయలుదేరాడు. అలా వెళ్ళుతూ, సదామత్తం అనే దివ్యపట్టణం చూచాడు. అక్కడ ఎనిమిదిమంది అప్సరసలు అతనికి ఉపచారం చేసి సంతోషపెట్టారు. ముందువారికన్నా హెచ్చుగా ఉపచారం చేశారు. వారు కూడ దక్షిణదిక్కు దారిని పోవద్దన్నారు. కాని, వాడు కుతూహలంతో వారి మాటలు వినక, వెళ్ళి నందనమనే మరొక దివ్యపురం చేరాడు. అక్కడ పదహారుమంది అప్సరసలు వచ్చి, అతనికి రతిభోగోపభోగ్యలయారు. వారు కూడ మునుపటివారిలాగే నిషేధించారు. అయినా, అతడు బయలుదేరి, బ్రహ్మోత్తరమనే ప్రాసాదం చేరాడు. అక్కడ ముప్పైరెండుమంది అతిసుందరులైన అప్సరసలు వచ్చి అతనిని ఆదరించి సుఖపెట్టారు. వారు కూడ ముందు వారిలాగే ఆ నగరం దక్షిణ దిఙ్మార్గంలో వెళ్ళవద్దన్నారు. అయినా అతడు వినక బయలుదేరాడు.

బయలుదేరి వెళ్ళుతూ దుష్టుల స్నేహంవలె కష్టాలకు పుట్టినిల్లువంటి లోహమయ దుర్గప్రాయమైన నగరం ప్రవేశించాడు. అతడు ప్రవేశించగానే, క్రమంగా భూమిలో కనిపించే పురద్వారాలన్నీ ఎవరో



మూసివేసినట్లు, సందులు లేకుండా బిగుసుకొనిపోయాయి. ఎదుట ఒక మహాకాయుడైన పురుషుడు నిలబడి ఉండడం చూచాడు. ఆ పురుషుడు సకలక్లేశదోషాలకు పుట్టినిల్లులాగ కనిపించాడు. అతని తలమీద జ్వాలలతో మండే ఒక చక్రం తిరుగుతున్నది. ఆ చక్రం నుంచి రక్తం ప్రవహిస్తున్నది. వాడు తన తలనుంచి కారుతున్న చీము నెత్తురులను తింటున్నాడు.

మైత్రకన్యకుడు ఆ భీభత్సదృశ్యం చూచి మనస్సు నిర్వేదంతో విరిగిపోయి ఇలా అన్నాడు: "ఇంత క్రూరవ్యథతో బాధపడే నీవెవడివి? ఏ కర్మఫలమిది?" మైత్రకన్యకుడు కరుణతో ఇలా ప్రశ్నించగా, ఆ పురుషుడు "నేను తల్లికి అపకారం చేశాను. ఆ కర్మఫలమిది" అని సమాధానం చెప్పాడు. ఆ మాటలు మైత్రకన్యకుడు విని, "అయితే నేను కూడా తల్లిని అవమానించి పాపం పొందాను. ఈ పాపసహోద్యాయి కనిపించి నా సంగతిని జ్ఞాపకం చేశాడు. సుఖాల నుంచి ఆ పాపమే నన్ను పచ్చిగడ్డి మైదానంలో స్వేచ్ఛగా గడ్డిని మేస్తున్న జింకను శౌనికుడు లాగినట్లు ఇంతవరకూ లాగింది." అని చింతాక్రాంతుడయాడు.

ఇలా చింతతో వాడు తలుపులు మూసిన ఆ పట్టణంలో ఉండగా, ఆకాశం నుంచి హృదయాన్ని కంపింపజేస్తూ వాణి ఇలా వినిపించింది. "చిరబద్ధమైన వాటిని వదలిపెట్టు. కొత్తగా వచ్చిన వాటిని బంధించుకో. బద్ధమైనవాటిని విడిచిపెట్టడానికి కొత్తవాటిని కట్టుకోవడానికి ఇదే అదను." ఆకాశం నుంచి ఈ మాటలు వినబడగానే, ఆ మహాకాయుడైన పురుషుడు బంధ విమోచనం పొందాడు. మంటలతో మండుతున్న అతని తలమీద చక్రం మైత్రకన్యుని తలపై పడింది. వెంటనే ఏవో వచ్చి తనను కట్టివేసినట్లయింది. మర్మాలు భేదించే వ్యథ శరీరమంతా వ్యాపించింది.

అప్పుడు మైత్రకన్యకుడు ముక్తబంధనుడైన ఆ పురుషుని చూచి ఇలా అన్నాడు: "మణిమందిరాలతో సుందరమైన పట్టణాలను, సరసభోగ మనోహరలైన అప్సరసలను వదలి ప్రకృష్టమైన పాతకం అనుభవించవలసిన కాలం సమీపించగానే, ఇక్కడికి లాగబడ్డట్టు వచ్చి చేరాను. కర్మవల్లి కాలానుగుణంగా ఫలిస్తుందికదా! పశువు వధ్యాగారం వచ్చి చేరినట్లు ఇక్కటికి వచ్చి చేరారు. భవితవ్యత బలవతీ. అది జీవిని లాక్కునివస్తుంది. అది లాగగా మనుష్యుడు అవశుడై ఎక్కడో ప్రవేశిస్తాడు. ఎవరి పరిపాకభోగ్యమైన భవితవ్యత వారి ఎదుటే ఉంటుంది. తల్లి ఎడ అపచారం చేసిన పాపాలకు క్లేశం అనుభవించే కాలావధి యెంత? మనబోటివాడు మరొక కొత్తవాడు ఇక్కడికి వస్తాడా?"

కాలుతున్న చక్రం ఒంటిని కోస్తుండగా బాధతో, మంటలతో ఆర్తుడైన మైత్రకన్యుని మాటలు విని ఆ మహాకాయుడు ఇలా అన్నాడు: "పాపకర్మలకు క్లేశం అనుభవించవలసిన గడువు అరవైవేల అరవై వందల సంవత్సరాలు. తల్లియెడ తప్పు చేసిన పాపులకు ఇంకా మరికొన్ని ఘోరస్థానాలున్నాయి. అలాటి తప్పులు చేసినవారు అలాటి వాటిని అనుభవిస్తారు."

దుస్సహతరమైన ఆ మాటలు విని మైత్రకన్యకుడు తన వ్యథాదుఃఖానుభవం వల్ల పరుల దుఃఖం పట్ల దయగలిగి ఇలా అన్నాడు: "ఇప్పుడే వచ్చే పాతకులకోసం కూడ ఈ అగ్నిచక్రం నా తలమీదే తిరగనీ! వారు ఈ తీవ్రమైన దీర్ఘవ్యథను ఎలా సహిస్తారు? ఆ దుఃఖమంతా నాకు ఒక్కనికే ఉండనీ, వారంతా వ్యథారహితులు కానీ! నా కర్మఫలం అనుభవించి, ఇతరులకోసమూ ఈ చక్రం ధరిస్తాను. తాను వ్యథ పడనిదే ఇతరుల వ్యథను ఎవరూ గ్రహించలేరు." సత్త్వహితచింతకుడై కరుణార్ద్రుడైన అతని సత్సంకల్ప

ప్రభావంతో ఆ చక్రం ఆకాశానికి ఎగిరిపోయింది. ఉత్తములైనవారి హృదయంలో కరుణాజలంతో నాటిన సత్సంకల్పలత పల్లవించినంతనే తాపం పోగొడుతుంది. పుష్పించగానే ధవళయశస్సు కలిగిస్తుంది. పూచి భవ్యసౌరభం గుబాళించగానే సిరులు కలిగిస్తుంది. మరి రసమయమైన ఫలాలను ఎందుకు అందజేయదు? కారుణ్యం వల్ల, పుణ్యమహాత్మ్యం వల్ల అతడు వెంటనే పాపవిముక్తుడై దేహం వదలి, దేవలోకంలో దేవతగా అవతరించాడు.

నేనే వెనుకజన్మలో మైత్రాత్ముడైన మైత్రకన్యకుడుగా పుట్టాను. తల్లిని కాలితో తన్ని తొలగించుకొని వెళ్ళడం వల్ల అలాటి దుఃఖ పరంపర అనుభవించాను. తల్లికి కార్షాపణాలు అర్పించడం వల్ల అప్సరోలోకం పొందగలిగాను.

ఈ విధంగా భగవానుడు ఉత్తమమైన మాతృశుశ్రూషాధర్మం ఉపదేశించాడు.

మంగళమాలిక, గుణమయి అయిన మాత, వాత్సల్యమౌళి అయిన పిత ఎవరి శిరస్సుపై ప్రీతితో తమ పాదాంబుజాలను పెట్టదలుస్తారో, పుణ్యాభరణులయిన ఆ పుత్రులు సకల దిక్కులూ నిండిన మహా యశస్సంపదలతో వెలుగొందుతూ నిత్యోత్సవాలలో తేలాడుతూ జగత్తులకే పూజ్యులవుతారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో మైత్రకన్యకావదానమనే తొంభై రెండవ పల్లవం

# 93. సుమాగాదావదానం

జినభక్తి విశేషయుతులైన వారి శ్రద్ధాసుధాసార నిర్ఝరాల తుంపరలు కూడ శ్లాఘ్యమైనవి. అవి పూజ్యుల పూజావిధిలో నిశ్చేతనమైన కుసుమాది పూజాద్రవ్యాలకు కూడా తగిన చైతన్యం కలిగిస్తాయి.

జినదేవుడు శ్రావస్తిలో జేతవనంలో ఉండగా, అనాథపిండదుడు వచ్చి భగవానునితో ఇలా విన్నవించాడు: "భగవన్, నా కన్య సుమాగధ నీ యందలి నా భక్తివలె మహాశ్రేష్ఠగుణ విశ్రుత అయిన ప్రౌఢిని పొందింది. పుండ్రవర్ధనమనే పట్టణంలోని శ్రీమంతుడైన సార్థనాథుడనే గృహపతి కుమారుడు వృషభదత్తుడనేవాడు ఆమెను పెండ్లాడగోరుతున్నాడు. నీవు ఇష్టపడితే అతనికి, నా కన్యను ఇస్తాను. నేను త్వదధీన ధనప్రాణాలు గలవాడిని, త్వదాజ్ఞా శరుణుణ్ణి." ఆ మాటలు విని వాత్సల్య విమల మానసుడయిన భగవానుడు "తప్పేముంది? అతనికి నీ కుమార్తెను ఇవ్వు" అన్నాడు. అనాథపిండదుడు శాస్త శాసనం ఆదరంతో స్వీకరించి, నమస్కరించి తన యింటికి వెళ్ళాడు. తర్వాత వృషభదత్తునికి సుమాగధను ఇచ్చి మహావైభవంతో పెండ్లి చేసి, భూరిరత్నాంబరాలు మొదలయిన కానుకలతో అత్తవారింటికి పంపాడు.

దూరదేశం వెళ్ళుతున్న సుమాగధకు జినభగవానుని చరణద్వంద్వం జ్ఞాపకం వచ్చి, కళ్ళలో నీరు తిరిగింది. బహుకాలానికి ఆమె పుండ్రవర్ధన నగరం చేరి, పతి శుశ్రూష చేస్తూ, ఎల్లప్పుడూ పతి భవనంలోనే ఉండిపోయింది. ఒకమారు అత్తగారు ధనవతి ఏరాళంగా ధనం వ్యయం చేసి, భోజ్యసంభారాలు సిద్ధం చేయిస్తూ, కోడలితో "సుమాగధా! పూజోపకరణాలన్నీ సిద్ధం చేయి. రేపు ఉదయం మన యింటికి జగత్పూజ్యగుణుడయిన జినభగవానుడు వస్తున్నాడు. సర్వజనులకు గౌరవభాజనులైన గురువులు, సమ్మోహ వినాశకారులు అయిన క్షపణకులు వస్తున్నారు. వారంతా మనకు పూజ్యులు" అని అన్నది. అత్తగారి మాటలు విని, భిక్షుగణం కోసమే ఆ పూజోపకరణమంతా సిద్ధమౌతున్నదని గ్రహించి, తదారంభతత్పరురాలయింది.

మరుసటినాడు కేశాలు, మీసాలు, గడ్డాలు పీకివేసుకున్న కష్టం సహించిన నిశితవ్రతులు, నగ్నులు అయిన క్షపణకులు ఇంటికి వచ్చారు. మినపకూర తిని బలిసిన మహిషాలవలె ఉన్న, సిగ్గులేని ఆ దిసమొలవారిని సుమాగధ చూచి, సిగ్గుపడి గుడ్డతో ముఖం కప్పుకుని, పెద్దల సన్నిధిలో దుఃఖనిర్వేదంతో ముఖం వంచి, అత్తగారితో ఇలా అన్నది: "అయ్యో! బహుకాలానికి దిగంబరుల ఎదుట కోడండ్లు నిలబడే ఆచారం చూచాను. కొమ్ములులేని వీరు మీ యిండ్లలో లెక్కలేకుండా తింటున్నారు. ఇక్కడి స్త్రీలకు మానుషత్వం లేనిదానివలన వీరి యెదుట సిగ్గు పడడం లేదు. మీకు వీరియందు భక్తి అపాత్రమైంది. పశువులవలె ఏమిటీ ఉచ్ఛృంఖలమైన ఆచారం? తిండి వదలనివారు గుడ్డను ఎలా వదలిపెడుతారు? నగ్నులు, తిండిపోతులు అయిన ఈ నియమవంతులు దయాహీనులని వెంట్రుకలు పీక్కొనడం వల్లనే తెలిసింది; కౌపీనం కూడ వదలిపెట్టడం వల్ల పెద్దల వద్ద శీలమన్న మాటేలేదు. ఏదో నియమవంతులమనే

పటాటోపంతో భయంకరమైన ముఖంలో క్రోధం దానంతట అదే కనిపిస్తున్నది. ఈ పశువులే పూజ్యులయినప్పుడు వెళ్ళగొట్టదగినవారెవరు? ఇంతకూ ఇది దేశదోషం! ఆచారమేమో గతానుగతికం." ఆ మాట విని అత్తగారు చాల విషణ్ణ అయి, "భద్రే! మీ పుట్టింట్లో ఎలాటివారిని పూజిస్తారమ్మా?" అని ప్రశ్నించింది. దానికి సుమాగధ ఇలా సమాధానం చెప్పింది. "తన కరుణతో సర్వజగత్తుకు కుశలాతిశయం కలిగించడానికి ఉద్యుక్తుడయిన జినభగవానుని మా పుట్టింట్లో పూజిస్తారు. ఆయన పుణ్యలావణ్యసింధువు; ధ్యానాధీనుడు; స్తిమిత నయనుడు; ఆయన వెదురుగడవంటి నాసిక పుణ్యసేతువువలె ఒప్పారుతుంది. ఆయన కర్ణయుగళం కుండలశూన్యమై కిందికి వేలాడుతూ కాంతితో వెలుగుతూ ఉంటుంది. ఆయన స్వకీయ తనుకాంతితోనే విద్వాంసులకు అంతరంగంలో శాంతి కలుగజేస్తాడు. శిరస్సు మీద సహజ కాంతిపుంజాలు విరజిమ్మే, మణి, బంగారు కాంతితో గజరాజు తొండంలాటి బాహువులు, కరతలాలలో శంఖ ద్వజ కమల మాలికాది రేఖలు- ఈ విధంగా ఆయన శమమయ సామ్రాజ్యార్హమైన లక్షణాలతో విరాజిల్లుతాడు. మహామునులకు కూడా అభిలాష కలిగించే అతని స్వభావం సర్వాభిలాషరహితమైనది. మన్మథుని జయించి రాగోజ్ఝితుడయిన అతని అధరం సరాగమైంది. అతని మూర్తి నిర్భరసంగమ ప్రణయిని. మైత్రి మనశ్శాయిని. క్షాంతి తన్మయకారిణి. దయ గాఢంగా హృదయాన్ని ఆలింగనం చేసుకొనేది. సర్వాశాభరణుడు, భూరిదయితాసక్తుడు, అపూర్వమణి వంటివాడు అయిన అతని శమగుణం వైరాగ్యాన్ని పొదుగుకున్నది; అనన్యమైన మహిమ కలది. ఆయనవల్ల ప్రవ్రజ్యాదీక్ష పొందిన శీలదుకూలధారులయిన మహాత్ముల మనస్సు నిరావరణమౌతుంది. విశ్వరక్షామణి అయిన అతని స్మరణ మాత్రంతోనే రాగద్వేషాలనే ఘోరమైన కోరలుగల భవసర్పం కరవదు."

అత్తగారు శ్రోత్రరసాయనమైన కోడలి మాటలు విని, వెంటనే మనస్సు ప్రసన్నమై, సంతోషంతో "అమ్మాయీ! ఆయనను దర్శించే ఉపాయమేదైనా ఉన్నదా? నీ పుణ్యసంబంధం వల్ల మేము గూడ అమృతత్వం పొందే భాగ్యముందా?" అని అనునయంతో, ఆదరంతో ప్రశ్నించింది. "ఇదుగో, ఇప్పుడే మీకు ఆయనను దర్శింపజేస్తాను" అని భక్తిమానిని అయిన ఆమె సమాధానం చెప్పి, తాను చేసిన మహా ప్రతిజ్ఞను నిర్వహించుకొనే అభిలాషతో, సంశయంతో ఊగిసలాడుతూ క్షణకాలం ధ్యానపరాయణ అయింది.

తర్వాత ఆమె మేడ ఎక్కి, సుగతుడున్న దిక్కుకు తిరిగి, నమస్కరించి, పూజ్యులకు అర్పించే పూజాకుసుమాంజలి సమర్పించి, ధూపదీపాదులతో అర్చించి, ఆ వైపు ముఖమెత్తి, ఆనందబాష్పాలు విశాలనయనాలు కప్పగా ఇలా విన్నవించింది:- "భగవన్, రత్నత్రయ దీక్షా వివర్జితనై, నీ ఆశ్రమమృగివంటి నేను ఈ దూరదేశంలో వచ్చి పడ్డాను. నన్ను కరుణించు. నీ పాదపద్మయుగళం శరణం పొందిన నన్ను దూరంలో ఉన్నా కటాక్షించు దయాళో! వాత్సల్యపేశల హృదయులయిన గొప్పవారికి ప్రవాసం వల్ల దూరమయిన వారిపై కూడా కరుణ సన్నగిల్లదు. భగవన్! నీ దాసుని కుమార్తెనైన నేను నిన్ను ఆహ్వానించాను. ఉదయమే వచ్చి దర్శనమిచ్చి నా మానం కాపాడు."

ఆమె ఈ విధంగా ప్రార్థించి అర్పించిన విచిత్రకుసుమావళి సజీవిత అయిన భక్తిదూతికలాగ ఆకాశమార్గంలో బయలుదేరింది. ఆ శ్వేతరక్తహరితనీలపుష్పపాళి ధూపధూమంతో పాటు ఆకాశంలో లేమబ్బులపై కనిపించే సంచారి శక్రచాపలతవలె కన్నులపండువయిది. ఆ కుసుమావళి - భక్తి నిర్భరమైన కుసుమావళి- క్షణంలో జేతవనం చేరి, శాస్తచరణాబ్జాలపై పడింది. సర్వజ్ఞుడైన భగవానుడు సుమాగధ



కోరికను తెలుసుకొని, దయతో ఎదుట ఉన్న ఆనందునితో "రేపు ఉదయం మనం పుండ్రవర్ధన నగరానికి వెళ్ళాలి. సుమాగధ సంఘంతోసహా నన్ను పూజించాలని ప్రార్థిస్తున్నది. ఆ నగరం ఇక్కడినుంచి అరవైవందల యోజనాల పైగా దూరంలో ఉంది. ఒక్కదినంలో అక్కడ చేరాలి. కాలవిలంబం పనికిరాదు. మహాబుద్ధితో(మాహాత్మ్యంతో) గగనమార్గంలో వెళ్ళగలిగినవారికి నిమంత్రణ శలాకను (ఆహ్వానించినట్టుగా గుర్తుగా ఇచ్చే కర్రముక్కను) ఇవ్వు" అని ఆజ్ఞాపించాడు.

సుగతుడు ఈ విధంగా ప్రేరేపించగా, ఆనందుడు ఒక్కదినంలో చేరాలనే కట్టుబాటుగల ఆహ్వానం భిక్షువులకు అందజేశాడు. మహాబుద్ధిశక్తిగల భిక్షువులందరూ ఆహ్వాన శలాకలు పుచ్చుకొనగా, కడవను తలగడగా పెట్టుకొని పడుకొనే పూర్ణుడనే స్థవిరభిక్షువు కూడ శలాకను స్వీకరించడానికి చేయి చాచాడు. ఆనందుడు అది చూచి, నవ్వుతూ "దగ్గర ఉన్న అనాథపిండదుని ఇంటికి నిమంత్రణకు వెళ్ళడానికి నీ కాళ్ళు ఆడవు. అరవైవందల యోజనాల దూరం ఒక్క పగటిలో ఎలా వెళ్ళుతావు?" అని అన్నాడు. దానికి స్థవిరుడు సిగ్గుతో తలవంచుకొని, "సాటివారి యెదుట న్యూనభావం దుస్సహం. అనాదికాలసంచితాలయిన జన్మజరాదిక్లేశాలనే ప్రయత్నంతో రూపుమాపగలిగినప్పుడు బుద్ధిపదం (మాహాత్మ్యస్థానం) పొందడం ఎంత?" అని ఆలోచించాడు. ఆ విధంగా తీవ్రాలోచన కలుగగానే, ఆ శుద్ధచిత్తునికి మహాశక్తి ప్రాదుర్భవించింది. రాత్రి గడిచి తెల్లవారగానే, సకలభిక్షువులూ వివిధ దేవవేషాలతో విమానాలెక్కి గగనమార్గంలో బయలుదేరారు.

ఇలా ఉండగా, పుండ్రనగరంలో సుమాగధ భర్తృగృహంలో సకల భోజనోపచార సంభారాలు సిద్ధం చేసి, భగవద్దర్శనోత్సుకతతో అత్తమామలు, భర్త మొదలయిన వారితోపాటు మేడ యెక్కి, కుసుమధూపార్ఘ్యాది పూజాద్రవ్యాలు కూర్చుకొని యెదురు చూస్తూ ఉంది. అప్పుడు ఆకాశవీధిలో ఆజ్ఞాత కౌండిన్యుడనే భిక్షువు అశ్వరథమెక్కి, ఆశ్చర్యకరమైన దివ్యకాంతి మాహాత్మ్యాలు వెదజల్లుతూ, మొదట కనిపించాడు. సూర్యసన్నిభుడైన అతనిని చూచి అత్తమామలు మొదలయినవారు ఆశ్చర్యపడి సుమాగధతో "ఈయనేనా నీవు చెప్పిన భగవానుడు?" అని ప్రీతితో ప్రశ్నించారు. "సూర్యకాంతిగల ఇతడు ఆజ్ఞాత కౌండిన్యుడనే భిక్షువు" అని సుమాగధ సమాధానమిచ్చింది. భగవానుడు కాడు. తరగని కాంతిగల ఆజ్ఞాత కౌండిన్యుడనే భిక్షువు" అని సుమాగధ సమాధానమిచ్చింది. భిక్షువులు మహావైభవంతో రథాలలో వస్తుండగా, అత్తమామలు కుతూహలం అణచుకోలేక "భద్రే, ఈయనేనా భగవానుడు? ఈయనేనా భగవానుడు?" అని అడుగడుగునా అడగడం ప్రారంభించారు. దానికి సుమాగధ ఇలా సమాధానం చెప్పింది: "ఇతడు శాస్త కాదు; అతడు శాస్త కాదు. వీరంతా ఆయన శాసనపాలకులయిన భిక్షువులు. ప్రశమగుణశ్లాఘ్యులై తపోదీప్తితో వెలిగి పోతున్నారు. అదుగో అక్కడ మనోహర స్వర్ణద్రుమాలతో రమ్యమైన పర్వతశృంగం ఎక్కి, మూర్తీభవించిన ప్రభావంవలె ఆశ్చర్యం కలిగిస్తూ వస్తున్నాడే, ఆయన మహాకాశ్యపభిక్షువు. సజలజీమూత గంభీర ఘోషతో వస్తున్న పంచానన రథమెక్కిన గుణగరిష్ఠుడు శారిపుత్రభిక్షువు. కైలాసంలాగ అతి ధవళమైన చతుర్దంత గజమెక్కి వస్తున్న అనంతకాంతిగల పుణ్యాత్ముడు మౌద్గల్యాయన భిక్షువు. వైడూర్యపు కాడ, రత్నకేశరాలు గల కనకారవిందంలో ఆసీనుడై దిక్కులకు శమసౌరభాలు వెదజల్లుతూ వస్తున్న భిక్షువు ప్రఖ్యాతుడైన అనిరుద్ధుడు. రెక్కల గాలితో మేఘాలను చెదరకొడుతున్న గరుడుని అధిరోహించి, ఆకాశపు అంచులలో వస్తున్నవాడు శమపూర్ణుడయిన మైత్రాయణీసుతుడు. ఈర్ష్యాదిమార్గాన్ని శాశ్వతంగా అణచివేసి, తన శాంతప్రభామృతంతో దిక్కులను

తనియిస్తూ వస్తున్న ఆ సత్త్వమహోధది ఏష్యజిత్తనే ప్రభావవంతుడైన భిక్షువు. కదులుతున్న తీగలు చుట్టుకొని కనుల పండువుగా కనిపించే విశాలమైన సువర్ణ తాళవృక్షమెక్కి వస్తున్న ఆ పుణ్యాపూర్ణద్యుతి అయిన మతి మంతుడు ఉపాలి. సువర్ణరత్నోజ్జ్వలమైన చిత్ర విచిత్ర చిత్రాలుగల వైడూర్య విమానశిఖరం ఎక్కి తన కాంతులతో దిక్కులకు బంగారు పూత పూస్తున్నట్టు వస్తున్న భిక్షువు కాత్యాయనుడు. మూర్తీభవించిన ధర్మంవలె వున్న వృషభవాహనం ఎక్కి వస్తున్న గరిష్ఠబుద్ధి అయిన భిక్షువు కౌష్ఠిలుడు. అతడు ప్రతిష్ఠాపరినిష్ఠితులలో వరిష్ఠుడు. విమానానికి పూన్చిన హంసల కాంతితో అంతరిక్షాన్ని మందహాసరమ్యంగా ఉన్నదా అన్నట్టు చేస్తూ వస్తున్న తపోనిధి పిలందవత్సుడనే భిక్షువు. సముత్ఫుల్లమైన లతావితాన వనాంతర్భాగంలో విహరిస్తూ, ఇంటి ఊసేలేక ఉండే ఆ అక్షుణ్ణకాంతిగల భిక్షువు శ్రోణకోటి. హేమప్రభలతో దిగంతరాళాన్ని అలంకరింపజేస్తూ, మరొక రూపం ధరించిన మేరుపర్వతంలాగ కనిపిస్తూ ఆకాశంలో ప్రకాశిస్తున్నవాడు శాస్త కుమారుడైన రాహులచక్రవర్తి. పర్వాతాలనుంచి, దిగంతాలనుంచి, అఖిల భూమండలంనుంచి, వ్యోమభాగణనుంచి, విచిత్రమైన రత్నాసనాలపై ఆసీనులై అసంఖ్యాక భిక్షుసంఘాలు అత్యద్భుత మాహాత్మ్యంతో వస్తున్నవి."

ఆమె వరుసగా చెబుతున్న భిక్షువులు, తక్కిన సంఘమూ వెనుదిరగడం చూచి అత్తగారు మొదలయినవారు హర్షాద్భుత సంభ్రమాశ్చర్యాలకు, అనన్యకాంతికి ఏకకాలంలోనే లోబడిపోయారు. అప్పుడు జగత్తంతా వెలిగిపోతున్న బంగారు రంగుతో శతసూర్యుల ప్రకాశం కలదయింది. అశేషజనుల సంతాపం శమింపజేయడం వల్ల, శతశీతాంశు శీతలంగాను అయింది. కుబేరశక్రబ్రహ్మాది దేవతలు గగన యాత్రలో సేవ చేస్తూ వెంట నడుస్తుండగా, అమరావతీ పురంధ్రులు పూవుల వానలు కురిపిస్తుండగా జినేంద్రుడు పుణ్యవంతులకు దృష్టిగోచరుడయాడు. అష్టాదశమూర్తి అయిన జినభగవానుడు అష్టాదశద్వారమార్గలగుండ పుండ్రపురం ప్రవేశించి, సుమాగధ ఇంటిని చంద్రకాంతరత్న కాంతిమయంగా చేశాడు.

సుమాగధ మొదలయిన వారు బహుప్రకారమైన పూర్ణోపచారాలతో భగవానుని పూజించారు. పురజనులు వెలుపల గోడపై ప్రతిబింబించిన అతని రూపాన్ని పూజించారు. భగవానుడు సంఘంతోపాటు దయతో సుమాగధ పూజను స్వీకరించి, ఆమెను వంశంవారందరితోపాటు అనుగ్రహాలోకనాలతో సంతోషపెట్టాడు. సుమాగధ ఆమె అత్తమామలు మొదలయిన బంధువులు, ఇతర పౌరజనులు, శాస్త ఉపదేశంతో శుద్ధహృదయులై వెంటనే సత్యదర్శనం పొందారు.

సుమాగధ కుశలానుబంధమైన పుణ్యాన్ని, విపుల ప్రభావాన్ని చూచిన భిక్షువులు కుతూహలంతో ఆమె పూర్వజన్మ వృత్తాంతం ప్రశ్నించారు. ఆ ప్రశ్న విని భగవానుడు దంతకాంతులతో దిక్కాంతల ముఖాలకు ప్రకాశం కలిగిస్తూ ఇలా అన్నాడు:

పూర్వం వారాణసిలో కృకి అనే సుందరుడైన రాజుకు కాంచనమాల **అనే కన్యక జనించింది.** ఆమె పుట్టుకతోనే రొమ్ములపై కాంచనమాల భాసించేది. ఆమె తన ఐదువందలమంది **సఖులతో సహా భక్తితో** కాశ్యపుడనే శాస్తను పూజించేది. ఒకమారు కృకి ఒక వికారస్వప్నం చూచి, భయసంశయ **సంభ్రాంతుడై స్వప్న** ఫలకోవిదులను ఫలమేమిటని అడిగాడు. ఆ నిమిత్తజ్ఞులు (జ్యోతిర్వేత్తలు) రాజసుతపై ఉన్న **ద్వేషంతో** "రాజన్! నీకు అత్యంత ప్రియమైనవారి హృదయంతో హోమం చేస్తే నీకు కల్యాణం కలుగుతుంది" అని



అన్నారు. వారి క్రూరవాక్కులను రాజు లెక్కపెట్టక, కుమార్తెమాటతో భగవానుడైన కాశ్యపుని వద్దకు వెళ్ళి, "భగవన్! నేనొక వికారమైన స్వప్నం చూచాను. దాని ఫలం సర్వజ్ఞుడైన నీవు చెప్పాలి. గవాక్షం నుంచి బయటికి వెళ్ళుతూ తోక యిరుక్కున్న ఏనుగును చూచాను. దప్పిగొన్నవానివెంట బావి పరుగెత్తి పోవడం చూచాను. ప్రస్థం పేలపిండికి ప్రస్థం ముత్యాలు కొలిచి యిచ్చి సంతృప్తిపడడం చూచాను. చెడ్డకర్రలు, చందనకాష్ఠం సమానంగా పరిగణించడం చూచాను. ఏనుగుగున్న మహాగజాన్ని యుద్ధానికి పిలవడం, అమేధ్యం పూనుకున్న కోతి ఇతరులకు ఆ అమేధ్యం పూస్తు ఎగర్లాడడం చూచాను. చాపల్యంతో మిడిసిపడే కోతిని పెద్ద రాజ్యానికి పట్టాభిషేకం చేసినట్టు, పద్దెనిమిదిమంది పురుషులు ఒక గుడ్డను పట్టుకొని లాగినా చినగకుండాపోవడం, దొంగలు కొట్టిన రమ్యపుష్పఫలారామాన్ని, ద్వేషోపహాస కలహాసక్తులైన ప్రజలను చూచాను. ఈ స్వప్నాద్భుతాలకు ఇతరులు ఘోరమైన ఫలాలు చెబుతున్నారు" అని ప్రశ్నించాడు.

రాజు మాటలు కాశ్యపభగవానుడు విని ఇలా సమాధానం చెప్పాడు: "జనులు శతాయుష్కులయినప్పుడు శాంతుడు, అమృతాంబోధి అయిన శాక్యముని అవతరిస్తాడు. నీవు చూచిన ఏనుగు ఫలమిది. ఆ శాక్యముని పశ్చిమ వయస్సులో అతని శ్రావకులు కలి సంశ్రయం వల్ల శీలగుణాచారాలు వదలి కల్లోల మనస్కులవుతారు. అపక్వమైన అల్పవివేకం గల గృహపతుల బలంతో ఆ శ్రావకులు వారి సేవ చేస్తూనే ఉపదేశం చేస్తారు. అర్థిభావంతో అర్థింపదగినవారే సేవకోసం పరుగెత్తుతారు గనుక దప్పిగొన్నవాడివెంట బావి పరుగెత్తడం నీవు చూచావు. వారు సమ్మోహోపహతులై, లోభాంధులై బోధ్యంగమనే ప్రస్థం ముత్యాలను ప్రస్థం పేలపిండికి అమ్ముతారు. అలాటివారు మౌర్ఖ్యంతో విశేషం ఎరుగలేక తీర్థికుల వాక్యాలనే సామాన్య దారువులతో బుద్ధభాషితాలనే చందన కాష్ఠాలను సమానంగా చూస్తారు. ఒక్కొక్కప్పుడు వినీతుడు ఉత్తముడు అయిన భిక్షుకుంజరాన్ని గున్న ఏనుగువంటి పిల్లసన్యాసి స్పర్ధతో ధిక్కరిస్తాడు. చాపలమనే అనుచితభావం గల కోతులవంటి భిక్షువులు సుశీలులైన ఇతర భిక్షువులకు కూడ తమ దోషం అంటేట్టు చేస్తారు. కోతికిలా షండునికి రాజ్యాభిషేకం జరుగుతుంది. సంబుద్ధుని శాసనమనే వస్త్రం ఎవరు ఎంత లాగినా చినగదు. సంఘద్రవ్య ఫలారామాలలో దొంగతనాలు జరుగుతాయి. భిక్షువులు తమలో తాము కలహిస్తూ అపవాదం పొందుతారు. నీ స్వప్న పరిణామ ఫలాలు ప్రపంచంలో ఇవి."

కాశ్యపుని మాటలు విని రాజు చాల ఆశ్చర్యపడ్డాడు. పిదప కాశ్యపుడు మహీపతికి ధర్మోపదేశం చేసి, కాంచనమాలకు కుశలమైన అర్హత్వం ప్రసాదించాడు. ఈ కాంచనమాల మరొక జన్మలో స్తూపానికి నారంగమాలతో పూజ చేసింది. ఆ సుకృతంతో పుట్టుకతోనే కాంచనమాలతో పుట్టింది. ఆ మహాపుణ్య ప్రభావంతో ఇప్పుడు జనసమూహానికి కుశలసేతువు అయింది.

భగవానుడు సుమాగధ పూర్వవృత్తాంతం ఈ విధంగా చెప్పి, తన కాంతులతో దిక్కులను నింపుతూ, భిక్షువులతో సహా జేతవనానికి బయలుదేరాడు.

మానవులు కొడుకులు పుడితే కులమంతా పావనమైపోతుందని భావించడం వట్టి మిథ్య. కొడుకు గుణవంతుడు కాకపోతే, కులమంతా వికలం కాదా? గుణవంతురాలయిన కుమార్తె పుడితే, రెండుకులాలకు నావగా సంసార మహాసముద్రాన్ని దాటిస్తుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో సుమాగధావదానమనే తొంభై మూడవ పల్లవం

# 94. యశోమిత్రావదానం

భగ్నభాగ్యులయినవారు కొందరు తరలతర తరంగాలతో పొంగులువారే జలం సమీపంలో ఉన్నప్పటికీ దప్పితో తపించిపోతారు. పురాగత పుణ్యవంతులు కొందరు ఖరతరమైన మరుభూమిలోను సహజ సలిల ధారలతో తీవ్రమైన దప్పి తీర్చుకుంటారు.

శ్రావస్తీ నగరంలో పుణ్యమిత్రుడనే గృహపతికి యశోమిత్రుడనే కుమారుడుండేవాడు. వాడు యశస్వులకు ప్రతిరూపమైనట్టివాడు. అమృతకిరణుని వంటి అతడు పుట్టిన క్షణంలోనే అతని పుణ్యావాక్కులతో అనావృష్టి వల్ల పుట్టిన విషమ విపత్తు తొలగింది. అతడు యువకుడుగా ఉన్నప్పుడే జితేంద్రియుడు, భవభోగపరాఙ్ముఖుడు అయి కుశలాభిలాషతో జేతవనవిహారి అయిన జినదేవుని సేవించాడు. శాస్త ధర్మోపదేశంతో ప్రవ్రజ్య స్వీకరించి అర్హత్వం పొంది, కాంచనమంటేను, మట్టిబెడ్డన్నా ఒకేభావం కలవాడై, ప్రియమన్నది అప్రియమన్నది లేనివాడయ్యాడు. అతని దంతాలనుంచి కరిగించిన స్ఫటికంవలె నిర్మలమూ, సరసమూ అయిన నీరు స్రవించేది. దానితో అతనికి దప్పి అనేది లేకపోయింది.

ఈ వింతకు భిక్షువులందరూ ఆశ్చర్యపడి కుతూహలంతో అతనికి దప్పి లేకపోవడానికి కారణమేమిటని ఒకమారు భగవానుని ప్రశ్నించారు. భగవానుడు ఇలా సెలవిచ్చాడు.

పూర్వం కాశీనగరంలో కాశ్యపుని వద్ద సుందరకుడనే శ్రేష్ఠిపుత్రుడు ప్రవ్రజ్య స్వీకరించాడు. వాడు ఒకమారు వేసవిలో దప్పిగొని శరీరమంతా బడలిపోయి, ఎక్కడా నీరు దొరకక నీరుకోసం చాతకపక్షిలాగ అంగలార్చాడు. అతని దురదృష్టం వల్ల సంఘంలోని నీటిపాత్రలన్నీ శూన్యమయాయి. బావులన్నీ వట్టిపోయాయి. నదులు ఎండిపోయాయి. అతడు దప్పితో ప్రలపిస్తూ, మరణాసన్నుడయాడు. అది చూచి సంఘంలోని ఉపాధ్యాయుడు తన జలపాత్రతో నీరు ఇవ్వబోగా, నీటిధార కనిపించలేదు. అప్పుడు సుందరకుడు శాస్త అయిన కాశ్యపుని ఆజ్ఞతో ఆ జలపాత్రను అందరి వద్దకు తీసుకొని వెళ్ళాడు. శాస్త ప్రభావం వల్ల అది అక్షయ జలపూరితమయింది. ఎందరు తాగినా తరగలేదు. శ్రేయోనిధి అయిన కాశ్యపుడు కరుణతో తను కూడా ప్రసన్న పాణిపద్మంతో పిడిసిలి పట్టి సుందరకుడు పోసిన నీటిని స్వీకరించాడు. జలపాత్ర అక్షయం కావడం చూచి జనసంఘం సత్యదర్శనం పొందింది. కాశ్యపునికి నీరుపోసిన పుణ్య ప్రణిధానంతో సుందరకుడు కుశలం పొంది, మరుజన్మలో యశోమిత్రుడుగా జన్మించి, దంతాలతో పుట్టిన అమృత జలధారతో శాంతి పొందుతున్నాడు. యశోమిత్రుని జననోదంతం జినుడు చెప్పగా భిక్షువులు ఆదరంతో విని, ఆశ్చర్యం పొందారు.

జినసేవ సుఖమనే విమలసలిల కలితమైన శమమనే హిమకల్లోలినిని పొందించి, సంసారమనే మరుభూమి పరిభ్రమణం వల కలిగే తృష్ణాతాపాన్ని పోగొడుతుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో యశోమిత్రావదానమనే తొంభయి నాల్గో పల్లవం

# 95. వ్యాఘ్ర్యవదానం

బుద్ధుడనే సహస్రరశ్మి పాపవిపులమైన తిమిరపుంజాన్ని తొలగించి, వెంటనే కరుణాకిరణాలు ప్రసారించి, దోషావహుడై, పరితాపహరుడై సన్మార్గాన్ని చూపుతాడు.

పూర్వం తథాగతుడు రాజగృహనగరంలోని కలందక నివాపమనే వేణువనంలో విహరిస్తున్నప్పుడు, అర్థదత్తుడనే సార్థవాహునికి నిశిత అనే భార్యకు ఇద్దరు కుమారులు - కవలలు పుట్టారు. వారి పేర్లు సంకువు, సంధిదత్తుడు అని. తండ్రి మరణించి ధనం, పరిజనం సన్నగిల్లిపోగా, తల్లే వారిని ఎంతో కష్టపడి పెంచి పెద్దవారిని చేసింది. వారిద్దరూ తల్లి మాటతో నెమ్మదిగా ఇరుగుపొరుగువారి యిండ్లలోని చిల్లర మల్లర, చిన్నచిన్న పాత్రలు దొంగిలించడం నేర్చుకొన్నారు. బాలులు తల్లిదండ్రుల నియమంతోనే యోగ్యులవుతారు. వారి ఉపేక్ష వల్లనే అవినయమనే అఖాతంలో పడుతారు. పెద్దలయిన స్వజనుల స్వభావాన్ని బట్టే బాలురు తిలలవలె నలిగి పర స్వభావాన్ని పొందుతారు.

వారిద్దరూ వయసు వచ్చినపిదప ప్రౌఢచోరులై ఉల్లంఘ సంధిచ్ఛేదాదులతో పౌరుల ఇండ్లలోపడి దొంగలించసాగారు. అజాతశత్రు మహారాజు చారుల వల్ల వారి పనులు తెలుసుకొని, తల్లితోపాటు వారిని వధించడానికి ఉత్తరువు చేశాడు. పరధనంతో భుజించడం, పరద్రవ్యంతో తాగడం , సౌఖ్యాశతో విషమమార్గం తొక్కడం - ఇవన్నీ అవిచార రమణీయ సుఖాలు. వీటి పరిణామం దారుణమైన ప్రాణావసానమే. విషయభోగమనే పానమదాకులరకు చౌర్యదాహవధాది దుష్కృత్యాలతో లభించే ధనం వల్ల కలిగే రాగం- అంతంలో కరపాదాలను నరికివేయడం, శూలాధిరోహణం వంటి శిక్షల వల్ల స్రవించే రక్తధారల మూలంగా వెలుపలికి పోతుంది.

రాజసేవకులు వారిని వధ్యభూమికి నలుపు ఎరుపు గుడ్డలు కట్టి వధ్యమాలలు వేసి, జనం తండోపతండాలుగా మూగి చూస్తుండగా పిలుచుకొని వెళ్ళారు. దయావంతుడైన సర్వజ్ఞుడు ఈ సంగతి తెలిసి, వధ్యభూమికి శిష్యసహితుడై వచ్చి, తన ప్రసాదానుగ్రహంతో వారిని బంధవిముక్తులను చేశాడు. పిదప సర్వజ్ఞుని ఆజ్ఞతో అజాతశత్రు మహారాజు వారిని వదిలివెట్టాడు. వారు ముక్తపాతకులై ప్రవ్రజ్య స్వీకరించి, అర్హత్వం పొందారు. వారి తల్లి కూడ జ్ఞానవిభవోజ్జ్వల అయింది.

వారి ఉన్నతికి కారణమేమని భిక్షువులు కుతూహలంతో ప్రశ్నించదలచడం గ్రహించి సుగతుడు ఈ విధంగా అన్నాడు: "పూర్వ జన్మలోను వీరిని నేనే రక్షించాను. వీరి తల్లి అప్పుడు ఘోరరూప అయిన వ్యాఘ్రి. అప్పుడు నేను ప్రాణిమాత్రదయాళువయిన కరుణరేఖుడనే క్షితిపాలసుతుడైన బోధిసత్త్వుణ్ణి. వీరిద్దరూ పసికూనలుగా ఉన్నప్పుడు ఆకలితో నకనకలాడే వీరి తల్లి (వ్యాఘ్రి) వీరినే తినడానికి

పూనుకుంది. నేను నా శరీరం అర్పించి, వ్యాఘ్రిని వారించాను. ఆ కర్మశేషం వల్ల ఈ జన్మలో చోరులయి నా రక్షణ పొందారు. ఆ వ్యాఘ్రి వీరి తల్లి." భూతభావనుడైన కరుణాసింధువు వారి పూర్వజన్మ వృత్తాంతం ఈ విధంగా తెలిపి, భిక్షుసంఘాలతో సహా జేతవనానికి వెళ్ళిపోయాడు.

సత్పురుషుల ఇష్టమైన దృష్టి అమృత రసవృష్టి వంటిది; అనిష్టాలను పోగొట్టేది. పతితుడైనవానిని కూడ పుణ్యోన్నతునిగాను, శ్లాఘ్యునిగాను చేస్తుంది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో వ్యాఘ్ర్యవదానమనే తొంభయి అయిదవ పల్లవం

## 96. హస్త్యవదానం

శశాంకునికి ఆహ్లాదగుణం, రవికి ప్రకాశం, అగ్నికి తాపం, పవనునికి వేగం, కరుణారతులైన మహానుభావులకు పరోపకారం సహజ స్వభావం గదా!

పూర్వం అవంతిదేశంలో కేళిరసికుడైన ఉదయన మహారాజు ఒకప్పుడు ప్రియురాండ్రతో ఒక వనంలో విహరించాడు. అతని కువలయేక్షణలయిన కాంతలు పూవులు కోస్తూ ఉండగా, యాదృచ్ఛికంగా వచ్చిన ఐదువందలమంది మునులు చూచారు. వారు తన ప్రియురాండ్రను కన్నెత్తి చూచారన్న కోపంతో రాజు వారిని చేతులు కాళ్ళు నరికించి, ఆ రక్తంలోనే పొర్లాడించారు. వారు మర్మచ్ఛేద వ్యథతో ఆర్తనాదాలు చేస్తుండగా విని, బుద్ధభగవానుడు కరుణాస్నిగ్ధదృష్టితో చూచాడు. అమృతవృష్టివంటి ఆ దృష్టి సోకినంతనే వారు బాధ తొలగి, ప్రాణాలు కుదుటబడి, కాలుచేతులు మరల అతుకుకొని, లేచి నిలుచుని, భగవానుని శరణు పొందారు. ప్రసన్నులైన ఆ మునులకు భగవానుడు ధర్మోపదేశం చేశాడు; వారు అనాగామిఫలం పొందారు.

అది చూచి భిక్షువులు ఆశ్చర్యంతో భగవానుని కారణమడుగగా ఆయన ఇలా అన్నాడు: "వీరిని నేను పూర్వజన్మలోను దయతో ఉద్ధరించాను. పూర్వం వారాణసిలో బ్రహ్మదత్తమహారాజు తప్పు చేసిన తన ఐదువందలమంది మంత్రులను వెళ్ళగొట్టాడు. వారు రాజభయంతో ఎడారి దారి పట్టుకొని వెళ్ళుతూ, ఎండకాలంలో నీరు, నీడ లేని ప్రదేశం చేరి చాల దప్పితో పడిపోయారు. భద్రమనే మహాగజ రూపంలో ఉన్న బోధిసత్త్వుడు వారిని చూచి వారి ప్రలాపాలకు కరిగిపోయి, వ్యథపడి, తన పొడుగాటి తొండంతో దూరం నుంచి సలిలం తెచ్చి, దప్పి తీర్చి కందమూల ఫలాలు ఇచ్చి ఆకలి పోగొట్టి వీపుపై ఎక్కించుకొని మరొకచోటు చేర్చి ప్రాణాలు దక్కించాడు. వారు తమ మహాశ్రమంతా తీరి విశ్రాంతి పొందారు. కొంతకాలానికి ఆ భద్రగజం శరీర త్యాగం చేసింది. వారు దానికి శరీరసంస్కారం చేసి, దేవోచితంగా పూజించారు. నేనే ఆ కుంజరం. నాతో రక్షితులైన ఆ మంత్రులే మునులు. అప్పుడు మంత్రుల ఇడుమ గడిపినట్టే ఇప్పుడు మునులను అంగవైకల్య హింస నుంచి రక్షించాను." సర్వసత్త్వ సంతారణవ్రతుడైన భగవానుడు ఈ విధంగా చెప్పి మునిగణం పూజిస్తుండగా, తన తపోవనానికి వెళ్ళాడు.

శాస్త కరుణావృత వాహిని జనని వంటిది. అఖిల సుఖకుశలాలకు దూతి; సంసారమనే మరుభూమి సంతాపహరణంలో శీతలచ్ఛాయ వంటిది.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో హస్త్యవదానమనే తొంభయి ఆరవ పల్లవం

# 97. కచ్ఛపావదానం

విద్వేషదోష విషదూషిత మానసులు సాధువులను బాధించడంలో చేసే నిశితప్రయత్నం సాధువుల ఉజ్జ్వలగుణాలను అనుకరించడంలో చేసేటట్టయితే, ఈ సంసారంలో భూరిపరాభవం పొందేవారెవరు?

జినదేవుడు రాజగృహ నగర సమీపంలోని వేణువనంలో విహరిస్తున్నప్పుడు దేవదత్తుని ప్రేరణతో ఐదువందలమంది తాపసులు, క్రోధంతో సంయమం కోల్పోయి, బొమముడిపాటుతో భయంకరంగా కనిపిస్తూ, దేవదత్తుడిచ్చిన వివిధాయుధాలతో భగవానునిపైకి వచ్చి అస్త్రశస్త్రవృష్టి కురిపించారు. అవన్నీ భగవానుని దేహంలో కమలోత్పలరాశిగా పడ్డాయి. నిశితమైన శస్త్రాలు కూడ మార్దవం పొందుతాయి గాని, విద్వేషవిషదిగ్ధమైన పాపుల చిత్తాలు మాత్రం మార్దవం పొందవు. శాస్తకు ఎలాటి దెబ్బా తగులకుండా అతని చుట్టూ, నభోనీలమైన మణిమయకూటాగారం శరీరాచ్ఛాదనంగా వెలిసింది. కాని అతని దృష్టికి అదేమీ అడ్డు తగలలేదు. తమ అస్త్రశస్త్రాలేవీ శాస్తకు బాధ కలుగజేయకపోవడం చూచి, అలసిపోయిన తాపసులు సిగ్గుతో ముఖం వంచుకొని, క్షమాసింధువు, ప్రసన్నమయేవాడు అయిన అతని కాళ్ళమీద పడ్డారు. భగవానుడు కూడ కుమారులను చూచినట్టుగా వారిని వాత్సల్యంతో చూచి, వారు అవమానం చేసినా, కోపపడక ధర్మోపదేశం చేశాడు. సంక్షోభం, భ్రాంతీ లేని శమసుఖం అనుభవిస్తూ, పుణ్యక్షమాసలిలాలతో నిర్మలశీతలాలయిన మహాత్ముల మనస్సులు శత్రువుల దుష్కృత్యాలతోను, మన్యురజస్సుతోను కలుషాలు కావు. ప్రవ్రజ్యతో పరిశుద్ధమానసులయిన వారంతా శాస్త ధర్మోపదేశం వల్ల సర్వాశ్రమ నిర్ముక్తమయిన అర్హత్వం పొందారు.

అంతలో భిక్షువులు వచ్చి జరిగిన సమాచారం విని, ఏమిటిది అని ఆశ్చర్యంతో ప్రశ్నించారు. దానికి జినదేవుడు ఇలా అన్నాడు:

"వీరందరూ నాకు పూర్వజన్మలోను చాల అపకారం చేశారు. నేను మాత్రం నిర్వికారుణ్ణయి, ఎంతో అనుగ్రహంతో చూచాను. ఒక జన్మలో వీరంతా కాశీవాసులైన వ్యాపారులు. అంతా కలిసి సముద్రయాత్రకు వెళ్ళారు. సముద్రంలో ఓడ పగిలిపోగా, జీవిత సంశయం ఏర్పడింది. అప్పుడు నేను తాబేలుగా జన్మించాను. వారి బాధ చూచి కరుణించి, వీపుపై ఎక్కించుకొని సముద్రం దాటించి గట్టు చేర్చాను. వారు జీవితం కాపాడుకొని గట్టున విశ్రాంతి పొందారు.

"వారిని దాటించడం వల్ల నేను అలసిపోయి గట్టున క్షణం కన్ను మూశాను. వారు నా మాంసం తిందామనే ఆశతో నన్ను చంపడానికి పూనుకున్నారు. నాపై రాళ్ళు కురిపించారు. నేను నాదృఢమయిన కపాటంలోకి(చిప్పలోకి) ముడుచుకొన్నందువల్ల నా దేహానికేమీ గాయం తగులలేదు. కాని, వారి ఆకలి చూచి మనసు కరిగి, స్వయంగా నా దేహం అర్పించి కృతకృత్యుణ్ణయాను. ఆ వర్తకులే నేను కరుణతో



కుశలం కలిగించడం వల్ల ఈ జన్మలో తాపసులయారు. అప్పుడు వారు కాశ్యపమహాముని శాసనంతో ప్రవ్రజ్య స్వీకరించి, ఆ పుణ్యంతో ఇప్పుడు ఫలం అనుభవిస్తున్నారు."

తథాగతుడు చెప్పిన కథను భిక్షువులు విని, భూదేవివంటి అతని క్షమాగుణాన్ని ప్రశంసించారు.

నిర్మలశీలమనే శీతలజలంకల సత్త్వగుణమనే ఆశయంతో ఆశ్వాసించేది, వైరమనే రజస్సును తుడిచివేసే నదివంటిది అయిన క్షాంతి మనస్సులో ప్రవహిస్తున్నవారు దుర్వారశత్రువుల కోపావమానాగ్నిజ్వాలావలివంటి వికారాన్ని పొందరు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కచ్ఛపావదానమనే తొంభై ఏడవ పల్లవం

# 98. తాపసావదానం

దినానాయకుని కిరణాలు తుల్యోపకార మహిమ గలవి. కులపర్వతాల అత్యున్నత శిఖరాల మీద, అశుభ్రమైన మురికిగుంటల మీద సర్వసాధారణంగా పడుతాయి.

జినదేవుడు పూర్వం రాజగృహనగర పరిసరాలలోని వేణువనంలో విహరిస్తుండగా, దుర్భిక్షం వచ్చింది. అప్పుడు ఆకలితో నకనకలాడే మల్లజాతి వారందరూ ఆయనను శరణు పొందారు. కరుణాకల్ప పాదపమైన అతడు వారికి అభిమతమైన ఆహారం పెట్టి, దుర్దశా శాంతికోసం ధర్మోపదేశం చేశాడు. వారు భగవానుని అనుగ్రహం వల్ల కుశలం పొంది, అర్హత్పదం పొంది, జగత్పూజ్యులయారు.

నీచులైన మల్లజాతివారు అలాంటి అభ్యున్నతి పొందినందుకు నిత్యం జాతులపై అపవాదులు వేసే పురవాసులు మత్సరగ్రస్తులయారు. "ఆహా! మ్లేచ్ఛులయిన, అనర్హులయిన మల్లులకు శుద్ధమైన ఉపదేశం, అర్హత్పదం ప్రసాదించాడు" అని వారు అనడం ప్రారంభించారు. అల్పులయినవారికి అనల్పమైన విభవం వస్తే, కొత్తదనాన్ని సహించనివారు వారి నీచ జన్మవిషయాలు ప్రచారం చేసి సిగ్గు కలిగించేట్టుగా ప్రవర్తిస్తారు. మల్లులు జినదేవుని ఆజ్ఞతో గగనమార్గంలో కురుద్వీపానికి వెళ్ళి వస్తూ ప్రభావం చూపడం వల్ల నరపతి సంతోషించి, గౌరవించాడు. క్రమంగా పౌరులు కూడ గుణవంతులకు కూడ గౌరవించదగిన మల్లుల సుగుణాలు తెలుసుకొని సమ్మానించారు. వారున్నూ భిక్షువులకు అగ్రగణ్యులయారు.

వారి ప్రభావానికి విస్మితులయిన భిక్షువులు వారి పుణ్యకారణం ప్రశ్నించగా, భగవానుడు పూర్వగాథ ఇలా తెలిపాడు:

"నేను పూర్వం ఒక జన్మలో కాశిదేశంలోని తపోవనంలో కుశలశీలుడనే పంచాభిజ్ఞుడయిన తాపసుడుగా పుట్టాను. అక్కడున్న కోటమల్లులు నావల్ల కల్యాణమార్గం తెలుసుకొని, పంచాభిజ్ఞులయిన మునులయారు. ఆ పుణ్యావాసనాభ్యాసప్రీతితో ఈ జన్మలోను ఆ మల్లులే సంసారక్లేశం నుంచి తరింపచేయబడ్డారు. వీరు అంతకు ముందుజన్మలో శాస్త్ర అయిన కాశ్యపుని సన్నిధిలో ప్రవ్రజ్య స్వీకరించారు. కాని పరుషభాషణులు కావడం వల్ల ఇప్పుడు మ్లేచ్ఛమల్లులుగా పుట్టారు."

సర్వదర్శి అయిన భగవానుడు మల్లుల ప్రాగ్జన్మ వృత్తాంతం చెప్పగా భిక్షువులు ఆనందించారు.

కమలాలు పంకంలో పుట్టి తిమిరభారంలో ముకుళించుకుపోయేవి అయినా గ్రహాధిపతి ఆలోకానుగ్రహంతో విబుధశేఖరాలు కాగల అర్హత్వం పొందుతాయి. అట్లే కుజనులు కూడ పంకం వంటి అపవిత్ర కులంలో పుట్టి, అజ్ఞాన తిమిరభరంతో కన్నులుగప్పి ఉన్నా, గ్రహాధిపతివంటి మహాత్ముని కటాక్షానుగ్రహం చేతనే విబుధులకు కూడ శేఖరమైన అర్హత్వం- అర్హత్పదవి - పొందుతారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో తాపసావదానమనే తొంభై ఎనిమిదవ పల్లవం

# 99. పద్మకావదానం

సర్వలోక పరలోక బాంధవుడు, సుధానిధి అయిన బుద్ధభగవానుడే ప్రాణుల కాయిక, మానసిక, సాంసారిక మహాభయాలను హరిస్తాడు.

పూర్వం శ్రావస్తీ నగరంలో పౌరులు, భిక్షుసంఘమూ రోగగ్రస్తులయినప్పుడు, జినభగవానుడు వారిని ఆలోకనామృతంతోనే స్వస్థులను చేశాడు. తన వాత్సల్యానికి ఆశ్చర్యపడిన భిక్షుసంఘంతో ఆయన ఇలా అన్నాడు:

"పూర్వజన్మలోను నేను మిమ్మల్ని స్వస్థులను చేశాను. పూర్వం నేను వారాణసిలో పద్మకుడనే రాజుగా పుట్టాను. అప్పుడు ప్రజలను తండ్రిలాగ చూస్తూ అందరి కష్టాలను పోగొట్టడానికి ఉద్యమించే వాణ్ణి. ఒకమారు దైవదోషంతోను, దేశకాలాల వైషమ్యం వల్లను పౌరులందరికీ దుస్సహమైన వ్యాధి పుట్టింది. వైద్యులు, మందులు తక్కిన సంభారాలు సమకూర్చినా, శాంతి స్వస్తికాది ప్రయోగాలు మొదలయినవాటివల్ల వారికి వ్యాధి తగ్గలేదు. వారి రోగనివృత్తికి రోహితమనే మహామత్స్యం కావాలని లక్షణజ్ఞులైన వైద్యులు చెప్పారు. దానికోసం సెంబడివారు ఎంతో ప్రయత్నించినా, ప్రయోజనం లేకపోయింది. ఆ మహామత్స్యం దొరకక జనులకు ప్రాణసంశయం కలుగగా, వారి ప్రలాపాలు వినలేక మనసు కరిగి 'సర్వరోగులకు పథ్యార్హమైన రోహితమత్స్యంగా మారాలి' అనే ప్రణిధాన బలంచేత వెంటనే నేను ప్రాసాదం నుంచి వారాణదీజలాలలో రోహిత వారాణదిలో పడిపోయాను. ఆ ప్రణిధాన బలంతో క్షణంలో వారాణదీజలాలలో రోహిత మహామత్స్యమయాను. రోగోపయుక్తమైన దాని మాంసంతో ఆ పురవాసులందరూ వెంటనే అమృతంతో నిండినట్టు స్వాస్థ్యం పొందారు. ఆ భిక్షువులే మీరు. ఇప్పుడు కూడా రోగం నుంచి మిమ్మల్ని ఉద్ధరించాను. ప్రాణుల రోగాలను పోగొట్టడం వల్ల నేను సదా నిరామయుడుగా ఉంటాను."

సంసార వ్యాధి వైద్యుడైన సుగతుని భాషితం విని స్వస్థులైన భిక్షువులు హర్షోత్సవం పొందారు.

పరహితంలోనే అవిరతమైన మనస్సుగలవారి సమత్వవికాసం అపూర్వమైంది. తమ దేహాన్ని కూడా గడ్డిపోచవలె త్యాగం చేయడం వారికి విలాసం.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పద్మకావదానమనే తొంభై తొమ్మిదవ పల్లవం

# 100. పుణ్యప్రభాసావదానం

అపూర్వ పుణ్యాలతో అమృతానికి అగ్రదూతి అయిన అనుత్తరబోధివాంఛ చంద్రలేఖవలె ఉదయించే ఉత్తమాశయుడైన సత్త్వోదధి వందనీయుడు.

జినదేవుడు జేతవనంలో విహరిస్తున్నప్పుడు ఒకమారు కోసలేంద్రుడయిన ప్రసేనజిత్తు వచ్చి సంభాషిస్తూ కుతూహలంతో "భగవన్, నీకు ఏ పూర్వజన్మలో సమ్యక్సంబోధి వాసన కలిగిందో చెప్పు" అని కోరాడు. భగవానుడు మందహాసంతో శుచి అయిన మానస సరోవరపు హంసపంక్తి వంటి దశనకాంతి వెలార్చుతూ ఈ విధంగా సమాధానం చెప్పాడు:

పూర్వం నేను ప్రభావతి అనే పట్టణంలో భూభుజులకు నిధి అయిన ప్రభాసుడనే మహారాజుగా జన్మించినప్పుడు సమ్యక్సంబోధి కలిగింది. పిడిఏనుగు ప్రేమపాశంతో కుంజరం అరణ్యంలో ప్రవేశించి, కొంత కాలానికి మరల తిరిగి వచ్చింది. అప్పుడు హస్తిమహామాత్రుడైన సంయాతుడు ప్రభాసమహారాజును చూచి, "క్షితిపతీ! నా శిక్ష వల్ల ఈ కుంజరం తిరిగి వచ్చింది. ఇది రాగాకృష్టమై శరీరం వశం తప్పి, మనోవికారం పొందిందేగాని, సాధారణంగా చాల నెమ్మది అయినదే. మానవులకు మన్మథవికారం మతిని పోగొట్టే ఉన్మాదం వంటిది. సూర్యుడుగాని, అగ్గిగాని లేకనే పుట్టే మంట. శాపమనేదే లేక కలిగే మహానరకం. రాత్రి కలుగకనే ముంచుకొని వచ్చే అంధకారం. మందు మాకు, పాము తేలు లేని విషం. అసహ్యమైన మత్తు, తగ్గు అనేది లేకనే పడిపోవడం వంటిది."

సంయాతుడు ఈ విధంగా మనవి చేయగా, రాజు "ఈ సంసారంలో విషయ నిస్పృహమైన రాగమేదైనా ఉందా?" అని ప్రశ్నించాడు. "ఈ జగత్తులో నిస్సంసారులు, వీతరాగులు అయినవారు తథాగతులు. సత్పాత్రులు (ఉత్తములు, మంచి పాత్ర-ప్రమిద - కలవి) గుణవంతులు (గుణాలు గలవారు, వత్తిగలవి), సర్వజీవులకు ఉపకరించేవారు అయిన బుద్ధప్రదీపాల కాంతితో ఈ విశ్వం ప్రకాశిస్తున్నది" అని సంయాతుడు చెప్పాడు. చిత్తప్రసాదంగల భూభర్త హృదయంలో ఆ మాటల వల్ల వెంటనే, సంబోధివాసన కలిగింది. అతడు పూర్వపుణ్య ప్రభావంతో కుశలోదయం కలిగి సమ్యక్సంబోధి లాభంకోసం ప్రణిధానం చేశాడు.

అంతకుముందు జన్మలో అతడు కులాలుడనే గృహపతిగా పుట్టాడు. అతడు జినుని గుడోదనంతో ఆరాధించాడు. ఆ పుణ్యప్రణిధానంతో అతనికి ప్రభాసజన్మలో బోధి అంకురించి, ఇప్పుడు నా ఈ జన్మలో నా హృదయంలో ఫలించింది.

తనకు మొదటిసారి ఉదయించిన శుద్ధబోధిని తథాగతుడు చెప్పగా కోశలేంద్రుడు తన కర్ణద్వయమనే పుడిసిళ్ళతో అమృతం వలె పానం చేసి, రాజధానికి వెళ్ళిపోయాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో పుణ్యప్రభాసావదానమనే నూరవ పల్లవం

# 101. శ్యామాకావదానం

నిరంతరం ప్రకాశం కలిగించే కల్పం సర్వజన ప్రియమైనది. పగలూ పూజ్యమైనదే. ప్రభాతకాంతి అనే పగటితల్లీ ప్రశంసనీయురాలే. పగటికి తండ్రి అయిన చండభానుని చెప్పనక్కర లేదు. అలాటివాని పాదోపసేవతో (పాదాలసేవ, కిరణాలను పొందడం) ధైర్యం సంపాదించిన పగటినిగాని, దాని తర్వాత కలిగే మరొక పగటినిగాని (దాని తమ్ముణిగాని) ఈ లోకంలోనో, పరలోకంలోనో చీకట్లు ముసిరాయని ఎవరైనా విన్నారా?

శుద్ధవరప్రకాశుడైన శుద్ధోదన క్షితీశుడు కీర్తిశేషుడు కాగా తథాగతుడు అతనికి శరీర పూజాది అంత్యక్రియలు జరిపి, భక్తితో స్తూపం కూడా నిర్మించాడు. తథాగతుడు అలోకసామాన్య పవిత్ర చరిత్రుడు; సామాన్యులకు అతని చరిత్ర అర్థమూ కాదు. ఆయన ఈలోక మార్గానికి యదృచ్ఛగా వచ్చినవాడు. అలాటివాడు తండ్రి అంత్యక్రియు జరుపడం చూచి సంశయవిస్మయాలు ముప్పిరిగొని భిక్షుగణం "జగద్గురూ, నీవు అనుత్తరానత్యయబోధి కలవాడివి. స్పృహను వదలి లోకవృత్తాన్ని ఊర్జితం చేసినవాడివి. అలాటి నీకు తండ్రి అనే ఈ వ్యవహారచర్య ఏమిటి?" అని వినయంతో ప్రశ్నించారు. వారికి ధర్మదర్శి అయిన భగవానుడు "ఈ కల్యాణ నికేతనమైన కాయానికి నిమిత్తభూతులయిన తలిదండ్రులు ధీమంతులయిన గురువులకూ గౌరవార్హులు. సమస్త పుణ్యాలకు ప్రథమావతారులయిన తలిదండ్రులను పూజించనివారి ధర్మం అధర్మమౌతుంది; జ్ఞానద్యుతి నల్లబడిపోతుంది. జన్మాంతరంలోను నేను గృహాభిలాష వదలినవాడైనా తపస్వులైన నా అంధ జననీజనకులను ఆదర గౌరవాలతో ఎప్పుడూ దేవతలవలె సపర్యతో ఆరాధించాను" అంటూ పూర్వ జన్మగాథ తెలిపాడు.

పూర్వం కాశీనగరంలో సుబంధువనే బ్రాహ్మణుడుండేవాడు. అతని భార్య పేరు గోమతి. ఆ దంపతులిద్దరూ వారిద్దరికీ శ్యామాకుడనే మతిమంతుడు కుమారుడుగా పుట్టి వంశాన్నే పవిత్రం చేశాడు. వృద్ధులు కావడం వల్ల చూపు తగ్గి, గృహభారమంతా కుమారునిపైన పెట్టి వనానికి వెళ్ళారు. మనీషులకు ముసలితనం ముంచుకువచ్చినా, వివేకం తారుణ్యం పొందుతుంది. ఆచారంలోను, గుణాలలోను అగ్రగణ్యుడనే గౌరవంతో రాజు శ్యామాకుణ్ణి తనకు పురోహితుడుగా ఉండవలసిందని ఎంతో కోరాడు. కాని, తలిదండ్రుల సపర్య చేయడంలోనే రసికుడైన శ్యామాకుడు కూడ వారు వెళ్ళిన తపోవనానికే వెళ్ళాడు. అక్కడ ఆ మనీషి కందమూల ఫలాలతో వారికి ప్రయత్నంతో పరిచర్య చేశాడు. వారు మనస్సు ప్రసన్నమై సంతోషం పొందారు.

ఒకమారు మృగయావినోది అయిన బ్రహ్మదత్తమహారాజు వేటకు వెళ్ళి మహిషద్విపాదులున్న అరణ్యంలో తిరుగుతూ ఆ తపోవన సమీపంలోని నదీతీరం చేరాడు. ఈలోగా నదీతీరంలో గుడగుడ శబ్దం అయింది. మృగాజినం కప్పుకొని, కుండను నీటిలో ముంచి తీసుకొంటున్న శ్యామాకునిపై రాజు మృగమనే భ్రాంతితో నారిని చెవివరకూ లాగి బాణం వదిలాడు. ఖలుని కొండెపు మాటవలె తీవ్రం,

మర్మస్పర్శి, అశుభకర్మకారి అయిన బాణం తగులగా శ్యామాకుడు తిరిగిపడి నెమ్మదిగా ఇలా అనుకున్నాడు: "నిష్కరుణుడైన ఎవరీ అనార్యుడు? నిష్కారణంగా పాపమనే విచారంలేక అకార్యం తలపెట్టి ఈ బాణం వదలి ప్రాణాలు పోగొడుతున్నాడు. వనంలో గుడ్డి తలిదండ్రుల శరీరధారణకు యష్టివంటి నన్ను బాణంతో కొడితే, వారిద్దరినీ కొట్టినట్టే. నిరాశులై వారిద్దరూ మరణిస్తారు. ఇలా ముగ్గురినీ ఒక్క దెబ్బతో చంపడానికి ఎవరీ ఉగ్రమైన ప్రయత్నం చేశాడు?"

ఈ విధంగా వ్యథతో మాటలు సరిగా పెగలక ప్రలపిస్తూ, పడిపోయిన నూనూగు మీసాల అతనిని చూస్తే, తుమ్మెదలు ముసరిన కొత్తగా చివురించిన గున్న మామిడిని కట్టెలు కొట్టేవాడు నిర్దయగా నరకి పడవేసినట్టు అనిపించింది. రొమ్ములో సువర్ణపుంఖంతో, రెక్కలతో ప్రాణాలను తోడివేస్తూ, సంతాపాగ్ని శిఖలాగ బాణం నాటుకుని ఉంది. ఈవిధంగా నదీతీరంలో విలవిల కొట్టుకొంటున్న శ్యామాకుణ్ణి చూచి, రాజు ధైర్యం కోల్పోయి, తిరిగివచ్చిన తన బాణం దెబ్బ తగిలినవాడులాగ చాల బాధపడుతూ ఇలా ప్రార్థించాడు: "ఓ మునీ, నీవు మృగాజినం కప్పుకొని ఉన్నావు. ప్రమాదవశాత్తు నేను నిన్ను బాణంతో కొట్టాను. ఇది కేవలం ప్రమాదదోషం. కనుక నన్ను శాపాగ్నితో కాల్చవద్దు."

వ్యథపడుతున్న రాజు మాటలు విని ఆ సత్త్వనిధి అయిన విప్రకుమారుడు తన తీవ్రబాధను నిబ్బరించుకొని, చెదరిన జటాకలాపం గాలికి ఎగురుతుండగా, స్వభావసిద్ధంగా మన్యురహితమైన మనస్సుతో ఇలా అన్నాడు: "రాజన్, నా తపశ్శాపభయం నీకు అవసరం లేదు. నాకు కోపమనేదే లేదు. నా తలిదండ్రులు గుడ్డివారు. ఇంతటి ప్రాణాపహారాపకారం చేసినా, వారు నిన్ను శపించాలని తలపెట్టరు. ప్రాణులు స్వయంగా చేసిన కర్మలే సుఖానికి, దుఃఖానికి, గుణోదయానికి, దోషానికి, శాపానికి, వధకు పరిణత కాలంలో తిరుగులేని కారణమవుతాయి. వాటిఫలం అసంభ్రాంతమైనది. కర్మ సర్వాత్మ. దాని వైచిత్ర్యం గోడలేని చిత్రరచన వంటిది. సన్మార్గంలో నెమ్మదిగా పోయేవాడు జారిపడి ఒళ్ళు విరుచుకుంటాడు. పల్లాలలో కొట్టుమిట్టాడుతున్నవాడు చెక్కుచెదరకుండా పరుగెత్తుతూ మంచిదారిని పడుతాడు. ఎంతో చతురుడు, ప్రయత్నకుశలుడు తన ప్రయత్నాలేవీ సాగక అలసిపోతాడు. ఏ ప్రయత్నం లేని సోమరికి సిరి అబ్బుతుంది. కర్మ సర్వాత్మస్వరూపి అంటే అతిశయోక్తి ఏముంది? ఈ నీటికడవ దప్పిగొన్న నా తలిదండ్రులకు జీవితం వంటిదే. ఓ దయామయా! నీవు సౌజన్యబుద్ధితో, దయార్ద్ర హృదయంతో ఈ ఉదకకుంభాన్ని వెంటనే వారికి అందివ్వు." ఈ మాటలు పలికి విప్రకుమారుడు కంఠగతప్రాణుడు కావడం వల్ల శ్వాస ఎక్కువయి మరేమీ మాట్లడలేక, మౌనంగా ఉండిపోయాడు.

పిదప రాజు చాల తాపం చెందుతూ, ఆ ఉదకఘటాన్ని ఆశ్రమానికి తీసుకొనివెళ్ళి, ఏకపుత్రులైన ఆ వృద్ధ తాపసులను చూచి, వారి వద్దకు వెళ్ళలేకపోయాడు. వారు అడుగుల చప్పుడు విని, ఎంతో ఉత్కంఠతో దగ్గరికి వచ్చి, "నాయనా" అని స్నేహంతో పలుకరించారు. రాజు "ఇక శాపం తప్పదు; నాశనం తప్పదు" అనుకుంటూనే "నేను మీ పుత్రుణ్ణి కాను. పాపభాగిని. సౌజన్యవల్లిని నరికి వేసిన కఠిన కుఠారం వంటివాడిని. మదించిన ఏనుగు మామిడి చెట్టును పడగొట్టినట్టు నేను మీ కుమారుణ్ణి కూల్చాను. నా బాణం గుచ్చుకొని మీ కుమారుడు ప్రాణావసన్నుడై నదీతటంలో పడి ఉన్నాడు. నా తలపై మీ ఉగ్రశాపం పెట్టండి. ఈ ఘోరపాపం కన్నా మీ ఉగ్రశాపమే చల్లనిది" అని అన్నాడు.



రాజు మాటలు విని వారు, బుద్ధి పిడుగుపాటుకు కాలిపోయినట్టుగా, దుస్సహ శోకభయంతో మోహగుహలో దూరినట్టు మూర్ఛపోయారు. రాజు వారికి శీతలోపచారం చేయగా ఎట్లో తేరుకుని, దీనంగా విలపిస్తూ, "భూపాలా, మమ్మల్ని మా కుమారుని వద్దకు పిలుచుకొని వెళ్ళు" అన్నారు. రాజు వారిని నదీతీరానికి తీసుకొని వెళ్ళాడు. అక్కడ వారు మహావ్యసన సముద్రంలో మునిగి, బాణం తగిలిన సుతుని చేతితో తడిమి ఆ బాణం తమకే తగిలినట్టుగా మరల మూర్ఛలో పడ్డారు. పిదప మూర్ఛ తెలిసి "పుత్రకా, నీవు గురువత్సలుడివి. ముసలివారు, గుడ్డివారు, అనాథులు అయిన తలిదండ్రులను అకస్మాత్తుగా వదలి స్వర్గానికి ఎందుకు వెళ్ళుతున్నావు?" అని అతనిని గాఢంగా కౌగలించుకొని ఏడ్చారు. "పుత్ర! గురువులనే దైవతంగా నమ్మి నిత్యాగ్నిహోత్రివయిన నీవు మమ్మల్ని నిర్వ్యాజంగా భక్తి సపర్యలతో ఆరాధించావు. ఇదే సత్యమైతే, దీనితో నీ దేహంలో గుచ్చుకున్న బాణం తొలగి, నీరోగుడివి అగుదువుగాక!" అని సత్య ప్రమాణం చేశారు. గురువులు కరుణాజనకమయిన ఆర్తితో సత్యసత్త్వ సంపన్నమైన ఈ మాటలు పలుకగానే, ఇంద్రుడు ప్రత్యక్షమై అమృతధారలతో కుమారుణ్ణి జీవింపజేసి, నిరామయుణ్ణి చేశాడు. శ్యామాక మునికుమారుడుగా ఉన్నప్పుడు నేను అలాటి వినయవ్రతంతో ఉన్నాను. ఈ శాక్యకులంలో పుట్టిన నాకు వారే మరల పూజ్యులయిన తలిదండ్రులుగా అవతరించారు.

ఈ విధంగా సుగతుడు చెప్పిన వివిధ ధర్మమూలమైన గురుసేవావ్రతం భిక్షువులు విని, దానితో సాటి అయిన సత్కర్మ మరొకటి లేదని నిర్ణయించుకున్నారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శ్యామాకావదానమనే నూట ఒకటవ పల్లవం

# 102. సింహావదానం

ధీరులు దానంతో దీనజనుల వ్యసనాలను పోగొడుతారు. శీలంతో సజ్జనుల మనస్సులను సంతోషపెడతారు. ప్రజ్ఞాబలంతో అవివేకుల మోహాన్ని తొలగిస్తారు. పిరికివారి భయాన్ని పరాక్రమంతో పటాపంచలు చేస్తారు.

శ్రావస్తిలో జేతవనంలో వసిస్తూ జినుడు తన ధర్మభోధనలతో ప్రజలకంతా సత్త్వకుశలం పంచిపెడుతుండగా భిక్షువులు ఒకమారు ఆయనను ఇలా ప్రశ్నించారు: "భగవన్, నీవు శక్రునికి, బింబిసారభూపతికి, ఆజ్ఞాత కౌండిన్యుడనే భిక్షువుకూ సత్యదర్శనం కలిగించావు. లక్షమంది దేవతలు, మరి నాలుగు అయుతాల ప్రజలు ఆ సందర్భంలో సత్యదర్శనపాత్రులయారు. ఇది నీకు సహజమైన స్వభావమా? పూర్వ పుణ్యం వల్ల కలిగిన గుణమా? విశ్వోపకారి అయిన నీకు జన్మపరంపరాభ్యస్తమైన ప్రసాదమా?"

భిక్షువుల ప్రశ్న విని భగవానుడు "నాకు పరోపకారబుద్ధి సహజాభ్యాసమైంది. ఈ మానవజన్మలో ఈ విధంగా ఉండడం ఏమి చిత్రం? సింహ హస్త్యాది జన్మలలో నేను ఉన్నప్పుడూ పరోపకారం నా అభ్యాసం" అంటూ పూర్వగాథ ఒకటి చెప్పాడు.

పూర్వం దాక్షిణాత్యులయిన ముగ్గురు వ్యాపారులు రెండున్నర లక్షలమంది పరిజనంతో పట్టుదలతో జలనిధి తీరానికి వెళ్ళారు. అప్పుడు జగత్తును మింగడానికి సిద్ధంగా వున్న రెండవ కాలునివలె మహాకాయమైన అజగరమొకటి ఉండేది. దానిపేరు కంకం. విషజ్వాలలతో సర్వజనులకూ ఆకాశమనే భ్రాంతి కలిగిస్తూ, సంత్రాసం వలె సహించరానిదై ఉన్న దానిని చూచినంతనే ధైర్యం కోల్పోయి, ఒకరిలో ఒకరు కూరుకొని పోయినట్టుగా ముద్దకట్టుకుపోయారు. ఆ మహాసర్పం వారిని దారిలోనే చుట్టుకుంది. వారు చేష్టలుడిగి మృత్యువు వదనంలో ఇరుక్కుని దీనాలాపాలు చేశారు. శరణు కోరుతూ దేవతలనందరినీ ప్రార్థించారు. వారి కరుణాక్రందనం సర్వదిక్కులకూ వ్యాపించింది. ఆ ఆక్రందనారవం కొండగుహలలో ఉన్న యశఃకేసరమనే సింహమూ, దాని మిత్రమైన మందరమనే ఏనుగూ విన్నాయి. వాటికి కరుణ కలిగి, ఆపన్నులను రక్షిద్దామనే సంకల్పంతో ధీరులై, సార్థవాహుల రక్షణకోసం బయలుదేరాయి. సార్థవాహులున్న ప్రాంతానికి వచ్చాయి. సింహం శైలాకారంగా ఉన్న గజేంద్రాన్ని ఎక్కి, అజగరంపై లంఘించి, దానిని చంపివేసింది. కాని దాని ప్రాణాలు పోయేటప్పుడు నోటినుండి వెలువడిన విషనిశ్వాసాలు మంటలు కక్కుతూ సింహకుంజరాల రెండింటినీ కాల్చివేశాయి. ఆ సార్థ నాయకులు కృతజ్ఞతతో వాటికి శరీరసత్క్రియ చేసి, స్తూపం నిర్మించి వాటి యశస్సులతో తమదారిని వెళ్ళారు.



సార్థవాహులకు ప్రాణాలిచ్చిన సింహాన్ని నేనే. ఆ మహాజగరం దేవదత్తుడు. కుంజరమేమో శారిపుత్రుడు.

ఆ సత్త్వచంద్రుని సుకృతాలతో ప్రకాశించే విశ్వోపకార చతురమైన మహా పూజ్యచరితం విని భిక్షువులు సంతోషించి, అనుపదమూ ప్రశంసించారు.

ఇది క్షేమేంద్రుడు రచించిన బోధిసత్త్వావదాన కల్పలతలో సింహావదానమనే నూట రెండవ పల్లవం

# 103. ప్రియపిండావదానం

మహాత్ముల సిరులు తారహారాలతో, వరవస్త్రశేఖరాలతో, ఛత్రచామరాలతో మందహాసం చేస్తూ, సుఖోత్సవాలతో దివ్యభోగాలు కలిగిస్తూ, వారి పూర్వజన్మ సుకృతాన్ని సూచిస్తాయి.

ఒకమారు భగవానుడు ధర్మవిభవప్రభావం వర్ధిల్లి మహాద్భుతాలు చేయడం చూచిన భిక్షుసంఘం ఆశ్చర్యపడడం అవలోకించి, ఇలా అన్నాడు:

ఒక జన్మలో నాకు అనుత్తర జ్ఞానప్రకాశం లేకపోయినప్పటికీ, సుకృతాన్ని సూచించే అద్భుత సంపదలు మాత్రం ఉండేవి. ఉత్తరాపథంలో వజ్రవతి అనే నగరంలో వజ్రచందుడనే రాజు వజ్రపాణిలాగ వెలుగొందేవాడు. గంగాధిపత్యమనే నగరానికి అధిపతి అయిన మేరువనే రాజును వజ్రచండుడు జయించి, రోహిణి అనే అతని కుమార్తెను చంద్రునిలాగ స్వీకరించాడు. అతనికి ఆ రోహిణిగర్భాన సూర్యసన్నిభుడైన కుమారుడు కలిగాడు. చిత్రమేమిటంటే, జన్మతోనే అతనికి మణిచ్ఛత్రం ఏర్పడింది. అతని పుణ్యప్రభావం వల్ల సంకల్పమాత్రంతోనే పురవాసులకు దివ్యాభరణ వస్త్రాన్నభోగాలు సిద్ధించేవి. తమకు ప్రియమైన భోగపిండాలు (భోగాన్నాలు) పట్టణమంతా నిండిపోవడం వల్ల అతనికి ప్రియపిండుడనే పేరుపడింది.

తండ్రి అనంతరం అతడు రాజ్యం పొంది, దిక్కులలోని సర్వభూతాలకు స్వేచ్ఛగా భోగసంపద కలిగించి విస్తారమైన యశస్సు పొందాడు. దుర్మతి అయిన దుర్మతి అనే అతని మంత్రిమాత్రం రాజు చేస్తున్న పనులకు ఈర్ష్య వహించాడు. దురాత్ములకు గుణవిద్వేషం సహజమే కదా! ఆ దుర్మతి ప్రియపిండుని మాతామహుడైన మేరు భూపతికి రహస్యంగా లేఖలు వ్రాసి, పూర్వం వజ్రచండుడు చేసిన అపకారాలన్నీ జ్ఞాపకపరచి వజ్రవతిపై దండెత్తడానికి ప్రోత్సహించాడు. మేరువు కోపంతో మండిపడుతూ, బలదర్పంతో దౌహిత్రుణ్ణి చంపదలచి అతనికి ఇలా సందేశం పంపాడు: "నీవు దౌహిత్రుడవైనా శత్రుపక్షం వాడివి. నీతండ్రి కామాతురుడై నా మండలాన్ని ముక్కలు చేయడం మాత్రమేకాక నా కీర్తిని హరించినట్టే నా కుమార్తెను హరించాడు. నీ తండ్రి బలాత్కారంగా స్వాధీనపరచుకొన్న భూమిని నీ అంతట నీవు ఇచ్చావా సరి. లేకపోతే నేనే వచ్చి నిన్ను యమాలయాతిథిగా చేస్తాను."

మాతామహుని సందేశవాక్కులు విని ప్రియపిండుడు యుద్ధం కలిగితే జనసంక్షయం **అవుతుందనే** కరుణతో సైన్యంతో పాటు సంధి విగ్రహసన్నద్ధుడై బయలుదేరి, సైనికులను దూరంగా **ఉంచి, నౌకంతో** గంగదాటి, గంగాపులినాలపై ఉన్న మాతామహుని నగరం గంగాధిపత్యం చేరాడు. **అమాత్యభృత్య** వర్గంతోపాటు వచ్చిన అతని సంకల్ప లీలతో దివ్యాహారాలు ఉద్భవించడం చూచి మేరుమహారాజు **"ఇతడు** దేవుడే" అని అనుకుని తనే అతని సన్నిధికి వెళ్ళి అతనిని కౌగలించుకొని, బాష్పాలు **వర్షిస్తూ**, సకల రత్నాలతోను పూజించాడు. ప్రియపిండుడు మాతామహుని ప్రణయోపచారాలన్నీ పొంది, **తన నగరానికి**



తిరిగివచ్చి, జంబూద్వీప జనాన్నంతా దివ్యభోగాలతో ఓలలాడించాడు.

అలాంటి దివ్యసంపదలకు కారణమేమిటని భిక్షువులు ప్రశ్నించగా, సర్వజ్ఞుడు ఇలా తెలిపాడు:

"ప్రియపిండుడు ఒక జన్మలో వారాణసిలో మూలికుడనే విప్రుడుగా పుట్టాడు. ఒకమారు రోగార్తుడైన ప్రత్యేకబుద్ధునికి చికిత్స చేశాడు. స్వాస్థ్యం కలిగేవరకూ ఈవిధంగానే వైద్యం చేసి, ఎండపొడ తగులనీకుండా గొడుగు కూడా పెట్టాడు. ఆ పుణ్యం వల్ల సహజచ్ఛత్రవంతుడు దివ్యోపభోగవంతుడు అయిన రాజుగా జన్మించాడు. ఆ ప్రియపిండుణ్ణి నేనే. దుర్మతి మంత్రి ఈ దేవదత్తుడు." భగవానుడు చెప్పింది విని భిక్షువులందరూ ఆశ్చర్యపడ్డారు.

విభవప్రభావ దివ్యోపభోగసుభగమై ఆశ్చర్యం గొలిపే భువనాధిపత్యం, దీర్ఘరోగవ్యసనాపన్నుల సేవోద్ధరణ పుణ్య విజృంభణల ఫలితమే సుమా!

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో ప్రియపిండావదానమనే నూట మూడవ పల్లవం

## 104. శశకావదానం

సత్సంగమనేది సన్మార్గంలో నడిచే మనోరథాల సిద్ధికి సూతుని వంటిది; సత్పురుషుల సత్కర్మలనే నిర్మలతీర్థంతో పవిత్రమై శ్లాఘ్యమైనది; సంసారమనే ఘోరసాగరానికి సేతువు వంటిది; శుభాలు కలిగించడానికి సహజహేతువు.

ఒకమారు బుద్ధభగవానుడు శ్రావస్తిలో కమలుడనే గృహపతి పుత్రుడు హంసుడనేవాణ్ణి ప్రయత్న పూర్వకంగా పట్టి పిలిపించి అర్హత్పదంలో నియమించి, ప్రసాదవిశదమైన కరుణాలోకనామృతాలతో అనుగ్రహించాడు. అప్పుడు భిక్షువులు "భగవన్, ఈ కులపుత్రుడు ప్రవ్రజ్య స్వీకరించినప్పటికీ, పూర్వజన్మ వాసనాశేషంతో విషయస్మరణ కలిగి, గృహోన్ముఖుడయ్యాడు. అలాటివాడిని ప్రయత్నపూర్వకంగా వినయమార్గంలో పెట్టి, మహానుగ్రహంతో సమ్మోహరహితుని చేశావు" అని స్తుతించారు. వారు హర్షామృతసిక్తులై, విస్మితులై ఇలా అనగా, భక్తవత్సలుడు, సర్వజ్ఞుడు అయిన భగవానుడు యిలా ప్రత్యుత్తరమిచ్చాడు:

పూర్వం కూడా నేనితనికి ప్రయత్న పూర్వకంగా కుశలం కలిగించాను. పూర్వం ఇతడొక తపోవనంలో సువ్రతుడనే తపోధనుడు. అప్పుడు నేను అతని ఆశ్రమంలో మనుష్యవాక్కులతో స్ఫుటంగా మాట్లాడే కుందేలుగా ఉన్నాను. అతని చల్లటి మాటలకు నమ్మకం కలిగి ప్రీతితో ఎప్పుడూ అతని సమీపంలోనే ఉండేవాడిని. ఇలా ఉండగా, అనావృష్టి ఏర్పడింది. కందమూలఫలాలు, నీటివనరులు ఎండిపోయాయి. సువ్రతుడు వనంపై ఉద్వేగం కలిగి గ్రామాంతరం వెళ్ళాడానికి పూనుకున్నాడు. అప్పుడు నేను "ఓయీ! తపోధన! విద్వాంసుడు, సాధువు అయిన నీకు తపోవన పరిత్యాగం ఎలా యుక్తమౌతుంది? గ్రామభూములు వియోగంలో, వివిధోద్వేగాలలో మునిగిన జనంతో సంకులమయినవి. గృహమోహం, గృహాయాసం నిండినట్టివి. స్త్రీలనే సంకెలలు గలగలమంటూ, దుస్సహమైన పుత్రులనే పాశం, బాంధవులు, భృత్యులు అనే నిబిడబంధనాలు కలిగి, ఖలసంఘంతో ఘోరమై, కుమతి అనే మహాంధకారబంధురమైన ఇంటిని బుద్ధిమంతుడు ఒకమారు వదలిపెట్టిన పిదప మరల తాకనైనా తాకుతాడా? క్లేశాలకు పుట్టినిల్లయిన ఇంటిలో ఉన్నవారికి మోహమనేది నానావియోగ ఘనదుఃఖాలు కలిగిస్తుంది. ద్రవిణమనే లవణం తిన్న కొద్దీ తృష్ణ హెచ్చుతుంది. విషమమైన విషయ స్నేహాభ్యాసాలవల్ల మనస్సు మొద్దుబారిపోతుంది. కుశలమన్నది క్షీణిస్తుంది. విజనమైన వనంలో శమ సంతోషచిత్తులకు విషయభోగరాగాసవాలతో బుద్ధి కైపెక్కదు. ప్రియవియోగధూమంతో కళ్ళుకలగి బాష్పపూరితాలు కావు. కలహ కోపతాపాలతో దాహవ్యథాదులు ఉండవు. పురుషులకు ప్రశమంపై వైముఖ్యం కలిగినప్పుడు ప్రసంగవశాత్తు వనంపై రోతతో గ్రామంపై స్పృహ, గ్రామంపై రోతతో వనంపై స్మరణ కలుగుతాయి. నియమాలకు విపరీతమైన గ్రామంలో ఉండాలనే ఆశపడవద్దు. విషయస్నిగ్ధులయినవారిని గ్రామసంబంధం ముందుగానే కట్టివేస్తుంది. ఇక్కడే ఉండు.



కొంతకాలానికి కందమూలఫలాలు దొరుకుతాయి. ప్రస్తుతానికి నా మాంసంతో ప్రాణధారణం చేయి" అని అంటూ దగ్గరనే ఉన్న వహ్నిలో పడ్డాను. అతడు వెంటనే నన్ను నిప్పునుంచి పైకెత్తి ఆలింగనం చేసుకొని "ఏమిటి ఈ విపరీతమైన సాహసం చేశావు? నేను వనం నుంచి కదలను. నీ ప్రీతి అక్కడ ఎక్కడిది?" అని మందలించాడు.

అతడు ప్రణయంతో ఈ విధంగా అనగానే, నేను ఆకాశంవైపు చూచాను. వెంటనే వానలు కురిశాయి. భూమి సస్యఫలసమృద్ధ అయింది. తర్వాత ఆ ముని పంచాభిజ్ఞత్వం పొంది, ఆదరంతో "ఈ శుద్ధసత్త్వం నుండి ఏమి కోరుతున్నావు?" అని ప్రశ్నించాడు. వచ్చేజన్మలో జగత్సంతారణార్థం జినుడై పుట్టదలచాను." అని నేను సమాధానం చెప్పాను. "నీవు తప్పక తథాగతుడివై అవతరిస్తావు. నీవు సమ్యక్సంబుద్ధుడివి, సర్వజ్ఞుడివి అయినప్పుడు వేరే జన్మయెత్తిన నాకు కూడా నీవు అనుగ్రహం చూపాలి" అని ముని కోరాడు. ఆ సాధువు మాటను నేను స్నేహంతో అంగీకరించాను. ఈ జన్మలో బుద్ధత్వం పొందాను. ఆ సువ్రతుడే గృహపతి కుమారుడు హంసుడు. పూర్వ స్మృతితో ప్రయత్నం పూర్వకంగా నేను కుశలం పొందించాను.

సర్వదర్శి, ప్రసన్నవత్సలుడు అయిన జినుడు నిజవృత్తాంతం ఈ విధంగా తెలుపగా అందరు ఆశ్చర్యం పొందారు.

శుభచరిత్రులతో సహవాసం అవికలమైన ఫలాన్ని కలిగిస్తుంది. దినపతి కిరణరుచి పరిచయంగల హిమగిరి శిఖరకాంతి అసమానమైనది గదా!

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శశకావదానమనే నూట నాల్గవ పల్లవం

# 105. రైవతావదానం

రెండు నాలుకలతో క్రౌర్యం కక్కుతూ, పవిత్ర చరిత్రులపై మిథ్యాపవాద విషం చిమ్మేవారు పాపశాప పరితాప పరంపరార్తులై తీవ్రమైన అనృత తిమిరావృతమైన బిలాలలో పడిపోతారు.

పూర్వం కాశ్మీర దేశంలో రైవతకుడనే పరిశుద్ధ చరిత్రుడైన భిక్షువు ఉండేవాడు. అతడు సర్వభూత దయాపరుడై కొండలలో విహరిస్తూ ఉండేవాడు. అతడొకమారు జనసంచారంలేని చోట చెట్లపట్టల కషాయపు కుండలో తన చీవరాలు తడుపుతూ వాటికి రంగులు వేస్తున్నాడు. అప్పుడు పిశునుడనే బ్రాహ్మణుడు తప్పిపోయిన తన ఆవు దూడలను వెదుక్కుంటూ, గోభక్షకులు వాటిని తినివేశారేమోననే అనుమానంతో అక్కడి కొండకిందికి వచ్చాడు. అతడు చీవరం నానబెట్టిన కుండను కాచడానికి పెట్టిన మంటలపొగను కొండపైన దూరం నుంచే చూచి ఎవరో తన ఆవుదూడనే చంపి కుండలో ఉడికిస్తున్నారని భ్రాంతిపడి, శస్త్రాస్త్రాలవారిని కొందరిని వెంటబెట్టుకొని కొండ ఎక్కి రైవతకుని సమీపించి, వినయంతో "ఆర్య, ఏమిటి చేస్తున్నావు?" అని ప్రశ్నించాడు. "చీవరానికి రంగు వేయడానికి ఉడక బెడుతున్నాను" అని రైవతక భిక్షువు సమాధాన మిచ్చాడు.

కాని ఆ సమయంలో రైవతకుని పూర్వపరిపాకం వల్ల ఆ వృక్ష త్వక్కుల కషాయపాకము గోమాంస రక్తసలిలంగా మారింది. విధి ఎదురు తిరిగినప్పుడు సుఖం దుఃఖమౌతుంది. తెల్లనిది నల్లనిదై పోతుంది. ధర్మం అధర్మవౌతుంది. మిథ్యాపాపప్రకటనం, జినకోపం, పదచ్యుతి - ఇవి అపుణ్యపరిపాకానికి ప్రత్యక్ష లక్షణం. మానవులకు పూర్వజన్మ దుష్కృత పాకకాలంలో దోషాలు మొలకెత్తుతాయి. అగుణాలు వ్యాపిస్తాయి. చేసిన పని విపరీతమౌతుంది. బుద్ధి చెదరి, పిదిలిపోతుంది. ఇంకా ఏఏ మహాభిఘాతాలు తలపై పడవు?

విపరీతమైన మాంసం వాసన, రక్తం కనిపించగా, బ్రాహ్మణుడు శంకతో కడవలోనికి తొంగి చూచాడు. కడవలో చీవరం మాంసం ముద్దగా మారిపోయింది. ప్రత్యక్షంగా నేరం చూచి బ్రాహ్మణుడు క్రోధంతో ముఖం వికారమైపోగా, తీవ్ర పాపకార్యంతో కంపించిపోతూ, అతనిని నిందిస్తూ ఇలా అన్నాడు: "ఆహా! నీ సదాచారం నిర్జనమైన వనంలో ఇదా? ఇక్కడ ఎవ్వడూ నీ చెయిదం చూడడుగదా! కాయమేమో ప్రవ్రజ్యారంజితం; ప్రియయేమో మ్లేచ్ఛజనులు చేయదగినది! ప్రచ్ఛన్న పాపుల కూటవ్రతాలు, కూటశాంతి ఎవరు తెలుసుకుంటారు?"

బ్రాహ్మణుడు ఈ విధంగా ఆక్షేపించగా రైవతకుడు మనసులో ఆలోచించాడు. "దోషం ప్రత్యక్షంగా కనిపిస్తున్నప్పుడు ఏమి సమాధానం చెప్పను? నిరుత్తరుడుగా ఉండటమే మేలు. ఇది నాకు దైవోపఘాతమని అంటే ఎవడు ఒప్పుకుంటాడు? ప్రత్యక్ష విషయాన్ని కప్పిపుచ్చేవాడు హాస్యపాత్రమవుతాడు. మౌనం అవలంబించి, ఏమి సంప్రాప్తించినా సహిస్తాను. నీటినుంచి నిప్పు పుట్టింది. దీనికి ప్రతీకారమేమిటి? కాల ఇంద్రజాలికుని వధువయిన భవితవ్యత దోషంలో గుణాతిశయాన్ని, గుణంలో వెంటనే దోషాన్ని, పీయూషాకరంలో విషాన్ని, విషంలో అమృతాన్ని- ఇలా ఎల్లప్పుడూ అద్భుత రూపాలనే చూపుతుంది."

ఇలా మౌనంగా ఆలోచిస్తున్న భిక్షువును చూచి, బ్రాహ్మణుడు మరింత కోపంతో మండిపడి, అతని తలపై పాపంవలె స్థూలమైన కర్రతో కొట్టాడు. రక్తం తలమీదినుంచి కారుతుండగా, కట్టి రాజు సభకు లాక్కొని వెళ్ళి, కుండలోని మాంసం చూపించి, అతనిని కారాగారాతిథిని చేయించాడు. సాక్షులు కానివారు చిత్రాకారంగా ఉండగా, ఎవడికి ఎవరి పారిశుద్ధ్యం తెలుస్తుంది? నిర్దోషులేమో క్లేశం పొందుతారు. గుప్తపాతకులేమో విర్రవీగుతూనే ఉంటారు. భిక్షువును కారాగారంలో పడదోసిన పిదప, కొంతకాలానికి బ్రాహ్మణునికి ఆవుదూడలు దొరికాయి. కాని, తను అన్యాయంగా దౌర్జన్యం చేశాననే సిగ్గుతో అతడు ఏమీ చెప్పలేకపోయాడు.

ఈ విధంగా పన్నెండు సంవత్సరాలు గడిచాయి. భిక్షువు నిర్దోషి అని ఆకాశవాణి పలికింది. అతని శిష్యుడు రాజుకు జ్ఞాపకం చేయగా, రాజు అతనిని బంధవిముక్తుని చేశాడు. భిక్షువు చిక్కిపోయి కంకాళంవలె పాలిపోయి, వెంట్రుకలు సంస్కారంలేక నిక్కబొడుచుకొని, వస్త్రహీనుడై ప్రేతంవలె కారాగారంనుంచి వెలుపలికి వచ్చాడు. ఆహా! కర్మపద్ధతి రాతి మీది వ్రాతవలె నిశ్చలమయింది. తెలుసుకొన్నవాడు కూడ క్రూరక్లేశ కదర్థనను అనుభవిస్తాడు! భిక్షువు స్థితిని చూచి నందమహారాజు తీవ్రసంతాపసంతప్తుడై తన పొరపాటు వల్ల ఇలాటి పాపకార్యం జరిగింది గదా అని నిందించుకొన్నాడు. అతడు భిక్షువు పాదాలపై పడి, ఆయనకు వస్త్రాలు కప్పి "ఆర్య! నా అజ్ఞానం వల్ల కలిగిన దోషం క్షమించు. ఆ బ్రాహ్మణునికి ఆ దూడలన్నీ దొరికాయి. కాని పాపమోహంచేత నీవు కారాగారంలో ఉన్న సంగతిని మరచాను. మహీపతి పాపి అయితే, నిర్దోషులయిన పవిత్రులకు శిక్ష పడుతుంది" అని విన్నవించాడు. రాజు ఈ విధంగా విన్నవించగా, క్షాంతి ప్రక్షాళిత హృదయుడైన రైవతకుడు "రాజా! నాకు కోపమేమీ లేదు. నీవు నాకేమీ అపకారం చేయలేదు. విపులక్లేశ సముదాయంలో పడుతున్న నాకు పరిణామంలో స్వకర్మ సదృశమైన ఫలం లభించింది. మానవులకు సర్వాపదలూ వచ్చి ఎగబడి కౌగలించుకొనడం, సంపదలు సర్వాంగ ప్రసభోపభోగం కలిగిస్తూ కష్టపెట్టడం, స్వేచ్ఛా సుఖాలు కలిగించే విహారాలు, దీర్ఘమైన బంధనాలు- ఇవన్నీ నిజ కర్మపరిపాక శబలితమైన సంసారవల్లి ఫలాలే" అని సమాధానపరిచాడు. "ఓ సుమతే! నీకు ఏ దుష్కర్మ వల్ల ఈ ఫలం కలిగింది?" అని రాజు కుతూహలంతో ప్రశ్నించాడు. భిక్షువు ఇలా అన్నాడు:

"నేను పూర్వం వారాణసిలో కురుడనే ఆవుల దొంగను. క్రూరుణ్ణయి ఆ గోమాంసం తింటూ జీవించేవాడిని. నేను ఒకమారు ఆవును చంపి దాని మాంసం తీసుకొని భయంతో పరుగెత్తుతుండగా, ఆలకాపరులు అనుచరులతో పాటు కోపంతో వెంట పరిగెత్తారు. దారిలో ఒక ప్రత్యేకబుద్ధుడు ఉండగా, అతని పక్కన ఆ మాంసం పెట్టి "ఇదుగో దొంగ" అని వారికి చూపాను. వారందరూ మాంసం పక్కనే ఉండడం వల్ల గోవధ పాపానికి ఉగ్రకోపంతో వధార్హుడని అతనిని కట్టి బందెలో వేశారు. నాకు పశ్చాత్తాపం కలిగి పన్నెండునాళ్ళ తరువాత వారి వద్దకు తిరిగి వెళ్ళి, నేనే పాపం చేసినవాడనని వివరించి, కారాగారంనుంచి ప్రత్యేకబుద్ధుని విడిపించాను. ఆ పాపపాకాన్ని నరకంలో నేను బహుకాలం అనుభవించి, ఈ జన్మలోను

పన్నెండు సంవత్సరాలు క్లేశం పొందాను." రైవతకుడు ఇలా చెప్పి సురాసురులకు కూడా నమస్కరించదగిన మాహాత్మ్యం ప్రదర్శించి, రాజు వద్ద సెలవు పుచ్చుకుని, భిక్షువులతో సహ వెళ్ళిపోయాడు.

దుష్టులు ప్రత్యక్షంగా లక్షణాలు, నిదర్శనాలు కనబరచి అసత్యదోషం విశేషయుక్తితో అంటగట్టినప్పుడు సాధువు విదేశంలో అమ్మబడిన బానిసవలె ఏమి మాట్లాడగలడు?

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో రైవతావదానమనే నూట అయిదవ పల్లవం

# 106. కనకవర్మావదానం

ధీరులు విజిగీషువులవలె దుస్సహ సంసార శత్రుబలాన్ని హతమార్చి విపుల సద్ధర్మ సామ్రాజ్యం పొందుతారు.

భగవానుడు ఒకమారు నగరోపమసూత్రం వాఖ్యానించిన పిదప భిక్షువులు కుతూహలంతో ప్రశ్నించగా ఇలా అన్నాడు:

స్వర్గకాంతిని జయించిన కనకవతి అనే పట్టణం ఉండేది. దానిని కనకుడనే మహాతేజస్వి అయిన రాజు పాలించేవాడు. అతనికి ప్రీతికి ఆటపట్టయిన కనకవర్మ అనే ఒక కుమారుడు, కనక ప్రభ అనే కుమార్తె కలిగారు. వసంతలతికవలె ఉన్న ఆ కనకప్రభ కొంత కాలానికి యౌవనం పొంది, స్తనస్తబకశోభితురాలు అయి, లతలాగ మనోజ్ఞ అయింది. మంత్రికుమారుడు కామసారుడనేవాడు ఆమెకు చిన్ననాటి మిత్రుడు. ఆ బాల్యప్రీతితో కలిగిన పరిచయంతో ఆమెను **కామించాడు.** ధైర్యం హరించే యౌవనమనే పుష్పసమయం ప్రవర్తిల్లినప్పుడు మంజరిపై తుమ్మెదలు పొరాడడం ఎవరు అడ్డగించగలరు?

మానవంతుడయిన మహీపతికి తనయ నష్టచరిత్ర అయిందని తెలిసి, శోకక్రోధాగ్నులు రెండూ ఒకేమారు చుట్టుముట్టాయి. అభిమానవంతుల కులాలు వారి పూర్వపుణ్యం కొద్దీ, కన్యావిహీనమై గౌరవం దక్కించుకొంటాయి. యాచించదగనివాడిని యాచించడం క్షణంలో సుఖాన్ని పోగొట్టినట్టుగా, కన్య క్షణంలో కులాన్ని మలినం చేస్తుంది. రాజు రాజకుమారిని, మంత్రిపుత్రుణ్ణి వధించవలసిందని ఉత్తరువు చేశాడు. శాసనకారులు వారిద్దరినీ వధ్యభూమికి లాక్కుని వెళ్ళారు. అప్పుడు వారిద్దరూ రక్షించవలసిందని వేడుకోగా రాజకుమారుడు కనకవర్మ వారిద్దరినీ ఆ నగరం నుంచి మరొక నగరానికి పంపించాడు. రాజుకు ఈ సంగతి తెలసి, క్రుద్ధుడై పుత్రుణ్ణి మహాశత్రువుగా పరిగణించి, నిష్కరుణుడై సమీపంలోని అడవికి వెళ్ళగొట్టాడు.

సత్త్వసముద్రుడయిన ఆ రాజపుత్రుడు తీర్థాలు, వనాలు తిరుగుతూ, రమ్యోద్యానాలతో సుందరమైన ఒక నగరం చూచాడు. అయితే, ఆ నగరం నిర్జీవంగా ఉంది. అక్కడ ఒకచోట ఒంటరిగా ఖిన్నురాలై నగర జనులంతా వెళ్ళిపోవడం వల్ల శోకిస్తున్న నగరదేవతలాగ ఉన్న తన చెల్లెలు కనకప్రభను చూచాడు. ఆమె తన అన్నను గుర్తుపట్టి కన్నీరు కురిపిస్తూ, ప్రీతితో కుశలప్రశ్నలు చేసింది. రాజకుమారుడు ఆమెను ఓదార్చి ఆ నగరం శూన్యంగా ఉండడానికి కారణమేమిటని ప్రశ్నించాడు. "అన్నా! ఈ మర్రిచెట్టును ఆశ్రయించుకొని అరవైమంది మహానాగులయిన యక్షులు ఉన్నారు. వారు నగరవాసులందరినీ చంపి, ఈ నగరాన్ని నిర్జనం చేశారు. ఇప్పుడు మిగిలినవారం నేనూ, మంత్రికుమారుడూను. మా యిద్దరికీ నీ భుజబల ప్రభావమే రక్ష" అని దీనంగా అన్నది. ఆమె మాటలు

ఆలకించి రాజకుమారుడు తన శరావళితో యక్షావళిని చంపి, ఒక్క యక్షుడు మాత్రం మిగిలేటట్లు చేశాడు. హతశేషుడయిన కోటరుడనే యక్షుడు రాజకుమారుణ్ని శరణు పొంది, దాసత్వం స్వీకరించి అతనికి జేజేలు పెట్టాడు. యక్షులందరూ నశించడం వల్ల ఆ నగరం మరల జనాకీర్ణమైంది. ఆ పట్టణానికి రాజకుమారుడు తన చెల్లెలి భర్త అయిన మంత్రిసూనుణ్ణి రాజుగా అభిషేకించాడు.

కనకక్షితిపతి చారులు చెప్పగా తన కుమారుని అద్భుతపరాక్రమ ప్రభావం విని, ప్రీతితో లేఖ వ్రాయించి పిలిపించుకున్నాడు. పిదప అతడు యువరాజుగా పట్టాభిషిక్తుడై ఇంద్రియాలను, చతుర్ద్వీపవతి అయిన మహీవలయాన్ని కూడ వశపరచుకొన్నాడు.

"ఆ రాజకుమారుణ్ణి నేనే. సంసారక్షయం చేసినట్టే శత్రువర్గ క్షయం కూడా కలిగించాను. సత్త్వరుచిరమైన సద్ధర్మ సింహాసనం మీద కూర్చుని, శీలమనే ఉష్ణీషం ధరించి, వివేకమనే పవిత్రజలంతో అభిషేకం పొంది, పృథుతర భవక్లేశావళి అనే శత్రుపరంపరను నాశం చేసి, శమగుణం సాధించిన విశ్వవిజేత నిర్వాణభూమిని అనుభవిస్తాడు. అమలతరమైన నిర్వాణం నగరసన్నిభమైనది. కష్టాలు యక్షులవంటి శత్రువులు. వాటిని జయించేవారికే నగర సదృశమైన నిర్వాణం లభిస్తుంది." ఈ విధంగా చెప్పి, భగవానుడు విరమించాడు.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో కనకవర్మావదానమనే నూట ఆరవ పల్లవం

# 107. శుద్ధోదనావదానం

పుణ్యోజ్జ్వలులయిన విశదాశయులకు గుణంపై స్పృహేగాని, ద్రవిణంపై కాదు. యోగంలో అభినివేశమేగాని, భోగంలో కాదు. విరాగంలోనే అభిరతిగాని, కామంలో కాదు.

పుణ్యశీలుడైన భగవానుడు పుణ్యప్రభావం తెలుపుతూ, పుణ్యంపై తనకు గల ఆదరం చూచి ఆశ్చర్యపడిన భిక్షువులతో ఇలా అన్నాడు:

పూర్వం బ్రహ్మదత్తుడనే రాజు వారాణసిలో రాజ్యమేలుతుండగా, కుబేరుని పోలిన శుద్ధోదనుడనే గృహపతి ఉండేవాడు. అర్థికల్పవృక్షమైన అతడు సముద్ర వ్యాపారంతో సాధించిన మణిమౌక్తిక సంభారాలతో అతని యిల్లు నిండి ఉండేది.

ఒకమారు అతడు రత్నద్వీపం నుంచి తిరిగివచ్చి, అపూర్వముక్తాహారం ఒకటి కానుకగా తీసుకొని రాజును చూడటానికి వెళ్ళాడు. రాజు ప్రేమతో ఎదురు వచ్చి గౌరవించాడు. శుద్ధోదనుడు లక్ష్మి లీలాహాసం వలె ఉన్న ఆ హారం రాజుకు బహూకరించాడు. కిరణాలనే దారాలు కట్టిన నక్షత్రాల వరుసవంటి ఆ హారం గుణవంతుడు హృదయాన్ని హరించి ఆకట్టినట్టుగా, రాజు హృదయాన్ని ఆశ్రయించింది. అప్పుడు బాలసరస్వతి అనే రాజు కుమార్తె ప్రాసాదోపరిభాగం నుంచి, దివ్యమైన కంఠంతో ఒక సుభాషితం ఆలపించింది. శ్రవణామృతము, ప్రియము అయిన ఆ సూక్తిని గృహపతి విని పులకాంకిత శరీరుడై తన యింటికి తిరిగి వెళ్ళాడు.

ఇంటికి వెళ్ళిన పిదప ఆ సుభాషితం మీదే మనసుపడి, ఆహారవిహారాలు మాని, నిద్రాదరిద్రుడై చాలకాలం ఆలోచించాడు: "ఆహా! రాజపుత్రి పాడిన సుభాషితం ఎంతమంచిది! ఆలోచన చేయకనే అమృతం తాగినట్టయింది. నేను పన్నెండు సంవత్సరాలు విపులరత్నసమూహం సంపాదించాను. ఒక్క సూక్తరత్నాన్నయినా సంపాదించకపోయాను. ఎంతో ప్రయత్నంతో సంపాదించిన రాళ్ళ బరువుగల రత్నాలలో ప్రయోజనమేమిటి? సన్మార్గానికి దారి చూపడంలో సుభాషితం రత్నదీపంవంటిది." ఈ విధంగా ఆలోచించి, రాజమందిరానికి ఒక దూతను పంపి, ఏమీ యాచించనివాడు రాజకుమార్తెను ఆ సూక్తిరత్నం ఇమ్మని యాచించాడు.

రాజకుమారి దూత మాటలు విని నవ్వుతూ "సూక్తం ఊరికేరాదు. మూల్యంతో లభిస్తుంది. దానంత విలువగల డబ్బు ఇవ్వండి. పన్నెండు సంవత్సరాలపాటు న్యాయంగా సత్యదృష్టితో సంపాదించిన రత్నసంచయం ఈ సూక్తం విలువ. అది చెల్లించండి" అని చెప్పి పంపింది. దూత తిరిగి వచ్చి భూపాలదుహిత మాటగా సంగతి తెలిపాడు. గృహపతి విని, తనవద్ద ఉన్న రత్నభాండారాన్నంతా ఆదరంతో తీసుకొని తానే రాచనగరు చేరి, గడ్డిపోచలాగ రత్నరాశిని సమర్పించి, సూక్తరత్నం స్వీకరించి

ఉత్కంఠతో దానిని పలుమారు పఠించాడు. ఆ సూక్త మేమిటంటే:- "కొద్దిగానో, గొప్పగానో కలిగే ఈ బాహ్యాంభ్యంతర సుఖాలు; సత్త్వగుణ విలసనంతో విస్మయం కలిగించే సిద్ధులు, తృష్ణను శమింపజేసే సంతతానంద లాభాలు - ఇవన్నీ కాలంలో పరిపాకం చెందిన పుణ్య కల్పద్రుమ ఫలాలే సుమా!"

ఔదార్యనిధి అయిన గృహపతి తన రత్న రాశినంతా ఇచ్చి సూక్తిని తీసుకున్నాడని తెలిసి, రాజు ఆశ్చర్యపడి, గృహపతిని పిలిచి, "గృహపతీ, నీవు ఎంతటి సరళస్వభావం కలవాడివి." ఒక బాలిక మాటలపై విశ్వాసంతో రత్నాలు వదలి సూక్తిరత్నం తీసుకొన్నావే. ఈ ప్రపంచంలో సుభాషితాలు కొల్లలు. ధనం ఎంతో కష్టపడితేనే గాని చిక్కదు. తిండి లేకపోతే సుభాషితాలు తిని ఎవరైనా ఉండ గలరా?" అని ప్రశ్నించాడు. గృహపతి రాజు ఎంతో స్నేహంతో అడిగిన ప్రశ్నలు విని, సూక్తి లభించినందుకు మురిసిపోతున్న ఆనందంతో ఇలా అన్నాడు: "రాజన్, ఈ రత్నాలు ఏమి చేసుకోను? ఎంతో శ్రమపడి రక్షించుకోవాలి. అలా రక్షించుకొన్నా నశిస్తాయి. పాముల తలమీద కూడ మణులున్నాయి. వాటికి విషమున్నట్టు మానవులకు రాగద్వేషాలున్నాయి. ఉత్తముల హృదయ మందిరంలో సన్మార్గదీపసదృశమైన విమలకాంతులు విరజిమ్ముతూ, గుణాలను ఆలంబనంగా చేసుకొని పుటపాకంతో తేరిన బంగారువంటి సుందర పదప్రాప్తితో వెలిగే సుభాషితమణికి సాగరమేఖల అయిన వసుమతి కూడా నాలుగోవంతు విలువకు పోలదు." రాజుకు ఈ విధంగా సమాధానం చెప్పి, శుద్ధోదనుడు కుశలోద్యతుడై ఆ సుభాషితాన్ని బంగారు రేకులపై వ్రాయించి, దిక్కులకంతా పంపాడు.

"ఆ శుద్ధోదన గృహపతిని నేనే. సూక్తిలోని పుణ్యోపదేశం కోసం సర్వస్వమివ్వడానికి కూడా సిద్ధమయ్యేవాడిని. ఈసారి పుత్రభిక్షువు ఆ రాజకుమారుడుగా జన్మించాడు అని తథాగతుడు అఖిల జగత్కుశలం కోసం తెలిపాడు.

పుణ్యమనేది కల్యాణ కమలానికి మొదటికాడ. నానా సంపదలనే నవలతలకు ఉద్యానభూమి. తృష్ణాతాపాన్ని హరించే హిమస్మేర గంగా ప్రవాహం. సన్మార్గాన్ని ముందుగా చూపగల సత్ప్రకాశం.

ఇది క్షేమేంద్రుడు రచించిన అవదాన కల్పలతలో శుద్ధోదనావదానమనే నూట ఏడవ పల్లవం

# 108. జీమూతవాహనావదానం

## ఉపక్రమము

ఈ బుద్ధావదాన వివిధాద్భుత కల్పవల్లిని జినేంద్రుడు నిర్మించిన మహావిహార శ్రేష్ఠాల చైత్యాంగణాలలో సువర్ణ చిత్రగుహామందిరాలలో చిత్రాలతో వ్రాయించారు; క్షేమేంద్రుడు అట్టి చిత్రరచనా విశేష రమ్యమైన అవదానావళిని జగత్తుకు లేకపోవడం ఎందుకనే కుశల దృష్టితో - పూర్ణ సుకృతమైన సత్పురుషుల చిత్తమనే విహారంలో కల్పపర్యంతం ప్రతిమా సహస్రాలతో ప్రకాశించే పుణ్య ప్రబంధోజ్జ్వలంగా ప్రతిష్ఠించాడు. క్షేమేంద్రుడు బోధిసత్త్వుని చరితాలు నూటయేడు రచించారు. మంగళ సంఖ్యాపూరణంగా మిగిలిన ఒక్క చరితాన్ని ప్రయత్నంతో రచించాలి. క్షేమేంద్రుని తనయుడు, సిద్ధుడనే నామాంతరం కలవాడు అయిన ఈ సోమేంద్రుడు ఈ ఉదారమైన జనకథా ప్రబంధంలో అవదానశేషం పూరిస్తాడు.

సూక్తోదధి అయిన క్షేమేంద్రుడు వంద్యుడు. రసనిధి అయిన అతని కవితాబంధం కేరళకామినీ కుచభరంవలె సంహతమైనది. ప్రసాదగుణం కాంచీకాంతల కపోలాలవలె కోమలతరమైంది. భంగీతరంగిణి, కర్ణాంతం వరకు పారే కర్ణాటకామినీ నయనచ్ఛట వంటిది. ఓంకారం నుంచి సులభంగా కుటిలత్వాన్నే నేర్చుకొని, స్వస్తి అనే పదం ముఖం నుంచి స్పష్టంగా ఎప్పుడూ వెలువడక, క్రోధం పొంగి ఎప్పుడూ వివర్ణమైన వదనంగల విద్యానిధులు పృథుకథలున్న ఈ కావ్యాన్ని ఎలా సహిస్తారు? వారికిది తీవ్రాపరాధ సదృశంగా కానవస్తుంది. క్షేమేంద్రకవి ఈ అవదానకల్పలతికను రచించి, సద్ధర్మ ప్రణిధానం పొందాడు. జినగుణకథన ప్రబంధంతో నేను సంపాదించిన పుణ్యం నన్ను సమస్తప్రాణి కుశలంకోసం నిత్యవ్రతుణ్ణిగా చేయనీ!

ఈ సంసారంలో కొట్టుమిట్టాడి అలసి సొలసి, కామాసవంతో మత్తెక్కి, మోహ తమస్సుతో కళ్ళు మూసుకొని, స్మృతి పోయి నిద్రించిన జగత్తును మేల్కొల్పడానికి పూనుకొని, దోషాలు నిశ్శేషంగా పోగొడుతూ వెలుగొందే సమ్యక్సంబుద్ధుడయిన బుద్ధభగవానునికి ఎల్లప్పుడు నమస్కారం. సహృదయులకు నిరంతరం ఆనందం కలిగిస్తూ, సూక్తాంశువులతో అందరికీ సుఖం కలిగిస్తూ, కీర్తి ప్రకాశాలు విరజిమ్మే మద్వంశాబ్ధిచంద్రుడైన జనకుడు క్షేమేంద్రునికి నమస్కారం. వాఙ్మయమైన ఈ పావన జినావదాననిర్మాణపుణ్యకుశలకార్యంలో కొరవను పూరించవలసిందిగా నా తండ్రి నన్ను ఆదేశించాడు. జినావదానకథలుగల చిత్రాలతో, శిల్పాలతో కన్నుల పండువుగా చిత్రవిచిత్రంగా కనిపించే ఆ విహారాలు కాలవాహినిలో కలిసిపోయాయి. కాని, సరస్వతీ తూలికతో విచిత్ర వర్ణక్రమంతో నాతండ్రి అవదానాలు చిత్రించిన ఈ పుణ్యమయవిహారం (కావ్యం) మహార్థవంతంగాను, సత్పురుషులకు నందనంగాను వెలుస్తున్నది. దిక్కులలో, దిగంతాలలో ప్రతిష్ఠించిన వాఙ్మయమనే పుష్పాళిలో సుస్థిరం చేసిన బోధిసత్త్వ ప్రతిమా

సమూహానికి (అవదాన కథలకు) యుగాలు గడచినా, జలోల్లాస పరిప్లవంతోగాని, అనలోల్లాస పరిప్లవంతోగాని వినాశం లేదు. నేను కూడ అక్షయ పుణ్యలోభంతో ఆ అవదాన పుణ్య విహారంలో ఒక్క ప్రతిమను సమర్పించాను. మహాత్ముల ప్రౌఢపదాలను అనుసరించేవాడు అల్పుడైనా అప్రయత్నంగా గొప్పదనం పొందుతాడు. భృంగాంగనవలె నా ముఖపద్మంలో ధ్వనిస్తున్న నా జనకుని వాణికి నమస్కరించి, ఈ పృథుకావ్యవిశేషశేషాన్ని మాధుర్యధుర్యంగాను, శ్రుతిపాత్రపేయంగాను, దివ్యసౌరభ సదనంగాను, అమృతమయంగాను పూరిస్తాను.

## కథాప్రారంభము

దివ్యవైభవప్రభావంగల సంపదను, నూతన సంగమోత్సవవతి అయిన కాంతను, తారుణ్యాభరణమైన భోగలహరిని గడ్డిపోచలాగ వదలి, ఇతరుల ప్రాణరక్షణ కోసం ఏలాటి నెపమూ లేక ఆదరంతో తమ దేహాన్నే అర్పించే అచలులైనవారిని నమస్కరిద్దాము.

కాంచనపురంలో జీమూతకేతువనే శ్రీమంతుడయిన విద్యాధరేశ్వరుడు ఉండేవాడు. అతడు జీమూతం వలె అర్థుల తాపాలు పోగొట్టేవాడు. అతనికి కల్పద్రుమం నుంచి పుట్టిన నిత్యనూతనాలయిన సిరులు పుణ్యసౌరభ నిర్భరమయిన యశఃపుష్పాలతో ప్రకాశించాయి. సముద్రునికి చంద్రుడువలె, అపూర్వ పుణ్యాల నవసంచయంవలె అతనికి జీమూతవాహనుడనే కుమారుడు కలిగాడు. గుణవంతుడు వినయంతోను, ఐశ్వర్యవంతుడు త్యాగంతోను, సజ్జనుడు సుకృతంతోను ఒప్పారినట్లు జీమూతకేతువు తన పుత్రుడయిన జీమూతవాహనునితో కీర్తి పొందాడు. రాజు తన కుమారునికి కల్పద్రుమంతోపాటు సామ్రాజ్యమంతా అప్పగించి, తపస్సుకోసం శాంతినిలయమైన మలయాచలానికి వెళ్ళాడు.

తండ్రి తల్లితోపాటు తపోవనానికి వెళ్ళగా, జీమూతవాహనుడు తనకు అబ్బిన విస్తారైశ్వరం చూచి ఈ విధంగా ఆలోచించాడు: "గురువులయిన తలిదండ్రుల సేవాభాగ్యరహితుణ్ణయిన నాకు ఈ సిరి కళ్ళులేనివానికి చిత్రశాలవలె నిష్ఫలమూ, సుఖకరం కానిదీని. జనకుని పాదాలకు నమస్కరించినప్పుడు ఆయన పాదనఖకాంతిమాలలు నా మకుటంపై పడి మెరిసినప్పుడు, ఆయన శాసనవాక్కులతో నా శ్రవణయుగాన్ని అలంకరించుకొన్నప్పుడు ఉన్నట్టి వైభవం ఇప్పుడు చక్రవర్తిత్వం పొందినా లేదు." జీమూతవాహనుడు ఈ విధంగా ఆలోచించి. తన కల్పపాదపాన్ని సర్వలోకోపకారం కోసం కనకవర్షం కురిపించేటట్టు చేసి, ప్రాజ్యసామ్రాజ్యం త్యజించి, తండ్రి ఉన్న ఆశ్రమానికి వెళ్ళాడు. ఉదార హృదయులకు త్రైలోక్యసారభూతమైన ఐశ్వర్యం తృణసదృశం. జీమూతవాహనుడు వెళ్లగానే కల్పవృక్షం పృథ్వినంతా బంగారుతో నింపి, స్వర్గలోకానికి వెళ్ళిపోయింది. జీమూతవాహనుడు శ్రీఖండమండనమయిన మలయాచలం చేరి పితృపాదాబ్జసేవతో వియోగతాపం పోగొట్టుకున్నాడు.

ఇలా ఉండగా, వసంతకాలం వచ్చింది. పిల్లగాలులకు కదలాడుతూ, విజృంభిస్తూ, ఉచ్ఛ్వసిస్తున్న చందనలతలకు కామమిత్రుడయిన వసంతుడు అభిలాషదీక్షను ఇచ్చాడా అన్నట్టు లతలు పల్లవించి పుష్పించి విజృంభించాయి. మీనకేతనుడు జగద్విజయం కోసం హఠాత్తుగా వాయవ్యాస్త్రం విసిరాడా అన్నట్టు దక్షిణానిలం ప్రోషితకామినులకు కష్టం కలిగిస్తూ వీచింది. రసాలవృక్షాలు పెద్దపెద్ద పూగుత్తులతో గురుత్వం పొంది (బరువెక్కి, గురుపీఠం ఆక్రమించి) షట్పదమండలాలనే నల్లటి దారాలతో చెక్కుచెదరని



ముద్రాబంధాలు కట్టి యువకులకు అభిలాషదీక్ష ఇచ్చాయి. నగరస్త్రీల పాదప్రహారాలతోనా అన్నట్టు ఎర్రటి చిగురుటాకులతో అందమైన అశోకవృక్షాలు వసంతలక్ష్మి శ్రవణావతంసాలవలె పర్వతసానువులపై కనులపండువయాయి. "కాంత ఉమ్మివేసిన ఆసవంతో ఈ స్మరదోహదం నాకు కలిగింది; ఎంత ధన్యురాలిని!" అని వకుళద్రుమం పూవుల సాకుతో చిరునవ్వు నవ్వింది. మనస్వినులు కోపం వదలి, మౌనం మానుకొని, పాదాలపై పడి ప్రియుణ్ణి బతిమాలడం చూచి, సిందువారం(వావిలి చెట్టు) పూవుల గుత్తులతో నవ్వింది. ఎర్రటి మోదుగ పూవులు మనస్వినుల అభిమానమనే గజాన్ని చంపిన రక్తంతో తడిసిన వసంతసింహం యొక్క నఖపంక్తిలాగా ఉంది. విరగబూచిన కేసరవృక్షాలు వసంతసింహం యొక్క కేసరాలుగా ఉన్నాయి. వసంత కుసుమలక్ష్మి కోకిలకామినుల ఆలాపాలతో చెవుల్లోను, శిరీషపుష్పాలతో ఒంటిమీదను, కర్ణికారపుష్పాలతో కన్నులలోను, కేసరరేణుపూరంతో ఘ్రాణపుటాలలోను హర్షం వర్షించింది.

మధువుతో కైపెక్కి తిరుగుతున్న భృంగాంగన విభ్రమభోగకాలమయిన ఆ వసంతకాలంలో విద్యాధరరాజకుమారుడు పూచిన వనస్థలులలో విహరించాడు. అక్కడ ఒకచోట హేమమందిరంలో సిద్ధులు ప్రతిష్ఠించిన రత్నమయ గౌరీవిగ్రహాన్ని పూజించి, ఆమె సన్నిధానంలో వీణ వాయిస్తూ ఇందుకలికవలె ఉన్న ఒక కన్యను చూచాడు. మన్మథుణ్ణి మరల బ్రతికించుకొనడానికి గౌరీసమారాధన సంవిధానస్థిత అయిన రెండవ కామవధువువలె ఉన్న ఆమెను చూచి జీమూతవాహనుడు ఆశ్చర్యపడ్డాడు. ఆ హరిణాయతాక్షి గీతాలాపావసానంలో ఒడినుంచి నెమ్మదిగా వీణను కిందికి దింపి, బాణాలు వదలి వచ్చిన మన్మథునిలాగ ఉన్న విద్యాధరరాజపుత్రుని చూచి సిగ్గుతో తల వంచుకుంది. వారి మనస్సులలో కలిగిన అభిలాష పరస్పరాలోకన విభ్రమంతో వారిరువురి మధ్య నేత్రకాంతి భూషణాలు ధరించి రాకపోకలు సాగించినట్టుకాగా, మధ్యన మనస్సు సంధి కుదిర్చే దూతవంటిదయింది. కామపద్మాకర రాజహంసివంటి ఆ కన్య ప్రథమ దర్శనంలోనే పక్షపాతం గలదై (అనురాగం గలది, రెక్కలపాటు గలది), జన్మాంతరాభ్యాసరసంతోనా అన్నట్టు, అతని స్వస్థమయిన (ఆరోగ్యవంతమైన, స్వర్గంలో ఉన్న) గొప్ప మానసాన్ని (మనస్సును, మానససరోవరాన్ని) ప్రవేశించింది. చంద్రుడు విమలమైన చంద్రకాంతంలో ప్రవేశించినట్టు, తనకు లక్ష్యమైన కన్యాసమూహాన్ని మన్మథబాణం నిరాఘాటంగా ప్రవేశించినట్టు, ఇందిందిరం ఫుల్లారవిందాన్ని చొచ్చినట్టు రాగయుక్తమైన ఆమె చిత్తాన్ని అతడు చొచ్చాడు.

ఆ కన్యకతోపాటు చెలికత్తె ఒకతె ఉంది. ఆమె పేరు మాలతిక. విద్యాధర రాజకుమారుడు ధీరుడయినప్పటికీ, ఆ కుమారి అద్భుతరూపానికి ఆకర్షింపబడి, ముంచుకువస్తున్న సిగ్గులో మునిగిపోయిన కామవికారంతో మరింత ముచ్చటగా కానవచ్చే ఆ కన్యకతో ఏకాంతంలో ఇలా అన్నాడు: "ఓ చక్కని కనుబొమలు గలదానా! నన్ను పలకరించి అభ్యాగత సత్కారం ఎందుకు చేయవు? నీ సద్వంశానురూపమైన రూపం సదాచారగుణంతో మరింత శోభ పొందింది. ఓ అనవద్యాంగీ! స్మరుని కొత్త నగలాగ వెలుగుతూ, చంద్రమనోహరంగా ఉన్న నీ దివ్యదేహం ఏ సమున్నత వంశపు ముక్తాఫలం? ఓ సుందరి! నీవు నాకు ఉపచారం ప్రత్యేకంగా చేయనక్కరలేదులే. సుధార్ద్రమయిన నీ దర్శనంతోనే ఉపచారం పొందాను. తన లావణ్యంతో హర్షం కలిగించే చంద్రరేఖ ఎవరితోనన్నా సంభాషిస్తుందా? కాని, సత్పక్షపాతాభిముఖుడైన బ్రహ్మ నిన్ను ఏ వంశానికి అలంకారంగా చేశాడో మాత్రం తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాను. ప్రీతి కలిగి ఈ కుతూహలం పోగొట్టు."

విద్యాధరశేఖరుని మాటలు విని, వాటిలో తొణికిసలాడే అతని ఔత్సుక్యం తలచుకొని ఆ కన్యక సిగ్గుతో మౌనం అవలంబించగానే, ఆమె చెలికత్తె మాలతిక ఇలా సమాధానం చెప్పింది: "కుమార, మా పట్టణంలో సిద్ధవిలాసినులందరూ నీ గుణ రూప సౌందర్యాలను గానం చేస్తారు గనుక విద్యాధర రాజవంశ సుధాబ్ధిచంద్రుడవై రూపుదాల్చిన మన్మథునివలె ఉన్న నీవు ఇక్కడ ప్రసిద్ధుడివి. ప్రఖ్యాతమైన కల్పద్రుమం వలె దానశీలమైనది, గుణప్రభావాభరణమైనది, ఇందుశుభ్రమైన నీ కీర్తిని ఈమె తమ్ముడు మిత్రావసువు ఈమెకు కర్ణావతంసంగా చేశాడు. (నీ కీర్తిని ఈమెకు ఈమె తమ్ముడు వినిపించాడు). అలాటి మహాసత్త్వుడైన నిన్ను, నా సఖి, ప్రౌఢలు ఉపచరించినట్టుగా ఎలా ఉపచరించి పలుకరిస్తుంది? కన్యకలకు పెద్దల యెదుట, ముఖ్యంగా సిగ్గుతో, స్వస్వభావమే మరుగవుతుంది. ఈమె సిద్ధాన్వయాంబోధి సుధాకరుడయిన సిద్ధపతి విశ్వావసువు సుత. ఉద్యాన విహారాలలో ఈమె దేహకాంతి పూవులను పూచేట్టు చేస్తుంది. నవమలయజ వల్లరివలె సుకుమారి; అప్పుడే చిగిర్చిన చిగురుటాకువంటి ఎర్రటి పెదవులు గలది; సురాసురులు సతతం అభిలషించేది అయిన ఈ అమృతమయి పేరు మలయవతి."

చెలికత్తె మాలతిక ఇలా చెబుతుండగా, ముసలికంచుకి వచ్చి - త్వరత్వరగా వచ్చినందువల్ల - ఆయాసపడుతూ, సిద్ధాధిపతనూజతో "కల్యాణి! మీతండ్రి విశ్వావసువు మిత్రావసువుతో సహ అంతఃపురంలో నీ పెండ్లిమాటలు మాట్లాడుచున్నారు. నిన్ను చూడదలచారు" అని మనవి చేశాడు. ఆ మాటలు విని సులోచన అయిన మలయవతి జీమూతవాహనునికి తన మనస్సును అప్పగించి చెలికత్తెతో పాటు నెమ్మదిగా నగరుకు వెళ్ళిపోయింది.

ఆమె తన వెంట వస్తున్న చెలికత్తెతో మాటలాడే నెపంతో మాటిమాటికి వెనుదిరిగి తనను చూస్తూ నెమ్మదిగా అడుగులు వేస్తూ వెళ్ళుతుండగా, విద్యాధరకుమారుడు ఆవైపే కళ్ళు అప్పగించి నూతనోత్కంఠతో ఆలోచించడం ప్రారంభించాడు: "ఆహా! ఈ మృగశాబాక్షి తండ్రివద్దకు వెళ్ళుతూ, రాగసహితమైన తన మనస్సును తండ్రి గ్రహించి శిక్షిస్తాడేమోననే భయంతో నా వద్దనే కుదువపెట్టిపోయినట్టు తోస్తున్నది. ఆ తనుమధ్య మన్మథుడు బాణాలు విడువగానే సిగ్గుతో మునిగిపోయి, నిట్టూర్పులను బలవంతంగా అడ్డగించుకుంటూ, మౌనంతోనే సంభాషిస్తూ, ఏకాంతంలోను నన్ను చూడటం వల్ల శంకాకుల అయి, కంపించిపోయిందే! ఏదారిని ఆ చోరి నా మనస్సును ప్రవేశించిందో తెలీకుండా ఉంది." విద్యాధర కుమారుడు ఈ విధంగా చాలసేపు ఆలోచించి, ఒక శిలాతలంపై కూర్చొని మన్మథాజ్ఞకు వశుడైపోయి, సంకల్పవర్తితో మృగాక్షిని ఎదుట చిత్రించుకొని, స్తిమితేక్షణుడై ధ్యానించాడు.

అప్పుడు ఆ వనంలో పుష్పపరాగరేణువులపై చక్రధ్వజాది చిహ్నాలున్న పాదపద్మముద్రలు చూచి, వాటిని అనుసరించి జీమూతవాహనుని నర్మసఖుడు సుబంధువు అక్కడికి వచ్చాడు. మన్మథాజ్ఞతో ధైర్యం అమ్మివేసి, నూతనాభిలాషావిశేషచింతాక్రాంతచిత్తుడైన మిత్రుని చూచి, ఈ మనోవికారానికి కారణమేమిటని ప్రశ్నించాడు. "మిత్రమా! ధైర్యనిధి అయిన నీవు కూడా చింతతో నిశ్చలలోచనుడవయి ఉన్నావు. అంతటి నితాంత సంతాపం కలిగించిన అధైర్యకారణమైనదేమిటి?" అని కుచ్చికుచ్చి ఎంతో ప్రణయంతో అడిగాడు.

కుమారుడు నిశ్వాసంతోనే, రెక్కలు కట్టిన స్మరబాణం తగిలిందని అనుమానించేట్టుగా ఇలా అన్నాడు: "సఖే! సృష్టితో విసిగిపోయిన బ్రహ్మ పురాణసృష్టివర్గంలో నూతన రూపరేఖవంటి కాంతిమయి



అయిన ఒక కన్యను చూచాను. ఆమె సిద్ధాన్వయాంబోధి సుధాంశురేఖ. చంద్రుడు ఆమె వదనారవిందలావణ్యంతో కాంతి తరిగి వెలవెల పాలిపోయాడు. సారంగం కూడా ఆమె నేత్రరుచికి తన నేత్రకాంతిలక్ష్మిని కోలుపోయింది. యశస్సు పోగొట్టుకొని, సిగ్గుపడిన యీ ఉభయులూ సమానదుఃఖం కలవారు గనుక ప్రతిరాత్రి కలుసుకొని చింతతో కదలక మెదలక ఉంటారని అనుకుంటున్నాను. కర్ణావతంసంగా ఉన్నవా అన్నట్టున్న నిడుద సోగకన్నులు గల ఆ సిద్ధరాజకుమారి ప్రథమ సందర్శనంలోనే మోసులెత్తుతున్న నూతనాభిలాషను ప్రకటించింది. ఆ కంపంలో మొలనూలు ఇష్టం వచ్చినట్టు గలగలలాడుతుండగా, దానిని సమాధానపెడుతున్నదా అన్నట్టు భయంతో మాటిమాటికీ గుడ్డ కప్పుతూ దాని గలగలను ఆపి, సిగ్గుతో ఏమీ మాట్లాడక, ముఖం వంచుకుంది. అప్పుడు ఆమె చెవిలోని కలువపూవు జారిపడింది. దాని చుట్టూ మూగే భ్రమరాల ఆరావంతో నాకు స్వాగతమిచ్చింది. ఆ వరతనువును స్ర ష్టించడానికి పరమాణువులను, ముఖసృష్టికోసం నూరు చంద్రులను, లోచనయుగంకోసం నూరు నీలోత్పలాలను, బాహువులకోసం లేతతామరతూడులను, పాదాలను రూపొందించడానికి పూచిన పద్మాకరాలను కాముడు విధాతకు అందించినప్పటికీ ఇంత స్నేహపూరితమైన నా మనస్సును ఆమె అగ్నిమయివలె మండిస్తున్నది! ఆమె కామకుముదాకర చంద్రరేఖ. ఆమెను చూచి నా నయనపద్మాలు వికసించాయి. ఆమె కాంతి విభ్రమసుధను తాగితే, విషోష్మక్రూరమైన మూర్ఛ వస్తున్నదే! ఇదేమిటి చిత్రం! లీలాగురువయిన తాను విమల సిద్ధవంశవార్ధితారాధవుడైన విశ్వావసు తనయనని నాకు తెలిపింది. కుసుమాయుధునికే విలాసాలు నేర్పే ఆ మృగాక్షి పేరు మలయవతి."

కొత్తగా మనోభవవికారం మొలకెత్తిన విద్యాధర రాజకుమారుని మాటలు విని, అతనికి విశ్వాసపాత్రుడు, ప్రణయి అయిన సుబంధు ఇలా అన్నాడు: "మిత్రుడా! దైవాత్తు తుల్యగుణానుభావం వలన నీకు అభిలాష కలగడం న్యాయమే. సుకృతవంతుల మనోరథం తప్పక సన్మార్గగామే అవుతుంది. సుందరాంగనల చూపులకు కూడా కదలని నీ ధైర్యాన్ని కదలించిందంటే లోకత్రయానికీ కనిపించే రతివల్లభుని పతాకవంటి ఆ కన్య ధన్యురాలు. పూర్ణిమ ఒక్కతే స్త్రీలలో వైభవం పొందుతున్న విజయవతి. ఆమె లేక చంద్రుడు ప్రతిరాత్రి కాంతి తరిగి, క్రమంగా క్షీణించిపోతాడు. ధైర్యం కూడగట్టుకోవయ్యా! నీ మనోవాంఛితం అప్రయత్నంగానే నీ చేతికి అందుతున్నది. సిద్ధపతి అయిన ఆ విశ్వావసు కుమార్తెనే నీతండ్రి నీకోసం కోరాడు. సిద్ధపతి "శశితో నిశిలాగ త్రిజగత్ప్రియుడైన తేజోనిధితో నా కన్య చేరుతున్నది. ధన్యుణ్ణయాను" అని ఆదరహర్షాలు నిండారగా కన్యావివాహోత్సవ తత్పరుడయ్యాడు. సఖుడా! ఆ వివాహోత్సవంలో కాంతాసమాగమసుధాసఫలమైన వివాహోత్సవం రేపు ఉదయం జరుగనున్నది. విద్యాధర కుమారుడు అనురూపగుణసంయోగం చూచిన ప్రజలు బ్రహ్మను చిరకాలానికి ప్రశంసిస్తారు." మిత్రుని పలుకులు విని వెంటనే విపులోత్సాహంతో నిజమందిరానికి వెళ్ళి, దినశేషం అనేక యుగాలనుకుంటూ గడిపాడు.

సాయంకాలమయింది. గగనోద్యానంలో విహరిస్తున్న తీక్ష్ణాంశువు సంధ్యావధూసంగమంతోనా అన్నట్టు కుంకుమవంటి గాఢరాగం(గాఢమైన రక్తవర్ణం, గాఢమైన అనురాగం) పొందాడు. దినావసానంలో పద్మినీకాంతుడు అస్తగిరితీరంలో విశ్రమించగా, అయన పాదసంవాహనాసక్త అయినదా అన్నట్టు సంధ్య అతని సమీపంలో ప్రకాశించింది. వాసరేశ్వరుడు పశ్చిమ సముద్రంలో దూకగా పైకి చిమ్మిన

నీటితుంపరలలాగ ఆకాశమంతా నక్షత్రాలతో నిండింది. రాత్రి నెమ్మదిగా పాకుతున్న చీకట్ల ముసుగులో భువనమనే పాత్రతో సంధ్యారాగమనే ఆసవం తాగి మత్తెక్కిన దానివలె క్షణకాలం ఘూర్ణిల్లింది.

తర్వాత, శచీకాంతునికి విలాసవతి అయిన పూర్వదిగ్వనిత, చంద్రోదయం కానుండగా వ్యాపించిన కాంతితో చందనం అలదుకొన్నట్టు కనిపించింది. రాత్రి అనే వనితముఖానికి విశేషకం (తిలకం) వంటివాడు, భోగులకు భోగసౌభాగ్యలీలాసుఖవిశేషకం (సుఖవిశేషాలు కలిగించే) అయిన సుధాకిరణుడు ఉదయించాడు. చంద్రుని చూచి విలాసహాసముఖి అయిన కుముద్వతిపై కోపగించుకొన్నదా అన్నట్టు కమలిని, ముఖం ముడుచుకుంది. నూతన చంద్రతిలకం (చంద్రుడనే తిలకం, కర్పూరతిలకం) దిద్దుకొని, తారానికరం (నక్షత్ర సమూహం, ముత్యాల పేరులు) ధరించిన శ్యామ (రాత్రి, యౌవన మధ్యస్థ అయిన వనిత) మునులకు కూడా సంయమం సడలించింది.

ఆనాటి రాత్రి మలయవతి ప్రాసాదమెక్కి, జీమూతవాహనధ్యానంతో నిద్రలేక ఉత్కంఠురాలై ఇలా ఆలోచించింది: "ఈ పాడు రాత్రి - ఉదయం జరుగనున్న వివాహానికి మధ్యన ఉన్న రాత్రి నూరు జాములదివలె ఎంతసేపటికీ గడవదు. ఈ రజని గగనోద్యానంలో శశిసంగమంతో సంతృప్తి పొంది, తారకా మందహాసం ఇంకా మానకుండా ఉంది కాబోలు! ఆయామం గల (పొడుగాటి) ఈ యామిని నాకు ప్రియసమాగమానికి విఘ్నంగా పరిణమించింది. సుఖరసాసక్తులకు ఇతరుల వ్యథ ఏమి తెలుస్తుంది?" ఆమె ఈ విధంగా చింతిస్తూ, సంతాపపడుతూ ఉండగా, రాత్రి నెమ్మదిగా గడిచిపోయింది.

తొందరలో ఇందుదర్పణాన్ని జారవిడచిన ప్రభాతప్రభ ఆసన్నమైన ఉత్సవానికి సంసిద్ధురాలయినట్టు ప్రకాశించింది. పద్మినీవల్లభుడు ఉదయించగా, చీకట్లన్నీ అణగారిపోగా, సర్వభూతాలకు సుఖంగా నేత్రోత్సవమయినట్టు అయింది. పద్మినికి దివాకరకరగ్రహం కాగా, భృంగాంగనల మంగళగీతాలు చెలరేగాయి.

అప్పుడు మహైశ్వర్యవంతుడయిన సిద్ధాధినాథుని భవనంలో సుతాపరిణయారంభసన్నాహాలు ప్రారంభమయాయి. సిద్ధపురంధ్రీమణులు దివ్యాంశుకాభరణాలతో అలంకరించిన పెండ్లికూతురు మలయవతిని చూచి అప్సరసలు తమలో తాము ఇలా అనుకున్నారు: "ఈమె స్తనమండలంపై ముత్యాలహారం కేవలం భారం, సౌందర్యానికి పరిహారమూను. లావణ్యానికి అడ్డు వచ్చే నగలు ఎక్కువగా ఎందుకు? ఈ తన్వంగికి స్తనతటం మీద రత్నావళులు ఎందుకు సఖీ? అవి కేవలం భారమే సుమా! ఆ వామలోచనకు కాటుక దిద్దావే, ఎందుకు? ముఖచంద్రబింబంలో తీర్చిన కస్తూరికా మంజరి కళంకంలాగ కనిపిస్తున్నది, చూడు."

అప్పుడు మణిమాలాదీధితులు వెదజల్లుతూ ఇంద్రభవనం వలె ఉన్న విమానంలో జీమూతవాహనుడు ఆకాశమార్గన వచ్చాడు. అతని వెంట విద్యాధరులు వందలమంది బారులుతీరి వచ్చారు. జగత్త్రయమూ పూజించే గుణాలుగల సిద్ధాధినాథుడు స్వాగతమివ్వగా, అతడు వివాహ మంగళభూమిని చేరాడు. ఇంతలో మన్మథవిలాసవల్లరివంటి మలయవతి రత్నవిమానమెక్కి వివాహ హర్షకాంతులతో దిక్కులను అలంకరిస్తున్నట్టుగా వచ్చింది. చెలికత్తెలు వీచే చామరం కొస తగిలి ఆమె కర్ణోత్పలం రేకు ఒకటి ఆమె చెంపకు అతుక్కుంది. అప్పుడు చంద్రరేఖను ధరించిన రాత్రిలాగ క్షణంసేపు కనిపించింది.



తర్వాత వివాహమహోత్సవం విధివత్తుగా జరుగగా, విద్యాధరరాజపుత్రుడు సిద్ధనృపాత్మజ పాణిగ్రహణ, స్పర్శనసవామృతంతో సంతోషించాడు. వివాహసమయంలో ఎదురుబదురుగా ఉన్నవారిద్దరి మెడలోని హారాల బహుమూల్యరత్నాలలో ఇద్దరి దేహాలూ ప్రతిబింబించాయి. దానిని చూడగా, పరస్పరం ప్రీతితో హృదయాలలో అవకాశం కల్పించుకొని ప్రవేశించి కూచున్నట్టు కనబడింది. వివాహవిధి జరిగిన తర్వాత వారిద్దరూ అప్సరసల నృత్యగానాలతో, ఉత్సవ కోలాహలంతో ఉన్న రాజమందిరాంగణం చేరి, అక్కడ రత్నాసనంపై ఆసీనులయారు.

అప్పుడు అంశుమంతుని అంశుమాల వివాహోత్సవంలో ఉత్సాహంతో నృత్యం చేసి అలసిపోయి శతపత్రమధువు తాగి, అస్తగిరితటంపై కూర్చుని విశ్రాంతి తీసుకుంది. అంతలో రశ్మిమాలి దినలక్ష్మిని, రాగవతి అయిన సంధ్యను కరావలంబనంతో గ్రహించి ఉద్యానలోభంతోనో అన్నట్టు మేరుపర్వతపు అపర దిక్కుకు వెళ్ళిపోయాడు. దినాంతంలో రజనీమృగాక్షి నీలాంబరం (నల్లటి చీర, నల్లటి ఆకాశం)ధరించి అభిసారికవలె భయసంభ్రమాలతో విలోలతార అయి (కనుగుడ్లు తిప్పుతూ, ప్రకాశించే నక్షత్రాలతో) దిగంతాలు చూడసాగింది. వివాహంలో సిద్ధపురంధ్రులు జాలపట్టాలు (కంజీరాలు) చేత్తో కొట్టి వాయిస్తూ చేస్తున్న నృత్యాన్ని మేడ యెక్కి చూచేవాడిలా చంద్రుడు ఉదయాద్రి శిఖరం ఆరోహించాడు. నిశాచంద్రులు నక్షత్రాలనే అక్షతలాజపుష్పాలు చల్లుకొని పెండ్లిచేసుకోగా, మధుపానంతో మత్తెక్కి రొదచేస్తున్న కుముదాకరాలకు ఎంతో సంతోషం కలిగింది. ఆ మహోత్సవోత్సాహరసంలో విలోల ఫేనోజ్జ్వలమాల్య హారమైన (కదలాడే నురుగువంటి ఉజ్జ్వలమైన పుష్పమాలలు, ముత్యాల హారాలుగల) సిద్ధపురంధ్రీగణం, చంద్రోదయ సమయంలో విలోలఫేనోజ్జ్వల మాల్యాహారుడైన (కదలాడే నురుగు, ఉజ్జ్వల ముత్యాలు గలవాడైన) అమృతసాగరంవలె పొంగులు వారింది. ఉదయం కాగానే, మిత్రసమాగమంతో (సూర్యుని రాకతో) సిద్ధుల పట్టణమంతా ఎరుపు రంగుతో రంగరించినట్టుకాగా, పట్టణవాసులంతా ఆ సిందూరప్రవాహంతో (వసంతాలతో) జల్లులాడుకున్నట్టు శోభ కలిగింది.

ఈ విధంగా మహోత్సవం ఆరు నాళ్ళపాటు జరిగిన పిదప ఏడవనాడు విద్యాధర రాజకుమారుడు అద్భుత హర్షభూమి అయిన గిరితటంపై వాహ్యాళి వెళ్ళాడు. ఒకచోట పరిపూర్ణ చంద్రబింబాననుడైన నాగకుమారుడు ముందు నడుస్తూ రావడం, అతనివెంట అతని తల్లి నడుస్తూ రావడం చూచాడు. నాగకుమారుని ముఖం ఫణామణిరశ్మిజాలంతో ప్రకాశమానంగా ఉంది. నాగకుమారుని తల్లి రొమ్ముపై పెద్ద పెద్ద కన్నీటి బిందువులు ధారకడుతూ, అత్యుగ్రశోకంతో కంపిస్తూ కరుణంగా ప్రలపిస్తుండడం విన్నాడు: "హా! వత్స! పాతాళానికి మణిప్రదీపం వంటి నీవు మృత్యువు వాత పడుతున్నావే! ఆనందసందోహం వలె ఉన్న నీ ఆననాబ్జాన్ని మరల ఎలా చూడగలను? బాంధవులకు ప్రాణంవంటివాడివి. ప్రియప్రీతిలతకు వసంతమూ, మన్మథునికి సంధి వంటిది అయిన ఈ యౌవనంలో కాలమనే ఏనుగు నిన్ను పాదాలతో తొక్కివేస్తున్నట్టుగా భక్షింపబడుతున్నావు" అని నాగమాత ఆక్రందించింది.

దయామయుడైన జీమూతవాహనుడు ఆ కరుణాలాపాలు విని, ఆమె దుఃఖం తనకు కూడ సంక్రమించగా ఆమె వద్దకు వచ్చి, "అమ్మా! ఘోరదుఃఖం తెలిపే ఈ ఏడుపేమిటి? ఎందుకు? ఈ కల్యాణమూర్తి అయిన సాధువుకు ఏదో విపత్తు వస్తున్నట్టు ఆశంకిస్తున్నావా? కుశలోచితాలు, సౌజన్యంతో

ఇతరులకు సుఖం కలిగించేవి అయిన ఈలాటి ఆకృతులు ప్రతీకారాస్పదాలయిన విపత్తులకు కారణాలు కావు" అని ఊరడిస్తూ ప్రశ్నించాడు. ఆమె తన కుమారుడు కనుమరుగవుతాడనే భయంతో అతని ముఖంపైనే చూపులు నాటివేసినదానివలె చూస్తూ ఇలా తెలిపింది: "నాయనా! ప్రతీకారమేమీ చేయలేని నా వ్యసనాల వార్త విని ఏమి ప్రయోజనం? నా దుష్కర్మపరిపాకం వల్ల అకాలంలో ఈ దుస్సహమైన దుఃఖం సంప్రాప్తమైంది. విశాలకీర్తితో ఉజ్జ్వలమైన శంఖపాలుని కులాంకురమైన ఈ నా కూనను విధురుడైన విధాత మూలమంట నరికివేయడానికి కఠినకుఠారం ఎత్తాడు. గరుడుడు నాగులను భక్షిస్తూ నాగకులాన్నంతా నాశం చేయడానికి పూనుకోగా, ఫణినాయకుడు సర్వక్షయం నివారించడానికి వంతుల ప్రకారం దినమొక నాగును ఎర్రగుడ్డ గుర్తుగా చుట్టి గరుడునికి ఆహారంగా పంపుతున్నాడు. అదిగో తుషారాచలంవలె పారం లేకుండా కనిపిస్తున్న రాశి గరుత్మంతుడు తినగా మిగిలిన భోగికాయకంకాళమాలల అస్థికూటమే. క్రమం ప్రకారం ఆ వారం ఇప్పుడు నా కులానికి మూలచ్ఛేదమై రాజశాసనంతో ఎర్రటి గుడ్డ గుర్తుగా కట్టుకున్న నా కుమారునిపై వచ్చిపడింది."

ఆమె ఇలా అంటుండగా, ఆమె పుత్రుడు శంఖచూడుడు ఆమెను ఊరడించాడు. ఆమె అతనిని తన పైటకొంగుతో కప్పి కరుణస్వరంతో "హా! శంఖచూడ! జగన్మండన! వధ్యభూమికి వెళ్ళడానికి ఎందుకింత తొందర పడుతున్నావు?" అని గట్టిగా ఏడుస్తూ అతనిని కౌగలించుకొని అతని భుజంపై ముఖం పెట్టి మూర్ఛపోయింది. కొంతసేపటికి ఆమె మూర్ఛ తెలిసింది.

జీమూతవాహనుడు ఒకే వత్సంగల ధేనువువలె కాతర అయిన తన తల్లిని చూచి, దయార్ద్రుడయిన, ఈ దుఃఖదవానలం నుంచి ఆమెను నివారించే దృష్టితో ఇలా ఆలోచించాడు: "అయ్యో! ఈ పతగేశ్వరుని క్రూరమలిన ప్రయత్నం ఏమిటిది? కరుణావిహీనుడై పరవధతో తన శరీరాన్ని పోషించుకుంటున్నాడే! తల్లి పుత్రవియోగంతో జీవించదనేమాట నిశ్చయం. ఈ సుకుమారమూర్తి అయిన నాగకుమారుణ్ణి నా దేహమిచ్చి అయినా రక్షించాలి." ఈ విధంగా అతడు క్షణమాత్రం ఆలోచించి, "తల్లీ! నీవు నీ కుమారునితోపాటు నీ గృహానికి తిరిగి వెళ్ళు. నేను పన్నగుల వధ్యభూమికి వెళ్ళుతాను. ఆ శోణాంశుకం ఇటు తే" అని అన్నాడు.

సదయుడైన విద్యాధరరాజకుమారుడు ఈ విధంగా ప్రార్థించగా, నాగమాత ఒడలంతా కంపించి, "నాయనా, నీవు ఇలాటి విపరీతపు మాటలు పలుకవద్దు. నీవు శంఖచూడునికంటే నాకు ప్రియమైన పుత్రుడివి. నేను నా అకుశలకర్మతో వచ్చిపడిన మోహోర్మిమయ మహాసాగరంలో పడ్డాను. దుష్కృతం చేసినవారికి దుఃఖాలు అకాలంలో యంత్రవిముక్తమైన రాళ్ళవలె (వడసెల రాళ్ళవలె) తగిలి దుస్సహ దుఃఖం కలిగిస్తాయి. సత్త్వగుణోదధి అయిన ఓ సాధూ! ఆశ్రితులకు సుధాసన్నిధివంటి స్వస్తికరమైన నీ తనువు, జగల్లోచనాలకు జీవభూతమైన కల్పాంతంలోను అక్షయంగా ఉండుగాక!" అని అతనిని ఎంతో ప్రయత్నంతో నివారించింది. అయినా, జీమూతవాహనుడు తన తనుప్రదానంలో పట్టుదల కలిగి, నిశ్చల చిత్తవృత్తి కాగానే, శంఖచూడుడు ఇలా విజ్ఞప్తి చేశాడు:

"విధాత ఆదిసృష్టినుంచే మేము గరుడునికి భక్ష్యవర్గంగా ఏర్పడ్డాము. ఈ విషయంలో ఎవరేమీ చేయదగింది లేదు. నిష్కారణ వాత్సల్యంతో కానిచోట మనసు పోనీవద్దు. ఈ నీ దేహం గుణాలకు అలంకారమైంది. సంపూర్ణ సౌజన్యసుధకు నిధానమైనది. ఇలాటి దానిని మూడులోకాల ప్రాణాలతోను రక్షించుకోవాలి. అలాంటప్పుడు నా కోసం గడ్డిపోచలాగ ఎందుకు వదులుతావు? ఈ సంసార కాననంలో



కాశ పలాశ వృక్షసమానులు మాబోటివారు ప్రతి నిత్యం పుడుతూనే ఉంటారు. అమృతం తోబుట్టువయిన పారిజాతవృక్షంవంటి నీబోటివాడు మరల జన్మించడు. నా విషయంలో ప్రసన్నత చూపు. నా జన్మాంతర పుణ్యపణ్యంతో సౌజన్యసుధా సుధాంశువయిన నిన్ను చూచాను. మా విషాదంతో నీవు మనఃప్రయాస పెట్టుకోవద్దు. సముద్రానికి వెళ్ళి, అతనిలో లీనమయిన గోకర్ణమూర్తిని నమస్కరించి, వెంటనే పాతాళలోకంలో జననిని వదలిపెట్టి వచ్చి, దుఃఖమనేదే లేక తార్క్ష్యశిలవద్దకు వెళ్ళుతాను." నాగకుమారుడు ఇలా చెప్పి, అతనికి తలవంచి నమస్కరించి, తల్లితోపాటు మహాబ్ధితరంగహస్తాలతో నురుగుల దండలను సమర్పిస్తున్నట్టున్న గోకర్ణతీరానికి వెళ్ళాడు.

విద్యాధరాధీశకుమారుడు ఎట్లయినా నాగకుమారుని ప్రాణాలను రక్షించాలనే నిశ్చయంతో స్వప్రాసాదానికి వెళ్ళుతూ తనకోసం అరుణకాంతులీనే మంగళ పట్టవస్త్రాలను తెస్తున్న కంచుకిని చూచాడు. ఆ కంచుకి అతనికి నమస్కరించి, ఆ మంగళ పట్టవస్త్రద్వయం ఇచ్చి "వివాహమహోత్సవ సప్తరాత్ర స్నానం కోసం దయ చేయండి. అంతా సిద్ధంగా ఉంది" అని విన్నవించాడు. "భద్ర! నీవు ముందు త్వరగా వెళ్ళు. నీ వెంటనే నేనూ వచ్చాననుకో" అని విద్యాధరకుమారుడు అతనిని పంపివేసి, సంతోషం పొంగగా, సత్త్వబుద్ధితో "నాకు పన్నగవధ్యచిహ్నమైన పాటలవస్త్రయుగ్మం దైవాత్తు, అయత్నంగా లభించింది. కనుక గరుడుడు వాలే శిలాతలమే చేరుతాను" అని ఆలోచించి, ఒక రక్తాంశుకం చూడామణివలె కనిపించేటట్టు తలకు చుట్టి, రెండవదాన్ని ఉత్తరీయంగా కప్పుకొని, గరుడుడు వాలే శిలవద్దకు వెళ్ళాడు; నాగుల శోణితంతో ఇరుప్రక్కలా ఎర్రగా అయి, వాటి కొవ్వుతో నల్లగా కరుడుగట్టిన ఆ శిలను ఎక్కి శరీరం పైభాగాన్ని కప్పుకొని నిలబడ్డాడు.

అప్పుడు కరిగి పారుతున్న బంగారు తరగల కాంతితో మెరుపుల గుంపువలె ప్రచండప్రకాశం ఆకాశమంతా నిండి, బాడబాగ్నిని కక్కుతున్న సముద్రమన్న భ్రాంతి కలిగింది. అప్పుడు దూరంలో సూర్యకిరణాలు పడి మెరిసిపోయే మేరుపర్వతం వలె, రెక్కలు వీచడంతో పుట్టిన మహావాయువుతో సముద్రాలనే సంక్షోభింపజేస్తూ, పక్షీంద్రుడు కనిపించాడు. అతడు వచ్చే వేగానికి దారిలోని కొండలలోని చెట్లు కూలాయి, కొండకొనలు విరిగి పడ్డాయి. వాటి పతనఘోషకు భూమి చకితురాలై, ముందుబరువు తగ్గిందేమోనని కలత పడింది. అంతటి చండవేగంతో వచ్చిన భోగీంద్రశత్రువు వధ్యశిలపై స్థిరంగా నిలబడి ఉన్న జీమూతవాహనుని వీపుపై వజ్రసదృశమైన నఖాంకుశాలతో కొండమీద పడిన పిడుగువలె కఠినంగా కొట్టాడు. గరుడుని హఠాదాఘాతానికి జీమూతవాహనుడు శరీరం ముక్కలు ముక్కలయి రక్తం కారుతున్నా, పరప్రాణరక్షణ చేస్తున్నందుకు సంతోషంతో ఒడలంతా పులకించి, ధైర్యం చిక్కబట్టి, "దుఃఖార్తులయిన దుర్గతులకు నా శరీరం రక్షోపకరణమై ఎప్పుడూ ఋతమే సంభవించుగాక!" అని ధ్యానించాడు. విహంగరాజు తను పిడుగువలె చంచువుతో కొట్టినా అతడు ధైర్యంతో కదలక మెదలక ఉండడం చూచి, "ఎవడీ భుజంగం?" అని ఆశ్చర్యంతో నిశ్చలంగా చూచాడు. మరల పైకి ఎగిరి, చండమార్తాండకిరణమాలవంటి విపులతేజఃపుంజంతో దిక్కులను కప్పుతూ, అతని తలపై పొడిచి, ముక్కలు చేశాడు. అప్పుడు అతని చూడామణి, రక్తప్రవాహంలో స్పష్టంగా కనిపించింది.

ఆ సమయంలో జీమూతకేతువు బాలహరిచందనవనంలో పత్ని, కోడలు మొదలయినవారితో సంభాషిస్తున్నాడు. అతనికి ఎందుకో శంకతో హృదయం విషణ్ణమయి, మనస్సు చింతాక్రాంతమయింది.

చంద్రోదయాన్ని కాంక్షించే సముద్రం వలె పుత్రదర్శనోత్కంఠుడై, "ఏమిటిది? గిరిప్రాంతాలను చూడాలని వెళ్ళిన కుమారుడు జీమూతవాహనుడు ఇంకా రావడంలేదే! ఆకాశం దిక్కులలో నిప్పులు కక్కుతున్నట్టుగా ఎర్రగా కనిపిస్తున్నది. కనుక ఈ గిరితటంలో గరుడాగమనవేళలోని కాంతి వ్యాపించినట్టుంది. గరుడుడి భయంతో దేహం కుంచించుకున్న భుజంగకుమారుని భక్షించడానికి పిడుగులాగ పైనపడే సమయమిది" అని సంశయంతో కొట్టుమిట్టాడుతుండగా, ఆకాశం నుంచి, ఆతని ముందు రక్తసిక్తమైన చూడామణి పడింది.

చెల్లాచెదరైన మాంసపు ముక్కలు, రక్తంతోపాటు అసహ్యమయిన దుర్నిమిత్తంవలె పడిన ఆ చూడామణిని చూచి జీమూతకేతువు వెంటనే మూర్ఛపోయాడు. అది పతి చూడామణి కావడం చూచి మలయవతి అత్తగారితోపాటు మూర్ఛపోయి భూమిపై పడింది. విద్యాధరాధిపతి నెమ్మదిగా తెలివి వచ్చి, భార్యను, కోడలిని సమాధానపరచి, సంశయనివారణార్థం ఆలోచించి ఇలా అన్నాడు: "కుమారుడు నిర్జనంలో ఎక్కడ ఉన్నాడో నేనే స్వయంగా వెళ్ళి చూచి వస్తాను. ఇది గరుడుడు వచ్చే ఘోరమైన వేళ. శరీరసంశయం కలిగించేది. జారిపడిన ఈ చూడామణిని చూచి నిశ్చయంగా చెప్పలేము. ఇది గరుడుడు తింటున్న సర్పకుమారుని మణి కావచ్చును. పాముల మణులు ఇలాటివి ఉత్పాతాలలో రాలిపడే నక్షత్రాలలాగ రాలిపడుతూ ఉంటాయి" ఇలా అని వారితోపాటు విద్యాధరేంద్రుడు భోగివధ్యశిలగల పర్వతసానువును చేరాడు.

ఈలోగా, శంఖచూడుడు సముద్రతీరంలో గోకర్ణమూర్తిని నమస్కరించి, ఎర్రటి వధ్యవస్త్రాలు ధరించి, ఆ ప్రదేశానికి వచ్చాడు. గరుడుని దెబ్బలకు క్షతగాత్రుడై పడిన జీమూతవాహనుని చూచి, "అయ్యో! చచ్చాను. మోసపోయాను!" అని ఏడుస్తూ కిందపడ్డాడు. బాష్పాకులితకంఠంతో నోట మాటరాక ఏడ్చాడు. దానికి గిరిగుహలు ప్రతిధ్వనించాయి. "వ్యసనులకు నిష్కారణబాంధవా! కారుణ్య పుణ్యావధే! ప్రాణాలను కూడా ఒడ్డి ఇతరుల దుఃఖాలను పోగొట్టే ఈ పేశలత ఏమిటి? ఓ సౌజన్యనిధీ! నీవు లేనిదే అంధకారబంధురమైన ఈ జగత్తు రాహుగ్రస్త చంద్రగ్రహణంనాటి ఆకాశంలాగ కళాహీనమయింది. అయ్యో! పరుల ప్రాణరక్షణ కోసం కృపతో జీవితం త్యజించిన నీకు కల్పాంతస్థాయి అయిన యశోమయ తనువు ఏర్పడ్డది. కాని పాపి అయిన ఈ శంఖచూడుణ్ణి మాత్రం నిత్యమరణం అనే ఘోరాపవాదంలో పడవేశావు." ఇలా ప్రలపిస్తూ శంఖచూడుడు గరుడుని వద్దకు వస్తూ, పరివార సహితంగా వస్తున్న జీమూతకేతువును చూచాడు. అతనికి జరిగిన వృత్తాంతం నివేదించి, శోకవిహ్వలుడై చేయెత్తి పక్షిపుంగవుణ్ణి ఆక్షేపిస్తూ ఇలా అన్నాడు: "తార్క్ష్య! చాలు చాలు నీ అవిచారమూలకమైన సాహసం. దానివల్ల చాలినంత పాపం సంపాదించుకొన్నావు. నీవు చంపదగిన నాగుల గుర్తేదో చూడకనే ఈ విద్యాధరకుమారుణ్ణి పొడిచి చంపివేశావే!"

ఈ మాటలు విని, జీమూతకేతువు అంగాలన్నీ కుంగిపోగా, ఎదుట పడిఉన్న జీమూతవాహనుణ్ణి చూచి, భార్యతోసహ మూర్ఛపోయాడు. పతంగరాజు ఉగ్రప్రహారాలతో వడలిపోయిన ఆకృతితో కంఠగతమైన అర్ధప్రాణాలతో ఉన్న ప్రియుణ్ణి ఎదుట చూచి, మలయవతి, నిలబడి ఉన్నా కొండ మీదినుంచి పడిపోయినదానివలె, దెబ్బతినకపోయినా దెబ్బతిన్నదానివలె, జీవించి ఉన్నా నిర్జీవవలె, మతిభ్రమించినా నిశ్చల అయినదానివలె అయి, చెలికత్తెలాగ మూర్ఛ సర్వాంగాలను పట్టి ఆలింగనం చేసుకోగా, మోహవివశ అయి



ముహూర్తకాలం ఏమీ తెలుసుకోలేకపోయింది. కొంతసేపటికి అందరూ మూర్ఛతేరారు. గరుడునికి లజ్జావిషాదాలు, అంతకన్నా హెచ్చుగా నైరాశ్యమూ కలిగాయి.

జీమూతవాహనుని తలిదండ్రులు ప్రాణాలు వదలాలనే నిశ్చయం చేసుకోవడం వల్ల అప్పటికి ధైర్యం తెచ్చుకొని, స్రస్తగాత్రుడయిన అతనితో ఇలా అన్నారు: "పుత్ర! పరకారుణ్యశీలుడవైన నీకు నీ శరీరంపై ఈ కఠోరత ఏమిటి? ఆ కఠోరత మా ప్రాణాలు హరించేదయినదికదా! ఆపన్నజనతా రక్షారత్నమయిన నీ శరీరాన్ని రక్షించుకోనందువల్ల నీవు ఏమి సుకృతం చేసినట్టయింది?" ఇలా అంటున్న తలిదండ్రులకు జీమూతవాహనుడు చేయిఎత్తి నమస్కరించే శక్తి లేక శిరఃకంపంతోనే నమస్కరించి, ప్రాణాలు ఎగిరిపోతుండగా మాటలు సరిగా పలుకలేక దిగమింగుతూ ఇలా అన్నాడు: "తండ్రీ! నీ ఆజ్ఞ లేకనే ఈ పని చేశాను. దానికి శిక్షగా ఈ నమస్కారం. దీనిని నీవు స్వీకరించి ప్రసన్నుడివి కమ్ము. శరీరం క్షణంలో క్షీణించేది. మనకు తెలియకే మార్పు చెందేది. కనుక దేహధారులకు పరోపకారమే జన్మయాత్రకు సారం. ప్రాణుల ఈ ఆయువు వేగంగా వీచే గాలికి ఊగిసలాడే తీగలఆకులపై పడిన సలిలబిందువు వలె చంచలమైనది. ఎల్లప్పుడూ ఆర్తులకు ఉపకారం చేయడం వల్ల నిలదొక్కుకొని, అమృతత్వప్రాప్తితో పుణ్యధామంలో స్థిరపదం పొందుతుంది."

కన్నీరు కురిపిస్తున్న తలిదండ్రులను అతడు ఈవిధంగా సమాధానపెట్టి, పశ్చాత్తాపంతో తను చేసిన దుష్కృత్యాన్ని నిందిస్తూ ఎదుటికి వచ్చిన ఖగపతిని, వైరాగ్యబంధురమైన సత్త్వబల ప్రణయంతో నాగులను చంపరాదని బ్రతిమాలి, నాగాశననివృత్తిలో స్థిరసంకల్పం కలవాడినిగా చేశాడు. తర్వాత అంతిమదశలో విషమశ్వాసతో మాటలు వెలువడక, కళ్ళు మూసుకొని, సత్త్వప్రకాశశేషుడయాడు (మరణించాడు).

అనంతరం మలయవతి పూవులు, వస్త్రాలతో తదుచితమైన చితిని సిద్ధపరచి వహ్ని సంస్కారం చేసి, సహగమనం చేయడానికి పూర్వం అగ్నిముందు నిలబడి ఇలా విలపిస్తూ అన్నది: "భక్తితో భవవల్లభను సంతోషపెట్టాను. 'సర్వవిద్యాధర చక్రవర్తి నీకు పతి అవుతాడు' అని వరమిచ్చింది. నేను పెండ్లి అయిన ఏడునాళ్ళకే విధవనయానే! ఆ సతీదేవి నాకు ప్రసాదించిన మాట వ్యర్థం ఎట్లయింది? జన్మాంతరంలోను ఇతడే నాకు పతి అగుగాక!" అంటూ ఆమె అగ్నిలో మొదట మందార కుసుమాంజలి సమర్పించింది.

అంతలో గిరిజ, అమృతకలశం పట్టుకున్న చేతులు తడబడగా ప్రత్యక్షమై, ప్రీతితో జీమూతవాహనుని సమీపించి, "పుత్రీ! నీ పతి జీవిస్తున్నాడు!" అని పలుకుతూ, దిక్కులకు కాంతులు వెదజల్లే సుధాధారలతో అతనిని జీవింపజేసింది. తనను జీవింపజేసి పార్వతి అంతర్ధానం చెందగా, మరణించిన నాగులను మరల బ్రతికించవలసిందని జీమూతవాహనుడు తార్క్ష్యుని కోరాడు. గరుత్మంతుడు అమృతవర్షం కురిపించగా, ఫణికుమారులు విప్పిన పడగలమీది మరీచులతో కాంతిమయులుగా కనిపిస్తూ లేచివచ్చారు. సిద్ధరాజకుమారి ప్రహర్షాద్భుత మన్మథభావాల శబలతతో ముప్పిరికొని మురిసిపోతూ, నడయాడే కల్పలతవలె పతి సమీపానికి వచ్చింది. ఖగేశ్వరుడు జీమూతవాహనుని పూజించి రెక్కలుగల మేరుపర్వతంలాగ వెళ్ళిపోగా, జీమూతవాహనునికి ఎదుట ఉన్న శంఖచూడుని దృష్టి తృప్తి పొందలేకపోయింది.

అప్పుడు సురపతికాంతలు తమ పాణిపద్మాలతో ఆ బోధిసత్త్వుని- జీమూతవాహనుని - శిరస్సుపై వికచకుసుమవర్షం కురిపించారు. ఆ పుష్పాలపై మూగిన భృంగాల ఝుంకారం జీమూతవాహనుని

గుణగణాలను దిక్కాంతలు గానం చేస్తున్నారా అన్నట్టు వినిపించింది. సత్త్వాబ్ధి అయిన జీమూతవాహనుడు తలిదండ్రుల పాదకమలాలపై తన శిరశ్చూడామణిని మోపి నమస్కరించి, హర్షాశ్రుధారలతో వారికి ప్రేమాభిషేకోత్సవం చేసి, తన పరిపూర్ణ పుణ్యసంపదలతో చక్రవర్తి సంపదకు చిహ్నాలయిన రత్నాలు పొందాడు. అంతలో సురపతి సంతోష ప్రణయాలతో అతనిని సింహాసనంపై ఆసీనుణ్ణి చేసి దేవతాగణాలు కీర్తిని గానం చేస్తుండగా, జీమూతవాహనుణ్ణి విద్యాధర చక్రవర్తిగా అభిషేకించాడు.

జినభగవానుడు పుణ్యోపదేశ సమయంలో చెప్పిన స్వజన్మవృత్తాంతాన్ని రచించి నేను పొందిన శ్రేష్ఠమయిన కుశలం సర్వ భూతాలకు అభ్యుదయకరం అవుగాక!

ఇది క్షేమేంద్రుడు రచించిన బోధిసత్త్వావదాన కల్పలతలో అతని కుమారుడు సోమేంద్రుడు

రచించిన జీమూతవాహనావదానమనే నూట ఎనిమిదవ పల్లవం.

# ప్రణిధానము

సర్వోన్నతుడు, గుణాన్వితుడు, భద్రంకరుడు భూరితర వీర్య బల క్షమాయుతుడు, అకుశలమనే మూలబంధంపై నిలిచిన సంసారద్రుమాన్ని ఉన్మూలించేవాడు, అరిషడ్వర్గాల మదం అణచివేసేవాడు అయిన సుగత భగవానునికి నమస్కారం. ఈ లోకంలో తారాదేవి, తరుణ కరుణావలోకనాలతో భక్తులకు కల్యాణ పరంపరను నిరంతరం నిరంతరాయంగా సిద్ధింపజేస్తున్నంతవరకూ, లోకనాథుడు విమల కుశల ధ్యాననిష్ఠుడయి ఉన్నంతవరకు ఈ బుద్ధభగవానుని కథ విబుధవదనామోదినిగా విలసిల్లుగాక! బుద్ధభగవానుడు సకల భువనోత్తారణంలో ప్రబుద్ధుడుగా ఉండేవరకు, ధర్మం సుకృతమార్గానికి స్వచ్ఛందమైన రత్నదీపంగా ఉన్నంతవరకు, సంఘం శరణాగతులకు కల్యాణ సంఘాలు ప్రసాదించేవరకు ఈ జినగుణకథానూతనకల్పవల్లి ఉండుగాక! పెక్కు పర్వతాలనుంచి జలజలపారే సలిలధారల మాలికలు ధరించిన ధరాదేవి శేషాహిశీర్షంపై అతని ఫణామండల రత్నరశ్మి సమూహా**లతో మయూరఫింఛచ్ఛత్ర**శోభను అనుభవిస్తున్నంతవరకు, సుమేరుపర్వతం ఈ క్షితితలమనే కమలం మధ్యన కర్ణికాకారంగా ప్రకాశిస్తున్నంతవరకు ఈ శాస్త్ర కథ జగత్తుకు కర్ణపూరప్రతిష్ఠను పొందనీ!

క్షేమేంద్ర మహాకవి రచించిన అవదాన కల్పలత అనే కృతి సమాప్తమైనది

# ఆనంద బుద్ధ విహార ప్రచురణలు

## తెలుగు గ్రంథాలు

| | |
|---|---|
| 1. ధమ్మపదం (పాళీ-తెలుగు) | రూ. 50-00 |
| 2. సిద్దార్థ గౌతమ | రూ. 20-00 |
| 3. ధమ్మపద శతకమ్ | రూ. 15-00 |
| 4. ధమ్మపదం (గీతిక) | రూ. 15-00 |
| 5. సుహృల్లేఖ | రూ. 30-00 |
| 6. జాతకమాల | రూ. 45-00 |
| 7. ధర్మపదం కథలు | రూ. 45-00 |
| 8. బోధిచర్యావతారం | రూ. 40-00 |
| 9. లోకక్షేమగాథలు | రూ. 40-00 |
| 10. వజ్రచ్ఛేదిక | రూ. 45-00 |
| 11. నిత్య పారాయణ సుత్తములు | రూ. 50-00 |
| 12. ఆంధ్రదేశములో బుద్ధధాతు పేటికలు | రూ. 70-00 |
| 13. బుద్ధ దర్శనము | రూ. 125-00 |
| 14. బుద్ధుని ప్రవచనాలు | రూ. 10-00 |
| 15. ప్రాచీనాంధ్ర బౌద్ధ శిల్పులు | రూ. 25-00 |
| 16. బుద్ధ భగవానుడు | రూ. 100-00 |

## English Books

| | |
|---|---|
| 1. Siddartha Gautama | Rs. 20-00 |
| 2. Buddhist Inscriptions of Andhradesa | Rs. 500-00 |
| 3. Buddhist Relic Caskets in Andhradesa | Rs. 125-00 |
| 4. The Buddha and His Dhamma | Rs. 15-00 |
| 5. Buddhism in relation to Science and World Religions | Rs. 10-00 |

## ఆడియోక్యాసెట్లులు (తెలుగు)

| | |
|---|---|
| 1. ధమ్మపదం రెండు భాగాలు | రూ. 50-00 |
| 2. సిద్దార్థ గౌతమ | రూ. 25-00 |